



ప్రథమ దైవ గ్రంథము

# త్రైత సిద్ధాంత భగవద్గీత

578 శ్లోకముల వచన గ్రంథము



రచయిత: త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు

www.thraithashakam.org





ప్రథమ దైవగ్రంథము

# త్రైత సిద్ధాంత

# భగవద్గీత

(578 శ్లోకముల వచన గ్రంథము)


రచయిత

త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

**శ్రీ.శ్రీ.శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**






ప్రచురించిన వారు

**ఇందూ జ్ఞానవేదిక**

(Estd. in 1978 - Regd.No.: 168/2004)

త్రైత శకము-41 పదవ ముద్రణ : ఏప్రిల్-2019

ప్రతులు : 1000 వెల : **500/-**

**"ఇందూ జ్ఞానవేదిక" ప్రచురణలు**

01) త్రైత సిద్ధాంత భగవద్గీత.
02) ఇందూ సాంప్రదాయములు.
03) ఇందుత్వమును కాపాడుదాం.
04) ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
05) హిందూమతములో కులవివక్ష.
06) తిట్ల జ్ఞానము-దీవెనల అజ్ఞానము.
07) శ్రీకృష్ణుడు దేవుడా! భగవంతుడా!!
08) యజ్ఞములు (నిజమా-అబద్దమా?).
09) ఏ మతములో ఎంత మతద్వేషము?
10) హిందూ మతములో సిద్ధాంతకర్తలు.
11) దైవగ్రంథములో సత్యాసత్య విచక్షణ.
12) దేవుని రాకకు ఇది సమయము కాదా!
13) మూడు గ్రంథములు, ఇద్దరు గురువులు.
14) దయ్యాల-భూతాల యదార్థ సంఘటనలు.
15) ప్రతిమ × విగ్రహ-దైవము × దెయ్యము.
16) త్రైతాకార రహస్యము (త్రైతాకార బెర్ముడా).
17) హేతువాద ప్రశ్నలు-సత్యవాద జవాబులు.
18) జ్యోతిష్యశాస్త్రము (శాస్త్రమా-అశాస్త్రమా?).
19) మంత్రము-మహిమ (నిజమా-అబద్దమా?).
20) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.
21) మన పండుగలు (ఎలా చేయాలో తెలుసా?).
22) కలియుగము (ఎప్పటికీ యుగాంతము కాదు).
23) కృష్ణ మూస (శ్రీకృష్ణ మరణము తర్వాత జీవితము)
24) స్వర్గము ఇంద్రలోకమా! నరకము యమరాజ్యమా!!
25) మూడు దైవ గ్రంథములు-మూడు ప్రథమ వాక్యములు.

26) తీర్పు-దేవుని తీర్పు.
27) గుత్తా.
28) ప్రబోధ
29) సుబోధ.
30) ఆదిత్య.
31) సమాధి.
32) తల్లి తండ్రి.
33) గీటురాయి.
34) త్రైతారాధన.
35) ధర్మచక్రము
36) ప్రసిద్ధి బోధ.
37) కర్మపత్రము.
38) నీకు నా లేఖ.
39) ఒక్కడే ఇద్దరు.
40) దేవుని ముద్ర.
41) భావము-భాష.
42) కథల జ్ఞానము.
43) సత్యాన్వేషి కథ.
44) సిలువ దేవుడా?
45) ఆత్మలింగార్థము.
46) ప్రాథమిక జ్ఞానము.
47) విశ్వ విద్యాలయము.
48) జీహాద్ అంటే యుద్ధమా?
49) జనన మరణ సిద్ధాంతము.
50) మతాతీత దేవుని మార్గము.
51) దేవుని చిహ్నము.
52) మతము-పథము.
53) ద్రావిడ బ్రాహ్మణ.
54) ప్రవక్తలు ఎవరు?
55) ధర్మశాస్త్రము ఏది?
56) దేవుని గుర్తు-963.
57) ఇందువు క్రైస్తవుడా?
58) నాస్తికులు-ఆస్తికులు.
59) ప్రబోధ తరంగాలు.
60) గీతా పరిచయము.
61) త్రైత సిద్ధాంతము.
62) వార్తకుడు-వర్తకుడు.
63) ధర్మము-అధర్మము.
64) తత్త్వముల జ్ఞానము.
65) మరణ రహస్యము.
66) పునర్జన్మ రహస్యము.
67) గురు ప్రార్థనామంజరి.
68) సామెతల జ్ఞానము.
69) పొడుపు కథల జ్ఞానము.
70) ఏది నిజమైన జ్ఞానము?
71) నిగూఢ తత్త్వార్థ బోధిని.
72) దేవాలయ రహస్యములు.
73) ప్రబోధానందం నాటికలు.
74) హేతువాదము-ప్రతివాదము.
75) మత మార్పిడి దైవద్రోహము.
76) నాది లోచన-నీది ఆలోచన.

77) ద్యానము-ప్రార్థన-నమాజ్.
78) సాయిబాబా దేవుడా! కాదా?
79) లు అంటే ఏమిటి? (తెలుగు)
80) చెట్టుముందా! విత్తుముందా?
81) గీతం-గీత (పాటల జ్ఞానము).
82) మరణము తర్వాత జీవితము.
83) ప్రథమ దైవగ్రంథము భగవద్గీత.
84) దేవుని జ్ఞానము కబ్జా అయ్యింది.
85) అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు.
86) ఒక మాట మూడు గ్రంథములు.
87) త్రైత సిద్ధాంత ఆధ్యాత్మిక ఘంటు.
88) ఏసు చనిపోయాడా? చంపబడ్డాడా?
89) ఏది సత్యము-ఏది అసత్యము.
90) ఒక వ్యక్తి రెండు కోణములు.
91) అంతిమ దైవగ్రంథములో వజ్ర వాక్యములు.
92) బ్రహ్మ-రావణబ్రహ్మ-భగవాన్ రావణబ్రహ్మ.
93) ద్వితీయ దైవగ్రంథములో రత్న వాక్యములు.
94) హిందూ ధర్మమునకు రక్షణ అవసరమా?
95) వేదములు మనిషికి అవసరమా?
96) ఉపనిషత్తులలో లోపాలు.
97) ఖుర్ఆన్, హదీసు ఏది ముఖ్యము?
98) భక్తిలో మీరు సంసారులా? వ్యభిచారులా?
99) ౧౦౦, శతము, 100
100) సుప్రసిద్ధి బోధ.
101) సిద్ధి బోధ.
102) సత్యార్థ ప్రకాశికలో సత్యమెంత.
103) రూపము మారిన గీత.
104) పోలీసులు-నేరస్థులు.
105) ఇప్పటి మానవుని పరిస్థితి.
106) తత్వార్థ బొమ్మల జ్ఞానము.

01. గుర్తింపబడనివాడు గురువు.
02. పుట్టినరోజు ఎవ్వరికీ రాదు.
03. ద్వితీయుడు-అద్వితీయుడు.
04. ఏక్‌నిరంజన్-అలక్‌నిరంజన్.
05. మాయకుడు-అమాయకుడు.
06. తల్లి తండ్రి-గురువు దైవము.
07. గురువులేని విద్య గ్రుడ్డివిద్య.
08. మతములలో పవిత్రయుద్ధము.
09. ప్రపంచ శ్రద్ధ-పరమాత్మ శ్రద్ధ.
10. దేశం మోసం-దేహం మోహం.
11. ఎదమీదముద్ర-తల్లి తండ్రి గుర్తు.
12. మూడు పుట్టుకలు-రెండు జాగాలు.
13. యోగీశ్వరుల జన్మదిన సందేశము.
14. తెలుగులో మూడు-ఆరు-తొమ్మిది.
15. మాయ మర్మము- ఆత్మ ధర్మము.
16. బయటి సమాజం-లోపలి సమాజం.
17. దేవుని జ్ఞానము-మాయ మహత్యము.
18. మూడు నిర్మాణాలు-ఒక పరిశుభ్రత.
19. సహజ మరణం- తాత్కాలిక మరణం.
20. మేఘం ఒకభూతం- రోగం ఒకభూతం.
21. కర్మ లేని కృష్ణుడు-కర్మ ఉన్న కృష్ణుడు.
22. స్వార్థ రాజకీయం (స్వ+అర్థ రాజకీయం).
23. శ్రీకృష్ణుడు చనిపోయాడా? చంపబడ్డాడా?
24. అంతిమ గ్రంథములో ప్రథమ వాక్యములు.
25. ఇచ్ఛాధీన కార్యములు-అనిచ్ఛాధీన కార్యములు.
26. టక్కుటమారా, ఇంద్రజాల మహేంద్రజాల, గజకర్ణ, గోకర్ణ.

*(DVD'S)*

27. ఆత్మ.
28. తాత.
29. తల్లి.
30. భయం.
31. ఆత్మపని.
32. బట్టతల.
33. యాదవ్.
34. జ్ఞానశక్తి.
35. సమాధి.
36. 6-3=6.
37. సంతకము.
38. ప్రభు-ప్రజ.
39. త్రైతశకము.
40. తోలేవాడు.
41. తల్లి తండ్రి.
42. నటించే ఆత్మ.
43. సంచిత కర్మ.
44. గురు చిహ్నం.
45. ఆస్తి-దోస్తి.
46. వెలుగుబంటు.
47. ధర్మచక్రము.
48. దైవగ్రంథము.
49. భక్తి-శ్రద్ధలు.
50. పురుషోత్తమ.
51. మతద్వేషము.
52. గ్రాహిత శక్తి
53. ఆడించే ఆత్మ.
54. ఏది శాస్త్రము?
55. భగవంతుడు.
56. ఏది ధర్మము?
57. గురుపౌర్ణమి.
58. శ్రీకృష్ణాష్టమి.
59. గోరు-గురు.
60. దశ-దిశలు.
61. మాట-మందు.
52. సృష్టి-సృష్టికర్త.
63. కలియుగము.
64. సేవా శాతము.
65. ప్రకృతి-వికృతి.
66. పైత్యం-సైత్యం.
67. నైజం-సహజం.
68. భక్తి-భయము.
69. సాంప్రదాయము.
70. అదురు-బెదురు.
71. నీ వెనుక వాడు.
72. శవము-శివము.
73. శైవము-వైష్ణవము.
74. ధర్మము-అధర్మము.
75. ద్రావిడులు-ఆర్యులు.
76. కాయ-పండు-కాయ.
77. యుగము-యోగము.
78. దేవునికి మతమున్నదా?
79. కర్మ మర్మము.
80. పుట్టుట-గిట్టుట.
81. ఏకత-ఏకాగ్రత.
82. చమత్కార ఆత్మ.
83. నిదర్శ - నిరూప.
84. గురువు ఎవరు?
85. త్రైత సిద్ధాంతము.
86. స్త్రీ / పు - లింగము.
87. జీర్ణ+ఆశయము.

88. శ్రీకృష్ణుడు ఎవరు?
89. ఆట-దోబూచులాట.
90. ప్రజలు-మానవులు.
91. దంతము-అంతము.
92. మతము-పథము.
93. ఏడు ఆకాశములు.
94. అర్థము-అపార్థము.
95. మూడు గ్రంథములు.
96. గ్రంథము - బోధ.
97 ప్రభువు-ప్రభుత్వం.
98. జ్ఞానము-విజ్ఞానము.
99. వార-మాస-వత్సర.
100. భూతం-మహాభూతం.
101. సేకూవలి-కూలిసేవా.
102. ఆత్మకు వెంట్రుక గుర్తు.
103. కోడిపుంజు-పాదరసము.
104. ఇందూ మహాసముద్రము.
105. శ్రీకృష్ణజన్మ మధుర.
106. అధర్మ ఆరాధనలు.
107. పుస్తకము-గ్రంథము.
108. హరికాలు-హరచేయి.
109. పుట్టగోసి-మొలత్రాడు.
110. 1 2 3 గురుపౌర్ణమి.
111. క్షమించరాని పాపము.
112. మరణము-శరీరము.
113. దివ్యఖురాన్-హదీసు.
114. ఇందువు-హిందువు.
115. సుఖము-ఆనందము.
116. కాలజ్ఞాన వాక్యములు.
117. భౌతికము-అభౌతికము.
118. దేవుని ఆజ్ఞ-మరణము.
119. జ్ఞానము దగ్గర జాగ్రత్త!
120. చంద్రాకారము (బట్టతల).
121. జ్ఞానము కబ్జా అయ్యింది!
122. దేవుడు ఇద్దరా! ఒక్కరా!!
123. మత సామరస్యం.
124. మోక్షము-మోసము.
125. అక్షర జ్ఞానము.
126. లలా జలము.
127. దైవ ధర్మములు-మత సాంప్రదాయములు
128. ఆహారము నీకా! నీ ఆత్మకా!!
129. మాత్ర-మందు.
130. కాలచక్రం.
131. బ్రహ్మవిద్య.
132. శక్తి.
133. పౌర్ణమి-అమావాస్య.
134. ఈశ్వర-పరమేశ్వర.
135. పురుషోత్తమ-శ్రీరామ.
136. దేవునికి ఒక్కడే కుమారుడు-
దేవునికి అనేకమంది కుమారులు.
137. జలం.
138. అధిపతి.
139. గ్రహాంతర వాసులు.
140. దేవుడు ద్వితీయుడా? అద్వితీయుడా?
141. మనిషి చేతిలో భగవంతుడు-
దేవుని చేతిలో మనిషి.
142. శరీరములో రక్తము-
గ్రంథములో జ్ఞానము
143. గ్రంథములో జ్ఞానము-
మనిషిలో రక్తము.
144. త్రైత సిద్ధాంత చరిత్ర.
145. ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.

## ప్రబోధాశ్రమము (శ్రీకృష్ణమందిరము)

చిన్నపొడమల (గ్రా), తాడిపత్రి (మం), అనంతపురం (జిల్లా) A.P.
Cell : 98665 12667, 99516 75081, 94903 63038.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
అనంతపురము టౌన్, A.P.
Cell : 97059 59390, 99855 80099

**కె.లక్ష్మీనారాయణాచారి** (ప్రెసిడెంట్)
ధర్మవరం, అనంతపురం (జిల్లా),
Cell : 94405 56968, 92900 12413, 94406 01136

**టి. సూర్యనారాయణ** (సూర్య మీ సేవా)
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9885250967

**ఇందూ ధరణి జనరల్ స్టోర్స్**
(పి. శివరామ్ ప్రసాద్)
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9030057963, 9063504963

**బి. ఆదిశేషయ్య** (టీచర్) (ప్రెసిడెంట్)
ప్రబోధాశ్రమము, తాడిపత్రి (మం)
Cell : 9491362448, 7382986963.

**పి. ఆదినారాయణ** (ప్ర.సభ్యుడు)
ముద్దిరెడ్డి పల్లి (గ్రా॥), అనంతపురం (జిల్లా).
Cell : 9440745800, 7259851861.

**ఎ. నాగేంద్ర** (ప్రెసిడెంట్)
క్రొత్త చెరువు (గ్రా,మం)
అనంతపురం జిల్లా. Cell:9493622669
9959316410, 9949995090.

**పి. నాగయ్య** (ప్ర.సభ్యుడు)
వీకర్ సెక్షన్ కాలనీ, కర్నూలు టౌన్
Cell : 9440244598, 9849303902

**ఇందూ జ్ఞానవేదిక** (Head Office)
చైతన్యపురి, దిల్‌సుఖ్‌నగర్,
హైదరాబాద్, తెలంగాణ రాష్ట్రం,
Cell:94910 40963, 90329 63963, 98485 90172.

**డి. గోపికృష్ణ**
హుజురాబాద్, కరీంనగర్ జిల్లా, T.S
Cell : 9989202003, 9542061601

**కె.వెంకటేశ్వర్లు** (ప్ర.సభ్యుడు)
నందికొట్కూరు, కర్నూలు జిల్లా
Cell : 9440047256, 9701956599

**కె.అశోక్‌బాబు** (టీచర్) (ప్రెసిడెంట్)
రామాపురం (గ్రా), వి.కోట (మం).
చిత్తూరు జిల్లా. Cell : 9440305700

**వి. రామక్రిష్ణన్** (వైస్ ప్రెసిడెంట్)
కుప్పం, చిత్తూరు జిల్లా. Cell : 96527 55110

**డి. బాలాజీ** (వైస్ ప్రెసిడెంట్)
బంగారు పాళ్యం (గ్రా), చిత్తూరు జిల్లా.
Cell : 9985483241, 7396077408.

**బాలం లక్ష్మీనరసింహులు** (ప్రెసిడెంట్)
మదనపల్లి, చిత్తూరు జిల్లా.
Cell : 9440825533, 8519938999.

**టి.వి. రమణ** (ప్రెసిడెంట్)
ముదిగుబ్బ (గ్రా) అనంతపురం జిల్లా
Cell : 9440980036, 07406039453.

**డి. వరుణ్ కుమార్ శ్రేష్ఠి (ప్రెసిడెంట్)**
పులివెందుల , కడప (జిల్లా).
Cell : 9293199539, 9985714382

P.M.H **నాయుడు**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా).
Cell : 9440490963

P. **రామకృష్ణారెడ్డి**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా)
Cell : 9666202963

**శ్రీ ప్రబోధ క్లీనిక్**
**U. జనార్ధన్** (R.M.P)
ఆటోనగర్, కోయిలకుంట్ల (మం),
కర్నూలు (జిల్లా) Cell : 9491851911

**డా॥యం. వెంకటేశ్వర రావు (ప్రెసిడెంట్)**
MD (acu)
శాంతినగర్, నెల్లూరు జిల్లా.
Cell : 7989100433, 9246770277.

**అనమల మహేశ్వర్ (ప్రెసిడెంట్)**
చవటపాల్యం (గ్రా), గూడూరు, నెల్లూరు జిల్లా.
Cell : 9494631664, 9490809181, 8106065300.

**రౌతు శ్రీనివాసరావు (ప్రెసిడెంట్)**
దర్గామాన్యం, గుంటూరు (జిల్లా).
Cell : 9948014366, 9052870853

**ఘడియం. పెద్దరెడ్డి (ప్రెసిడెంట్)**
నరసరావుపేట, గుంటూరు (జిల్లా).
Cell : 9989204097, 9505904097

**నర్రా శ్రీనివాస్ రెడ్డి**
కంభం (మం), ప్రకాశం (జిల్లా).
Cell :9849883261, 8142853311, 8187084516

**తలారి గంగాధర్**
గుడిపాటి గడ్డ, నంద్యాల టౌన్
Cell: 9491846282, 7671963963

**Y. రవిశేఖర్ రెడ్డి**
పెద్దకొట్టాల (గ్రా), నంద్యాల (మం)
కర్నూలు (జిల్లా).
Cell : 9440420240, 9885385215

**టి. ఉదయకుమార్ (ప్రెసిడెంట్)**
భీమవరం వన్‌టౌన్, పశ్చిమ.గో.జిల్లా
Cell : 99482 75984, 73864 33834.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
విశాఖపట్టణము, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం.
Cell : 76749 79663, 94400 42763,
89777 13666, 92478 26253.

**ఎన్.బి. నాయక్ (ప్ర.సభ్యుడు)**
పెదమడక, అగనంపూడి,
విశాఖపట్నం (జిల్లా), Cell : 73964 92239,
92483 15309, 73862 12589.

**వి.సి.వర్మ (గురూజీ) ఆనందాశ్రమము**
మజ్జివలస (గ్రా, పోస్టు),
భీమిలి (మం), విశాఖపట్నం (జిల్లా).
Cell : 94415 67394, 9502 172711.

**వి. శంకర రావు (టీచర్) (ప్రెసిడెంట్)**
అశోక్‌నగర్, విజయనగరము (జిల్లా).
Cell : 9703534224, 9491785963.

**తులసీ రావు**
Opp. T.T.D కళ్యాణమండపం,
విజయనగరము (జిల్లా).
Cell : 9441878096, 9030089206.

**యస్. అనిల్‌కుమార్**
కాకినాడ టౌన్, తూర్పు గోదావరి జిల్లా
Cell:9866195252, 9640526520, 7396038888

**బండారు సత్యనారాయణ**
మామిడి కుదురు (మం),
తూ.గోదావరి జిల్లా, Cell:95535 07141,
84669 20419, 94902 95577

**ఎన్.వి. రామకృష్ణ** (ప్ర.సభ్యుడు)
బొద్దాం (గ్రా), రాజాం (మం),
శ్రీకాకుళం (జిల్లా).
Cell : 9494248963, 9959779187.

**చెల్లారపు అప్పల నాయుడు**
చెల్లారపు వలస (గ్రా),
బొబ్బిలి (మం), విజయనగరం జిల్లా.
Cell:9494853773, 8465860706

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
మల్లిగాం (గ్రా), కొత్తపేట్ (పో),
రాయగడ (జి), ఒడిశా (రాష్ట్రం)
09437527499, 09437527470, 09437975781

**షేక్ అమీర్ అలీ** (President, K.I.S.S)
నల్గొండ జిల్లా, తెలంగాణ రాష్ట్రం.
Cell : 9505989898, 9505768181

**షఫీ షేక్** (Vice President, K.I.S.S)
చెన్నై, తమిళనాడు రాష్ట్రం.
Ph:09445554354.

**షేక్ ఇబ్రహీం** (K.I.S.S Member)
కర్నూల్ టౌన్, ఆం.ప్ర. Ph:70950 08369

**యం. అల్లీపీర్** (K.I.S.S Member)
మడకశిరా, అనంతపురం జిల్లా, ఆం.ప్ర.
Cell : 89780 58081

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
కొత్తకోట, మహబూబ్‌నగర్ (జిల్లా).
Cell : 87905 58815, 9440655409, 9701261165

**యం. మురళి** (Cell : 97057 16469)
జడ్చర్ల, మహబూబ్‌నగర్ జిల్లా.

**యం. జైరాంనాయక్**
పద్మావతి కాలనీ, మహబూబ్‌నగర్ టౌన్.
Cell :70321 74830, 90009 16419

**జి. సాయిశంకర్ శ్రేష్ఠి** (టీచర్)
అచ్చంపేట, మహబూబ్ నగర్ (జి)
Cell : 9948947630, 9640717574

**పోటు వెంకటేశ్వర్లు (గురూజీ)** (ప్రెసిడెంట్)
హుజూర్‌నగర్, నల్గొండ జిల్లా.
Cell : 9848574803, 9866423853.

**బి. దేవేందర్**
భువనగిరి టౌన్, నల్గొండ జిల్లా.
Cell:9948060838, 9704885964, 9848741703

**ఇ. శ్రీనాథ్ శ్రేష్ఠి**
గణేష్ స్ట్రీట్, జనగాం, వరంగల్ జిల్లా.
Cell : 9573552963, 8096958359.

**ఎ. రాఘవేంద్ర శ్రేష్ఠి**
శ్రీకృష్ణ మెడికల్స్ & జనరల్స్
పటేల్ నగర్, 3వ క్రాస్ హోస్పేట,
బళ్ళారి జిల్లా, కర్ణాటక రాష్ట్రం.
Cell : 097318 16452, 096111 33635.

**A.V. LAKSHMI NARAYANA**
San Antonio, TEXAS, U.S.A
+1(210) 527 3436, +1(210) 668 8963

**K.SIVA KRISHNA**
Atlanta, GEORGIA, U.S.A
+1(404) 551 3297, +1(470) 658 7635

# విషయ సూచిక

# 12 అధ్యాయములు - శ్లోకముల వివరములు

| అధ్యాయము పేరు | కల్పితములు | వ్రాసినవి | వ్రాయనివి | మొత్తము |
|---|---|---|---|---|
| అర్జున విషాద యోగము | - | - | 47 | 47 |
| సాంఖ్య యోగము | 7 | 55 | 10 | 72 |
| కర్మ యోగము | 7 | 36 | - | 43 |
| జ్ఞాన యోగము | 9 | 33 | - | 42 |
| కర్మ సన్న్యాస యోగము | - | 29 | - | 29 |
| ఆత్మ సంయమ యోగము | 1 | 46 | - | 47 |
| విజ్ఞాన యోగము | - | 30 | - | 30 |
| అక్షర పరబ్రహ్మ యోగము | - | 28 | - | 28 |
| రాజవిద్యా రాజగుహ్య యోగము | - | 34 | - | 34 |
| విభూతి యోగము | - | 42 | - | 42 |
| విశ్వరూప సందర్శన యోగము | 10 | 45 | - | 55 |
| భక్తి యోగము | - | 20 | - | 20 |
| క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగము | - | 35 | - | 35 |
| గుణత్రయ విభాగ యోగము | - | 27 | - | 27 |
| పురుషోత్తమప్రాప్తి యోగము | - | 20 | - | 20 |
| దైవాసుర సంపద్విభాగ యోగము | - | 24 | - | 24 |
| శ్రద్ధాత్రయ విభాగ యోగము | 6 | 22 | - | 28 |
| మోక్ష సన్న్యాస యోగము | 14 | 52 | 12 | 78 |

| | | |
|---|---|---|
| **వ్రాసిన శ్లోకముల మొత్తము సంఖ్య** | - | **578** |
| **వ్రాయని శ్లోకములు** | - | **69** |
| **కల్పిత శ్లోకములు** | - | **54** |
| **గీతలోని శ్లోకముల మొత్తము సంఖ్య** | - | **701** |
| **భావము మార్చి వ్రాసిన శ్లోకములు** | - | **55** |

# భగవద్గీత - రచయిత ముందుమాట

భూమి మీద గల జీవరాసులలో మనిషి అన్నిటికంటే ఎక్కువ బుద్ధిబలము కలవాడు. బుద్ధిలో అన్నిటికంటే గొప్పవాడైన మానవుడు, అన్నిరంగములలో అతి సూక్ష్మాతి సూక్ష్మముగా యోచించగల్గుచున్నాడు. కాని ఒకే ఒక ఆధ్యాత్మికరంగములో మాత్రము హీనాతిహీనముగా వెనుకబడి ఉన్నాడు. ఉదాహరణకు ఒక న్యాయవాది (అడ్వకేట్) ఉన్నాడనుకొందాము. అతడు అన్యాయవరుని వైపు వాదించుటకు ఒప్పుకొని, తన బుద్ధిచేత అన్యాయమును న్యాయముగా వర్ణించి, తన క్లైంట్ చేసినది న్యాయమనిపించి శిక్షనుండి తప్పించగల్గుచున్నాడు. అలాగే ఒక డాక్టరు తన దగ్గరకు వచ్చిన రోగియొక్క భయంకర రోగమును సహితము, తన తెలివితో వైద్యము చేసి నయము చేయగల్గుచున్నాడు. పోలికలేని క్రొత్తరోగమును బుద్ధితో యోచించి పోగొట్టిన వైద్యుడుగానీ, అన్యాయమును న్యాయమన్నట్లు వాదించి గెలిచిన న్యాయవాదిగానీ, ఇంకా ఎంతో తెలివిగలవారు గానీ, దైవసంబంధమైన విషయముల వద్ద మాత్రము పూర్తి తెలివి తక్కువవారై, ఏమాత్రము గ్రహించలేనివారై పోవుచున్నారు. ప్రపంచ విషయములలో వికసించిన బుద్ధి పరమాత్మ విషయములలో మాత్రము ముకుళించుకొని పోవుచున్నది. మానవుడు ప్రపంచ విషయములలో ఎంతో అభివృద్ధి చెందుచు పూర్వము లేనివి, ఎవరికీ తెలియనివి అయిన ఎన్నో క్రొత్త సిద్ధాంతములను, క్రొత్త యంత్రములను కనుగొనుచున్నప్పటికీ ఆధ్యాత్మిక విషయములలో మాత్రము పూర్వమున్నవి మరియు పూర్వము అందరికీ తెలిసిన విషయములను కూడా గ్రహించలేక పోవుచున్నాడు. ప్రపంచ విషయములను ఎన్నిటినో తెలిసినవాడు, పరమాత్మ విషయములను ఎందుకు తెలియలేక పోవుచున్నాడో కూడా గ్రహించలేక, దైవ విషయములలో పూర్తి పొరబడుచున్నాడు. అక్షరములను నేర్చినంత మాత్రముననే అన్ని పట్టాలు వచ్చినట్లు తలచువానిలాగ, తనకున్న కొద్ది భక్తితోనే తనకు పూర్తి జ్ఞానము తెలుసుననుకొనుచున్నాడు.

ఈనాటి మానవుని బుద్ధికి ఆధ్యాత్మిక విషయములలో పూర్తిస్థాయి అవగాహన లేకుండా పోవుచున్నది. ఉదాహరణకు ఒక దారిలో ఇద్దరు స్త్రీలు పోవుచున్నారు. అదే దారిలోనే ముగ్గురు వ్యక్తులు కూర్చొని ఉన్నారు. ఫర్లాంగు దూరములో వస్తున్న ఇద్దరి స్త్రీలలో ఒకరు స్త్రీకాగా, ఒకరు నపుంసకుడై ఉండెను. చీర, రవిక కట్టడములోను, వేషధారణలోను, అలంకారములోను నపుంసకుడు స్త్రీతో సమానముగా ఉండుట

వలన దూరము నుండి చూచినపుడు ఇద్దరినీ స్త్రీలనుకోవడములో తప్పులేదు. మొదట ఇద్దరినీ స్త్రీలని దారి ప్రక్కన కూర్చున్న వారనుకున్నారు. ఆ స్త్రీలు కొంత దగ్గరవుతూనే ముగ్గురిలో ఒకటవ వాడు, వారిలోని నడక ముఖవర్చస్సు యొక్క కొద్దిపాటి వ్యత్యాసమును బట్టి వస్తున్నది ఇద్దరు స్త్రీలుకాదు, అందులో ఒకరు మాత్రము స్త్రీకాగా ఒకరు నపుంసకుడని చెప్పాడు. ఆ మాటవిన్న రెండవవాడు, మూడవవాడు వారిలోని వ్యత్యాసమును కనుగొనలేక, "కాదు ఇద్దరూ స్త్రీలే" అన్నారట. ఇలా వారనుకొన్న కొద్దిసేపటికే దారిన పోయే ఆ ఇద్దరు దగ్గరకొచ్చారు. దగ్గరగ చూచిన రెండవ వానికి కొంత అర్థమైపోయి ఒకరు నపుంసకుడే అని నిర్ధారణకొచ్చాడు, కానీ పైకి ఒప్పుకోలేదు. ఇంతసేపు కాదని ఇపుడు ఒప్పుకుంటే తనకు విలువుండదను కొన్నాడు. మూడవవాడు మాత్రము చాలా తెలివితక్కువవాడు కాబోలు అప్పటికి కూడా వానికి అర్థము కాలేదు. వారిలోని తేడాను కనుగొనలేక పోయాడు. మొదటివాడు ఎన్నో తేడాలు చెప్పుచున్నప్పటికీ, మూడవ వానికి ఏమాత్రము అర్థము కాలేదు. పైకి కనిపించు ఆకారములే ముఖ్యమనుకొన్నాడు. లోపలగల లింగభేదమును గ్రహించలేక పోయాడు. చివరకు ఈ విధముగా *"ఏమి చెప్పినా ఒప్పుకోను, ప్రత్యక్షముగా చీరకట్టుకున్న ఆడవారు కనిపిస్తుంటే ఎలా కాదనాలి? నేను నమ్మనుగాక నమ్మను. చెవులకు కమ్మలు, చేతులకు గాజులు, కాళ్లకు మెట్టెలు, మెడలో మంగళసూత్రము ఇన్ని ఉంటే ఆడది కాదంటావా, నీకు బుద్ధిలేదుపో!"* అన్నాడు. రెండవవాడు మాత్రము మొదటివాని మాటను లోపల ఒప్పుకొనినప్పటికీ బయటికి మాత్రము మూడవవాడు చెప్పినదే నిజమన్నాడు. వారి వాదనను చూచి మొదటివాడు వీరెంతో తెలివి తక్కువ వారని, వీరితో వాదించుటకంటే ఊరకుండుట మంచిది అనుకొన్నాడు.

ఈ విధముగనే జగతిలో మూడు రకముల మనుషులున్నారు. సత్యమును గ్రహించినవారు ఒకరకము, సత్యమును గ్రహించి పైకి ఒప్పుకోలేని వారు రెండవ రకము, సత్యమును గ్రహించలేక, తాను పట్టిన కుందేలుకు మూడేకాళ్లన్నట్లు కొంతయినా వెనుదిరిగి ఆలోచిస్తామనుకోక, తనకు తెలిసినదే సత్యమని మొండిగా వాదించువారు మూడవ రకము. దైవ విషయములో సత్యమును తెలిసినవారు కోటికి ఒకరు అరుదుగా ఉండగ, అంతరంగములో సత్యమును ఒప్పుకొని బయట

ఒప్పుకోనివారు కొందరున్నారు. సత్యమును ఏమాత్రము గ్రహించలేక మొండిగా వాదించువారు ఎందరో గలరు. దైవమార్గములో సత్యమునే తెలియాలని పట్టుదల గలిగి సత్యాన్వేషియై, సత్యమును తెలిసినవాడు కోటికొకడుండడము అరుదైన విషయమే. భూమిమీద సత్యమును తెలిసినవాడు అరుదుగా ఎవడో ఒకడుండవచ్చును. వానిని దారిలోనున్న మొదటివానిగా చెప్పుకోవచ్చును. మొదటినుండి తమకు జ్ఞానము తెలుసునని చెప్పుకొనుచూ గురువులుగా, స్వాములుగా, ఆధ్యాత్మికవేత్తలుగా చలామణి అయిన వారికి దైవమార్గములో కొంత తెలిసివుండుట వలన చివరకు తమ జ్ఞానము తప్పని, సత్యాన్వేషి చెప్పిన జ్ఞానమే నిజమైనదని తెలిసి, పైకి ఒప్పుకొంటే ప్రజలలో ఇంతవరకున్న గౌరవము తగ్గునని, మొదటినుండి తాము చెప్పుచున్నదే చెప్పుచుందురు. తమలోని పొరపాటును బయటపడకుండా, తాము బయటపడకుండా తెలిసి అసత్య వచనములాడుచుందురు. ఇటువంటి వారు దారిలోని రెండవ రకము వారు. సత్యమును ఏమాత్రము ఎప్పటికీ గ్రహించలేక తమకున్న కొద్దిపాటి జ్ఞానమే గొప్పదనుకొని, తాము చేయు ఆచరణయే సరియైనదనుకొని, ఎవరేమి చెప్పినా వినని వారు గలరు. ఇటువంటి వారిని దారిలోని మూడవరకము వారిగా లెక్కించ వచ్చును.

దారిలో వస్తున్న వారు వేషభూషణములలో స్త్రీలే అయినప్పటికీ వారి భౌతిక శరీరములలో తేడాగలదు. ఇద్దరిలో ఒకరు స్త్రీకాగా, రెండవ వారు నపుంసకులు. నపుంసకుని శరీరము పురుషాంగము కల్గియుండుట వలన నపుంసకుడిని స్త్రీ అనలేము. పైకి కనిపించుటకు అన్నివిధముల స్త్రీవలె ఉన్నప్పటికీ లోపల మాత్రము శరీరము వేరుగ ఉన్నది. మొదట దూరమునుండి చూచినపుడు గుర్తించలేక స్త్రీలనుకొనినా ఫరవాలేదు గానీ, దగ్గరికి వచ్చిన తర్వాత కూడా గుర్తించలేని వారిని తెలివితక్కువ వారని చెప్పవచ్చును. అంతేగాక గుడ్డలూడదీసి చూచినప్పటికీ స్త్రీ పురుషుల తేడాను గుర్తించలేని వారిని మరీ మూర్ఖులని చెప్పవచ్చును. దారిలో వస్తున్న స్త్రీలు కనిపించినట్లే, భూమి మీద పైకి కనిపించుటకు ఆకారములో ఒకే పోలిక కల్గిన రెండు రకముల తేడాలున్న పుస్తకములు గలవు. వాటిని చూచువారు కూడా మూడు రకముల వారు గలరు. పుస్తకములు ఒకే ఆకారములున్నప్పటికీ వాటిలోపల తేడాలున్నవని చెప్పు మొదటి రకము వారూ గలరు. అలాగే ఆ తేడాను మొదట గుర్తించలేక పోయినప్పటికీ

తర్వాత గుర్తించి, ఆ విషయమును బయటికి ఒప్పుకోక ముందునుండి చెప్పుమాటనే చెప్పు రెండవ రకమువారూ గలరు. పుస్తకములు అన్నీ ఒకరకముగానే ఉన్నవి కదా! అని వాటి తేడాను ఏమాత్రము ఒప్పుకోని మూడవ రకమువారు కూడా గలరు.

భూమి మీద పుస్తకములు అన్నియు ఒకే ఆకారము కల్గి ఉన్నప్పటికీ వాటిలోని విషయములను బట్టి పురాణములు, శాస్త్రములని రెండురకములుగ విభజింపవచ్చును. కనిపించుటకు అన్నీ పుస్తకములే అయినప్పటికీ, వాటిలోని విషయములనుబట్టి పురాణములని, శాస్త్రములని విభజించుకొని గుర్తించు మొదటిరకము మనుషులు గలరు. మొదట అన్నీ పుస్తకములేకదా! అది శాస్త్రమైతే ఇది ఎందుకు శాస్త్రము కాదని వాదిస్తూ, చివరకు వాటి తేడాను గమనించి బయటపడక, ముందు మాటనే మాట్లాడుచుపోవు రెండవ రకము వారు గలరు. అలాగే వాటి తేడాను కనుగొనలేక అన్నీ ఒకటే కదా! అని మొండిగా వాదించు మూడవ రకము వారు గలరు.

పురాణములలోని విషయములు వేరని, శాస్త్రములలోని విషయములు వేరని తేల్చి చెప్పువారున్నప్పటికీ, వాటి తేడాను వివరిస్తున్నప్పటికీ, మొదట కాదని కొంతకాలమునకు తమ మనసులో సత్యమును గ్రహించిన వారు పురాణములను విడువలేక పైకి అన్నీ ఒకే దారి చూపుచున్నవి, ఏమీ తేడాలేదని చెప్పుకొనువారు గలరు. పురాణములను బోధించుచు పురాణములలో ఎంతో పేరుగాంచిన వారు, పురాణములు కాలక్షేపమునకే గాని కర్మక్షేపమునకు పనికి రావని, చివరికి తెలిసి కూడా మధ్యలో పురాణముల గూర్చి తక్కువగా చెప్పితే, ఇంతవరకు గొప్పవని చెప్పిన తమకు విలువుండదని, బయటికి వాటిని గొప్పగనే చెప్పుచుందురు. కొంత మనసులో పురాణములకంటే శాస్త్రములు గొప్పవని తోచుచున్నప్పటికీ, తమ బయటి గౌరవము కొరకు పురాణములను విడువలేని వారు చాలామంది కలరు. మనుషులను ఇంతగా చిక్కుబెట్టు పురాణములను, శాస్త్రములను గురించి తెలుసుకొందాము.

ఒక విషయమును గురించి చెప్పునపుడు నోటితో చెప్పితే ఆ మాట ఆ సమయములోనే, ఆ ప్రాంతములోనే వినిపించగలదు. అలా కాకుండ చెప్పిన విషయము ఎల్లప్పుడు అన్ని ప్రాంతములలో తెలియాలంటే అది గ్రంథరూపము కావాలి. పుస్తకరూపమైన విషయము పుస్తకమున్నంత వరకు ఉండగలదు. అటువంటి

పుస్తకములు రెండు రకములు గలవు. అవియే పురాణములు, శాస్త్రములు. జరుగవలసిన కాలములో మానవుడు ఈ విధముగ నడువవలెనని సమాచారమును తెలుపు నిమిత్తము, వ్రాయబడిన పుస్తకములు కల్పితములతో కూడుకొన్నవి కొన్ని కాగా, ఏమాత్రము కల్పితములు లేనివి కొన్ని గలవు. కల్పితములతో కూడుకొన్నవే పురాణములు. మానవున్ని మంచి మార్గములో నడుపవలెనను పురాణములలోనున్న ఉద్దేశ్యము మంచిదే. అయినప్పటికీ తెలుపబడిన విషయము కల్పితములతో కూడుకొన్న దానివలన హేతువాదుల విమర్శలకు నిలువలేక పోవుచున్నవి. విమర్శలకు జవాబివ్వగల స్థోమత పురాణములలో లేదు. వాస్తవ జ్ఞానము పురాణములలో లేని దానివలన మానవుని కర్మను తొలగించు స్థోమత వాటియందు లేకుండాపోయినది. అందువలన వాటిని తెలియుట వలన కాలక్షేపమేగానీ కర్మక్షేపము లేదని, పూర్వము నుండి వాటికి గుర్తింపుగ ఒక పేరుపెట్టారు, దానినే పురాణ కాల క్షేపమన్నారు. పురాణ కాలక్షేపమను మాటతో వాటి వలన కాలము వృథా అగునని అర్థము. క్రొత్త విషయములను తెలియజేయడములో మానవున్ని మంచి మార్గములో నడుపుటకు ఉద్దేశించిన పురాణముల ప్రయోగము మానవున్ని పూర్తి కర్మవిముక్తున్ని చేయలేక పోయాయి. పురాణములకు పూర్తిగా అతుక్కుపోయిన వారికి ఈ విషయము కొంత బాధ కల్గించునదైనప్పటికీ వారిని మాత్రము పురాణములు ముక్తులజేయలేవు. పురాణములకు పూర్వమునుండి పుక్కిడి పురాణములని నామము కూడా కలదు. నిజమైన విషయములు బొడ్డు దగ్గరనుండి వచ్చునని, కల్పితములు, అబద్ధములు నోటిపుక్కిడి నుండి వచ్చునని కొందరి ఉద్దేశ్యము. మేము చిన్నప్పుడు పాఠశాలలో ఉన్నపుడు నిన్నటి దినము ఎందుకు రాలేదని మాష్టారు ఒక పిల్లవానిని అడిగినపుడు, ఆ పిల్లవాడు నిన్నటి దినమున నాకు తలనొప్పిగ ఉండెను, దానికి రాలేదనెను. ఆ మాటవిన్న మాష్టారు నీవు చెప్పుమాట బొడ్డు దగ్గర నుండి వస్తావుందా లేక పుక్కిడిలో నుండి వస్తావుందా? అని అడిగెను. ఆ మాటలో అర్థము నీవు చెప్పుమాట నిజమైనదా లేక అబద్ధమా అని అడగడము. దీనిప్రకారమే పుక్కిడి పురాణములనడములో అబద్ధపు పురాణములని అర్థమవుచున్నది.

పురాణములు పుక్కిడినుండి వచ్చునవైతే, బొడ్డుదగ్గరనుండి వచ్చునవి శాస్త్రములని చెప్పవచ్చును. శాస్త్రములనగా శాసనములతో కూడుకొన్నవని

చెప్పవచ్చును. **"శాపము" అన్న పదము నుండి పుట్టినది "శాసనము". శాసనము అనినా, శాపము అనినా జరిగి తీరునదని అర్థము.** శాసనములతో కూడుకొన్నది శాస్త్రము. శాస్త్రములోని ప్రతీ విషయము సత్యముతో కూడుకొని ఉండును. ఒక్క మారు చెప్పబడిన శాస్త్రవిషయము ఎప్పటికీ అసత్యము కాదు. ఉదాహరణకు అందరికి తెలిసిన గణిత శాస్త్రమును తీసుకొందాము. అందులో 5×4=20 అన్నది శాసనము. ఇది ఒక్క మారు చెప్పబడినదైనప్పటికి చిరకాలము ఉండిపోయినది. ఎప్పుడైనా ఎక్కడయినా జరిగితీరునది శాసనము లేక శాస్త్రము అన్నట్లు, 5×4=20 అను మాట ఎప్పటికీ మారదు. ఈ విధముగ ఉన్నవి శాస్త్రములని తెలుసుకొన్నాము. పురాణములు ఒక రకమైన గ్రంథములు కాగా, శాస్త్రములు మరొక రకమైన గ్రంథములు. ప్రయాణము ఒకటే అయినా తూర్పు పడమర దిశలు వేరైనట్లు, ఉద్దేశ్యము ఒకటే అయినా పురాణములువేరు, శాస్త్రములువేరు. తూర్పు, పడమరకున్నంత తేడా పురాణములకు శాస్త్రములకు గలదు. వాటి వ్యత్యాసమును గ్రహించలేక అన్నీ పుస్తకములే కదా అంటే స్త్రీకి, నపుంసకునికి తేడా తెలియనట్లగును. అందువలన ఏ పుస్తకము ఏ కోవకు చెందినదో, శాస్త్రమేదో, పురాణమేదో, వాటికున్న వ్యత్యాసమేమో తెలియవలసిన ఆవశ్యకత చాలా ముఖ్యము. అలా కాకపోతే కాళ్లమీద పోసుకోవలసిన దుమ్మును నెత్తిమీద, నెత్తిమీద పోసుకోవలసిన నీటిని కాళ్లమీద పోసుకొన్నట్లుండును. కాళ్లకు దుమ్ము అయినప్పటికి తలమీద నీరు పోసుకొంటే శరీరమంతా తడిసి శుభ్రపడడమేకాక, కాళ్లకున్న దుమ్ముకూడ నీటిలో కొట్టుకొనిపోయి కాళ్లు కూడా శుభ్రము కాగలవు. అలాకాక కాళ్లమీద నీరుపోసుకొని తలమీద దుమ్ము పోసుకొంటే అంతవరకు శుభ్రముగనున్న శరీరమంత అశుభ్రముగా మారును. ఆ విధముగానే పురాణములు ఏ గ్రాహితములేని వారికి ప్రాథమికముగ తెలుసుకొనుట కని, కొంత గ్రాహితశక్తి గలవారికి శాస్త్రములు అవసరమైనవని తెలియాలి. అలాకాక గ్రాహితమున్న వారు పురాణములు చదివినా, గ్రాహితము లేనివారు శాస్త్రములు చదివినా ఏమాత్రము వారికి రుచింపవు. ఈ కారణము చేతనే కొందరు పురాణములను అర్థము చేసుకొన్నట్లు శాస్త్రములను అర్థము చేసుకోలేక పోవుచున్నారు. మరికొందరు శాస్త్రములను తెలిసి పురాణముల జోలికిపోకున్నారు.

ఇపుడు మనము చూడబోవు భగవద్గీత నూటికి నూరుపాల్లు శాస్త్రము కావున పురాణములలోనికి దీనిని కలుపకూడదని ముందే తెలుపుచున్నాము. ఇక్కడ ముఖ్యముగ మేము చెప్పవలసిన విషయము, మీరు వినవలసిన విషయము మరొకటి గలదు. అదేమనగా! అష్టాదశ పురాణములని, పురాణములు మొత్తము 18 గలవు. అవి వరుసగా 1) బ్రహ్మపురాణము 2) పద్మపురాణము 3) విష్ణుపురాణము 4) శివ పురాణము 5) భాగవతము 6) నారదపురాణము 7) మార్కండేయ పురాణము 8) అగ్ని పురాణము 9) భవిష్యత్‌పురాణము 10) బ్రహ్మకైవర్తన పురాణము 11) లింగ పురాణము 12) వరాహపురాణము 13) స్కంధ పురాణము 14) వామనపురాణము 15) కూర్మపురాణము 16) మత్స్య పురాణము 17) గరుడపురాణము 18) బ్రహ్మాండపురాణము.

ఈ పదునెనిమిది పురాణములు పూర్వము నుండి పేరుగాంచియున్నవి. శాస్త్రములు పురాణములలో మూడవ భాగము మాత్రము గలవు. పురాణములు 18 కాగా శాస్త్రములు కేవలము 6 మాత్రమే. శాస్త్రములకంటే పురాణములు సంఖ్యలో మూడింతలు పెద్దవైనప్పటికీ విలువలో రాతికి, రత్నానికి వున్నంత తేడా పురాణములకు, శాస్త్రములకు గలదు. 18 పురాణములకు లేని విలువ 6 శాస్త్రములకుండుట వలన ఆ విషయము పూర్వము కొందరికి జీర్ణము కానిదయ్యెను. పూర్వము కాలగమనములో పురాణప్రియులు ఎక్కువ, శాస్త్రప్రియులు తక్కువైనపుడు, అదే అదనుగ పురాణములకు విలువ చేకూర్చుటకు, శాస్త్రములకు విలువ లేకుండా చేయుటకు, పెద్దకుతంత్రము జరిగినది. శాస్త్రములను లేకుండా చేసి, శాస్త్రముల స్థానములలో మరో ఆరు విధానములను ప్రవేశపెట్టి, అవియే శాస్త్రములని ప్రచారము చేశారు. అలా మొదటి ఆరు శాస్త్రములు శాస్త్రములుగా ప్రచారము కాక, శాస్త్రములుకాని ఆరు శాస్త్రములు ప్రచారమైనవి. అవి వరుసగా ***1) శిక్ష 2) వ్యాకరణము 3) చంధము 4) నిరుక్తము 5) జ్యోతిష్యము 6) కల్పము.*** ఈ కాలములో ఇవి అందరికి తెలియకున్నా వేదపరిచయమున్న వారికి, పురాణములలో పూర్తి మునిగిన వారికి బాగా తెలియును. శాస్త్రముల పేరుతగిలించుకొన్న వీటిలో ఉదాహరణగ ఒకదానిని వివరించుకొని చూస్తాము.

**1) శిక్ష :-** ఇందు వేద శబ్దముల యొక్క అక్షరముల స్థాన జ్ఞానములను, ఉదాత్త,

అనుదాత్త, స్వరిత స్వరముల జ్ఞానమును చెప్పబడి ఉన్నది. ఉదాత్తమనగ ఉచ్ఛము, అనుదాత్తమనగ నీచము, స్వరితమనగ సమానము అని తెలియవలెను. ఈ శిక్షా శాస్త్రములను వ్యాస శిక్ష, భరద్వాజ శిక్ష, నారదశిక్ష అని మూడు విధములుగా చెప్పుచున్నారు. ఇది ఒకటవ శాస్త్రమైన శిక్షలో ఉన్న పద్ధతి. వేదశబ్దములు ఇలా పలుకవలెనని ఒకచోట గట్టిగ, ఒకచోట చిన్నగ పలుకుటకు చెప్పిన పద్ధతిని శాస్త్రమన్నారు. అదియు ఒక శాసనరూపముగాక ఇది నారదుని పద్ధతని, ఇది వ్యాసుని పద్ధతని, ఇది భరద్వాజ పద్ధతని తెలిపినారు. దానిని బట్టి వ్యాసుడు పల్కినట్లు భరద్వాజుడు పల్కలేదని, భరద్వాజుడు పల్కినట్లు నారదుడు పల్కలేదని తెలియుచున్నది. శాస్త్రము ఒకే పద్ధతి కల్గి ఎప్పటికీ మారదను సూత్రమునకు శిక్షా శాస్త్రము విలువలేకుండా చేసినది. మధ్యలో కల్పించబడిన ఇటువంటి శాస్త్రములను వదలి నిజమైన శాస్త్రములేవో తెలుసుకొందాము.

పురాణములకంటే శాస్త్రములు ఎంతో ముందుపుట్టినవి. అవి వరుసగ ఈ విధముగ గలవు ***1) గణిత శాస్త్రము 2) జ్యోతిష్యశాస్త్రము 3) ఖగోళశాస్త్రము 4) రసాయనిక శాస్త్రము 5) భౌతికశాస్త్రము 6) యోగశాస్త్రము.*** ఈ ఆరు శాస్త్రములు మినహా ఏ శాస్త్రములు లేవు. ఇక్కడ కొందరొక ప్రశ్న అడుగవచ్చును. అదేమనగా! ఈ ఆరు శాస్త్రములకంటే నేడు బాగా ప్రచారములో ఉన్నది వాస్తుశాస్త్రము. ఇల్లు కట్టించుకొను వారంతా వాస్తుశాస్త్రము ప్రకారము కట్టించుకొనుచున్నారు. అది మీ లిస్టులో లేదే? అని అడుగవచ్చును. దానికి మాజవాబు ఏమనగా! మేము చెప్పిన ఆరు శాస్త్రములు తెలిసినవారు చాలా తక్కువగా ఉన్నారు కానీ, వాస్తు శాస్త్రజ్ఞులు మాత్రము ఎక్కడ చూచినా తయారైనారు. ఇక దీని విషయము గురించి చెప్పాలంటే ఇప్పుడున్న వాస్తుశాస్త్రమనేది అసలు కల్ల. వాస్తు ప్రకారము ఇల్లు కట్టుకోవాలనడము మరీ విచిత్రమైన మాట. వాస్తు ప్రకారము లేని ఇంటిలో కష్టాలు నష్టాలు వస్తాయనడము యోగశాస్త్రమునకే విరుద్ధమైన మాట. మనిషికి లభ్యమగు ఇల్లు వాడు పుట్టినపుడే ప్రారబ్ధములో నిర్ణయించబడివుండును. మధ్యలో ఎవరూ నిర్ణయించలేరు. ఒకరికి ఎటువంటి ఇల్లు జీవితములో దొరుకునను విషయము జ్యోతిష్యములో ఉండును. అంత తప్ప ఇంటిని గురించి ప్రత్యేకమైన శాస్త్రము లేదని గుర్తించవలెను.

శాస్త్రములు ఆరు, పురాణములు పదునెనిమిది సంఖ్య ఎప్పటికీ మారునది కాదు. ఆరు శాస్త్రములలోని గణితశాస్త్రముతో జ్యోతిష్యశాస్త్రము ముడిబడియున్నది. అందువలన గణితములేని జ్యోతిష్యముండదు. అలాగే జ్యోతిష్యశాస్త్రముతో ఖగోళ శాస్త్రము ముడిబడియున్నది. అట్లే ఖగోళశాస్త్రముతో రసాయనిక శాస్త్రము, రసాయనిక శాస్త్రముతో భౌతికశాస్త్రము, భౌతికశాస్త్రముతో యోగశాస్త్రము అనుసంధానమై ఉన్నవి. భౌతికమనగా శరీరమునకు సంబంధించినది. మానవుడు శరీరము ధరించివున్నాడు. శరీరములో ఎన్నో భాగములతో నివాసము చేయు జీవాత్మ, పరమాత్మలోనికి ఐక్యము కావడానికి యోగశాస్త్రమును తెలిసి తీరాలి. గణితము, జ్యోతిష్యము, ఖగోళము, రసాయనికము, భౌతికము అను ఐదు శాస్త్రములు మానవుని మనుగడలో ప్రపంచ సంబంధముగా ఉపయోగపడుచున్నవి. ఆరవ శాస్త్రమైన యోగశాస్త్రము మాత్రము మానవునికి ప్రపంచ సంబంధముగా కాక పరమాత్మ సంబంధముగా ఉపయోగపడు చున్నది. మానవుడు ప్రపంచములో బ్రతుకుటకు ఐదుశాస్త్రములు కావలసియుండగా, ప్రపంచమును వీడి పరమాత్మ లోనికి ఐక్యము కావడానికి, ఆరవశాస్త్రమైన యోగ శాస్త్రము తప్పనిసరిగా అవసరము. మానవునికి తప్పనిసరిగా అవసరమైన యోగ శాస్త్రము అనునది ఏది? ఎక్కడ? గలదని కొందరడుగవచ్చును. అందరికి అవసరమైన యోగశాస్త్రమును గురించి, దానివిలువ గురించి ముందు తెలుసుకోవడము కూడా ముఖ్యమే.

మానవునికి అతి ముఖ్యమైన శాస్త్రము యోగశాస్త్రము. యోగశాస్త్రములో మానవుని కర్మను రూపుమాపు విధానము గలదు. కర్మ నిర్మూలనా సూత్రములను మానవుడు బోధించలేడు, కావున స్వయముగా పరమాత్మయే ఈ శాస్త్రమును భగవంతుని రూపముతో బోధించాడు. భగవంతుడు బోధించిన యోగశాస్త్రము మూడు భాగములుగా ఉన్నది. భూమి మీద కొన్ని దేశములలో యోగశాస్త్రము లోని ఒక భాగమును భగవంతుడు ఎక్కువగా బోధించాడు. ఏ దేశములో, ఏ భాగము అవసరమో, ఏ భాగమును అక్కడి ప్రజలు అర్థము చేసుకోగలరో, ఆ భాగమునే ఎక్కువగా బోధించాడు. భారతదేశములో మాత్రము యోగశాస్త్రములోని మూడు భాగములను బోధించాడు. ఇక్కడ మూడు భాగములలోని ఏ భాగమును అనుసరించినా మోక్షము పొందు అవకాశము గలదు. భారతదేశము ఇందూదేశము, అనగా

జ్ఞానముకల్గిన దేశము. జ్ఞానమును అవగాహన చేసుకొను స్థోమత ఇందువులలో గలదు, కావున యోగశాస్త్రము యొక్క మూడుభాగములను సంపూర్ణముగా బోధించారు. యోగశాస్త్రములోని మూడు భాగములు వరుసగా 1) జ్ఞానయోగము లేక బ్రహ్మ యోగము. 2) రాజయోగము లేక కర్మయోగము. 3) భక్తియోగము లేక విశ్వాస యోగము అనునవి గలవు. మూడు యోగభాగములు మూర్తీభవించిన యోగశాస్త్రము భారతదేశములోనే బయల్పడడము మన అదృష్టమేనని చెప్పవచ్చును. మూడు యోగభాగములలో స్వయముగా పరమాత్మ అంశయైన భగవంతుని చేత చెప్పబడిన యోగశాస్త్రమే **భగవద్గీతా** గ్రంథము.

స్వచ్ఛమైన యోగశాస్త్రమైన **"భగవద్గీత"** గ్రంథములోనే మిగతా దేశములలో గల ఇతర మత గ్రంథరూపములో చెప్పబడిన సారాంశము కూడా గలదు. కావున భగవద్గీతను ఏ మతస్థుడు, ఏ దేశస్థుడు ఖండించలేడు. వారి వారి మతముల లోని సారాంశము భగవద్గీతలో ఒక భాగమైవుండడమే దీని ప్రత్యేకత. **ఎంతో గొప్ప యోగశాస్త్రమైన భగవద్గీతను కూడా కొందరు రచయితలు చెప్పిన భావములచేత దాని గొప్పతనమునకు** ముసుగుపడు ప్రమాదమేర్పడినది. గీతకు భాష్యమును చెప్పిన వారికి భగవద్గీతలోని మూడు భాగములు తెలియక పోవడము, వారిలో పురాణముల భావములు ఇమిడివుండడము మరియు భగవద్గీత ఒక శాస్త్రమను విషయము కూడా వారికి తెలియక పోవడము, మొదలగు కారణముల చేత గీత యొక్క విలువ భారతదేశములోనే తెలియకుండా పోయినది. అందువలన ఇతర మతస్థులు కూడా గీతను గురించి హేళనగా మాట్లాడు అవకాశము గలదు. కొందరు ఇందువులే గీతను చిన్నచూపు చూచుచున్నారు. ఇందూమతమునకు మూలగ్రంథము భగవద్గీత యని తెలియనివారు చాలామంది ఇందూమతమును వదలి ఖురాన్, బైబిలు మొదలగు మూలగ్రంథములున్న ఇతర మతములలోనికి పోవుచున్నారు. అన్ని మతముల సూత్రములు భగవద్గీతలో భాగమైవుండగా, ఇందూమతమునే వదలి ఇతర మతముల లోనికి పోవడమునకు కారణము, భగవద్గీత యొక్క సారాంశముగానీ, దాని విలువగానీ ఎవరికీ తెలియక పోవడమేనని తెలియుచున్నది. ఎంతోమంది భగవద్గీతను అనేక భాషలలో అనువదించివుండగా, **ఇందూమతములో ఇప్పటి వరకు దాదాపు మూడువందల మంది స్వామీజీలు గీతకు భాష్యము వ్రాసివుండగా, గీతబోధకులమని**

**కంకణము కట్టుకొనివుండువారు అనేకులుండగా, ఈ మతమునే వదలిపోవు పరిస్థితి ఎందుకు ఏర్పడినదో అందరూ ఆలోచింప తగిన విషయము.** ఇప్పటికీ పల్లెల ప్రాంతములలో గీత అంటే ఏమిటో తెలియనివారు 90 శాతముగలరు. వీటన్నిటికీ కారణము గీత ఇప్పటి వరకు సరైన విధానములో శాస్త్రబద్ధముగా బోధింపబడక పోవడమేనని చెప్పవచ్చును. శాస్త్రమును శాస్త్రముగా కాక పురాణమువలె బోధించడము వలనను, ఎన్నో పురాణవిషయములు గీతలో కలపడము వలనను, ముఖ్యముగా ముక్తి కొరకు భగవద్గీత అని తెల్పక, భుక్తి మరియు జీవనసరళికొరకని గీతా మహత్యమును చేర్చడము వలన, యోగశాస్త్రమైన గీత దానివిలువను కోల్పోయినదని తెల్పుచున్నాము. భగవద్గీత ధర్మయుక్తమైనది కాగా అధర్మయుక్తమై పోయినట్లు కన్పిస్తున్నదని తెల్పుచున్నాము.

భగవంతుడు తెల్పిన స్వచ్ఛమైన, శాసనబద్ధమైన, యోగశాస్త్రమైన భగవద్గీత ఇటువంటి సమయములో పూర్తి అవసరము. ఏ మతస్థులు, ఏ దేశస్థులు విమర్శించ లేనిది, ఇది మా మతమునకు సంబంధించినదేనని ఇతరులు కూడా చెప్పుకొనునట్లు, అర్థభావములతో కూడుకొన్న భగవద్గీత మనకు కావలెను. హేతువాదుల, నాస్తికవాదుల సంశయములను తీర్చి వారిని కూడ ఆస్తికులకంటే గొప్పగా దేవున్ని విశ్వసించునట్లు చేయు భగవద్గీత ఎంతో అవసరము. అటువంటి భగవద్గీతను గుర్తించాలంటే ముందు దాని వివరము, పరిచయము కొంతయినా తెలియాలి. గీతను గురించి ముందు తెలియవలసిన వివరమే ఈ **"గీతా పరిచయము"**. భగవద్గీత అంటే ఏమిటో తెలియాలంటే తప్పనిసరిగా గీతాపరిచయము చదవాలి. గీతాపరిచయమును చదివిన తర్వాత గీతను సులభముగా అవగాహన చేసుకోవచ్చును.

ఇంతవరకు శాస్త్రములను, పురాణములను విడదీసిచెప్పిన మేము శాస్త్రబద్ధముగా భగవద్గీతను వ్రాయడము జరిగినది. అదియే **"త్రైతసిద్ధాంత భగవద్గీత"** త్రైతసిద్ధాంత భగవద్గీత ఆధ్యాత్మికవిద్యలో ఒక పెద్దమలుపులాంటిది. దీనిలో ఎన్నో కల్పిత శ్లోకములను నిర్దాక్షిణ్యముగ తీసివేయడము ఒక ముఖ్యవిషయమైతే, గీతను 17 అధ్యాయములేనని ఒక అధ్యాయమును తీసివేయడము మరియొక సంచలన విషయము. త్రైతసిద్ధాంత భగవద్గీతలో దాదాపు 50 శ్లోకములకు భావమే మార్చి వ్రాయడము ఒక విప్లవములాంటిది. గీతలోని పురాణవిషయములను ఖండించి

స్వచ్ఛముగ గీతను శాస్త్రముగ తీర్చిదిద్దడమైనది. ఎన్నో మలుపులు తిరిగిన **"త్రైతసిద్ధాంత భగవద్గీత"ను** చదువుటకు ముందు గీతాపరిచయమును చదివితే గీత సులభముగ అర్థము కాగలదు. గీతలో ఇప్పటివరకు ఏమున్నదో, ఏముండవలయునో తెలియుటకు, గీత యొక్క పేరులో గల అర్థమును మొదట వివరించుకొనుచు, గీతాపరిచయమును మొదలు పెట్టెదము.

**"గీత"** అంటే ఎందరో పెద్దలు ఎన్నో అర్థములు చెప్పివున్నారు. కాని మనందరికీ సులభముగ తెలిసిన పద్ధతిలో ***"గీత" అంటే "హద్దు"*** అని తెలుసు. రామాయణములో ఒకనాడు లక్ష్మణుడు కూడా ఈ గీతను దాటవద్దని ఒక హద్దును ఏర్పరచి అడవిలోనికి పోయాడని అందరికి తెలుసు. అలాగే ఈ గీతలో ఉంటే జీవత్వమునకు అర్థముందని, ఈ గీత దాటితే మానవత్వమునకే అర్థములేదని భగవంతుడు ఏర్పరచిన హద్దునే **"భగవద్గీత"** అంటున్నాము. లక్ష్మణుడు ఆనాడు పుల్లతో భూమి మీద గీత గీచి దీని లోపలుంటే రక్షణ ఉంటుందని, ప్రమాదము వుండదని, దీనిని దాటకూడదని సీతకు చెప్పాడని చరిత్రలో ఉన్నది. అలాగే భగవంతునిగా ఉద్భవించిన పరమాత్మ మాటలతో జీవత్వమునకు హద్దు ఏర్పరచి ఈ హద్దు మీరితే మానవత్వమునకు అర్థమే లేకుండా పోవునని, ఈ హద్దులో ఉన్నంత వరకు జీవత్వమునకు అర్థముంటుందని, ఈ గీతలోపలుండు వానికి దైవత్వము ప్రాప్తించునని తెలుపుచు క్రమపద్ధతిగా గీచిన గీతయే **'భగవద్గీత'.**

గీత అంటే హద్దు అనియు, రేఖ అనియు, గీయబడిన గీత అనియు మేము చెప్పితే అర్థము చేసుకోలేని అప్రబుద్ధులు కొందరు "ఈ అర్థము ఏ నిఘంటువులోనిది? మీకు ఎవరు చెప్పారు? మాలాంటి విజ్ఞులు నవ్విపోతారను ధ్యాస కూడ లేకుండా చెప్పారే!" అని హేళనగా మాకు ఉత్తరములు కూడా వ్రాశారు. అటువంటి వారందరికీ చెప్పు జవాబేమనగా! ఇతరులు ఇంతకుముందు చెప్పిన విషయమును, ఇతరులు ఇంతకుముందు వ్రాసిన విషయమును, మేము చెప్పడముగానీ, వ్రాయడముగానీ ఎప్పటికీ ఉండదు. అందువలన మా రచనలలోని పుస్తకములలో అన్నీ క్రొత్త విషయములుగానే కనిపిస్తూయుంటాయి. కృష్ణుడు గీతను చెప్పాడు, అది అంతకు ముందు ఎవరూ చెప్పినది కాదు, వ్రాసినది కాదు. ఏసుప్రభువు తన జీవితములో కొన్ని మాటలు చెప్పాడు, అవి ఆయనకంటే ముందు ఎవరూ చెప్పలేదు. కృష్ణుడు

కానీ, ఏసుప్రభువు కానీ  ఎలాగ ఎవరినీ అనుసరించి చెప్పలేదో, అలాగే మేము ఎవరినీ అనుసరించి చెప్పలేదు.  మాచే వ్రాయబడిన వ్రాతలన్నీ ప్రత్యేకతను కల్గియున్నవేనని అందరూ గ్రహించవచ్చును.  అదే పద్ధతి ప్రకారము గీత అంటే ఇంకా ప్రత్యేకముగా ఏమి చెప్పుచున్నామనగా!

గీత అనగా గీయబడినది.  ఎవరు గీచారు? అని ప్రశ్నించుకుంటే, దేవుని చేత గీయబడినదని జవాబు తెలియుచున్నది.  దేవుడు కనిపించేవాడు కాదు, ఆయన ఎట్లు గీచాడు? అని ప్రశ్నరావచ్చును.  దానికి జవాబు ఏమనగా! శరీరములోని జీవుడు కూడ కనిపించడములేదు.  అయినప్పటికీ మన శరీరములో కనిపించని మనము (జీవులము) శరీరమునకున్న హస్తము ద్వారా గీతలు గీయుచున్నాము కదా! అలాగే  కనిపించని దేవుడు ప్రకృతి అను తన శరీరముతో గీత గీచాడు, అని నీవు ఎందుకు అనుకోకూడదు? ఇపుడు మరియొక ప్రశ్న రాగలదు.  జీవుడు కనిపించలేదు, దేవుడు కూడా కనిపించలేదు.  అయినను కనిపించే శరీరముతో గీచిన గీత కనిపిస్తుంది కదా!  అలాగే కనిపించే ప్రకృతితో గీచిన గీత కనిపించాలి కదా!  అలా ఎక్కడా కనిపించలేదే? అని ప్రశ్నించవచ్చును.  తెలివైన వారికి మరొక విధముగ యోచనవచ్చి, కృష్ణుడు కూడా మనలాంటి శరీరమున్న మనిషే, అతని శరీరము ద్వారా వచ్చిన గీత పుస్తకరూపములో ఉన్నది.  దేవుడు మనలాంటి మనిషి కాకున్నా ప్రకృతి అను అతని శరీరము ద్వారా వచ్చిన గీత ఏ రూపములోనూ కనిపించలేదే? అని ప్రశ్నించవచ్చును. ఈ ప్రశ్నకు జవాబేమిటో, ఏ విధముగా అర్థము చేసుకోవాలో క్రింద చూస్తాము.

**శ్రీకృష్ణునిచే గీయబడిన భగవద్గీత అను పుస్తకము కొందరి వద్ద ఉండవచ్చును, కొందరి వద్ద లేకుండపోవచ్చును.  దేవునిచే గీయబడిన గీత ప్రతీ ఒక్కరివద్ద గలదు.** మానవులవద్దేకాక, సమస్త జీవరాసులవద్ద కూడా కలదు.  దేవుడు గీచిన గీత లేక హద్దు జీవుడైన నిన్ను వదలి లేదు.  ఆ గీత ఎప్పటికీ నిన్ను అంటిపెట్టుకొని ఉన్నది. దేవుడు గీచిన హద్దు  ఏదో  తర్వాత పేజీ పటములో చూడుము.

భూమి మీద ఎన్నో దేశాలు కలవు.  ప్రతి దేశమునకు ఆ దేశము యొక్క సరిహద్దు రేఖ ఉండును.  సరిహద్దు రేఖ లోపలయుండునది ఫలానా దేశమనియో, ఫలానా రాజ్యమనియో చెప్పుచుందుము.  ఈ పద్ధతి ప్రకారము భారత దేశమునకు చుట్టు ఒక హద్దు కలదు.  అలాగే ప్రపంచములో ఎన్నో జీవరాసులు కలవు.  ఒక్కొక్క



దేవుని గీత

1. **ఇది దేవునిచే గీయబడిన గీత,**
**ఈ గీతదాటి ఏ ధర్మము లేదు.**

2. **ఈ గీతలోనే భగవంతుడు చెప్పిన**
**శ్లోకములన్నియు ఇమిడి ఉన్నవి.**

3. **ఈ గీతకంటే బయట ఎవరూ**
**భగద్గీతలోని ఒక్క శ్లోకమును కూడా చూపలేరు.**

4. **శ్రీ భగవద్గీతయే ఈ గీత,**
**ఈ గీతయే శ్రీ భగవద్గీత.**

5. **దేవుడు సృష్టించినదే శరీర హద్దు,**
**భగవంతుడు చెప్పినదే భగవద్గీత.**

జీవరాసి శరీరము ఒక్కొక్క విస్తీర్ణము కల్గియున్నది. ఈ పద్ధతి ప్రకారము మానవుని శరీరము కూడా ఒక విస్తీర్ణము కల్గియున్నది. దేశమునకు హద్దు ఉన్నట్లు, మానవ శరీరమునకు కూడా హద్దు ఉన్నది. దేశము యొక్క సరిహద్దు లోపల ఆ దేశము యొక్క చట్ట రాజ్యాంగముండును. అలాగే శరీరము యొక్క గీత లోపల ఆ శరీరము యొక్క నిబంధన రాజ్యాంగముండును. దేశము యొక్క చట్ట రాజ్యాంగము ఆ దేశము యొక్క పరిధి అను హద్దులోపలనే ఉండును. అలాగే శరీరము యొక్క నిబంధన రాజ్యాంగము ఆ శరీరము యొక్క పరిధి అనబడు హద్దులోనే ఉండును. దేశమునకు ఒక రాజు ఉన్నట్లు, శరీరమునకు జీవుడు అను ఒక రాజు కలడు. దేశములోని రాజుకు కొంత పరివారమున్నట్లు, శరీరములోని జీవుడను రాజుకు కూడా 25 మంది పరివారము కలరు. దేశములోని రాజు ఒక చోట కూర్చొని తన పరివారము చేత రాజ్యపరిపాలన చేస్తున్నట్లు, శరీరములోని జీవుడు ఒకచోట కదలక వుండి తన పరివారము చేత శరీర పరిపాలన చేస్తున్నాడు. **దేశ పరిధిలోని రాజ్యాంగమును తెలుపునది చట్టము. అలాగే శరీర పరిధిలోని యంత్రాంగమును తెలుపునది నిబంధన లేక ధర్మము.** చట్టము దేశపరిధిలో ఉన్నట్లు, ధర్మము దేహము

యొక్క పరిధిలో ఉన్నది. చట్టములో న్యాయము, అన్యాయము ఉన్నట్లు, ధర్మములో పుణ్యము, పాపములు కలవు. దేశములోని చట్టము న్యాయాన్యాయములను నిర్ణయించి నట్లు, శరీరములోని ధర్మము పుణ్య పాపములను నిర్ణయించుచున్నది.

సరిహద్దును పరిశీలిస్తే అది ఏ దేశమైనది, అందులోని చట్టము ఏమిటి అన్నది తెలియును. అట్లే శరీరహద్దును పరిశీలిస్తే అది ఏ దేహమైనది, దానిలోని ధర్మమేమిటన్నది తెలియును. చట్టమేమిటన్నది దేశ హద్దును చూస్తే తెలియునట్లు, ధర్మమేమిటన్నది దేహ హద్దును చూస్తే తెలియును. నీ శరీరములోపలి ధర్మములేమిటో తెలియాలంటే శరీర గీతలోపలే తెలియాలి. దేహము లోపల గల స్థూల సూక్ష్మ వివరములను తెలుపునదే గీత, అదియే భగవద్గీత. **భగవద్గీతలోని ప్రతీ శ్లోకము శరీర పరిధిలోని ధర్మములనే తెలియజేశాయి తప్ప ఏ శ్లోకము శరీరపరిధి దాటి చెప్పలేదు.** శరీర పరిధియే ధర్మములకు నిలయమైనది, కావున పరిధి లోపలనే చెప్పబడిన దానిని గీత అన్నారు. దేవుడు భగవంతుని రూపములో చెప్పినది కావున దీనిని భగవద్గీత అన్నారు.

విచక్షణా దృష్టితో చూస్తే నీ గీతలోపల ఉండునదే భగవద్గీతయను గీతలో ఉన్నది. దేవుడు మానవుని ఊహకు ఎన్నో సిద్ధాంతములను అందించినట్లు "గీత" అను పదమును కూడా అందించాడు. గీత అంటే రేఖ అనియు, హద్దు అనియు, గీయబడిన గీత అనియు వ్రాయించాడు. అలా వ్రాయించుట వలన ఎప్పటికైనా మానవుని బుద్ధికి సంశయమొచ్చి ఇది ఏ గీత? ఏ హద్దు? అని ప్రశ్నించుకొని జవాబు కొరకు ఎదురుచూస్తాడని దేవుని ఉద్దేశ్యము. అలా చూచువానికి గీతలోని ధర్మములన్నీ అర్థము కాగలవని ఆయన భావము. ఎంతో మనమంచి కోరి దేవుడు గీతను గీతగానే మనకు పరిచయము చేస్తే, దానిని తెలుసుకొందామను యోచన కొందరి బుద్ధికి రాక, ఏ నిఘంటువులోనిది ఈ అర్థము? అని అడిగితే, వారు రాక్షస జాతివారో, దేవతల జాతివారో, వారినేమనాలో మీరే యోచించండి. నిఘంటువులలో (డిక్షనరీలలో) ప్రపంచ అర్థాలుండవచ్చును. కానీ పరమాత్మ భావములుండవు. అట్లుంటే దేవుడు భూమి మీదకు వచ్చి తన జ్ఞానము ఇది అని చెప్పవలసిన పనిలేదు. ధర్మాలు అధర్మాలుగా మారినపుడే దేవుడు తన జ్ఞానమును తెలియజేస్తానన్నాడు. దేవుడు భగవంతునిగా భూమి మీదకు వచ్చినపుడు అధర్మపరులకు ధర్మములు

రుచించవు. అందువలన శ్రీకృష్ణజన్మలోను, ఏసుప్రభువు జన్మలోను ఆయన మాటను ధిక్కరించినవారు, ఆయనకు ఇబ్బందులు కలుగజేసినవారు ఎందరో కలరు. ఆనాడే ధిక్కరించిన వారున్నపుడు ఈనాడు మాలాంటివారిని తప్పుపట్టువారు ఎందరో ఉండవచ్చును. అటువంటి వారిని దృష్టిలో పెట్టుకోకుండ, దైవజ్ఞానము మీద శ్రద్ధకలవారికి వాస్తవ జ్ఞానము అందివ్వాలను ఉద్దేశ్యముతో **గీత అనగా దేవునిచేత గీయబడిన గీత** అని అర్థము చెప్పుచున్నాము.

ధర్మములను మాటలతో భగవంతుడు గీచిన గీతను మీకు అందించాలను కొన్నాము. కాని ముఖ్యగమనిక ఏమంటే ఆరోగ్యవంతునికికాక రోగమున్న వారికే వైద్యుడు అవసరమన్నట్లు, ఇంతవరకు ఆత్మవాదులకే కాక ఆస్తికులకు, నాస్తికులకు, హేతువాదులకు కూడా మా బోధలు ఎక్కువ ఉపయోగపడినాయి. కొందరు ఆస్తికుల నుండి కొన్ని విమర్శలు వచ్చినప్పటికీ, హేతువాదులు, ఆస్తికులు, నాస్తికులు మా బోధల వలన నిజమైన ఆత్మవాదులుగా మారడము మాకు ఉత్సాహము నిచ్చాయి. అందువలన హేతువాదులకు, నాస్తికులకు, ఆస్తికులకు కూడా అర్థమగునట్లు, వారు కూడా దైవత్వమును తెలుసుకొనునట్లు, భగవద్గీత అందరికీ జవాబై నిలుచునట్లు వ్రాయపూనినాము. మేము వ్రాయు భగవద్గీతయందు ఎన్నో క్రొత్త అద్భుత ఆశ్చర్యకర విషయములు బయటపడగలవని ముందే తెలుపుచున్నాము.

ఎన్నో ప్రశంసలు మరెన్నో విమర్శలు చవిచూచిన మేము అన్నిటినీ యోచించి, సత్ విమర్శలన్నిటికి తట్టుకొనునట్లు, సత్యమునే ప్రకటించడము మంచిదని మాలోని చిత్తము నిర్ణయించడము మాకు సంతోషము. గీతలో శ్రీకృష్ణుడు కూడా ఒక మాట చెప్పాడు. మానవునికి కావలసిన సుఖముల కోసమే వేదార్థములున్నవని, కష్టములు కడతేరి సుఖములు ప్రాప్తించుటకు వేదములిలా చెప్పుచున్నవని, ఎన్నో విధముల ఉపన్యాసములను కొందరు వేదవాదులు తేనెవలె తియ్యగా ఉండునట్లు బోధించు చున్నారనీ, ఆ మాటలు విన్నవారు వారి సుఖముల కోసమే దైవ ప్రార్థనాక్రియలు చేయుచున్నారనీ, శ్రీకృష్ణుడు చెప్పినట్లు అలాంటి తియ్యటి మాటలు మా బోధలలో లేని కారణమున కొందరికి రుచించడము లేదు. ***"సుఖములందాసక్తి కలిగినవారు వారి సుఖముల కోసమే పూజలు కూడా చేయుదురు కానీ వారికి ఆత్మజ్ఞానము పట్టుబడదు"*** అని శ్రీకృష్ణుడు అన్నాడు. ఆ విధముగనే నేటి ప్రజలు చాలామంది

అదే మార్గములో ఉన్నారు. అంతేకాక బోధించు బోధకులు కూడ భగవద్గీత శ్లోకము లను మంత్రములవలె జపించుచున్నారు. కాని వాటిలోని ఉన్నత భావమును గ్రహించలేకపోయారు.

మా బోధలు ప్రపంచ విషయములకు ఏమాత్రము ఉపయోగపడవు. కావున నేటి ఆశల వాతావరణములో మా బోధలకు ఆదరణ చాలా తక్కువని కూడా మాకు తెలుసు. అయినప్పటికీ సత్యమునే తెల్పి మానవులను శాశ్వతమైన మోక్షప్రాప్తిని ఆశించునట్లు చేయాలని మా ఆకాంక్ష. మా బోధల వలన అందరూ కాక వేయింటి కొకడు మోక్షాసక్తుడైనా మా కృషికి ఫలితము చేకూరినట్లే, మా ఉద్దేశ్యము నెరవేరినట్లే.

గీత అంటే ఒక రేఖ అనియు, మానవాళికి ఒక హద్దును చూపునదనియు, మానవాళికందరికీ పనికి వచ్చునదేననియు చెప్పారు. కానీ ఫలానా మతము వారికని పేరుపెట్టి చెప్పలేదు. అందువలన గీత విశ్వమానవులందరి నిమిత్తము శాసన రూపముగనున్న శాస్త్రమని తెలియవలెను. అందులో తెలిపిన విషయములు మానవ జాతికంతటికీ ఉపకరించునప్పటికి, గీత కేవలము హిందువులకేనని మిగతా మతముల వారనుకోవడము శోచనీయము. బహుశ చెప్పిన వానిని బట్టి అతను ఆ దినము ఏ మతమువాడో, ఆ మత సంబంధమైనదేనని కొందరనుకొని, గీతను ఒక్క హిందూ మతమునకే పరిమితము చేసియుండవచ్చును. భగవద్గీత ప్రకటితమైన ఐదువేల నూటాయాభై సంవత్సరముల క్రితము, ఏ ఇతర మతములేదని ముఖ్యముగా గమనించినట్లయితే గీత ఇప్పుడున్న అన్ని మతముల మానవులకని సులభముగా తెలియగలదు. అందులోని విషయములు జన్మించిన జీవునికని ఉండుట వలన, అన్ని మతముల వారు జన్మించిన జీవులే అయినందువలన, ఆ విషయములు సమస్త మానవాళికి సంబంధించినవని తెలియుచున్నది. ఇంకనూ పరికించి చూచినట్లయితే అందులో స్త్రీ పురుష భేదములు లేక కేవలము ఆత్మ పరముగా చెప్పబడియున్నదని తెలియుచున్నది. అటువంటప్పుడు ఒక కులమని, ఒక మతమనియేకాక, స్త్రీ పురుషుల భేదము కూడా లేకుండా గీతను తెలుసుకొనవచ్చునని తెలియుచున్నది. బైబిలు క్రైస్తవులకన్నట్లు, ఖురాన్ మహమ్మదీయులకన్నట్లు, భగవద్గీత హిందువులకేనని చాలామంది భావిస్తున్నారు. బైబిలులో క్రైస్తవులపేరు, ఖురాన్‌యందు ఇస్లామ్ పేరుండుట వలన ఆయా గ్రంథములను ఆయా మత గ్రంథములనుటలో అర్థము

కలదు. కానీ భగవద్గీతయందు ఏ మతము పేరు లేదు, చెప్పినవాడు ప్రవక్తగాదు, అటువంటపుడు అది ఒక మత గ్రంథమనుటలో అర్థమే లేదు.

భగవద్గీతను అర్థము చేసుకొంటే మానవ జాతికంతటికీ అధిపతియైన దేవుడున్నాడని తెలియగలదు. అందువలన అందరికీ అధిపతియైన దేవున్ని గూర్చి తెలుసుకొను నిమిత్తము భగవద్గీతను చదువవలెనని కోరుచున్నాము. బహుశ కొందరు భగవద్గీతను ఇప్పటికే చదివివుండవచ్చును. అందులో యోచించు వారికి సంశయములు ఉండవచ్చును. సంశయములు తీరక గీతకు దూరముగా, నాస్తికులుగా కొందరు మారివుండవచ్చును. అలాంటి వారినందరినీ దృష్టిలో పెట్టుకొని వారియందు ఉద్భవించిన ప్రశ్నలను సేకరించి ఆ ప్రశ్నలకు సరియైన జవాబు నొసగు భగవద్గీతను మేము వ్రాయడము జరిగినది. చదువరులైన మీరు మా వ్రాతలలోని ఏ విషయమును గ్రుడ్డిగా నమ్మక యోచించి నిర్ణయించుకోండి. మేము చెప్పు విషయములు కొన్ని మీరింతవరకు విననివిగా ఉండవచ్చును. పూర్వము ఎవరూ ఈ శైలిలో చెప్పక వేరుగా చెప్పివుండవచ్చును. అయినప్పటికీ వాస్తవికతను అర్థము చేసుకోగలరను భావముతోనే వ్రాయుచున్నాము.

భగవద్గీతను శ్రీకృష్ణుడు యుద్ధరంగమున బోధించాడని అందరికీ తెలియును భగవద్గీతను శ్రీకృష్ణుడు అర్జునునితో **"ఇది రహస్యమైన జ్ఞానము, నీకు మాత్రమే బోధిస్తున్నాను"** అని అన్నాడు. అలాంటపుడు అర్జునునికొక్కనికే తెలిపిన విషయమును సంజయుడెలా వినగలిగాడు? అన్నది ప్రశ్న. ఒకవేళ దూరదృష్టి, దూరశ్రవణము సంజయుడు కలిగివుండవచ్చును. ఆ విషయము శ్రీకృష్ణునికి తెలియకుండానే సంజయుడు యుద్ధరంగములోని ప్రతీ విషయమును ధృతరాష్ట్రునికి తెలియ జేయుచున్నాడనుకొందాము. విశ్వరూప సందర్శన సమయమున ***"ప్రకృతి కన్నులతో నా విశ్వరూపమును చూడలేవు, నాయొక్క విశ్వరూపము జ్ఞాననేత్రులకు మాత్రము అగుపడగలదు. దేవతలు కూడా ఇంతవరకు చూడని నా విశ్వరూపమును నీకు మాత్రము చూపగలను. విశ్వరూపమును చూచుటకు జ్ఞాననేత్రమునిచ్చుచున్నాను"*** అని శ్రీకృష్ణుడు చెప్పి ప్రత్యేకమైన జ్ఞానదృష్టినిచ్చి అర్జునునికి మాత్రము చూపినపుడు, సంజయుడు ఏ దృష్టితో విశ్వరూపమును చూచి ధృతరాష్ట్రునికి తెలియబరిచాడు? అన్నది ప్రశ్నే. అర్జునునితో పాటు సంజయుడు కూడా విశ్వరూపము చూడగలిగినపుడు,

ఎవరూ చూడని దానిని నీకు మాత్రము చూపుచున్నానని శ్రీకృష్ణుడెందుకన్నాడు? ఇలా ఆదిలోనే భగవద్గీత ప్రశ్నలమయమైనది. ప్రశ్నల రూపములో యోచించువారికి సత్యమైన సమాధానము ఏమిటన్నది మనము చూడాలి.

ఇలా యోచించుతూపోతే గీతలోని సత్యములు, రహస్యములు బయట పడగలవు. భగవంతుడు చెప్పిన మాటలు ఎన్నో సందర్భములలో, ఎన్నో విధములుగా మారి, చివరకు ఏడు వందల శ్లోకముల రూపముగా గీత నిలిచివున్నది. ఈనాడు మనముందున్న భగవద్గీతకు, ఆనాడు శ్రీకృష్ణుడు చెప్పిన భగవద్గీతకు ఏమైనా మార్పు ఉన్నదాయని యోచిస్తే, అన్ని విధములైన ప్రశ్నలకు సమాధానము దొరకగలదు. ఆ యోచించేదేదో నిరూపణాత్మకముగ, శాసనబద్ధముగ ఉన్నపుడు అసలైన సత్యములు బయల్పడగలవు. అన్నిటికీ సమాధానములు దొరకగలవు. ఈ పంథాలో యోచించినపుడే యుద్ధరంగమున శ్రీకృష్ణుడు అర్జునునకు ఎంతసేపు బోధించాడను ప్రశ్నకు సమాధానము కూడా లభించగలదు.

వ్రాయడానికి చేతకాని లేక చదువురాని ఒక వ్యక్తి ఇంకొక ఊరిలో గల తన బంధువుకు సమాచారము తెలియజేయాలనుకొన్నపుడు, సమాచారమును వ్రాయగలిగిన వ్యక్తి వద్దకు పోయి ఉత్తరము వ్రాసిపెట్టమని అడుగుతాడు. వ్రాయుటకు ఎదుటి వ్యక్తి ఒప్పుకొన్నపుడు సమాచారము చెప్పునతడు చెప్పవలసిన ముఖ్యమైన విషయమును చెప్పి ఊరకుండును. ఆ విషయమును విన్న అతడు దానిని ఎలా పొందుపరిచి వ్రాస్తే చదువుకొనువాడు సులభముగా తెలుసుకొనగలడని యోచించి, ఎదుటివాడు అర్థము చేసుకొనుటకు తగిన విధముగా ఉండునట్లు మరియు ముందు క్షేమ సమాచారములు అడిగినట్లు, చివరిలో ముగింపును తెలియజేస్తూ పొందుపరిచి వ్రాయును. చెప్పినవాడు విషయమొకటి చెప్పినప్పటికి వ్రాయువాడు దానికొక పద్ధతి, వరుస, అందము, అర్థముకలుగజేసి వ్రాసినట్లు, భగవంతుడు చెప్పిన మూల సారాంశ విషయమును వ్యాసుడు శ్లోకముల రూపమున తీర్చిదిద్ది వ్రాశాడు. భగవంతుడు చెప్పిన విషయము చిన్నదైనప్పటికీ అది అర్థమగుటకు అనేక శ్లోకములుగా, అనేక అధ్యాయములుగా వ్యాసుడు వ్రాయుట వలన ఏడు వందల శ్లోకముల గ్రంథమైన గీత మన ముందున్నది. అన్ని శ్లోకముల సారాంశమును పరిశీలించి చూచితే మూల విషయము బహుకొద్దిగా ఉన్నట్లు తెలియగలదు. అన్ని అధ్యాయములను పిండి చూస్తే

సారాంశము కొద్దిదే. **"సర్వము వ్యాపించివున్న వానిని నేనొక్కనినే"** అను మాటకు విభూతి యోగమను అధ్యాయములో 42 శ్లోకములు చెప్పబడియున్నవి. **"సర్వము నేనే"** అను విషయమును సూచించుటకు 42 శ్లోకములు వ్రాయబడితే 701 శ్లోకము లందు ఇమిడిన భావము కొద్ది నిమిషములలో మాట్లాడు మాటలకంటే మించి ఉండదు. చిన్న విషయమును పొడవైన జాబుగా వ్రాసుకొన్నట్లు, శ్రీకృష్ణుని చిన్న సందేశమును వ్యాసుడు పెద్దగా వ్రాసి చూపించాడే తప్ప ఇంత పొడవైన భగవద్గీత యుద్ధరంగములో జరుగలేదు. జరుగుటకు వ్యవధియులేదు. వ్యాసునిచే వ్రాయబడిన ఇంత పెద్ద భగవద్గీత మానవులకు సులభముగా అర్థమగుటకే తప్ప వేరు ఉద్దేశ్యము లేదని తెలియాలి.

సంజయుడెలా యుద్ధరంగములోని విషయమును ధృతరాష్ట్రునికి తెలియ జేసాడన్నది గీతలోని మొదటి ప్రశ్న. ఒకవేళ సంజయుడు శ్రీకృష్ణుని సందేశమును ఆయన విశ్వరూపమును తెలుసుకోగలిగాడనుకొందాము. అపుడు అర్జునునకే గాక ఆ విషయము సంజయునికి, ధృతరాష్ట్రునికి కూడ తెలిసినట్లగును. అలా యుద్ధరంగము మొదటిలోనే శ్రీకృష్ణుడు ఫలానాయని తెలిసియుంటే సంజయుడు ధృతరాష్ట్రుడు ఇద్దరూ యుద్ధరంగములోనికే సరాసరి పరుగెత్తిపోయి యుద్ధాన్ని నిలిపియుండెడివారు. అదియును గాక గీతా బోధ సంజయుడు వినియుంటే **"నీకు తప్ప"** అని భగవంతుడు అర్జునునితో చెప్పిన మాటే అసత్యమగును. భగవంతుని మాట ఎప్పటికీ అసత్యము కాదు. సంజయుడు గీతను విన్నాడన్న మాటే అసత్యమంటే సంజయుడు విని చెప్పకపోతే భగవద్గీతయే లేదు కదా! అను సంశయము ఏర్పడగలదు. ముందు నుయ్యి వెనుక గొయ్యిగ వున్న ఈ ప్రశ్నకు సమాధానము దొరకలేదంటే ఇంతవరకు మనము గీతను సరిగా అర్థము చేసుకోలేదని తెలియుచున్నది. గీత అడ్డంకుల మార్గములో అర్థమైనది గాని, సంశయరహితమైన మార్గములో అర్థము కాలేదని తెలియుచున్నది. ఇటువంటి ప్రశ్నలకు జవాబు చెప్పలేని స్థితిలో తాముండియు, ప్రజల దృష్టిలో తెలిసినవారిగా చలామణి అగుచున్న కొందరు మీ జ్ఞానము ఏ పాటిదని మమ్ములను హేళనగా మాట్లాడడము కూడ జరిగినది. అలా వారు మమ్ములను వెక్కిరించినా ఫరవాలేదు. వారి మూలముగా ప్రజలు గీతను

సరియైన మార్గములో అర్థము చేసుకోలేక పోయారన్నదే మా బాధ. ఇంతవరకు సత్యమైన విషయములు ఎవరి బలహీనతతో బయటికి రాలేదో ప్రజలు గ్రహించగలరు. బ్రహ్మవిద్యలో సత్యమును అన్వేషించువారికి, హేతువాదులకు ఇంతవరకు చాలా చోట్ల లభించిన జ్ఞానములో వారియందు ఉద్భవించిన ప్రశ్నలకు జవాబులు దొరకక ఎందరో నాస్తికులైనారు. *"మాప్రశ్నలకు జవాబులు లేవు. అంతా బూటకము, మాటలతో మభ్యపెట్టడము తప్ప మరేమిలేదు. దేవుని పేరు చెప్పుచు సంశయాలతో కూడుకొన్న జ్ఞానము చెప్పుచున్నారు"* అని నాస్తికులంటున్నారు.

అలాంటి నాస్తికులు కూడ మా జ్ఞానము ద్వార వారి ప్రశ్నలకు జవాబులు తీసుకొని, ఈ పద్ధతి ప్రకారమైతే దేవుడున్నాడని ఒప్పుకొనుచుండగ మిగతావారు వెక్కిరించిన పరవాలేదు. చాలామంది గీత రచయితలు మేము అడుగు ప్రశ్నలకు జవాబు చెప్పలేరు. ఎందుకనగా గీతలో విశ్వరూపమునకు ఆకారమును కల్పించి చెప్పారు. అక్కడ వారు చెప్పినట్లు కోరలు, ముఖము, నోరును చిత్రించుకొంటూ పోతే పరమాత్మ రూపము వికృతమైన పెద్ద పిశాచి ఆకారమును పోలియుండును. అలాంటిదా పరమాత్మ ఆకారము? దీనికేమి సమాధానము చెప్పగలరు? దేవుడు పల్కిన **'చాతుర్వర్ణము'** అను మాటకు వివరము బ్రాహ్మణ, వైశ్య, క్షత్రియ, శూద్రులని కులముల పేర్లు చెప్పి కులమత భేదములు కల్గించు అజ్ఞానుల మాటలవలె దేవుని మాటలను తీర్చిదిద్దారు. వారి మాటల ప్రకారము భూమి మీద హిందూమతమునకే సంబంధములేని మతములలోని మనుజులలో పై చెప్పిన నాల్గుకులములు లేవే! వారిని ఏ దేవుడు సృష్టించాడు? ప్రపంచమంతా ఒకే దేవుడైనపుడు చాతుర్వర్ణమను మాట వారికి వర్తించదా? ఈ నాల్గుకులాలు లేని దేశములెన్నో ఉన్నాయి. వారిని సృష్టించినవాడు ఎవడో చెప్పగలరా?

గీతయందు జ్ఞానయోగమను అధ్యాయము మొదటిలో ఆదియందే సూర్యునికి చెప్పియుంటినని భగవంతుడు చెప్పినపుడు, సూర్యుడొక మనిషికాదు కదా! అది ఒక గోళము గదా! అలాంటి గోళమునకెట్లు చెప్పాడు? ఎంతో దూరమునున్న సూర్యుడెట్లు వినగలిగాడు అను ప్రశ్నకు జవాబు చెప్పగలరా? ప్రకృతి చేత పుట్టినది,

ప్రకృతి సంబంధమైనది శరీరమని, శరీరములోని కదలికశక్తి పురుషుడైన పరమాత్మదని, గుణత్రయ విభాగయోగములో 3,4 శ్లోకములలో ఉండగ, ప్రక్క అధ్యాయమైన పురుషోత్తమ ప్రాప్తియోగములో 16,17 శ్లోకములలో క్షర అక్షర పురుషోత్తములుగ పురుషుని మూడు విభాగములు చేసి చెప్పియుండగ, ఆ శ్లోకముల వివరము కేవలము పురుషునికే చెప్పక ప్రకృతి సంబంధమైన శరీరమును ఎందుకు తీసుకొన్నారని అడిగిన జవాబు చెప్పగలరా? ఇంతవరకు ఎందరిచేతనో వ్రాయబడిన గీతలలో ఇటువంటి ప్రశ్నలుగ మిగిలిన విషయములెన్నో కలవు. కనుక ఇప్పటికైన మేల్కొని, పవిత్రమైన కాలమును వృథా చేయక, జ్ఞానము సముద్రములాంటిదని, దానిలో ఇంకా మనకు తెలియని విషయములెన్నో కలవని, తెలుసుకొనుటకు ప్రయత్నిద్దాము.

దూరముగ కురుక్షేత్రమందు జరుగు యుద్ధమును సంజయుడు చూడగల్గుచున్నాడను కొందాము. అక్కడ ఆయనకు కనిపించునది కేవలము ప్రకృతి దృశ్యము. అక్కడున్న మనుజులు, ఏనుగులు, గుఱ్ఱములు, రథములే కనిపిస్తాయి. నేడు మనము చూచితే దగ్గరున్నవి మాత్రమే కనిపించును. ఆనాడు సంజయుడు చూస్తే దగ్గరున్నవి కాక దూరమున్నవి కూడ కనిపించాయట. అలా చూడగల్గు శక్తి ఆనాడు సంజయునికుండెడిదనుకొందాము. దూరముగ యుద్ధరంగములో గల అర్జునుడు శ్రీకృష్ణుడు కనిపించి ఉండవచ్చును. కాని అంతరంగమున లోదృష్టియైన జ్ఞానదృష్టికి కనిపించు పరమాత్మ దర్శనమెలా కనిపించింది? సంజయుడు యుద్ధరంగము మొదటి నుండి చూచాడన్నపుడు ప్రకృతి సంబంధమైన బయటి దృశ్యములే కనిపించియుండును, కాని పరమాత్మ దర్శనము కనిపించి ఉండదని తెలియుచున్నది.

ఇక్కడ కొందరికొక అనుమానము కూడ రావచ్చును. అది ఏమనగా! శ్రీకృష్ణుడు రాయభారము కొరకు కౌరవసభలోనికి పోయినపుడు, అచట దుర్యోధన దుశ్శాసనులు మొదలగు వారు తాడుతో బంధించవలెనని రాగ, ఒంటరియైన శ్రీకృష్ణుడు వారి తాళ్లకు బంధింపబడక విశ్వరూపము చూపాడు కదా! అపుడు

కన్నులు మిరుమిట్లు గొల్పు ఆ రూపమును చూడలేక వారు క్రిందపడిపోగ, ఆ రూపమును చూడవలెనను ధృతరాష్ట్రుని కోర్కెమేరకు శ్రీకృష్ణుడు ఆయన అంధత్వమును తీసివేసి కన్నులు కనిపించునట్లు చేశాడని, మరియు అపుడే ధృతరాష్ట్రుని భార్య గాంధారిదేవి కూడ తన కళ్లకు కట్టుకొన్న గుడ్డ తీసి విశ్వరూపము చూచినదని విన్నాము. ఆనాడు అందరు మామూలు కన్నులతోనే కదా! విశ్వరూపమును చూచినది. అటువంటపుడు యుద్ధ సమయములో అర్జునునికి చూపిన విశ్వరూపమును సంజయుడెందుకు చూచియుండడని అడుగవచ్చును. దానికి మా సమాధానమేమనగా! వారి మాట ప్రకారము దూరముగనున్న సంజయునికే విశ్వరూపము కనిపించి యుంటే అచటనే దగ్గరలోనున్న సైన్యమునకు, ఇటు పాండవులకు, అటు కౌరవులకు అందరికి కనిపించియుండాలి. అట్లు అందరికి కనిపించినట్లు ఋజువే లేదు. దగ్గరున్న వారికే కనిపించని విశ్వరూపము దూరముగ ఉన్న సంజయునికి కనిపించిందనడము పూర్తి అసత్యము. అట్లే రాయభారమున విశ్వరూపమును కొందరు చూచుట, కొందరు చూడకుండ పోయారను మాట కేవలము అభూత కల్పనయే గాని నిజము కాదు. ఆత్మ పరమాత్మలు ఇంద్రియాలకు అగోచరమైనవి. కంటికి కనిపించవు, చెవులకు వినిపించవని భగవంతుడు గీతయందే తెలిపియున్నాడని మరువకూడదు. అలా తెలిపియుండగ పరమాత్మ స్వరూపమైన విశ్వరూపము కంటికి కనిపించిందనడము ధర్మవిరుద్ధమైన మాట. కనిపించినదని చెప్పువారుంటే భగవద్గీత రాజవిద్యా రాజగుహ్యాయోగమను అధ్యాయములో నాల్గవ శ్లోకమున **"మయాతత మిదం సర్వం జగదవ్యక్త మూర్తినా"** ఇంద్రియములకు కనిపించక ఈ ప్రపంచమంతా నేను వ్యాపించియున్నాను. అని ధర్మయుక్తముగ చెప్పిన భగవంతుని మాటకే వ్యతిరేఖముగ చెప్పినవారగుదురు. అందువలన గీతను జాగ్రత్తగా పరిశీలించి ధర్మబద్ధముగ చెప్పాలంటే, సంజయుడు తన కన్నులతో విశ్వరూపమును ఏమాత్రము చూడలేదు. రాయభారమున విశ్వరూపము చూపుటకు అదేమైన గారడివిద్య లాంటిదా! అవసరమొచ్చినపుడంతా విశ్వరూపము చూపితే దానికి విలువుంటుందా! అలా చూపించునదేయైతే విశ్వరూపసందర్శన యోగములో 47వ శ్లోకమున

*"నీవు తప్ప మరి ఎవ్వరును దీనిని చూచిన వారు లేరు"* అను మాట మరియు 52వ శ్లోకమున ***" అర్జునా ఈ రూపమును చూడవలెనని దేవతలు కూడ కోర్కె కలిగియున్నారు. అయినను నీవు తప్ప ఎవరును దీనిని చూచిన వారు లేరు".*** అను మాట పనికిరానిదైపోవును. అలాంటపుడు భగవంతుడు పల్కిన మాట నిజమా లేక మానవులు చెప్పిన మాట నిజమా అని పరిశోధించి చూచితే, భగవంతుడు చెప్పినది సిద్ధాంతపరమైన శాస్త్రవచనమని, మానవుడు చెప్పినది నిరూపణకురాని అశాస్త్రీయ వచనమని తెలియుచున్నది. అలాకాక విశ్వరూపమును యుద్ధరంగములో సంజయుడు, రాయభారములో మిగతావారు, చూచారంటే ఎవరు చూడలేదను భగవంతుని మాట అసత్యమై మొత్తము భగవద్గీతయే అసత్యమగును.

పురుషుడైన పరమాత్మ, ప్రకృతియైన మాయ యొక్క రహస్యములు తెలియాలంటే చాలా కష్టము. ఎచట పురుషుడున్నాడో అచట ప్రకృతి కూడ గలదు. ఎచట ధర్మమున్నదో అచటనే అధర్మము కూడ ఉన్నది. అట్లే ధర్మముల కూడలియైన భగవద్గీతయందు కూడ అధర్మపు వాసన వుండనే ఉన్నది.

అందువలన పూర్తి వివరణ చేయగలిగినపుడే అందులోని ధర్మములను స్వీకరించి అధర్మములను విడనాడగలము. అటువంటి వివరము ప్రకారము చూస్తే గీతను 700 శ్లోకముల రూపముగ భగవంతుడు చెప్పలేదు. మరియు సంజయుడు విశ్వరూపమునుగాని, యుద్ధరంగములోని ప్రకృతి దృశ్యమును గాని చూడలేదు. అనగా యుద్ధరంగమున జరుగుచున్న ప్రత్యక్ష దృశ్యమును కూడ చూడలేదు. ఇక్కడ కొందరికి ఆశ్చర్యము కల్గి సంజయుడు చెప్పగ ధృతరాష్ట్రుడు విన్న మాటలేగదా భగవద్గీత రూపముగనున్నదను అనుమానమును వ్యక్తము చేయవచ్చును. దానికి మా సమాధానమేమనగా! భగవద్గీత కేవలము శ్రీకృష్ణుడు అర్జునుడు మాట్లాడిన విషయమే గాని ఇతరులకు ఏమాత్రము సంబంధము లేదు. అలాకాక గీత సంజయ ధృతరాష్ట్ర సంభాషణే అయివుంటే గీతకు సంజయ ధృతరాష్ట్ర సంవాదమని పేరు కల్గెడిది. శ్రీకృష్ణార్జున సంవాదమని పేరు కల్గెడిది కాదు.

గీతను వ్రాసిన వ్యాసుడు సంజయ ధృతరాష్ట్రులు మాట్లాడినట్లు వ్రాశాడు కదా! ఇది అబద్ధమా అని కూడ కొందరడుగ వచ్చును. దానికి మా సమాధానము ఏమనగా! వ్యాసుడు తెలివిగ శ్రీకృష్ణార్జునులు మాట్లాడిన విషయమంటూనే ఆ విషయమును సంజయ ధృతరాష్ట్రులు మాట్లాడినట్లు చిత్రీకరించాడు. ఆనాడు వ్యాసుడు అలా చేయడములో ఒక విశేషము గలదు. ప్రజలు సులభముగ అర్థము చేసుకోవాలను ఉద్దేశ్యముతోనే సంజయ ధృతరాష్ట్రులపాత్ర కల్పించి కొద్దిపాటి గీతను 701 శ్లోకముల రూపముగ చేశాడు. మంచిని బోధించుటకు చిన్న పిల్లలకు బూచోనిని కల్పించి కథ చెప్పినట్లు, వ్యాసుడు కొంత పొడవుగ కొన్ని పాత్రలు కల్పించి చెప్పడములో తప్పులేదు. అయినప్పటికి చిన్న పిల్లలకు చెప్పు కథలో బూచోని పాత్ర ఎంత అసత్యమో, గీతలో సంజయ ధృతరాష్ట్రుల పాత్రలు మరియు 701 శ్లోకముల పొడవు అంతే అసత్యమగును.

కొందరు పెద్దలు తమ జ్ఞానమును పుస్తక రూపములో వ్రాయునపుడు దానినెట్లు చెప్పవలెనని యోచించి, ఎట్లు చెప్పితే ప్రజలు నమ్మగలరని ఆలోచించి, కొన్ని పాత్రలు కల్పించి, వారి సంభాషణ రూపములో వ్రాశారు. ఉదాహరణకు అటువంటివే "సీతా రామాంజనేయ సంవాదము", "శ్రీకృష్ణరుక్మిణీ సంవాదము", "శివపార్వతి సంవాదము", "గురుశిష్య సంవాదము" మొదలగునవి గలవు. ఇలా ఎన్నో సంవాదరూపముగ వ్రాయబడియున్నాయి. కాని నిజముగ సీత రామాంజనేయులు, శ్రీకృష్ణరుక్మిణీలు మాట్లాడలేదు. అట్లే శివపార్వతులు, గురుశిష్యులు మొదలైన పాత్రలన్ని కల్పితమేనని తెలియాలి. అలాగే సంజయ ధృతరాష్ట్రులు కూడ కల్పితమే అగుదురు.

ఇపుడు భగవంతుడు చెప్పిన గీత వ్యాసునికెలా తెలిసిందను ప్రశ్న కూడ రాగలదు. మరియు గీతను వ్యాసుడు ఎవరి ద్వారా తెలుసుకొన్నాడన్న ప్రశ్న కూడ రాగలదు. దానికి మా సమాధానమేమనగా సావధానముగ పరికించి చూచితే శ్రీకృష్ణుని ద్వార తెలుసుకొన్న అర్జునుడే తాను తెలుసుకొన్న విషయమును యుద్ధానంతరము కొంత కాలమునకు వ్యాసునికి స్వయముగ తెలిపియుండాలి.

అర్జునుని ద్వార తెలుసుకొన్న విషయమును పాత విషయమనిపించనట్లు, అపుడే జరుగుచున్న తాజా విషయమన్నట్లు, సంజయ ధృతరాష్ట్రుల పాత్రలు కల్పించి వ్యాసుడు వ్రాశాడు. అలా వ్యాసుడు వ్రాయుట వలన ఎవరికీ అనుమానము రాలేదు. ఆలోచించని బోధకులు కూడ అలాగే చెప్పుచు పోయారు. ప్రజలంతా అదే నిజమనుకొన్నారు. కాని యోచించు కొందరికి మాత్రము గీత అడ్డగీతగ తోస్తున్నది. ఆలోచించు వారికి కొంత అసత్యము అందులో కనిపిస్తున్నది. జ్ఞానదృష్టి కల్గిన వారికి గీతరూపమే వేరుగ కన్పిస్తున్నది. వారందరు ఏది నమ్మాలో, ఏది నమ్మకూడదో తెలియక నాస్తికులుగ మారజొచ్చారు. ఇటువంటి అర్థముకాని సమయములో గీత సత్యమైనదని, హేతుబద్ధమైనదని, అందులోని విషయములు సిద్ధాంతపరమైన శాసనములని చెప్పుట మావంతయినది.

సంజయునికి సంబంధములేదని చెప్పడముతో భగవద్గీత నిజముగ భగవద్గీతయే అగును. మధ్యలో సంజయ గీత కాదు. దీనితో భగవద్గీత పెద్ద మలుపు తిరిగినట్లగును. ఇంత పెద్ద మలుపు త్రిప్పితే గాని చిక్కులుగల్గు తప్పుదారి వదలి, ఆటంకములు లేని మంచి దారిలోనికి కలుసుకోలేము. అందువలన పాఠకులు కడు జాగ్రత్తగా సత్యాసత్యములను యోచించి తెలుసుకోవాలని కోరుచున్నాము.

ఇప్పుడొక విప్లవాత్మకమైన ప్రశ్న వేసుకొందాము. అది ఏమనగా! భగవంతుడు చెప్పినది భగవద్గీత అని అర్థముగదా! అలాంటపుడు మనము చదువుచున్న భగవద్గీత 18 అధ్యాయములుగ ఉన్నది. అందులో మొదటి అధ్యాయము అర్జున విషాద యోగముతో మొదలైనది. అర్జున విషాదయోగము కూడ భగవద్గీతయేనా! లేక కాదా? దీనికి సమాధానము చూస్తాము.

ఒక డాక్టరు, ఒక రోగి మాట్లాడుకొనుచున్నారనుకొందాము. రోగి తనకున్న రోగమును గూర్చి చెప్పగ, డాక్టరు రోగనివారణకు కావలసిన మందులు పత్యములు జాగ్రత్తలు మొదలగున్నవన్ని చెప్పాడనుకొందాము. ఇప్పుడు దేనిని వైద్యమంటాము? డాక్టరు చెప్పిన విషయమును మాత్రమే వైద్యమంటాము కదా! రోగి చెప్పిన దానిని

వైద్యమనము కదా! అలాగే అర్జునున్ని రోగి అనుకుందాము. శ్రీకృష్ణున్ని వైద్యుడు అనుకుందాము. అలాంటపుడు శ్రీకృష్ణుడు చెప్పినదే వైద్యముగాని, అర్జునుడు చెప్పినది వైద్యము కాదుకదా! అర్జునుడు తనలోనున్న అజ్ఞానమనే రోగాన్ని బయట పెట్టినపుడు, జ్ఞానమనే వైద్యమును శ్రీకృష్ణుడు చెప్పినపుడు, ఆ విషయమునకు వైద్యమని పేరుపెట్టితే, అది కేవలము శ్రీకృష్ణుని మాటలకే వర్తించాలి. కురుక్షేత్ర యుద్ధమున అర్జునుడు తనలోని విషాదమును బయట పెట్టగా, సర్వదుఃఖములను పోగొట్టు జ్ఞానమును శ్రీకృష్ణుడు చెప్పాడు. అపుడు ఆయన మాటలకే భగవద్గీతయను పేరు కల్గినది.

"భగవద్గీత" అనగ భగవంతుడైన శ్రీకృష్ణుడు పల్కినదేగాని అర్జునుడు పల్కినదికాదని తెలియుచున్నది. అలాంటపుడు భగవద్గీత ఎక్కడి నుండి మొదలైనదను ప్రశ్న ఉద్భవిస్తే! వైద్యులు చెప్పినదే వైద్యమన్నట్లు భగవంతుడు చెప్పినదే భగవద్గీతయగును. కావున భగవంతుని మాటలు ఎక్కడినుండి మొదలైనవో అక్కడినుండే భగవద్గీత మొదలైనదని నిస్సంకోచముగ చెప్పవచ్చును. మనకు అవసరమైనవి, మనము తెలుసుకో తగిన విషయములు, భగవంతుని మాటలతోనే మొదలైనవి. భగవంతుని మాటలు జీవులు తెలుసుకోతగ్గ హద్దు కావున వాటిని **" గీత "** అనడము జరిగినది.

ఇక్కడ కొందరికొక సంశయము రాగలదు. అదేమనగా! రోగి లేనిది వైద్యుడు, రోగము లేనిది వైద్యము అవసరము లేదు కదా! అలాంటపుడు అర్జునుడు చెప్పిన విషాదయోగము భగవద్గీతలో ప్రాముఖ్యము కాదా! అని అడుగవచ్చును. దానికి సమాధానమేమనిన విషాదమన్నది ఆనాటి అర్జునునికే కాక ఈనాటి మానవులందరికి విషాదమున్నది. అలాంటపుడు గీత మానవులందరికి అవసరము. విషాదమున్నది ఆనాటి అర్జునునికేనన్నట్లు ఆయన యొక్క విషాదమునే చెప్పుకోనవసరము లేదు. శ్రీకృష్ణుడు చెప్పిన మాటలు భవరోగములున్న వారందరకి వైద్యములాంటివే, భవరోగములనునవి మానవులైన మనందరకున్ననే ఉన్నవి. కావున అర్జున విషాదయోగమను అధ్యాయమును భగవద్గీత అను పేరుతో చెప్పుకోనవసరము

లేదు. భగవద్గీతను ప్రతి పుస్తకములోను భగవంతుడు చెప్పిన విషయముల నుండియే ప్రారంభించి వ్రాసి ఉంటే ఎంతో బాగుండేది. అలాకాక ప్రతి భగవద్గీతలోను అర్జున విషాదయోగముతో మొదలు పెట్టిన దానివలన చదివిన వారందరు శ్రీకృష్ణుడు అర్జునునకు చెప్పాడని, ఆ విషయములు అర్జునుని కోసమేనని, అర్జునుని చేత యుద్ధము చేయించే దానికొరకేనని, అధైర్యపడిన పార్థుని ధైర్యపరుచుటకేనని, కేవలము అర్జునుని నిమిత్తమే భగవద్గీత ఉన్నట్లు తలచుచున్నారు. అర్జున విషాదయోగము చదివిన కొందరు "అర్జునునకు బాధ ఉన్నది. కావున ఆయనకది అవసరము. మాకేమి బాధ లేదు కావున మాకు అవసరము లేదు" అనుచున్నారు. ఇక్కడ ముఖ్యముగ చదివేవానికి తన నిమిత్తమే దీనిలోని విషయములు గలవను తలంపురావడము లేదు. అందువలన నేడు భగవద్గీత పారాయణము చేయుటకే ఉన్నదని, కంఠాపాఠము చేసుకొని పారాయణము చేయుచున్నారు. కాని దాని అర్థము గూర్చి ఎవరు యోచించడము లేదు.

బాగా పారాయణము చేయు ఒకరి వద్దకు పోయి మీరు శ్లోకములు బహుచక్కగ పారాయణము చేయుచున్నారు. అందులోని అర్థము కూడ మీకు బాగా తెలిసివుండునని అడుగగా! అందులకాయన " అర్థముతో మాకు పనిలేదు, పారాయణము చేయడము మంచిదని చేయుచున్నాము" అన్నాడు. ఆ శ్లోకములు ఎందునిమిత్తము చెప్పబడినవో తెలియకుండ కేవలము పారాయణము చేయడము ఏమి మంచిదని మేము అడుగగా! ఆయన శ్రీకృష్ణుడు ఏమి చెప్పితే మనకేమి? ఏమి చెప్పాడని చూచుకోవలసింది అర్జునుడు మనము కాదు. మనము పెద్దలు చెప్పినట్లు పారాయణము చేయడము మంచిది, కాని ఇదెందుకు అదెందుకని అడగకూడదు అని గద్దించి చెప్పాడు. ఇలా చాలామంది గీతలోని మొదటి అధ్యాయమైన అర్జున విషాదయోగముతో గీత యొక్క భావమునకు దూరమై పోవుచున్నారని తెలియుచున్నది. కావున మేమిపుడు వ్రాయు భగవద్గీతలో అర్జునవిషాదయోగము అను అధ్యాయము లేకుండ కేవలము భగవంతుడు చెప్పిన మాటలనుండియే మొదలు పెట్టి భగవద్గీతయను పేరుకు అర్థము సార్థకమగునట్లు వ్రాయదలిచాము.

కొందరు తెలివైనవారు గీతాపారాయణము మీద దృష్టి పెట్టక, అందులో శ్రీకృష్ణుడు ఏమి చెప్పాడని చూచేవారు కూడ గలరు. అటువంటి వారు, అందులో సత్యము తెలుసుకోవాలనుకొన్నవారు, గీతను పూర్తిగ చదివినప్పటికి అందులో నుండి ఏమి తెలుసుకోలేక చివరకు ఎన్నో సంశయములనుకల్గి ఇది మనకేమి అర్థము కావడము లేదు. ఇందులోని విషయములు ఒకదానికొకటి పొంతన లేకుండ ఉన్నాయి. ఇది అర్జునునితో యుద్ధము చేయించుటకొరకు అతనిని ఉత్సాహ పరుచుటకు పల్కిన పల్కులేకాని, సిద్ధాంతపరముగ లెక్కించు విషయములు లేవనుచున్నారు. ఆ మాట విన్నమేము "భగవద్గీత ధర్మయుక్తమైనది, శాస్త్రబద్ధమైనది. అటువంటి దానిని సిద్ధాంతపరముగ లేదనుట ఏమి మాట" అని అడుగగా! వారు వారికున్న అనుమానములను ఇలా చెప్పుచున్నారు. "ఏమిటయ్యా గీతలో ఉండేది? గ్రుడ్డిగ చదివేవారికైతే సరిపోతుంది. వివరణా దృష్టితో చదివే మాలాంటి వారికి సరిపోదు. ఒక చోట ఇంద్రియములకు తెలియనిది 'ఆత్మ' అంటారు, మరియొక చోట 'ఓం'అను అక్షరమే దేవుడంటారు, అక్కడ కనిపించని వినిపించని వాడు ఇక్కడ కనిపించి వినిపించే 'ఓం' ఎట్లయ్యాడు? ఒక చోట ప్రకృతియే అంతాచేస్తున్నది, నేను ఏమి చేయలేదు చూస్తున్నాను, కేవలము సాక్షిని మాత్రమేనని చెప్పి, మరియొక చోట అన్నీనేనే చేస్తున్నాను, బొమ్మలాట మాదిరి ఆడిస్తున్నాననడము ధర్మమా? సిద్ధాంతమా? ఒకచోట నాకందరు సమానమని, అందరికి నేను సముడనని చెప్పినవాడు, మరియొక చోట హెచ్చు తగ్గు కులములుగ పుట్టిస్తున్నాననడము దైవత్వమా? ఒకచోట గుణముల వలననే కార్యములు జరుగుచున్నవంటాడు మరియు గుణములను త్యజించమంటాడు. మరియొక చోట గుణములు త్యజించి పనులు మానుట తామసము అంటాడు. అలా పనులు మానకూడదంటాడు. ఒక చోట కుక్కను, ఏనుగును, చండాలుని అందరిని సమానముగ చూడమంటాడు. మరియొక చోట వాడు శత్రువు వానిని చంపుము అంటాడు. ఒక చోట ఆత్మ చంపబడదంటాడు, మరియొక చోట అందరిని నాశనముచేయు కాలుడను నేనే అంటాడు. ఈ విధముగ గీతలో ఎన్నో దిక్కు తెలియని మాటలున్నాయి. అందువలన అర్థముతో పనిలేకుండ కంఠాపాఠముగ చదువు వారికి సరిపోతుంది గాని మాకు నచ్చదు పో" అంటున్నారు.

భావమేమిటని చూచేవారికి  గీతలో కొన్ని సంశయములు వచ్చు మాట నిజమే.  అంతమాత్రమున గీతను అశాస్త్రీయము,  సిద్ధాంతముకాదని చెప్పుటకు వీలులేదు.  గీతను తెలుగులోనికి అనువదించి అర్థము చెప్పువారు సరైన విధముగ చెప్పలేక పోవడము వలన పై విధముగ అనుమానములు కొందరికి వచ్చి ఉండవచ్చును.  సత్యము చెప్పాలంటే  ఆనాడు భగవంతుడు తెల్పిన గీత  నేటి వరకు అర్థము కాలేదనియే చెప్పవచ్చును. ఎందుకనగా భగవద్గీతను సక్రమముగ అర్థము చేసుకోవాలంటే  ముఖ్యముగ నాలుగు సూత్రములను అనుసరించి చదువ వలసియుండును.  వ్రాయువారు కూడ ఆ నాలుగు సూత్రముల ప్రకారమే వ్రాసి ఉండవలెను. అలా సూత్రబద్ధముగకాక ఇష్టమొచ్చినట్లు వ్రాయువారికి, ఇష్టమొచ్చినట్లు చదువువారికి  గీతలోని అంతరార్థము ఎప్పటికి అర్థము కాదు.  ఇంతవరకు ఈ నాలుగు సూత్రములను ఎవరు అనుసరించలేదు.  కావున  గీత యొక్క స్వరూపము ఎవరికి అర్థముకాలేదనియే చెప్పవచ్చును.  ఈ మాటకు కొందరికి కోపము కూడ వచ్చివుండవచ్చును.  గీత మాకు తెలియదా అని మమ్ములను దూషించినా ఫరవాలేదు. ఇంతవరకు సంశయరహితమైన గీత లేదు! అందువలన సంశయరహితమైన గీత కావాలంటే ముఖ్యమైన నాలుగు సూత్రములు గీత మీద పెట్టి చదవాలి. ఆ నాల్గు సూత్రములేవియనగా!

*1. చదువుచున్న శ్లోకము జీవాత్మకా, ఆత్మకా, పరమాత్మకా, ప్రకృతికా? ఎవరిని గూర్చి చెప్పబడినది?*

*2. చదువుచున్న శ్లోకము బ్రహ్మయోగమునకా! లేక కర్మ యోగమునకా దేనికి సంబంధించినది?*

*3. చదువుచున్న శ్లోకము సాకారమునకా, నిరాకారమునకా ఎవరిని గూర్చి చెప్పినది?*

*4. చదువుచున్న శ్లోకము శాస్త్రబద్ధమా! కాదా?*

ఈ నాలుగు సూత్రములు గీత మీద ప్రయోగించి చూడకపోతే అది ఆకారప్రాయమేయగును గాని అర్థసహితము కాదు. ఈ నాల్గు సూత్రముల ప్రకారము ఇంతవరకు ఏ భగవద్గీత వ్రాయబడియుండలేదు. కావున వాటిలో ఎన్నో సంశయములు మిగిలినవనుటలో తప్పులేదు. సంశయరహిత జ్ఞానము గీత నుండి అర్థము కావాలంటే తప్పక పై సూత్రములను అనుసరింప వలసివుండును. పై సూత్రములలో నాల్గవ సూత్రమును గీత మీద వర్తింపజేస్తే, అందులోని అశాస్త్రీయ కల్పిత శ్లోకములన్నియు బయటపడగలవు. భగవంతుని ఉద్దేశ్యమునకు ఏ శ్లోకములైతే భిన్నముగనున్నవో అవన్నియు ఈ సూత్రముతో దొరికి పోవును. భగవంతుడు చెప్పిన భావమంతయు శాస్త్రబద్ధమే, కావున ఆమాటలు చదివిన వారికి ఎటువంటి సంశయములు మిగలవు. పై నాలుగు సూత్రములకు సంబంధము లేని శ్లోకములు భగవద్గీతకు ఏ మాత్రము సంబంధములేదని చెప్పవచ్చును. ఇపుడు ఈ సూత్రములు ప్రయోగించి గీతామహత్యమునకు, గీతకు సంబంధమేమైన కలదేమో చూచెదము.

గత కాలములోని పెద్దలు ఏదో మంచి చేయాలనుకొంటే ఆ పనులు నేటి సమాజములో దురదృష్ఠవశాత్తు అర్థములేనివై, అనర్థములతో కూడుకొన్నవై నిలిచినవి. పెద్దలు ఆశించిన ఫలితములకంటే వేరు ఫలితములు ఎదురైనవి. ఉదాహరణకు యమలోకమును గురించి అది ఎక్కడోవుందని, అక్కడ పాపముల పట్టిక ప్రకారము నరకము అనుభవింపవలసి ఉంటుందని భయోత్పాతము కల్గునట్లు వాస్తవానికి అక్కడ లేని యమలోకమును గురించి వర్ణించారు. దాని వలన ప్రజలకు పాపమంటే భయముకల్గి, పాపపు పనులు చేయకుందురని పెద్దల భావము. వారిది మంచి భావమేయైనప్పటికి దాని ఫలితము ఆశించినట్లు లేకుండ ప్రజల యందు వేరు విధముగ తయారై పోయినది. పాపము చేయువానికి పాపభీతి కల్గడములేదు. చేయుపని చెడ్డదని తోచినప్పటికి అది ఆ సమయానికి అనుకూలమైన పనియని పాపమువస్తే రానీలేనని, యమలోకానికి పోయినప్పుడు కదా అనుభవించేదని, మరణించిన తరువాత ఏమో జరుగునని ఇపుడెందుకు వదులుకోవాలని, అపుడు

ఏమి జరుగుతుందో ఎవడు చూచాడని, యమలోకమనునది దృష్టాంతము లేని మాటయని ఇష్టమెచ్చినట్లు ఎవరంతకు వారనుకొనుటకు మొదలు పెట్టారు. వాస్తవానికి పాపభీతి లేకుండ పోయినది.

పెద్దలు యమలోకము ఎక్కడో ఉందని వర్ణించక ఇక్కడే ఉందని, భూమి మీద అనుభవించు కష్టబాధలన్నియు యమబాధలేనని, వాస్తవము తెలిపియుంటే ప్రత్యక్షముగ జరుగు ఘోరమైన బాధలను చూచి, మానవుడు పాపము యొక్క పరిణామమిట్లుండునని తెలుసుకొని, భయముకల్గి పాపపు పనుల నుండి తప్పించు కొనెడివాడు. ఉన్నదున్నట్లు చెప్పక మానవులకు అర్థము కావాలని కథల రూపముగ అల్లి చెప్పిన మాటలు మానవులకు పెడదారిని చూపినవి. అట్లే ఈనాడు "గీతామహత్యము" వలన గీత ఎడల మానవుల భావము పెడదారియే పట్టినదని చెప్పవచ్చును.

కొందరు పెద్దలు గీతను అందరు చదువవలెనని, అందరికి దానియందు భక్తి కల్గునట్లు చేయవలెనని, గీతామహత్యమును ప్రకటించారు. దానివలన ప్రజలు మహత్యమునందు కల్పించిన ఫలితముల మీదనే మనస్సును లగ్నము చేసి గీతలోని విషయములను వదలి వేశారు. మహత్యములో ప్రకటించిన ఫలితములే కావాలను కొంటున్నారు. గీతయందు ప్రకటించిన ధర్మములను చూడలేక పోవుచున్నారు. కొందరు పెద్దలు మంచిదని తెలిపిన గీతామహత్యము మానవుల ఎడల బెడిసికొట్టి అధర్మముల వైపు మరల్చినది. ఆ విధముగ మారుటకు గీతామహత్యమునందు భగవద్గీతకు వ్యతిరిక్తమైన మరియు ధర్మవిరుద్ధమైన మాటలెన్నో గలవు. అందువలన మనమందరము గీతామహత్యమంటే ఏమిటో తెలుసుకోవాలి.

భగవంతుడు గీతయందు ఏ ఉద్దేశ్యమును ప్రకటించాడో ఆ ఉద్దేశ్యమునకు వ్యతిరిక్త భావములు గీతామహత్యమందు వ్రాయబడుట విచిత్రము. గీతయందు భగవంతుడు ధర్మములు తెలిపియుంటే, ధర్మములకు వ్యతిరేఖముగనున్న వాక్యములను గీతామహత్యములను పేరుతో ఎందరో మరిమరి చెప్పుచు మానవాళిని ప్రక్కదారి

పట్టించడము మరీ విచిత్రము. అంతో ఇంతో జ్ఞానమున్నవారు కూడ గీతామహత్యము, గీతకు వ్యతిరేఖముగనున్నదేనని యోచించక నిత్యము పారాయణము చేయడము మరిమరి విచిత్రము. ఈ మా మాటలకు కొందరికి కోపమొచ్చి మా మాటలు అజ్ఞానపరమైనవని గొంతెత్తి అరవవచ్చును. పాఠకులుగ మీరు స్వయముగ యోచించుస్థితికి రండి. ఒకనాడు సత్యమును చెప్పిన ఏసుప్రభువును ఆనాటి జ్ఞానులు దైవదూషణ చేయువానిగ లెక్కించి హింసించి చంపారు. సత్యము తెలుసుకొన్న తరువాత ఆనాటి ఏసు మాటలు ఈనాడు శిరోధార్యమైనాయి. అట్లే ఒకనాడు ఖగోళ రహస్యములను చెప్పిన గెలీలియో అనునతనిని ఆనాటి జ్ఞానులన్నవారు చిత్రహింసలపాలు చేశారు. మరి ఈనాడు ఆ గెలీలియో మాటలే ఖగోళశాస్త్రజ్ఞులకు ఆధారమైనాయి. అందువలన మన లెక్కలో జ్ఞానులను పేరుకల్గిన వారు ఇది అసత్యమని అరచినంత మాత్రమున మీరు తొందరపడక ఆలోచించి చూడండి. అపుడే సత్యము తెలియగలదు.

మేము ప్రకటించిన నాలుగు సూత్రములలో నాల్గవ సూత్రము ప్రకారము చూచినట్లయితే గీతామహత్యము అశాస్త్రీయమని తెలియగలదు. గీత యోగశాస్త్రము కాగ, గీతామహత్యము వరాహపురాణమగుట గమనింపదగిన విషయము. శాస్త్రములకు పురాణములకు ఎంతో తేడాగలదనుటకు నిరూపణగ **శాస్త్రమైన గీత జన్మరాహిత్యమును తెలుపగ, పురాణమైన గీతామహత్యము గీతపారాయణము వలన ప్రపంచమున్నంత వరకు మానవ జన్మకలుగునని తెల్పినది.** గీతామహత్య మందు 13వ శ్లోకమున గీతను ప్రతిదినము ఒక అధ్యాయము చదువుట వలన మన్వంతరము వరకు నరజన్మమును పొంది, భూమి మీద పుట్టుచుందురని గలదు. ఇది గీతకు వ్యతిరేఖమైన మాటకాదా!

పగలంతయు పాపము చేసి సాయంత్రము గీతను చదివెడువారు, వినెడివారు కొందరున్నారు. ఎందుకనగా! గీతను వినుటవలన చేసుకొన్న పాపమంతయు పుణ్యముగ మారునని గీతామహత్యమున 18వ శ్లోకములో ఉండుట వలన వారు నిర్భయముగ పాపము చేయుచు, సాయంకాలము దానిని పుణ్యముగ

మార్చుకొనుటకు గీతను వినడము చదవడము చేయుచున్నారే గాని అందులోని అర్థమును గ్రహించడము లేదు. గీతలో ఏమి చెప్పారో తెలిసి నడుచుకోమని చెప్పితే అది మాకు అవసరములేదు, అది మాకు సాధ్యము కాదు, దానికంటే గీతామహత్యములో చెప్పినట్లు గీతను వినుచువస్తే పాపము పుణ్యముగ మారునుకదా! ఇదే సులభము కదా! అనుచున్నారు.

భగవద్గీత పాప పుణ్యరహితుడవై మోక్షము పొందమని చెప్పితే, గీతా మహత్యము పాపములను పుణ్యములుగ మార్చుకొమ్మని చెప్పుచున్నది. వాస్తవానికి పాపపుణ్యములు మానవులు సంపాదించినపుడు అవి వాని కర్మచక్రములోని సంచితకర్మలో చేరిపోయి మరుజన్మలలో అనుభవింపవలసివచ్చును. అట్లుకాక గీతను వినుట వలన పాపము పుణ్యముగ మారుననుట అభూతకల్పనయే గాని సత్యముగాదు. వినుటకు అవకాశముండి కూడ గీతను వినని ఒక వ్యక్తిని కలిసి "ఏమయ్యా నీవు గీతను కనీసము వినడము కూడ లేదు. మీ ఇంటి ప్రక్క దేవాలయములో ప్రతి దినము గీతను పారాయణము చేయుచున్నారు కదా! వినుటకు మంచి అనుకూలము కదా" అని అడిగితే, ఆయన *"నేనేమి పాపములు చేయలేదు. పాపము చేస్తే కదా పుణ్యములుగా మార్చుకొనుటకు గీతను వినాలి. నేను పుణ్యమునే చేయుచున్నాను, కావున గీతను వినవలసిన పనిలేదు"* అన్నాడు. మీరెందుకలా అంటున్నారని మేమడుగగా "గీతామహత్యములో వ్రాసిపెట్టారుకదయ్యా! మీకంతమటుకు తెలియదా" అన్నాడు. ఆ మాట విన్న మేము గీతామహత్యము ముఖ్యముకాదయ్య గీతయే ముఖ్యమని చెప్పగ, అతను నవ్వి ఇలా అన్నాడు, "గీతా మహత్యములో 20వ శ్లోకము చూడుము. గీతను చదివినప్పటికి గీతామహాత్యము చదవకపోతే ఫలితమేలేదని ఉంది. కావున గీతకంటే గీతామహత్యమే ముఖ్యమని మాకు తెలుస్తున్నది".

ఇలా ఎందరో గీతకంటే గీతామహత్యములో చెప్పిన మాటలనే ఎక్కువగ నమ్మి నడుచుకొనుచున్నారు. అలాంటి మరియొక వ్యక్తితో కలిసి గీతలోని విషయములను అడుగగా అందులోని వివరము మాకు తెలియదన్నాడు. ఇదేమి

విచిత్రము గీతను ప్రతిదినము చదువుచున్నారు కదా అని అడిగితే "అవునయ్యా గీతను ప్రతిదినము చదివితే అందులోని విషయములతో మాకు ఏమి పని" అని అన్నాడు. మరి ఆ విషయములతో పనిలేనిది ఎందుకు గీతను చదువుచున్నారని అడిగితే మోక్షముకొరకని సమాధానము చెప్పాడు. మోక్షమంటే ఏమిటని వివరము తెలిసి దానిని పొందాలంటే గీతలోని ధర్మములు తెలియాలికదా! అని అడిగితే, అతను నవ్వి కొండనుత్రవ్వి ఎలుకను పట్టినట్లు అంతశ్రమ ఎందుకయ్యా మేము సులభముగ మోక్షము పొంది ఉన్నామన్నాడు. ఏమిటి బ్రతికియున్నట్లే మోక్షమా! దేహముతో ఉన్నపుడే మోక్షము పొందారా అని అడిగితే "అవునయ్యా గీతామహత్యములో 19వ శ్లోకము చూడలేదా! గీతను గీత అర్థమును చదువుట వలన దేహముతో ఉండియే మోక్షము పొంది ఉందురని ఉన్నది కదా! నేను తూచ తప్పక ప్రతి దినము గీతశ్లోకములు తాత్పర్యము చదువుచున్నాను. కావున గీతామహత్యము ప్రకారము నేను ఇపుడు మోక్షములోనే ఉన్నట్లు" అని అన్నాడు. అలా కాదయ్యా మోక్షమంటే శరీరమును వదలి, ఏ శరీరము ధరించక అణువణువున వున్న పరమాత్మయందు కలిసిపోయేదని మేమంటే, అతను కోపగించుకొని "విష్ణువు చెప్పిన గీతామహత్యమునేకాదని ఇది మోక్షముకాదంటావా! నీకేమి తెలియదుపో" అన్నాడు. ఇలా ఎందరో గీతామహత్యములోని మాటలనే నమ్మి అసలైన ధర్మములను వదలి గీతకే వ్యతిరేఖముగ మారిపోయి ఉన్నారు. ఇందులో మొదటి తప్పు గీతామహత్యమును చెప్పిన వారిదేయగును. వాస్తవానికి చెప్పినవారు ప్రజలను తప్పు దారి పట్టించాలని చెప్పలేదు, మంచియే చేయాలని చెప్పారు. కాని అది ప్రజలయెడల దురదృష్టవశాత్తు తప్పుగ పరిణమించినది.

అదే పద్ధతిలో మరికొందరు పెద్దలు గీత శ్లోకములు చదువుట వలన ప్రపంచ పనులు నెరవేరునని ఆశను కల్పించారు. ఒక్కొక్క శ్లోకము ఒక మంత్రమని పలానా శ్లోకమును మంత్రమువలె చదువుట వలన పలానా పని నెరవేరునని చెప్పారు. ఈ శ్లోకము చదువుట వలన ఈ రోగముపోవునని, మరియొక శ్లోకము వలన కోర్టులోని వ్యాజ్యమును గెలుచుదురని, అట్లే సంతానమునకొక శ్లోకము,

ధనప్రాప్తికొరక శ్లోకము పనికివచ్చునని చెప్పినవారు కూడ కలరు. అది చూచిన మేము ప్రపంచ పనులకు కాదయ్య గీత ఉన్నది, మనము జ్ఞానము తెలుసుకొనే దానికని చెప్పితే, జ్ఞానము అర్జునునికి చెప్పాడు గాని మనకు కాదయ్య అంటున్నారు. అర్జునునకు చెప్పినదే మనకు పనికి వస్తుంది. దాని వలన జ్ఞానము తెలిసి మోక్షము పొందవచ్చునని మేమంటే, దానికి జవాబుగ పెద్దలు దీని వలన మోక్షమొస్తుందని చెప్పలేదే! ఈ శ్లోకము చదివితే ఈ పని నెరవేరునని చెప్పారు కదా! ఈ అధ్యాయము చదివితే ఈ ఫలితముంటుందని వ్రాశారు. నాకు ఇపుడు కోర్టులో కేసువున్నది, కావున అది నెరవేరుటకు ఇది సరిపోవునని పెద్దలు చెప్పిన శ్లోకమును ప్రతిదినము పఠించుచున్నానన్నాడు. ఇలా గీతామహత్యము ప్రజలను గీతకు దగ్గర చేసినది కాని గీత యొక్క భావమునకు దూరము చేసినది. గీతకు మహత్యముందని తెలుసుకొన్నవారు శ్లోకములను పారాయణము, పుస్తకమును పూజచేయుచున్నారు తప్ప గీతలోని జ్ఞానమునకు దగ్గర కావడము లేదు. నేటి నుంచి గీతను చదువువారు శ్రీకృష్ణుడు ఆనాడు అర్జునునికి మాత్రమేకాదు, మనకు కూడ చెప్పాడని అందులోని భావము గ్రహించి చదవండి. అంతో ఇంతో జ్ఞానులైనవారు గీతామహత్యమును చదవకుండ గీతలోని విషయములనే చదివి అర్థము చేసుకోవాలి. గీతామహత్యము ప్రకారము ఏవో ప్రపంచ కోర్కెలు నెరవేరునను ఉద్దేశ్యముతో గీతను చదువకూడదు. ఫలితముల మీద ఆశ లేకుండ చదవాలి. గీతకు, గీతామహత్యమునకు ఎలాంటి సంబంధములేదని, గీత శాస్త్రబద్ధమైనదని, గీతామహత్యము శాస్త్రముకాదని, అది కేవలము పురాణమని తెలియాలి. ఇట్లు విశదీకరించుకొంటూ పోతే కురుక్షేత్రము ధర్మక్షేత్రమేనా! అను ప్రశ్న కూడ ఉద్భవించుచున్నది. గీత యుద్ధరంగములో మొదలైనది. ఆ యుద్ధము ఎందుకు సంభవించినదో అందరికి తెలుసు. నిజము చెప్పాలంటే ప్రొద్దుపోక జూదమాడి పెట్టుకున్న యుద్ధమని అందరికి తెలియును. ఆ యుద్ధము కురుక్షేత్రమందు జరిగినది. ఆ కురుక్షేత్రమును ధర్మక్షేత్రమనుట కూడ జరిగినది. వాస్తవానికి కురుక్షేత్రము ధర్మక్షేత్రమేనా అన్నది ప్రశ్న, దానిని పరికించి చూస్తాము.

ప్రపంచములో మొదటి నుండి బీదవానికొక న్యాయము, ధనికునకొక న్యాయము సహజముగనున్నది. పేదవాడు చిన్న తప్పుచేస్తే వానిని తప్పుడు వానిగ ప్రచారము చేస్తారు. అదే ధనికుడు చేస్తే వానినలా అనక వాడు చేసిన తప్పును కూడ సమర్థిస్తారు. ఒక ఊరిలో ఒక పేదవాడు ఒక స్త్రీతో అక్రమసంబంధము ఏర్పరచుకొంటే వానిని తిట్టిన ప్రజలే, అదే ఊరిలో అదే పనిని ఒక ధనికుడుచేస్తే వాడు మగవాడు ఏమి చేసిన తప్పులేదన్నారు. ఇట్లు అనేక చోట్ల అనేక విధముల తప్పులను ధనికుల ఎడల ఒక విధముగ, పేదల ఎడల మరొక విధముగ మాట్లాడడము జరుగుచున్నది. నాకు తెలిసిన మరొక వ్యక్తి జూదమాడి ఉన్న ఆస్తినంతయు పోగొట్టుకుంటే అతనిని ఛీ అన్నారు. అట్లన్నవారే ఆస్తిని మరియు భార్యను కూడ జూదములో పెట్టి ఓడిపోయిన ధర్మరాజును ధర్మపరుడన్నారు. ఇదే పేద ధనికులకుండే భేదము చూడండి.

ఆస్తిని అన్నదమ్ములను చివరకు భార్యను కూడ కోల్పోయిన ధర్మరాజు తిరిగి తన ఆస్తి కోసము యుద్ధమునకు పూనుకొన్నాడు. ఆ యుద్ధము ఈనాడు పంజాబ్ రాష్ట్రమునందు గల కురుక్షేత్రమందు జరిగినది. ఆ క్షేత్రములో ధర్మము ఈనాడుగాని, ఆనాడుగాని లేదనియే చెప్పవచ్చును. ఎందుకనగా ఈనాడు ఆ స్థలము పెద్దపట్టణముగ ఉన్నది. అన్ని స్థలములలో జరిగినట్లే అక్కడ కూడ మోసములు, కుతంత్రములు, హత్యలు, గలాటలు జరుగుచూనే ఉన్నవి. ఈనాడు సిక్కులు తమకు ప్రత్యేకమైన రాష్ట్రము కావాలని పోరాటము జరిపి ఎందరో హతమయ్యారు. ఆనాడు భూమి కోసమే యుద్ధము జరిగినది. భారతదేశచరిత్రలో ఈనాటికి ఆనాటికి యుద్ధములో పేరుగాంచి రక్తముతో తడిసిన ఆ భూమిని ధర్మక్షేత్రమనుట సరియైన భావముకాదనియే చెప్పవచ్చును.

కురుక్షేత్రమును ధర్మక్షేత్రమని శ్రీకృష్ణుడు అనలేదు. మధ్యలోని వారన్నారనుకోండి. దానికి ఆ పేరు తగునా, తగదా అను ప్రశ్నను వేసుకొని యోచించాలి. ముందు ధర్మమంటే ఏమిటో తెలియాలి. ధర్మమంటే పలానాయని

తెలిసినపుడే అది ధర్మక్షేత్రమా కాదా అను వివరము మనకు తెలియగలదు. అదియును కాక ధర్మయుక్తమైన భగవద్గీతను తెలుసుకొనుటకు ముందు ధర్మములను గూర్చి కొద్దిగ అయిన తెలిసి ఉండాలి. అలాంటపుడే గీతలో ఇవి భగవంతుడు చెప్పిన ధర్మయుక్తమైన వాఖ్యములని, ఇవి మనుజులు చెప్పిన అధర్మ యుక్తములైన మాటలని గుర్తించుటకు వీలగును.

జడ్జీల మీటింగులో మంత్రిగారు ఉపన్యసిస్తూ న్యాయమును నిర్ణయించి తీర్పు చెప్పు న్యాయమూర్తులను ధర్మపరులని వర్ణిస్తు, మీరు ధర్మము ప్రకారము తీర్పులు చెప్పుచు ధర్మమును కాపాడవలసినది మీ చేతులలో ఉన్నదని, ఏ ప్రలోభములకు లొంగకుండ ధర్మమును నిర్వర్తించాలన్నాడు. ఇక్కడ మంత్రిగారు న్యాయమును ధర్మమును రెండిటిని కలిపేసి న్యాయమూర్తులను ధర్మమూర్తులన్నారు. అలాగే చాలామంది ప్రజలు కూడ న్యాయము ధర్మము ఒకటేనని తలచి న్యాయమని చెప్పు సందర్భములలో ధర్మమను పదము వాడుచున్నారు. ఇది ప్రజల పొరపాటైతే ఇక స్వాములైన వారు జ్ఞానము, నీతి రెండు ఒకటేనని తలచి, వారు జ్ఞానము చెప్పవలసిన సందర్భములలో నీతిని చెప్పుచున్నారు. ఇట్లు ప్రజలకు న్యాయ ధర్మముల వ్యత్యాసము తెలియక పోగా, జ్ఞానము, నీతి వ్యత్యాసములు స్వాములకు కూడ తెలియకుండ పోయినవి.

నీతి న్యాయములు ఒక జాతి కాగ, జ్ఞాన ధర్మములు మరియొక జాతి అగును. నీతి న్యాయము ప్రపంచ సంబంధము కాగ, జ్ఞాన ధర్మములు పరమాత్మ సంబంధమగును. నీతి న్యాయయుక్తమైతే, జ్ఞానము ధర్మయుక్తమగును. నీతిని ఆచరిస్తే న్యాయమగును, అవినీతిని ఆచరిస్తే అన్యాయమగును. అట్లే జ్ఞానమునాచరిస్తే ధర్మమగును. అజ్ఞానమునాచరిస్తే అధర్మమగును. నీతి న్యాయములాచరించడమును బట్టి పుణ్యము, అవినీతి అన్యాయముల ఆచరణను బట్టి పాపము వచ్చుచుండును. అట్లే జ్ఞానధర్మములను బట్టి పాపపుణ్యములనబడు కర్మ నశించిపోవడము జరుగుచుండును.

నీతి ప్రపంచమున మానవుని ప్రవర్తనను సూచించి సత్ప్రవర్తునిగ జేయును. మానవుని ప్రవర్తన మీదనే న్యాయాన్యాయములు ఆధారపడి ఉండును. ప్రవర్తన సరియైనపుడు న్యాయమని, ప్రవర్తన సరికానపుడు అన్యాయమని నిర్ణయింపవలసి ఉండును. అట్లే జ్ఞానము ఆధ్యాత్మికముగ మానవుని కట్టుబాట్లను సూచించి సత్పురుషునిగ (యోగిగ) మార్చును. జ్ఞానమును ఆచరించడము మీదనే ధర్మాధర్మములు ఆధారపడియుండును. మానవుని బాహ్యాచరణకు సంబంధించినది న్యాయము కాగ, అంతర్ భావముల మీద ఆధారపడినది ధర్మము. అంతర్ ఆచరణమున ధర్మము బాహ్యములో అవినీతి అన్యాయముగ కనిపించవచ్చును. అందువలన ధర్మములివియని చెప్పిన శ్రీకృష్ణుడు కూడ బాహ్య ప్రపంచములో కొందరికి అసత్యపరుడుగ అక్రమాలు చేసినవాడుగ కనిపించాడు.

వాస్తవానికి నీతి న్యాయమిదియని, జ్ఞాన ధర్మములివియని తెలిస్తే గాని ఎదుటి వానిని పూర్తిగ గుర్తించలేము. నీతి న్యాయము తెలిసినంత మాత్రమున, ప్రపంచ మానవుల స్థాయిని గుర్తించి చెప్పవచ్చును. కాని యోగమార్గములో ఎవరెంతటివారో చెప్పలేము. భూమి మీద మానవులు నీతి న్యాయమును గుర్తించగలరేమో గాని, జ్ఞాన ధర్మములను గుర్తించుట చాలా కష్టము. అందువలన నేటి కాలములో చాలామంది స్వాములు కూడ జ్ఞానధర్మములివియని గుర్తించ లేకపోయారు. జ్ఞానమనుకొని నీతిని పట్టుకొని వ్రేలాడుచున్నారు. ప్రజలకు పుణ్యమొచ్చు పనులనే బోధిస్తు అదే జ్ఞానమాచరణ అనుకొంటున్నారు. పాపపుణ్యములు నశింపజేయు జ్ఞానమును తెలుపలేకపోవుచున్నారు. అందువలన చాలా మంది నీతినే జ్ఞానమని, న్యాయమునే ధర్మమని తలచుచున్నారు. కోర్టులో గల న్యాయమూర్తులను ధర్మమూర్తులని, వారి ఆసనములను ధర్మాసనములని అనడము కూడ వింటున్నాము.

ఎన్నో పుణ్యములు చేయుచున్న మానవుడు వాటిని ధార్మిక కార్యములు చేస్తున్నట్లు చెప్పుచున్నాడంటే ధర్మమనునది ప్రత్యేకమైనదని తెలియక పోవడమే

కారణము. అంతేకాక నీతి కార్యమైన దానము చేయు ప్రతి సందర్భములోను ధర్మము చేయుచున్నాననడము కూడ గ్రహించవచ్చును. ఒక దేవాలయములో ఫ్యానును బిగించి ఒకడు దానము చేశాడనుకొందాము. అక్కడ ఫ్యాను మీద పలానా వారి ధర్మమని దానము చేసిన వారి పేరును వ్రాసియుందురు. పలానా వారి దానమని మాత్రమువుండదు. అతను చేసినది దానమేయైనప్పటికి ధర్మమని వ్రాయుటలో అర్థమే లేదు. ఇట్లు తెలియని తనము అందరిలో వ్యాపించి చివరకు భిక్షమడుగువాడు కూడ దానము చేయండి అనక ధర్మము చేయండి అనడము చూస్తూనే ఉన్నాము. ఈ పరిస్థితిని బట్టి చూస్తే ధనికులను మొదలుకొని భిక్షగాని వరకు ధర్మమంటే ఏమిటో తెలియక పోయినదని అర్థమగుచున్నది. స్వాములు సహితము పుణ్యము వచ్చు మెత్తని నీతి మాటలే చెప్పుచున్నారంటే ధర్మమునకు భూమి మీద గుర్తింపులేదని అర్థమగుచున్నది.

ఇలా ధర్మాధర్మముల వివరము ప్రకారము చూస్తే కురుక్షేత్రము ధర్మక్షేత్రమేమాత్రము కాదు. అవినీతి అన్యాయములకు ఆలవాలమైన మనుజుల మధ్య జరిగిన పోరాట స్థలమును ధర్మక్షేత్రమనడము సమంజసము కాదు. ఆనాడు కౌరవ పాండవులు నీతిని ఉల్లంఘించి, సంగ్రామమున యుద్ధపు కట్టుబాట్లను అతిక్రమించి, మోసముతో ఒకరినొకరు చంపుకొని రక్తసిక్తమై చరిత్రకెక్కిన స్థలము ధర్మక్షేత్రమా? అలా అది ధర్మక్షేత్రమైతే పౌరుషమే ఊపిరిగ ముఠాకక్షలతో పేరుగాంచిన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రములోని రాయలసీమ జిల్లాలు కూడ ధర్మక్షేత్రములే అగును.

ఆచరణ యోగ్యమైనది ధర్మము, అది కదలిక కల్గిన మానవులు మాత్రమే ఆచరించుటకు ఉపయోగపడును. అందువలన ధర్మపరుడు అధర్మపరుడని మనుషులను పిలువవచ్చును. కాని చైతన్యములేని భూమికి ధర్మక్షేత్రమని పేరుపెట్టడములో అర్థము లేదు. సైన్సు ప్రకారము ఒక్కొక్క వస్తువుకు ఒక్కొక్క ధర్మము గలదు. అట్లే బ్రహ్మవిద్యను తెలుపు యోగశాస్త్రము ప్రకారము దైవమునకు కూడ ధర్మము గలదు. దైవధర్మమును ఆచరించినపుడు మానవుడు కూడ దైవముగ మారిపోవును.

మానవుడు పరమాత్మ నుండి బయటికి వచ్చిన జీవాత్మ. జీవాత్మ తన పూర్వపు ధర్మమైన పరమాత్మ ధర్మమును అనగ తన స్వధర్మమును ఆచరించిన ఎడల మరల పరమాత్మ స్థాయిలో చేరిపోగలడు. గాలి నీరు వేరు వేరైనప్పటికి గాలినుండే నీరు పుట్టినది. కావున నీరు తిరిగి గాలిగ మారిపోగలదు. నీరు గాలిగ మారుటకు ప్రయోగమవసరము. అట్లే జీవాత్మ పరమాత్మగ మారుటకు యోగమవసరము. ఏ ప్రయోగము ద్వార నీరు గాలిగ మారునో ఆ విధానమును శాస్త్రవేత్తలు తెల్పినట్లు, ఏ యోగము ద్వారా జీవాత్మ పరమాత్మగా మారగలదో ఆ విధానమును భగవంతుడైన శ్రీకృష్ణుడు తెల్పాడు. ప్రయోగములో ఏ పద్ధతులు అనుసరించాలో శాస్త్రవేత్తలు తెల్పినట్లు యోగములో ఏ పద్ధతులు అనుసరించాలో శ్రీకృష్ణుడు తెల్పాడు. ఆ పద్ధతులే గీతలో గలవు. నీరు గాలిగ మారుట శాస్త్రబద్ధమైన విషయము. అట్లే జీవాత్మ పరమాత్మగ మారుట కూడ శాస్త్రబద్ధమైన విషయము.

కౌరవులకు పాండవులకు మధ్య జరిగిన యుద్ధములో శ్రీకృష్ణుడు రథసారథ్యము వహించాడు. యుద్ధప్రారంభములో అర్జునుడు మోహగుణము చేత అక్కడున్న వారందరు తనవారని, వారిని చంపుట చేత పాపము కూడ వచ్చునని, చింతించి నిశ్చేష్ఠుడు కాగ అపుడు శ్రీకృష్ణుడు మాట్లాడుచు యుద్ధము చేయకపోతే మొదట వారు నిన్ను పౌరుషము లేనివానిగా లెక్కింతురని, యుద్ధము చేసి వీరుడవనిపించుకోమని, ప్రపంచ సంబంధ వచనములే చెప్పగ అర్జునుడు యుద్ధము చేయుటకు ఉత్సాహములేదని, ఏమి తోచని స్థితిలో ఉన్నానని, నన్ను శిష్యునిగ తలచి నీవు శాసించి ఏమి చేయాలో చెప్పమని అడిగినపుడు శ్రీకృష్ణుడు తన గీతను మొదలు పెట్టిచెప్పాడు. ఏ వస్తువైన అవసరమైనపుడు లభిస్తే దానికి విలువ ఉంటుంది. అవసరములేనపుడు ఆ వస్తువును అంతగ లెక్కించము. అలాగే అర్జుననికి అవసరమైనపుడు గీతను చెప్పుటవలన దానికి విలువ ఉంటుంది. అలా అవసరము లేనపుడు చెప్పితే గుడాకేశుడు (నిద్రను జయించినవాడు) అని పేరుగాంచిన అర్జునుడు కూడ ఆవులించి నిద్రపోగలడని తలచిన శ్రీకృష్ణుడు తన జ్ఞానమును అర్జునుడు అడుగు వరకు చెప్పలేదు. అలాగే ఈనాటి మానవుడు కూడ తనకు జ్ఞానము

అవసరమని తెలియనంత వరకు గీతను గూర్చి చెప్పిన తెలియలేదు. ఎప్పుడో ఒకప్పుడు అర్జునునికి కల్గిన అనుభూతివలే మనకు పాపపుభీతి ఏర్పడినపుడు అర్జునునికి అవసరమైన గీతయే మనకు కూడ అవసరమగును. పాపభీతి ఇప్పటి మానవునికి ఎక్కడ కనిపించడము లేదు. అందువలన శ్రీకృష్ణుడు ఏమి చెప్పాడన్నది వీరికి అవసరములేకున్నది. నేటి మానవునికి కష్టభీతి తప్ప పాపభీతిలేదు. కష్టము లెలా పోతాయను ఆలోచన తప్ప, కష్టములకు కారణమైన పాపమెలా పోతుందని యోచించడము లేదు. కష్టములకు కారణమైన పాపమును గూర్చి యోచించిక కేవలము కష్టనివారణ ఉపాయములే వెదుకుచున్నాడు. అలాంటి సమయములో దారి చూపి ఇది మీకష్టములకు కారణమని తెలియజేయాల్సిన వారు గురువులు. నేటి కాలములో గురువులు కూడ జ్ఞానమను అగ్ని చేత పాపకర్మలు కాలిపోవునని. అపుడు కష్టముల నుండి బయట పడగలరని చెప్పక కష్టనివారణకు ఈ ప్రదక్షిణలు చేయమనో, ఈ యజ్ఞములు చేయమనో, దానములు చేయమనో లేక పూజలు చేయమనో చెప్పుచున్నారు. దాని వలన తాత్కాలిక కష్టనివారణ కోసమే మానవుడు మ్రొక్కడమో లేక యజ్ఞయాగాది దానములు చేయడమో జరుగుచున్నది. అలాంటపుడు గీత యొక్క ఆవశ్యకత ఎంతటిదని తెలియకపోయినది. ఒకవేళ ఎక్కడైన గీతను చదవడముంటే అది కూడ ఫలానా లాభమువచ్చునను ఉద్ధేశ్యముతోనే చదువుచున్నారు తప్ప దీనివలన జ్ఞానమెంతో తెలియునని, జ్ఞానము వలన కర్మ నుండి బయటపడి ముక్తి పొందవచ్చునను ఉద్ధేశ్యముతో చదవడము లేదు. ఒకరకముగ చెప్పాలంటే గీత కొన్ని గ్రామములలో ఎక్కువగ ప్రచారములోనికి వచ్చినది. గీతామందిరములు కట్టించుకొని అక్కడ గీతను పెట్టుకొన్నారు. అటువంటి చోట కూడ గీతాశ్రవణమని వినేదానికి పోవుచున్నారు తప్ప, అందులో సారాంశమేమని గ్రహించడానికి పోవడము లేదు.

ఇటువంటి కాలములో కూడ గీత అంటే ఏమిటి? గీతా సారాంశమేమిటని యోచించు వారు కూడ అక్కడక్కడ గలరు. అటువంటి వారికి ఇంతవరకున్న గీత

భావములలో ఎన్నో లోపములు కనిపించగ  వాటి నిజస్వరూపమేమిటని అన్వేషిస్తున్నారు.  అలా గీత నిజస్వరూపమేమిటో తెలుసుకోవాలను తపనకల్గిన వారున్నారని, వారి కోసమే ఈ గీత బయల్పడుచున్నదని,  అటువంటి వారికి ఎన్నో తెలియని రహస్యములను తెలియజేస్తు **త్రైత సిద్ధాంత భగవద్గీత** ముందుకు సాగిపోగలదని  భావిస్తున్నాము.

మానవ శరీరములో పేరుగాంచిన గుణములు కామ, క్రోధ, లోభ, మోహ, మద, మత్సరములనునవి ఉన్నవి.  కామమనగ ఆశ, క్రోధమనగ కోపము, లోభమనగ పిసినారి తనము, మోహమనగ నాది నావారను భావము,  మదమనగ గర్వము,  మత్సరమనగ  అసూయ అని చెప్పుకోవచ్చును.  అలాంటి గుణముల చేత సర్వమానవులు కదిలింపబడి పనులు చేయుచుందురు.  భూమి మీద ఏ జీవరాసియైనప్పటికి గుణముల వలననే కదలి కార్యములు చేయుచున్నవి. ఈ పద్ధతి ప్రకారము అర్జునుడు యుద్ధము చేయననుకొనుటకు కారణమైన గుణము మోహగుణము.  మొదట ఆశ, కోపము యుద్ధమునకు ప్రేరేపింపగ తర్వాత మోహగుణము వలన వీరు నావారు వీరినెట్లు చంపగలననుకొన్నాడు.  ఈ విధముగ గుణముల మధ్య అశాంతి ప్రతి జీవునికి ఏర్పడుచున్నది. అర్జుననకేర్పడిన మోహగుణమును  బుద్ధి యోచించి వీరిని చంపుట వలన పాపమొచ్చునని సంకల్పము పుట్టించగ  అదే అదునని శ్రీకృష్ణుడు గీతను చెప్పాడు.  అర్జుననికేర్పడినట్లు గుణముల మధ్య మానవునికి అశాంతి ఏర్పడి  పాపమను భావమొచ్చినప్పటికి  శ్రీకృష్ణునిలాగ వెంటనే చెప్పు గురువులేనందున మానవుడు వివరము తెలియక అశాంతిలోనే మునిగిపోవుచున్నాడు.  అర్జుననికి కల్గినట్లు ప్రతి మానవునికి గుణముల వలన బాధకల్గుచునే ఉన్నది.  ఒక గుణమొక వైపుకు లాగితే మరియొక గుణము ఇంకొక ప్రక్క లాగుచుండును.  గుణముల మధ్య చిక్కి నలుగుచున్న మానవునికి అశాంతి కలదు. కావున శ్రీకృష్ణుని గీత అర్జుననికొక్కనికే కాక  గుణములున్న జీవరాసులందరికి అవసరమే. శ్రీకృష్ణుడు చెప్పినది అర్జుననకేనని తలచవద్దండి.  గుణప్రభావములో

చిక్కిన అందరికి వర్తించునదిగ తలచి, ప్రతి ఒక్కరు గీత తన నిమిత్తమే చెప్పారని తలచి చదవాలి. ఇపుడు ఇక్కడ వ్రాసిన గీత అర్జునునికేననుకోక శ్రీకృష్ణుడు నీకే చెప్పుచున్నాడను భావముతో శ్రద్ధగా చదవండి.

భగవద్గీత శ్రీ భగవానువాచతో మొదలైనది. శ్రీకృష్ణుడు పల్కిన పలుకులను భగవానువాచ అనడమెందుకు? శ్రీకృష్ణ ఉవాచ అని ఎందుకనలేదను సంశయము కొందరికుండవచ్చును. దానికి మా సమాధానము ఏమనగా! శ్రీకృష్ణుడు అందరిలాంటి మానవుడు కాదు. అతను అందరిలాగ జన్మించలేదు. ఈ ప్రపంచమంతయు ఏ శక్తి ఆధారముతో నిలచి ఉన్నదో, ఆకాశములో సూర్యచంద్ర నక్షత్ర గోళములు ఏ శక్తి ఆధారముతో తమ గమ్యములు తప్పక తేలియాడుచున్నవో, అణువణువున ఏ శక్తి దైవముగ నిలచి అధిపతిగనున్నదో, భూమి మీద గల అన్నిమతములకు ఏ శక్తి దేవునిగ ఉన్నదో ఆ శక్తియే ఒక మానవునిగ వచ్చిన జన్మ శ్రీకృష్ణునిది. శ్రీకృష్ణుడు భగము నుండి పుట్టినవాడు కనుక భగవంతుడను పేరువచ్చినది. భగమనగ స్త్రీయొక్క యోని భాగమని అర్థము. అలాంటపుడు మనము కూడ తల్లి భగము నుండియే పుట్టాము కదా! మనమంతా భగవంతులమేనా? అను ప్రశ్నరాగలదు. ఇక్కడున్న అందరికి తెలియని సత్యమేమిటంటే **మనమందరము భగము నుండి పుట్టలేదు**. ఈ మాట చాలామందికి ఆశ్చర్యమును కలుగజేయును. ఇందులో సత్యము తెలిస్తే ఆశ్చర్యపడవలసినదేమి లేదు. భగము నుండి మన శరీరములు పుట్టినవి, కాని జీవాత్మలమైన మనము పుట్టలేదు. శిశు శరీరము భగము నుంచి బయటికి వచ్చిన తర్వాత కొంతసేపటికి అనగ ఐదు నిమిషములకో, పది నిమిషములకో, అరగంటకో, లేక గంటకో ఎక్కడో శరీరమును వదలిన మనము శిశు శరీరములో చేరి అరచుచున్నాము. ఒకచోట మరణించిన జీవుడు గుణములు పాపపుణ్యములతో కూడివచ్చి నిర్ణయింపబడి సిద్ధముగ బయటికి వచ్చియున్న క్రొత్త శరీరములో ప్రవేశిస్తున్నాడు. సర్వవ్యాపియైన పరమాత్మ మనమాదిరి ఒకచోట మరణించి మరియొక చోటికి పోనవసరము లేదు. ఆయన శరీరము ధరించి మాట్లాడి ధర్మములు తెలియజేయాలనుకొన్నపుడు స్త్రీ శరీరములోను, గర్భమందు,

గర్భస్థ శిశువునందు, సర్వము వ్యాపించి ఉన్నాడు కనుక శిశుశరీరముతో సజీవముగ పుట్టుచున్నాడు. అందువలన ఆయన ఒక్కడే భగవంతుడగును. సర్వవ్యాపి, సర్వము తానైనవాడు మరియొక దాని ప్రమేయము లేకుండ పుట్టగలడు. ***"స్వయంభు" అయిన పరమాత్మ పుట్టవలసి వచ్చినపుడు శిశుశరీరము తయారగుటకు పురుష వీర్యకణములతో కూడ పనిలేదు. కనుక సర్వవ్యాపియైన వాడు కన్యగర్భము నుండియైన పుట్టిరాగలడు. ఖుద్ అనగా తనకు తానుగ పుట్టువాడు ఖుదా అగును. ఖుదాయైన పరమాత్మ సజీవముగ పుట్టిన శరీరమునకు శ్రీకృష్ణ అను పేరు పెట్టారు. కావున శ్రీకృష్ణుడు భగవంతుడు, ఆయన చెప్పినదే భగవద్గీత.***

ధర్మములంటే ఏమిటో తెలియకుండపోయి అధర్మములు మానవులందు ఎక్కువైనప్పుడు ఉద్భవించి, ధర్మముల గూర్చి తెలియజేస్తానని గీతయందు భగవంతుడు తెల్పాడు. ఆ మాట ప్రకారము ద్వాపరయుగ అంత్యములో భగవంతుడు పుట్టాడంటే అపుడు ధర్మములకు ముప్పు ఏర్పడి అధర్మములు చెలరేగి ఉన్నవన్నమాట. ఇక్కడ కొందరికి ఒక అనుమానము రావచ్చును. ద్వాపరయుగ అంత్యములో వ్యాసుడు, భీష్ముడు, మొదలైన ఎందరో గొప్పవారుండెడి వారు గదా! ఆ సమయములోనే ధర్మములకు ముప్పు ఏర్పడినదా? అన్నది ప్రశ్న. దానికి జవాబు ఏమనగా! ఆనాడు తపస్సులు, యజ్ఞయాగాదులు, వ్రతక్రతువులు ఎక్కువగ ఉండెడివి. వాస్తవిక ధర్మములు తెలియని కారణమున ఆనాటి ప్రజలలో భక్తియనునది ఉన్నప్పటికి అది బాహ్య దేవతారాధనల మీద ఉండెడిది. అంతర్ముఖ ఆధ్యాత్మికము మీద ఏమాత్రము లేకుండెడిది. ఎందరో ఋషులున్నను వారంతయు దేవతల మీద దృష్టినుంచి తామేదో పొందవలెనను తపన తప్ప, యోగమేమిటో తెలియకుండిరి. ఎంతటి గొప్ప ఋషులైన పుణ్యమొచ్చు సత్కార్యములు తప్ప, పుణ్యమంటని కార్యవిధానము తెలియకుండిరి. నీతి తప్ప జ్ఞానము తెలియని ఆ కాలములో, న్యాయము తప్ప, ధర్మము తెలియని అటువంటి సమయములో భగవంతుడు ఉద్భవించాడు. ఆ భగవంతుడు చెప్పినదే భగవద్గీత. గీత భగవంతుని ద్వార

బోధింపబడినది. భగవంతుడు గీతను శాశ్వతముగ వుండునట్లు గీచిపోయినప్పటికి ఆ హద్దులోని ఆధ్మాత్మికరూపమును అజ్ఞానమను గ్రుడ్డితనముతో మానవుడు సరిగ చూడలేక పోయాడు. ఇవి ధర్మములని గుర్తించలేక పోయాడు. ఇది ఆధ్యాత్మికమని బోధించుటకు మానవులైన కొందరు గురువులుగ బయలుదేరినప్పటికి, వారియందు మాయ తిష్ఠవేసి ఆధ్యాత్మికమునే బోధించునట్లు భ్రమింపజేసి, వారిచేత అధర్మములనే బోధింపచేసింది. పరమాత్మ చేత సృష్ఠింపబడిన మాయ, పరమాత్మకు వ్యతిరిక్తముగ బోధించునట్లు మరియు వర్తించునట్లు చేయుట దాని కర్తవ్యము. కావున మానవుల శరీరములలో గుణములందు ఇమిడియుండి, ఎవరు గుర్తించలేనట్లున్న మాయ మానవులను సులభముగ తనవైపు నడిపించుకొనుచున్నది. ఎందరో గురువులను సహితము భ్రమింపజేసి, పరమాత్మ యొక్క విధానమును గాని, పరమాత్మ ధర్మములను గాని, గుర్తించకుండునట్లు చేసి, వారు చేయుచున్నది మరియు వారు చెప్పుచున్నది పరమాత్మ జ్ఞానమేనన్నట్లు తలపింప జేయుచున్నది. అందువలన ఎందరో మహానుభావులు కూడ ఆధ్యాత్మికములో పరమాత్మ చెప్పినట్లు కాక, కొద్దిగ ప్రక్క మార్గములో పోయారనియే చెప్పవచ్చును.

తెలిసినవారు కూడ ముఖ్యమైన ధర్మములవద్ద పొరబడునట్లు మాయ చేసినది. ప్రజలకు జ్ఞానమును బోధించు బోధకుల చేతనే ప్రక్కదారిని బోధించునట్లు చేయుచున్నది. ఉదాహరణకు ఒక విషయమును చూస్తాము. ఒక సినిమా శతదినోత్సవ సభలో ఒక స్వామి ఉపన్యశిస్తు, డైరెక్టరు గొప్పపని చేశాడని చెప్పుచు, "ఈ సినిమా దర్శకుడు ఒక గొప్ప యోగియై ఎంతో తపస్సు చేసి చిత్రమును తయారు చేశాడు. ఈ సినిమాపట్ల ఆయన చేసిన తపస్సుకు మెచ్చుకోవలసిందే" అన్నారు. ఇక్కడ సినిమా దర్శకుడుపడిన శ్రమను తపస్సుగ పోల్చి చెప్పడమే కాక అతనినే యోగి అనడము కూడ జరిగినది. దీనిని బట్టి చూస్తే ఆయన ఉపన్యాసములో యోగి, తపస్వి ఇద్దరు ఒకరేనని తెలియుచున్నది. ఇది ఒక సంఘటనకాగా మరియొక విషయమును చూస్తాము. ఒక స్వామిని ఒక పట్టణమునకు అక్కడి ప్రజలు ఆహ్వానించారు. ముందుగానే ఆ విషయమును

ప్రజలకు తెలియజేయుటకు, అందరిని స్వామిగారి దర్శనార్థమురమ్మని చెప్పుటకు ఒక ఆహ్వాన పత్రికను అచ్చువేయించి పంచిపెట్టారు. ఆ ఆహ్వానపత్రికను అచ్చువేసిన వారు ఆధ్యాత్మికవిద్యను బాగా తెలిసినవారే. వారు అచ్చు వేయించిన పత్రికలో సమాచారము ఈ విధముగ గలదు. "ద్వాదశ సంవత్సరములు రుద్ర భూమినందు తపమాచరించి యోగిగ మారిన శ్రీశ్రీశ్రీ బాలభారతి యోగి గారు మన పట్టణమునకు విచ్చేయుచున్నారు. భక్తులందరు విచ్చేసి దర్శనము చేసుకోవలసిందని కోరుచున్నాము" అని వ్రాశారు. ఇక్కడ కూడ పండ్రెండు సంవత్సరములు స్మశానములో తపస్సు చేసిన తపస్విని యోగి అన్నారు. "తపము చేసి యోగిగ మారిన" అన్నారు. ఈ విషయమును వ్రాసిన వారు గొప్ప తత్త్వవేత్తలే అయినప్పటికి తపస్సుకు యోగమునకు భేదము తెలియలేక పోయారు. తపము చేసిన వానిని యోగిగ, యోగము చేసిన వానిని తపస్విగ చెప్పుకొనుట వలన భగవద్గీతలో దేవుడు చెప్పిన ధర్మములకే ముప్పు ఏర్పడగలదు. ధర్మములకు గ్లాని ఏర్పడినదని ధర్మములను కాపాడుట కొరకు దేవుడే దిగివచ్చి "**తపస్విభ్యోధికో యోగి**" అని చెప్పినప్పటికి, యోగమునకున్న గొప్పతనమును తెలియక తపస్వికులను, యోగులను ఒకటే అనుకోవడము పొరపాటు కాదా! దేవుడు చెప్పిన ధర్మమునకు వ్యతిరేఖముగ చెప్పినవారము కాదా! దేవుని ధర్మమునకు ముప్పు కల్గించినవారమై, దేవుని మాటకు విలువ లేకుండ చేసిన వారమగుదుము కదా!

ఎంతో చిన్న జ్ఞానమును కూడ గ్రహించలేక, ఎంతో పెద్ద స్వాములు కూడ పొరబడడము విచిత్రముగ నున్నది కదా! ఇప్పటికి కూడ నూటికి తొంభైమందికి తపస్సు వేరు, యోగము వేరని తెలియక పోవడము విచిత్రముగానే ఉన్నది. చాలా పురాణములలో తపస్సును యోగమును రెండిటిని ఒకటిగానే చెప్పుకొన్నారు. ఒక మహర్షి అడవిలో కూర్చొని తపస్సు చేయుచుండగ అతని యోగదీక్షకుమెచ్చి ఇంద్రుడు ప్రత్యక్షమయ్యాడని ఒక పుస్తకములో వ్రాసియున్నది. అలాగే ఒక రాజు యోగము చేయుచుండగ అతని తపస్సుకుమెచ్చి బ్రహ్మదేవుడే ప్రత్యక్షమయ్యాడని మరొక పుస్తకములో వ్రాశారు. ఈ వ్రాతలుగాని, కొందరి బోధలుగాని భగవద్గీతలోని

ఆత్మసంయమ యోగము 46వ శ్లోకములో **"తపస్విభ్యోధికో యోగీ"** అను మాటకు వ్యతిరిక్త ధోరణిలో గలవు. మాయ జ్ఞానులను కూడ దేవుని మాటకు వ్యతిరేకులుగ చేయగలదు. అందువలన శాస్త్రమును ఆధారము చేసుకొని జ్ఞానమార్గములోనే నడువవలెను. అట్లు కాకపోతే దారి తప్పు ప్రమాదము గలదు.

నేటి కాలములో ఎందరో గురువులుగ పేరుగాంచినవారున్నారు. వారిలో స్వచ్ఛమైన జ్ఞాన వివరములుకాక పురాణ ఇతిహాసములైన భారత భాగవత రామాయణ కథలను చెప్పుకొను గురువులను వదిలివేసి, ఆత్మ వివరమును తెలుపునట్టి జగత్ గురువులను సహితము చూచిన ఎడల వారియందు కూడ కొంత మాయ పనిచేసినదనియే చెప్పవచ్చును. ఉదాహరణకు అద్వైత సిద్ధాంతమును ప్రచారము చేసినవారున్నారు. మరియు ద్వైత సిద్ధాంతమును ప్రచారము చేసిన వారు కూడ ఉన్నారు. పీఠాధిపతులై గొప్ప గురువులమని పేరుగాంచిన వారే ఒకరి సిద్ధాంతమును మరొకరు ఒప్పుకోక ద్వైతము సరియైనదికాదని అద్వైతులు, అద్వైతము సరియైనదికాదని ద్వైతుల యొక్క వాదన. ఆలోచించి చూచినట్లయితే ఒకరిది సరియైన సిద్ధాంతమైతే మరియొకరిది తప్పు సిద్ధాంతమగును కదా! అందువలన సిద్ధాంతములనే బయల్పరచిన గురువులవద్ద కూడ మాయ పనిచేసినదనియే చెప్పవచ్చును.

సిద్ధాంతమనునది ఎప్పటికి మారునది కాకుండాలి, మరియు అసత్యమైనది కాకుండాలి. ఇంకనూ వివరము చెప్పుకుంటే సిద్ధి అనగా ప్రాప్తించునది, సిద్ధించునది, అనుభవానికివచ్చునదని అర్థము. అనుభవానికివచ్చు విషయము తెల్పువాడు సిద్ధాంతియగును. శాసనములతో కూడుకొన్నది శాస్త్రము. శాసనము సిద్ధాంతము రెండు ఒకటే. శాస్త్రము తెలుపువాడు శాస్త్రియని, సిద్ధాంతములను తెల్పువాడు సిద్ధాంతియని పూర్వమనెడివారు. చిన్న చిన్న శాసనములతో కూడుకొన్నదే ఒక సిద్ధాంతమగును. దీని ప్రకారము అన్ని విద్యలకంటే గొప్ప విద్యయైన ఆధ్యాత్మికము శాసనపరమైన సిద్ధాంతరూపముగ ఉండాలి. అలాగే జగత్ గురువులుగ పేరుగాంచిన

శంకరాచార్యులవారు అద్వైత సిద్ధాంతమును, మద్వాచార్యుల వారు ద్వైత సిద్ధాంతమును ప్రచారము చేశారు. ఇవి ఒకదానికొకటి భిన్నముగ ఉండుట వలన ఏది సత్యము, ఏది అసత్యమని పరికించి చూడవలసియున్నది. వాటి వ్యత్యాసములు వాటిలోని సత్యాసత్యములు తెలుసుకొనుటకు ప్రమాణముగ పెట్టుకొని చూడవలసినది **భగవంతుడు చెప్పిన భగవద్గీతయే.**

బ్రహ్మవిద్యకు ప్రమాణ గ్రంథమైన భగవద్గీత నూటికి నూరు పాళ్లు శాస్త్రబద్ధమైన సిద్ధాంతములతో కూడుకొని ఉన్నది. పరమాత్మ స్వయముగ తెల్పిన భగవద్గీత ప్రకారము చూచిన ఎడల పరమాత్మ జీవాత్మలను రెండు లేవని పరమాత్మ ఒక్కటే గలదను అద్వైతము, జీవాత్మ పరమాత్మలు రెండు ఉన్నాయను ద్వైతము, రెండునూ గీతకు కొద్దిగ ప్రక్కమార్గములో ఉన్నాయని తెలియుచున్నది. అనగ పూర్తి సరియైన సిద్ధాంతములుకావని అర్థమగుచున్నది. గీతను ప్రమాణముగ పెట్టుకొని చూచినట్లయితే మానవమాత్రులైన గురువులు చెప్పిన ద్వైత, అద్వైత సిద్ధాంతములు రెండును హేతుబద్ధముగ లేవు. ద్వైత సిద్ధాంతమును పరిశీలించి చూచినట్లయితే భూమి మీద వేర్లు లేకుండ చెట్టున్నదనుట ఎంత సత్యమో అంతే సత్యముగనున్నట్లు తెలియుచున్నది. అట్లే అద్వైత సిద్ధాంతమును పరిశీలించితే భూమి వేర్లు రెండు లేకుండానే చెట్టున్నదనుట ఎంత సత్యమో అంతే సత్యమగును. అనగ రెండు సిద్ధాంతములు అశాస్త్రీయముగనున్నవని, హేతుబద్ధముగలేవని తెలియుచున్నది. ***ఈ రెండు సిద్ధాంతములు అశాస్త్రీయము అహేతుకమనుటకు గీతలోని పురుషోత్తమప్రాప్తి యోగమందు గల 16,17వ శ్లోకములే ఆధారము. ఈ రెండు శ్లోకములు ద్వైత అద్వైత సిద్ధాంతముల రెండిటిని ఒక్క వేటుతో కొట్టిపారవేయుచున్నవి. ఈ రెండు శ్లోకములే అసలైన ఆధ్యాత్మిక సిద్ధాంతమైన త్రైత సిద్ధాంతమును బోధిస్తున్నవి. ఈ రెండు శ్లోకములే కాక గీత యొక్క సారాంశమంతయు త్రైతము మీదనే బోధింపబడియున్నది.*** కలియుగములో ద్వైత, అద్వైత సిద్ధాంతములు బయటికి రాగ, ద్వాపరయుగ అంత్యములోనే త్రైత సిద్ధాంతము భగవంతుని చేత బోధింపబడి ఉన్నది. అయినప్పటికి మాయా ప్రభావము చేత

త్రైతము అర్థము కాకపోయినది. మాయా ప్రభావము చేతనే ద్వైత, అద్వైతములు బయల్పడినవి. ఇప్పటికి ద్వైత, అద్వైత గురుపరంపరలైన మద్వాచార్య, శంకరాచార్య పీఠములు భూమి మీద గలవు. **త్రైతమను పేరుగాని దానిని బోధించువారుగాని లేకుండపోయారు. ఇట్టి పరిస్థితులలో త్రైతము బయటికి రావడము మన అదృష్టమని తెలియాలి. త్రైతము ప్రకారమే భగవద్గీత, భగవద్గీత ప్రకారమే త్రైతము గలదు.** మనము ఇక్కడ క్రొత్తగ చెప్పుకొనుచున్న త్రైత సిద్ధాంతమును గురించి కొద్దిగ వివరించుకొందాము.

*పరమాత్మ తప్ప రెండవది లేదనుట అద్వైతము, పరమాత్మ జీవాత్మ రెండు కలవనుట ద్వైతము. పరమాత్మ జీవాత్మకు మధ్యలో ఆత్మగలదని మూడింటిని గూర్చి తెల్పునది త్రైతము.* ఏ విధముగ భూమికి చెట్టుకు మధ్యలో కనిపించకుండ వేర్లున్నవో, అట్లే పరమాత్మకు జీవాత్మకు మధ్యలో ఆత్మగలదు. భూమికి చెట్టుకు మధ్యలో వేర్లు ఎంత ప్రాముఖ్యత వహించియున్నవో, అట్లే పరమాత్మకు జీవాత్మకు మధ్యలో ఆత్మ ప్రాముఖ్యత వహించియున్నది. పరమాత్మ సర్వవ్యాపి, అనంతముకాగ ఆత్మ శరీరమంత వ్యాపించి శరీరములో ఒక్క స్థానములో గల జీవాత్మ యొక్క జీవనాన్ని సాగిస్తున్నది. వేర్లు లేకపోతే చెట్టు ఎలా లేదో అలాగే ఆత్మ లేకపోతే జీవాత్మయే ఉండదు. భూమి మీద చెట్టు ఎక్కడున్న దానికి తప్పని సరిగ వేర్లు అనుసంధానమైవుండి చెట్టు జీవనాన్ని సాగించుటకు ఆధారమై ఎట్లున్నవో, అట్లే పరమాత్మ వ్యాపించిన జగతిలో జీవాత్మ ఎక్కడున్నా ఆత్మ అనుసంధానమైవుండి జీవాత్మ జీవనాన్ని సాగించుటకు ఆధారమైవున్నది. ***జగతిలో పరమాత్మ, ఆత్మ, జీవాత్మలేని ఆధ్యాత్మికమే లేదు. ఈ విషయమునే వివరిస్తు క్షరుడని జీవాత్మను, అక్షరుడని ఆత్మను, పురుషోత్తముడని పరమాత్మను గీతలో బోధించారు. జీవాత్మ ఆత్మలు రెండు కూటస్థముగ కలిసి ఉన్నాయని, వాటికతీతముగ పరమాత్మ ఉన్నదని, జీవాత్మ ఆత్మలను ఇద్దరి పురుషులకంటే అతీతముగనున్న పరమాత్మ పురుషోత్తముడని చెప్పబడియున్నది.*** ఈ విషయము బ్రహ్మవిద్యా శాస్త్రమైన గీతలో పరమాత్మ మాటల రూపముగ చెప్పడమే

కాక ప్రతి మానవుడు ఈ విషయము తెలుసుకొనునట్లు, ప్రతి మానవుని హస్తములో జీవాత్మ, ఆత్మ, పరమాత్మల గుర్తుగ మూడు రేఖలు ముద్రించి పెట్టాడు. ప్రతి మనిషి హస్తములోను మూడురేఖలు ముఖ్యముగ ఉండును. వాటిలో రెండు క్రింది రేఖలకొనలు ఒకదానితో ఒకటి కలిసియుండును. పై రేఖ ఒకటి మాత్రము ప్రత్యేకముగ ఉండడము గమనించవచ్చును. కలిసియున్న రెండు రేఖలు జీవాత్మ, ఆత్మలకు ప్రతీకలుకాగ ప్రత్యేకముగ పైన ఉన్న రేఖ మాత్రము పరమాత్మకు గుర్తుగవున్నది. ఇది ప్రతి హస్తములో ఉండగ గురువులుగ ఉన్నవారు కూడ దీనిని గమనించలేదంటే, మాయ యొక్క ప్రభావమెంత ఎక్కువగ ఉన్నదో అర్థము చేసుకొనవచ్చును. సృష్ఠి ఆదియందే మానవుని అరచేతిలో మూడు ఆత్మల రహస్యముంచిన పరమాత్మ ద్వాపరయుగ అంత్యములో కూడ అదే విషయమునే గీతలో చెప్పాడు. చేతిలో పెట్టినా, నోటితోచెప్పినా, మానవుడు గ్రహించలేక పోతున్నాడని పూర్వము తెలిసిన పెద్దలు పురుషున్ని సూచించు లింగాకృతిని దేవాలయములందు ప్రతిష్ఠించి గీతలో చెప్పినట్లు ***జీవాత్మ, ఆత్మ, పరమాత్మలుగ, పురుషుడు మూడు భాగములై ఉన్నాడని తెలియునట్లు, మూడు విభూతి రేఖలు లింగము మీద తీర్చిదిద్దారు. మూడు ఆత్మల విషయము ప్రతి ఈశ్వర దేవాలయములోను ఉండునట్లు చేశారు.*** కాని కాలక్రమమున ధర్మమేనాడో అధర్మముగ మారిపోయి ఈశ్వర దేవాలయము కడకు మెడలో పామున్న శివుని ఆలయముగ లెక్కించబడుచున్నది. ఈశ్వరుడనగా అధిపతియను అర్థము పోయి ఈశ్వరుడే శంకరుడను పెడార్థము మిగిలిపోయినది. ఆదియందు స్వచ్ఛముగనున్న లింగమొకటే ఉన్న ఈశ్వరాలయములో తర్వాత లింగము ప్రక్కన పార్వతి, ఎదురుగ నందిని ప్రతిష్ఠించారు. ఇలా చివరకు ఈశ్వరాలయము శంకరాలయముగ మారి శైవుల దేవాలయమైనది. ఇలా మూడు విభూతి రేఖల అర్థమైన ఆత్మల గుర్తింపు మారిపోయినప్పటికి అసలు సత్యము స్థిరముగనుండునట్లు మన పెద్దలు ఒక నియమమును ఉంచారు. అదేమనగా ప్రతిరోజు ఉదయము నిద్రలేస్తూనే ఎవరి ముఖము కూడ చూడకుండ మొట్టమొదట తన అరచేతిని చూడాలని చెప్పారు.

లేస్తూనే అరచేతిని చూచుట వలన మూడు రేఖలు కనిపిస్తాయని, ఎప్పటికైన వాటిని గురించి ఆలోచించరా! అని వారి భావమై ఉండవచ్చును. ఈ ఆచారము ఈ కాలములో ఎక్కడైన మిగిలి ఉన్నప్పటికి అర్థము తెలుసుకోలేక పోవుచున్నారు. అరచేతిలోనే మూడు ఆత్మలున్నాయని, అరచేతిలోనే అంతా ఉన్నదని, అరచేతిలోనే వైకుంఠముందని, అరచేతిలోనే త్రైత సిద్ధాంతమున్నదను అర్థముతో, ఏ మతములోని వాడైన నా అభిమతములోనే ఉన్నాడని పరమాత్మ మానవుల చేతిలో మూడు రేఖలు అమర్చాడు.

చేతిలోని మూడురేఖలే శరీరములోని మూడు ఆత్మలని, శరీరములోని మూడు ఆత్మలనే త్రైతము అంటున్నామని, త్రైతమును తెల్పునదే త్రైత సిద్ధాంత భగవద్గీత అని తెల్పుచున్నాము. త్రైత సిద్ధాంతము ముఖ్యముగ మూడు ఆత్మల వివరమును గురించి చెప్పుచు పోయినది. త్రైతమనిన, మూడు ఆత్మలనిన చదువు వారికి క్రొత్తగ ఉండును. కావున ముందే గీతా పరిచయమును చూడవలసిన ఆవశ్యకత గలదు. ఎందుకనగా ఒక క్రొత్తవానిని మనము నేరుగ పలకరించలేము. వానితో స్నేహము చేయలేము. క్రొత్త వ్యక్తిని పరిచయము చేయడానికి మొదట ఒక మధ్యవర్తి ఉంటే వానితో సులభముగ పరిచయము ఏర్పడగలదు. మధ్యవర్తి యొక్క తెలివినిబట్టి, వాడు తెలిపే దానినిబట్టి, క్రొత్తవాని విషయమంతా మనకు ముందే అవగాహన కాగలదు. ఆ తర్వాత వానితో సులభముగ కలసిమెలసి పోవచ్చును. అలాగే త్రైత సిద్ధాంత భగవద్గీతలోని సారాంశము తెలియాలంటే, దాని అవగాహన కావాలంటే, ముందు గీతాపరిచయమను మధ్యవర్తి కావలసిందే. గీతాపరిచయమును చదివిన తర్వాత త్రైత సిద్ధాంత భగవద్గీత అను సరిక్రొత్త గీత అర్థము కాగలదు. ఈ గీతాపరిచయము మిమ్ములను త్రైతముతో పరిచయము చేయించి, త్రైతమంటే ఏమిటో తెలుపగలదు. గీతాపరిచయమును చదివిన తర్వాత మాచే రచింపబడిన **త్రైత సిద్ధాంత భగవద్గీతను** చదవగలరని కోరుచున్నాము.

*ఈ ▭ బాక్స్‌లో గల శ్లోకముల భావము పూర్తిగ మార్చి వ్రాయబడి ఉండును. అందువలన మిక్కిలి యోచనాశక్తిని ఉపయోగించి చదువవలెనని కోరుచున్నాము.*

## భావము మార్చిన శ్లోకములు :-

| | | |
|---|---|---|
| సాంఖ్యయోగములో | - | 11, 19, 22, 23, 24, 45, 47. |
| కర్మయోగములో | - | 9, 21, 24, 35. |
| జ్ఞానయోగములో | - | 5, 6, 7, 8, 13, 17, 33. |
| కర్మ సన్న్యాస యోగములో | - | 6, 18. |
| ఆత్మ సంయమ యోగములో | - | 1, 3, 5, 6, 32, 41. |
| విజ్ఞాన యోగములో | - | 5, 11, 25. |
| అక్షర పరబ్రహ్మ యోగములో | - | 4, 13, 23, 24, 25. |
| రాజవిద్యా రాజగుహ్య యోగములో | - | 13, 22, 24, 25, 26. |
| విభూతి యోగము | - | 6. |
| విశ్వరూప సందర్శన యోగములో | - | 23, 25, 27, 39. |
| క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగములో | - | 2, 6. |
| పురుషోత్తమ ప్రాప్తి యోగములో | - | 2, 14, 15, 16, 17. |
| దైవాసుర సంపద్విభాగ యోగము | - | 7, 8, 9. |
| మోక్ష సన్న్యాస యోగములో | - | 2. |

## మొదటి అధ్యాయము

# సాంఖ్య యోగము

**శ్రీ భగవంతుడిట్లనియె :-**

(1)శ్లో॥ 11 : అశోచ్యా నన్వశోచస్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే ।
గతాసూ నగతా సూంశ్చ నానుశోచన్తి పండితాః ॥
(ప్రకృతి, పరమాత్మ)

భావము : శోకింపతగని వాటిని గూర్చి నీవు శోకించుచున్నావు. మరియు నీ ప్రజ్ఞ (బుద్ధి) నెల్లనుపయోగించి మాట్లాడుచున్నావు. పండితులు గతులు కల్గిన మరియు గతులులేని వాటిని గూర్చి బాధపడరు.

వివరము : బాధపడతగని విషయమును గురించి బాధపడుచున్నావని ప్రత్యేకముగ అన్నపుడు పరోక్షముగ బాధపడవలసిన విషయమును గూర్చి బాధపడలేదని, నిజముగ బాధపడవలసినదేదో ఉన్నదని తెలియుచున్నది. ఇక్కడ వివరముగ శోకింపతగినదేది? శోకింపతగనిదేది? అని యోచించవలసి వస్తున్నది. దేని కోసము శోకింపకూడదో అనగా బాధపడకూడదో దానిని గూర్చి అదే శ్లోకమునందు "గతాసూ నగతాసూంశ్చ" అని చెప్పబడి ఉన్నది. అనగా గతులుగల్గిన, గతులులేని వాటిని గూర్చి నీవు బాధపడుచున్నావు అంటున్నాడు. అపుడు గతులు ఉన్న గతులులేని వాటికంటే వేరు దానిని గూర్చి బాధపడవలసియున్నదని సులభముగ అర్థమగుచున్నది. ఇపుడు ప్రతి మానవుడు తెలియవలసిన వివరము గతులు ఉన్నదేది? గతులు లేనిదేది? గతులు గల మరియు గతులు లేని వాటికంటే వేరుగనున్నదేది? అన్న విషయము ముఖ్యము. ఎందుకనగా ఆ మూడవ దానికోసము మనము బాధపడవలయును.

గతి అనగా ఎన్నో అర్థములు గలవు 1) పోక 2) విధము 3) త్రోవ 4) స్థానము 5) ఆధారము 6) ప్రయాణము 7) ఉపాయము 8) చలనము అని ఇన్ని అర్థములు గలవు. ఇక్కడ సందర్భానుసారముగ భౌతిక అర్థమైన "చలనము" అన్న పదము తీసుకొన్నపుడే శ్రీకృష్ణుని మాటలోని నిజార్థము బయటపడగలదని తెలియవలయును. దాని ప్రకారము చలనము కల్గినవి శరీరముగల సమస్త జీవరాసులున్నవి. అట్లే చలనములేని వస్తుజాలము ప్రపంచములో ఎంతో ఉన్నది. చలనము కల్గిన మానవులు, జంతువులు క్రిమి కీటకాదులు, చలనములేని వస్తువులను మొత్తము కలిపి జ్ఞానము తెలిసిన పెద్దలు "ప్రకృతి" అని పేరు పెట్టారు. చలనము గల చలనములేని ఈ ప్రకృతికంటే వేరైనదొకటున్నది. అదియే 'దైవము'. ఆనాడు అర్జునుడు ప్రకృతిలోని మనుజుల గూర్చియే బాధపడ్డాడు కాని ప్రకృతికి అతీతమైన దైవమును గూర్చి బాధపడలేదు. అందువలననే శ్రీకృష్ణుడు దేనికోసము బాధపడ కూడదో దానికోసమే నీవు బాధపడుచున్నావు అని హెచ్చరించాడు. ఆనాటి అర్జునుడే కాక ఈనాటి ప్రతి మానవుడు ప్రకృతి సంబంధ విషయములకే ప్రాకులాడుచున్నాడు. తాము చదివిన గొప్ప గొప్ప చదువులన్ని ఈ ప్రకృతిలోని విషయముల గురించి యోచించుటకే సరిపెట్టుచున్నాడు. నీ ప్రజ్ఞనెల్ల ప్రకృతి విషయములకే ఉపయోగించి మాట్లాడుచున్నావని అర్జునున్ని శ్రీకృష్ణుడు హెచ్చరించాడు. అంటే మన ప్రజ్ఞను దేవుని వైపు ఉపయోగించలేదని చెప్పకనే తెలియబడుచున్నది. తెలిసిన జ్ఞానులు ప్రకృతి జనితమైన సమస్త వస్తువులను మరియు జీవజాలములను గూర్చి చింతించరని, వారు దైవమును గూర్చియే చింతింతురని, శోకింతురని చెప్పబడి ఉన్నది.

భగవంతుడు తెలియజేసిన మొట్టమొదటి శ్లోకములోనే కనిపించు సమస్త జీవరాసులు ప్రకృతియేయనని. కనిపించని పరమార్థమొకటున్నదని సూచించాడు. అట్లే మనము ప్రతి నిత్యము బాధపడునది, ఏడ్చునది, చింతించునది, ప్రకృతిలోని విషయములకేనని పరమార్థ విషయమునకుకాదని కూడ సూచించాడు. పండితులైన వారు అనగా జ్ఞానము తెలిసినవారు చరాచర ప్రకృతికోసము ఏమాత్రము బాధపడరని తెలియజేశాడు. అట్లే నీవు చలనము కలిగిన, చలనములేని వాటికోసము

నీ ప్రజ్ఞనంత ఉపయోగిస్తున్నావు. అది సరియైన పనికాదని కూడ తెలియజేశాడు. మొదటి శ్లోకములోనే శోకింప తగినవని, శోకింపతగనివని రెండు భాగములు చేసి చూపడము గొప్ప విశేషము. అందులో మన ప్రజ్ఞను ప్రకృతి వైపు వినియోగించక పరమాత్మ వైపు వినియోగించమని సూచించడము మొట్టమొదటి శ్లోకములోని ప్రత్యేకతయని తెలియాలి.

*(చాలామంది వ్రాసిన గీతా గ్రంథములలో ఈ శ్లోకము యొక్క భావమునకు, ఇక్కడ మాచేత వ్రాయబడిన భావమునకు చాలా తేడా ఉన్నది. వారు వ్రాసిన దానిలో కేవలము మానవుల గూర్చి, చనిపోయిన వారిని బ్రతికి ఉన్న వారిని గూర్చి చెప్పియుండగ, మా భావములో మొత్తము ప్రకృతిని గూర్చి, చలనములేని చలనమున్న, జీవములేని జీవమున్న వాటిని గూర్చి చెప్పడము జరిగినది. బ్రతికియున్న, మరణించిన వారిని గూర్చి తెలిసిన వారు చింతింపరని తెలిపితే "వారి మీద మాకేమి బాధలేదు, మాకున్న చింతయంతయు ధనము మీదనే, బ్రతికి ఉన్నవారు ఎట్లున్న ఫరవాలేదు, రుచిలేని తిండి తిన్న ఫరవాలేదు, డబ్బులు మాత్రము ఖర్చుకాకూడదు. బ్రతికినవారు రోగముతో బాధపడుచున్నను ఫరవాలేదు వారిని గూర్చి నాకేమిచింత లేదు. ఆసుపత్రికి పోతే డబ్బ ఖర్చు అవుతుందనేదే నాబాధ" అను వారు గలరు. అట్లే తమవారు చనిపోయిన చింతించరు. అట్లని వీరిని జ్ఞానులందామా! వీరికి డబ్బు బంగారు మీద తప్ప బ్రతికిన, మరణించిన వారి మీద ఏమాత్రము చింత బాధ ఉండదు. పరాయి మగవాడు భార్యను బలవంతము చేసిన, ఆమెకోసము చింతించడు. తన స్వంత కొడుకును ఇతరులు హత్య చేసిన, డబ్బు పోతుందని కేసుపెట్టడు. మిగతా గీతలలో వ్రాయబడిన ఈ శ్లోకార్థము యొక్క ప్రకారమైతే వీరిని పరమ జ్ఞానులని చెప్పవచ్చును. ఇది నిజమాయని యోచించి చూచిన వాడు బంగారు మీద, ధనము మీద ఆశపరుడు తప్ప జ్ఞాని ఏమాత్రము కాదని తెలియుచున్నది. అందువలన ఇంతవరకు అందరు వ్రాసుకున్న భావము సరికాదని చెప్పవచ్చును. )*

గతించిన మరియు గతించని వారిని గూర్చి జ్ఞానులు చింతించరని వ్రాసిన వాక్యములు తప్పు, శ్రీకృష్ణుడు అలా చెప్పలేదు. మనుషులను గూర్చియే చెప్పియుంటే పోయిన వారికొరకుగాని, ఉన్నవారికొరకుగాని చింతించక కేవలము డబ్బు కొరకే చింతించు లోభిని కూడ జ్ఞాని అనవలసివస్తుంది. కావున ఈ శ్లోకములో శ్రీకృష్ణుడు లోతుగ చెప్పిన జ్ఞానమును గ్రహించితే చర అచర ప్రకృతిని గూర్చి జ్ఞానులైనవారు చింతించరని, ప్రకృతికి అతీతమైన దైవమును గూర్చి చింతించువాడు నిజమైన జ్ఞానియని తెలియుచున్నది. ఇంతవరకు ఈ అధ్యాయమున మొదటి శ్లోక అర్థమును అందరికి భిన్నముగ వ్రాశారే అని కొందరనుకోవచ్చును. ఎందరో స్వాములు, పీఠాధిపతులు, యోగులు చెప్పిన భావమును కాదనవచ్చునా? అని కొందరడుగ వచ్చును. అందరికి ఒకే జవాబు చెప్పడమేమనగా! నిజము నిప్పులాంటిది. ఎప్పటికైన బయటపడగలదు. దాచబడిన సత్యమును బహిర్గతము చేయుటయే నాపని అయినపుడు ఒక్క భగవద్గీతయే కాదు, ఏ మతములోని జ్ఞానమునైన విప్పి చెప్పడము నా కర్తవ్యము. ఈ నా కార్యములో భగవద్గీతలో తర్వాత వచ్చు శ్లోకములకు కూడ భావమార్పిడి తప్పకయుంటుంది. ఇది త్రైతము అను సిద్ధాంతము మీద ఆధారపడి వ్రాయునది, కావున శాస్త్రబద్ధమైనదిగ లెక్కించి చూడవలెను. ఈ శ్లోకముగాని, రాబోవు శ్లోకములుగాని హేతువాదులకు ప్రశ్నలు మిగల్చవని అన్నిటికి అందరికి సమాధానమై ఉంటాయని తెలుపుచున్నాము.

ప్రతి శ్లోకము నాలుగు సూత్రముల ప్రకారము చూడవలయునని ముందే చెప్పియున్నాము. వాటిని మరొక్క మారు గుర్తు చేయుచున్నాము. 1) చదువుచున్న శ్లోకము జీవాత్మకా, ఆత్మకా, పరమాత్మకా, ప్రకృతికా, ఎవరిని గూర్చి చెప్పబడినది. 2) చదువుచున్న శ్లోకము బ్రహ్మయోగమునకా లేక కర్మయోగమునకా దేనిని గూర్చి చెప్పబడినది. 3) చదువుచున్న శ్లోకము సాకారమునకా నిరాకారమునకా, ఎవరిని గూర్చి చెప్పబడినది. 4) చదువుచున్న శ్లోకము శాస్త్రబద్ధమైనదా కాదా! అన్నవి సూత్రములైతే నాల్గవసూత్రము ప్రకారము శాస్త్రబద్ధమైన శ్లోకములనే మేము వ్రాస్తు శాస్త్రబద్ధము కాని వాటిని వదలివేయుచున్నాము. కావున మీరు ముఖ్యముగ

చూడవలసినవి మూడు సూత్రములు మాత్రమే. అవి కూడ మీకు అర్థమగునట్లు ఏ శ్లోకము దేనికి సంబంధించినదో శ్లోకము ప్రక్కన బ్రాకెట్‌లో తెలుపుచుందుము. అందువలన శ్లోకము ప్రక్కన బ్రాకెట్‌లో ఉన్న దానిని ప్రతి ఒక్కరు గమనించ వలసినదిగా తెలుపుచున్నాము.

*(1) శ్లో॥ 12 : న త్వేవాహం జాతు నాసం నత్వం నేమే జనాధిపాః ।*
*నచైవ న భవిష్యామ స్సర్వే వయ మతః పరమ్ ॥*
*(జీవాత్మ)*

భావము : నేను లేకుంటిననుట ఎప్పటికీ లేదు. నీవు ఎప్పటికీ ఉందువు. ఈ ధరణి పాలించు రాజులు కూడ ఎప్పటికీ ఉందురు. ఇక ముందు కూడ మనమందరము లేకపోవుటనునదే లేదు.

వివరము : సమస్త జీవరాసులు లేకుండ పోతాయని నీవు బాధపడుచున్నావేమో! ఎవరూ లేకుండా ఎప్పటికీ పోరు. జీవరాసులైన వారు ఎవరైన కాని, నేను కాని, నీవుగాని, ఈ భూమికి రాజులైన వారుగాని, జీవముగల ప్రతి ఒక్కరు లేకుండా పోవుదురనుట అసత్యము. అందరము ఎప్పటికి ఉండగలము అని శ్రీకృష్ణుడన్నపుడు మనకొక ప్రశ్న ఉద్భవించగలదు. మనమంతా కొంతకాలముండి చనిపోవుచున్నాము కదా! అటువంటప్పుడు శాశ్వతముగ ఉంటామని, లేకుండపోవుదుమనుట అసత్యమని ఎలా అనగలము? దానికి సమాధానముగ క్రింది శ్లోకమున ఇలా ఉన్నది.

*(1) శ్లో॥ 13 : దేహినోఽస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా।*
*తథా దేహాన్తర ప్రాప్తి ర్ధీర స్తత్ర న ముహ్యతి ॥*
*(జీవాత్మ)*

భావము : దేహికి దేహమునందు బాల్యము, యవ్వనము, కౌమారము, ముసలి తనము వరుసగ ఎట్లు కల్గునో, అట్లే శరీరమును వదలిపోవడమను మరణము కూడ కల్గుచున్నది.

వివరము : దేహమునందు నివశించు దానిని దేహి అనుచున్నాము. దేహమునందు మూడు ఆత్మలు నివశించుచున్నవి. ఒకటి జీవాత్మ, రెండవది ఆత్మ, మూడవది పరమాత్మ. ఈ మూడింటిని సందర్భానుసారముగ అర్థము చేసుకోవాలి కాని జీవాత్మకు చెప్పినచోట ఆత్మకు, ఆత్మకు చెప్పిన చోట పరమాత్మకు, పరమాత్మకు చెప్పినచోట జీవాత్మకు అర్థము చేసుకోకూడదు. చాలా గీతలలో ఈ శ్లోకము జీవాత్మకు చెప్పినదనుకోక దేహి అనగానే ఆత్మ అనుపదమును ఉపయోగించి చెప్పారు. దేహి అనగానే ఒకటవద లేక రెండవద, మూడవద అని పరికించి చూడడములేదు. ఇటువంటి పొరపాట్లు జరుగునను ఉద్దేశ్యముతోనే మేము ప్రతిశ్లోకము ప్రక్కన బ్రాకెట్‌లో ఆ శ్లోకములో దేనిని గురించి ఉన్నదో దానిని గుర్తించుచున్నాము. అర్జునుడు మానవులైన జీవాత్మలనబడు వారిని గూర్చియే అడిగాడు, దైవస్వరూపమైన ఆత్మను గూర్చి ఆయన అడుగలేదు. అందువలన ఈ శ్లోకమున జీవాత్మను గూర్చి చెప్పడమే జరిగినది.

జీవాత్మ ఒక శరీరము ధరించునపుడు ఆ శరీరమును బట్టి కొంతకాలము బాల్యమంటాము. కొంతకాలము జరుగగా వయస్సు వచ్చిన తరువాత శరీరమందు గల జీవాత్మకుకాక శరీరమునకు యవ్వనము వచ్చును. అట్లే కొంతకాలము జరుగగా కౌమారము, ఇంకా కొంతకాలము గడువగ ముసలితనము శరీరమునకు ఏర్పడును. కాని శరీరమునకిన్ని జరుగుచున్నను లోపల గల జీవాత్మకు మాత్రము వయస్సు పెరగడము తరగడమనునది లేదు. వయస్సు పెరగడము ఒక్క శరీరమునకే కాక శరీరమునందే బాల్య, యవ్వన, కౌమార, వృద్ధాప్యం మొదలగు దశలు ఏర్పడుచున్నవి.

మనకొక కారు లేక జీపు ఉందనుకొనుము. అది బాగున్న వరకు దానిని ఎక్కి పయణించగలము. కొంతకాలమునకు దానిలోని టైర్లు అరిగిపోవును. అలా టైర్లు కారుకు అరుగుచున్నవి కాని అందులో కూర్చున్న వ్యక్తి కాళ్ళు అరగడము లేదు కదా! కొంత కాలమునకు టైర్లు పూర్తిగా అరిగిపోయి అవి దొర్లలేని స్థితికి వచ్చి బండి నిలిచిపోయినపుడు, అందులో పయణిస్తున్న వ్యక్తికి ఏమీకాలేదు కదా! కారుకు అరిగిన టైర్లు పనికిరావని అవి తీసివేసి వేరే క్రొత్త టైర్లు మార్చుకుంటాము.

టైర్లు అరుగు కొద్ది అందులో కూర్చున్నవాడెట్లు అరిగిపోలేదో, అట్లే శరీరము ధరించి దానిని వాడుకొనుచున్న జీవాత్మకు శరీరమునకు వచ్చినట్లు వృద్ధాప్యము రాదు. అరిగిపోయిన టైర్లు మార్చి క్రొత్త టైర్లు తగిలించుకొని బండిని నడుపుకొన్నట్లు, పాతబడిన శరీరమును వదలి క్రొత్త శరీరమును పొంది జీవాత్మ కాలము గడుపుకొనుచున్నాడు. ఎంత కాలము జరిగిన, ఎన్ని సంవత్సరములు జరిగిన జీవాత్మ ఎప్పటిలాగనే ఉండును. వానియందు ఏ మార్పురాదు. ఒక శరీరము ధరించినపుడు పేదగా, మరియొక శరీరము ధరించినపుడు రాజుగా ఉండవచ్చును, కాని వాడు మాత్రము లేకుండపోవుట అసత్యము. అందువలననే భగవంతుడు నీవుగాని ఈ రాజులుగాని లేకుండా పోవుదురనుట లేదు అన్నాడు. ఇక్కడొక సందేహము కొందరికొచ్చి, ఇది మామూలు జీవాత్మలకు వర్తించు సూత్రము, భగవంతుడైన శ్రీకృష్ణుడు నేను కూడ అని పల్కుచు మన మందరము లేకుండపోము అన్నప్పుడు దేవునికి కూడ ఈ సూత్రము వర్తించునా అని అడుగవచ్చును. దానికి సమాధానము దేవుడైనవాడు కూడ మామూలు మానవునివలె శరీరము ధరించి ఉన్నాడు. కనుక సర్వ శరీరములకు వర్తించు సూత్రము ప్రకారము తనను కూడ కల్పుకొని చెప్పాడు. అదియును కాక తాను దైవము గనుక ఎప్పటికి ఉండువాడే కావున తాను కూడ ఎల్లప్పుడుండు వానిగ చెప్పాడు.

ఇక్కడ మరియొక ప్రశ్న రాగలదు. జీవాత్మ జ్ఞానము తెలుసుకొని మోక్షము పొంది జీవాత్మగ నశించిపోయి పరమాత్మగ మారినపుడైన జీవాత్మకు నాశనము గలదు గదా! ఆ ఉద్దేశ్యముతోనే కదా జీవాత్మను క్షరుడన్నారు (నాశనమగు వాడన్నారు). అలా పరమాత్మలో చేరిపోయినపుడు జీవాత్మ నాశనమైపోయినవాడే కదా! అపుడు వాడు లేకుండ పోవుచున్నాడు కదా! అలాంటపుడు ఎప్పటికి లేకుండ పోవుననుటలేదు అనడములో గొప్పతనమేమిటని అడుగవచ్చును. దానికి మా సమాధానమేమనగా! ఇక్కడ శ్లోకమునందు చెప్పినది జీవులకేయైనప్పటికి, అది కేవలము అజ్ఞానములో ఉన్నవారికి మాత్రము చెప్పుచున్న విషయము. సర్వ సాధారణ జీవుల గురించిన విషయము తప్ప ఇతరము కాదని తెలియాలి. ఎందుకనగ శరీరములు నశించినపుడు

అనగా చంపబడినపుడు లేక మరణము పొందినపుడు అందులో గల జీవుడు కూడ నాశనమగునేమోనన్న అర్జునుని అనుమానమునకు తగినట్లు శరీరమార్పిడిలో జీవాత్మ నశించదని చెప్పబడినది. ఇది ఒక శరీర మార్పు ఎడల శరీరము నశించినపుడు జీవాత్మ యొక్క స్థితిని గూర్చి చెప్పినది. ముందు శ్లోకములలో కర్మ నశించినపుడు జీవాత్మ పూర్తి నశించి పోవును కావున జీవాత్మ క్షరుడు అనబడుచున్నాడు.

ఈ శ్లోకములో ముఖ్యముగ మూడు ఆత్మలయందు కేవలము ఒక్క జీవాత్మను గూర్చి చెప్పబడినదని మరియు శరీరపతనము జరిగినపుడు శరీరము మాత్రము పోయి జీవాత్మ పోకుండ ఎక్కడో ఒకచోట ఉండగలడని తెలియబరచ బడినది. ఇది శరీరపతనము ఎడల జీవాత్మ మార్పును గూర్చి చెప్పినది కాని కర్మ పతనము ఎడల చెప్పినది కాదని తెలియాలి. అదియును చాలా భగవద్గీతలలో ఎందరో వ్రాసినట్లు ఈ శ్లోకము ఆత్మకు కాదు కేవలము జీవాత్మకని తెలియాలి.

సరే, ఈ విషయము తెలిసిన తరువాత అర్జునుడు లేక మనము కాని ఎదుటివాడు లేక మన ఇంటిలో వానికి శరీర దశలన్ని జరిగి పోయినపుడు వీడు శరీరమును మాత్రము వదలిపోయినాడు, వీడు నాశనము పొందలేదు, వీడు ఉన్నాడు, వాని కోసమెందుకు ఏడ్వాలి అని తెలిసినప్పటికి మనకు పరిచయమున్న ఈ శరీరము వదలి పోయినాడు కదా అనో లేక వాడు మన దగ్గరలేకుండ ఈ శరీరము వదలి ఎక్కడికో పోయాడు కదా! ఇక వాడున్నప్పటికి వాడు ఎక్కడున్నది మనకు తెలియదు కదా! అని అంతో ఇంతో దుఃఖము పొందుదుము. వాడు చనిపోయాడని కాదు, వాడు దూరమాయెనని ఏడ్చుచున్నామని తెలిసినవారనుట కూడ వినవచ్చును. అందువలన భగవంతుడు తిరిగి ఇంకొక శ్లోకమున ఇట్లనుచున్నాడు.

*(1)శ్లో॥ 14 : మాత్రాస్పర్శాస్తు కౌంతేయ! శీతోష్ణసుఖదుఃఖదాః।*
*ఆగమాపాయినో నిత్యాస్తాం స్తితిక్షస్వ భారత! ॥*

*(జీవాత్మ)*

**భావము :** పంచతన్మాత్రల చేత, శీతోష్ణములు సుఖదుఃఖములు మానవులకు

కల్గుచుండును. శీతోష్ణములు సుఖదుఃఖములు ఎప్పటికి ఉండునవి కావు అశాశ్వతములైనవి. వచ్చిపోయెడు వాటిని ఆ కొద్దికాలము ఓర్చుకోవలయును.

**వివరము :** పంచతన్మాత్రలనునవి మన శరీరములో జ్ఞానేంద్రియములకుండు శక్తులు. జ్ఞానేంద్రియములైదు కావున ఆ ఐదుకు గల శక్తులను ఐదు తన్మాత్రలని అందురు. ఉదాహరణకు జ్ఞానేంద్రియములలో కన్ను కలదు కదా! ఆ కన్ను అందరికి ఉండినప్పటికి దానికి గల చూపులో మనిషికి మనిషికి తేడా ఉండును. ప్రతి మనిషికి గల కన్ను కనపించగలదు. కాని ఆ కళ్ళకెంత చూపున్నదో కనిపించదు. ఇంద్రియమైన కన్ను కనిపించినప్పటికి, దానిశక్తియైన తన్మాత్రయను చూపు కనిపించదని తెలియాలి. అనగా కన్ను వేరు, చూపువేరని, కన్ను కనిపించినప్పటికి చూపు కనిపించదని తెలియుచున్నది. అట్లే ఇతరుల చెవి కనిపించినప్పటికి, వారి చెవికి ఎంత వినికిడి ఉన్నదో వాడు చెవిటివాడో కాదో చూస్తూనే చెప్పలేము. ఈ విధముగా కనిపించు 1) కన్ను 2) ముక్కు 3) చెవి 4) నాలుక 5) చర్మము అనువాటికి 1) చూపు 2) వాసన 3) శబ్దము 4) రుచి 5) స్పర్శ అను కనిపించని తన్మాత్రలు గలవు.

ఈ తన్మాత్రల వలననే శరీరములో ఉన్న జీవులకు బయటి ప్రపంచపు విషయములు తెలియుచున్నవి. ఆ విషయములు తెలియుట వలననే వానికి సుఖము దుఃఖములు కలుగుచున్నవి. దేహము ధరించిన ప్రతి జీవికి అనగా వాడు ఏ మతమువాడైనగాని, ఏ జాతివాడైనగాని, ఏ జీవరాసియైనగాని పంచతన్మాత్రల ద్వారానే శీతలము, ఉష్ణము, సుఖము, దుఃఖము కలగాలి. ఈ సిద్ధాంతము ప్రకారము మనము కూడ తన్మాత్రల ద్వార సుఖదుఃఖములను అనుభవిస్తున్నాము.

ఒక మనిషికి దగ్గరైన భార్య వానితో మాట్లాడుట వలన శబ్దము అను తన్మాత్రతో సంబంధపడుచున్నాడు. ఆమెను చూచుచుండుట వలన అతను చూపు అను తన్మాత్రతో సంబంధపడివున్నాడు. ఆమె చనిపోయినపుడు తన్మాత్రలచేత సంబంధము కల్గివున్నవాడు కావున వానికి అంతో ఇంతో జ్ఞానముండిన, ఆమె

శరీరము చనిపోయినది కాని ఆమె చనిపోలేదని తెలిసినప్పటికి, తన్మాత్రల ప్రాబల్యము వలన వానికి దుఃఖము ఏర్పడును. ఆ దుఃఖము కొద్దిరోజులకు లేకుండ పోవుచున్నది. ఎందుకనగా తన తన్మాత్రలు వేరు విషయములందు లగ్నమై ఆ విషయసంబంధ సుఖదుఃఖములను కలుగజేయుచుండును. కనుక మొదటి సుఖదుఃఖములను మనిషి మరచి పోగలుగుచున్నాడు. ఇట్లు కొంతకాలమునకు భార్యతో ఉన్న తన్మాత్రల విషయములు మరిచిపోవుట వలన ఆమె జ్ఞప్తికిరాదు, ఆ దుఃఖమురాదు. తన్మాత్రలు బయటి విషయముల సుఖదుఃఖములు కలుగజేయునవి, కావున కాలక్రమమున ఏ సుఖము గాని శాశ్వతముగ ఉండక మారిపోవుచుండును. అందువలన తనవాడు పోయినప్పటికి వాని దుఃఖము కొంతకాలమే, అట్లే తనకు కుమారుడు పుట్టినప్పటికి తనకు సంతోషము కొంతకాలమే. కావుననే గీతయందు ఈ శ్లోకమున **"శీతోష్ణ సుఖదుఃఖదాః ఆగమాపాయిన అనిత్యాః"** అని అన్నాడు. అంటే రాకపోకలు కలిగినవి, అనిత్యములైనవి, సుఖదుఃఖములని అర్థము. ఇటువంటి అశాశ్వతమైన సుఖ దుఃఖములు, తన్మాత్రలు వుండుట వలన ఎవరికైన అవి కలుగుచుండును. అయినప్పటికి వాటికి ఆ సమయములో సుఖములకు పొంగక, దుఃఖములకు కృంగక కొంత ఓర్చుకోవలయును.

ఎంతటి జ్ఞానికైన సుఖదుఃఖములు కలుగుట తప్పదు. అట్లు కల్గినప్పటికి వాటినొకింత ఓర్చుకొని వాటి వ్యథ ఎవడైతే పొందడో, అటువంటి వాడు ఎంతటి సమర్థుడు, దేనికి సమర్థుడన్న విషయము క్రింది శ్లోకమున భగవంతుడు చెప్పుచున్నాడు.

*(1) శ్లో॥ 15: యం హి న వ్యథయం త్యేతే పురుషం పురుషర్షభ ।*
*సమ దుఃఖసుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే ॥*
*(జీవాత్మ)*

**భావము :** ఎవడు సుఖదుఃఖ భేదములెంచుకొనడో, ఎవనికి వాని వ్యథ కలుగదో వాడే అమృతత్వమునకు అర్హుడగును.

**వివరము :** కష్టసుఖములు శీతోష్ణములు కలుగుచున్నప్పటికి కొంత ఓర్చుకొనవలెనని చెప్పాడుగా! అట్లు ఓర్చుకొనుటకు అలవాటుపడుట వలన తన్మాత్రల సంబంధము లేకుండపోవచ్చును. అట్లు అలవాటు పడుచు చూపు, స్పర్శ, వాసన, రుచి శబ్దములతో సంబంధపడక పోవుట వలన వానికి బ్రహ్మయోగము అలవడి మృతములేని, నాశనముకాని పరమాత్మను పొందుటకు అర్హుడగును.

(1)శ్లో॥ 16 : నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః।
ఉభయో రపి దృష్టో உన్త స్త్వనయో స్తత్త్వదర్శిభిః॥
(ఆత్మ)

**భావము :** సత్తు కనుక ఆత్మకు నాశనము లేదు. శరీరము అసత్తుకనుక దానికి నాశనము తప్పదు. నిశ్చయమైన ఈ రెండిటి నిర్ణయ విధానములు ఆత్మను దర్శించినవారికి తెలిసివుండును.

**వివరము :** మన శరీరములో జీవాత్మయే కాక ఆత్మ అనునదొకటున్నది అది నాశనములేనిది. నాశనముగల జీవాత్మ నివాసమున్న శరీరములోనే నాశనము లేని ఆత్మ కూడ ఉన్నది. జీవాత్మ శరీరములు మారుచు నాశనము కాక ఉండినప్పటికి మోక్షము (శరీరములను జైలు నుండి విడుదల) పొందినపుడు నాశనము కావలసిందే. కావున జీవాత్మను క్షరుడు (నాశనమగువాడు) అనుచున్నారు. జీవాత్మవలెకాక ఆత్మ శరీరములందంతయు సమానముగ ఆవహించివున్నను నాశనము లేదు. కావున దానిని అక్షరుడు (నాశనములేని వాడు) అన్నారు. అమృతుడైన ఆత్మ అన్ని జీవ శరీరములందు వ్యాపించి, ఆయా జీవరాసుల తలలో కేంద్రమేర్పరచుకొని నివసిస్తు, శరీరనాడుల ద్వార దాని శక్తిని శరీరమంత ప్రసరింపజేయుచున్నది. అన్ని జీవ శరీరములందు అవయవములు పనిచేయుటకు ఈ ఆత్మశక్తి అవసరము. ఆత్మశక్తి లేనపుడు అవయవములు పనిచేయవు. మనకు ఉపయోగపడు రేడియో, ఫ్యాను, లైట్లు వివిధ రకముల పరికరములు పనిచేయుటకు విద్యుత్ అను శక్తి ఎలా అవసరమో, అలాగే మన శరీర అవయవములు పనిచేయుటకు ఆత్మచైతన్యమను శక్తి ఉపయోగపడుచున్నది. ఆత్మచైతన్యములేని సజీవశరీరము భూమి మీద ఉండదని

తెలియాలి. జీవుడు సుఖదుఃఖములను అనుభవించుటకు గాని, శరీర అవయవములు కదులుటకు గాని, శరీరాంతర్భాగములు పనిచేయుటకు గాని అన్నిటికి ఆత్మశక్తిలేనిది కుదరదు. సమస్త శరీరములలో సారాంశమైనది ఆత్మ చైతన్యశక్తియే కావున ఆత్మను సత్తు అని పిలిచెడివారు. ఆత్మలేని శరీరము సత్తులేనిది కావున నిస్సత్తువైనదని సత్తు పోయినదని అనెడివారు.

ప్రతి జీవరాసిలోను ఈ సత్తు గలదు. ఆవులో, ఏనుగులో, చీమలో, దోమలో, మనిషిలో అందరిలోను ఒకే విధమైన సత్తు (ఆత్మ) గలదని తెలియాలి. సత్తు శరీరమంత వ్యాపించి ఉన్నపుడు అన్ని అవయవములు పనిచేయుచుండును. ఆ సత్తు ఒక చేతిలోనికి ప్రసరింపలేదనుకొనుము అపుడు ఆ చేయి పని చేయదు. అటువంటి వాడు పూర్వము నా చేయి సత్తుపడి పోయిందని చెప్పెడివాడు. కాలక్రమమున **'సత్తు' అను మాట 'సచ్చు'** అను మాటగ మారినది. అందువలన ఇపుడు కూడ చేయి పని చేయనివాడు నాచేయి 'సచ్చు' పడిపోయిందని పలుకుట ప్రత్యక్ష ప్రమాణముగ గలదు. అట్లే నా కాలు సచ్చు పడిపోయిందనుట కూడ వినుచుందుము. ఆ పడిపోయిందని దేనినంటున్నామో అదియే ఆత్మశక్తియని తెలియాలి, అది లేనిది ఏ మతస్థుని శరీరము పనిచేయదు.

నాది ఈ మతము, నీది ఆ మతమని ఎన్ని భేదములు పెట్టుకొన్నను వారందరికి సత్తు ఒక్కటే, అది మనుజులకే కాదు అన్ని జీవరాసులలో కూడ ఉన్నది. ఆవు శరీరములో సత్తుపోయిందనుకొందాము. అపుడు దానిని ఆవు సత్తుపోయిందని పూర్వమనెడివారు. ఈనాడు ఆ మాటనే ఆవు సచ్చిపోయిందని అంటున్నాము. అట్లే గేదె సచ్చిపోయింది, ఎద్దు సచ్చిపోయిందనుచున్నాము. అదే విధముగ మనిషి కూడ సచ్చిపోయాడంటున్నాము. ఆ సచ్చి అనగా సత్తు ఏమిటని ఎవరు యోచించలేదు. మనయందుగల మనము యోచించని సత్తునే ఆత్మనియు పిలువవచ్చును.

సత్తు అనబడు ఆత్మకు ఒక సిద్ధాంతము గలదు. అది ఏమనగా! జీవాత్మ ఎచ్చటైతే ఉందో అచట ఆత్మకూడ ఉండవలయును. అందువలన జీవాత్మ వదలిపోవు శరీరమును ఆత్మ కూడ వదలిపోవుచున్నది. జీవాత్మ ఎచట ప్రవేశిస్తున్నదో ఆత్మ కూడ అచటనే ప్రవేశిస్తున్నది. మరణములో జీవాత్మతో పాటు పోయిన ఆత్మ, పుట్టుకతో జీవాత్మతో పాటు శరీరమందు ప్రవేశిస్తున్నది. అందువలననే మరణించిన శరీరమందు కదలికలు నిలిచిపోవడము, పుట్టిన శరీరమున కదలికలు రావడము జరుగుచున్నది. శరీరములకు స్వయం చైతన్యశక్తి లేదు కనుక వాటిని అసత్తు అనుచున్నాము. స్వయం చైతన్యశక్తి గల ఆత్మను సత్తు అంటున్నాము. చైతన్యములేని అసత్తయిన శరీరములు కృశించి నశించిపోగలవని, సత్తయిన ఆత్మనాశనము కానిదని ఆత్మను తెలుసుకొన్న వారికి పూర్తి అర్థమై ఉండును. సర్వశరీరములకు దీపము లాంటిది సత్తు. అది ఉన్నదాని వలననే కొందరు మంత్రిపదవులు, మరికొందరు కంత్రీపదవులు, కొందరు పోలీసు ఇన్స్పెక్టర్లు, కొందరు కలెక్టర్లు, కొందరు దొంగలుగా అనేక విధములుగా మానవజాతి మనగలుగుచున్నది. అది తెలియక నేను పోలీస్ ఆఫీసర్నని కర్ర చేతితో పట్టుకొని ఆడిస్తు, ఆ ఆడించే శక్తి ఎవరిదో తెలియక విర్రవీగకూడదు. అట్లు నేను ఒక జడ్జినని నా చేతిలో కలమున్నదని, నేను ఎట్లు వ్రాస్తే అట్లు జరుగునని అనుకోకూడదు. ఆ వ్రాతకు ఉపయోగపడు శక్తి ఎవరిదో తెలియాలి. సర్వసాధారణముగ అందరు నాలో ఉన్నది నాశక్తి కాక ఇంకెవరి శక్తియని అనుకోవచ్చును. ఆత్మ జీవాత్మల విషయము తెలిసిన ఏసును ఒకనాడు ముద్దాయిగ కోర్టులో నిలబెట్టిన దినమున, ఆ జడ్జి **'నేను ఏమి చెప్పితే ఆ శిక్ష అమలు జరుగును'** అని చెప్పినపుడు ఏసు ఇలా అన్నాడు **' పై నుండి నీకు ఇవ్వబడి ఉంటే తప్ప నా మీద నీకు ఏ అధికారము ఉండదు'** ఆ మాటయందు ఎవరు స్వతంత్రులు కాదని, అందరికి పై అధికారి ఆత్మ (సత్తు) ఉందని స్పష్టమగుచున్నది. ఇంకనూ పరమాత్మ ఎట్టిదనిన ముందు శ్లోకమున చూడుము.

(1) శ్లో॥ 17 : అవినాశి తు తద్విద్ధి యేన సర్వ మిదం తతమ్ ।
వినాశ మవ్యయ స్యాస్య న కశ్చి త్కర్తు మర్హతి ॥

(పరమాత్మ)

**భావము :** నాశనములేని పరమాత్మ ప్రపంచమంత వ్యాపించి సర్వము ఇమిడి ఉన్నది. ఇది శరీరములోపల కూడ ఉన్నది. అట్టి దానిని ఎవడు నాశనము చేయలేడు.

**వివరము :** జీవాత్మతో పాటు ఆత్మ కూడ శరీరమందు నివశించుచున్నది. జీవాత్మ ఆత్మయేకాక పరమాత్మ అనునది కూడ శరీరమందు నివశించుచున్నది. పరమాత్మ, జీవాత్మ ఆత్మవలె శరీరములందే కాక, శరీరముల బయట కూడ అంతట వ్యాపించి సర్వము నిండినదైయున్నది. అవధిలేని పరమాత్మ శరీరము లోపల, బయటనేకాక మిగతా నిర్జీవమైన అన్ని పదార్థములందు కూడ అణువణువున వ్యాపించి ఉన్నది. దానికంటే భిన్నమైనది వేరేదియును లేదు. ఒకచోట ఉండి మరొక చోట లేనిదానినైతే చంపవచ్చును. అట్లుకాక అంతట ఇమిడియున్న దానిని ఎవరు చంపగలరు. చంపుటకు కనిపించునది కాదు, తెలియునది కాదు. శరీరమును ఎవడైన చంపవచ్చును. అందువలన ఆ శరీరములోని ఆత్మ జీవాత్మలజోడి మరొక శరీరమును ఆశ్రయించుచున్నవి. ఆత్మ, జీవాత్మలవలె కాక పరమాత్మ చనిపోయిన శరీరములో కూడ అణువణువున వ్యాపించి ఉన్నది. అందువలన అది ఎవరిచేత చంపబడునది కాదు, ఎవరు దానిని చంపలేరు.

(1) శ్లో॥ 18 : అన్త వన్త ఇమే దేహాః నిత్యస్యోక్తా శ్శరీరిణః।
అనాశినో ऽ ప్రమేయస్య తస్మా ద్యుధ్యస్వ భారత ! ॥

(ఆత్మ, పరమాత్మ)

**భావము :** శరీరములలో నిత్యము ఉండువాడైన ఆత్మయు, నాశనములేని వాడు అప్రమేయుడు అయిన పరమాత్మయు నివశించు శరీరమునకు ఎప్పటికైన నాశనము తప్పదు కావున యుద్ధము చేయుము.

**వివరము :** ఒక సజీవ శరీరమును విడదీసి చూచిన అందులో శరీరము కాక జీవాత్మ, ఆత్మ, పరమాత్మలనునవి మూడు ఉన్నాయని తెలియుచున్నది. ఈ శ్లోకములో జీవాత్మను గూర్చి ఏమాత్రము చెప్పక శరీరము ఆత్మ పరమాత్మల గూర్చియే చెప్పారని తెలియాలి. **"అంతవంత ఇమే దేహా"** అన్న మాటను బట్టి ఈ దేహమునకు నాశనము కలదని అర్థము. ఎప్పటికైన నాశనము కాగల శరీరములో నిత్యుడైన ఆత్మ ఉన్నాడు. ఈ ఆత్మ ఒక్క శరీరమునందు ఒక్క ఖండముగ ఉంటు, సమస్త శరీరములందు ఒకే అంశముగా ఉన్నది. కనుక అన్ని శరీరములందున్న ఆత్మలు ఒక్కటేనని తెలియుచున్నది. అన్ని శరీరములలో ఉన్న జీవాత్మలు కర్మరీత్య వేరు వేరుగ ఉన్నవి. అవి అన్ని ఒకటికావు, అవి ఒకదానికొకటి భిన్నమైనవి, అందువలన జీవాత్మలు అనేకముగా ఉన్నాయి. ఆత్మ అట్లుకాక అనేక శరీరములలో అనేక ఆత్మలున్నప్పటికి అవన్నియు ఒక్కటేనని తెలియాలి. ఒక శరీరములో ఉన్న ఆత్మ హత్య కావింపబడినప్పటికి అన్ని శరీరములలో ఉండు ఆత్మ మిగిలివున్నది. కావున ఆత్మకు నాశనము లేదన్నాము. ఇక్కడ ముఖ్యముగ గ్రహించవలసిన విషయము ఏమనగా! ఒక్క శరీరపరముగ చూచిన నాశనము కాగల ఆత్మ, సమస్త శరీరపరముగ చూచినపుడు నాశనములేనిదని చెప్పవచ్చును. ఈ విషయము ముందు శ్లోకములలో వివరముగ ఉన్నది.

పరమాత్మ విషయానికొస్తే ఎప్పటికి ఎక్కడ నాశనములేనివాడు, దేని చేతను తెలియబడనివాడు, చివరకు యోగముచేత కూడ తెలియబడనివాడు, ఏ ప్రమాణము చేత తెలుపబడని వాడు, ఏ పేరు లేనివాడు అయిన పరమాత్మయు మరియు ఆత్మయూ ఈ శరీరమునందు నివశించుచున్నవి. అయినప్పటికి శరీరము ప్రకృతి జనితమైనది కావున దానికి నాశనము తప్పక కల్గును. ఈ దేహము శాశ్వతముగ ఉండునది కాదు. ఎందుకనగా శరీరమునకు బాల్యము, యవ్వనము, కౌమారము, వృద్ధాప్యము అను మొదలగు దశలు కలవు. ఒకదాని వెంట ఒకటి అవి నాశనము వైపు ప్రయాణిస్తున్నవి. చివరకు శరీరము శిథిలమై మరణమేర్పడును. కాని శరీరములోని ఆత్మకు పరమాత్మకు శరీరమునకున్నట్లు దశలు లేవు. అందువలన

వాటికి నాశనములేదు. శరీరము కొన్ని భాగములతో కూడికొనియున్నది. మార్పుచెందు కనిపించు స్థూలశరీరము పది భాగములుగ ఉన్నది. పది భాగములైన స్థూలశరీరము ప్రతి దినము క్షణక్షణము మార్పుచెందుచున్నది. ఎలా అనగా దినమునకు 12 గంటలు పగలు లేక 720 నిమిషములు, సెంకడ్లయితే 43,200. స్థూలశరీరమైన పది భాగములు సూక్ష్మముగ కనిపించకుండ మార్పు చెందుచున్నది. అందువలన ఒక దినమునకు పదింతల కాలమును 4,32,000 సూక్ష్మ కాలమంటాము. ఒక దినమునకు కనిపించని 4,32,000 మార్పులు శరీరములో జరుగుచుండుటవలన కొంత కాలమునకు శరీరము ముసలిదగుచున్నది. ప్రత్యక్షముగ కనిపించు శరీరము పరోక్షముగ మార్పుచెందుచున్నదని చాలామందికి తెలియదు. ప్రత్యక్షముగ క్షణక్షణముగ మార్పు చెందుచున్నదని, అట్లే నాశనము గలదని కూడ అందరికి తెలియును. అట్టి శరీరమును గూర్చిలెక్కించక యుద్ధము చేయమన్నాడు. కలియుగము ఆయుస్సు కూడ 4,32,000 సంవత్సరములనుట గమనార్హము.

(1) శ్లో॥ 19: య ఏనం వేత్తి హంతారం యశ్చైనం మన్యతే హతమ్ ।
ఉభౌ తౌ న విజానీతో నాయం హంతి న హన్యతే ॥
(జీవాత్మ)

**భావము :** జీవాత్మను చంపుదునని ఎవడనుకొనునో మరియు అది చంపబడునని కూడ ఎవడనుకొనునో ఆ ఇరువురు జ్ఞానశూన్యులని తెలియుము. జీవాత్మ చావునది కాదు, చంపబడునది కాదు.

**వివరము : జీవాత్మ చచ్చునది కాదు, చంపబడునది కాదు అనుమాట బహుశ ఈ యుగములో మాదే మొదటి మాటై ఉండవచ్చుననుకొంటాము.** జీవాత్మకు చావులేదని బహుశ ఏ భగవద్గీతలోను మీరు చూచి ఉండరనుకొంటాము. ఎంతో మంది పెద్దలు చెప్పలేని దానిని మీరెట్లు చెప్పుచున్నారను ప్రశ్న మీరేయవచ్చును. దానికి సమాధానము ఇంతవరకున్న భగవద్గీతలలో పురుషుడైన పరమాత్మను ముగ్గురు

పురుషులుగా విభజించుకోలేదు. ఆ ఒక్క తప్పే అందరిని తప్పుత్రోవ పట్టించింది. గమ్యము తప్పిన దారియై సంశయాలతో కూడుకొని జవాబు లేకుండ చేసినది. ఈ మాటలు చాలా మంది పెద్దలకు బాధకల్గించునని కూడ మాకు తెలుసును. అయినప్పటికి ఒకరికి బాధకల్గించునని సత్యమును దాచకూడదు. అందులోను జ్ఞానవిషయములలో మరీ జాగ్రత్తగా ఉండాలి. వాస్తవమును ధైర్యముగా ప్రకటించాలి. సప్రమాణమైన సత్యమును దాచుటవలన మహాపాపమేర్పడును.

ఒక విధముగ ఇంతవరకు ఈ విషయమును వ్రాయని పెద్దలదేమి తప్పులేదని చెప్పవచ్చును. ఎందుకనగా! మాయ దైవనిర్మితమైనది. ఒక విధముగా దానికి దైవశక్తి ఉందని చెప్పవచ్చును. దైవమును గూర్చి బోధించవలయుననుకొను వారిమీదనే ఎక్కువ బలముగా పనిచేయును. మాయకు వ్యతిరిక్తమైన వారు బోధకులని, వారిని తప్పుదోవ పట్టిస్తే వారిననుసరించి మిగతావారంతా ఇది మంచిదారనుకొని దానివెంటపోగలరని మాయ యొక్క అభిప్రాయము. అందువలన మనము మాయా ప్రభావములో చిక్కుకొనక, మనకు ఇతరులు చెప్పుట సరికాదను ఈర్శ్యను వదలి బుద్ధికి పదునుపెట్టి చూడగలరని ఆశిస్తున్నాము. ఇంతేకాదు **ఇక్కడ జీవాత్మకు చావులేదని చెప్పడము ఒక సంచలనమైతే, తర్వాత ఆత్మకు చావున్నదని చెప్పడము మరియొక సంచలనము.** ఇవన్నియు సహేతుకముగ చెప్పబడినవే. హేతువాదులకు జవాబునిచ్చు విషయములే. ఇంతవరకు అగమ్యగోచరముగ ఉన్న విషయములను వివరముగ తెలుసుకొని ఏ ప్రశ్నకైన జావాబిచ్చువారుగ మారి ఇతరులకు ఈ క్రొత్త విషయ వివరమును తెలియజేసి అజ్ఞానమును రూపుమాపుదురని కోరుచున్నాము.

భగవద్గీతయందు ఒక సందర్భములో జీవుడు క్షరుడు, ఆత్మ అక్షరుడు అన్నారు. అటువంటప్పుడు ఇక్కడేమో ఆత్మచావునని (క్షరుడని), జీవుడు చావడని (అక్షరుడని) చెప్పడము కనిపించు పొరపాటు కాదా! అని కొందరడుగవచ్చును. దానికి సమాధానము, ఒక ఉద్యోగి ఒక ఊరిలో బదిలీ అయి వేరొక ఊరికి పోయి ఉద్యోగము సాగిస్తున్నాడనుకొనుము. అట్లు ఎన్నో బదిలీలు పొంది ఎన్నో ఊర్లలో

ఉద్యోగము చేయుచున్నాడు. ఇక్కడ బదిలీ జరిగినపుడే ఊరు మారునట్లు ఒక జీవుడు ఒక శరీరములో పనిచేయుచు ఉండి, శరీరము మరణము పొందినపుడు ఆ శరీరము వదిలి వేరొక శరీరము చేరుచున్నాడు. ఉద్యోగికి బదిలీలాంటిదే జీవులకు మరణము. బదిలీ అయినంత మాత్రమున ఉద్యోగస్తుడు లేకుండపోలేదు. అట్లే మరణము పొంది శరీరము మారినంత మాత్రమున జీవుడు లేదనుట తగదు. ఎన్ని ఊర్లు మారిన, చివరకు రిటైర్డు (ఉద్యోగవిరమణ) అయిన తర్వాత వాడు ఉద్యోగి ఎట్లు కాకుండ పోవునో, అట్లే జీవుడు కూడ ఎన్ని శరీరములు మారిన మోక్షము పొందిన తరువాతనే జీవుడు కాకుండ పోవును. రిటైర్డుతో ఉద్యోగి అనుపేరు లేకుండపోయినట్లు, మోక్షముతో జీవితము లేకుండ పోయి జీవుడు కాకుండా పోవును. ***అందువలన ఇచట గ్రహించవలసినది మరణించుట అనునది నాశనము కాదు. నాశనము అనునది మరణము కాదు. మరణమునకు, నాశనమునకు ఎంతో తేడా ఉన్నదని తెలియాలి.*** జీవునికి చావు లేదన్నాము, కాని నాశనము పొందదని చెప్పలేదు. అట్లే ఆత్మ చంపబడును అన్నాము, కాని నాశనమగువాడని చెప్పలేదే! జీవాత్మ ఎట్లు చంపబడదో, ఆత్మ ఎట్లు చంపబడుచున్నదో క్రింద తెలుసుకొందాము.

ఒక సజీవ శరీరమును పరిశీలించి చూచిన ఆ శరీరము ఎన్నో భాగములుగా ఉన్నది. ఒక్కొక్క భాగము ఒక్కొక్క పనిని చేయుచు యంత్రమువలె సాగిపోవుచున్నది. శరీరములో అన్ని భాగములు పని చేయుటకు శక్తి అవసరము. ఆ శక్తిని కుండలీశక్తి అనియు, ఆత్మశక్తియనియు అనుచున్నాము, ఆత్మ శరీరములోని తల భాగమును, వెన్నుపామును కేంద్రముగ చేసుకొని శరీరమంతా వ్యాపించి అన్ని భాగములచేత పనిచేయిస్తున్నది. అన్ని శరీరభాగముల వరకు ఆత్మ వ్యాపించివున్నది. ఈ విధముగ శరీరమందు ఆత్మవుండగ, జీవాత్మ మాత్రము శరీరములో ఒక్కచోట మాత్రము ఉన్నది. శరీరముతో తనకెలాంటి సంబంధము లేనిదిగ జీవాత్మ ఉన్నది. జీవాత్మకు తనవరకొచ్చిన కష్టసుఖములను అనుభవించు పని తప్ప ఏమిలేదు. ఆత్మచేత పనిచేయుచున్న కన్ను పంపెడి సమాచారమును బుద్ధి ద్వార జీవుడు

అనుభవిస్తు ఆ దృశ్యములోని ఆనందమునో, కష్టమునో అనుభూతిపొందుచున్నాడు. అట్లే జ్ఞానేంద్రియములైన ముక్కు, చెవులు, నాలుక, చర్మములచేత మనస్సు ద్వార పంపబడు విషయములను బుద్ధి ద్వార మాత్రమే జీవుడు అనుభవిస్తున్నాడు. బయటి జ్ఞానేంద్రియాలకు లోపలి జీవునకు మధ్యవర్తిగ మనస్సు ఉన్నది. మధ్యలో ఉన్న మనస్సు లేకపోయిన, పనిచేయకపోయిన జీవుడు చీకటిగదిలో ఉండినట్లగును. బయటి ప్రపంచ విషయమేమి తెలియదు. అట్లే బయటి జ్ఞానేంద్రియము ఏ ఒక్కటి లేకున్న దాని విషయము జీవునికి తెలియకుండా పోవును. కన్నుల్లేని శరీరములోనున్న జీవుడు దృశ్యముల సుఖమునుగాని, కష్టమునుగాని అనుభవించలేడు.

శరీరములో బయటి జ్ఞానేంద్రియములు పనిచేయాలన్నా, లేక లోపలి మనస్సు పనిచేయాలన్నా అన్నిటికి ఆత్మయే కారణము. శరీరములోని తల మధ్యలో ఉన్న జీవునికి శరీరమునకు ఏమాత్రము సంబంధములేదని, ఆత్మచేత పని చేయబడు శరీర భాగములనుండియే జీవునకు అన్ని తెలియాలని, అట్లు తెలియకపోతే జీవుడు చీకటి గదిలో ఉన్నవానితో సమానమేననుకోవాలి. ఉదాహరణకు ఒక బావి దగ్గర నీరు తోడి కాలువలో పోయువాడుండగ, కాలువ ద్వారావచ్చు నీరును ఫర్లాంగు దూరములో గట్టుమీద కూర్చొని త్రాగువాడు వేరొకడున్నాడనుకొనుము. తన శక్తిని ఉపయోగించి బావి నుండి నీరు తోడి పోయగా, ఆ వచ్చిన నీరు తియ్యనివి కాని, ఉప్పువికాని, త్రాగేవాడు దూరముగ కూర్చొనియున్నవాడు. తీపుకాని, ఉప్పుకాని అనుభవించువాడు పొలములో గట్టుమీద కూర్చొన్నవాడు. ఆ నీరులోని ఉప్పునుగాని, తీపునిగాని నీరు తోడువాడు అనుభవించడు. నీరుతోడు వానిది శక్తి మాత్రమే. అనుభవించువాడు పొలములోనివాడు. ఇదేవిధముగా ప్రపంచమను బావి నుండి తన శక్తిచేత శరీరేంద్రియముల ద్వారా కష్టసుఖములనబడు నీరును అందించువాడు ఆత్మకాగ, పొలములో కూర్చొని నీరు త్రాగువానిగ శరీరములో ఎక్కడో లోపల కూర్చున్న జీవాత్మ ఉన్నాడు. బావినుండి నీరు తోడు పరికరములు లేకపోయిన లేక తన వరకు వచ్చు కాలువ లేకున్న త్రాగువానికి నీరందదు. అట్లే ఇచట శరీర భాగములైన జ్ఞానేంద్రియములను నీరును తోడు పరికరములుగా, కాలువను

మనస్సుగా పోల్చుకొనవలెను. బుద్ధిని నీటిని అందించు పాత్రగ పోల్చుకోవలెను. జ్ఞానేంద్రియములు గాని, మనస్సుగాని, ఏ ఒక్కటి పనిచేయకున్న జీవునికి సమాచారమందదు.

ఇచ్చట ప్రమాదవశాత్తు బావిలోపడి మరణించు అవకాశము నీరు తోడువానికే ఉన్నది, కాని దూరముగ పొలములో కూర్చున్న వానికి ఏమాత్రము లేదు. అట్లే ప్రమాదవశాత్తు హత్య జరిగిన ఎడల మరణించు అవకాశము బయటి వరకు ఉన్న ఆత్మకు కలదు, కాని లోపలయున్న జీవాత్మకు లేదు. ఇట్లు హత్య సమయములో జీవాత్మకు మరణములేదని, ఆత్మకు మరణము కలదని తెలియాలి. ఒకవేళ ఆత్మచావలేదు జీవాత్మయే చస్తున్నదని ఎవరైన అనిన, బావి దగ్గర నీరు తోడువాడు బావిలోపడలేదు, పొలములో ఉన్నవాడు పడినాడన్నట్లుండును. ఆత్మ జీవాత్మల యొక్క హత్య, ఆత్మహత్యల గురించి క్రింద విపులముగ తెలుసుకొందాము.

ఒక జైలులో శిక్షవేయబడిన ఖైదీకి ఒక కాపలాదారుడుండి, ఆ ముద్దాయి ఎక్కడికి పారిపోకుండ వానిచేతికి వేయబడిన సంకెళ్ళ గొలుసును తన నడుముకు కట్టుకొన్నాడనుకొనుము. అట్లు కట్టుకొనుట వలన ముద్దాయి ఎక్కడికి పోయిన కాపలాదారుడు కూడ వాని వెంటపోవలసివున్నది. ఒకవేళ కాపలాదారుడు పోవలసి వచ్చిన వాని వెంట ముద్దాయి కూడ పోవలసి ఉంది. ముద్దాయిని వేరొక జైలుకు మార్చిన ఎడల వానితోపాటు కాపలాదారుడు కూడా ఆ జైలుకు పోవలసి ఉంది. ఖైదీకి కాపలాదారుని శాశ్వతముగా నిర్ణయించిన దానివలన, ఖైదీ ఏ జైలుకు పోయిన తప్పనిసరిగ వాని రికార్డులతో పాటు కాపలాదారుడు కూడ పోవలసియున్నది. శిక్ష ప్రకారము ముద్దాయికి ఆహారము మొదలగునవి ఇస్తూ, వానిచేత ఏ పని చేయించాలో ఆ పనులనే కష్టములైనవికాని, సుఖములైనవికాని చేయిస్తు, వాడు చేయు అన్ని పనులకు కాపలాదారుడు ప్రత్యక్షసాక్షిగా ఉన్నాడు. జైలులో ఖైదీకి కాపలాదారుడు ఉన్నట్లే, ఒక శరీరమను జైలులో ముద్దాయిగ జీవాత్మ ఉండగ, కాపలా దారునిగా ఆత్మ ఉంటూ వానికి సాక్షిగ కూడ యుండి వానిచేత పనులు

అనుభవింప చేయిస్తున్నది. ఒక శరీరము వదలిపోవునపుడు జీవునితో పాటు వాని కర్మయను రికార్డును తీసుకొని వేరే శరీరమునకు ఆత్మ పోవుచున్నది.

శరీరము జైలులాంటిది, అందులో ఉన్న జీవుడను ఖైదీ ముందుచేసిన తప్పులకు శిక్షను అనుభవిస్తు ఆ జైలులోనే తిరిగి క్రొత్త తప్పులు చేశాడనుకొనుము, వాని రికార్డులో క్రొత్త తప్పులు రికార్డు చేసి శిక్షను పెంచుదురు. అట్లే ఒక శరీరములో కర్మననుభవించు జీవుడు అదే శరీరములో క్రొత్త కర్మను సంపాదించుకొనిన, తిరిగి క్రొత్త శరీరమను జైలుకుపోయి శిక్షననుభవించవలసి వచ్చును. జీవుడు పాతకర్మను అనుభవిస్తు క్రొత్త కర్మసంపాదించుకొనుట వలన, శరీరములను జైళ్ళను ముద్దాయి అనబడు జీవుడు మారుచూనే ఉన్నాడు. వానితోపాటు కాపలాదారుడైన ఆత్మ కూడ మారుచూనే ఉన్నది. ఈ విధముగ జైలు మార్పిడిని మరణము అందుము. ఒక శరీరములో అనుభవించవలసిన కర్మను పూర్తిగా అనుభవించి వేరొక శరీరమునకు పోవడము మరణమైతే, ఒక శరీరములో అనుభవించవలసిన కర్మను పూర్తిగా అనుభవించకమునుపే ఆ శరీరమును వదలి పోవడమును **'అకాల మరణము'** అంటాము. ఈ అకాలమరణము రెండు విధములుగా ఉన్నది. ఒకటి హత్య, రెండవది ఆత్మహత్య. **అనుభవించవలసిన ప్రారబ్ధకర్మను శరీరములో అనుభవించక ముందే ఆ శరీరమును <u>జీవుడు</u> వదలిపోవడము హత్య అంటాము. అట్లే ఒక శరీరములో అనుభవించవలసిన ప్రారబ్ధమును అనుభవించక ముందే <u>ఆత్మ</u> ఆ శరీరమును వదలి వెళ్లిన అది ఆత్మహత్య అంటాము. ఇక్కడ గమనించతగిన విషయమేమనగా! <u>జీవాత్మ ఆత్మలలో</u> ఏది ముందు బయలుదేరుచున్నదో దానిని బట్టి హత్యనా, ఆత్మహత్యనా** అని నిర్ణయించడము జరుగుచున్నది.

మూడు ఆత్మలలో మొదటిదైన జీవాత్మను భగవద్గీతయందే క్షరుడన్నాము. *'క్షరుడు'* అనగా నాశనమగువాడని అర్థము. శరీరము నాశనమైనప్పటికి జీవుడు నాశనము కాడని కూడ ఇదే గీతలోనే చెప్పుకొన్నాము. ఒకచోట నాశనమగువాడని వేరొకచోట నాశనములేనివాడని అనుట విచిత్రమేయైనప్పటికి రెండూ వాస్తవమేనని తెలియాలి. సందర్భానుసారము చెప్పుటలో అలా చెప్పవలసి వచ్చినది. శరీరము

నాశనమైనపుడు జీవుడు నాశనము కానిమాట నిజమే. ఎన్ని శరీరములు మారి పోయిన జీవుడు నాశనమగువాడు కాడు, ఇక్కడ నాశనము కానిమాట నిజమే అయినప్పటికి జీవుడు క్షరుడే, నాశనమగువాడే. అది ఎలా అనగా! జీవాత్మ కర్మల నుండి బయటపడునపుడు తిరిగి పుట్టవలసినది లేదు. పరమాత్మగ మారినపుడు ఇక జీవాత్మలేదు. అపుడు జీవాత్మ నాశనమైనాడనియే చెప్పవచ్చును. అంతవరకు శరీరమునకు తప్ప జీవాత్మకు నాశనములేదనిన మనమే, ఇపుడు జీవాత్మకు నాశనమున్నదని ఒప్పుకోక తప్పదు. అట్లే ఆత్మను అక్షరుడని గీతయందే చెప్పాము. అక్షరుడనగా నాశనములేనివాడని అర్థము. క్షరుడైన జీవున్ని అనగా నాశనము కలవానిని నాశనములేని ఆత్మను కూడ మరణము కలవాడని సందర్భానుసారముగ చెప్పవలసి వచ్చినది. హత్య, ఆత్మహత్య అనడములో ఆత్మహత్య యొక్క అర్థము ఆత్మ చంపబడుచున్నదని. ఆ విషయము అర్థము కావాలంటే అలా చెప్పక తప్పదు. దీనిని ఎవరు అపార్థము చేసుకోకూడదు. పై శ్లోకములో *'హన్తినహన్యతే'* అను మాట వచ్చింది కనుక హత్యను గురించి పూర్తి వివరమిచట ఇవ్వవలసి వచ్చింది. హత్య, ఆత్మహత్యల యొక్క వివరము క్రింద చూస్తాము.

హత్య అంటే ఇతరులచేత చంపబడడమని, ఆత్మహత్య అంటే తన్నుతాను చంపుకోవడమని నేడు వాడుకగ అందరికి తెలిసిన విషయమే కదా! అని అనుకొనవద్దండి. ఇక్కడ ధర్మము అధర్మముగా మారిపోయినది. ధర్మము యొక్క స్థానములో అధర్మము, అధర్మము యొక్క స్థానములో ధర్మము నిలబడివున్నాయి. కావున ఈ విషయములో ధర్మమేదో, అధర్మమేదో వివరముగా తెలుసుకొందాము.

జీవులకు మరణము రెండు విధములుగా ఉన్నది. ఒకటి కాలమరణము, రెండవది అకాలమరణము. హత్య, ఆత్మహత్యలు రెండు అకాలమరణమునకు చెందినవి. కాలమరణమును గురించి మా రచనలలోని **'జనన మరణ సిద్ధాంతము'** అను పుస్తకములో వివరముగ తెలుపబడినది. జీవుడు కర్మరీత్యా శరీరములో నివాసముండి కష్టసుఖములను అనుభవిస్తున్నాడు. శరీరములో జీవుని యొక్క పని కష్టసుఖములను అనుభవించడము మాత్రమేనని తెలియాలి. జీవుడు కష్టసుఖములను

అనుభవించుటకు తగిన కార్యములు చేయుటకు శరీరమును కదిలించుచున్నది ఆత్మయని తెలియాలి. ఆత్మ చైతన్యము చేత శరీరమును కదిలించుచుండగ ఏర్పడు సుఖదుఃఖములను జీవుడు లోపలనుండి అనుభవించుచున్నాడు. దీనిని బట్టి జీవునికి శరీరమును కదలించుశక్తి లేదు. కేవలము ఒక్క ఆత్మకే ఆ శక్తి ఉన్నదని తెలియుచున్నది. ఆత్మయొక్క చైతన్యశక్తి శరీరములోని సకల అవయవములను కర్మప్రకారము కదిలించుచు, జీవరాసులను ప్రపంచములో చరించునట్లు చేయుచుండగ, నాచేతనే శరీరము కదలుచున్నదని జీవుడు భ్రమించుచున్నాడు. అజ్ఞానముచేత ఆత్మంటే ఏమిటని, దాని పని ఏమిటని తెలియక జీవుడు తానే అన్ని పనులకు కారణమనుకొనుట సహజముగనున్నది. వాస్తవమునకు జీవుడు వేరు, ఆత్మవేరు. కర్మరీత్యా జరుగవలసిన పనులన్నిటిని ఆత్మయే శరీరముచేత చేయిస్తున్నది.

ఇపుడు అసలు విషయానికొస్తాము. సజీవమైన శరీరములో ఆత్మ జీవాత్మ అను రెండు ఆత్మలు ఉన్నాయి. ఇది అన్ని శరీరములకు వర్తించు విషయము. ఉదాహరణకు బల్లి శరీరము తీసుకొందాము. దానియందు రెండు ఆత్మలున్నవి, బల్లిశరీరము గోడమీద కదలుటకు దానిలోని ఆత్మే కారణము. అది కదులుచు పోవుచుండగ పట్టుదప్పి కాలుజారి క్రిందపడింది. అపుడు దాని కొనతోక తెగిపోయింది. బల్లి పూర్తి శరీరమంత ఒక భాగముగ, చివరి కొంత తోక మాత్రము వేరొక భాగముగ విడిపోయాయి. బల్లి పూర్తి శరీరమంతయు సహజముగానే ఉన్నది. కావున అది వెంటనే తిరిగి గోడమీద ప్రాకుచు పోయినది, కాని క్రింద తెగిపడిన తోక ఒక నిమిషము పాటు వంకరలు తిరుగుచు ఎగిరెగిరి పడుచుండును. ఈ సంఘటన చాలామంది చూచియే ఉందురు. తెగిపడిన తోక కదలుటకు ఆత్మచైతన్యమే కారణము. బల్లి శరీరములో తలనుండి తోక వరకు వ్యాపించిన ఆత్మచైతన్యము తోక తెగిపోగ అందులో కొంత మిగిలి పోయింది. ఆ కొంత శక్తి వలన తోక ఎగిరిపడుచు కదిలింది. ఆ శక్తి అయిపోయిన వెంటనే అది నిలిచిపోయి చలనములేనిదైనది. బల్లి శరీరములో మిగతా ముఖ్యమైన భాగములన్ని ఉన్నవి. కావున అందులో ఆత్మ నివాసయోగ్యమేయైనందున, బల్లిశరీరము కదులుచు బ్రతికే

ఉన్నది. శరీరమంతా వ్యాపింపబడిన ఆత్మ కొద్దిగ ఖండింపబడినదని ఈ సంఘటన ద్వారా తెలియుచున్నది.

కోడి శరీరము నుండి దాని తలను వేరుచేసినపుడు ఆ కోడి శరీరము కొద్దిసేపు తనకలాడుట కూడ అందరికి తెలిసిన విషయమే. ఇక్కడ శరీరములోని ముఖ్యమైన భాగములన్నింటిని తలనుండి వేరు చేయడములో తలలోని ఆత్మ ఒక భాగముగను, శరీరమంత వ్యాపించిన ఆత్మ ఒక భాగముగను ఖండింపబడ్డాయి. తలలోని కర్మకనెక్షన్ మరియు ఆత్మచైతన్య ప్రసారము తెగిపోయిన దానివలన ఆ శరీరము మృత్యువును పొందినది. శరీరము లేదు కావున తల భాగములోని ఆత్మ జీవాత్మలు ఆ భాగమును కూడ వదలి వెళ్ళి పోవుచున్నవి. ఈ సంఘటనలో ఆత్మ రెండు భాగములుగ ఖండింపబడినదని తెలియుచున్నది. ఆశ్చర్యముగ ఉన్నది కదా! **ఆత్మ ఆయుధములచేత తెగదు, నీటికి నానదు, అగ్నికి కాలదు అని భగవద్గీతలో చెప్పగ "ఈయనకేమి పిచ్చి పట్టింది ఆత్మ ఖండింపబడుచున్నదంటున్నాడు"** అని మీరనుకోవచ్చును దానికి మా సమాధానమేమనగా! భగవద్గీతలో చెప్పినది నిజమే, కాని మనము అవగాహన చేసుకోవడములో పొరపాటుపడ్డాము. అక్కడ ఖండింపబడదని చెప్పినది ఏ ఆత్మను గురించి? జీవాత్మనా? ఆత్మనా? పరమాత్మనా? ఈ మూడు ఆత్మల వివరము తెలియకపోతే మనము పప్పులో కాలువేసినట్లే. అంతెందుకు నేనొక ప్రశ్నవేస్తాను హత్య అంటే చంపబడడమని అర్థమున్నపుడు ఆత్మహత్య అన్నప్పుడు ఆత్మ చంపబడడమనియేగా అర్థము. అవును ఆత్మ ఖండింపబడుచున్నది. ఖండింపబడిన శరీరములోని ఆత్మ కూడ ఖండింపబడుచున్నది. ఖండించబడి ముక్కలైన భాగములలోని ఆత్మ కదలికలను మనము కళ్ళతో చూడగల్గి కూడ అర్థము చేసుకోలేకపోయాము. ఒక వ్యక్తి ఇంకొక వ్యక్తిని నరికినపుడు, నరకబడిన శరీరములోని ఆత్మ శరీరముతో బాటు ఛిద్రమై చలనములేనిదై పోవుచున్నది. అట్లే ఒక జంతువు ఇంకొక జంతువును వేటాడి చీల్చి వేసినపుడు కూడ ఆత్మ అదే స్థితి పొంది చలనములేనిదై పోవుచున్నది. యదార్థ సంఘటన అయిన ఒక ముఖ్య ఉదాహరణను కూడ ఇక్కడ పరిశీలిద్దాము.

రైల్వేవంతెన మీద  ఒక విద్యార్థి తనతోపాటు సైకిల్‌ను త్రోసుకుంటు పోవుచు, ప్రమాదవశాత్తు కాలుజారి వంతెన మీద నుండి ముప్పై అడుగుల క్రిందికిపడ్డాడు.  పడినపుడు అతనికి ఏమాత్రము రక్తగాయము కాలేదు. కాని క్రిందపడినపుడు వెన్నెముకలోని వెన్నుపాము మధ్యలోనికి తెగిపోయింది.  మధ్యలోనికి తెగిపోవడము వలన అతను చూస్తున్నట్లే నడుము నుంచి క్రింది శరీరమైన కాళ్ళు తనకలాడుచుండడము కళ్ళారా చూచాడు.  అవి ఎందుకు అలా ఎగిరిపడుచున్నవో అర్థముకాలేదు.  గుండెక్రింది వరకు వెన్నుపాము తెగిపోవడము వలన గుండె ఊపిరితిత్తులు పనిచేయుచున్నవి.  కాని క్రింది భాగమును నడిపించు చైతన్యము వెన్నుపాము ద్వారా క్రిందికి ప్రాకలేదు.  కావున అతనిలోని జీర్ణాశయము కూడ పనిచేయలేదు.  శరీరము తెగకున్నను చైతన్యము ప్రసారమగు నాడి తెగిపోవడము వలన, క్రింది భాగములోని చైతన్యము రెండు నిమిషముల కాలము తనకలాడి నిలిచిపోయినది.  సగము శరీరము చచ్చిపోయి, సగము శరీరము మాత్రము మిగిలివున్న అతను, రెండు దినములకు చనిపోవడము జరిగినది.  ఈ సంఘటనలో కూడ ఆత్మ రెండు ముక్కలై  సగము శరీరము మరణము పొంది, మిగతా సగము రెండు రోజులకు నిలిచిపోయినదని తెలియుచున్నది.

ఇన్ని సంఘటనల యొక్క ఆధారముతో శరీరములోని ఆత్మ ఖండింప బడుచున్నదని, జీవునితోపాటు మరణము పొంది వేరొక శరీరమును చేరుచున్నదని తెలియుచున్నది.  దీని ప్రకారము ఒకడు ఇంకొకనిని కత్తితో నరికి చంపినపుడు, శరీర భాగములలో వ్యాపించిన ఆత్మ కూడ నరకబడుచున్నది. కావున దానిని **'ఆత్మహత్య'** అనుట సమంజసము.  ఒకరిచేత ఇంకొకరు చంపబడుట **'హత్య'** అనుట అందరికి తెలిసినదే.  కాని అది హత్యకాదు ఆత్మహత్య అని తెలియాలి. శరీరమంతా వ్యాపించియున్న ఆత్మను  ఇంకొకరు బలవంతముగ నిలిపి వేయడమును హత్య అనకూడదు, ఆత్మహత్య అనాలి.  ఒక మనిషి ఇంకొక మనిషినిగాని, జంతువు మనిషిని కాని, చంపినట్లయితే అది హత్యకాదు **'ఆత్మహత్య'** అని తెలియాలి.  ఇంత కాలము హత్య అని దేనిని అనుకుంటున్నామో, అది ఆత్మహత్య అని తెలిసింది కదా!

అట్లే ఇంత కాలము ఆత్మహత్య అని దేనిని అనుకుంటున్నామో, అది 'హత్య' అని తెలియాలి. ఇక 'హత్య' యొక్క వివరము తెలుసుకుందాము.

శరీరములో జీవాత్మ, ఆత్మ అను ఇద్దరు పురుషులున్నారని భగవద్గీత పురుషోత్తమప్రాప్తి యోగములో 16వ శ్లోకమున చెప్పబడివున్నది. ఇందులో ఆత్మ చంపబడడము ఆత్మహత్యయని ఇందాక తెలుసుకొన్నాము. ఆత్మ జీవాత్మలు చావులోను పుట్టుకలోను ఒకదానివెంట ఒకటి పోక తప్పదు. శరీరమును ధరించునపుడుకాని, శరీరమును వదలునపుడుకాని, ఆత్మ జీవాత్మ ఇద్దరు ఒకేమారు రావడము పోవడము జరుగుచున్నది. ఆత్మ శరీరమును ముందుగా వదలాలను కొన్నపుడు దానివెంటనే జీవాత్మ కూడ పోవును. అదే విధముగా జీవాత్మ శరీరమును వదులునపుడు దానివెంట ఆత్మ పోవును. వీటి భేదములోనే 'హత్య' 'ఆత్మహత్య' అనుట జరుగుచున్నది. **ఆత్మతో పాటు జీవాత్మ పోతే ఆత్మహత్య అనియు, జీవాత్మ వెంట ఆత్మ పోవడమును హత్య అనియు అంటున్నాము.** ఇంకొక శరీరము చేత శరీరములోని ఆత్మ చనిపోవడమును ఆత్మహత్య అనుకొన్నాము. ఆ విధముగనే ఒక శరీరములోని ఆత్మచేత అదే శరీరములోని జీవాత్మ చంపబడడమును హత్య అనబడును. ఆత్మ చంపబడడము ఆత్మహత్య అయితే జీవాత్మ చంపబడడము హత్య అగుచున్నది. ఇక్కడ గమనించదగ్గ విషయమేమనగా! జీవాత్మ ఆత్మల తేడా తెలియనపుడు హత్య ఆత్మహత్యల తేడా కూడ తెలియదు.

ఒకడు తాడుతో గొంతును బిగించుకొని ఉరివేసుకొన్నాడనుకొందాము. అది ఆత్మహత్య కాదు హత్య అగును. ఆ శరీరములోని ఆత్మ తన చైతన్యము చేతనే జీవుడు ఆ శరీరములో నివశించుటకు వీలుకాకుండ చేయుచున్నది. కావున ఆత్మ జీవాత్మను చంపినట్లగుచున్నది. మరణించినపుడు ఇక్కడ జీవుని వెంట ఆత్మ పోవుచున్నది అందువలన అది హత్య అనబడును. అదే విధముగా మరణశిక్ష చెప్పబడిన ఖైదీని మరణశిక్ష అమలులో వేరొకడు గొంతుకు తాడు బిగించి చంపాడను కొనుము. అది పై విధముగ హత్యకాదు ఆత్మహత్య అగును. ఇక్కడ ఆత్మతోపాటు జీవుడు పోవుచున్నాడు. ఇక్కడ శాస్త్రబద్ధమైన ధర్మసూక్ష్మమేమనగా! ఇతర

శరీరములచేత ఒక శరీరము చనిపోయినపుడు ఆ **'చావు'** నేరుగా **ఆత్మకు** చెందును. అట్లే ఒక శరీరము ఇంకొకరి జోక్యము లేకుండ ఆత్మచేత మరణించినపుడు ఆ **'మరణము'** నేరుగా **జీవునికి** చెందును. అది ఏ విధమనగా! ఒక శరీరములోని జ్ఞానాగ్ని ఇంకొక శరీరములోని కర్మను కాల్చునపుడు అది ప్రారబ్ధమునే కాల్చును. అట్లే ఒక శరీరములోని జ్ఞానాగ్ని అదే శరీరములోని కర్మను కాల్చాలంటే అది ప్రారబ్ధమును కాల్చదు. నేరుగా సంచిత కర్మను కాల్చును. ఒకే జ్ఞానాగ్ని తన శరీరములోనైతే సంచితకర్మ మీద, ఇతర శరీరములలోనైతే ప్రారబ్ధము మీద ఎట్లు పనిచేయుచున్నదో, అదే విధముగనే ఒకే 'మరణము' తన శరీరము ద్వారా ఏర్పడితే జీవునికి, ఇతర శరీరము ద్వారా ఏర్పడితే ఆత్మకు చెందునని తెలియాలి. తన శరీర మరణమునకు తానే కారణమైనపుడు అది **'హత్య'** అని, ఇంకొకరు కారణమైనపుడు **'ఆత్మహత్య'** అని శాస్త్రబద్ధముగా ఉండగ అజ్ఞానము వలన దానికి వ్యతిరిక్తముగ హత్యను ఆత్మహత్య అని, ఆత్మహత్యను హత్యయని అందరు అనుకుంటున్నారు. ఆత్మహత్యగాని, హత్యగాని అకాలమరణములోనివని జ్ఞాపకముంచుకోవలెను.

ఆత్మ ప్రయత్నముతో జీవుడు చనిపోవడము సూత్రబద్ధముగా హత్య అగును. దాని వలన వచ్చు పాపము ఆత్మను అంటదు. జీవుడు చంపబడుటచేత వచ్చు పాపము ఆత్మకు అహములేదు కావున అది ఆత్మనంటదు. ఒక శరీరము వేరొక శరీరము యొక్క చావుకు కారణమైనపుడు అది ఆత్మహత్యయగును. అందులో వచ్చు పాపము చాలా భయంకరమైనది. దైవమునే చంపినంత పాపము జీవునికి ఏర్పడుచున్నది. ఒక శరీరములోని ఆత్మ మరణమునకు ఇంకొక శరీరములోని ఆత్మచైతన్యమే కదా కారణము అటువంటపుడు ఆత్మహత్య పాపము జీవునికి ఎందుకు అంటును? అను ప్రశ్న రాగలదు. దానికి సమాధానము ఆత్మహత్యకు ఆత్మ కారణమనుట నిజమే, జీవుడు ఏమి చేయనివాడు అను సూత్రము ప్రకారము వానికి ఆత్మహత్యకు సంబంధములేదు. అయినప్పటికి శరీరములోని అహము జీవుని చేత తానే చేసినట్లు ఒప్పించుచున్నది. కనుక అక్కడ వచ్చు పాపము జీవుని కర్మకూడలిలో చేరుచున్నది. సంబంధములేని కర్మను జీవుడు అనవసరముగా తన మీద అహము చేత వేసుకొనుచున్నాడు.

మిగతా ప్రపంచపు పనులలో జీవునకు చిన్నచిన్న కర్మలు అహముచేత వచ్చుచుండును. వాటి ఫలితము అంతపెద్దగా లేకపోయినా మరణ విషయములో వచ్చు కర్మ చాలా భయంకరమైనది. అది ఆత్మనే హత్య చేసినది, కావున జీవుడు ఎక్కడ అహము పొందినా చిన్న కర్మవచ్చును కాని, **చావు** విషయములో **అహము** పొందడము వలన భయంకరమైన కర్మవచ్చును. అందువలన **ఆత్మహత్య మహాపాపమని** పెద్దలన్నారు. నేడు భూమి మీద కొంతమంది కిరాయికి చాలా మందిని చంపుచున్నారు. హత్య, ఆత్మహత్యల వివరము తెలియనివారు తాము హత్య చేశాము అనుకుంటున్నారు. వారు చేసినది ఆత్మహత్యయని వారికి తెలియదు. అందువలన వచ్చు పాపము భయంకరమైనదని కూడ వారికి తెలియదు. ఇప్పుడు ఈ విషయము తెలుసుకున్న పెద్దలు ప్రజలకు ఆత్మ జీవాత్మల భేదములు, హత్య ఆత్మహత్యల భేదములు తెలిపి వారిని అజ్ఞానము నుండి బయటపడునట్లు చేయుదురని కోరుచున్నాము.

ఒక శరీరములో జీవాత్మ ఒకడే ఐనపుడు దానికి కాపలాగా ఉన్న ఆత్మ కూడ ఒకటే. అన్ని శరీరములలో ఒకే నిబంధనతో, ఒకే మాదిరి వేరు వేరు ఆత్మలు ఉండుట వలన ఒక శరీరములోని ఆత్మకు వర్తించినది ఒకే మారు అన్ని శరీరములలో వర్తించదు. కావున ఒక శరీరములో హత్య కావింపబడినప్పటికి అన్ని శరీరములలో ఆత్మ హత్య కావింపబడలేదు. ఆత్మను విశాలముగ చూచినపుడు అది హత్యకావింప బడలేదు. ఆత్మను విశాలముగ కాక శరీరములో ఒక్క ఖండముగా చూస్తే ఆ మరణము ఆత్మహత్య అనబడును. ప్రతి శరీరములోను భిన్నముగా ఉన్న జీవాత్మ నాశనమగువాడైనను సందర్భానుసారముగ మరణములో శరీరమునకే నాశనము, జీవునకు లేదన్నట్లు, **అన్ని శరీరములలో ఒకే అంశగ ఉన్న ఆత్మ నాశనము లేనిదైనను కొన్ని మరణములలో మరణించునదిగా చెప్పబడుచున్నది. నాశనమగు జీవాత్మకు చావులేదన్నను, నాశనములేని ఆత్మకు చావు ఉన్నదన్నను చివరకు జీవాత్మకు నాశనము కలదు, ఆత్మకు నాశనములేదని తెలియాలి.** మరణమునకు, నాశనమునకు ఎంతో తేడా గలదని తెలియవలెను. ఒక్క శరీరములోని ఆత్మను

తెలుసుకోగల్గితే అది వానికి ఆత్మదర్శనమైనట్లే. సకల జీవరాసులలో ఆత్మ ఎట్లు ఉన్నదో తెలుసుకొన్నట్లేయగును. మూడవ ఆత్మయైన పరమాత్మను భూమి మీద బ్రతికివున్న ఏ జీవరాసి కాని తెలుసుకోలేదు, ఇది శాసనము. రెండవ ఆత్మను తెలుసుకొన్న తరువాత శరీరమును వదిలినపుడు మూడవ ఆత్మయైన పరమాత్మ అనునది ఏమిటో తెలియును. అటువంటివాడు తిరిగి పుట్టడు. అదే విడుదల లేక మోక్షము అంటారు. ఆత్మను తెలిసినవాడు భూమి మీద ఉండవచ్చునుగాని పరమాత్మను తెలిసినవాడు భూమి మీద ఉండడని తెలియాలి.

*(1)శ్లో॥20 : నజాయతే మ్రియతేవా కదాచిన్నాయంభూత్వా భవితావానభూయః ।*
*అజో నిత్య శ్శాశ్వతో உయం పురాణో నహన్యతే హన్యమానే శరీరే ॥*
*(పరమాత్మ)*

**భావము :** పరమాత్మ పుట్టునది కాదు గిట్టునది కాదు. ఒకప్పుడుండి మరియొకప్పుడు లేదనుటకు వీలుకాదు. నిత్యముండువాడు, పురాణుడు శరీరము చంపబడినను తాను చచ్చువాడు కాదు.

**వివరము :** ఇపుడు ఈ శ్లోకములో ప్రత్యేకించి మూడవ పురుషుడైన పరమాత్మను గురించి తెలుపుచున్నాడు. దీనితో ముగ్గురు పురుషుల విషయము కొంత అవగాహన కాగలదు. పరమాత్మ అనునది ఆత్మ జీవాత్మలవలె మరణముగాని నాశనముగాని పొందునది కాదు. ఒకచోట ఉండి మరియొక చోట లేనివాడు కాదు. సర్వము నిండి అణువణువున వ్యాపించివున్నవాడు, భూతకాలములో ఉండి భవిష్యత్తులో ఉండడనుటకు వీలులేనివాడు, ఎప్పటి నుండి కలడో తెలియని పురాణుడు, చావుపుట్టుకలు లేనివాడు, బయట బయలులోను, వస్తువు యొక్క అణువణువులోను, శరీరముల లోపలను వ్యాపించి ఉన్న పరమాత్మ, శరీరము మరణించినను దానిలోని అణువణువున కూడ ఉన్నాడు. చంపబడిన శరీరములో ఉండి కూడ చచ్చువాడు కాదని, చనిపోయిన బ్రతికిన శరీరములలో కూడ ఒకే మాదిరి ఉన్నాడని తెలియాలి.

(1)శ్లో॥21 : వేదా ఽ వినాశినం నిత్యం  యఏన మజమవ్యయం ।
కథం స పురుషః పార్థ ! కం ఘాతయతి హన్తికమ్ ॥
(పరమాత్మ)

**భావము :** నిత్యుడు, నాశనములేనివాడు పరమాత్మయని ఎవడు తెలుసుకొనునో, వాడు అట్టి పరమాత్మను ఎట్లు హింసింపగలడు?  హింసచేయుటకునైన ఎట్లు తలచును?

**వివరము :** జీవాత్మకాక మరియు ఆత్మవలెనుకాక ఆత్మకంటే వేరైన పరమాత్మ నాశనము చెందనివాడని, అంతట నిండి ఎల్లప్పుడుండువాడని, తెలిసిన వాడెవ్వడైన పరమాత్మను బాధపెట్టుదునని కాని, పరమాత్మ బాధపడునని కాని తలపోయడు. పరమాత్మకు ఏదిలేదు, చావుపుట్టుకలు కాని, కష్టసుఖములుగాని పొందువాడు కాదు.  ప్రపంచములో దేనికి తెలియని వానిని ఎవడైన ఎట్లు తాకగలడు? ఇంకను పరమాత్మ ఎట్టిదనిన,  ఈ ప్రపంచమంతయు నాశనమైనప్పటికి నాశనము కాక నిలిచివున్నది.  పరమాత్మ సృష్టి ఆదిలో  ప్రకృతి యొక్క పంచభూతములను తయారుచేసి దాని ద్వార జనితములైన గుణముల నుంచి బుద్ధికి, బుద్ధి నుండి చిత్తమునకు, చిత్తమునుండి మనస్సుకు, మనస్సు నుండి శరీరము బయటనున్న జ్ఞానేంద్రియములైన కన్ను, ముక్కు, చెవి, నాలుక, చర్మములకు అనుసంధానము ఏర్పరచి,  పెద్ద యంత్రాంగము తయారు చేసి పెట్టాడు.  మనస్సుకు శరీరములో రెండు పనులను కల్పించి  ఒకటి బయటి ఇంద్రియములకు లోపలి ఇంద్రియములకు సమాచారమును చేరవేయు మధ్యవర్తిగను, ఆ పనిలేనపుడు విషయములను మననము చేయడమను రెండవ పనిని నిర్ణయించి పెట్టాడు.  మనస్సు విషయములను జ్ఞాపకము చేయగ, విషయమునకు తగిన గుణములు చెలరేగగ, వాటిని బుద్ధి రెండు విధములుగా యోచించగ, యోచించిన రెండు విధానములలో చిత్తము కర్మానుసారము నిర్ణయించగ, ఆ నిర్ణయము మనస్సు ద్వారా  బయటి శరీర భాగలములైన కర్మేంద్రియములకు చేరగ, మనస్సు ఆదేశము ప్రకారము అవి పనిచేయుచున్నవి.  ఈ విధముగా బయటి ప్రపంచమున లోపల చెలరేగిన

విషయము కార్యరూపము దాల్చుచున్నది. కార్యములు చేయునట్లు యంత్రాంగము అమర్చినది పరమాత్మయే. కర్మానుసారము కార్యరూపములై జరుగు పనులను తానే చేయునట్లు జీవుడు అహము చేత నేనే అనుకొనుట వలన జరుగు పనులలో పాపముకాని, పుణ్యముకాని తిరిగి ఆ జీవునకు ఏర్పడునట్లు, అట్లు ఏర్పడుటవలన వచ్చిన కర్మను తిరిగి శరీరము ద్వారా అనుభవించునట్లు అమరిక ఏర్పరచినది కూడ పరమాత్మయే. ఇన్ని అనుసంధానముల నేర్పరిచిన దానివలన, ప్రపంచమంతయు నిండిన మనుజులందరు తమలోని యంత్రాంగము తెలియక కర్మానుసారము బయటి కార్యములనే చేయుచుండుట వలన, మనము చూస్తున్న గందరగోళ ప్రపంచమేర్పడినది. ఎవరేమి చెప్పిన వినే స్థితిలో లేరు. జ్ఞానము తెలుసుకొమ్మంటే మాకు తీరికెక్కడిదంటున్నారు. పరమాత్మ అలా తీరికలేని పనులలో ఇరికించడమే కాక, తన జ్ఞానము తెలుసుకొనుటకు శ్రద్ధ అను దానిని కూడ శరీరములో వుంచాడు. శ్రద్ధ కల్గినవాడు జ్ఞానమును తెలుసుకొనునట్లు కూడ చేశాడు. ఈ విధముగా పరమాత్మ మానవులను మాయలోను ఇరికించాడు. దానినుండి తప్పుకొనుటకు దారిని కూడ ఏర్పరిచినాడు.

ఇంత పెద్ద ప్రపంచమునే సృష్ఠించిన పరమాత్మ ఈ ప్రపంచమంతయు తిరిగి నాశనమగునట్లు, తరువాత కొంతకాలమునకు సృష్ఠింపబడునట్లు కూడ ఏర్పరిచి పెట్టాడు. ఈ ప్రపంచమంతయు నాశనమైనపుడు కూడ పరమాత్మ నిలిచివున్నాడు. దీనిని బట్టి పరమాత్మకు మరణముగాని, నాశనముగానిలేదని తెలియుచున్నది. ప్రపంచమునే సృష్ఠించి దానిలో ఎవరెవరు వారివారి పనులను చేసుకొనునట్లు అమర్చిన మేధావి పరమాత్మ. **స్వయంగా తానే మనుజుల మధ్యకు వచ్చి, నేను మిమ్ములను తయారు చేసినవాడినని చెప్పినప్పటికి, నమ్మనట్లు యంత్రాంగమును తయారు చేసిన మేధావి పరమాత్మ. మనుజులనే కాక సకల జీవులను, భూగోళమును, చంద్రగోళమును, సూర్యగోళమును, నక్షత్రములను తన శక్తి చేతనే ఆడించుచున్నాడని తెలిసినవాడెవడైన, అట్టి వానిని చంపుదునని కాని ఆయన చంపబడునని కాని ఎట్లు తలచును.**

ఇంతవరకు మూడు ఆత్మల వివరము తెలియజేయుచు, చావులో ఒకదాని కొకటి ఎలా భేదములున్నవో తెలియజేయుచు, మూడు ఆత్మల వివరములలో మరణము గూర్చియే తెలిపిన భగవంతుడు ఆ మూడు ఆత్మలను అర్థము చేసుకొనునట్లు వాటి విధానమును గూర్చి ఇంకనూ తెల్పుచు జీవాత్మ ఎలా దేహమును పొందుచున్నదో మరియు వదలుచున్నదో క్రింది శ్లోకములో తెలియజేయు చున్నాడు.

1) శ్లో॥22: వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరో ఽపరాణి।
తథా శరీరాణి విహాయ జీర్ణా న్యన్యాని సంయాతి నవాని దేహీ ॥
(జీవాత్మ)

**భావము :** మానవుడు పాతవస్త్రమును వదలి క్రొత్తవస్త్రమును ధరించినట్లు ఆత్మ శిథిలావస్థకొచ్చిన పాతదేహమును వీడి క్రొత్త శరీరములో ప్రవేశించుచున్నది.

**వివరము :** భగవంతుడు ఈ శ్లోకమున చెప్పిన భావము నూటికి నూరుపాల్లు చాలా మందికి అర్థము కాలేదని మేము తెలుపుచున్నాము. ఎందుకనగా ఈ శ్లోక భావమునకు వ్యతిరేక వివరము తమకు తెలియకుండానే వారియందు నిలిచి పోయినది. భగవంతుడు ఈ శ్లోకమున ఉదాహరణగ **పాతవస్త్రము, క్రొత్త వస్త్రమని చెప్పి పాతదేహము, క్రొత్తదేహమని కూడ వివరించాడు.** కాని ఇక్కడ క్రొత్త దేహమంటే ఏమిటో తెలియక చాలామంది పై శ్లోక భావమునే హత్య చేశారని చెప్పవచ్చును. విచక్షణ, వివరణ చూపులేని వారందరు గీతలో క్రొత్త దేహమన్నప్పుడు తలూపారు. మరికొన్ని పుస్తకములలో గర్భమందే పూర్తి తయారుకాని అసంపూర్ణ శరీరములో జీవుడు ఆరు నెలలకే ప్రవేశించునన్నపుడు కూడ తలూపారు. అట్లే పాతగృహము వదలి క్రొత్త గృహములో ప్రవేశించుచున్నాడన్నపుడు తలూపారు. ఆ క్రొత్త గృహమునకు పైకప్పుబడకనే తలుపులుంచకనే సగము కూడ తయారుకాని దానిలోనికి ప్రవేశించుచున్నాడన్నప్పుడు కూడ తలూపారు. క్రొత్త ఇల్లంటే పూర్తి తయారైనది

కదాయని, క్రొత్త శరీరమంటే పూర్తి రూపురేఖలు దిద్దుకొన్నది కదాయని, యోచించలేక పోయారు. ఎవరెట్లనుకొనిన భగవంతుడు చెప్పుమాట ఏమంటే! పాతశరీరమును వదలిన ఆత్మ, పూర్తి తయారైన క్రొత్తదనిపించుకొనిన శరీరములో చేరుచున్నదని తెల్పుచున్నాడు. జీవాత్మ ఎచట గలదో ఆత్మకూడ దానితో కూడి ఉన్నది. కావున జీవాత్మ జన్మించితే దానితో పాటు ఆత్మకూడ మరుజన్మమున ప్రవేశిస్తున్నది. జీవాత్మ ఎలా శరీరములు మారుచున్నదో తెలిస్తే, ఆత్మకూడ క్రొత్తదేహమునెలా చేరుచున్నది తెలియును. కావున దానికి కావలసిన పూర్తి సవివరము ఆధ్యాత్మికరీత్యా, విజ్ఞాన (సైన్సు)రీత్యా మరియు సిద్ధాంతరీత్యా క్రింద వ్రాయుచున్నాము చూడండి.

స్త్రీ పురుష సంయోగములో పురుషుని వీర్యము స్త్రీయోని మార్గమున ప్రవేశించి గర్భకోశమును చేరి, అందు శరీరముగా తయారగుటకు ప్రారంభమగుచున్నది. పురుషుని వీర్యము స్త్రీ గర్భములో పూర్తి శరీరముగా తయారగుటకు దాదాపు తొమ్మిది నెలల కాలము పట్టుచుండును. స్త్రీగర్భములో మావి అను తిత్తియందు పూర్తిగా తయారైన శిశుశరీరము జీవములేనిది. చాలామందికి తెలియని విషయము కూడ ఇదియే. ఆరవనెలయందు శిశుశరీరమునకు ప్రాణము వచ్చునని చాలామంది పొరబడుచున్నారు. తల్లి గర్భములోనున్న శిశువునకు ప్రాణము రావడము అబద్ధము. గర్భమున పూర్వజన్మ జ్ఞప్తికలిగి వాపోవుట పూర్తి అబద్ధము. ఇక్కడ కొందరికొక పెద్ద సంశయమేర్పడవచ్చును. అది ఏమనగా? శిశు శరీరము లోనికి ప్రాణము రాకపోయినచో, గర్భములోని శిశువు కదులుచుండునటుల తెలియుచున్నది కదా! అది ఎట్లు జరుగును? ఒక వేళ ఆరవ నెలయందు ప్రాణము రాకపోయినట్లయితే, శిశువు గర్భములో కదలకుండును కదా! ఆరవ నెలనుండియే కదలిక జరుగుచున్నది. కావున శిశు శరీరమునకు ప్రాణము గర్భములోనే వచ్చినట్లు మేము నమ్ముచున్నామని అడుగవచ్చును. దానికి మా సమాధానము తెలిపెదము. దూరము నుండి చూచి చింతచెట్టులాగయున్న జమ్మిచెట్టును చింతచెట్టనుకొన్నట్లు, గర్భములో శిశువు కదలికకు కారణము తెలియని మనము గర్భములోనే శిశువుకు ప్రాణమొస్తుందనడములో విశేషమేమున్నది. దగ్గరకు పోయి చూచిన కదా

చింతచెట్టులాగయున్న జమ్మిచెట్టు, చింతచెట్టుకాదని తెలిసేది. నిజముగా గర్భములో జరుగుచున్న మార్పులను గమనించిన కదా! మనకున్న సంశయము తీరునది. కావున గర్భములో శిశుశరీరము పొందు మార్పులను గురించి తెలుసుకొందాము.

స్త్రీ గర్భము ధరించిన మొదటి నెలనుండి దాదాపు ఆరునెలల వరకు శిశు శరీరము తయారై ఆకృతిని చేరుకొనును. ఆరునెలల వరకు శిశుశరీరము తయారగునట్లు తల్లి శరీరములోని నాడులే చేయుచున్నవి. తల్లి శరీరములోని బ్రహ్మనాడి నుండి బయలుదేరిన కొన్ని నరములు గర్భకోశమును ఆక్రమించి, శిశు శరీరముతో బొడ్డు ద్వార సంబంధము కలిగి, ఆ శరీరమును పెరుగునట్లు చేయుచున్నవి. తల్లి శరీరములో భాగములుగా జీర్ణాశయము, గుండె, కాలేయము మొదలగు అవయవములున్నట్లే, గర్భమును కూడ ఒక భాగముగా లెక్కించు కోవలయును. జీర్ణాశయము, గుండె మొదలగు అవయవములను నాడులు ఆక్రమించి ఏవిధముగా కదలించుచున్నవో, ఆ విధముగనే ఆరునెలల తరువాత గర్భములోని శిశువును కూడ అప్పుడప్పుడు నాడులు కదలించుచుండును. కుమ్మరివాడు కుండను ఒక ఆకృతి వచ్చువరకు ఒకే స్థితిలో తయారుచేసి, ఒక ఆకృతి ఏర్పడిన తరువాత కుండను త్రిప్పిత్రిప్పి కొట్టి పూర్తికుండగా ఎట్లు తయారుచేయునో, అట్లే ఆత్మ బ్రహ్మనాడి ద్వారా ఆరునెలల వరకు శిశుశరీరమును ఒక ఆకృతి వచ్చునట్లు చేసి, ఆ తరువాత ఆ శరీరమును తలక్రిందులుగను, అడ్డముగను మరియు ఇతర స్థితులుగా మావియందు అప్పుడప్పుడు త్రిప్పుచు, పూర్తి ఆకృతి వచ్చి జీవుడు చేరుటకు తగిన రీతిగా శరీరమును తయారుచేయును. నాడులు కదిలించు కదలికను బట్టి కొందరు గర్భములో ఆరవ నెలయందే శిశు శరీరమునకు ప్రాణము వచ్చినదని భ్రమించుచున్నారు.

తల్లి గర్భములో నాడులు శిశుశరీరముతో సంబంధము కల్గియుండి, తొమ్మిది నెలల పర్యంతము జీవునికి నివాసయోగ్యముగా శరీరమును తయారగునట్లు చేసి, పూర్తి శరీరము తయారైన వెంటనే ఒక్క క్షణము కూడ గర్భములో శిశువు శరీరమును ఉంచక, గర్భకోశమును ముకుళింపజేసి, యోని ద్వారము వికసింపజేసి, శిశు

శరీరమును బయటికి త్రోసివేయుచున్నవి. శిశుశరీరము బయటపడుదాక తల్లి గర్భములోని నాడులు శిశుశరీర సంబంధము కల్గియుండును. ఎప్పుడైతే గర్భము నుండి శిశుశరీరము బయటకు వచ్చునో, అప్పుడే గర్భములోని నాడుల సంబంధములు నిలిచిపోవుచున్నవి. గర్భము నుండి బయటపడు శిశుశరీరము శవమువలె బయటపడును. శరీరము బయటపడు వరకు ప్రాణముండదు. కావున దానిని శవములాగనే చెప్పుకోవలయును. ఇప్పుడు కొందరు *'గర్భములోని శిశువుకు ప్రాణము లేకపోతే అది కుళ్ళి తల్లి ప్రాణమునకే హాని కల్గించును కదా! ఆరు నెలల తరువాత ఎప్పుడైతే గర్భములో పిండము కదలక నిలిచిపోవునో అప్పుడే తల్లికి అపాయము సంభవించుచున్నది కదా! పిండము కదలిక ఎప్పుడైతే నిలిచిపోయి తల్లికి బాధ కల్గుచున్నదో, అప్పుడు వైద్యశాలకు తీసుకుపోతే అక్కడ వైద్యుడు ఈమెకు పిండము లోపలనే చనిపోయినదని చెప్పి, ఆలస్యము చేసినచో ప్రమాదమని ఆపరేషన్ (శస్త్రచికిత్స) చేసి పిండమును బయటికి తీసివేయడము కూడ జరుగుచున్నది కదా! ఏమి తెలియని మొరటువారు కూడ పిండము కదలికతో శిశువుకు ప్రాణము వచ్చినదని, పిండము యొక్క కదలిక నిలచిపోయిన వెంటనే శిశువుకు ప్రాణము పోయినదని తెలుసుకొనుచున్నారే! మీ మాట ఎట్లు నమ్మదగును? అంతే కాక పిండములో ప్రాణము లేకపోయిన వెంటనే తల్లికి ప్రమాదము జరుగుట కూడ తెలిసిన విషయమే. ఈ విధముగ ప్రత్యక్షముగా తెలియుచుండుట వలన గర్భములోనే శిశువుకు ప్రాణమొస్తుందని మేము నమ్ముచున్నాము'* అని అడుగవచ్చును. దానికి మా సమాధానము ఏమనగా!

గర్భములో ఆరవ నెలయందు కదలిక వచ్చు మాట నిజమే. ఆ కదలిక నిలిచిపోయిన వెంటనే తల్లికి ప్రమాదము సంభవించు మాట కూడ నిజమే. కాని అంత మాత్రమున శిశువుకు ప్రాణమొచ్చినదని, పోయినదని అనుకోవడము చాలా పొరపాటు. ఆరవనెలలో ప్రాణము వచ్చినదనిన, అంతవరకు ప్రాణములేదనియే

కదా అర్థము, ప్రాణములేని సమయములో తల్లికి ప్రమాదము సంభవించవచ్చును కదా! నిజము తెలియక అందరు అక్కడే పొరపాటుపడుచున్నారు. వాస్తవ విషయము ఏమనగా! మన శరీరములో కొన్ని అవయవములున్నను మనకు ఏ హాని కలుగకుండునట్లు, గర్భస్థ శిశువు తల్లి శరీరములో ఒక భాగముగా ఉండి, తల్లికి ఏ హాని కలిగించకుండ ఉండును. తల్లి శరీరములోని నాడులే శిశుశరీరమును కూడ ఆక్రమించి ఆ శరీరమును పెంచుచున్నవి. అందువలన శిశుశరీరము తల్లి శరీరములో ఒక భాగముగా ఉన్నదని చెప్పవచ్చును. ఆరవ నెలనుండి నరముల వలన పిండము కదిలినను తల్లికి ఏ విధమైన బాధయుండదు. ఈ విధముగా ఉండి తొమ్మిదవ నెలయందు శిశుశరీరము పూర్తిగా తయారైన వెంటనే నరముల ఒత్తిడి వలన తల్లి ప్రసవించుచున్నది. ఈ విధముగా కాక ఎవరికైన శరీరములో ఆరోగ్యలోపము వలన ఆరవ నెలకంటే ముందు బ్రహ్మనాడి నుండి బయలుదేరిన నరముల సంబంధము గర్భకోశముతో తెగిపోయిన ఆ గర్భము తల్లి శరీరములో వేరు పదార్థమై అక్కడ నిలువకుండ స్రవించిపోవును. దీనినే **'గర్భస్రావము'** అని అందురు. ఇది చాలా మంది స్త్రీలకు ఆరునెలల లోపల జరుగుచుండును. ఆరునెలల లోపల శిశుశరీరము ఒక స్థాయికి వచ్చియుండదు. కాబట్టి రక్తముగానో, రక్తపు ముద్దగానో బయటికి పోవును. రక్తముగాను, మెత్తని రక్తపుముద్దగాను ఉండుట వలన బయటికి పోవుటకు అనుకూలముగా ఉండును. ఒకటి రెండు నెలల గర్భస్రావము ఎక్కువ బాధను కలిగించదు. నెలలు ఎక్కువ అయిన కొద్ది గర్భస్రావములో బాధ ఎక్కువగును.

ఆరవ నెల తరువాత పిండము ఒక ఆకృతి ధరించి స్రవించుటకు వీలుకాక ఉండును. తల్లి అనారోగ్యము వలన ఆరవనెల తరువాత గర్భకోశములో నాడులు గర్భముతో సంబంధము లేకుండా పోయిన ఎడల, ఆ గర్భము స్రవించుటకు వీలులేనందు వలన, ఆ గర్భస్థ శిశుశరీరమునకు తల్లి శరీరముతో సంబంధము లేక వేరు పదార్థముగా అక్కడనే నిలిచిపోవును. నరముల ఒత్తిడి గర్భకోశము మీద లేనందు వలన శిశుశరీరము ఇతర పదార్థముగా గర్భకోశములోనే నిలిచిపోయి

కుళ్ళుటకు మొదలుపెట్టును. శిశుశరీరము ఉబ్బుకొలది దానిని ఆనుకొని ఉండు అవయవములకు ఒత్తిడి ఏర్పడును. ఆ స్థితిలో ఉబుకుచున్న శిశుశరీర ఒత్తిడికి మిగిలిన సున్నితమైన అవయవములు ఒకదానికొకటి ఒత్తిడి కలుగజేసుకుంటుపోయి చివరకు గుండెకు ఒత్తిడి కల్గించును. గుండెకు కొద్ది మాత్రము ఒత్తిడి తగిలిన వెంటనే నిలిచిపోవు ప్రమాదము కలదు. అదృష్టవశాత్తు వెంటనే వైద్యుల దగ్గరకుపోయి చెడిపోవుచున్న శిశుశరీరమును బయటకు తీసివేసినట్లయితే తల్లి బ్రతుకుటకు వీలుకల్గును. ఈ విషయమిట్లుండగా మనము వేరువేరు విధములుగ పోల్చుకొని గర్భములోనే ప్రాణము వచ్చినది పోయినది అనుకొనుట జరుగుచున్నది.

తల్లి ఆరోగ్యము సరిగా ఉండి పూర్తిగా తయారైన శిశుశరీరము తొమ్మిది నెలలకు గర్భకోశములోని నరముల ఒత్తిడి వలన బయటపడుచున్నది. **ఒక తానులోని వస్త్రము దర్జీవాని వలన కుట్టబడి ఒక వ్యక్తి ధరించుటకెట్లు యోగ్యమైయున్నదో, అట్లే గర్భకోశము నుండి బయటపడు శరీరము కూడ జీవుడు నివాసము చేయుటకు అనుకూలముగ నరముల చైతన్యము చేత తయారు చేయబడి బయటికి వచ్చుచున్నది.** ఆ విధముగా బయటికి వచ్చిన శరీరమునందు జీవుడు ప్రవేశించుచున్నాడు. చనిపోయిన వెంటనే జీవుడు ఏమాత్రము ఆలస్యము లేక బయటికొచ్చిన క్రొత్త శరీరమును ధరించుచున్నాడు. దీనినే గీతాశాస్త్రములో ***'పాతవస్త్రమును విడిచి క్రొత్తవస్త్రమును ధరించునట్లు, జీవుడు నాశనమైన పాతశరీరమును వదలి క్రొత్త శరీరమును ధరించుచున్నాడు'*** అని పరమాత్మ అన్నాడు. జీవుడు క్రొత్త శరీరమును ధరించుట వాని కర్మానుసారముగా ఉండును. జీవుడు చేసుకొన్న పాపపుణ్యములను అనుసరించియే క్రొత్త శరీరము కూడ లభ్యమగును. ఒక తల్లిగర్భము నుండి బయటపడిన శరీరమును ధరించుటకు తగిన జీవుడు వేరొక శరీరము నుండి వచ్చి ప్రసవింపబడిన శరీరములో ప్రవేశించుచుండును. తల్లిగర్భము నుండి బయటపడు శరీరము యొక్క తల బయటికి వచ్చినంత మాత్రముననే ఆ శరీరములో జీవుడు ప్రవేశించుటకు అవకాశము కలిగియుండును. అందువలన కొద్ది మాత్రము బయటికి వచ్చిన శరీరము కూడ ప్రాణము కలిగి అరుచుట మొదలుపెట్టును. కొన్ని చోట్ల

ఒక నిమిషము మొదలుకొని గంట రెండుగంటల వరకు శిశుశరీరములోనికి ప్రాణము రాకుండుట సంభవించుచున్నది. దానికి కారణము ఆ శరీరములో ప్రవేశించు జీవుడు పాతశరీరమును వదలడములో ఆలస్యమై ఉండవచ్చును. అనగా ఆ శరీరములో ప్రవేశించు జీవుడు వేరొక చోట మరణించుట ఆలస్యమైనదన్న మాట. అందువలన ఇక్కడ కూడ శిశుశరీరము బయటికి వచ్చిన తరువాత ఆలస్యముగానే జీవుని ప్రవేశము జరుగుచున్నది. కొన్ని చోట్ల శిశుశరీరము బయటికి వచ్చిన తరువాత ప్రాణము వచ్చుటకు కొన్ని గంటల కాలము జరిగిన సందర్భములు కూడ కలవు. 12 గంటల తర్వాత ప్రాణము వచ్చిన సంఘటనను 136 వ పేజీలో చూడవచ్చును.

ప్రసవింపబడిన శరీరములోనికి జీవుడు ఆలస్యముగా ఎందుకు చేరు చున్నాడని తెలియని గ్రామీణ ప్రాంత మంత్రసానులు, మావియందు ప్రాణమున్నదని మావిమీద నీళ్ళుపోసి తట్టుచుందురు. తెలియనితనముతో ఇక్కడ మంత్రసానులు మావిని నీటితో తట్టుచుండగా, జీవుడు వేరొక చోటినుండి వచ్చి శరీరములోనికి ప్రవేశించుచున్నాడు. జీవుడు ప్రవేశించినపుడే శ్వాస శరీరములోనికి ప్రవేశించు చున్నది. అందువలన మొదటి శ్వాసతో జన్మకలుగుచున్నదని చెప్పవచ్చును. శిశు శరీరములో జీవుడు ప్రవేశించగానే అరుచుటకు మొదలు పెట్టును. అపుడు మంత్రసానులు మావిలోని ప్రాణము శిశువులోనికి వచ్చినదని బొడ్డుకోయుదురు. ప్రాణము రాకముందు బొడ్డును కోసిన, మావిలోని ప్రాణము శరీరములోనికి రాలేదని వారి నమ్మిక. అందువలన ప్రాణము రాకముందు బొడ్డుకోయరు. ప్రాణము రాకముందు బొడ్డుకోసిన ఎడల, ఆ శిశుశరీరములోనికి ప్రాణము రాకపోవు మాట నిజమే. మావి నుండి ప్రాణము వస్తుందనడము మాత్రము అబద్దము.

బొడ్డు కోసిన తరువాత ప్రాణము రాకుండా పోవుటకు కారణమేమనిన, క్రొత్తగా మొలకెత్తు చింత మొలకకు, విత్తనపు బేడలు ఏ విధముగా ఆహారబలము ఇస్తున్నవో, ఆ విధముగానే క్రొత్తగా బయటపడిన శరీరమునకు, జీవుడు ప్రవేశించు వరకు మావి ఆధారమై శిశుశరీరములోని రక్తము గడ్డకట్టకుండునట్లు చేయుచున్నది.

ఆ విధముగా కొంతసేపు మాత్రము చేయగలదు. జీవుడు ప్రవేశించిన వెంటనే శ్వాస రక్తప్రసరణము జరుగుచున్నవి. కావున మావితో అవసరము లేదు. అందువలన బొడ్డుత్రాడును కోసివేసి మావిని వేరు చేయుచున్నాము. జీవుడు శరీరములో ప్రవేశించక ముందే బొడ్డును కోసిన, రక్తము చల్లారి శరీరములో గడ్డకట్టుకుపోయి జీవుడు ప్రవేశించుటకు శ్వాస జరుగుటకు అయోగ్యమగును. అందువలన ముందే బొడ్డుకోయు పద్ధతి మంచిదికాదు. ఒకవేళ తెలియనివారు ముందే బొడ్డు కోసిన ఆ శరీరములోని రక్తము చల్లారక ముందే ఒక నిమిషము లోపల జీవుడు వచ్చి చేరినా చేరవచ్చును. ఆ నిమిషములోనే వచ్చి చేరలేకపోతే ఆ శరీరములో రక్తము గడ్డకట్టి పనికిరానిదై పోవును. అందువలన తెలిసిన వారుకాని, తెలియని వారుకాని, ప్రాణము రాకముందే బొడ్డుకోయరాదు. బొడ్డు ముందు కోయని కారణమున మావినుండే ప్రాణమొస్తున్నదని చాలామందికి నమ్మికయున్నది. ఆ నమ్మికయున్న మంత్రసానుల మాటవిని *'ఏమమ్మా మీరు ఆరవ నెలలో శిశువుకు ప్రాణమొచ్చినదని అంటుంటారే , అట్లయిన తల్లి ప్రసవించినపుడు శిశు శరీరములో ప్రాణమొచ్చినది శిశువుకా? లేక మావికా? శిశువుకు ప్రాణమొచ్చియుంటే అది శిశువులో ఉండక మావిలోనికి ఎందుకు పోయినది, తిరిగి శరీరములోనికి ఎందుకు వస్తున్నది ?* అని అడిగితే వారు ఏమాత్రము సమాధానము చెప్పలేరు.

మన జన్మను గురించి మనమే తెలుసుకోలేని అజ్ఞాన అంధకారములో ఉండి చీకటిలోనున్న వస్తువును గురించి ఊహించి చెప్పినట్లు, తెలియని పుట్టుకను గురించి కొందరు ఆరవనెలయందు జీవుడు తల్లిగర్భములో ప్రవేశించి పూర్వ జన్మలను తలచుకొని బాధపడుననుట ఎట్లున్నదో మీరే ఆలోచించండి. పూర్వ కాలములో పుట్టిన తరువాతనే ప్రాణమొస్తుందని విశ్వసించేవారు. ధర్మములన్ని అధర్మములుగా మారిపోవునని పరమాత్మ చెప్పినట్లు, ఇప్పుడు ప్రాణము పుట్టక పూర్వమే ఉన్నదని అంటున్నారు. పూర్వము పుట్టిన శరీరములోనికి ప్రాణమొచ్చినపుడు జీవునకు జన్మ కలిగినట్లు లెక్కించుకొని, ఆ లెక్క ద్వారా జాతకచక్రము గీచి చూచెడివారు. ఇప్పటికి

ఆ పద్ధతి ఉన్నది. జ్యోతిష్యశాస్త్ర ప్రకారము కూడ శరీరములో మొదట శ్వాస ఎప్పుడు ప్రవేశించుచున్నదో, అప్పుడే జన్మ అని గ్రహించెడివారు. ఈ కాల జ్యోతిష్యములో ప్రసవము జరిగిన సమయమునే జన్మగా లెక్కించుకొనుచున్నారు. నిజమైన జన్మ శ్వాస శరీరములో ప్రవేశించినపుడే అవుచున్నది. కాబట్టి లెక్క ప్రకారము జ్యోతిష్యము చక్కగా తెలిసెడిది. ఇపుడు ప్రసవ సమయమునే జన్మగా లెక్కించుకొనుచున్నారు. కావున భవిష్యత్తు చక్కగా తెలియకున్నది. ఆరవనెల యందు జీవుడు క్రొత్త శరీరమును చేరియుండిన జ్యోతిష్యులు దానినే జన్మగా లెక్కించుకోవలయును కదా! అట్లుకాక ప్రసవించిన తరువాత లెక్కించుకొనుచున్నారంటే ధర్మము పూర్తి నాశనముకాక ఇంకను కొద్దిగ మిగిలి ఉన్నదని అర్థమగుచున్నది.

నేటి శరీర శాస్త్రజ్ఞులకు మరియు వైద్యులకు (డాక్టర్స్) ఈ విషయములో చాలా అనుమానములు ఉండవచ్చును. ఎందుకనగా వారు చదివిన చదువులో పురుషుని శరీరములో తయారైన వీర్యమునందు వీర్యకణములకే ప్రాణమున్నట్లు తెలియబరుచబడియున్నది. అందువలన ఒక వైద్యుడు మా బోధ విన్న ఒక వ్యక్తితో కలిసి " ఆయన చెప్పునది పూర్తి శాస్త్రవిరుద్ధము. శరీర శాస్త్రజ్ఞులుగాను, వైద్యులుగాను ఉన్న మాకంటే ఆయనకు ఎక్కువగా తెలిసియుండునా? ప్రసవించిన తరువాత శరీరానికి ప్రాణము రావడము పూర్తిగా అసత్యము. ఆరవనెలలో ప్రాణమొస్తుందని మిగతా వేదాంతులు చెప్పుమాట కూడ అసత్యమే. పురుష వీర్యములోనే వీర్యకణములు జీవము కలిగియున్నవి. జీవము గల వీర్యకణము స్త్రీ శరీరములో రజోకణముతో కలిసి శరీరముగా మార్పుచెంది, తొమ్మిది నెలల తరువాత జీవముతోనే తల్లిగర్భము నుండి బయటికి వస్తున్నది. జీవము లేకుండ వస్తున్నదను మాట చాలా పొరపాటు. వీర్యములో వీర్యకణమునకు జీవమున్నట్లు మేము ఎన్నో నిదర్శనములు చూపగలము. ప్రాణము గల జంతు శరీరములో నుండి వీర్యమును తీసి, కొంత కాలము బయట తగిన వాతావరణములో ఉంచి, అవసరమేర్పడినపుడు ఆ వీర్యమును స్త్రీ జంతువు యొక్క యోనిలో వదలి దానికి గర్భమేర్పరుచుచున్నాము" అని పలుకుచున్నారు. వీర్యమునకు ప్రాణమున్నదని ఆ వ్యక్తి పూర్తిగా నమ్ముటకు

మిక్కిలి చల్లని వాతావరణములో అనగా $0^0$ నుండి $4^0$ సెల్సియస్ ఉష్ణోగ్రత ఉన్న ఒక ఫ్లాస్కునుండి టెస్టుట్యూబు మాదిరి ఉండిన ఒక గాజు గదిలో భద్రపరచి ఉన్న పశు వీర్యమును తీసి వెంటనే గాజు పలకమీద ఉంచి, మైక్రోస్కోపు (సూక్ష్మదర్శిని) నందు చూపినపుడు, ఒక చుక్క వీర్యములో తలతోక కలిగిన వీర్యకణములు అసంఖ్యాకములుగా ఉండి, అవి చలనము కలిగి తోకను కదలించుచు ముందుకు ఈదుచున్నటుల కనిపించుట వలన, ఆ వ్యక్తి చాలా ఆశ్చర్యపోయి వీర్యములోని వీర్యకణములకే ప్రాణమున్నదని పూర్తి విశ్వసించుచున్నాడు. వీర్యములోని వీర్యకణము యొక్క చిత్రమును క్రింద పటములో చూడవచ్చును.




వీర్యములో వీర్యకణములు కదులుచుండుట చూచిన ఆ వ్యక్తి వీర్యమునకే జీవముండగా, ప్రసవింపబడిన తరువాత జీవమొస్తుందనడము అబద్ధమైయుండ వచ్చునని భావించి, ఆయన మమ్ములను కలిసి "స్వామిగారు! జీవుడు జన్మపొందు విషయమై మీరు చెప్పిన బోధ విన్న నేను, ఒక పరిశోధనలో వీర్యమునకు ప్రాణమున్నట్లు చూచాను. వీర్యములో వీర్యకణములకు ముందే జీవముండగ ప్రసవింపబడిన తర్వాత జీవమొస్తుందన్న మీ మాట మాకు సంశయముగా ఉన్నది. ఒకవేళ ప్రసవానంతరము జీవమొచ్చునట్లు భావించిన వీర్యకణము కదలుట కళ్ళార చూచాము కదా! అను సంశయమొక వైపు ఏర్పడుచున్నది. అందువలన మీరు చెప్పిన బోధ నిజమా? లేక వైద్యులు చెప్పి చూపించినది నిజమా? ఏది నిజము ఏది అబద్ధము అను సందిగ్ధావస్థలో ఉన్నాను. దీని విషయమై మీరేమందురు" అని ఆయన మమ్ములను ప్రశ్నించాడు.

ఇంతకు ముందు ఆధ్యాత్మిక గ్రంథములలో ఆరునెలలకు జీవమొస్తుంది అన్న విషయము నిజముకాదని? ప్రసవింపబడిన తరువాత జీవమొస్తుందని మా సిద్ధాంతమును తెలియజేసాము. ఇప్పుడు వైద్యులు వీర్యమునకే జీవమున్నట్లు వారి ఉద్ధేశ్యమును తెలియబరచుచున్నారు. కావున వారి సంశయము తీరునట్లు క్రింద విజ్ఞానరూపముగా తెలుపుచున్నాము శ్రద్ధగా గ్రహించుము.

జీవుడు కనిపించువాడు కాదు. జ్ఞాననేత్రమునకు మాత్రము జీవుడు కనిపించగలడు. జ్ఞాననేత్రములేని వైద్యులు కదులుచున్న వీర్యకణములో జీవము ఉన్నట్లు భావించుకొనుచున్నారే కాని జీవమును చూడలేదు. కదలుచున్నంత మాత్రముననే జీవమున్నట్లు ఎందుకు భావించుకోవలమును? కణమునకు కదలిక ఉండుట వలన జీవమున్నట్లు ఊహించితే, బస్సులు రైళ్ళు కదలుచున్నవి కదా! వాటికి జీవమున్నదా? మనుష్యులు లేకుండానే అంతరిక్షములో ప్రయాణించు రాకెట్లకు జీవమున్నదా! లేదు. కదలుచున్న యంత్రములకు జీవమెట్లు లేదో, ఆ విధముగానే కదలుచున్న వీర్యకణమునకు జీవములేదని చెప్పుచున్నాము. జీవము లేకుండిన వీర్యకణము ఎందుకు కదులుచున్నదని కొందరిలో సంశయమేర్పడవచ్చును. ఆ సంశయము తీరుటకు వీర్యములోని వీర్యకణము పురుష శరీరములో ఏ విధముగా తయారగుచున్నదో సంపూర్ణముగ తెలుసుకోవలసియున్నది. అందువలన నేటి శరీర శాస్త్రజ్ఞులకు మరియు వైద్యులకు తెలియని జనన సిద్ధాంతమును ఈ కాల శరీర శాస్త్రముననుసరించియే తెలుపుచున్నాము.

పురుష శరీరములో అంగమునకు ప్రక్కలయున్న బీజములలో (వృషణము లలో) వీర్యము తయారగును. బీజములు జంతువులకు పెద్దవిగాయుండును. మానవులకు చిన్నవిగ ఉండును. జంతువులకు మానవులకు అనగా పిండము నుండి ఉద్భవించు అన్ని జీవులకు వీర్యము తయారగును. మానవుని బీజములలో 200 లకు పైగా లాబ్యూలులు అను సూక్ష్మభాగములుండును. ప్రతి లాబ్యూలు అను సూక్ష్మభాగములోను మడతలుగ ఒక కట్ట మాదిరియున్న నాళములున్నవి. వీటినే వీర్యోత్పత్తి నాళములని అనుచున్నాము. ఈ మడతలుగల నాళములలోనే

వీర్యాణువులు ఉత్పత్తి అగుచున్నవి. వీర్యోత్పత్తి నాళములన్ని ఒకటిగా చేరి **ఎపిడైడిమిస్** అను ఒక పెద్ద గొట్టముగా ఉదరభాగములోనికి ప్రవేశించి అక్కడ ఒక తిత్తిగా విస్తరించి ఉండును. వీర్యము ఈ తిత్తిలో నిలువ ఉండును. అందువలన దీనిని వీర్యాశయమని అనుచున్నాము. రెండు బీజములనుండి వచ్చు నాళములు రెండు వీర్యాశయములుగా విస్తరింపబడి ఉండి, వీర్యాశయముల నుండి నాళములు బయలుదేరి ప్రోస్టేటు అను గ్రంథిలోనికి పోయి, అచటి నుండి మూత్రనాళములోనికి తెరుచుకొని ఉన్నవి. మానవుని బీజనిర్మాణము క్రింది పటములో చూడవచ్చును.




1. ఎపిడైడిమిస్ నాళము. 2. వీర్యాశయము. 3. ప్రోస్టేటు గ్రంధి.
4. లింగము. 5. బీజము. 6. లొబ్యులు.

బీజములలో తయారైన వీర్యకణములు ఎపిడైడిమిస్ చేరి, అక్కడి నుండి వీర్యనాళము ద్వారా వీర్యాశయములోనికి పోయి, కొంతకాలము నిలువయుండి స్కలన కాలములో ప్రోస్టేటుగ్రంథి ద్వారా వచ్చినపుడు, అది స్రవించిన పాలవంటి పలుచని ద్రవముతో కలసి మూత్రనాళములోనికి వచ్చి, అక్కడ **కౌపర్** అను చిన్న గ్రంథులు తయారు చేసిన ద్రవమును మరియు మూత్రనాళములో **మ్యూకస్** అను పొర స్యంధించిన మ్యూకస్ అను జిగురు పదార్థమును కలుపుకొని వీర్యము తెల్లని

జిగురు పదార్థముగా బయటికి వస్తున్నది. దీనినే వీర్యము అంటాము. ఇంగ్లీషులో స్పెర్మ్ (Sperm) అంటారు.

వీర్యములో గల వీర్యకణములు తల (శిరస్సు) కంఠము (మెడ) తోక (వాలము) అను మూడు భాగములుగా ఉండును. బీజవీర్యనాళములో తయారైన వీర్యకణము చలనరహితమైనది. బీజవీర్యనాళములో తయారై వీర్యకణము పూర్తి పరిమాణము పొందియుండదు. ఎపిడైడిమిస్‌లోను, వీర్య నాళములోను మరియు వీర్యాశయములోను వీర్యకణము యొక్క పూర్తి ఆకారము తయారగును. వీర్యకణము పూర్తి పరిమాణము పొందిన తరువాతనే చలనము కలిగియుండును. పూర్తి ఆకారము తయారుకానంత వరకు చలనము ఉండదని ముఖ్యముగా గ్రహించవలయును. పూర్తిగా తయారైన వీర్యకణము ద్రవపదార్థములో ఒక నిమిషానికి నాలుగు మిల్లి మీటర్ల వేగముతో ఈదుతూ ఉండును. వీర్యకణము యొక్క తోక పాముతోక కదిలినట్లు కదులుచుండుట వలన వీర్యకణము ముందుకు కదిలిపోవుచుండును. వీర్యకణములు ఆమ్లగుణ ద్రవపదార్థములో చలించలేవు. క్షారగుణ ద్రవ పదార్థములో చలించగలవు. పురుష శరీరములో వీర్యకణములు కొన్ని వారాలపాటు చలనశక్తి కలిగి ఉంటాయి. స్కలితమైన తరువాత కొన్ని గంటలకాలము మాత్రమే స్త్రీ దేహశీతోష్ణస్థితిలో చలించగలవు.

ఇపుడు వీర్యకణము చలించుటకు కారణమేమిటను విషయము పరిశీలించినట్లయితే వీర్యాశయము లోపల గ్లూకోజ్ అధికముగాయున్న ద్రవము స్యంధింపబడుతుంది. వాలము కలిగిన వీర్యకణమునకు గ్లూకోజ్ తగిలిన వెంటనే వాలము చలించును. వీర్యాశయములోని ద్రవములో గ్లూకోజ్ స్యంధనము మామూలుగా ఉండును. కావున వీర్యకణము ఎన్ని రోజులైన పురుష శరీరములో చలనము కలిగియే ఉండును. **ద్రవములో గ్లూకోజ్‌లేని ఎడల వీర్యకణము చలించలేదు.** సున్నపురాయికి నీరు తగిలిన వెంటనే ఏ విధముగా చలనము పుట్టుచున్నదో, నిమ్మరసమునకు సోడా తగిలిన వెంటనే ఏవిధముగా చలనము వచ్చునో, పాదరసమునకు వేడి తగిలిన ఏ విధముగ చలించుచున్నదో ఆ విధముగనే

వీర్యకణ వాలమునకు గ్లూకోజ్ తగిలిన వెంటనే వాలములో కదలిక ఏర్పడును. గ్లూకోజ్‌కు వీర్యకణవాలమునకు సరిపడదు. కావున వీర్యకణవాలమునకు ఎప్పుడు గ్లూకోజ్ తగులునో అపుడు రసాయనిక క్రియ ఏర్పడును. ఆ క్రియయే వీర్యకణ వాల చలనము. వీర్యకణవాలము కదలుట వలన వీర్యకణమంతయు కదులును. అంతమాత్రమున వీర్యకణమునకు జీవమొచ్చినదనడము పొరపాటు. శాస్త్రజ్ఞులందరు ఇక్కడే పొరపడుచున్నారు. **ఎప్పుడైతే గ్లూకోజ్‌లేకుండ పోవునో అపుడు వీర్యకణ చలనము నిలిచిపోవునను విషయము ముఖ్యముగా గ్రహించవలెను.**

శాస్త్రజ్ఞుల అంచనా ప్రకారము వీర్యకణము జీవము కలదియే అయితే దాని చలనము ముందుకు మాత్రమేయుండక వెనుకకు ప్రక్కలకు కూడ ఉండవలయును. దానికి జీవములేనిదాని వలన ప్రక్కలకు వెనుకకు చలించలేదను విషయము ముఖ్యముగా గమనించవలయును. గ్లూకోజ్‌కు వాలమునకు సరిపడని కారణమున, వాలము చలించుట వలన, వీర్యకణము ముందుకే పోవుచుండునని గ్రహించుము. వీర్యకణవాలచలనమనెడి రసాయనిక క్రియ వలన గ్లూకోజ్ ఖర్చయి పోవుచుండును. గ్లూకోజ్ ఖర్చయి వీర్యద్రవములో లేకుండా పోయినపుడు, వీర్యాశయము గ్లూకోజ్‌ను స్యంధించుచునేయుండును. అందువలన వీర్యకణ చలనమునకు లోపల ఏ ఆటంకములేదని చెప్పవచ్చును.

సంయోగ సమయములో వీర్యము స్త్రీయొక్క యోనిలో విడువబడును. వీర్యములోని వీర్యకణము స్త్రీగర్భములోని రజోకణముతో కలిసినపుడే స్త్రీ గర్భము ధరించుటకు వీలున్నది. వీర్యకణము గర్భాశయములో ఉన్న రజోకణముతో కలియుటకు చాలా దూరము పోవలసియుండును. వీర్యకణవాల చలనము వీర్యకణమును ముందుకే తీసుకొని పోవును. వీర్యకణము కొంతదూరము ప్రయాణించిన తరువాతే రజోకణముతో కలియుటకు వీలుకలదు. వీర్యకణ చలనము రజోకణముతో కలియుటకే నిర్మింపబడినది. లేకపోతే చలనముతో అవసరమేలేదు. స్త్రీయోనియందు స్కలనము జరిగిన వీర్యములో గ్లూకోజ్ ఉన్నంతవరకు వీర్యకణములు చలించి ముందుకు పోవును. గ్లూకోజ్ అయిపోయిన

వెంటనే నిలిచిపోవును. వీర్యకణము కదులుచు ఎంత ముందుకు పోగలదు అన్న విషయము వీర్య ద్రవములో ఉన్న గ్లూకోజ్‌నుబట్టి నిర్ణయించవచ్చును. స్కలన కాలములో ప్రోస్టేటు గ్రంథి తన స్యంధనములో ఎక్కువ గ్లూకోజ్‌ను స్యంధించగలదు. అందువలన వీర్యకణము యోనిలో చలనము కలిగి ముందుకు పోగలదని చెప్పవచ్చును.

ఆమ్లగుణద్రవములో గ్లూకోజ్ ఉండినప్పటికి రసాయనిక క్రియ జరుగక వీర్యము చలనములేనిదవును. క్షార గుణద్రవములో మాత్రమే గ్లూకోజ్ సంయోగము వలన చలనము కలిగి ముందుకు పోగలదు. స్త్రీ యోనిలో ద్రవములు ఆమ్లగుణము కలవిగా ఉన్నాయి. అందువలన యోనిలో వీర్యకణములు చలనరహితమైపోయి ముందుకు సాగలేని స్థితి ఏర్పడుచున్నది. స్త్రీయోనిలో పడిన వీర్యము ఆమ్లద్రవ ప్రభావము వలన నిర్వీర్యమై పోకుండ ప్రోస్టేటు గ్రంథి క్షారగుణము గల తెల్లని ద్రవమును స్కలనకాలములో స్యంధించును. స్కలితమైన వీర్యములో క్షారగుణ ద్రవము ఉండుటవలన వీర్యము స్త్రీయోనిలోని ఆమ్లద్రవములో నిలిచిపోకుండ రెండు మూడు గంటల కాలము వరకు చలించగలుగును. వీర్యము తెల్లగా ఉండుటకు ప్రోస్టేటు గ్రంథి కారణమేనని తెలియుము.

స్త్రీ పురుషులు సంయోగము చేసిన ప్రతిసారి వీర్యకణము స్త్రీ రజో కణముతో చేరలేదు. ప్రతి సంయోగములోను వీర్యకణ చలనమునకు కావలసిన గ్లూకోజ్ అయిపోవడమో లేక యోనియందు ఆమ్లగుణ ద్రవ ప్రభావము ఎక్కువ కావడమో ఉండును. ఒకవేళ వీర్యములో గ్లూకోజ్ సంపూర్ణముగావుండి క్షారగుణ ద్రవము కూడ ఎక్కువయుండిన వీర్యకణము పూర్తి ముందుకు పోయినప్పటికి గర్భకోశములో అ సమయానికి రజోకణము లేకపోయినట్లయితే ఆ సంయోగము నిష్ప్రయోజనమగును. ఎప్పుడో ఒకప్పుడు అన్ని అనుకూలములు ఏర్పడితే వీర్యకణము రజోకణముతో కలుస్తుంది. ఏ ఒక్క అనుకూలము లేకపోయిన ఆ సంయోగము ఫలించదు. అందువలన మానవుల అన్ని సంయోగములు ఫలించవని చెప్పవచ్చును. దీని కారణముననే కొందరికి సంతానము ఆలస్యముగా

జరుగుచుండును. పిండజములైన జంతువులు ఒక్క పర్యాయము సంయోగించిన అది సఫలమై సంతతి జరుగును. దీనికి కారణము జంతు వీర్యములో క్షారగుణ ద్రవము ఎక్కువగ ఉండుటయు మరియు వీర్యములో గ్లూకోజ్ కూడ అధికముగా ఉండునని తెలుసుకొనుము. స్త్రీ జంతువులో రజోకణము తయారైనపుడే ఆ జంతు శరీరములో మార్పులు కనిపించి పురుష జంతువును ఆకర్షించును. ఆ మార్పును చూచినపుడే పురుష జంతువులలో కామగుణము పుట్టును. స్త్రీ జంతువులలో కూడ రజోకణము తయారు అయినపుడే కామవాంఛకల్గును. అపుడే పురుష జంతువు కోసము ప్రాకులాడును. ఆ స్థితినే ఎద (మనసైనదని) అయినదని మనము అంటూవుంటాము. రజోకణము తయారైనపుడే సంయోగము జరుగుచున్నది. మరియు ఆ వీర్యములో కణములు ముందుకు పోవు అనుకూలతలు ఉన్నాయి. అందువలన జంతు సంయోగము ఒక్క పర్యాయము జరిగిన వెంటనే అది సఫలమగును. మనుష్య సంయోగములో వీర్యమునకు ఎన్నో ఆటంకములు ఉన్నవి. కావున మానవుల సంయోగము ఎన్ని మార్లు జరిగిన అది సఫలము కాకపోవచ్చును.

వీర్యకణము శరీర ఉష్ణోగ్రతలో గ్లూకోజ్ కలయికతో రసాయనిక క్రియ వలన చలించగలదు. వీర్యకణ గ్లూకోజ్ రసాయనిక క్రియకు ఉష్ణోగ్రత అవసరమని ఇక్కడ తెలియుచున్నది. శరీర ఉష్ణోగ్రతకంటె కొద్దిపాటు ఎక్కువ ఉష్ణమైన ఫరవాలేదు. మరీ ఎక్కువ ఉష్ణోగ్రతలో రసాయనిక క్రియ జరుగదు. మరియు వీర్యకణము చెడిపోవును. అదే విధముగా శరీర ఉష్ణోగ్రతకంటే కొద్దిగా ఉష్ణోగ్రత తగ్గిన వీర్యకణ గ్లూకోజ్ రసాయనిక క్రియ జరుగును. కాని పూర్తి శీతలము ఏర్పడినచో రసాయనిక క్రియ జరుగదు. ఎక్కువ శీతలములో వీర్యకణము చెడిపోదు. ఇప్పటి ఉష్ణోగ్రత కొలత ప్రమాణములో $0^0$ సెల్సియస్ శీతలములో ఉంచిన వీర్యము చెడిపోదు. ఆ శీతలములో వీర్యమునందు రసాయనిక క్రియ జరుగక నిలిచిపోవును. కాని వీర్యకణములు చెడిపోవు. రసాయనిక క్రియ జరుగనందున వీర్యములోని గ్లూకోజ్ ఖర్చుకాక అట్లేయుండును. అందువలన ఈ కాలములో వీర్యమును బయట **"$0^0$ సెల్సియస్"** శీతల ప్రదేశములో నిలువయుంచుచున్నారు. నిలువ

ఉంచిన వీర్యమునకు తిరిగి వేడి తగిలిన వెంటనే రసాయనిక క్రియ జరిగి చలించుటకు మొదలుపెట్టును. కావున వీర్యమును అవసరమొచ్చినపుడు సంతాన కార్యమునకు వాడుకొనుచున్నారు. ఈ కార్యము పశువుల ఎడల ఎక్కువగా చేయుచున్నారు.

ఈకాల శాస్త్రజ్ఞులకు జ్ఞాననేత్రము గాని, సూక్ష్మదృష్ఠిగాని ఉండవు. కావున వారి భావనలన్నియు స్థూల పరిశోధనల మీద ఆధారపడియుండును. వీర్యకణము కదులుచున్నదంటే దానికి ప్రాణము ఉన్నట్లేనని వారి అంచనాయుండును. వారికి జీవుని విషయము తెలియదు. జీవుడు ఒకచోట నివశించుటకు వానితోపాటు ఎన్ని భాగములు (శక్తియుత భాగములు) ఉండవలయునను విషయము వారికి తెలియదు. జీవుడు ఒక వీర్యకణములోనే కాక, ఏ శరీరములో నివసించిన అక్కడ పంచభూతములు ఉండవలయును. ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమితో తయారైన మనస్సు, బుద్ధి, చిత్తము, అహము అను మొదలగు ఇరువది నాలుగు భాగములు ఉండు చోటునే జీవుడు నివాసము చేయగలడు. అట్లు కాక 24 భాగములులేని చోట జీవుడు ఉండడని తెలియవలెను. జీవుడు మరణములో పాతశరీరమును వదలి, జన్మలో క్రొత్త శరీరమును ధరించునని పరమాత్మ గీతయందు తెలిపియున్నాడు. మరియు క్రొత్త శరీరములో బాల్యము, యవ్వనము, కౌమారము, వృద్ధాప్యము అను దశలు ఉండునని తెలిపినాడు. కాని వీర్యకణముగా గర్భములో వృద్ధి చెందునట్లుగా తెలిపియుండలేదు. జీవుడు ధరించు శరీరము స్థూలము, సూక్ష్మము అని రెండు భాగములుగ ఉండును. ఈ రెండు భాగములలో స్థూలభాగము లేకపోయినప్పటికి, సూక్ష్మభాగముండిన దానియందు జీవుడు నివాసము చేయగలడు. కాని సూక్ష్మము లేకపోయిన జీవుడు నివాసము చేయలేడు. జీవుడు నివాసము చేయు విధానము సాంఖ్యయోగము తెలిసిన యోగులకు మాత్రమే తెలియును. ఈనాటి డాక్టర్లకు, శాస్త్రజ్ఞులకు తెలియదు. జీవమును జ్ఞాననేత్రమున్న యోగులు మాత్రము చూడగలరు. డాక్టర్లు, శాస్త్రజ్ఞులు తమ స్థూలనేత్రములతో చూడలేరు.

వీర్యకణము తోక, తల కలదిగా తెలిపియున్నాము. తోక చలనము కలిగి తలగాయున్న దానిని ముందుకు తోసుకొనిపోవును. వాలము వీర్యకణ తల

భాగమును ముందుకు తీసుకుపోవు వాహనముగానే ఉన్నది. వీర్యకణములోని తలయే సంతానమునకు కారణమని తెలియుచున్నది. ఇంతకు ముందు వీర్యకణ వాలము గురించియే తెలుసుకొన్నాము. ఇపుడు దాని తలను గురించి తెలుసు కొందాము. వీర్యకణ తల లోపలి భాగమున ఒక గుండ్రని భాగమున్నది. అది బంతివలె ఉండును. ఆ గుండ్రని కణము ఒక విధమైన ప్రకాశము కలిగి ఉండును.

**పరిశోధించి గుండ్రని భాగములోని ప్రకాశమును చూడవచ్చును. ఈ గుండ్రని భాగము స్త్రీగర్భములో రజోకణముతో కలసి శరీరముగా మారుటకు అనుకూలముగా నిర్మాణమైయుండును. ఇదియే పురుష వీర్యములోని బీజమని చెప్పవచ్చును.**

స్త్రీ గర్భకోశములో ఓవరీ (Ovary) అన్న భాగము నుండి రజోకణము తయారగును. రజోకణము ఓవరీలో నెలకొక్కటి తయారగుచుండును. రజోకణమునే ఇంగ్లీషులో ఓవమ్ (Ovum) అని కూడ అందురు. ఈ రజోకణము ప్రొటోప్లాజము అను పదార్థముతో తయారైయుండును. బాదము గింజ ఆకృతి గల ఓవరీలు స్త్రీగర్భకోశములో గర్భాశయానికి రెండువైపుల రెండు వుండును. ఓవరీలో తయారైన రజోకణము గర్భాశయానికి దగ్గరగాయున్న నాళములోనికి పోయి నిలిచియుండును. పురుష వీర్యములోని వీర్యకణము సంయోగము చెందిన తరువాత యోనిలో ముందుకు చలించుచు పోయి, వికసించుకొన్న పుష్పపు ఆకృతి కలిగిన భాగములో ప్రవేశించి, అందుగల నాళము ద్వారా గర్భకోశమునకు పోయి, గర్భాశయ మొదటి భాగములో ఉన్న నాళమందలి రజోకణముతో కలియుచున్నది. రజోకణము వీర్యకణము కలియడమునే గర్భధారణయని అందురు. రజోకణముతో కలిసిన వీర్యకణము తిరిగి గర్భాశయములోనికే వచ్చి, అందులోగల జిగురు పదార్థముతో తయారైన పొరలలో చొచ్చుకొని పోయి స్థానమేర్పర్చుకొని శిశువుగా వృద్ధి పొందును.

స్త్రీ రజోకణముతో వీర్యకణము కలిసినపుడు వీర్యకణ తల భాగములోని గుండ్రని కణము అనేక కణములుగా విభజనచెంది (Mitosis), ఆ కణములన్నియు

కలిసి ఒక శరీరముగా తయారగుటకు మొదలుపెట్టును. వీర్యకణము అనేకముగ విభజింప బడుట కూడ రసాయనిక ప్రక్రియయేనని తెలుసుకొనుము. వీర్యకణము స్త్రీ శరీర జనిత ప్రొటోప్లాజ రజోకణముతో కలిసినపుడే ఈ రసాయనిక క్రియ జరుగును. వీర్యకణ తలలోని గుండ్రని భాగము మరియు స్త్రీ రజోకణము రసాయనిక క్రియకు అనుకూల పదార్థములతో తయారైనవని తెలుసుకొనుము. ఈ రెండు పదార్థములు జీవరహితములేనని జ్ఞప్తికుంచుకొనుము. ఈ రెండు పదార్థముల యొక్క కలయిక వలన ఏర్పడిన రసాయనిక క్రియలో వీర్యకణము అనేక కణములుగా చీలిపోవుచు, ఆ కణములన్నియు ఒక గుంపుగా చేరుచు, శిశుశరీరము తయారగును. గర్భోత్పత్తి అయిన మూడవ నెలనుండి గర్భాశయములో వీర్యకణ అభివృద్ధి జరుగుచున్న పొరను అంటి రక్తపుష్కలమైన ఒక సంచివంటి పొర నిర్మితమగును. దీనిలో యుండే రక్తనాళములకు తల్లిలో ఉండే రక్తనాళ శాఖలు కలిసివుంటాయి. ఈ రక్త నాళముల నుండి బయలుదేరే నాడులు బొడ్డుత్రాడుగా ఏర్పడి శిశునాభిని అంటివుండును. శిశుశరీరములో జరిగే కార్యకలాపములకు కావలసిన ఆక్సిజన్, ఆహార పదార్థములు, విటమినులు బొడ్డు ద్వారానే సరఫరా అగును. గర్భధారణ జరిగిన తరువాత 280 రోజులకు శిశుశరీరము పూర్తిగా తయారగును.

గర్భధారణ జరిగిన తరువాత ఓవరీనందు ఒక భాగములో గర్భరక్షక రసము తయారై రక్తములో కలిసిపోవును. ఆ రసములో 'ప్రొజెస్టిరాన్' అను హార్మోను ఉన్నది. ఈ హార్మోను గర్భకోశము మీద పనిచేయు నాడులకు బలము కలిగించి గర్భస్రావము కలుగకుండ కాపాడును. ప్రొజెస్టిరాన్ బాగుగా తయారగుటకు తల్లి తన శరీర ఆరోగ్యమును జాగ్రత్తగ చూచుకోవలయును. ప్రొజెస్టిరాన్ సక్రమముగా తయారుకాని తల్లి శరీరము, గర్భము పెంచుటలో అనారోగ్యమైనదిగా ఉండును. ప్రొజెస్టిరాన్ తయారుకాని శరీరములో గర్భస్రావము జరుగుచుండునని తెలుసుకోవలయును. అటువంటి వారు గర్భస్రావము జరుగకుండ ప్రొజెస్టిరాన్ హార్మోనును ఇంజక్షన్ రూపములో తీసుకోవచ్చును.

తల్లి శరీరములో బ్రహ్మనాడి నుండి బయలుదేరిన కొన్ని నాడులు గర్భకోశమును ఆశ్రయించియుండును. ఆ నాడులు వీర్యకణము శరీరముగా మార్పుచెందుటలో ఏ ఆకృతిగా తయారుకావలసినది నిర్ణయించును. ఆ నాడులే శరీరమును ఏవిధముగా పెంచవలయునో ఆ విధముగా పెంచి ప్రసవింప జేయును. బ్రహ్మనాడినుండి బయలుదేరిన నాడులే శిశుశరీరమును గర్భాశయములో కదలునట్లు చేయుచున్నవి. ఆ నాడులలో చైతన్యము తక్కువగా ప్రసరింపబడి గర్భాశయము తక్కువగా కదులుచుండిన, శిశుశరీరము క్రమపద్ధతిగా పెరుగదు. తల్లి అనారోగ్య కారణమున గర్భములో శిశు కదలికలు తక్కువయుండిన, ఆ శిశువు క్రమపద్ధతిగ పెరుగక నడుము నుండి పైకి ఎక్కువ పెరిగి కాళ్ళు తక్కువగా పెరిగియుండును. కొందరికి నడుము నుండి కాళ్ళు ఎక్కువ పెరిగి నడుముపై శరీరము తక్కువ పరిమాణము పెరిగియుండును. కొందరికి తల లావుగ ఉండును, నడుము పెద్దదిగాను, చిన్నదిగాను, చేతులు కురచగాను, పొడవుగాను ఇట్లు అనేక విధముల మార్పులు కనిపించిన శిశుశరీరము సక్రమముగా పెరగలేదని తెలియుము. అవయవములు క్రమబద్దముగా పెరుగుటకు బ్రహ్మనాడి చైతన్యము అవసరము. బ్రహ్మనాడి చైతన్యము లేకపోతే శిశుశరీరము పెరుగదు, కదలదు మరియు ఆకృతి ఏర్పడదు.

ఇప్పటి శరీర శాస్త్రజ్ఞులు పురుష వీర్యకణమును, స్త్రీరజోకణమును పరిశోధనాశాలలో కలిపి వాటికి కావలసిన వాతావరణమును, అభివృద్ధికి కావలసిన పోషక పదార్థములను, రక్తమును సరఫరా చేయగా వీర్యకణము రజోకణముతో కలిసి రసాయనిక క్రియ వలన విభజన జరిగి మాంసకణములు ముద్దగా కొంత పెరిగి నిలిచిపోవును. శరీరము పూర్తిగా పెరగలేదు, తయారైన శరీరము ఒక మాంసపు ముద్దగా ఉండిపోయినది. ఏ ఆకృతి ఏర్పడలేదు. ఆ పరిశోధన వలన తల్లి శరీరములోనే శిశువు ఆకృతిగా పెరుగునని, అట్లుకాక పోయినచో శరీరమునకు ఆకృతి రాదని తెలియుచున్నది. బ్రహ్మనాడి స్పర్శలేనిదే శరీరము తయారుకాదని తెలియని శాస్త్రజ్ఞులు పరిశోధన జరిపి అందు విఫలమై మాకంటే మించిన దేవుడు

ఒకడున్నాడని చివరకు అంగీకరించుచున్నారు. ఒకవేళ వారి పరిశోధనలలో శిశువు ఒక ఆకృతిగా తయారై అందు జీవమే ప్రవేశించియుంటే, మాకంటే వేరే దేవుడు లేడని అనేవారేమో?

ఇంత విన్న తరువాత కూడ కొందరికొక సంశయము పుట్టి "హిరణ్యకశిపుని కుమారుడైన ప్రహ్లాదుడు, తల్లిగర్భములోనే నారాయణ మంత్రమును నారదుని ద్వారా విన్నాడు కదా! తల్లిగర్భములో ప్రహ్లాదునికి జీవములేని ఎడల నారాయణ మంత్రమును ఎట్లు వినెను" అని అడుగవచ్చును. దానికి మా సమాధానమేమనగా! ఒక వేళ వారి మాట ప్రకారమే ప్రహ్లాదునికి గర్భములోనే జీవమున్నదని అనుకొనిన బయటి మాటలు గర్భములోపలికి ఎట్లు వినిపించును? అట్లు వినిపించిననుకొనిన ఇపుడు కూడ గర్భములోనున్న శిశువులకు బయటి వారు బోధించిన బోధ తెలియవలయును కదా! అట్లు లోపల విన్నామనువారు కాని, వినినవారు కాని ఎవ్వరు లేరే! పరికించి చూచిన అనుభవానికిరాని కవులు పల్కిన మాటలని ప్రహ్లాదుని విషయము తెలియుచున్నది. బ్రహ్మవిద్య ఒక్క యోగులకు మాత్రమే తెలియును. భాషాపండితులు, కవులు బ్రహ్మవిద్యను గురించి ఏమాత్రము చెప్పలేరు. అందువలన జ్ఞానదృష్టిలేని కవులు వ్రాసిన మాటలు పూర్తి అసత్యము.

**ప్రహ్లాదుని విషయము పురాణములలోనిది. పురాణములు కేవలము కల్పితము. విష్ణువును గురించి వ్రాయుటకు పూనిన కవులు, వారి ఇష్టానుసారము అల్లిన కథయే ప్రహ్లాద విషయము.** ఇటువంటి కొన్ని కథలు చూచి, అంత పెద్దవారు వ్రాసిన విషయములు నిజముకాక అసత్యముండునాయని, మిగతా కవులందురు ఆ విధముగనే వ్రాయుటకు మొదలు పెట్టి శాస్త్రమునకు పూర్తి హాని చేసినారు. నేనింత వరకు చెప్పినప్పటికి నా మాట వినక ధర్మమేది? అధర్మమేది? అని గ్రహించక అధర్మవాదనే చేయువారు పరమాత్మ గీతయందు తెలియజేసిన విషయమునకు వ్యతిరేకులు.

మేము తెలియజేయు బోధ జీవునకు, ఆత్మకు సంబంధించిన విషయము, కావున జీవముగల సమస్త జీవరాసులకు వర్తించును. జన్మ అనునది ఒక్క మానవునికే

కాక అన్ని జీవరాసులకున్నది. అందువలన క్రిమి, కీటక, పశు, పక్షి, మృగాదులకు కూడ మా బోధ వర్తించును. ఈ మా మాటలువిన్న కొందరికి ఒక సంశయమేర్పడి "కోడి గ్రుడ్డునకు గర్భములో జీవము రాక బయటికి వచ్చిన తరువాత వస్తుందను కొనుటకు అది చలన రహితమైనదిగా ఉన్నది. చలనములేని కోడిగ్రుడ్డుకు ప్రాణము లేదనుకొనుటకు గ్రుడ్డులోనే పిల్ల ప్రాణము కలిగి బయటకు వచ్చుట చూచుచూనే ఉన్నాము. గ్రుడ్డునుండి పుట్టు జీవులకు మీరు చెప్పిన బోధ ఎట్లు వర్తించును? గ్రుడ్డులో జీవమున్నట్లా లేక గర్భము నుండి బయటకు వచ్చిన గ్రుడ్డునందు జీవుడు చేరినట్లా" అని అడుగ వచ్చును. ఈ అనుమానమును తెలుసుకొనిన అండజముల విషయమంతయు అర్థమగును. అందువలన కోడిగ్రుడ్డు విషయము తెలుసుకొందాము.

గ్రుడ్డు నుండి పుట్టు ప్రాణులకు, పిండములనుండి పుట్టు ప్రాణులకు జన్మ విషయములో కొద్దిగా మార్పు గలదు. జన్మ విషయములో అండజ, పిండజములకు భేదముండిన, సిద్ధాంతము మాత్రము అన్నిటికి ఒకటిగానే ఉండును. అండజములకు, పిండజములకు, భూజములకు (చెట్లు) మొదలగువాటికి మొదటి శ్వాసతోనే జన్మ కలుగుచున్నదను సిద్ధాంతము వర్తించును. కోడి జన్మను వివరించుకొనిన కోడికి యుక్తవయస్సు వచ్చిన వెంటనే శరీరములో కొన్ని పదార్థములు తయారై గుండ్రని ఆకృతి ధరించుచు దిన దినము పెరిగి అండాకృతికి చేరుకొనును. కోడి శరీరములో అండమునకు అవసరమైన పదార్థములు తయారవుతున్న సమయములో కోడిపెట్ట పుంజులతో సంబంధము ఏర్పరచుకొనును. పుంజుతో సంపర్కము జరిగినపుడు ఆ సంపర్క ఫలితముగా ఒక పదార్థమును పెట్టకోడి శరీరములో అండము కోసము తయారవుతున్న పదార్థములతో కలుసుకొనును. ఈ విధముగా కోడి శరీరములో తయారైన పదార్థములు కొన్ని అండముగా మారి బయటికి వచ్చును. కోడి ప్రతి దినము ఒక అండమును తయారుచేయును. బయటికి వచ్చిన అండమును పరిశీలించిన అందులో తెల్లసొన, పచ్చసొన అను పదార్థములు కనుపించును. ఈ పదార్థములలో ఏమాత్రము ప్రాణములేదు. అందువలన గ్రుడ్డుకు ప్రాణము లేదని చెప్పవచ్చును. పిండము

బయటికి వచ్చిన వెంటనే ప్రాణమొచ్చినట్లు అండము బయటికి వచ్చిన వెంటనే ప్రాణము అందులో ప్రవేశించదు. ఇదియే అండజములకు, పిండజములకు గల భేదము. అండములోని పదార్థములు నిర్జీవములైనవై, ఆ పదార్థములు తగిన వాతావరణములో మార్పుచెందునవై ఉండును. కోడిగ్రుడ్డు $40^0$ సెంటిగ్రేడు డిగ్రీల ఉష్ణోగ్రతలో మార్పు చెందునదై ఉండును. మిగతా వేరు వేరు జాతి గ్రుడ్లుకు వేరు వేరు ఉష్ణోగ్రత అవసరమై ఉండును. తగు ఉష్ణోగ్రతకు పదార్థములలో రసాయనిక మార్పు జరుగునట్లు అండములు నిర్మింపబడియుండును. అండములో కోడిపిల్ల శరీరము తయారగుటకు అవసరమైన పోషక పదార్థములు, విటమినులు మరియు ఇతర పదార్థములతో నిర్మింపబడి ఉండును. చేతిబాంబులో రసాయనిక పదార్థములు నింపబడియున్నట్లు, కోడిగ్రుడ్డులో కూడ రసాయనిక పదార్థములు నింపబడివున్నవి. చేతిబాంబుకు ఎప్పుడు ఒత్తిడి కలుగునో అప్పుడది ప్రేలునట్లు, గ్రుడ్డుకు కూడ ఎప్పుడు తగిన వేడి తగులునో అప్పుడు పిల్లగా మారుటకు మొదలిడును.

తల్లి కోడి గ్రుడ్ల మీద పొదిగినపుడు కోడి శరీరములోని వేడి గ్రుడ్లకు తగులుట వలన గ్రుడ్డునందు పదార్థములు మార్పు చెందుచు పిల్లగా తయారగును. గ్రుడ్డులో పచ్చసొన భాగములో మధ్యన ఒక గుండ్రని పదార్థముండును. అది వేడి తగిలిన వెంటనే మార్పు చెందుటకు మొదలిడును. మధ్య భాగములోని పదార్థమునే మనము పురుష బీజముగా లెక్కించుకోవలయును. పచ్చసొన తెల్లసొన వినియోగము వలన ఈ పదార్థము పెరుగుచున్నది. కావున తెల్ల పచ్చసొనలను స్త్రీకణములుగా లెక్కించుకొనుచున్నాము. తగిన వేడి తగిలినపుడే గ్రుడ్డులో ఇమిడియున్న పురుషకణము స్త్రీకణ పదార్థములు కలిసిపోయి, పురుషకణము వృద్ధి చెందుచుపోయి, కొద్ది రోజులకు పూర్తి పిల్లగా తయారగును. మానవులకు పురుషకణము గర్భాశయములోనే స్త్రీకణముతో కలియును. కోడిగ్రుడ్డుకు వేడిమి తగిలిన వెంటనే గ్రుడ్డునందు బీజకణము మార్పు చెందుటకు మొదలిడును. గ్రుడ్డులో పూర్తి పిల్ల శరీరము తయారగుటకు 21 దినముల కాలము పట్టును. పిల్లగా మార్పు చెందు కాలము అన్ని జాతి గ్రుడ్లకు ఒకే మాదిరియుండదు. ఒక్కొక్క జాతికి ఒక్కొక్కకాల పరిమితియుండును.

$40^0$ సెంటిగ్రేడు ఉష్ణముకంటే ఎక్కువ వేడిలో గ్రుడ్డులోని పదార్థము చెడిపోవును. అందువలన ఎండా కాలము కోడిగ్రుడ్లు పిల్లలుగా మారుట తక్కువగా ఉండును. గ్రుడ్లు కోడి క్రిందనేకాక వాటికి తగిన వాతావరణములో ఎక్కడైన పిల్లలుగా మారగలవు. ఈ కాలములో గ్రుడ్లను పిల్లలుగా తయారుచేయు యంత్రములు కలవు. ఆ యంత్రములలో గ్రుడ్డుకు కావలసిన వేడిని అందజేయుదురు. కావున గ్రుడ్డు పిల్లగా మార్పు చెందుచున్నది. వీటినే Incubators అందురు. కొన్ని చోట్ల కుండలోవుంచిన గ్రుడ్డు కూడ పిల్లగా మార్పుచెందిన సంఘటనలు ఉన్నాయి. పుంజుకోడితో సంబంధములేని పెట్టకోళ్లు కూడ గ్రుడ్లు పెట్టును. ఆ విధముగా పెట్టబడిన గ్రుడ్లు పొదగవేసినప్పటికి పిల్లలుగా తయారుకావు. కారణమేమనిన ఆ గ్రుడ్డునందు పురుష బీజములేదు. గ్రుడ్డులో తెల్లసొన, పచ్చసొన, మిగతా అన్ని స్త్రీ పదార్థములుండును. కాని పచ్చసొన మధ్య భాగములో పురుష కణముండదు. పురుషకోడి సంపర్కము చెందిన కోడిగ్రుడ్డు మాత్రమే పురుష బీజము కలదిగావుండును. ఒక్కొక్క గ్రుడ్డుకు ఒక్కొక్కొ సంపర్కముండవలెను. ఒక సంపర్కమే అన్ని గ్రుడ్లలో బీజము కాదు. అందువలన గ్రుడ్లు పెట్టు కోడి ఒక విధముగా ఈల వేయుచు పుంజుకోడిని ఆకర్షించుచు ప్రతి దినము త్రొక్కుల్లు (సంపర్కము) పడుచుండును.

మానవులకు గర్భకోశములో మావియందు శిశువు తయారైనట్లు, అండజము లకు గ్రుడ్డునందు పిల్ల తయారగును. మావియందు తయారైన శిశువుకు ప్రాణము లేనట్లు, గ్రుడ్డునందు తయారైన పిల్లకు ప్రాణముండదు. ఇక్కడ ముఖ్యముగా గమనించవలసిన విషయమేమనగా? మావినుండి ప్రసవింపబడిన శిశువుకు బయట ప్రాణము వస్తున్నది. కాని అండములో తయారైన పిల్ల శరీరమునకు గ్రుడ్డునుండి బయటికి రాకమునుపే గ్రుడ్డునందే ప్రాణమొస్తున్నది. పిండజములకు మొదటి శ్వాసతోనే ప్రాణమొస్తున్నది. అండజములకు కూడ మొదటి శ్వాసతోనే ప్రాణమొస్తున్నది. నిర్జీవమైన పిల్ల గ్రుడ్డు యొక్క పెంకును చీల్చుకొని రాలేదు. పెంకును పగులగొట్టుకొనుటకు అవసరమైన శక్తి ప్రాణముండినపుడే లభ్యమగును. అందువలన పెంకును పగులకొట్టుకొని బయటకు వచ్చు నిమిత్తము, పిల్లకు

లోపలనే ప్రాణమొచ్చు ఏర్పాటు దేవుడు చేసియుంచాడు. జీవుడు నివాసము చేయుటకు యోగ్యముగ శరీరము ఎప్పుడు తయారైనదో, అప్పుడు ఆ శరీరమునందు వేరొక జీవుడు మొదటి శ్వాసతో ప్రవేశించునను సిద్ధాంతము అందరికి తెలిసినదే. ఆ ప్రకారము గ్రుడ్డులో తయారైన పిల్ల శరీరములోనికి జీవుడు మొదటి శ్వాసతో ప్రవేశించుచున్నాడు. ఇక్కడ కొందరికి ఒక సంశయమేర్పడవచ్చును. శ్వాస జరుగుటకు గాలి అవసరముకదా! బయటి గాలి లోపలికి రాకనే కోడిపిల్ల ఎట్లు శ్వాసించగలదని అడుగవచ్చును. దానికి సమాధానమేమనగా! తల్లి కోడి శరీరములో గ్రుడ్డు తయారైనపుడే గ్రుడ్డునందు పిల్లగా మారుటకు అవసరమైన పదార్థములన్నియు నింపబడి, ఆ పదార్థములన్నియు ఒక పొరలో బంధింపబడియుండును. ఆ పొరకు పెంకుకూ మధ్య ఒక ప్రక్కన కొద్దిగా ఖాళీ స్థలముండును. దానియందు గాలి నింపబడియుండును. గ్రుడ్డులో గాలి ఎక్కడున్నది క్రింది పటములో చూడవచ్చును.

అండమునందు పూర్తిగా తయారైన పిల్లయందే జీవుడు ప్రవేశించును. పిల్ల తయారైన చివరి సమయములో పలుచని పొర చినిగిపోయి గ్రుడ్డు అంతయు




1) గాలి గది 2) పలుచని పొర 3) పెంకు

4) తెల్లసొన 5) పురుష కణము 6) పచ్చ సొన

పిల్ల శరీరము ఆక్రమించియుండును. పొర చినిగిన తరువాత గాలి గ్రుడ్డంతయు వ్యాపించియుండును. గ్రుడ్డులో గాలియుండుట వలన జీవుడు పిల్ల శరీరములోనికి మొదటి శ్వాసతో ప్రవేశించుచున్నాడని తెలుసుకొనుము. పిల్ల శరీరములోనికి ప్రవేశించిన జీవుడు గ్రుడ్డు లోపలయుండిన గాలిని శ్వాసించుచుండును. అట్లు కొన్ని నిమిషములు శ్వాస జరిగిన తరువాత ఆ గాలిలోని (ఆక్సిజన్) ప్రాణవాయువు అయిపోవును. అపుడు శ్వాస జరుగుచుండినప్పటికి ఆ శ్వాసలో ప్రాణవాయువు లభించనందు వలన పిల్ల ఉక్కిరి బిక్కిరగును. తన్నుకొనుటకు ప్రారంభించును. దిక్కు తెలియక పెంకును ముక్కుతో పొడుచును. పిల్ల తన్నుకొనునపుడు ముక్కుతో పొడచినపుడు పెంకు చిన్న రంధ్రముపడి తరువాత పగిలిపోవును. అపుడు బయట గాలిలో పిల్ల బ్రతుకుసాగించును. ఇదే విధముగా అండజములన్నిటికి జన్మ కలుగుచున్నదని తెలుసుకొనుము. స్త్రీలకు గర్భము వ్యర్థమైపోయినట్లే గ్రుడ్లు కూడ వ్యర్థమైపోగలవు. గ్రుడ్డు తయారు కావడములో పదార్థములు ఎక్కువ తక్కువ ఉండు దోషమువల్ల కాని, గ్రుడ్డు బయటకు వచ్చిన తరువాత వేడి లభ్యము కావడములో ఎక్కువ తక్కువల దోషము వలనగాని, గ్రుడ్డు ముగ్రుగ్రుడ్డుగా వ్యర్థమైపోవుట జరుగుచుండును. ఇంతవరకు అండజముల యొక్క జన్మను గురించి తెలుసుకొన్నాము. అండజముల విషయములో అండమునకు ప్రాణములేని విషయము తెలిసిపోయినది. ఇపుడు భూమి నుండి పుట్టు జీవులకు జన్మ ఎట్లు కలుగుచున్నది తెలుసుకొందాము.

భూమి నుండి పుట్టు వృక్షలతాదులన్నింటిని భూజములని అందురు. కోడి గ్రుడ్డు నుండి పిల్ల పుట్టినట్లు, విత్తనముల నుండి భూజములు పుట్టును. తల్లి కోడి శరీరములో తయారైన గ్రుడ్డుకు ప్రాణములేనట్లు, చెట్ల నుండి తయారైన విత్తనమునకు కూడ ప్రాణములేదు. విత్తనమునకు ప్రాణములేదను మాట కొందరికి చాలా విచిత్రముగాయుండును. ప్రజలలో విత్తనమునకు ప్రాణమున్నదను నమ్మిక పూర్తిగా జీర్ణించిపోయినది. అందువలన మా మాట విన్నంతనే చాలా ఆశ్చర్యము కలుగ

వచ్చును. కొందరు మా మాట అబద్ధమని పుస్తకము చదువక మూసివేయుదురేమో! ఎవరు నమ్మిన నమ్మకపోయిన విత్తనములకు ప్రాణములేదను మాట సత్యము.

కోడి శరీరములో గ్రుడ్డు తయారగునట్లు, వృక్షములోనే విత్తనములు తయారగును. వృక్షములకు పెరుగు కాయలలో విత్తనములు తయారగును. ప్రతి జాతి విత్తనము రెండు భాగములుగా విభజింపబడియుండును. విత్తనము మొలకెత్తుటకు కావలసిన కొన్ని పదార్థములు కాయలయందే తయారై విత్తనమందు నింపబడి ఉండును. విత్తనము యొక్క రెండు బేడలయందు మొలకలకు కావలసిన ఆహారపదార్థములు, మరికొన్ని రసాయనిక పదార్థములు తయారైయుండును. గ్రుడ్డుకు పెంకు ఏ విధముగా ఉన్నదో, ఆ విధముగా విత్తనముకు ఒక పొర కప్పబడి ఉండును. ఈ పొరయందు ఒక చోట చిన్న ముడి కలిగియుండును. ఆ ముడి విత్తనము లోపలనున్న బేడలను పొరను కలిసియుండును. విత్తనపు బేడలు పై పొర కలియు ముడియందు **'మొన'** అను ఒక చిన్న భాగముండును. ఈ మొన విత్తనములో ముఖ్యమైనది. ఈ మొనయందే పురుషకణము ఇమిడి ఉండును. విత్తనములో మొన మినహాయున్న బేడలను స్త్రీకణములుగా లెక్కించు కోవలయును. స్త్రీపురుష కణములను కాపాడుచు ప్రతిజాతి విత్తనమునకు ఒక పొరయుండును. దీనిని బీజరక్షక పొరయని అందురు. పొట్టులేని విత్తనములు రక్షణలేనివై కణములు చెడిపోవును. అందువలన పొట్టుపోయిన విత్తనములు మొలకెత్తవు. విత్తనమునకు ఒకచోట ముడి ఉన్నదని తెలుసుకొన్నాము కదా! ఆ ముడివద్ద పై పొర చిన్న రంధ్రము కలిగియుండును. ఈ విధముగా ఉన్న విత్తనము పూర్తి తయారైనదని చెప్పవచ్చును. బేడ ముదరనటువంటిది, పొర తయారుకానటువంటిది, పొరకు రంధ్రము లేనిది పూర్తి తయారుకాని విత్తనమని తెలుసుకొనుము. అటువంటి విత్తనము జన్మకు అయోగ్యమైనది. పూర్తిగా తయారైన విత్తనము నీరు తగిలిన వెంటనే మార్పు చెందునట్లుయుండును. భూమియందు పడిన విత్తనమునకు తేమ తగిలిన వెంటనే అది మొక్కగా మొలుచుటకు ప్రారంభమగును. విత్తనమున గల

ముడివద్దనున్న రంధ్రము ద్వారా నీరు విత్తనము లోపలి భాగమందున్న మొనకు తగులును. నీరు తగిలిన వెంటనే మొనయందు మార్పువచ్చును విత్తనపు బేడలయందు కూడ మార్పువచ్చును. బేడలు మెత్తగా తయారగును. విత్తనపు మొన రెండు బేడలను ఆధారము చేసుకొని పెరుగుట ప్రారంభించును. అపుడు విత్తనపు పై పొర మెత్తబడి చినిగిపోవును. మొన నుండి పెరుగుటకు బయలుదేరిన ఒక భాగము భూమిలోనికి పోవును. రెండవ భాగము భూమి పైకి పెరుగును. గ్రుడ్డునందు పిల్లకు ప్రాణములేనప్పటికి ఏ విధముగ పెరుగుచున్నదో, అదే విధముగనే విత్తనమునందు ప్రాణములేనప్పటికి మొనయందలి పురుషకణము పెరుగుచున్నది. ఇది అంతయు విత్తనమునందలి రసాయనికచర్యయని తెలియవలెను. అట్లు పెరుగు సమయములో విత్తనముయందలి పదార్థములు మొలకకు వినియోగింపబడును. పురుషకణము విత్తనములోని పదార్థములను వినియోగించుకొని మొక్కగా మార్పు చెందుచుండును. భూమిపైకి పెరిగిన భాగములో చిన్నచిన్న ఆకులు తయారగును. భూమిలోపలికి పోయిన వేరు భాగములో చిన్నచిన్న వేర్లు తయారగును. ఈ విధముగా తయారైన మొక్కకు కూడ ప్రాణము లేదు. అంతవరకు విత్తనమందలి పోషక పదార్థములతోనే మార్పు చెందిన రసాయనిక క్రియ అని తెలియవలెను.

మొక్కకు ఆకులు వచ్చి వికసించుకొనుదాక దానియందు ప్రాణములేదని చెప్పవచ్చును. మొదటి శ్వాసతోనే జీవుడు ప్రవేశించునను సిద్ధాంతము ప్రకారము చెట్టుకు మొదటి శ్వాస జరుగు వరకు ప్రాణమురాదు. మొలకెత్తిన మొక్క ఆకులయందు పత్రరంధ్రములు తయారైనపుడు జీవుడు ప్రవేశించుటకు యోగ్యత కలిగిన మొక్కగాయుండును. మొక్క ఆకులు, కాండము పూర్తి తయారైన తరువాత, ఆకులయందు పత్రరంధ్రములు ఏర్పడిన తరువాత, మొదటి శ్వాసతో జీవుడు మొక్కయందు ప్రవేశించును. ఆకుల క్రింద గల పత్రరంధ్రముల ద్వారా మొక్క శ్వాసించునని తెలుసుకొనుము. పత్రరంధ్రములలో ఎపుడు శ్వాస ప్రవేశించుచున్నదో అపుడు జీవుడు చెట్టునందు ప్రవేశించునట్లు లెక్కింపబడుచున్నది. అండజములకు, పిండజములకు ప్రాణమొచ్చిన తర్వాత వాటికి ప్రాణమొచ్చినట్లు మనము

సులభముగా గుర్తించగలము. కాని మొలకకు ప్రాణమొచ్చినను శ్వాస ఎపుడు ప్రవేశించినది ఎవరూ కనుగొనలేరు. మొలకెత్తిన విత్తనములకు ప్రాణమొచ్చిన వెంటనే గాలి నుండి ఆకుల ద్వారా శ్వాసించుచు, భూమి నుండి వేర్ల ద్వార పోషకపదార్థములను తీసుకొనుచు, ఆకుల పై భాగమున సూర్యరశ్మి చేత పిండి పదార్థమును తయారుచేసుకొనుచు, ఆహారమును సంపాదించుకొనుచు, జీవిత కార్యమును సాగించును.

స్త్రీలకు గర్భస్రావము జరిగినట్లు, గ్రుడ్డు మురుగ్రుడ్డుగా చెడిపోయినట్లు విత్తనములు కూడ చెడిపోగలవు. ఎక్కువ వేడి తగులుట వలన, విత్తనమందలి తేమ ఆరిపోవుట వలన పదార్థములు చెడిపోయి విత్తనము మొలకెత్తలేక పోవును. పొట్టు తీసివేసిన విత్తనములు, పుచ్చిన విత్తనములు, చిరకాలము గడచిన విత్తనములు మొలకెత్తలేవు. విత్తనములో పదార్థములు అనుకూలముగా లేనందువలన పురుష భాగమైన మొన మొలకెత్తలేదు.

భూమిమీద గల సమస్త విత్తనములకు జన్మ పైన చెప్పిన విధముగా మొదటి శ్వాసతోనే కలుగుచున్నట్లు తెలుసుకొనుము. సముద్రములోని జీవరాసులు నీటిని మొదటి శ్వాసగా పీల్చును. ఈ విధముగా జీవరాసులన్నియు క్రొత్త శరీరము ధరిస్తున్నవి. జీవాత్మతో పాటు ఆత్మ ఉన్నది కావున ఆత్మ కూడ జీవాత్మతో పాటు క్రొత్త శరీరమును చేరుచున్నదని తెలియాలి. క్రొత్త శరీరమేదో, ఆత్మ దానినెపుడు చేరుచున్నదో తెలిసింది కదా! ఆత్మ ఇంకనూ ఎట్టిదనగా క్రింది శ్లోకమును చూడుము.

<u>**గమనిక :**</u> **'వాసాంసి జీర్ణాని'** అను భగవద్గీత శ్లోకమునకు మేము చెప్పిన వివరము సరిక్రొత్తది. కావున దీని విషయమై బాగా యోచించి అర్థము చేసుకోగలరని కోరుచున్నాము. అయినప్పటికి ఇందులో ఎన్నో అనుమానములు ఉత్పన్నమై ఇది సత్యమా అను ప్రశ్న బయలుదేరును. అటువంటి అనుమానములు పోవుటకు కొన్ని వాస్తవ సంఘటనలను తెలుపుచున్నాము. దాదాపు ఇరవై ఐదు సంవత్సరముల క్రితము ఈనాడు దినపత్రికలో టూకీగా అను శీర్షిక క్రింద **'గడుగ్గాయి'** అను

పేరుతో ప్రచురితమైది. అది ఏమనగా! ఇంగ్లాండునందు పెద్ద ఆస్పత్రిలో ఒక స్త్రీకి ప్రసవము జరుగగ, పుట్టిన ఆడ శిశువుకు గంటసేపైనప్పటికి కదలిక రాకపోవడముతో, అక్కడున్న డాక్టర్లు పరీక్షించి ఆ శిశువు గర్భమునందే చనిపోయినదని చెప్పారు. తర్వాత ఆ శిశువుకు అవ్వగారైన వృద్ధురాలు వచ్చి శిశువును గురించి అడిగింది. అపుడామెకు శిశువు తల్లి ప్రక్కనున్న వారు శిశువు గర్భమునందే చనిపోయినదని, దానిని శవాల గదిలో ఉంచారని చెప్పారు. ఆ వృద్ధురాలు చనిపోయిన శిశువు ముఖమునైన చూచి వస్తానని శవాలగదిలో తొట్టిలో పెట్టి గుడ్డకప్పిన శిశువు దగ్గరకు పోయి ముఖము మీద గుడ్డ తీసి చూడగా, శిశువు బ్రతికివున్నట్లు ఆమెకు తెలిసి ఎత్తుకు వచ్చి, అరుస్తున్న ఆ శిశువును అందరికి చూపి తల్లి దగ్గరకు చేర్చింది. ఆ విషయము తెల్సిన డాక్టర్లు వచ్చి శిశువును పరీక్షించి చూచి తెల్లముఖము వేశారు. తరువాత వారి సంరక్షణలోనే నెల రోజులు ఆ శిశువును పెట్టుకొని తరువాత డిశ్చార్జి చేసి పంపారు.

ఇటువంటి సంఘటనే తిరుపతి గోస్ ఆస్పత్రిలో కూడ జరిగినది. అక్కడ పొరపడిన లేడిడాక్టరు నేనెలా పొరబడినాను, అన్ని పరీక్షలు చేసిన తర్వాత శిశువుకు ప్రాణములేదని నిర్ణయించాను కదా! శిశువు గంట తరువాత ఎలా బ్రతికిందని ఏదో ఎక్కడో పొరబడినాననుకొన్నది. ఆమె మా **'జనన మరణ సిద్ధాంతము'** అను పుస్తకము చదివిన తరువాత నాతో కలిసి తాను ఎక్కడ పొరబడినానో తెలిసిపోయినదని, ఈ విషయము మా చదువులలో ఎక్కడా లేదని, అందువలననే పొరపాటు జరిగినదని ఒప్పుకొన్నది. అపుడు నేనిలా ప్రశ్నించాను. ***"కదలికలు లేనపుడు శిశువు ఏ స్థితిలో ఉందనుకొంటారు?"*** దానికామె జవాబు ***'అది మూర్ఛస్థితిలో ఉందనుకొంటాము. అపుడు కాళ్లు పట్టుకొని తలక్రిందులుగా వేలాడబెట్టి వీపు మీద తట్టుతాము. అప్పటికీ కదలిక రాకపోతే రెండు రకముల ఇంజెక్షన్లు వాడుతాము. అప్పటికీ కదలిక రాని ఎడల ఆ శిశువు గర్భములో మరణించినట్లు నిర్ణయించుతాము.'*** అన్నది అపుడు నేను శ్వాస ఆడుచు తెలివి తప్పియుంటే దానిని మూర్ఛ అనవచ్చును. శ్వాస ఆడకుండ తెలివి తప్పియుంటే

దానిని మూర్ఛ అనకూడదు కదా! కదలికలులేని శరీరములో శ్వాస ఆడుచున్నదో లేదో ముందు పరిశీలించిన ఎడల మీకే తెలియునన్నాను. ఇట్లు ఎన్నో నిదర్శనములను జనన మరణ సిద్ధాంతమునకు అనుకూలముగా మీరు చూడవచ్చును.

## 1). శిశువు బ్రతికే ఉన్నా ... మరణించాడని చెప్పిన డాక్టర్లు

(ఈనాడు, హైదరాబాద్ ) సీతాఫల్ మండి, నవంబరు 30,2001 (న్యూస్‌టుడే) :

నవమాసాల కలల పంట కాసేపట్లో భూమ్మీద పడబోతోందని ఆ తల్లి సంబరపడింది. ఇన్నాళ్ళూ కడుపులో ఉండి కితకితలు పెట్టిన బిడ్డ కొద్దిసేపట్లో చేతుల్లో ఉంటాడని ఆ తల్లి కన్న కలలు ఎన్నో, తీరా ఆ సమయం రానే వచ్చింది. పుట్టగానే బిడ్డ మృతి చెందాడని డాక్టర్ చెప్పేసరికి ఆమె గుండె బద్దలయింది. బిడ్డ శవాన్ని డాక్టర్ ఓ సంచిలో వేసి ఇచ్చి అప్పచెప్పినట్టుగా వారితో సంతకం తీసుకుని చేతులు దులుపుకున్నాడు. అక్కడితో కథ ముగిసేదే. కానీ ఆ బిడ్డ తండ్రి రావడంలో జరిగిన కొద్దిపాటి ఆలస్యం కథను మరో మలుపు తిప్పింది. శిశువు తండ్రికోసం అంతా ఎదురు చూస్తుండగా సంచిలో కదిలినట్లయింది. ఇది వింతా! డాక్టర్ల నిర్లక్ష్యమా! ఇదేదో ఏ మారుమూల కుగ్రామంలోనో జరిగినది కాదు. రాష్ట్రంలో ప్రఖ్యాతి పొందిన గాంధీ హాస్పిటల్లో జరిగిన సంఘటన ఇది. వివరాల్లోకి వెళితే.. గూడూరులో ఉండే ప్రకాష్ (25), రేణుక (20) లకు సంవత్సరం క్రిందట పెళ్లయ్యింది. రేణుక గర్భవతి అయ్యాక, తొలి కాన్పు కావడంతో ఖర్చుకు, శ్రమకు వెరవక ప్రతిసారి గాంధీ ఆసుపత్రికి వచ్చి పరీక్షలు చేయించుకొనేవారు. ప్రసవ సమయం దగ్గరపడడంతో గురువారం సాయంత్రం గూడూరు నుంచి వచ్చి గాంధీ ఆసుపత్రిలోనే అడ్మిట్ అయ్యారు. సాయంత్రం ఏడు గంటలకు రేణుక మగబిడ్డకు జన్మనిచ్చింది. డాక్టర్లు పరీక్షించి పిల్లవాడు బలహీనంగా పుట్టడంవల్ల చనిపోయాడని చెప్పారు. దాంతో రేణుక శోకదేవతే అయ్యింది. ఆమె తల్లి వీరమ్మకు చనిపోయాడని చెప్పి బిడ్డను ఓ గోనె సంచిలో వేసి ఆస్పత్రి సిబ్బంది అప్పగించారు. సంచి అప్పగించినట్లు ఆమె చేత సంతకాలూ చేయించుకున్నారు. రేణుక భర్త ఆ సమయంలో బయటికి వెళ్లాడు.

వీరమ్మ రేణుకను ఓదారుస్తూ బిడ్డ శవాన్ని పెట్టుకు కూర్చుంది. అల్లుడి కోసం ఎదురు చూస్తోంది. గంట సమయం గడచిపోయింది. ఇంతలో గోనె సంచిలో కదలికలు మొదలయ్యాయి. పక్కనే ఉన్న మహిళలు ఆ విషయం గమనించి వీరమ్మకు చెప్పారు. సంచి విప్పి చూడగా బిడ్డ కదులుతున్నాడు. దాంతో వీరమ్మ, రేణుకల సంతోషానికి అవధుల్లేవు. అంతలోనే మళ్లీ కదలికలు ఆగిపోయాయి. ఈ విషయాన్ని డాక్టర్లకు చెబితే వాళ్ళు వీరమ్మను బెదిరించి పంపేశారు. మళ్ళీ కొద్ది సేపటికి బిడ్డ ఏడుపులంకించుకున్నాడు. అప్పటికిగానీ డాక్టర్లకు తెలివిరాలేదు. వెంటనే బాబుని ప్రీమెచ్యూర్ యూనిట్‌కి తరలించారు. ప్రస్తుతం బాబు ఆ యూనిట్‌లో చికిత్స పొందుచున్నాడు. అల్లుడు రావడం ఆలస్యం కాకపోయి ఉంటే ఏం జరిగేదో తల్చుకోవడానికే భయంగా ఉందని వీరమ్మ రోదిస్తూ చెప్పింది. ఆ కాసేపూ నరకయాతన అనుభవించామని రేణుక, వీరమ్మలు అన్నారు. బాబు బతకలేదని తెలిసి ఆత్మహత్మ చేసుకోవాలని అనుకున్నా అంటూ రేణుక కళ్ళనీళ్ల పర్యంతమైంది. ఒక వేళ అదే జరిగుంటే రెండు నిండు ప్రాణాలు ఉత్త పుణ్యానికే బలయ్యేవి. అప్పుడా పాపం ఎవరిదో డాక్టర్లు ఆత్మ విమర్శ చేసుకోవాలి.

## 2). ప్రాణము రాక ముందే వచ్చినది, పోయినదని చెప్పిన డాక్టర్లు

తండ్రి పేరు : E. రామమోహన్ గౌడ్,

తల్లి పేరు : E. వాసవి

హాస్పిటల్ : గంగ హాస్పిటల్

తేది : జూలై,22,2004

టైమ్ : 6.30 A.M

గర్భవతిగ ఉన్న శ్రీమతి వాసవిగారు గంగ హాస్పిటల్ (దిల్‌సుఖ్ నగర్, చైతన్యపురి) లో లేడీ డాక్టర్‌గారితో పరీక్ష చేయించుకున్నది, గర్భస్థ శిశువు ఆరోగ్యముగానే ఉన్నదని ఆమె భర్త రామ్మోహన్ గౌడ్ గారికి డాక్టర్ తెలియపరిచారు.

తరువాత కొద్ది రోజులకు నెలలు నిండి గర్భవతియైన వాసవి గారికి నొప్పులు ప్రారంభమైనవి. డెలివరి అవుతుందని గంగ హాస్పిటల్‌కు వెళ్లి డాక్టరును కలిశారు. గర్భములో శిశువు కదలికలు బాగానే ఉన్నవని, శిశువు బాగానే ఉందని చెప్పిన డాక్టర్ల మాటలు విని రామ్మోహన్ గౌడ్ సంతోషంగా ఉన్నారు. కొంత సమయమునకు వాసవిగారు ప్రసవించడము జరిగినది. ప్రసవించిన 15 నిమిషముల తర్వాత తండ్రి రామ్‌మోహన్ గౌడ్‌కు శిశువును చూపించారు. అపుడు శిశువుకు కదలిక గాని, శ్వాస ఆడినట్లు గాని కనిపించలేదు. ఆ విషయమై లేడీ డాక్టరును అడుగగ శిశువు హార్టు సమస్యతో (ప్రాబ్లమ్‌తో) పుట్టినదని, కొద్ది కొద్దిగ శ్వాస తీసుకొంటున్నదని, అందువలన పైకి కనిపించలేదని చెప్పినది. అపుడు రామ్మోహన్ గౌడ్ శిశువు కొద్దిపాటు కూడ మెదలలేదు, అరవలేదు కదా అని అడిగాడు. దానికి సమాధానముగ హార్టు ప్రాబ్లమ్ ఉన్న శిశువు అలాగే ఉంటుందని, భవిష్యత్తులో శిశువు పెద్దదయిన ఇటువంటి పరిస్థితే ఉంటుందని, ఇటువంటి శిశువుతో తల్లిదండ్రులకు చాలా కష్టముగ ఉంటుందని, అన్ని పనులూ శిశువుకు చేయవలసి ఉంటుందని చెప్పడము జరిగినది. ఆ మాటకు శిశువు మీద తండ్రికి కొంత విరక్తి కల్గినది. అప్పటికి ఉండలేక గర్భముతో ఉన్నప్పటినుండి మీ వద్దకు తీసుకువచ్చి పరీక్షలు చేయించాము కదా! అపుడు కడుపులో శిశువు ఆరోగ్యము బాగా ఉందని చెప్పారు కదా! అని అడిగాడు. అన్ని ప్రాబ్లమ్స్ పరీక్షలతో తేలవు అని చెప్పి, I.C.U కి శిశువును పంపుచున్నామని, ఒకవేళ శిశువు బ్రతకవచ్చు లేక చనిపోవచ్చు అని వేరే హాస్పిటల్‌కు ఫోన్ చేసి వ్యాన్‌ను రప్పించి శిశువు యొక్క ముక్కులకు ఆక్సిజన్ పెట్టి అక్కడి నుండి పంపించినది. ఇదంతయు జరుగుటకు దాదాపు 45 నిమిషములు పట్టినది. శిశువు మీద ఆశ వదులుకొన్న రామమోహన్, తన భార్య ఆరోగ్యముగ ఉంటే చాలునని భార్యకు శిశువు విషయము ఏమాత్రము చెప్పక ప్రక్కగదిలో పరీక్షల నిమిత్తము డాక్టర్లు పెట్టుకొన్నారని చెప్పి మభ్యపరిచాడు. తర్వాత అరగంటకు మీ శిశువు చనిపోయిందని డాక్టరు చెప్పడము జరిగినది. ఆ విషయము తల్లికి తెలిస్తే షాక్‌కు గురి అవుతుందని భర్త ఏమాత్రము భార్యకు తెలియనివ్వకుండ దాదాపు 20 రోజులు గడిపాడు.

ఇక్కడ జరిగిన అసలు విషయమేమంటే 15 నిమిషముల తర్వాత కూడ కదలని, అరవని శిశువును చూచి డాక్టరుకు ఏమి అర్థము కాక, శ్వాస ఏమాత్రములేని శిశువుకు కొద్దికొద్ది శ్వాస బయటికి కనిపించని విధముగ ఆడుచున్నదని చెప్పడము మొదటి తప్పు. ఆ తప్పును సమర్థించుకొనుటకు హార్టువీక్‌గ ఉన్న శిశువు ఇలాగే ఉంటుందని, పెద్దయిన తర్వాత కూడ కదలక మెదలక ఉంటుందని చెప్పడము రెండవతప్పు. శ్వాసయే లేని శిశువుకు ఆక్సిజన్ పెట్టి వేరే హాస్పిటల్‌లోని I.C.U కు పంపించి శిశువు చనిపోయిందని వారి ద్వార చెప్పించడము మూడవ తప్పు. ఎప్పుడో ఒకపుడు కొన్ని శిశువులకు మాత్రము, ప్రాణము ఆలస్యముగ వస్తుందని డాక్టర్లకు తెలియకపోవడము అన్నిటికంటే పెద్దతప్పు.

అరగంటకుగాని, గంటకుగాని, రెండు మూడు గంటలకుగాని, అంతకంటే ఎక్కువ సమయమునకుగాని, శిశువుకు ప్రాణమొచ్చితీరునను సత్యము తెలియకపోవడము వలన, గంగ హాస్పిటల్‌లోని శిశువుకు ప్రాణము రాకమునుపే కొద్దిగ శ్వాస ఉందని తర్వాత పోయిందని చెప్పడము జరిగినది. ఈ సంఘటనలో ఎన్నో ఆశలతో, ఊహలతో తమ బిడ్డను చూచుకొంటామనుకొన్న తల్లిదండ్రులకు బిడ్డను దూరము చేసినట్లయినది. జీవిత ప్రథమాంకములోనే శిశువులను డాక్టర్లు తమకు తెలియకుండానే పరోక్ష హత్యలు చేయుచున్నారు. హత్యలు అనాగరికమని హత్య చేసిన వారిని శిక్షించగలిగిన న్యాయవ్యవస్థ తల్లితండ్రులకు దుఃఖమును కల్గించుచున్న పరోక్ష శిశు హత్యలను ఆపగలదని, శిశువుకు ప్రాణము ఎప్పుడొస్తుందో తెలియని లోపభూయిష్టమైన వైద్యచదువులను, లోపరహితముగ మార్చుటకు ఆదేశాలిచ్చి, ఎందరో శిశువులను రక్షించి పుణ్యము కట్టుకోవలసిందిగ కోరుచున్నాము.

## 3). శిశువుకు ప్రాణము రాకనే చనిపోయినదని చెప్పిన డాక్టర్లు

| | | |
|---|---|---|
| తండ్రి పేరు | : | మల్లేష్ |
| తల్లి పేరు | : | రజిత |
| హాస్పిటల్ | : | విజయ నర్సింగ్‌హోమ్, (కర్మన్‌గాట్) |
| తేది | : | ఆగష్టు26,2004. |

డాక్టర్లు : సత్యనారాయణ మరియు ఒక గైనకాలజిస్టు

కూలినాలి చేసుకొని బ్రతికే పేదదంపతుల కుటుంబము మల్లేష్ గారిది. భార్య గర్భవతి కాన్పు అయ్యే సమయములో ఆమెకు నొప్పులు వచ్చాయి. వెంటనే దగ్గరలో ఉన్న గాయత్రీ నగర్ రోడ్డు నెం.19 లో ఉన్న విజయ నర్సింగ్‌హోమ్‌కు తీసుకొని వెళ్ళారు. ప్రసవము కాగానే ఆ మగ శిశువును డాక్టర్లు పరీక్షించి శిశువుకు ప్రాణములేదని చెప్పారు. చనిపోయినదని చెప్పి శిశువును తీసుకెళ్లమని డాక్టర్లు చెప్పగ, ఆ సమయములో శిశువు తండ్రి లేనందున, దాదాపు ఒకటిన్నర గంట తరువాత శిశువు తండ్రి మల్లేష్ తదితరులు నర్సింగ్‌హోమ్‌కు వచ్చి, శిశువు చనిపోయినదని డాక్టర్లు చెప్పిన సమాధానము విని బాధపడ్డారు.

ప్రాణములేని పసిబిడ్డను పూడ్చి పెట్టాలని అనుకొన్నారు. అనుకొన్న వెంటనే గుంత త్రవ్వడానికి శిశువు తండ్రికి సంబంధించినవారు వెళ్లారు. హాస్పిటల్‌నుంచి ఆ పసికందు శవాన్ని స్మశానానికి తరలించాలనుకున్నపుడు, రక్తపు మరకలు ఆరని పసికందును తండ్రి చివరిసారిగా తన స్వంత హస్తాలతో తీసుకొన్నాడు. తన చేతులలోనికి తీసుకొన్న శిశువును చూసి తండ్రి మల్లేష్ సంతోషముతో 'నా బిడ్డ బ్రతికే ఉన్నాడు' అని బిగ్గరగ అరిచాడు. ఈ హఠాత్ పరిణామానికి అక్కడివారు ఆశ్చర్యపోయారు. నా బిడ్డ శ్వాస పీల్చుకుంటున్నాడని మల్లేష్ చెప్పాడు. అప్పటికీ శిశువు యొక్క బొడ్డుత్రాడు వేరు చేయబడలేదు. శిశువు చనిపోయిందని అలా ఎందుకు చెప్పారు అని డాక్టరును నిలదీయగా, డాక్టరు సత్యనారాయణ సమాధానము చెపుతూ నాతో పాటు గైనకాలజిస్టు కూడ పరీక్షించారు **ఏదో ఫీటల్ హార్టు** లోపమని చెప్పారు అన్నాడు. శిశువు బొడ్డుత్రాడు తొలగించి వెంటనే ఓవైసీ హాస్పిటల్‌కు తీసుకుపొమ్మని డాక్టరు చెప్పారు. వెంటనే వారు ఓవైసీ హాస్పిటల్‌కు తీసుకెళ్లి కొన్ని పరీక్షలు చేయించుకొని తర్వాత శిశువు ఆరోగ్యముగనే ఉన్నదని తెలుసుకొన్న దంపతులు సంతోషించారు.

తండ్రి చేతులలో ప్రాణము పోసుకున్న ఆ శిశువు కొన్ని నిమిషములు కల్లు తెరువకుంటే గుంతపాలై పోయేవాడు. దంపతులు దుఃఖముతో ఏడ్చేవారు. ప్రాణముండగానేలేదని ఎందుకు చెప్పారని దంపతుల బంధువులు స్థానిక పెద్దలు, అక్కడి విజయ నర్సింగ్‌హోమ్ డాక్టరును నిలదీసి అడుగగా డాక్టరు ఏదో సమాధానము చెప్పి పంపివేశారు.

ఈ విషయము రెండు మూడురోజులకు E. Tv వారికి కూడ తెలియబడింది. E. Tv విలేఖరి రెహమాన్ స్థానిక విజయనర్సింగ్ హోమ్‌కు వెళ్ళి వాకబు చేయగ డాక్టరుగారు మొదట బుకాయించి తరువాత తన తప్పేమీ లేదని గైనకాలజిస్టుతో పరీక్షించానని చెప్పాడు. ఈ సంఘటన E. Tv న్యూస్‌లో ఆగస్టు 29వ తేదిన ప్రసారము చేయడము జరిగినది.

## 4). 12 గంటలకు పైన స్మశానంలో బ్రతికిన శిశువు

తల్లి పేరు : సుమతి

హాస్పిటల్ : గాయత్రి క్లినిక్ (కల్వకుర్తి).

తేది : 5-10-2004

డాక్టర్లు : డా॥ముప్వా రామారావు మరియు డా॥ హిమబిందు.

ఎన్నో పరిశోధనలు చేసి భౌతిక విషయములన్నీ తెలుసు కొన్నామనుకొను శాస్త్రజ్ఞులకు, ఇంకా తెలియని విషయములెన్నో ఉన్నవి. మాకు తెలియనిదిలేదనుచు, తమకు తెలిసినదే సత్యమనుకొను భౌతికశాస్త్రవేత్తలు ఇంకా పరిశోధించి తెలుసుకోవలసింది ఎంతో ఉందని వెక్కిరించు విషయములు కోకొల్లలు గలవు. అందులో ఒక్క విషయమును కూడ పరిశీలించి చూడక ఉన్నత విద్యావంతులమని పైనరంగు పూసుకోవడము సమాజద్రోహమని తెలియునట్లు, ఎన్నో సంఘటనలు గలవు. ఒక మేక రెండు పిల్లలీనిన తర్వాత, వాటికి ప్రాణములేదని ప్రక్కన పారవేసిన తర్వాత, మూడు గంటలకు ఆ రెండు పిల్లలు ఒకదాని తర్వాత ఒకటి

ప్రాణము పోసుకోవడము విచిత్ర సంఘటనే, అయిన అవి జంతువులు కాబట్టి వాటిని ఎవరు పట్టించుకోవడములేదు. అట్లని మనుషుల విషయములో అదే విధముగ జరిగినప్పటికి పట్టించుకోక పోవడమును ఏమనవచ్చునో అర్థము కావడములేదు. మన పరిశోధనల ఫలితము మానవ సమాజము నాగరికతవైపు పయణించుటకే గాని అనాగరికతవైపుకు పోకూడదు. మానవుని మనుగడకు ఉపయోగపడవలసిన విజ్ఞానము (సైన్సు) ప్రథమాంకమైన బాల్యములోనే మానవున్ని హతమార్చడము విడ్డూరము కాదా! ఒక్క ఆంధ్రరాష్ట్రములోనే సంవత్సరమునకు కొన్ని వందల సంఖ్యలలో, శిశుదశలోనే మానవజాతి పరోక్ష హత్యకు గురి అవుతున్నదని చెప్పుటకు ఎన్నో ఉదాహరణలుగలవు. వాటిలో మహబూబ్‌నగర్ జిల్లా, కల్వకుర్తిలోని ఒక ప్రైవేటు ఆసుపత్రియందు జరిగిన సంఘటనను వివరించుకొందాము.

"జడ్చర్ల మండలము నజురుల్లాబాద్ గ్రామానికి చెందిన సుమతి, పురుటి నొప్పులతో 2004 అక్టోబర్ 5వ తేదిన మంగళవారము కల్వకుర్తి ప్రైవేటు ఆసుపత్రిలో చేరడము జరిగినది. సాయంత్రము 5 గంటలకు ఆమెకు సిజేరియన్ ఆపరేషన్ ద్వార ఆడశిశువును బయటికి తీసిన డాక్టర్లు, శిశువును కొంతసేపు క్షుణ్ణంగా పరీక్షించి మరణించినట్లు ధృవీకరించారు. మరణించిన శిశువు పుట్టిందని చెప్పిన డాక్టర్ల మాటలకు కొంత బాధపడిన తల్లితండ్రులు శిశువును ఇంటికి తీసుకుపోయారు. శిశువు పుట్టిన మంగళవారము గడిచిపోగా బుధవారము పసికందును ఖననము చేయడానికి శ్మశానానికి తీసుకెళ్లారు. గోతిలో శిశువును పరుండబెట్టి పైన మట్టి వేయునపుడు శిశువు కదలి ఏడ్వడము మొదలుపెట్టింది. ఆశ్చర్యపడిన తండ్రి మొదలైనవారు బిడ్డ బ్రతికిఉందని గ్రహించి ఇంటికి తెచ్చుకొన్నారు. అన్ని విధముల పాప ఆరోగ్యముగ ఉన్నది. అన్ని పరీక్షలు జరిపిన తర్వాత కూడ మరణించిన శిశువు పుట్టినదని డాక్టర్లు చెప్పడముతో ఆ కుటుంబము పడిన ఆవేదన ఆగ్రహముగ మారింది. ఆసుపత్రిపై దాడిచేసి తాళాలు వేయడానికి ప్రయత్నించారు. శిశువు మరణించినట్లు ధృవీకరించిన డాక్టర్లు పరారైపోయారు.

ఇది జరిగిన సంఘటన కాగ ఇందులో డాక్టర్లకు తెలియని విషయము ఉన్నదని స్పష్టముగ కనిపిస్తున్నది. శిశువు బయటపడిన తర్వాతనే ప్రాణము పోసుకొంటుందను విషయము జగమునకు తెలియని సత్యము. తర్వాత రెండవరోజు ప్రాణమొచ్చిన విషయము అర్థముకాక, తమదే తప్పనుకొన్న డాక్టర్లు పారిపోవడము జరిగినది. శిశువుకు మొదట ప్రాణములేని మాట వాస్తవమే, అయినప్పటికి ఆ విషయము తెలియని డాక్టర్లు తమదే పొరపాటనుకోవడము వారి చదువులకే అవమానము. ఈ ఒక్క విషయముతోనే డాక్టర్లకు తెలియని విషయమెంతో కలదని తెలియుచున్నప్పటికి, మేము గత 30 సంవత్సరములుగ చెప్పుచున్నప్పటికి మాకు తెలియనిది మీకు తెలుసునా అని మొండిగా మాట్లాడు వారినేమనాలో మీరే యోచించండి.

డాక్టర్లు శిశువు చనిపోయిందని చెప్పిన వెంటనే శిశువును తల్లితండ్రులు వదలిపోయి ఉంటేనో, లేక శిశువును పారవేసి ఉంటేనో, లేక వెంటనే భూమిలో పూడ్చిపెట్టిఉంటేనో, ఆ శిశువును పరోక్షముగ హత్య చేసినట్లు కాదా! దానికి డాక్టర్లు కారకులు కాదా! డాక్టర్లను తయారుచేసిన మెడికల్ బోర్డు ఈ విషయములన్నిటికి బాధ్యత వహించి సమాధానము చెప్పాలి."

తన పుట్టుకను తానే తెలియని మనిషి, తన సంతతి పుట్టుకలో కూడ పొరపడుచున్నాడు. ఎందరో తల్లిదండ్రులు తమ శిశువులకు ప్రాణము రాకముందే గర్భములోనే చనిపోయాడని అపోహపడుచున్నారు. పుట్టిన తరువాత కదలని శిశువును చనిపోయినదని డాక్టర్లు చెప్పడము వలన, మొదటికి ప్రాణమేరాని శిశువును చనిపోయినదని పూడ్చిపెట్టిన వారు కొందరుండగ, ఆ శ్రమ కూడ లేకుండ నిర్జన ప్రదేశములోనో, కంపచెట్లయందో, మురికికాల్వలయందో పారవేసినవారు కూడ చాలా మందిగలరు. ఇటువంటి సంఘటనలు ఎన్నో వేలసంఖ్యలో జరిగినవి కలవు. వాటిలో ఉదాహరణకు అనంతపురం ఆంధ్రజ్యోతి వార్తా పత్రికలో సోమవారం,13వ తేది, సెప్టెంబరు 2004న అనంతపురం జిల్లా స్పెషల్ ధర్మవరం జోన్‌లో ప్రచురితమైన వార్త ఈ విధముగ ఉన్నది.

## 5). అనాధ పసికందును అక్కున చేర్చుకున్న దంపతులు

ధర్మవరం, సెప్టెంబరు, 12, 2004 (ఆన్‌లైన్)

ఓ తల్లి కనిపారవేసిన పసికందును అక్కున చేర్చుకున్న దంపతుల సంఘటన ఇది. అనంతపురం జిల్లా, ధర్మవరం పట్టణములోని గూడ్సుషెడ్డు కొట్టాలకు వెళ్ళే రహదారిలో రైల్వేగేటు వద్ద, లోకము ఎరుగని అప్పుడే పుట్టిన ఒక పసికందును ఎవరో పారవేయడముతో, విషయము తెలుసుకున్న పోలీసులు అక్కడికి వెళ్లి, ఆ పసికందు ప్రాణాలతో ఉండడము చూచి ప్రభుత్వ ఆసుపత్రికి తరలించారు. పసికందు ముళ్ళపొదల్లో అరుస్తున్నా ఎవరూ పట్టించుకోని పరిస్థితులలో సి.ఐ విక్టర్, ఎస్.ఐ శ్రీనివాసులు, ఎ.ఎస్.ఐ భీమప్ప ముళ్ళపొదల్లోని పసికందును బయటికి తీశారు. వెంటనే ప్రభుత్వాసుపత్రికి తరలించగ వైద్యులు చికిత్సలు నిర్వహించారు. ఆ పసికందు వయస్సు కేవలము కొన్ని గంటలే అని వైద్యులు తెలిపారు. ఆ బిడ్డను అక్కున చేర్చుకోవడానికి పలువురు దంపతులు పోటీపడగ, చివరకు అన్ని వివరాలు తెలుసుకొని చిన్నారిని పోషించగల ఆర్థిక స్థోమత ఉండి సంతానములేని దంపతులకు అప్పగించడము వల్ల, ఆ చిన్నారికి న్యాయము చేసినవారౌతామని సి.ఐ విక్టర్, ఎస్.ఐ శ్రీనివాసులు భావించారు. దీనితో గుంతకల్లుకు చెందిన వి. దేవదానము, సరోజ అను దంపతులకు ఆ పసికందును అప్పజెప్పారు. వారికి సంతానములేక పోవడముతో ఆ చిన్నారిని తమ బిడ్డగ చూచుకొంటామని చెప్పి పోలీసులకు విజ్ఞప్తి చేశారు. దేవదానము గుంతకల్లు పట్టణమునకు చెందిన వ్యక్తి కాగ, కల్లూరు ఎ.పి. ట్రాన్స్‌కో లో లైన్‌మేన్‌గా ఉద్యోగము చేయుచున్నాడు. దీనితో సి.ఐ విక్టర్ వారికి పసికందును అప్పజెప్పి దంపతుల వివరాలు తీసుకొన్నారు.

ఇదేదో అక్రమ సంబంధము వలన కనిన శిశువును పారవేశారని చాలామంది అనుకొనుటకు అవకాశము గలదు. అటువంటిది ఏమీలేదు. అక్రమ సంబంధము వలన గర్భము వస్తే అబార్షన్ చేయుటకే రెడీగా ఎందరో డాక్టర్లు గల ఈ నవీన కాలములో, అందరికీ కనిపించేటట్లు తొమ్మిది నెలల కడుపును

పెంచుకొనువారు ఎవరూలేరు. కనేవారు అంతకూ లేరు. కావున శిశువును పారవేసిన కేసులన్ని చనిపోయినవని, పారవేసినవేనని తెలియుచున్నది. పారవేసిన తరువాత శిశువు సురక్షితముగవుండి ప్రాణమువస్తే, ఎవరో ఒకరు చూసి తెచ్చి పెంచుకొన్నవారు కూడ ఎందరో కలరు. ఎవరూ చూడకపోతేనో, కుక్కల కంటపడితేనో ఆ శిశువు అంతమైపోయినట్లే.

సమాజములో ఇటువంటి పరోక్ష శిశుహత్యలు కోకొల్లలుగ జరుగుచున్నవి. మేము గత ముప్ఫై సంవత్సరములుగా చెప్పుచున్నను, మమ్ములను హేళన చేయువారు తప్ప సత్యమును గ్రహించువారు లేరు. ఆదిలోనే అంతమై పోవువారిని కాపాడుటకు ఈ పరోక్ష హత్యలను నివారించుటకు న్యాయస్థానములు న్యాయాధీశులు ముందుకు రావాలని కోరుచున్నాము.

**జనన సిద్ధాంతమునకు మరొక ఉదాహరణ మీరు చూడవచ్చును.**

## 6). అమ్మా నే బ్రతికే ఉన్నా !

**బ్రతికున్న బిడ్డ చనిపోయాడని గుడ్డలోచుట్టేసిన వైద్యులు!**

*సెప్టెంబరు, 21,2005 (న్యూస్‌టుడే, సుల్తాన్‌బజార్) కోఠి, హైదరాబాద్.*

అప్పుడే కళ్లు తెరచిన పసికందు, అమ్మ ఒడి వెచ్చనేంటో తెలియదు. అమ్మ పాలరుచీ చవిచూడలేదు. ఎన్నో రంగులు, అందాలు చూడాల్సి ఉంది. కాని నిర్ధయ గల వైద్యులు నువ్వు బతకలేదన్నారు, మృతశిశువువన్నారు. గుడ్డలో చుట్టి ఓ మూలకు విసిరేశారు. బిడ్డ పుట్టిందని తెలిసి మధురానుభూతితో ఉన్న ఆ మాతృమూర్తికి తన ప్రేగుబంధం ఏమైందో తెలియదు. బంధువులు బయటకెళ్లేసరికి బ్రతికున్న ఆ బిడ్డను మృతశిశువుగా ముద్రవేసి పక్కన పెట్టారు. నిర్లక్ష్యం..నిర్లజ్జ..అనాగరికం.. ఈ పదాలకు మించి నిఘంటువులో ఏదైనా పెద్ద పదముంటే... దాన్ని సుల్తాన్‌బజార్ ప్రసూతి ఆసుపత్రి సిబ్బందికి అన్వయించాలి. మంగళవారంనాడు (అ)ధర్మాసుపత్రిలో జరిగిన సంఘటన

తలచుకుంటేనే ఒళ్లు గగుర్పొడుస్తుంది. మానవతను ప్రశ్నిస్తుంది. వైద్యలోకానికే మాయని మచ్చగా మిగులుతుంది.

జీడిమెట్ల సమీపంలోని సూరారం గ్రామానికి చెందిన సురేష్ యాదవ్, రేవతి(27) దంపతులు. వీరికి ఒక పాప. గతంలో రేవతికి రెండు సార్లు అబార్షన్ అయింది. ఆమె మళ్ళీ గర్భం దాల్చడంతో కుటుంబీకులు సుల్తాన్‌బజార్‌లోని ప్రభుత్వ ప్రసూతి వైద్యశాలలో కొంతకాలంగా చికిత్స చేయిస్తున్నారు. ఏడునెలల గర్భవతి అయిన రేవతికి హై బి.పి. ఉండటంతో, ప్రసవ సమయంలో ఇబ్బందులతో పాటు పుట్టబోయే శిశువు బలహీనంగా జన్మించడం, లేదా శిశువు మరణించే అవకాశాలున్నాయని, ఆసుపత్రి సూపరింటెండెంట్ ఆమె కుటుంబీకులకు వారంరోజుల క్రితమే సూచించారు. రేవతి ఈ నెల 8న సుల్తాన్‌బజార్ ప్రభుత్వ ఆసుపత్రిలో చేరింది. అయితే ఆమెకు సోమవారం సాయంత్రం పురిటినొప్పుల కోసం ఇంజక్షన్ ఇవ్వడంతో, రాత్రి ఒంటి గంట సమయంలో నొప్పులు ప్రారంభమయ్యాయి. డ్యూటీ మెడికల్ ఆఫీసర్ (DMO) సంధ్యాదీక్షిత్‌కు ఆ సమాచారం అందించారు. మంగళవారం తెల్లవారుజామున 3.45 గంటల సమయములో రేవతికి సాధారణ ప్రసవము జరిగి ఓ మగబిడ్డకు జన్మనిచ్చింది. ప్రసవము సమయములో రేవతి తల్లి యాదమ్మ ప్రసవము జరిగే వార్డు వద్ద ఉండగా, ఆమె భర్త సురేష్ మందుల కోసం బయటికి వెళ్ళాడు. అయితే రేవతిని వెంటనే ఆపరేషన్ థియేటర్‌కు తరలించారు. ఆరు గంటల సమయములో అక్కడ పనిచేసే ఆయావచ్చి పుట్టిన శిశువు మరణించాడని ఓ గుడ్డ తీసుకురావాలని చెప్పింది. దీంతో రేవతి తల్లి యాదమ్మ గుడ్డను తీసుకువచ్చి ఇచ్చింది. శిశువును గుడ్డలో చుట్టి ఓ ప్లాస్టిక్ కవర్‌లో ఉంచి పక్కన పెట్టేశారు. డబ్బులు ఇస్తే ఇక్కడే ఉండే ఓ వ్యక్తి మృతశిశువును తీసుకెళ్ళి పూడ్చేస్తాడని సలహా కూడా ఇచ్చారు. అయితే రేవతి పరిస్థితి ఆందోళనకరంగా ఉండటంతో, ఆమె అత్తామామలు వచ్చేదాకా ఉండమని చెప్పడముతో, సిబ్బంది శిశువును అక్కడే ఓ ప్రక్కన పెట్టేశారు. మధ్యాహ్నం 3.30 గంటల సమయములో రేవతి మామ శివయ్య,

మరి కొందరు బంధువులు వచ్చి మృతశిశువును ఇవ్వాలని కోరడంతో, ప్రక్కన పడేసిన శిశువు ఉన్న కవర్‌ను వారికి అందించారు. దీంతో వారు ఆసుపత్రి ఆవరణలో ఉన్న సందర్శకుల గదివద్దకు వెళ్ళి, ఓసారి ఎవరి పోలికో ముఖం చూద్దామని కవర్‌లో ఉన్న శిశువును బయటికి తీశారు. అంతే శిశువు ఊపిరి పీల్చుకుంటూ కాళ్లు చేతులు ఆడిస్తూ కనిపించింది. వెంటనే వారు డ్యూటీలో ఉన్న డాక్టర్ రాజేశ్వరి దృష్టికి తీసుకువెళ్ళగా, శిశువు ఊపిరితో ఉన్నాడని వెంటనే నీలోఫర్ ఆసుపత్రికి తరలించాలని సూచించారు. ప్రాణాలతో ఉన్న శిశువు మృతి చెందాడని చెప్పి తమ నిర్లక్ష్యాన్ని చాటుకున్న వైద్యులు, 12 గంటల తర్వాత శిశువు ప్రాణాలతో ఉన్నాడనే విషయం తెలిసినా తగిన విధంగా స్పందించలేదు. ప్రస్తుతం ఆ శిశువు నీలోఫర్ ఆసుపత్రిలో చికిత్స పొందుతున్నాడు. సంచలనం సృష్టించిన ఈ సంఘటన ప్రభుత్వాసుపత్రుల వైఖరిని మరోసారి తెరమీదికి తెచ్చింది.

**ఇట్లు ఎన్నో నిదర్శనములను జనన సిద్ధాంతమునకు అనుకూలముగా మీరు చూడవచ్చును.**

***ఈ విషయములో నేను మీకు కొన్ని ప్రశ్నలను ఇస్తున్నాను. వీటికి మీరు జవాబులు చెప్పగలరేమో చూడండి.***

1. వెనుకటి జన్మ జ్ఞప్తికల్గి చెప్పిన వారినైన మనము భూమి మీద చూడవచ్చును. కాని గర్భస్థ స్థితిని గూర్చి చెప్పినవారున్నారా? అసలు మీకు ఆ జ్ఞప్తి ఉందా?

2. జ్యోతిష్య శాస్త్రరీత్యా తల్లి గర్భము నుండి బయటపడిన తర్వాతనే లెక్కించి దశా శేషమును తెల్పుచున్నారు. దశలు తల్లి గర్భము చేరినప్పటి నుండి ఎందుకు లెక్కించలేదు? దశా భుక్తిని గత జన్మ భుక్తి అని వ్రాయుచున్నారు ఎందుకు? (గర్భ భుక్తి అని కొందరంటారు. గర్భములో సంవత్సరముల తరబడి ఉండరు కనుక గర్భ భుక్తి అనకూడదు గత జన్మ భుక్తి అనాలి.)

3. తల్లి గర్భము నుండి బయటపడిన శిశువుకు కొన్ని నిమిషములు, కొన్ని గంటల పాటు శ్వాస, రక్త ప్రసరణము, కదలిక, చైతన్యము ఎందుకు లేవు.?

4. మంత్రసానులు కొందరు మావిలో ప్రాణమున్నది, శిశువులోనికి రావాలని అంటుంటారు. అసలు గర్భములో ప్రాణమొచ్చినది మావికా, శిశువుకా?

5. కొన్ని ఆస్పత్రులలో ప్రసవింపబడిన శిశువులు చనిపోయినారని డాక్టర్లు నిర్ధారన చేసిన కొంతసేపటికి ఎలా ప్రాణము పొందినాయి?

6. గర్భస్థశిశువుకు ప్రాణము లేనిదే పెరగదని, శిశువు తల్లి శరీరములో మరణిస్తే తల్లికి ప్రమాదమని అంటారు. గర్భము నిలచినప్పటి నుండి ప్రాణము రాని ఆరు నెలల కాలము ఎలా పెరుగగలిగింది. ఆ ఆరు నెలల కాలములో శిశువుకు ప్రాణములేనట్లయితే తల్లికెందుకు ప్రమాదము జరగలేదు?

7. యోగశాస్త్రమైన గీతలో జీవుడు శరీరమును పొందినప్పటి నుండి బాల్య, యవ్వన, కౌమార, వృద్ధాప్య మరియు మరణావస్థలన్నారు కాని గర్భస్థావస్థ అని చెప్పలేదెందుకు?

8. గీతలో పాత శరీరమును వదలి క్రొత్త శరీరమును జీవుడు ధరిస్తున్నా డన్నాడు. క్రొత్తదంటే పూర్తి తయారైనదా? లేక ఆరు నెలలకు అసంపూర్ణముగ ఉన్నదా?

9. భగము (యోని) నుండి ప్రాణముతో పుట్టినపుడు అందరు భగవంతులే అవుతారు కదా! అలా అందరము భగవంతులుగ ఎందుకు లేము?

ఇక్కడ మేము కొద్దిగ చెప్పు జవాబు ఏమంటే మన శరీరములో పంచ భూతములలో ఒకటైన వాయువు (గాలి) ఉన్నది. అది ఐదు భాగములుగ ఉన్నది. వాయువును ప్రాణము అనవచ్చును. అందువలననే పంచవాయువులను పంచ ప్రాణములు అన్నారు. మన ముక్కురంధ్రములో గాలి ఉన్నపుడే ప్రాణమున్నదని, గాలిలేనపుడు ప్రాణములేదని చెప్పడము కూడ పరిపాటి. శరీరములో ప్రాణమున్నపుడే జీవుడు కూడ ఉండును. ప్రాణములేనపుడు జీవుడుండడు.

ముక్కురంధ్రములలో శ్వాస ఆడనంత వరకు శిశువుకు ప్రాణములేదని గ్రహించవలయును. తల్లి గర్భములో మావి అను తిత్తియందు ఉమ్మి నీరు అనుద్రవములో శిశువు మునిగి ఉండును. అందువలన శ్వాస ఆడుటకు అవకాశమేలేదు. జీవుడసలే లేడు. జననము గురించి మేము అడిగిన ప్రశ్నలకు జవాబులు మీరు వెదకండి. సత్యా సత్యములు మీకే అర్థమవుతుంది.

(1)శ్లో॥23: నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః।
న చైనం క్లేదయం త్యాపో న శోషయతి మారుతః॥
(జీవాత్మ)

**భావము :–** జీవాత్మ కత్తికి తెగదు, అగ్నికి కాలదు, నీటికి నానదు, అట్లే గాలికి ఆరిపోదు.

**వివరము :** మూడు ఆత్మలలో మొదటిదైన జీవాత్మకు చెప్పబడిన ఈ శ్లోకములో అగ్నికి, గాలికి, నీటికి అట్లే కత్తికి దొరకనిది జీవాత్మ అన్నారు. జీవాత్మ శరీరము లోపల ఎక్కడో మారుమూల ఉన్నది. అందువలన బయటి ప్రకృతిలోని భాగములైన అగ్ని, నీరు, గాలి, భూమి జీవాత్మను ఏమి చేయలేవు. ఆయుధముల చేత కూడ నరకబడుటకు వీలులేదు. ఆయుధములు కాని, అగ్ని, నీరు, గాలి, భూమి కాని బయటి శరీరమునే తాకగలవు. బయటి శరీరమునే అగ్ని కాల్చ గలదు, కత్తి తెంపగలదు. కాని లోపల ఉన్న జీవాత్మను తాకలేవు. శత్రుదుర్భేద్యమైన కోటలో రాజున్నట్లు జీవుడున్నాడు. ఎంత మంది శత్రువులొచ్చిన కోట బయటినుండి తమ సైనికులతో యుద్ధము చేయవలసిందే. ఒక వేళ కోటలోని సైనికులు ఓటమిపాలై, కోట గోడలు కూలిపోయి, శత్రువులు కోటలోనికి ప్రవేశించు అవకాశమొస్తే, కోటలోని రాజు రహస్యమార్గము ద్వారా బయటికిపోవును. శత్రువులకు దొరకడు. ప్రతి కోటకు రహస్య ద్వారములుండి అపాయకాలములో రాజు పారిపోవుటకు వీలగునట్లు చేసి ఉందురు. అట్లే జీవుడు కూడ కోటలోని రాజువలె ఉండి శరీరమునకు

అపాయకాలములో ఎట్లు పోతున్నదని ఎవరికి తెలియకుండ, కంటికి కనిపించకుండ శరీరము నుండి బయటికిపోవును. దీనిని బట్టి కోటలోని రాజును ఎవరు ఎట్లు చంపలేరో, శరీరములోని జీవున్ని కూడ ఎవరు చంపలేరని తెలియుచున్నది. ఈ విధముగనే యోచిస్తే బయటి ప్రపంచములోని అగ్ని, నీరు, గాలి జీవున్ని తాకలేవని అవి తాకుటకు వీలైనది శరీరము మాత్రమేనని తెలియుచున్నది.

(1)శ్లో॥ 24 : అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్య ఏవచ।
నిత్యస్సర్వగత స్థాణు రచలో ఽయం సనాతనః ॥
(పరమాత్మ)

**భావము :** నిత్యముండువాడు, సర్వ జగత్తంతయు వ్యాపించినవాడు, నిలకడగ ఉండువాడు, చలనము లేనివాడు అయిన సనాతనమైన పరమాత్మ ఛేదింపబడదు, కాలదు, తడుపబడదు, త్రోయబడదు.

**వివరము :-** కొందరు ఇక్కడొక ప్రశ్నను తెలివిగా నన్నడుగవచ్చును, ఏమయ్యా! పై శ్లోకములో చెప్పబడిన విషయమే క్రింద చెప్పబడినది కదా! అదేమో జీవాత్మకన్నావు. ఇదేమో పరమాత్మకన్నావు. ఒకే విషయము ఇక్కడ పరమాత్మకైనది అక్కడ జీవాత్మకెందుకైనది? అని అడుగవచ్చును. దీనికి మా సమాధానము ఏమనగా? పై శ్లోకములో చెప్పిన విషయమే క్రింది శ్లోకములో చెప్పనవసరము లేదు కదా! పైన చెప్పినదే క్రింద చెప్పడములోనే క్రింది దానికి ప్రత్యేకత ఉన్నదని తెలియుచున్నది. ***పైన చెప్పినపుడు ఆయుధములచేత ఛేదించబడదు అని చెప్పి, క్రింద ఛేదించబడునది కాదు అన్నారు.*** పై విషయము క్రింద విషయము ఒకటే అయినప్పటికి రెండవ మారు చెప్పుటలో ఆంతర్యమువేరని యోచన రాక తప్పదు. ఆ యోచనతోనే పై శ్లోకమును, క్రింది శ్లోకమును పరిశీలించి చూచిన పై శ్లోకములో ఆయుధము చేత తెగదు, అగ్నిచేత కాలదు, నీటిచేత నానదు, గాలిచేత త్రోయబడదు అని మాత్రమే అన్నవారు క్రింది శ్లోకమున ఈ ఆత్మ తెగదు, కాలదు, నానదు,

త్రోయబడదు అని చెప్పి విశేషముగా ఈ ఆత్మ నిత్యుడు, సర్వము వ్యాపించినవాడు, చలనములేనివాడు, సనాతనుడు అని కూడ చెప్పారు. సర్వవ్యాపి, సనాతనుడు పరమాత్మయే కావున ఈ క్రింది శ్లోకము పరమాత్మకే చెప్పారని తెలియుచున్నది. పై శ్లోకమున జీవాత్మకున్న విధానము మాత్రమే చెప్పారు. కావున అది జీవాత్మకు మాత్రమేనని తెలియుచున్నది.

చెప్పబడిన విషయము జీవాత్మకు పరమాత్మకు రెండిటికి వర్తించునది. రెండు ఆత్మలకు వర్తించు విషయము రెండు శ్లోకములలో చెప్పబడినపుడు ఏ శ్లోకము ఎవరికను అనుమానము రాక తప్పదు. ఇక్కడ క్రిందిశ్లోకము ప్రత్యేకించి పరమాత్మకే చెప్పుట వలన పై శ్లోకము జీవాత్మకేనని సులభముగా తెలిసిపోవుచున్నది. ఈ సారాంశమును బట్టి జీవాత్మ పరమాత్మలు రెండును బయటి ప్రకృతికి గాని, ఆయుధములకు గాని దొరుకునవి కావు. దొరుకునది మధ్యలో ఉన్న ఆత్మ మాత్రమేనని తెలియుచున్నది.

(1) శ్లో॥ 25 : అవ్యక్తోఽయ మచిన్త్యోఽయ మవి కార్యోఽయ ముచ్యతే ।
తస్మాదేవం విది త్వైనం నానుశోచితు మర్హ సి ॥

(ఆత్మ)

**భావము :-** ఆత్మను తెలియచెప్పుటకు, చింతించి తెలుసుకొనుటకు సాధ్యము కాదు. ఆత్మను ఏ వికారములు అంటవు. అందువలన దానికోసము దుఃఖ పడవలదు.

**వివరము :-** మన శరీరమందు మనతోపాటు నివాసముంటున్న ఆత్మను ఎవరైన తెలుసుకొన్నప్పటికి దానిని బయటికి చెప్పలేరు. దానిని వ్యక్తపరచి చెప్పుటకు మాత్రము చేతకాదు. ఎందుకనగా! ఇట్లుంటుందని దానితో పోల్చి చెప్పుటకు ప్రపంచములో ఆత్మను పోలినదేదీలేదు. అందువలన తనయందుండు ఆత్మను తెలుసుకొన్నవారు, దానియొక్క అనుభూతిని బయటికి చెప్పలేక పోవుచున్నారు. మనస్సు చేత యోచించి తెలుసుకొనుటకు కూడ సాధ్యముకాదు. ఎందుకనగా!

మనస్సుకు యోచనలొస్తున్నంత వరకు ఆత్మ తెలియదు. మనో యోచనలు స్థంభించినపుడే ఆత్మ తెలియును. కావున **'మచింతోయ'** అని చింతనలకందని వాడని తెలిపారు. ఒక వేళ మనస్సు ప్రపంచ విషయములను యోచిస్తే ఆత్మ తెలియక పోవచ్చును. అట్లుకాక మనోచింతన ఆత్మ మీదే పెట్టుకుంటే ఆత్మ ఎందుకు తెలియదని కొందరడుగవచ్చును. వారి మాట ప్రకారము మన మనస్సు ప్రపంచ విషయముల మీద లేకుండా చేసుకొని ఆత్మ మీదే పెట్టితే ఆత్మ తెలియగలదు. అయితే మన మనస్సు దాని మీద పెట్టుటకు ఆత్మ పలానిదని ముందు తెలిసి ఉండాలి కదా! ఆత్మ తెలియనపుడే కదా దానిని తెలుసుకోవాలని ప్రయత్నించేది. అందువలన తెలియని వాడు మనోచింతనచే తెలియలేడు. చింతనచే తెలియునది ప్రపంచమే తప్ప ఆత్మ కాదు. అంతేకాక ఆత్మను ఏ వికారములు అంటవు. గుణముల వలన కలుగు భావములను వికారములంటారు. గుణముల వలన కలుగు మంచి చెడు భావ అనుభూతులు ఆత్మకు అంటవు. అటువంటి ఆత్మకు ఏదైన బాధ కలుగతుందేమోనని, దానిని గూర్చి నీవుగాని, ఎవరుగాని దుఃఖ పడవలసింది లేదు.

ఒక వేళ నేను ఆత్మను గూర్చి బాధపడడము లేదు. జీవాత్మను గూర్చి బాధపడుచున్నాననుకొనిన ఆ జీవాత్మను గూర్చి భగవంతుడిట్లనుచున్నాడు.

(1)శ్లో॥ 26 : అథ చైనం నిత్యజాతం నిత్యం వా మన్యసే మృతం ।
తథా పి త్వం మహాబాహో! నైవం శోచితు మ్హర్షసి ॥
(జీవాత్మ)

**భావము :** అట్లు కాకుండ వాడు నిత్యము పుట్టి నిత్యము చచ్చునని తెలిసితివేని, ఆ విధంబునైన వాని కొరకు నీవు ఏల దుఃఖపడవలయును.

**వివరము :-** ఆత్మ కొరకు కాదు నేను దుఃఖించునది, ప్రతి నిత్యము పుట్టుచున్న మరియు మరణించుచున్న జీవాత్మల గురించి నేను దుఃఖిస్తున్నానని అనుకొనిన, జీవాత్మ ఒకచోట పుట్టి మరియొక చోట మరణించుచున్నాడు. ఆ విధముగనైన

వాడు ఎక్కడ పోకుండ మనముంటున్న భూమి మీదనే మనగలుగుచున్నాడు గదా! వాడు లేకుండాపోతే కదా వానికోసము ఏడ్వాలి. ఒకవేళ వాడు లేడని కాదు, వాడు మనవద్ద ఉంటూ ఉన్నట్లుండి శరీరము వదలి వేరే శరీరము ధరించి వేరేచోట ధనికుని ఇంట పుట్టినప్పటికైన, వాడు సుఖముగా ఉండినప్పటికైన, నా వద్దనుండి పోయెను కదా! ఇక వాని విషయము నాకు తెలియదు కదా! అని దుఃఖము వస్తున్నదనిన దానిని గూర్చి క్రింది శ్లోకమున భగవంతుడు ఇట్లనుచున్నాడు.

(1) శ్లో ॥ 27: జాతస్య హి ధ్రువో మృత్యుర్ధ్రువం జన్మ మృతస్యచ ।
తస్మాద పరిహార్యేఽర్థే న త్వం శోచితు మర్హసి ॥

(జీవాత్మ)

**భావము :-** పుట్టుట ఎప్పటికైన చచ్చుట కొరకే, చచ్చుట మరి పునర్జన్మమునకే, కనుక అనివార్యమైన ఈ సంగతిని గురించి దుఃఖించుట తగదు.

**వివరము :-** ఒక చోట జన్మించినవాడు కొంత కాలమునకు మరణించి తీరవలసిందే, అలా మరణించినవాడు ధనికుని ఇంటగాని, పేదవాని ఇంటగాని తప్పని సరిగా ఎక్కడో ఒక చోట పుట్టవలసి ఉన్నది. అలా ఎందుకు చచ్చి మరియొక చోట పుట్టాలి? మొదట పుట్టినవాడు పుట్టిన చోటనే ఉంటే వానిని విడిపోయామను దుఃఖము మనకుండదు కదా! ఒక వ్యక్తి మరణము చేత మరియొక వ్యక్తి వియోగ దుఃఖము అనుభవించవలసి వస్తుంది కదా! అలా ఎందుకు జన్మల మార్పిడి జరగాలి, అని యోచించిన జనన మరణ పద్ధతి లేకుండ పోయినట్లయితే ఈ ప్రపంచ నాటకమే సాగకుండ సూత్రధారి, ఎవరో పాత్రధారి ఎవరో, తెలియకుండ పోగలదు. దేవుడు ఏర్పరిచిన కర్మయను చట్టమును ఆచరింపజేయుటకు ప్రకృతి అను వ్యవస్థను దేవుడు నిర్మించాడు. ప్రకృతియను వ్యవస్థలో గుణములు, ఇంద్రియములు, వాటి మార్పులు ఎన్నో అమర్చి, చివరకు శరీరము మరణించడము తిరిగి ఇంకొక శరీరమును పొందడమను పద్ధతి కూడ అమర్చిబడి ఉన్నది. ఆ పద్ధతి ప్రకారము అన్నియు యాంత్రికముగా జరుగుచున్నవి. దేవుడే మనిషిగా

వచ్చినప్పటికి ప్రకృతిని అనుసరించి మెలగవలసిందే. ఆయన కూడ ఆ పద్ధతిని అతిక్రమించి నడుచుకొనుటకు వీలులేనట్లు ఆయనే గట్టి భద్రము చేసి ఉంచాడు. కావున జీవాత్మల చావు పుట్టుకలు అనివార్యమైనవి, దానిని ఎవరూ అతిక్రమించలేరు. కావున జీవుల చావుల గురించి దుఃఖించుట వ్యర్థమైన పని.

పుట్టిన తర్వాత చనిపోకుండ ఉండడము అనివార్యమైనదని తెలిసినప్పటికి, చనిపోయిన వానిని గురించి కొంతైనా దుఃఖము ఉండును. ఆ దుఃఖము కూడ లేకుండా పోవాలంటే వాడు ఎచట పుట్టాడని తెలిసిన, మనవాడు పలాన చోట ఉన్నాడులే అని బాధలేకుండా పోవును కదా అని కొందరనుకోవచ్చును. అట్లు తెలిసినప్పటికి దుఃఖముండడమే కాక, ఇంకను దుఃఖమధికమగుటకు అవకాశము గలదు. ఎందుకనగా! ఒక ధనికుడు చచ్చి మరియొక చోట దరిద్రుని ఇంట పుట్టాడనుకొనుము. అది తెలిసిన ధనికుని కుటుంబీకులు మనవాడు మరియొక చోట పుట్టాడులే అని దుఃఖపడకుండ ఉండరు. వాడు దరిద్రుని ఇంటిలో పుట్టాడు కదా! ఏమి సుఖము అనుభవిస్తాడని ఇంకను ఎక్కువ బాధపడుదురు. ఎక్కడ పుట్టాడని తెలియక పోవడము వలన చనిపోయిన దినము మరసటి దినము ఏడ్చి ఊరకుండి మర్చిపోతారు. కాని వాడు ఎక్కడ పుట్టినది తెలిస్తే వానిని గూర్చి వీరు చచ్చిపోయేంత వరకు ఏడ్వవలసి వస్తుంది. అందువలన తిరిగి వచ్చు జన్మ విషయము ఎవరికి తెలియకుండ పోవునట్లు, కర్మచట్టమును అమర్చి ప్రకృతిని పరమాత్మ నిర్మించాడు. దీని విషయమై క్రింది శ్లోకమున ఇలా ఉన్నది.

(1) శ్లో॥ 28 : అవ్యక్తా దీని భూతాని వ్యక్త మధ్యాని భారత ।
అవ్యక్త నిధనాన్యేవ తత్ర కా పరిదేవనా ॥

(జీవాత్మ)

**భావము :** జీవ సంభవములెల్ల తెలియబడవు. అట్లే వాని మరణములు కూడ తెలియబడవు. కాని పుట్టుక చావుల మధ్యనగల జీవితము మాత్రము తెలియును. అట్టి జీవునకు నీవు శోకింపతగదు.

**వివరము :–** పుట్టుచున్న జీవాత్మలు ఎక్కడ నుండి వచ్చి పుట్టినవో ఎవరికి తెలియదు. పుట్టిన జీవాత్మ కొంతకాలము శరీరములో ఉండి చనిపోయినపుడు ఎక్కడికి పోవుచున్నది, అది తిరిగి ఎక్కడ శరీరము ధరిస్తున్నది తెలియదు. ఎక్కడి నుండి వస్తున్నది ఎక్కడికి పోవుచున్నది తెలియక పోవడము వలన, చనిపోయిన వ్యక్తి జీవితములో గల సంబంధములన్ని బ్రతికియున్న వారు తెంచుకోవలసి వస్తున్నది. ఉదాహరణకు మొగుడు చనిపోగా బ్రతికి ఉన్న భార్య అతని జీవిత సంబంధములన్ని కోల్పోయినదై, అతని జీవిత సంబంధమునకు గుర్తులైన తాళి, మెట్టెలను కూడ తీసి వేయుచున్నది. అదే తన భర్త చచ్చి ఎక్కడికి పోయినది, ఎక్కడున్నది తెలిస్తే మాత్రము ఏ భార్య తన తాళిని తీసివేయదు. అక్కడ ఇంకొకరిని పెళ్ళిచేసుకోనివ్వదు. పుట్టిన వాడు పలానా చోట నుండి వచ్చి పుట్టాడని తెలిసిన ఇబ్బంది కలదు. ఎందుకనగా ఒక తగ్గు కులస్థుడు ఉన్నత కులమున పుట్టాడనుకొందాము. వాడు పలానా వాడని, ఎక్కడి నుండి వచ్చి పుట్టినది ప్రసవము జరిగిన ఇంట్లో తెలిస్తే వాడు పలానా రౌడీయనో, లేక నీచ కులస్థుడనో, వారు బాధపడుచు వారికి పుట్టినప్పటికి, వారి సంతతిగా చూచుకోకుండా పోవుటకు వీలున్నది.

ఒక వేళ చచ్చినవానికి జ్ఞప్తి ఉండి, నేను పలానా చోట మరణించి ఇక్కడ పుట్టానని తెలియుట వలన, నాకు వీరా తల్లిదండ్రులని ఏవగించుకొను అవకాశములు కూడ కలవు. కర్మ సిద్ధాంతమునకే ముప్పువాటిల్లి ప్రపంచ మానవవ్యవస్థే ముందుకు సాగదు. కావున ప్రతి జీవరాసికి పుట్టుక మరణము యొక్క వెనుక రహస్యము తెలియకుండునట్లు ప్రకృతి చేత తీర్చిదిద్దబడినది. అందువలన ఒక జన్మ జ్ఞప్తి ఆ జన్మతోనే పోవుచుండుట వలన, బయటి వారికి కాని తనకు గాని పుట్టక మునుపు, మరణము వెనుక, తెలియక చావు పుట్టుకల మధ్య గల జీవితము మాత్రమే తెలియుచున్నది. ముందు వెనుక సంబంధము లేక మధ్య మాత్రము తెలియు జీవితముల అనుభూతులను బట్టి, తోటి జీవుల కోసము నీవు దుఃఖించవలదన్నారు.

1) శ్లో॥ 29 : ఆశ్చర్యవత్పశ్యతి కశ్చిదేన మాశ్చర్యవ ద్వదతి తథైవచాన్యః ।
ఆశ్చర్య వచ్చైన మన్య శ్శృణోతి శ్రుత్వా ప్యేనం వేద నచైవ కశ్చిత్ ॥
(జీవాత్మ)

**భావము :-** మధ్య జీవితములో జరుగు పనులను ఒకడు ఆశ్చర్యముగా చూచు చున్నాడు. ఆ పనులను ఇంకొకడు ఆశ్చర్యముతో వినుచున్నాడు. మరియొకడు వింతగా చెప్పుకొనుచున్నాడు. కాని జీవాత్మ నిజస్థితిని గూర్చి ఎవడు తెలియడు.

**వివరము :-** పుట్టుక ముందు, చావు వెనుక గల విషయము తెలియక, మధ్య జీవితము మాత్రము తెలియు మానవులు ఇంకొకరి జీవితమును గురించి ఆశ్చర్యముగా చూచుచున్నారు. ఆశ్చర్యముగా వినుచున్నారు. అట్లే వింతగా చెప్పుకొనుచున్నారు. కాని వింతలు విడ్డూరములు గల జీవితము వెనుక ఉన్న జీవాత్మను ఏమాత్రము గుర్తించలేక పోవుచున్నారు. గుర్తించలేని జీవాత్మను చంపలేరని క్రింది శ్లోకమున చెప్పుచున్నారు చూడండి.

**ముఖ్య గమనిక :** ప్రచురింపబడిన భగవద్గీతలన్నిటిలో చాలామంది పెద్దలు ఇంత వరకు చెప్పిన అన్ని శ్లోకములలోను ఆత్మను గురించి వర్ణించి చెప్పారు. అట్లే పై శ్లోకములోని భావమునకు కూడ ఆత్మను గూర్చి చెప్పారు. దీని వలన భగవద్గీత భావమే తప్పుదారి పట్టిపోయిందని మేమంటున్నాము. జీవాత్మ ఆత్మల వివరము తెలియనపుడు తెల్లగయున్నవని అన్నము సున్నము రెండూ ఒకటే కదా! అన్నట్లు ఉంటుంది. వరి బియ్యము ఉడికి అన్నము, సున్నపు రాళ్ళు ఉడికి సున్నముగా మారి తెల్లగున్నప్పటికి వాటి రుచియందు ఎంతో తేడా ఉందునట్లు, ఆత్మ జీవాత్మలు రెండు శరీరములందే నివసించినప్పటికి వాటివాటి విలువలు వేరై ఉన్నవి. దేహియంటే దేహమందు నివసించునదని అర్థము. ఆత్మ జీవాత్మ రెండు దేహమునందు నివసించునవే, కావున దేహి అను పదము రెండిటికి వర్తించును. అందువలన ఆత్మ అనుభవమును, జీవాత్మ ఉనికిని తెలిసినవారైతే గాని వాటిని సందర్భానుసారము గుర్తించగలరు. వాచా వేదాంతము తెలిసి వేగముగా మాట్లాడినంత మాత్రమున

అనుభవము రాదు. కనుక అనుభవములో జీవాత్మ ఆత్మలు వేరని గ్రహించాలి. జీవాత్మకు చెప్పిన శ్లోకమును ఆత్మకు చెప్పినట్లు వివరము చెప్పుచు, ఒకడు ఆత్మను ఆశ్చర్యముగా చూచుచున్నాడని చాలామంది వ్రాశారు. అట్లే వినుచున్నాడని, చెప్పుచున్నాడని కూడ వ్రాశారు. వారి మాట ప్రకారము పోయిన ఆత్మ విషయములను నోటితో చెప్పుకోవచ్చును, చెవులతో వినవచ్చును కాని కంటితో చూచుటకు సాధ్యము కాదు. ఆత్మ దృశ్యరూపము కాదు దానినెలా ఆశ్చర్యముగా చూడవచ్చునని తెలిపారు? మేము తెల్పు గీత సత్యమైనదిగ ఉండవలయునను భావముతో, ప్రక్క భావములకు పోయి అనర్థమై పోయిన వాటిని, సరియగు భావమున వ్రాయుటకు కొన్ని చోట్ల వాటిని విమర్శించి తెలుపవలసి వచ్చినది. కాని ఎవరిని వ్యక్తిగత విమర్శ చేయలేదని మనవి చేయుచున్నాము. సత్యమునకు అందరు విలువ ఇస్తారని తలచుచున్నాము.

(1) శ్లో॥ 30 : దేహీ నిత్య మవధ్యోఽయం దేహే సర్వస్య భారత!
తస్మా త్సర్వాణి భూతాని న త్వం శోచితు మర్హసి ॥
(జీవాత్మ)

**భావము :-** సర్వదేహములలోను నివశించు జీవాత్మలు ఎప్పటికీ చంపబడునవి కావు. కావున అన్ని జీవరాసుల గురించి నీవు బాధపడవలసిన పనిలేదు.

**వివరము :-** జీవాత్మకాని, ఆత్మకాని దేహములందే నివసించుట వలన **"దేహి"** అను పేరు రెండిటికి వచ్చినది. **"దేహే సర్వస్య"** అనుట వలన అన్ని దేహములందు **"దేహీ నిత్యమవధ్యోయం"** చంపబడని జీవాత్మగ ఉన్నందున అని తెలుసుకోవలెను **'అవధ్యోయః'** అనుటలో మరణించదు అన్నప్పుడు అది జీవాత్మ అని తెలియనగును. భూతాని అనగ జీవరాసుల కోసము నీవు బాధపడవలదని శ్రీకృష్ణుడు తెలిపాడు.

ఇప్పటి వరకు ఈ అధ్యాయములో 12వ శ్లోకము మొదలుకొని 30వ శ్లోకము వరకు అనగ మొత్తము 19 శ్లోకములు జీవాత్మను, ఆత్మను, పరమాత్మలను

గురించియే చెప్పబడినవి. ఈ 19 శ్లోకములలో జీవాత్మను, ఆత్మను, పరమాత్మను ముగ్గురిని కలిపి చెప్పడములో **'దేహీ'** అను ఒక పదమును మాత్రమే ఉపయోగించారు. అన్నిటిని దేహీ అనడము వలన, ముగ్గురు పురుషుల వివరము పురుషోత్తమప్రాప్తి యోగమను అధ్యాయము వరకు విడదీసి చెప్పనందున, ఏ శ్లోకము ఏ ఆత్మకు చెప్పబడినదను వివరము లేకుండా భగవద్గీత వ్రాయబడుటవలన, చదివెడి వారికి ఆత్మల యొక్క వివరణా జ్ఞానము తెలియకుండా పోయినది. అందరివలె మేము వ్రాయక ఈ ఆత్మల వివరము తెలియజేయుటకు ఒక కారణము కలదు. అదేమనగా! ఒక దినమున ఒక జిజ్ఞాసి ఒక గురువు దగ్గర ప్రశ్న వేయుట జరిగినది. ఆ ప్రశ్న ఏమనగా? భగవద్గీతలో సాంఖ్యయోగమున 20వ శ్లోకములో ఒకచోట ' ***నజాయతే*** ' పుట్టుకయే లేదని, ఒకచోట 27వ శ్లోకములో '***ధ్రువం జన్మ మృతస్యచ***' పుట్టవలసిందేనని చెప్పుటలో అర్థమేమి? రెండు మాటలు ఒకే ఆత్మకు వర్తించునా? అని అడిగాడు. ఈ ప్రశ్నకు ఆ గురువుగారు భగవద్గీతలో ఏమి వ్రాసుందో అదే చదువుకొమ్మని చెప్పాడు. అది చదివి అర్థముకాక అడుగుచున్నానని భక్తుడు అనడము, దానికి గురువుగారు సమాధానము చెప్పలేక పోవడము జరిగింది. అదంతయు ప్రక్కనుండి గమనించిన మేము సమాధానములేని భగవద్గీత ఉండకూడదనుకున్నాము. ఆ సంఘటనే ఈనాటి మా రచనలో సరియైన సమాధాన మిచ్చునట్లు చేసినది. ఇంతవరకు ఎన్ని భగవద్గీతలు పరిశీలించి చూచిన దేనిలోను మూడు ఆత్మల వివరము లేకుండా పోవడము మన దురదృష్టకరము. సంస్కృత పండితులు, మేధావులు, స్వాములు, గురువులు ఎందరిచేతనో వ్రాయబడిన భగవద్గీతలలో ప్రశ్నలు పుట్టడము జవాబులు దొరకకుండా పోవడము మన దురదృష్టకరమే. ఇప్పటికైన ఆ జిజ్ఞాసి అడుగు ప్రశ్నకు జవాబు దొరకడము మన అదృష్టమని తలచుకొందాము. 30 విధములుగ మూడు ఆత్మల వివరమును వరుసగ మూడు భాగములలో వ్రాసిన దానిని తర్వాత పేజీలో పరిశీలించి చదివి జీవాత్మ, ఆత్మ, పరమాత్మల వివరమును బాగుగ అర్థము చేసుకోగలరని ఆశిస్తున్నాము.

| జీవాత్మ | ఆత్మ | పరమాత్మ |
|---|---|---|
| 1. నాశనముకలది. | నాశనములేనిది. | నాశనములేనిది. |
| 2. మరణము కలది. | మరణము కలది. | మరణములేనిది. |
| 3. అగ్నికి కాలదు<br>కత్తికి తెగదు<br>నీటికి తడువదు. | అగ్నికి కాలును<br>కత్తికి తెగును<br>నీటికి తడుచును. | అగ్నికి కాలదు<br>కత్తికి తెగదు<br>నీటికి తడువదు. |
| 4. జ్ఞానదృష్ఠికి తెలియును | జ్ఞానదృష్ఠికి తెలియును | జ్ఞానదృష్ఠికి కూడ తెలియదు. |
| 5. ఒక్క శరీరము లోపల<br>ఒక్కచోట ఉండును. | శరీరములలోపల<br>అంతట ఉండును. | అన్ని శరీరముల లోపల<br>బయట కూడ ఉండును. |
| 6. శరీరము బయటలేదు. | శరీరము బయటలేదు. | శరీరము బయట కూడ<br>ఉన్నది. |
| 7. ఆకారమున్నది. | ఆకారమున్నది. | ఆకారము లేదు. |
| 8. పేరు ఉన్నది. | పేరు ఉన్నది. | పేరు లేనిది. |
| 9. జీవుల సంఖ్య<br>అనేకము. | జీవుల సంఖ్యను<br>బట్టి ఆత్మలుండును. | ఇది ఏకమైనది. |
| 10. కర్మననుభవించునది. | కర్మననుభవించదు. | కర్మననుభవించదు. |
| 11. శక్తిలేనివాడు. | శక్తికలవాడు. | శక్తియే తానైనవాడు. |
| 12. ముద్దాయి | సాక్షి | జీవాత్మ ఆత్మకు విభిన్నముగా<br>ఉంటూ సాక్షికానివాడు. |
| 13. గుణవికారములున్నవి. | గుణవికారములు లేవు. | గుణవికారములు లేవు. |
| 14. విభూతి రేఖలలో<br>క్రిందిది. | విభూతి రేఖలలో<br>మధ్యది. | విభూతి రేఖలలో<br>పైది. |
| 15. ఆరాధించువాడు. | ఆరాధింపబడువాడు. | ఆరాధనలకందువాడు కాదు. |
| 16. సృష్ఠింపబడినవాడు. | సృష్ఠింపబడినవాడు. | సృష్ఠించినవాడు. |

| | | |
|---|---|---|
| 17. జీవుడు. | ఆత్మ. | దేవుడు. |
| 18. ప్రళయము తర్వాత లేనివాడు. | ప్రళయము తర్వాత లేనివాడు. | ప్రళయము తర్వాత కూడ ఉన్నవాడు. |
| 19.ప్రకృతి మాత అగును. | ప్రకృతి తోబుట్టువగును. | ప్రకృతి భార్య అగును. |
| 20. ఆత్మలో కలియువాడు. | జీవాత్మను పరమాత్మలో కలుపు మధ్యవర్తి. | జీవాత్మను కలుపుకొనువాడు |
| 21. శూణ్యములో లేనిది. | శూణ్యములో లేనిది. | శూణ్యములో ఉన్నది. |
| 22. జగత్తులో ఒకచోట శరీరములోఉన్నవాడు. | జగత్తులో శరీరములలో శరీరమంతట ఉన్నవాడు. | విశ్వమంతయు ఉన్నవాడు. |
| 23. బ్రతికి ఉన్నపుడు జీవాత్మ ఆత్మను తెలుసుకోవచ్చును. | బ్రతికి ఉన్నపుడు ఆత్మ జీవాత్మను కలుపుకోవచ్చును. | బ్రతికి ఉన్న ఎవరు తెలుసుకోలేనది. |
| 24. జీవున్ని పూజచే ఆరాధించవచ్చు. | ఆత్మను యోగముచే ఆరాధించవచ్చు. | ఏ విధ పూజ, ఏ యోగముచే ఆరాధించలేము. |
| 25. కర్మ ఆధీనములోని వాడు. | కర్మననుసరించువాడు. | కర్మ సంబంధము లేనివాడు. |
| 26. కర్మ కట్టెలను మోయువాడు. | కర్మ కట్టెలను కాల్చువాడు. | అగ్నియై ఉన్నవాడు. |
| 27. క్షరుడు | అక్షరుడు | పురుషోత్తముడు. |
| 28. గ్రుడ్డివాడు | చూపుగలవాడు | చూపు రూపు లేనివాడు. |
| 29. వ్యక్తుడు | వ్యక్తుడు | అవ్యక్తుడు. |
| 30. కర్మబద్దుడు | జీవబద్దుడు | అబద్దుడు. |

జీవితములో జీవుడైనవాడు జ్ఞానము ప్రకారము ఆరాధించవలసినది ఆత్మనే. ఈ విషయము తెలియజేయు నిమిత్తము ఈశ్వర లింగము మీద విభూతి రేఖలలోగాని, నుదుటి భాగములో ధరించు విభూతిరేఖలలో కాని, మధ్యనగల రేఖ మీద బొట్టు పెట్టి గుర్తించారు. యోగము చేయుట వలన తెలియబడునది శరీరములో రెండవ ఆత్మ. ఎంతకాలము యోగము చేత ఆత్మను చేరితే, అంతకాలము జ్ఞానాగ్ని లభించి కర్మకాలిపోవును. బ్రహ్మయోగ విధానములో జీవునికి ఆత్మయే దైవము. జీవునికి మూడవ ఆత్మయిన పరమాత్మతో ఏమాత్రము సంబంధముండదు. ఆధ్యాత్మికము ప్రకారము దేవాలయ పద్ధతులుకాని, సందేశములు కాని, ఆరాధన వివరములుకాని, యోగపద్ధతులుకాని అన్ని ఆత్మను సూచించునవేనని తెలియాలి. భక్తులు ధరించునామము గాని, బొట్టుగాని, అట్లే చేయు పూజా విధాన అర్థములు గాని, అన్నియు రెండవదైన ఆత్మను తెలుసుకొనునట్లు నిర్మించబడి ఉన్నవేనని తెలియాలి. ఎన్నో ఆరాధనలు, ఆచరణలు, అర్థములన్ని మన దేహములో ఉన్న ఆత్మకోసమే. పెద్దలు తత్త్వరూపములో పాటలుగా, పద్యములుగా చెప్పిన జ్ఞానము కూడ ఆత్మను గురించి చెప్పినదేనని తెలియాలి. పరమాత్మ యొక్క వివరము ఏమాత్రము ఎవరికి తెలియదు. ఏ శాస్త్రములు తెలుపలేవు. పరమాత్మ బ్రతికిన ఎవరికి తెలియదు. కావున మనము ఎంత చెప్పుకొనిన రెండవదైన ఆత్మకేనని తెలియాలి.

ఇంతవరకు జీవాత్మ, ఆత్మల చావు పుట్టుకల సమస్య తెల్పిన భగవంతుడు ఇంతటితో ఆ విషయమును వదలి కర్మ విషయములను తెల్పుటకు పూనుకొని **'సుఖదుఃఖే సమేకృత్వా'** అను శ్లోకము మొదలు పెట్టాడు. అయితే భగవద్గీతలో ఆ శ్లోకము వెంటనే కనిపించక ఏడు శ్లోకముల వెనుక కన్పిస్తూ ఉన్నది. మధ్యలో 7 శ్లోకములు వచ్చిపడినాయి. అవకాశము కోసము ఎదురు చూస్తున్న కొందరు పెద్దలు, మాది కూడ కొంత ఉండవలయునని వారి స్వబుద్ధిని ఉపయోగించి, సంస్కృత పాండిత్యము కలవారు కనుక శ్లోకములల్లి మధ్యలో ఇరికించారు. ఏనాడో అవి కలసిపోవుట వలన వాటిని ఎవరూ గుర్తించలేకపోయారు. మేము ఇంతకు ముందు తెల్పిన నాల్గు సూత్రముల ప్రకారము చూచితే, ఈ ఏడు శ్లోకములు

శాస్త్రబద్దము కాదని తెలియుచున్నది. కావున ఇవి కల్పితములని తేలిపోయినవి. శాస్త్రబద్దము కానివని ఎట్లు నిర్ణయించారని కొందరడుగవచ్చును. దానికి మా సమాధానమేమనగా! శాస్త్రము ఎప్పటికీ ఖండించబడదు. ఈ శ్లోకములలో యుద్ధము చేయుట స్వధర్మమని తెలుపబడినది. కర్మయోగము 35వ శ్లోకమున చూచిన స్వధర్మమనునది స్వంతమైన ఆత్మధర్మమని, పరధర్మమనునది ఆత్మకంటే వేరైన ప్రకృతి ధర్మమని తెలియుచున్నది. యుద్ధము చేయుట ప్రకృతి విషయము ఆత్మవిషయము కాదు. కనుక యుద్ధము స్వధర్మము కాదు, ఆత్మాచరణ స్వధర్మమగును. కులములు జాతులను బట్టి స్వధర్మములను నిర్ణయించిన అసలు ఆత్మజ్ఞానమునకే ముప్పువాటిల్లును. వాటి విషయము రాబోవు అధ్యాయ శ్లోకములందు ప్రస్తావించెదను. అసలు **గీతలో బ్రాహ్మణ, వైశ్య, క్షత్రియ, శూద్ర అను నాల్గువర్ణముల ప్రస్తకే లేదు.** కావున క్షత్రియులని పేరు పెట్టి చెప్పిన శ్లోకములు కల్పితములని వాటియందు ఆత్మ జ్ఞానపరమైన విషయములు ఎంత మాత్రములేవని గ్రహించాలి. పుణ్యమును అనుసరించి స్వర్గమనునది ఉండును. కాని యుద్ధమును అనుసరించి స్వర్గముండును అనుట శాస్త్రబద్దము కాదు. అది కర్మసిద్ధాంతమునకే వ్యతిరిక్తము. కావున ఈ ఏడు శ్లోకములు కల్పితములని, చెప్పుటయే కాక, ఇటువంటి కల్పిత శ్లోకములు గీతయందు అక్కడక్కడ గలవని, వాటియందలి దోషము తెల్పి, అశాస్త్రీయమైన వాటిని తొలగించి, స్వచ్ఛమైన దైవవాక్కును మాత్రమే మీకందించగలము.

వరుసగా క్రింద ఇచ్చు ఏడు శ్లోకములు కల్పితములని తెలియునట్లు వాటి ప్రక్కన (×) మార్కు గుర్తించి ఉంచాము. వాటి వివరము కూడ వ్రాయలేదు.

**1)శ్లో॥ 31: స్వధర్మమాపి చాపేక్ష్యనవికంపితు మర్హసి ।**
**ధర్మాద్ధి యుద్దాచ్ఛ్రే యో ఽన్యత్ క్షత్రియస్య న విధ్యతే॥ (×)**

**1) శ్లో॥ 32 : యదృచ్ఛయా చోపపన్నం స్వర్గ ద్వారా మపావృతమ్,**
**సుఖినఃక్షత్రియాః పార్థ! లభతే యుద్ద మీ దృశమ్.॥ (×)**

1) శ్లో॥ 33 : అథ చేత్త్వం దర్మ్యమిమం సంగ్రామం న కరిష్యసి, ।
తతస్స్వధర్మం కీర్తించ హిత్వా పాపమవాప్స్యసి. ॥ (✕)

1) శ్లో॥ 34 : అకీర్తిం చాపి భూతాని కథ ఇష్యంతి తేవ్యయాం, ।
సమ్భావితస్య చాకీర్తి ర్మరణాదతిరిచ్యతే. ॥ (✕)

1) శ్లో॥ 35 : భయాద్రణాదుపరతం మన్యంతేత్వాం మహారథాః ।
యేషాం చత్వం బహుమతో భూత్వా యాస్యసిలాఘవమ్.॥(✕)

1) శ్లో॥ 36 : అవాచ్చ వాదాంశ్చబహూన్వదిష్యంతి తవాహితాః ।
నిన్దన్త స్తవ సామర్థ్యం తతో దుఃఖ తరం న్నుకిమ్ ॥ (✕)

1) శ్లో॥ 37 : హతో వా ప్రాప్స్యసే స్వర్గం జిత్వావా భోక్ష్యసే మహీం।
తస్మాదు త్తిష్టకౌంతేయ! యుద్ధాయం కృతినిశ్చయః ॥ (✕)

(1) శ్లో॥ 38 : సుఖదుఃఖే సమేకృత్వా లాభాలాభౌ జయాజయౌ।
తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాప మవాప్స్యసి ॥
(కర్మయోగము)

**భావము :** కష్టసుఖములు, లాభనష్టములు, జయాపజయములను సమముగ తలచి యుద్ధము చేయుము. అట్లు చేయుట వలన పాపకర్మములు పొందవు.

**వివరము :-** మొదట అర్జునుడు యుద్ధము చేయక పోవడానికి ముఖ్యముగ రెండు కారణములు కనిపిస్తున్నవి. మొదటి కారణము తనవారిని చంపడమను మోహ గుణము. రెండవది చంపితే పాపమొస్తుందను పాపభీతి. మొదటిదైన మోహగుణము తనవారను భావము కల్గించి, వీరంతా చనిపోతే వీరిని లేకుండా చేసినవాడనగుదును కదా! అలాకాక వారందరుండవలెనని, వారిని తనేమి చేయకూడదను భావము కల్గించినది. అంతేకాక చంపితే విపరీతమైన పాపము వస్తుందను భావము కూడ పుట్టించినది. అర్జునుని నుండి ముఖ్యముగ వెలువడిన చావు సమస్యకు శ్రీకృష్ణుడు

వివరించి చావంటే ఏమిటి! చచ్చునదెవరు? మరణించు వారేమౌతారు? అను మొదలగు విషయములను ఇంతవరకు తెలియజేశాడు. ఇపుడు ఈ శ్లోకముతో పాపపుణ్య విషయములను తెలుపుటకు మొదలుపెట్టాడు. భగవద్గీతలో చావు పుట్టుకల విషయము కొద్దిగా ఉండగా, పాపపుణ్య వివరమే ఎక్కువగ తెలియబరచ బడినది. యుద్ధములో తన బంధువులనైన వారిని చంపి హింసించుట ద్వార పాపమొచ్చునను అర్జునుని మాటకు మొదటి జవాబుగ ఈ శ్లోక వివరమిలా ఉన్నది చదవండి.

హింసతో కూడుకొన్న యుద్ధకార్యములో కనిపించని పాపమేకాక సుఖము దుఃఖములు కూడ ఉండును. గొప్ప శత్రువును సులభముగ చంపినపుడు సంతోషము కల్గును. లేక ఎదుటి శత్రువు చేత దెబ్బ తిన్నపుడు దుఃఖము కూడ కల్గును. అంతేకాక లాభము లేక నష్టము ఉండును. చివరిగ ఎదుటివారు నెగ్గి మనమోడడమో లేక మనము గెలిచి ఎదుటివారు ఓడిపోవడమను జయాపజయములు అను మూడు ఒకే యుద్ధకార్యము నుండి ఏర్పడుచున్నవి. యుద్ధము చేయువాడు తన మనస్సును చేయుచున్న కార్యమైన యుద్ధము మీద మాత్రము పెట్టి ఆ కార్యమునెలా నిర్వర్తించాలో అలానే చేయాలి. యుద్ధము చేయుటలో ఎన్ని మెలుకువలు ఎన్ని విధానములు ఉన్నాయో, ఆ యుద్ధము ఏ నైపుణ్యతతో చేయాలో, వాటిని మాత్రమే తన మనస్సులో పెట్టుకొని యుద్ధము చేయుట వలన, దాని వెనుక వచ్చు పాపము ఏమాత్రము వానికంటదు. ఒక వేళ యుద్ధము చేయుచు, యుద్ధము నేను చేయుచున్నానని, ఆ యుద్ధములో కష్టసుఖములు కలుగునని, ఆ యుద్ధములో లాభనష్టములుండునని, అట్లే జయాపజయములు ఉండునను యోచనయుండి, అందులో సుఖమును లాభమును జయమును కావలెనను కాంక్ష గాఢముగ పెట్టుకొనిగాని, లేక నష్టము కష్టము అపజయము కావలెనను కాంక్ష పెట్టుకొనిగాని, యుద్ధము చేయుట వలన తప్పక కర్మయనెడి పాప పుణ్యములు వచ్చును.

ఒకే కార్యమైన యుద్ధమును చేయడములోనే పాపము రావడము లేక రాకుండా పోవడమను రెండు పద్ధతులు కలవు. ఒకే కార్యము చేయడములో

పాపమంటడము లేక అంటకుండ పోవడమను రెండు విధానములుండుట ఆశ్చర్యకర విషయమైనప్పటికి అది పూర్తి శాస్త్రబద్ధమైన సత్యము. ఎవరైన కర్మ సిద్ధాంతమును తెల్పు ఈ మొదటి శ్లోకము యొక్క అర్థము అవగాహన చేసుకోవడముతోనే, ఇటు జ్ఞానములోనికో లేక అటు అజ్ఞానములోనికో అడుగు వేయడము జరుగుతుంది. భగవద్గీత యొక్క మూల ఉద్దేశ్యము ఈ శ్లోకముతోనే మొదలవుచున్నది. కావున ఆ ఉద్దేశ్యము అర్థము కాకపోతే అజ్ఞానములోనికి, అర్థమైతే జ్ఞానములోనికి మార్గము ఏర్పడుతుంది. భగవంతుని భావము అర్థము కాక అజ్ఞాన మార్గములోనికి అడుగువేయు అవకాశము ఎక్కువ ఈ శ్లోకములో ఉండుటవలన, జాగ్రత్తగ అర్థము చేసుకొని దీనిని గూర్చిన పూర్తి వివరము మిగతా గీతయందు శోధించవలసి ఉండును. అంతేకాక హింసతో కూడుకొన్న యుద్ధము చేయుట వలన పాపమురాదు అన్న మాటతో ఆశ్చర్యపడక, పాపము రాకుండా పోవడానికున్న కారణము లేమిటి? అని పూర్తి వివరము తెలుసుకొనుటకు ప్రయత్నించవలయును. అట్లు వెదకక ఇట్లయితే పాపము వచ్చును. అటులైతే పాపము రాదు అనడమేమిటి అని ప్రశ్నించుకొని కూర్చున్న వారికి, గీతను బోధించు శ్రీకృష్ణుని జీవితము కూడ పాపపు పనులతో కూడుకొన్నదిగానే కనిపించును. అట్లు కాకుండ గీత సందేశము జ్ఞానమార్గము కావాలంటే గీతను పూర్తిగా పరిశీలించి చూడవలెను. అర్థముకాని ఒక మాటతోనే తమ పూర్తి నిర్ణయమును తీసుకోకూడదని కోరుచున్నాము.

ఇంతవరకు చావు పుట్టుకల విషయము తెలుపుచు జీవాత్మ ఆత్మల వివరము తెల్పిన భగవంతుడు, ఈ శ్లోకముతో పాపపుణ్య విషయములు వివరిస్తూ కర్మయోగమును తెలుపడము మొదలు పెట్టాడు. ఇచటినుండి రాబోవు శ్లోకములలో రెండు యోగముల యొక్క వివరము వివరించబడుతుంది. రెండు యోగములలో ఒకటి కర్మయోగము (**రాజయోగము**), రెండు బ్రహ్మయోగము (**జ్ఞానయోగము**). పాపపుణ్య బంధనములకు సంబంధించిన విషయములన్నియు ఈ రెండు యోగములందే ఇమిడి ఉండును. కావున వాటి వివరము తెల్పు శ్లోకముల ప్రక్కన

ఆయా యోగముల పేర్లు బ్రాకెట్‌లో గుర్తింపబడి ఉండుట గమనించాలి. ఇచటినుండి కర్మయోగ వివరము ప్రారంభమగుచున్నదని తెలియబరుస్తూ, ఈ క్రింది శ్లోకము చెప్పబడినదని గ్రహించాలి.

(1)శ్లో॥ 39 : ఏషా తేఽభి హితా సాంఖ్యే బుద్ధిర్యోగే త్విమాం శృణు ।
బుద్ధ్యా యుక్తో యయాపార్థ! కర్మబంధం ప్రహాస్యసి ॥
(కర్మయోగము)

**భావము :** ఇంతవరకు శరీరములందు ఆత్మల వివరముగల జ్ఞానము తెలియ జేసాను. ఇకనుండి కర్మబంధములు కలగని జ్ఞానము తెలియజేతును వినుము.

**వివరము :** ఈ శ్లోకముకంటే ముందు కర్మయోగమునకు సంబంధించిన శ్లోకము చెప్పి, అది గుర్తించారో లేదోనని తలచి, ఇపుడు చెప్పునది కర్మను నాశనము చేయు కర్మయోగమని హెచ్చరిక చేయుచు ఈ శ్లోకము చెప్పాడు. ఈ మాటతో ప్రతి ఒక్కరు ఇంతకు ముందు విన్నది శరీర ఆత్మల సంబంధ సాంఖ్య వివరమని సులభముగ తెలుసుకోగలరు. ఆత్మలు వేరని, యోగములు వేరని తెలుసుకోమన్నట్లు ఈ శ్లోకము యొక్క ముఖ్య ఉద్దేశ్యము. మొదలు పెట్టినది కర్మయోగ వివరము కనుక, ఆ కర్మయోగమును గురించి భగవంతుడు ఈ విధముగ అంటున్నాడు.

(1)శ్లో॥ 40: నేహాభిక్రమ నాశోఽస్తి ప్రత్యవాయో న విద్యతే ।
స్వల్ప మప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్ ॥
(కర్మయోగము)

**భావము :-** కర్మయోగమును ఆరంభించి మానుకొనుట వలన ఏ దోషము లేదు. కొద్దిగ ఆచరించినప్పటికి గొప్ప కర్మభయమునుండి కాపాడగలదు.

**వివరము :-** కర్మయోగమును ఆరంభించిన తరువాత మానుకొనుట వలన ఏదైన దోషము కల్గుననుట ఏమాత్రము లేదు. పాపపుణ్య బంధముల నుండి తప్పించు కొనుటకు కర్మయోగమే సాధనము. కర్మయోగము కొంతకాలము ఆచరించినప్పటికి

ఆ కాలములో కల్గు భయంకర కర్మబంధములనుండి కాపాడును. ఆచరించిన కర్మయోగము కొద్దిదైనప్పటికి ఆ సమయములో పెద్దకర్మలను పోగొట్టును. ఇక యోగ విషయము అర్థము కానివారు, యోగమంటే ఏమిటో తెలియని వారెట్లుందురు అనగా!

*(1) శ్లో ॥ 41 : వ్యవసాయాత్మికా బుద్ధి రేకేహ కురునన్దన!*
*బహుశాఖా హ్యనన్తాశ్చ బుద్ధయోఽవ్యవసాయినామ్ ॥*
*(ప్రకృతి)*

**భావము :-** యోగమునందు బుద్ధిగలవారు ఒకటే నిశ్చయముతో ఉందురు. వేరభిప్రాయములు కల్గువారికి బుద్ధి శాఖోపశాఖలైవుండును.

**వివరము :-** జ్ఞానమంటే ఏమిటని, యోగమంటే ఏమిటని, ఆత్మ జీవాత్మలంటే ఏమిటని తెలిసి పరమాత్మ సన్నిధి (మోక్షము) పొందాలనుకొన్న వారికి వారి నిశ్చయమును చెడకొట్టుటకు ఎన్ని ఆటంకములు ఏర్పడినప్పటికి, వారు ఆ మార్గమును వదలరు. దైవము యొక్క విలువ తెలిసి పరమాత్మను చేరాలను కొన్నవారు తమకు ప్రియాతి ప్రియమైన వారిని కూడ వదలుకొనుటకు ఇష్టపడుదురు, కాని తమ మార్గమును వదులుకొనుటకు ఇష్టపడరు. ప్రపంచ విషయములలో మునిగిన వారికి జ్ఞానమార్గము ఆశ్రయించిన వారి పట్టుదల అర్థముకాకపోగ, తమను మతిహీనులుగ లెక్కించినను వారు బాధపడక ఇతరులలో ఎంత అజ్ఞానము ఉన్నది కనిపిస్తుండగ, వారు ఆ అజ్ఞానములో పడకుండ జాగ్రత్తపడుచు, జ్ఞాన మార్గములో ఒకే పట్టుదల కలిగి ఉందురు. ఇక జ్ఞానమంటే ఏమిటో దాని వాసన కూడ తెలియనివారు వారి మనో నిశ్చయము నిజదైవము మీద లేకపోగా, ప్రపంచ సంబంధమగు అనేక విషయములలో అనేక విధములుగ లగ్నమై ఉందురు. ఇంకను కొందరెట్లుందురనగా!

(1) శ్లో ॥ 42 : యామిమాం పుష్పితాం వాచం ప్రవద న్త్యవిపశ్చితః।
వేద వాదరతాః పార్థ ! నాన్య దస్తీతి వాదినః ॥
(ప్రకృతి)

**భావము :-** వేదములలోని విషయములను పుష్పములలోని తేనెవలె తియ్యని మాటల రూపములలో చెప్పుకొందురు. అజ్ఞానులైనను జ్ఞానులవలె ఉండి ప్రజలకు లాభము వచ్చు పనులను, సుఖముకల్గు పనులను బోధించుచుందురు.

**వివరము :-** నేడు కొందరు గురువులమనిపించుకొన్నవారు, స్వాములనిపించు కొన్నవారు, తమ తమ ఉపన్యాసములలో ఎంతో మాటల పొందిక కల్గి, వినే వారికి కమ్మగ కనిపించునట్లు వేదములందు విషయములనే ఆసక్తిగ చెప్పుచుందురు. ఆత్మ పరమాత్మల విషయము వదలి మానవుల కోర్కెలు నెరవేరునట్లు, సుఖములు కల్గునట్లు, కష్టములు పోవునట్లు, అనేక విధములుగ బోధించి అవియే నిజజ్ఞాన మార్గమని కూడ చెప్పుచుందురు. అవి ఎట్లుండుననగ క్రింది శ్లోకములో చూడుము.

(1) శ్లో ॥ 43 : కామాత్మాన స్స్వర్గ పరా జన్మకర్మ ఫల ప్రదామ్ ।
క్రియావిశేష బహుళాం భోగైశ్వర్యగతిం ప్రతి ॥
(ప్రకృతి)

**భావము :** సుఖములు చేకూర్చు వారిమాటలు జన్మ కర్మ ఫలములొసగు అనేక క్రియలను ప్రేరేపించునవై ఉండును. అట్టి పనులు చేయుట వలన ఇహలోక సుఖములు భోగములు వచ్చుచుండును.

**వివరము :-** కొందరు వేద విషయములనే బోధచేయుచు, ఆ బోధలలో వ్రత క్రతువుల యజ్ఞ యాగముల విషయములను తెల్పుచు, పలానా వేదములో తెల్పినట్లు యజ్ఞము చేయుట వలన పలానా ఫలితము కల్గునని, పలాన వ్రతము చేయుట వలన వచ్చిన కష్టములు పోయి సుఖములు కల్గునని బోధించి, మనుజులను ఆ పనులు చేయుటకు పూనుకొనునట్లు చేయుదురు. అట్లు చేయుట వలన ఇహలోక సౌఖ్యములు కల్గును. మరియు ఆ పనులు చేయుట వలన మనకు తెలియకనే

కర్మకూడ వచ్చి జన్మలకు కారణమగును. అట్టి పనుల వలన కర్మలు కల్గునేకాని దైవసన్నిధియైన మోక్షప్రాప్తి కలుగదు. ఏది మంచిదని తెలియక సహజముగ ప్రపంచ సుఖములనే కాంక్షించు ప్రజలకు, ఆ సుఖముల గూర్చియే చెప్పి అందుకు అవసరమైన పనులనే చేయునట్లు బోధించువారికి కూడ కర్మగల్గి జన్మలు కల్గునని, పై శ్లోకము యొక్క వివరముకాగా, అట్టి బోధలువిన్న ప్రజలగురించి భగవంతుడు ఈ విధముగా క్రింది శ్లోకమున చెప్పుచున్నాడు.

*(1)శ్లో ॥ 44 ః భోగైశ్వర్య ప్రసక్తానాం తయాஉపహృత చేతసామ్ ।*
*వ్యవసాయాత్మికా బుద్ధి స్సమాధౌ న విధీయతే ॥*
*(ప్రకృతి)*

**భావము :–** కోర్కెల చేత ఆకర్షింపబడిన మనస్సు గలవారు అటువంటి సుఖములనే ఆశ్రయించుదురు. వారి మనస్సుకు ఆత్మ విజ్ఞానదాయకమైనట్టి జ్ఞానము ఎప్పటికి పట్టుబడదు.

**వివరము :–** మానవులకు కోర్కెలుండడము, కష్టములు లేకుండా పోయి సుఖములు కల్గవలెనను ఆశ ఉండడము సహజము. సహజముగ అటువంటి మనస్సు గలవారికి వారి పనులు నెరవేరునట్లు, పలానా శ్లోకము ఇన్నిమార్లు చదివితే ఈ కోర్కె నెరవేరునని, ఈ మంత్రము వలన ఈ కోర్కె, పలాన వ్రతము వలన పలానా కష్టము పోవునను స్వాముల మాటలు బాగా కనిపించగ, అట్టి వారినే ఎక్కువ మంది ఆశ్రయించి అటువంటి పనులనే చేయపూనుదురు. ఆ పనులు చేయుట వలన అనేక జీవిత సుఖములందే వారి మనస్సు చిక్కుకొని, ఒకదాని కొకటి సంబంధములేని భిన్నమైన పనులు చేయుచు, ప్రకృతి సుఖములకు అతీతమైన మరియు జప, తప, వ్రత, క్రతువులకు తెలియని ఆత్మ పరమాత్మల గూర్చి తెలుసుకోలేరు. ఆత్మజ్ఞాన విషయములు ఏమాత్రము వారికి పట్టుబడవు, అర్థము కావు.

1) శ్లో ॥ 45: త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున!।
నిర్ద్వంద్వో నిత్య సత్త్వస్థో నిర్యోగ క్షేమ ఆత్మవాన్ ॥
(బ్రహ్మయోగము, కర్మయోగము)

**భావము :** మూడు గుణముల విషయములే వేదములు. వేద భూయిష్టమైన ఆ మూడు గుణములను పూర్తిగ వదలివేయుము. సుఖదుఃఖములు, లాభనష్టములు మొదలగు ద్వంద్వములను వదలి వేసినట్లే యోగక్షేమము అనుదానిని కూడ వదలి నిత్యమైన దైవమును చేరుము.

**వివరము :-** ముందు శ్లోకములో చెప్పినట్లు భోగైశ్వర్యములను ఆశ్రయించక దైవమును తెలుసుకొమ్మని హితము చెప్పుచు భగవంతుడిట్లన్నాడు. ప్రతి మనిషికి తలలో ఎన్నో గుణములు మెదలుచుండును. ఆ గుణ సంకల్పముల వలననే మానవులందరు అనేక కార్యములు చేయుచున్నారు. అనేక కార్యములకు కారణమైన తలలోని గుణములను వివరించి చూచితే మూడు రకములుగ ఉన్నవి. **1) తామసము 2) రాజసము 3) సాత్త్వికము.** ఈ మూడు గుణములనే భగవంతుడు మాయ అని విజ్ఞానయోగములో చెప్పాడు. మాయరూపమైన గుణముల విషయములే వేదములందున్నాయి. కావున వేదములలోని కార్యాచరణలైన యజ్ఞయాగాదులు, వ్రతక్రతువులు మొదలుకొని అన్నీ వదలి ఏ గుణసంకల్పము లేకుండ అనగా తలలో చిన్న యోచన కూడ రాకుండ చేసుకొని, బ్రహ్మయోగమాచరించి దైవమును తెలియుము.

అట్లు బ్రహ్మయోగము వీలుకాక పోయినప్పటికి ద్వంద్వములైన లాభ నష్టములు, సుఖదుఃఖములు వదలి కర్మయోగమాచరించి దైవమును చేరుము. ఈ శ్లోకమునందు మరియు 44వ శ్లోకములో చెప్పినట్లు భోగైశ్వర్యములను ఆశించి, వాటికి సంబంధించిన వ్రతక్రతువులు మొదలైన పనులు చేయక దైవత్వమును చేరు రెండే రెండు మార్గములైన బ్రహ్మయోగము, కర్మయోగమును ఆశ్రయింపుమని

హితము చెప్పడమైనది. ఇందులో మా మనవిగ చెప్పడమేమంటే, ఇంతవరకు ఆధ్యాత్మికములో అతిరథ మహారథులైన స్వాములెందరో గీతను గురించి వ్రాసినారు. అందులో ఈ శ్లోకమునందు ముందు వాక్యము బ్రహ్మయోగమునకు సంబంధించిన దని, రెండవ వాక్యము కర్మయోగమునకు సంబంధించినదని గుర్తించి వ్రాయలేక పోయారు. కావున మేమిపుడు చెప్పిన వివరమును తప్పుగ తలువ కూడదని, యోచించితే ***గుణ సంకల్పములులేనిది బ్రహ్మయోగమని, సుఖదుఃఖ, లాభనష్ట, యోగక్షేమముల ధ్యాస లేకుండ పనిచేయడము కర్మయోగమని వాటి ద్వార దైవమును తెలియుమని భగవంతుడు చెప్పినట్లు సులభముగ అర్థము కాగలదు.*** 44వ శ్లోకములో భోగైశ్వర్యముల గురించి చెప్పి 45వ శ్లోకములో వాటికి సంబంధములేని మార్గమును సూచించాడని తెలియాలి. ఇది దైవ విషయము కావున అర్థశూన్యము, భావశూన్యము కాకుండ భగవంతుడు ఏ భావము తెల్పాడో, ఆ భావమునే మేము పొందుపరచుచున్నామని తెలుపు కొనుచున్నాము.

(1)శ్లో॥ 46 : యావా నర్థ ఉదాపానే సర్వత స్సంప్లుతోదకే ।
తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః ॥
(కర్మ యోగము)

**భావము :** బావి నిండుగవున్న నీరు ఏ విధముగ నిత్యము త్రాగుటకు స్నానము చేయుటకు ఉపయోగపడుచున్నదో, ఆ విధముగనే సర్వ వేదముల నుండి కూడ మనకు నిత్యము ఉపయోగము గలదని బ్రహ్మజ్ఞానియైన వానికి తెలియును.

**వివరము :** మనకు నిత్యము స్నానము చేయుటకు త్రాగుటకు ఉపయోగపడు నీరు బావియందు కాని లేక చెరువుయందుగాని పూర్తిగా నిండి సమృద్ధిగా ఉన్నప్పటికి ఆ నీరంతయు ఒక్క మారుగ ఉపయోగపడదు. దాని నుండి నిత్యము కొద్ది కొద్దిగా నీరును మనము ఉపయోగించుకుంటాము. అలాగే మన శిరస్సను బావియందు గుణములను నీరు నిండి సమృద్ధిగ ఉన్నది. బావినుండి నీరు ఉపయోగపడునట్లే

మన తలలోని గుణములన్నియు ఒకే మారు ఏ మనిషికి ఉపయోగపడక నిత్యము కొన్ని గుణములు మాత్రము ఉపయోగడపడుచున్నవి. ఒక్క మారుగ బావిలోని నీరంతయు ఎట్లు ఉపయోగపడదో, అట్లే తలలోని గుణములన్నియు ఒకే మారు ఏ మానవునికి ఉపయోగపడవు. నిత్య జీవితములో మానవుడు పనులు చేయుటకు గుణములే అవసరము. అవి శిరస్సులోని గుణచక్రమందు 36 గుణములుగ ఉండి, ఒక్కొక్క గుణమునకు అనేక ఉప గుణములుండి చాలా పెద్ద సంఖ్యగ ఉన్నవి. ఆ మొత్తము గుణములన్ని మనిషికి నిత్యము ఒకే విధముగా ఉపయోగపడక ఒకరోజు కొద్దిగ, మరియొక రోజు ఎక్కువగ, ఇంకొక రోజు చాలా కొద్దిగ ఉపయోగపడుచుండును. ఉదాహరణకు ఒక మనిషి స్నానము చేసి బట్టలుతుకుకొన్న రోజు కొంత నీరు అధికముగ ఖర్చగును. స్నానము చేయని దినము, బట్టలుతకని దినము, నీటి ఖర్చు కొద్దిగ తగ్గును. అట్లే మనిషికి కూడ తీవ్ర యోచన చేసిన దినమున ఎక్కువ గుణములు, యోచన చేయక విరామముగ నిద్రలో గడిపిన దినమున గుణములు తక్కువగ, అట్లే ఇతరులతో పోట్లాడిన దినమున కొద్దిగ ఎక్కువ, సౌమ్యముగ గడచిపోయిన దినమున తక్కువగ గుణములుపయోగపడుచున్నవి. ప్రతి మానవునకు తలలోని గుణముల ఉపయోగము నిత్యము హెచ్చు తగ్గులుగ జరుగుచున్నదను విషయము బ్రహ్మజ్ఞానము తెలిసిన వారికి బాగుగా తెలియును. బ్రహ్మజ్ఞానము తెలియని వారికి బావిలోని నీటివలె గుణములు ఉపయోగపడు చున్నవను మాట తెలియదు. నిత్యము గుణముల ప్రభావము తమయందున్నప్పటికి, వాటిని గుర్తించలేక, యోచన చేయునది కూడ తామేనని తలచుచుందురు.

వేదములనగ త్రిగుణములని 45వ శ్లోకమున భగవంతుడు చెప్పాడు, కావున 46వ శ్లోకమున కూడ వేదములన్న చోట గుణములనియే భావించాలి. అట్లుకాక అన్యదా వేరే భావమును ఉపయోగించితే భగవంతుని మాటనే మభ్య పెట్టినట్లగును.

1) శ్లో॥ 47 : కర్మణ్యే వాధి కారస్తే మాఫలేషు కదాచన ।
మా కర్మఫల హేతుర్భూ ర్మాతే సఙ్గోఽ స్త్వ కర్మణి ॥
(కర్మయోగము)

**భావము :-** కర్మ సంపాదించుటయందే నీకు అధికారము కలదు. కర్మఫలము లందు ఆశపడవలదు. కర్మయగు పాపపుణ్య ఫలములైన కష్టసుఖములకు కారకుడవు కావద్దు. అట్లే కర్మ వచ్చునని దానికి సంబంధించిన పనులు మానవద్దు.

**వివరము :-** ముందు శ్లోకములో ప్రతి మనిషికి గుణముల వలన యోచన లొస్తున్నవని, వాటివలన పనులు జరుగుచున్నవని తెలుసుకొన్నాము. గుణముల వలన జరుగు కార్యములలో కర్మ అనునదొకటున్నది. దానినే పాపపుణ్యములు అంటాము. అగ్నికి పొగ అనుబంధమైవున్నట్లు కార్యములకు కర్మ, కర్మకు కార్యములు అనుబంధమై ఉన్నవి. అనగ పనులకు పాపపుణ్యములు వచ్చుట, వచ్చిన పాప పుణ్యములను బట్టి తిరిగి పనులు జరుగుట ప్రతి జీవరాసికి ప్రకృతి సిద్ధమైనది. ప్రకృతి సిద్ధముగ మానవుడు గత జన్మల పాపపుణ్యములగు ప్రారబ్ధకర్మను అనుభవిస్తు, ఈ జన్మలో కార్యములు చేయుచున్నాడు. ఆ కార్యములలో అనుసంధానమైన కర్మను తాను చేశానని అనుకొని తిరిగి కర్మను మూటగట్టుకొంటున్నాడు. తరువాత జన్మలో దానిని అనుభవించవలసివస్తున్నది. ఇది ప్రకృతి సిద్ధమైన పద్ధతియైతే, దానికి వ్యతిరిక్తమైన పరమాత్మ పద్ధతి కూడ ఒకటున్నది. అది ఏమనగా! గతములో తనకు అంటుకొని ఉన్న కర్మ కార్యాచరణయైనపుడు, ఆ కార్యాచరణలో అనుసంధానమై వచ్చు క్రొత్త పాపపుణ్యములను (కర్మను), తనకు ఏమాత్రము సంబంధము లేకుండ చేసుకోవడము, అనగ క్రొత్త కర్మను తనయందు రాకుండ చేసుకోవడమనునది. క్రొత్తకర్మ లేనిది క్రొత్తగ వచ్చు కార్యములు ఉండవు. కావున జీవుడు క్రొత్తగ పుట్టి క్రొత్త పనులు అనుభవించవలసినది లేదు. కర్మాచరణలో ఉన్న కార్యముల ద్వార క్రొత్త కర్మ అంటకుండ చేసుకొని, క్రొత్త కార్యములు అమలు కాకుండ తప్పించుకోవడమే పరమాత్మ సిద్ధమైన పని. ప్రకృతి సిద్ధమైన పద్ధతి అనగ **'ప్రకృతినే చేరు పద్ధతి'**

అని, పరమాత్మ సిద్ధమైన పద్ధతనగ **"పరమాత్మనే చేరు పద్ధతి"** అని అర్థము చేసుకోవాలి.

భగవంతుడు ఇటువంటి రెండు పద్ధతులున్నాయని తెలుపుచు కర్మను ప్రకృతిసిద్ధముగ సంపాదించుకోవచ్చును, లేక పరమాత్మ సిద్ధముగ దానిని లేకుండ కూడ చేసుకోవచ్చును. ఈ రెండు పద్ధతులలో ఏదైన ఒక దానిని ఆచరించి కర్మను సంపాదించుకోవడములోనో, లేక సంపాదించుకోకుండ చేసుకోవడములోనో, మానవునికి అధికారమున్నదని తెల్పాడు. "కర్మణ్యే వాధి కారస్తే" అనగా కర్మను సంపాదించుట, సంపాదించకపోవుటలో నీకు అధికారము కలదని తెలియుచున్నది. అట్లే కర్మ ఫలములైన సుఖదుఃఖములను అనుభవించడములో ఎవరికి అధికారము లేదు. కర్మ ఒక మారు సంపాదించబడియుంటే అది కార్యరూపమై కష్టసుఖములుగ అనుభవమునకు వచ్చును. సంపాదించబడియున్న కర్మవలన కలుగు కష్ట సుఖములను ఎవరు నివారించలేరు. విష్ణు, ఈశ్వర, బ్రహ్మాసహితము అనుభవించ వలసివుండును. కావున కర్మఫలమైన కార్యములందు ఎవరికి ఏ అధికారము లేదు. అవి ఎట్లు ఉంటే అట్లే చేయవలసియుండును, మరియు అట్లే అనుభవించవలసి ఉండును.

అసలు కర్మ విషయమిలాగున్నది, కావున కర్మఫలముల మీద ఆశపడి వాటికి కారణ భూతుడనుకొని క్రొత్తకర్మలు తెచ్చుకోకూడదు. అలాగే పనులుచేస్తే కర్మలు వచ్చునని ఆ కర్మలు రాకుండుటకు పనులు మానుకోవలయుననుకోకూడదు. ఎందుకనగ మొదటి కర్మాచరణే తర్వాత చేయబడు కార్యములు, కావున కార్యములు నీవు చేయకూడదను కొనుట పొరపాటు. ఎవరేమనుకొన్నను కర్మప్రకారము జరుగవలసినవి జరుగక మానవు. కాని నీకు కర్మ సంపాదించడమందు మాత్రమే అధికారమున్నదని, పనులు చేయడములో కాని, అనుభవించడములో కాని అధికారము లేదని తెలియాలి. ఇతరులు వ్రాసిన గీతలలో ఈ శ్లోక భావము పూర్తి తప్పుగ ఉన్నది. ***(పనులు చేయుటలో అధికారము గలదు, ఫలితము మీదనే లేదని వ్రాశారు. పనులు చేయుటలో అధికారము లేదు, ఫలితము మీదనే***

***ఉన్నదని మేము వ్రాశాము.)*** పని మీద అధికారము లేదని, నీ ఇష్టమున్నా లేకున్నా బలవంతముగ నీచేత పని చేయించబడునని, నీవు నీ కర్మరీత్య యుద్ధము చేయవలసి ఉన్నదని, నీకిష్టము లేకున్నా నీచేత కర్మ చేయించి తీరునని భగవంతుడు చెప్పడము జరిగినది. దీనిని బట్టి పనిమీద అధికారము లేదనునది స్పష్టముగ తెలియుచున్నది. అందువలన మేము వ్రాసిన భావమే ఈ శ్లోకమునకు సరియైనదని జ్ఞప్తి చేయుచున్నాము. పనులు చేయడములో ఎవరికి అధికారములేనిదాని వలన, పనులు చేయుచు వాటి వలన కలుగు కర్మనుండి తప్పించుకొనుటకు క్రింది శ్లోకములో ఇలా అన్నాడు.

(1)శ్లో॥ 48 : యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ! ।
సిద్ధ్యసిద్ధ్యో స్సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే ॥
(కర్మయోగము)

**భావము :** చేయు పనులయందు కల్గు లాభనష్టముల ఎడల ధ్యాసలేక, మంచి చెడు పనులందు సమబుద్ధి గలవాడై, కార్యములాచరించినవాడు యోగనిష్ఠ ఆచరించిన వాడగును. ఈ విధముగనే నీవు కార్యములు చేయుము.

**వివరము :-** జరుగు పనులయందు గల లాభనష్టములను సమముగా చూచుట వలన దానిని యోగమనబడును. అదియే కర్మయోగమగును. లాభనష్టములను సమముగ చూచుట వలన కర్మయోగమైతే, అందరు సులభముగ ఆచరించవచ్చునని తలచుటకు అవకాశము గలదు. కాని అలా చేయుట అనుకొన్నంత సులభము కాదు. ఎందుకనగా కార్యములకు సంబంధించిన పూర్తి వివరమంతయు తెలిసినపుడే లాభనష్టములపై ధ్యాసలేక పనులు చేయగల్గుదురు. అలాకాక కార్యములు ఏ కారణమున జరుగుచున్నవో, ఏ కారణమున క్రొత్తకర్మ వచ్చి చేరుచున్నదో, అసలుకు కార్యాచరణ యోగమగుటకు ముఖ్యమైన వివరమేమిటో తెలియనిది, లాభనష్టములు సమముగ తోచక వాటికి సంబంధించిన సుఖదుఃఖములు కలుగును. కావున **'సంగమ్‌త్యక్త్వా'** అని శ్లోకమున చెప్పబడియున్నది. **'సంగమ్'** అను పదమునకే ఈ

శ్లోకమున ముఖ్యమైన అర్థమున్నదని గ్రహించాలి. 'సంగమ్‌త్యక్త్వా' అనగ కలసిపోక లేక కూడిపోక అని అర్థము. ఇక్కడ యోచించవలసినది దేనితో కలిసిపోకూడదు? దేనితో కూడిపోకూడదు? ఎవరు ఎవరితో కలియకూడదు? అను ప్రశ్నలకు జవాబులు కావాలి. దానికి సరైన జవాబు గీతయందు రాబోవు శ్లోకములలో పూర్తిగ ఉన్నది. అయినప్పటికి ఇపుడు సందర్భానుసారముగ ఆ జవాబు చెప్పుకొనుచున్నాము. మన శరీరములోని 25 భాగములలో అహము అను ఒక్క భాగముతో కలియకుండ కర్మలు ఆచరించిన క్రొత్త కర్మలురావు. అలా క్రొత్త కర్మలు రాకుండ పోవడమే కర్మయోగమంటాము. శరీరములోని 25 భాగములలో ఒకటైన అహముతో ఎవరు కలియకూడదు అను ప్రశ్నకు జవాబు వెదకిన తెలియునదేమనగా! అన్నిటిని అనుభవించుటకు 25 భాగములలో తాను ఒక భాగమైయున్న జీవుడు, అహమను దానితో కలియకూడదు. అలా కలియక చేయు పనులనే కర్మయోగమంటాము. కావుననే 'సంగమ్‌త్యక్త్వా " కురుకర్మాణి" "యోగస్థః" అన్నాడు. సంగమ్‌త్యక్త్వా- అహముతో కలియకుండ, కురుకర్మాణి - కర్మ అమలు బరిచిన కార్యములు చేయుము. యోగస్థః - యోగమందుగల వాడవౌదువు.

*(1)శ్లో॥ 49 : దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగాద్ధనంజయ! ।*
*బుద్ధౌ శరణమన్విచ్ఛ కృపణాః ఫలహేతవః ॥*
*(కర్మయోగము)*

**భావము :-** కర్మనాశనము చేయు కర్మయోగమునకంటే, నీచస్థితిని కలుగజేయు కర్మ చాలా భేదమైనది. నీవు నీచస్థితిని కలుగజేయు కర్మను విడిచి, ఉన్నత స్థితిని కలుగజేయు కర్మయోగమునే ఆశ్రయింపుము.

**వివరము :-** కర్మయోగమనునది జన్మ బంధముల నుండి జీవుని కాపాడి ఉన్నత మైన దైవత్వమును చేర్చుచున్నది. కర్మ అనునది జన్మ బంధములను కలుగజేసి, జీవున్ని జన్మలపాలు చేసి తగ్గుస్థితికి పంపుచున్నది. కావున ఫలితములలో కర్మకు, కర్మయోగమునకు చాలా దూరభేదమున్నదని చెప్పవచ్చును. కనుక నీవు జన్మలను,

నీచస్థితిని కల్గించు కర్మను వదలి, ఉన్నత స్థితియైన దైవమును చేర్చు కర్మయోగమునే శరణుజొచ్చుమని చెప్పి తరువాత క్రింది శ్లోకమున కూడ ఆ మాటనే బలపరచునట్లు చెప్పుచున్నాడు.

*(1)శ్లో॥ 50 : బుద్ధియుక్తో జహా తీహ ఉభే సుకృత దుష్కృతే ।*
*తస్మాద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలమ్ ॥*
*(కర్మయోగము)*

**భావము :** కర్మయోగమనుసరించిన వాడు కర్మయైన పాప పుణ్యములను నాశనము చేయుచున్నాడు. అందువలన నీవు కూడ కార్యములను చేయుచు ఆ పనులయందే ఇమిడిన పాపపుణ్యములను పొందని నేర్పరితనమును తెలియుము. అదియే కర్మయోగము.

**వివరము :-** పరమాత్మయందైక్యమగుటకు గీతయందు సూచించిన రెండు యోగములలో ఒకటైన కర్మయోగమంటే ఏదోనని, ఎంత నిష్టతో కూడుకొని ఉండునోయని, ఎంతటి సాధన చేయవలసి ఉండునోయని యోచించనవసరము లేదు. అందరనుకొనులాగ కర్మయోగములో ఏ సాధనలు ఏ నిష్టలు లేవు. ఉన్నదంతా ఒకే పద్ధతి. నీ ద్వార జరుగు ఏ పనియైనను పరవాలేదు, కాని ఆ పనులు చేయడములో కర్మ అంటని యోగకుశలత తెలిసియుండాలి. అన్ని పనులు చేయుచు కార్యములందు వ్యత్యాసమును వదలి, కర్మ ప్రకారము సంభవించు మంచిచెడు కార్యములను ఆచరించుచు, అహమును పొందకుండిన కార్యములోని కర్మ అంటదు. అదియే కర్మనుండి తప్పించుకొను ప్రావీణ్యత దానినే **'కర్మసుకౌశలం'** అని గీతయందన్నారు. ఏ నియమములు లేని కర్మయోగము అన్ని పనులు ఆచరించుచు కర్మనంటక పోవడమే, కావున యోగమాచరించువాడు సుకృత దుష్కృతములైన పుణ్యపాపములను నశింపజేసుకొనును. అనగా మంచిని చేయుట ఎడల సంభవించు సుకృతమైన పుణ్యమును, అట్లే చెడు పని చేయుట ఎడల సంభవించు దుష్కృతమైన పాపమును అంటకుండ చేసుకొనును. అదియే కర్మయోగము యొక్క ప్రావీణ్యతయని తెలియాలి.

**ముఖ్య గమనిక :** చెడుపనులను వదలి మంచి పనులను చేయమని అందరు బోధించుట మనకు తెలిసినదే. అయితే గీతయందు గత జన్మల కర్మ ప్రకారము మంచి చెడు పనులు జరుగుచుండునని, ఎవరి ఇష్టము ప్రకారము అవి జరుగవని చెప్పాడు. కావున జరిగెడి పనులలోని క్రొత్త కర్మను రాకుండ చేసుకొమ్మన్నాడు. అట్లు కాక చెడుపనులని, మంచిపనులని భేదమును గూర్చి చెప్పలేదు. కర్మయోగములో కర్మప్రకారము మనయందు బలవంతముగా జరుగు అన్ని పనులను సమముగా తలచి, వాటినుండి వచ్చు క్రొత్త కర్మను రాకుండ చేసుకొనుట వలన, తిరిగి తన చేత అటువంటి పనులు జరుగకుండపోవునని బోధించాడు. కర్మ నిర్మితమైన కార్యములను ఎవరు వదలలేరు. కాని ఆ కార్యములు జరుగకుండ పోవలెనన్న ఆ పనులకు కారణమైన (బీజమైన) కర్మనే లేకుండా చేసుకోవాలి. దానినే కర్మయోగమంటాము.

*( 1 ) శ్లో॥ 51 : కర్మజం బుద్ధియుక్తా హి ఫలం త్యక్త్వామనీషిణః ।*
*జన్మబంధ వినిర్ముక్తాః పదం గచ్ఛన్త్య నామయమ్ ॥*
*( కర్మయోగము)*

**భావము :** జ్ఞానపరులు కర్మ ఫలములను వదలి, జన్మ బంధములను విడచి మోక్షమును పొందుచున్నారు.

**వివరము :-** కర్మయోగమును ఆచరించు జ్ఞానులు ప్రారబ్ధకర్మ నుండి వచ్చు కష్టసుఖములు లాభనష్టముల ఫలమును వదలి, కర్మప్రకారము ఏ కార్యమొచ్చిన దానిని ఆచరించి, దానినుండి వచ్చు క్రొత్త ఆగామికకర్మను రాకుండా చేసుకొని, జన్మ బంధములను కల్గించు సంచితకర్మను వీడి నాశనరహితమైన, పరమాత్మ స్వరూపమైన మోక్షమును పొందుచున్నారు.

***(ఒక జన్మలో పుట్టినప్పటి నుండి మరణించు వరకు అమలుకు వచ్చు కర్మను ప్రారబ్ధకర్మయని, పుట్టినప్పటినుండి మరణించు వరకు క్రొత్తగా వచ్చు కర్మను ఆగామికకర్మయని, జన్మబంధములను కల్గించు కర్మ నిలువను సంచితకర్మయని తెలియాలి.)***

ఈ శ్లోకమున ప్రారబ్ధమును ఆచరిస్తూ, క్రొత్తగా వచ్చు కర్మయైన ఆగామికకర్మను రాకుండ చేసుకొని, తిరిగి జన్మలేని విధముగా సంచితకర్మను అసలే లేకుండా చేసి, మోక్షము పొందుమని ముఖ్యముగా తెలియజేసాడు. ఈ శ్లోకములో పూర్తి వెదకినప్పటికి "కర్మజం" అనగా ప్రారబ్ధకర్మని, "జన్మబంధం" అనగా ఆగామికకర్మని తెలియుచున్నది. కాని సంచితకర్మ లేదేయని కొందరికి అనుమానము రావచ్చును. దానికి సమాధానము పాతది ప్రారబ్ధరూపముగా అయిపోతూ క్రొత్తదైన ఆగామికకర్మ రాకుండపోతే, నిలువయైన సంచితమే పూర్తి లేకుండా పోతుందని తెలియాలి. సంచితము లేకపోయినపుడే అందు నుండి వచ్చు ప్రారబ్ధముండదు. అపుడు పుట్టనవసరమేలేదు. అపుడే మోక్షమను దైవపథమును చేరుకోగలము.

(1) శ్లో॥ 52 : యదా తే మోహకలిలం బుద్ధిర్వ్యతి తరిష్యతి ।
తదా గంతాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ ॥
(కర్మయోగము, బ్రహ్మయోగము)

**భావము :** ఎపుడైతే మోహగుణమను కల్మషమును దాటగలవో, అపుడే నీవు ఇంతవరకు వినిన, వినవలసిన విషయముల కొరకు వైరాగ్యము పొందగలవు.

**వివరము :** మన శరీరములో12 గుణములుండినను ముఖ్యముగా ఆరు గుణములు మాత్రమే పేరుగాంచి ఉన్నవి. అందులో అపుడు అర్జునునికి ఆవహించి బాణములు క్రిందవేయునట్లు చేసినది మోహగుణము. నాది నావారు అని, 'నా' అని ప్రేరేపించునది మోహగుణము. ఆ గుణమును వీడి నాది నావారు అను విషయము మరచిపోతే కాని, ఇంతవరకు చెప్పిన కర్మయోగ వివరము, ఇక చెప్పబోవు బ్రహ్మయోగ వివరము మీద ఆసక్తి రాగలదు. అట్లు ఆసక్తి కల్గినపుడు వేదములను గుణముల నుండి బయటపడగలవు. ఇచట ***నిర్వేదం*** అను పదమును మరువకూడదు.

జ్ఞానము తెలుసుకోకుండ ఆటంకపరుచువారు నీవారే. అందువలన నావారను మోహగుణము వదలి దానికి వ్యతిరేఖమైన వైరాగ్యమును పొంది శ్రద్ధగావింటేగాని జ్ఞానము అర్థముకాదని, జ్ఞానము అర్థమైన తరువాతనే యోగమును పొందుటకు

అవకాశము గలదని చెప్పాడు. గీత మొదలైనపుడు చెప్పినది ఆత్మ జీవాత్మల వివరము, తరువాత చెప్పినది కర్మయోగము. ఇక చెప్పబోవు విషయము బ్రహ్మయోగము.

(1) శ్లో॥ 53 : శ్రుతి విప్రతి పన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా ।
సమాధా వచలా బుద్ధిస్తదా యోగ మవాప్స్యసి ॥
(బ్రహ్మయోగము)

**భావము :** వివిధ శ్రుతుల వలన కలత చెందిన నీబుద్ధి చలింపనిదై స్థిరమైన సమాధియందు నిలిచినపుడు నీవు యోగము పొందిన వాడవగుదువు.

**వివరము :** గీతయందు మూడు ఆత్మలను గూర్చి చెప్పడములో ఆత్మయను పదమును, అట్లే రెండు యోగముల గురించి చెప్పడములో కూడ యోగము అను పదమును వాడారు. కావున ఆత్మ అన్నప్పుడు ఏ ఆత్మ అన్న విషయము, యోగము అన్నప్పుడు ఏ యోగము అన్నవిషయము శ్రద్ధగా పరిశీలించి చూడవలసి ఉండును. ఇపుడు పై శ్లోకమున యోగమన్నారు కావున బ్రహ్మయోగమును గురించి చెప్పాడని తెలియాలి. ఏమి చెప్పాడనగా!

అనేక విధముల జ్ఞానమును గురించి విని కలత చెందిన నీ బుద్ధి మాత్రము చలింపనిదై, స్థిరముగా ఎల్ల జీవరాసులయందు సమముగా ఉన్న ఆత్మయందు ఎపుడు లగ్నము కాగలదో, అపుడే బ్రహ్మయోగమును పొందిన వాడవగుదువు. సర్వజీవరాసులలో సమముగా నివసించు ఆత్మయందు బుద్ధి లగ్నము కావడమును **'సమాధి'** అని తెలియాలి. ఈ శ్లోకముకంటే ముందు అన్ని విషయములలో ఉంటూ, అన్ని పనులు చేస్తూ కర్మ అంటని కర్మయోగమును విన్న అర్జునుడు, ఈ శ్లోకములో శరీరములోని ఏ భాగము ఏ పని చేయక బుద్ధి కూడ స్థంభించి పోయినపుడు బ్రహ్మయోగమవునను మాటవిని, ఆశ్చర్యచకితుడై మొదటి సారిగా నోరు విప్పి బ్రహ్మయోగము యొక్క వివరమును గురించి ఇలా అడిగాడు.

**అర్జునుడిట్లనియె :-**

*(1) శ్లో 54 : స్థిత ప్రజ్ఞస్య కా భాషా ? సమాధిస్థస్య కేశవ !*
*స్థితధీః కిం ప్రభాషేత ? కి మాసీత ? వ్రజేత కిమ్ ?*
*(బ్రహ్మయోగము)*

**భావము :** ఓ కృష్ణా! బుద్ధి నిలిచిపోయి సమాధి స్థితిలో ఉన్నవాడు ఏ భాషలో మాట్లాడును? ఏమి మాట్లాడును? ఏ విధముగా కూర్చుండును? ఏమి ఆచరించును?

**వివరము :** ప్రజ్ఞ స్థిరమైనవాడు అనగా బుద్ధి నిలిచిపోయినవాడు ఏ భాష మాట్లాడును? మామూలుగా మనము నోరు కదిపి మాట్లాడు భాషకాక మూగగా మాట్లాడు భాష ఏమైనా ఉన్నదా? అట్లు ఏదైన భాష ప్రత్యేకించి ఉంటే బుద్ధి ఏ పని చేయనపుడు అతను ఏ విధముగా మాట్లాడును? బుద్ధి పనిచేయని వాడు ఏ విధముగా కూర్చొనును? మొత్తము మీద బుద్ధి పనిచేయని అతని ప్రవర్తన ఎట్లుండును? వివరమంతా తెలుపవలెనని అర్జునుడు అడుగగా, బుద్ధి నిశ్చలత పొందిన వానిని గూర్చి భగవంతుడిలా చెప్పాడు.

**శ్రీభగవంతుడిట్లనియె :**

*(1) శ్లో॥ 55 : ప్రజహాతి యదా కామాన్ సర్వాన్పార్థ ! మనోగతాన్ ।*
*ఆత్మన్యే వాత్మనా తుష్టః స్థిత ప్రజ్ఞ స్తదోచ్యతే ॥*
*(బ్రహ్మయోగము)*

**భావము :** ఎప్పుడైతే సర్వ ఆశలు మరియు మనోగతములైనవన్ని ప్రయత్న పూర్వకముగా వదలి ఆత్మయందే జీవాత్మ తృప్తిబొందుచున్నదో అపుడే వానిని స్థిత ప్రజ్ఞుడని చెప్పవచ్చును.

**వివరము :** ఇక్కడ "**మనోగతాన్**" అన్నది విశేషపదము. మనస్సులో లగ్నమైయున్న అనగా మనుసులో దాగియున్న గడిచిన విషయములన్ని అని అర్థము. ఇంతకు

ముందు చూచినవి, విన్నవి, తిన్నవి, తాకినవి, వాసన చూచిన విషయములేవైన మనోగతములే. అవేవి మనస్సుకు జ్ఞప్తికి రాకుండాపోయి మరియు భవిష్యత్తును గురించిన ఆశలు జ్ఞప్తికి రాకుండాపోయినపుడు, ఆ శరీరములోని జీవాత్మ ఆ శరీరమునందే ఉన్న ఆత్మతో కలసిపోవును. బ్రహ్మయోగము ఆచరించుటకు మూలకారణమైనది మనస్సు. మనస్సు శరీరము లోపలి అవయవములకు బయటి అవయవములకు మధ్యవర్తిలాంటిది. అది స్థంభించినపుడే లోపలి బుద్ధి మరియు దానికి సంబంధిత గుణములు పనిచేయవు. అట్లే లోపలి నుండి మనస్సు ద్వార వచ్చు ఆజ్ఞలు నిలిచిపోవుట వలన బయటి అవయవములు పని చేయవు. అట్టి స్థితిని పొందిన వానినే స్థితప్రజ్ఞుడని అందురు. ఇంకనూ స్థిత ప్రజ్ఞుడు ఎట్లుండుననిన.

(1)శ్లో ॥ 56 : దుఃఖే ష్వనుద్విగ్న మనాస్సుఖేషు విగత స్పృహాః ।
వీతరాగ భయక్రోధ స్థ్సిత ధీర్మునిరుచ్యతే ॥
(బ్రహ్మయోగము)

**భావము :** దుఃఖమందు బాధపడని వానిని, సుఖములందు సంతోషించని వానిని, మరియు ప్రేమ, కోపము, భయములేని వానిని మౌనము వహించిన బుద్ధిగల వాడందురు.

**వివరము :** బ్రహ్మయోగము ఆచరించు వాని శరీరములో ఏ అవయవములు పనిచేయక స్థంభించియుండును. అవయవములు కదలి పనిచేయుటకు గుణముల ప్రకారము బుద్ధి యోచించితే, జరిగిన నిర్ణయమును మనస్సు ద్వారా పనులుగా జరుగునట్లు, శరీర యంత్రాంగము ప్రతి జీవరాసిలో ఉండును. బుద్ధి స్థంభించిన వాని శరీరములో ఏ యోచనలు జరుగవు. యోచనల ప్రకారము పనులు నిర్ణయింపబడవు. మనస్సు పూర్తిగా తన పనిని నిలిపి వేసియుండును. కావున అవయవములకు ఎటువంటి ఆదేశములు రావు. అందువలన పనిచేయు అవయవములు ఏ పనిని నిర్వర్తించక స్థంభించివుండును. ఇక జ్ఞానేంద్రియము లైన కన్ను, ముక్కు, చెవి, నాలుక, చర్మము వాటి వాటి పనిని అవి చేసి వాటి వాటి

విషయ జ్ఞానమును తెలుపు స్థితిలో ఉన్నప్పటికి, మనస్సు వాటిని గ్రహించకున్న దానివలన, అ విషయజ్ఞానము శరీరములోని జీవునికి, బుద్ధికి చేరదు. కావున వాడు ఏ విషయమునకు బాధపడడు. అట్లే బయట జరుగు సుఖములు కూడ తెలియవు, కావున సుఖములకు పరవశుడు కాడు. వానికి బయటి సమాచారము అందించు మనస్సులేని కారణమున భయము, ప్రేమ, కోపము ఏవియు ఉండవు. మనస్సు మౌనము వహించియుండును కావున అట్టి వానిని **'ముని'** అంటున్నాము. ఇంకనూ అట్టివాడు ఎలా ఉండుననగా!

*(1) శ్లో ॥ 57 : యస్సర్వత్రానభి స్నేహస్తత్త త్ప్రాప్య శుభా శుభమ్ ।*
*నాభినందతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥*
*(బ్రహ్మయోగము)*

**భావము :** ఎవరైతే అన్నిటియందు సంబంధము లేక, శుభాశుభములయందు మనోధ్యాస ఏమాత్రము లేకుండా, సుఖదుఃఖములు అనుభవించకుండునో, అట్టివాని ప్రజ్ఞ గొప్పది.

**వివరము :** శరీరములోని మనస్సుకు మొత్తము 12 మంది స్నేహితులున్నారు. వారెవరనగా లోపలయున్న బుద్ధి, చిత్తము బయటనున్న జ్ఞానేంద్రియములైన కన్ను, ముక్కు, చెవి, నాలుక, చర్మము మరియు కర్మేంద్రియములైన కాళ్ళు, చేతులు, నోరు, గుదము, గుహ్యము. **'సర్వాత్రానభిస్నేహ'** అనగా ఎల్లపుడు స్నేహ సంబంధము కల్గి ఉండడమని అర్థము. ఎల్లప్పుడు బయటి ప్రపంచములోని మనుషులతో ఏ మానవునికి స్నేహము ఉండదు. కావున బయటి మనుషుల స్నేహమనుకోకూడదు. ఎల్లప్పుడు స్నేహము కల్గినది మనస్సు ఒకటే అదెలా స్నేహము కల్గి ఉన్నదనగా! తర్వాత పేజీ పటములో చూడుము.

బయటి జ్ఞానేంద్రియములైన కన్ను, ముక్కు, చెవి, నాలుక, చర్మము వాటి వాటి విషయములను మనస్సుకు సర్వత్ర అందించుట వలన ఈ బయటి ఐదు




ఇంద్రియములతో మనస్సు ఎడతెగని స్నేహము కల్గియున్నది. మరియు బయటి ఇంద్రియములు అందించిన సమాచారమును మనస్సు లోపలి బుద్ధికి అందిస్తూ బుద్ధితోను, బుద్ధి యోచించిన విషయములను నిర్ణయించి బయటి కర్మేంద్రియములకు తెలుపమని చిత్తము మనస్సుకు తెల్పుచుండుట వలన చిత్తముతోను సర్వత్ర స్నేహము ఉన్నది. సర్వత్ర స్నేహ సంబంధము ఒక్క మనస్సుకు తప్ప మరి ఏ ఇతరమునకు లేదు.

లోపలయున్న బుద్ధి, చిత్తము బయటనున్న కన్ను, ముక్కు, చెవి, నాలుక, చర్మములతో మనస్సు స్నేహ సంబంధము ఎప్పుడైతే వదలివేయునో అది నిద్ర అవుతుంది. నిద్రలో మనస్సు తన మీద జ్ఞప్తిని కోల్పోవును. అలా కాకుండా చేసుకోవడమును బ్రహ్మయోగమంటాము. మనస్సు తన్ను తాను మరువక సర్వత్ర కలిగిన 12 ఇంద్రియముల స్నేహమును ఎంతసేపు లేకుండునో అంతసేపు బ్రహ్మయోగమగును. బయటి విషయము లోపలికి లోపలి విషయము బయటికి చలించకపోవడము వలన బ్రహ్మయోగములో మానవ శరీరము నిద్రలాగ స్థంభించి ఉండును. అందువలన బయట కల్గు శుభాశుభములు, ప్రేమ అసూయలు అట్టివానికి ఉండవు, వానినే నిజమైన బ్రహ్మయోగి అంటాము.

***ఏ ఇంద్రియమునకు, ఏ ఇంద్రియములతో స్నేహమున్నది క్రింద గల పట్టికలో చూడుము.***

| | | | |
|---|---|---|---|
| 1. | జీవునికి | ః | అహము, బుద్ధి, (2) |
| 2. | మనస్సుకు | ః | ఐదు కర్మేంద్రియములు,<br>ఐదు జ్ఞానేంద్రియములు,<br>బుద్ధి, చిత్తము, (12) |
| 3. | బుద్ధికి | ః | మనస్సు, చిత్తము, జీవుడు (3) |
| 4. | చిత్తమునకు | ః | బుద్ధి, మనస్సు, అహము (3) |
| 5. | అహమునకు | ః | జీవుడు, చిత్తము (2) |
| 6. | కన్నుకు | ః | మనస్సు (1) |
| 7. | ముక్కుకు | ః | మనస్సు (1) |
| 8. | చెవికి | ః | మనస్సు (1) |
| 9. | నాలుకకు | ః | మనస్సు (1) |
| 10. | చర్మమునకు | ః | మనస్సు (1) |
| 11. | చేతులకు | ః | మనస్సు (1) |
| 12. | కాళ్ళకు | ః | మనస్సు (1) |
| 13. | నోరుకు | ః | మనస్సు (1) |
| 14. | గుదమునకు | ః | మనస్సు (1) |
| 15. | గుహ్యామునకు | ః | మనస్సు (1) |

మనస్సుకు ఎల్లప్పుడు ఇంద్రియములతో కల్గిన స్నేహమును ఏ విధముగా లేకుండా చేసుకోవలయునో, ఉదాహరించి భగవంతుడు క్రింది శ్లోకమున ఈ విధముగా అంటున్నాడు.

(1) శ్లో॥ 58 : యదా సంహరతే చాయం కూర్మోఽఙ్గానీవ సర్వశః। ।
ఇంద్రియాణీంద్రియార్థేభ్యస్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥
(బ్రహ్మయోగము)

**భావము :** తాబేలు ఏ విధముగా తన అవయవములను ముడుచుకొనుచున్నదో, ఆ విధముగా మనస్సును ఇంద్రియముల నుండి మరలింపవలెను.

**వివరము :** తాబేలు ఉన్నచోటనే ఉండి బయటవున్న తన నాల్గు కాళ్ళను మరియు తలను వీపు చిప్ప క్రిందికి ముడుచుకొని, బయటి సంబంధము అనగా బయటికి కనిపించకుండ చేసుకొనుచున్నది. ఆ విధముగానే మనిషి తన శరీరమును కదల్చకుండా బయటి ఇంద్రియములైన జ్ఞానకర్మేంద్రియముల నుండి మనస్సు యొక్క సంబంధము లేకుండా చేసుకోవలయును. అట్లు చేసుకోవడమే బ్రహ్మయోగము నందున్న పనితనము.

ఇక్కడ ముఖ్యముగా గమనించవలసినదేమనగా! తాబేలు చలించునపుడు చిప్ప క్రిందికి అవయవములను ముడుచుకోదు. ముడుచుకుంటే ముందుకు కదలలేదు. తాబేలు చలించనపుడే తనకాళ్ళు తలను ముడుచుకొన్నట్లు, మనిషి కూడ ఒక చోట స్థిరముగా కూర్చున్నప్పుడే తన మనస్సును ఇంద్రియముల సంబంధము లేకుండ చేసుకోగలడు. కాళ్ళను ముడుచుకొని తాబేలు ఎలా ముందుకు పోలేదో, అలాగే మనిషి మనోధ్యాసను ఇంద్రియముల నుండి మరల్చుకొని ఏ చిన్న కార్యమునైన చేయలేడు. కొందరు పనులు చేయుచు మనస్సును మరల్చుకోవాలని చెప్పుచుందురు. అది శుద్ధ అసత్యమని తెలియాలి. బ్రహ్మయోగమనబడు మనోనిశ్చలతను పొందిన వాడు బాహ్య సంబంధమైన అన్ని ఇంద్రియ చలనములు లేనివాడై ఉండును.

(1) శ్లో॥ 59 : విషయా వినివర్తన్తే నిరాహారస్య దేహినః।
రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే ॥
(బ్రహ్మయోగము)

**భావము :** బ్రహ్మయోగమాచరించు యోగి ఇంద్రియములకు ఆహారమైనట్టి

విషయములయందు మనోధ్యాసలేకుండా చేసుకొన్నప్పటికి, వాని తలలోని విషయముల మీద ఆశ అనుగుణము వీడకయుండును. ఆ ఆశయు కొంత కాలము ఆత్మను దర్శించుట వలన నశించిపోవును.

**వివరము :** ఒక రోగి పథ్యముండి ఒక రుచిగల పదార్థము తినకుండినప్పటికి ఆ పదార్థము మీద ఆశ ఉండినట్లు, యోగి విషయములను అనుభవించక పథ్యమైన బ్రహ్మయోగము ఆచరించినప్పటికి, వాని తలలో విషయాసక్తిగల ఆశ అను గుణము దాగియుండి, అపుడపుడు విషయముల మీద ఆసక్తిని కలుగజేయుచు, మనస్సును చలింపజేసి యోగభంగము కల్గించుచుండును. అందువలన బ్రహ్మయోగి ఒక గంటకాలము యోగసాధనయందు గడిపితే, కొన్ని నిమిషముల కాలమైన మనస్సు చలించి యోగభంగము జరుగుచుండును. ఈ విధముగా జరుగుచుండినప్పటికి బ్రహ్మయోగమాచరించు వానికి కొంతకాలమునకు అట్టి మనో చంచలమైన కోర్కెలు కూడ రాకుండా పోవును.

బ్రహ్మయోగమాచరించు ఏ యోగికైన మనో చంచలము యోగ సమయములో కల్గుట సహజమే. దానిని గురించి క్రింది శ్లోకమున ఈ విధముగా చెప్పుచున్నాడు.

*(1) శ్లో॥ 60 : యతతోహ్యాపి కౌన్తేయ! పురుషస్య విపశ్చితః ।*
*ఇంద్రియాణి ప్రమాథీని హరన్తి ప్రసభం మనః ॥*
*(బ్రహ్మయోగము)*

**భావము :** జ్ఞానియైనవాడు యోగ సమయమందు మనస్సు చలించకుండునట్లు ఎంత ప్రయత్నము చేయుచుండిన, యోగభ్రష్టతయను ప్రమాదము కలుగునట్లు ఇంద్రియములు వాని మనస్సును చలింపజేయుచున్నవి.

**వివరము :** బ్రహ్మయోగమాచరించు వాడు ఎంతటి జ్ఞానియైన, అతను యోగము చేయు సమయమున బయటి జ్ఞానేంద్రియములు ఐదు, వాటి వాటి విషయములను మనస్సుకు చేరవేయు సామర్థ్యము కల్గి, మనస్సును ఏకాగ్రతగా లేకుండా విషయ సంబంధము కల్గునట్లు చేయుచున్నవి. బ్రహ్మయోగమాచరించుటకు ఆశీనుడైన

ప్రతి యోగి యొక్క శరీరములోను జ్ఞానేంద్రియములు శత్రువులవలె పనిచేసి, వాని యోగమును విఘ్నపరచుచున్నవి. ఇంద్రుడు పురాణాలలో అగ్ని, వరుణుడు, వాయువు మొదలగు వారిని పంపి తపస్సు చేయువారిని విఘ్నపరచినట్లు, నిజ జీవితములో యోగమాచరించువారికి అగ్ని, నీరు, వాయువు, భూమి చేత తయారైన ఇంద్రియముల ద్వారా యోగము భంగమగునట్లు ప్రకృతి చేయుచున్నది.

**గమనిక :** జ్ఞాన జిజ్ఞాసులైన పాఠకులకు తెలియజేయడమేమనగా! పండితులుగా ఉన్నవారు. మేధావులు శ్లోకము భావము చదివి వివరము చదివిన పరవాలేదు. అలాకాక మాకు సంస్కృతము అర్థము కాదు, మాకు గీతలోని జ్ఞానము మాత్రమే అవసరము, భావము, వివరము ఒకటి చిన్నది ఒకటి పెద్దది ఏమిటి మాకు అర్థము కావడములేదు అనుకొనువారికి సులభముగా గీత యొక్క జ్ఞానము అర్థము కావలయునంటే శ్లోకము భావము వదలివేసి కేవలమొక్క వివరము మాత్రమే చదువుచుపోండి. అలా వివరము మాత్రము చదువుట వలన గీతలోని జ్ఞానము సులభముగా అర్థము కాగలదని మా నమ్మకము. మీరు ఏది చదివినప్పటికి ఆ వివరము ఏ విషయమును గురించి చెప్పినది సూచనగా శ్లోకము ప్రక్కన బ్రాకెట్‌లో సూచించినది తప్పక చూడండి.

*(1) శ్లో॥ 61: తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః ।*
*వశే హి యస్యేంద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥*
*(బ్రహ్మయోగము)*

**భావము :** ఇంద్రియములనెల్ల అణచివేసి మనస్సును నాయందు ఎవడుయుంచునో, ఇంద్రియములెవనికి స్వాధీనమైయుండునో అట్టి వాని ప్రజ్ఞ గట్టిది.

**వివరము :** బయటి జ్ఞానేంద్రియములు వాటివాటి సమాచారమును మనస్సుకు చేరవేసినప్పటికి, మనస్సు వాటిని స్వీకరింపని స్థితిలో ఉన్నపుడు జ్ఞానేంద్రియములు ఏమి చేయలేవు. మనస్సు యొక్క ధ్యాస జ్ఞానేంద్రియముల మీద లేకుండా చేస్తే దాని ధ్యాస ఆత్మ మీద ఏర్పడగలదు. జ్ఞానేంద్రియముల విషయ ధ్యాస మనస్సుకు లేనపుడు కర్మేంద్రియములకు మనస్సు ద్వార ఎట్టి పనియు ఆదేశింపబడదు. కావున

కర్మేంద్రియములు వశీకరణ మంత్రము ప్రయోగించినట్లు కదలక నిలిచిపోయి ఉండును. అట్టి స్థితి కల్గిన వానినే నిలకడ గల మనస్సు గలవాడని చెప్పవచ్చును.

(1) శ్లో॥ 62 : ధ్యాయతో విషయాన్ పుంస స్సంగ స్తేషూపజాయతే ।
సంగాత్సంజాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే ॥
(ప్రకృతి)

**భావము :** విషయముల ధ్యాసలో వాటి సంగమము మానవునకు ఏర్పడుచున్నది. అట్టి సంగమము వలన మానవునకు కోర్కె పుట్టుచున్నది. దాని వలన క్రోధము పుట్టుచున్నది.

**వివరము :** జ్ఞానేంద్రియములైన కన్ను, ముక్కు, చెవి, నాలుక, చర్మము యొక్క విషయముల మీద మనస్సుకు ధ్యాస కల్గుట వలన, వాని తలలోని గుణముల గుంపులతో ఆ విషయముపోయి చేరుచున్నది. జ్ఞానేంద్రియముల నుండి వచ్చు విషయము గుణముల గుంపులో కలియుట వలన, ఆ విషయమును బట్టి మొదట గుణముల గుంపు నుండి కోర్కె ఏర్పడుచున్నది. ఆ కోర్కె నెరవేరక పోతే దాని వలననే కోపము గుణసంగము నుండి వచ్చుచున్నది. ఇంకనూ ఆ గుణములు కల్గుట ఎట్లున్నదనగా!

(1) శ్లో ॥ 63 : క్రోధాద్భవతి సమ్మోహ స్సమ్మోహాత్ స్మృతి విభ్రమః ।
స్మృతి భ్రంశా ద్బుద్ధినాశో బుద్ధి నాశాత్ప్రణశ్యతి ॥
(ప్రకృతి)

**భావము :** క్రోధము వలన సమ్మోహము గల్గును. సమ్మోహము వలన స్మృతి భ్రమించుట, స్మృతి భ్రమించుట వలన బుద్ధి నాశనము, బుద్ధి నాశనము వలన భ్రష్టత్వము పొందుట కల్గును.

**వివరము :** గుణచక్రమందుగల గుణములలోనికి మనస్సు ద్వారా విషయము పోయి చేరిన వెంటనే అందులోని గుణములు కదలను మొదలు పెట్టును. మొదటిది

కోర్కె, రెండవది కోపము అట్లే ఇతర లోభ, మోహ, మధ, మాత్సర్యములను గుణములు కల్గుచుండును. విషయమునకు తగిన గుణము వచ్చిన వెంటనే ఇతర గుణమును ఆలోచించుట మాని ఆ వచ్చిన గుణమందే సమ్మోహుడై నిలుచును. కొద్దిసేపటికి ఆ గుణమునందు యోచించు జ్ఞప్తి కూడ లేకుండ చిత్తము నిర్ణయించును. యోచించు జ్ఞప్తి కూడ లేనందువలన బుద్ధి యొక్క పనితనమేమి లేకుండ పోవును. బుద్ధి పనితనము లేకుండ పోయిన దాని వలన మానవుడు విచక్షణారహితుడై కర్మ ప్రకారము పనులు చేయుచు కర్మబద్ధుడగుచున్నాడు.

ఒక విషయము జ్ఞానేంద్రియముల ద్వారా లోపలికి పోయినపుడు, మనస్సు ద్వారా బుద్ధికి చేరును, బుద్ధి గుణముల ద్వారా యోచించును. బుద్ధి యోచించిన విషయమే కర్మప్రకారము చిత్తముచే నిర్ణయింపబడుచున్నది. పై రెండు శ్లోకములు సాధారణ మానవునియందు జరుగు వివరమును తెలియజేసినవి. యోగిగ మారు వాని విషయము క్రింది శ్లోకమున ఇలా ఉన్నది.

*(1) శ్లో ॥ 64 : రాగద్వేషవియుక్తైస్తు విషయానింద్రియైశ్చరన్ ।*
*ఆత్మవశ్యైర్విధేయాత్మా ప్రసాద మధిగచ్ఛతి ॥*
*(బ్రహ్మయోగము)*

**భావము :** రాగద్వేషములను వదలి అట్లే ఇంద్రియ విషయములను వదలి స్వాధీనపడిన మనస్సుగలవాడెపుడైతే అపుడు ప్రసాదంబు కలుగును.

**వివరము :** లోపలి నుండి వచ్చు ప్రేమ అసూయ అను రెండు రకముల గుణములను వదలి వేసి, బయటినుండి వచ్చు ఇంద్రియ విషయములను వదలి వేసి, ఏ ధ్యాసలులేని వశమైన మనస్సు గలవానికి ఆత్మదర్శనము కల్గును.

ఇక్కడ రాగద్వేషములు (ప్రేమ అసూయలు) అను మాట వచ్చినది. కావున గుణముల గురించి పూర్తిగ తెలియవలసి ఉన్నది. మన శరీరమునందు షట్‌వర్గము అను ఆరుగుణముల గుంపు పేరుగాంచి ఉన్నది. అవియే ***1) కామ 2) క్రోధ 3) లోభ 4) మోహ 5) మద 6) మత్సరమను*** గుణములు. ఇవి ఆరు చెడును

సూచించు గుణములు. ఈ గుణములున్న వారిని అసురులని, ఈ గుణములకంటే వ్యతిరేఖ గుణములున్న వారిని దేవతలని గీతయందు తర్వాత అధ్యాయములలో తెల్పబడియున్నది. చెడును (పాపమును) కల్గించు కామ, క్రోధ, లోభ, మోహ, మధ, మత్సరములను గుణములను అందరికి తెలియునట్లు పెద్దలు ఎక్కువ ప్రచారము చేశారు. ఎందుకనగా అవి తెలిసియుంటే వాటియందు ఎరుక కల్గి ఉందురను భావముతో అందరికి తెలియునట్లు చేశారు. ఇక మంచిని (పుణ్యము) కల్గించు ఆరు గుణములున్నవి. అవి మొదటి ఆరు గుణములకు వ్యతిరేఖమైనవి. ఏ దానికి ఏది వ్యతిరేఖమైనది క్రింద తెలుసుకొందాము.

**1) కామము × దానము** **2) క్రోధము × దయ**

**3) లోభము × ఔధార్యము** **4) మోహము × వైరాగ్యము**

**5) మధము × వినయము** **6) మత్సరము × ప్రేమ**

ఇలా ఉన్న చెడు, మంచి గుణములందు ఏ గుణము లేకుండ పోవడము బ్రహ్మయోగమగును. ద్వేషము, ప్రేమ అని రెండు గుణములు చెప్పడములో మంచివి చెడువి అను రెండు రకముల గుణములు వదలి, అట్లే బయటి ఇంద్రియముల విషయములు వదిలినవాడు బ్రహ్మయోగి అగును. వానికే ఆత్మదర్శనమగునని ఈ శ్లోకమున తెలియజెప్పబడినది. అట్టి వానికి ఇంకనూ ఎలా ఉండునది క్రింది శ్లోకములో తెలియబరచబడినది.

*(1) శ్లో॥ 65 : ప్రసాదే సర్వదుఃఖానాం హాని రస్యోపజాయతే ।*
*ప్రసన్న చేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతే ॥*
*(బ్రహ్మయోగము)*

**భావము :** ఆత్మదర్శనము కల్గినపుడే సర్వదుఃఖములకు హాని ఏర్పడును. బుద్ధి సుస్థిరత చెందును. మనస్సు నిర్మలత్వము పొందును.

**వివరము :** బ్రహ్మయోగమున మనస్సు లోపలి గుణముల, బయటి ఇంద్రియముల

ధ్యాస లేకుండ పోయినపుడు ఆత్మదర్శనమగును. ఒక్కమారు ఆత్మదర్శనము కల్గిన వానికి తరువాత ఎన్ని దుఃఖములు తటస్థించినను వాడు వాటిని లెక్కచేయడు. ఆత్మానుభూతి ముందర ఏ దుఃఖము కనిపించదు. ఒక్కమారు ఆత్మదర్శనము కల్గిన వానికి మనస్సు కూడ మొదటివలె చలింపక నిలుచుటకు అనుకూలపడును, బుద్ధియు స్థిరపడును. ఇట్టి స్థితి పొందని మనిషికెలా ఉండుననిన క్రింద ఇలా చెప్పబడినది.

*(1) శ్లో॥ 66 : నాస్తి బుద్ధి రయుక్తస్య న చాయుక్తస్య భావనా ।*
*న చా భావయత శ్శాన్తి రశా న్తస్య కుత స్సుఖమ్ ॥*
*( బ్రహ్మయోగము)*

**భావము :** యోగిహీనునికి బుద్ధి నిలకడగ ఉండదు. దైవభావము అతనికి కలుగదు. దైవభావములేని వానికి శాంతిలేదు. శాంతిలేని వానికి సుఖముండదు.

**వివరము :** మనస్సు నిలకడలేని వానికి బుద్ధికూడ నిలకడగ ఉండదు. ఎందుకనగ మనస్సు అందించు విషయములను ఆలోచించవలసిన పని బుద్ధికున్నది. కనుక మనస్సు నిలకడకానంత వరకు బుద్ధి స్థిరపడదు. ఎల్లప్పుడు బయటి విషయములనే యోచించు బుద్ధికి దైవభావము ఏమాత్రము పట్టుబడదు. దైవభావము లేనివాడు రాజకీయవేత్తగాని, ఉన్నత ఉద్యోగి కాని, పెద్ద జమీందారుడుకాని వానికి అన్ని ఉండినప్పటికి మనోశాంతి ఉండదు. శాంతిలేనివాడు సుఖముల మధ్యవున్నను సుఖమేమిటో వానికి తెలియదు. లోపల ఏదో తీరని లోటుతో అసంతృప్తితో బాధపడుచుండును.

*(1) శ్లో ॥ 67 : ఇంద్రియాణాం హి చరతాంయన్మనోఽ నువిధీయతే।*
*తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావ మివాంభసి ॥*
*( ప్రకృతి)*

**భావము :** ఏ మనుష్యుని మనస్సు ఇంద్రియముల వెంట తిరుగుచుండునో వాని బుద్ధియు గాలి వలన నావ కదిలినట్లు చలించుచుండును.

**వివరము :** శరీరము ఒక యంత్రములాంటిది. యంత్రములలో ఒక భాగము నుండి ఇంకొక భాగమునకు అనుబంధమున్నట్లు, శరీర బయటి ఇంద్రియములైన జ్ఞానేంద్రియములకు లోపలి మనస్సుకు సంబంధమున్నది. మనస్సు బయటి జ్ఞానేంద్రియ విషయములను గ్రహించవచ్చును. లేక గ్రహించకుండ జారిపోవచ్చును. **మోటారుబండ్ల గేర్‌బాక్స్‌లోని సిస్టమ్‌వలె మనస్సున్నది.** ఇటు లోపలి విషయముల తోను సంబంధపడవచ్చును, అటు బయటి విషయములతోను సంబంధపడవచ్చును. ఎటూ కాకుండ ఊరకనువుండవచ్చును. మోటార్ బండ్లగేర్‌బాక్స్‌లోని 'మెయిన్‌రాడ్' ఇటు ముందుకు నడుచు చక్రముతోను, అటు వెనుకకు నడుచు చక్రముతోను సంబంధపడవచ్చును. ఎటూ లేక న్యూట్రల్‌గా ఏ చక్రముతోను సంబంధములేక ఉండవచ్చును. అలాగే మనస్సు ఇటు బయటకు అటు లోపలికి సంబంధము కల్గివున్నది. బయటి సంబంధము కల్గి బయటి విషయములను గ్రహించి వెంటనే లోపలి సంబంధముకల్గి లోపలి బుద్ధికి తెలియజేయుచున్నది. లోపలికి వచ్చిన విషయములను బుద్ధి యోచించడము దాని సహజ కర్తవ్యము. మనస్సు అందించు కొలది బుద్ధి యోచించవలసి ఉన్నది. కావున గాలి వలన పడవ కదిలినట్లు మనోవిషయముల వలన బుద్ధి కదలుచుండును. ఈ యంత్రాంగమంతయు సహజముగా ప్రకృతిలోని మానవునియందు జరుగుచుండును. మానవుడు ప్రయత్నించి బ్రహ్మయోగిగా మారవలెనంటే క్రింది శ్లోకము చూడుము.

*(1) శ్లో॥ 68 : తస్మాద్యస్య మహాబాహో! నిగృహీతాని సర్వశః ।*
*ఇంద్రియాణీంద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥*
*(బ్రహ్మ యోగము)*

**భావము :** ఎవడు ఇంద్రియముల యొక్క సర్వ విషయములను నిగ్రహించుచున్నాడో అట్టివాని ప్రజ్ఞ నిలకడగా నిలిచినదగును.

**వివరము :** ఎవని మనస్సు ఐదు జ్ఞానేంద్రియములైన కన్ను, ముక్కు, చెవి, నాలుక, చర్మముల యొక్క సర్వ విషయములను వీడి ఎటూ కాక నిలకడగాయుండునో,

అపుడు బయటి విషయములు చేరని దానివలన బుద్ధి ఏ గుణముతో యోచించక నిలిచిపోవును. అట్టి స్థితినే బ్రహ్మయోగమంటాము. బ్రహ్మయోగమును గురించి ఇంకనూ చెప్పడమేమనగా! క్రింది శ్లోకమున చూడుము.

*(1)శ్లో॥ 69 : యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ ।*
*యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః ॥*
*(బ్రహ్మయోగము, ప్రకృతి)*

**భావము :** సర్వ జీవరాసులకు రాత్రివలె నిద్రించు అజాగ్రత్త ఎందుగలదో అందే బ్రహ్మయోగి జాగ్రత్త కల్గియుండును. ఏదైతే బ్రహ్మయోగికి రాత్రివలె స్థంభించి ఉన్నదో అందే సర్వ జీవరాసులు జాగ్రత్తగానున్నవి.

**వివరము :** సర్వజీవరాసులు (మానవులందరు) ప్రపంచ విషయములలో ఉదయము నుండి లగ్నమై వారివారి ఉద్యోగములందునో, వారివారి వ్యాపారములందునో బహు జాగ్రత్తగా ఎచట ఏ నష్టము రాకూడదను భావముతో ఉండి, పూర్తి ఎరుకగ వారి కర్తవ్యములను నిర్వర్తించుచున్నారు. ప్రపంచ విషయములలో జాగ్రత్తగ ఉన్న ప్రజలు ఆత్మజ్ఞాన విషయములలో పూర్తి నిద్రావస్థయందుండిపోయారు. ఆత్మ విషయము చీకటితో నిండిన రాత్రివలె వారికి ఉన్నది. ఆత్మజ్ఞానమంటే ఏమిటో అర్థముకాని అంధకారములో వారు నిలిచిపోయారు. మామూలు ప్రజలు ఆ విధముగా ఉండగ, ఆత్మదర్శనము కోరు బ్రహ్మయోగులు మాత్రము ప్రజలు ఏ ఆత్మ విషయములలో అజాగ్రత్త కలిగి అంధకారములో ఉన్నారో, ఆ ఆత్మ విషయములలో పూర్తి ఎరుకకల్గి ఆత్మజ్ఞానము గ్రహించుటలో జాగ్రత్త కల్గియున్నారు. ఆ విధముగనే సర్వులు ఏ ప్రపంచ విషయములలో శ్రద్ధకల్గి జాగ్రత్తగా వర్థిస్తున్నారో, ఆ ప్రపంచ విషయములలో బ్రహ్మయోగులు అజాగ్రత్త కలిగియున్నారు. అందువలన ఈ శ్లోకములో అజ్ఞానులకు చీకటైనది జ్ఞానులకు పగలుయని, అజ్ఞానులకు పగలైనది జ్ఞానులకు చీకటియని తెలియాలి.

1 ) శ్లో॥ 70 : ఆపూర్యమాణ మచలప్రతిష్ఠం సముద్రమాపః ప్రవిశన్తి యద్వత్ ।
తద్వత్కామాయం ప్రవిశన్తి సర్వే సశాన్తిమాప్నోతి న కామకామీ ॥
( బ్రహ్మయోగము)

**భావము :** నిండి నిబిడీకృతముగా ఉన్న సముద్రమునందు నదుల నీరు ఎంత చేరినప్పటికి పొంగిపోనట్లు, బ్రహ్మయోగనిష్ఠయందున్న వానికి ఎన్ని కోర్కెలున్నను వాటి ప్రభావమేమి లేకపోవును. బ్రహ్మయోగి కాక కోర్కెలు కోరువానికి ఎప్పటికి ఆత్మదర్శనము లభించదు, శాంతిరాదు.

**వివరము :** సముద్రము ఎప్పటికి ఒకే విస్తీర్ణము కలదియైయుంటు, తన లోనికి ఎన్ని నదీ ప్రవాహములు వచ్చి చేరుచున్ననూ ఏమాత్రము పొంగి పోవునది కాక మొదటివలె ఉంటున్నది. అట్లే బ్రహ్మయోగి అయినవాడు సముద్రముతో సమానముగా ఉన్నాడు. బ్రహ్మయోగమనబడు ఒకే పరిధిలోవుండు యోగికి బయటి నుండి ఎన్నో కోర్కెల సంబంధిత విషయములు జ్ఞానేంద్రియములనబడు ఐదు నదుల ద్వారా వచ్చినప్పటికి చలించకయుండును. అప్పుడు వాని మనస్సు ఆత్మయందు లగ్నమైనది గనుక ఆ విషయముల తాకిడి వానినేమి చేయలేక పోయినది. అట్లుకాక విషయ తాకిడికి మనస్సు చలించుచున్నదైతే వానికి లోపలి గుణములలో మొదటిదైన పెద్దదైన కామము (ఆశ) అనుగుణము తప్పక యోగభ్రష్ఠుని చేయును. కోర్కెలు గలవాడు, గుణములు పనిచేయువాడు ఆత్మను దర్శించలేడు. అందువలన బ్రహ్మయోగి ఎట్లుండవలయునంటే.

(1) శ్లో॥ 71: విహాయ కామాన్ యస్సర్వాన్ పుమాంశ్చరతి నిస్పృహః ।
నిర్మమో నిరహంకార స్స శాంతి మధిగచ్ఛతి ॥
( బ్రహ్మయోగము, కర్మయోగము)

**భావము :** సర్వ కోర్కెలను విడనాడి వాటి ధ్యాస ఏమాత్రము లేకుండు వాడును, అట్లే మోహమును, అహంకారమును లేనివాడును తప్పక శాంతి పొందును.

**వివరము :** ఈ శ్లోకము ఇటు బ్రహ్మయోగులకు, అటు కర్మయోగులకు ఇరువురకు చెప్పినదిగా తెలియవలయును. ఈ రెండు యోగములను గూర్చి ఈ అధ్యాయము నందు తెలియజేశారు. ***విషయధ్యాసలు లేక మనస్సును అణచివేయునది బ్రహ్మయోగమని, అట్లే విషయధ్యాసలు కల్గి కార్యాచరణ చేస్తు అహంకారమును అణచివేయునది కర్మయోగమని వివరింపబడినది.*** ఇప్పుడు ఈ శ్లోకమున ఎవని మనస్సు అన్ని కోర్కెలు విడనాడి వాటి ధ్యాసకు ఏమాత్రము పోకుండునో వానిని బ్రహ్మయోగియని, అట్లే అహంకారము ఎవనికి లేకుండునో వానిని కర్మయోగియని తెలియజేస్తూ వీటియందు ఏ యోగమాచరించిన వానికైనను మోక్షము పొందు అవకాశము కలదని తెలియబరచబడినది. ఇక ఈ అధ్యాయములో చివరిగా చెప్పునది ఏమనగా!

*(1)శ్లో॥ 72 : ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ! నైనాంప్రాప్య విముహ్యతి ।*
*స్థిత్వాఽస్యా మన్తకాలేపి బ్రహ్మ నిర్వాణ మృచ్ఛతి ॥*
*(బ్రహ్మయోగము, కర్మయోగము)*

**భావము :** ఇది దైవమును పొందుస్థితి. ఈ స్థితి పొందినవాడు నాది నావారు అను మోహమును పొందడు. ఈ స్థితి పొందిన వాడు మరణకాలమున మోక్షమును పొందును.

వివరము : ఇంత వరకు చెప్పిన రెండు యోగములు మూడవ పురుషుడైన పరమాత్మను పొందు మార్గములు. ఈ రెండు యోగములను ఆచరించిన వానికి నా అను మోహగుణము రాదు. ఈ యోగములు పూర్తి ఆచరించినవాడు మరణకాలమున శరీరమును వదలి ఏ జన్మపొందక పరమాత్మను చేరగల్గుచున్నాడు. ఇంతటితో భగవద్గీతయందు సాంఖ్యయోగమనబడు ఈ అధ్యాయము అయిపోయినది. ఈ అధ్యాయములో భగవంతుడు చెప్పిన శ్లోకములు మొత్తము 54 కాగా, అర్జునుడు అడిగిన శ్లోకము బ్రహ్మయోగమును గూర్చి అడిగినది కాగ, భగవంతుడు చెప్పిన శ్లోకములలో 13 జీవాత్మ సంబంధితమైనవి, ఆత్మ సంబంధిత మైనవి 2 శ్లోకములు, పరమాత్మ 4, ఆత్మ పరమాత్మ 1 శ్లోకమున్నవి. కర్మయోగమును గూర్చి ఉన్నవి 9

శ్లోకములు, బ్రహ్మయోగమును గూర్చినవి 13, అట్లే బ్రహ్మయోగము కర్మయోగము కలిపియున్నవి 4 శ్లోకములు. ప్రకృతిలోని సహజత్వాన్ని బోధించినవి 8 శ్లోకములు. బ్రహ్మయోగమును ప్రకృతిని కలిపి చెప్పినది ఒక శ్లోకము. మొత్తము ఈ అధ్యాయములో 55 శ్లోకములు. 7 శ్లోకములు కల్పితములైనవిగా కొట్టివేయబడగా మరియు 10 శ్లోకములు అర్జునుడు బాధపడినవిగా లెక్కించి, భగవంతుడు చెప్పినవి కానందున తీసివేయబడినవి.

**శ్లోకముల యొక్క వివరము పట్టిక ఇలా ఉన్నది.**

| | | | |
|---|---|---|---|
| 1) | జీవాత్మను గురించినవి | = | 12 |
| 2) | ఆత్మను గురించినవి | = | 2 |
| 3) | ఆత్మ పరమాత్మలను గురించినవి | = | 1 |
| 4) | పరమాత్మను గురించినవి | = | 4 |
| 5) | కర్మయోగమును గురించినవి | = | 9 |
| 6) | బ్రహ్మయోగమును గురించినవి | = | 14 |
| 7) | కర్మయోగము మరియు బ్రహ్మయోగము రెండు కలిసియున్నవి. | = | 4 |
| 8) | ప్రకృతిలోని మనుజుల గూర్చినవి | = | 7 |
| 9) | బ్రహ్మయోగము మరియు ప్రకృతి | = | 1 |
| 10) | ప్రకృతి మరియు పరమాత్మల గూర్చినది | = | 1 |
| | మొత్తము | = | 55 |
| | వ్రాయక వదలినవి | = | 10 |
| | కొట్టివేయబడిన కల్పిత శ్లోకములు | = | 7 |
| | సాంఖ్యయోగ శ్లోకములు మొత్తము | = | 72 |

భావము, వివరము మార్చి వ్రాసిన శ్లోకములు – 11,19,22,23,24,45,47

## రెండవ అధ్యాయము

# కర్మ యోగము

**అర్జునుడిట్లనియె :-**

*(2) శ్లో॥ 1: జ్యాయసీ చేత్కర్మణస్తే మతా బుద్ధిర్జనార్దన! ।*
*తత్కిం కర్మణి ఘోరేమాం నియోజయసి కేశవ ! ॥*
*(కర్మ, బ్రహ్మయోగములు)*

**భావము :** పాపపుణ్య కర్మలగు పనులు చేయుటకంటే బ్రహ్మయోగమే శ్రేష్ఠమైనదని నీ అభిప్రాయమైన, భయంకరమగు కర్మలు కలుగు పనులనే చేయమని నన్ను ఎందుకు నియమించుచున్నావు.

**వివరము :** సాంఖ్యయోగమను మొదటి అధ్యాయములో మొదట కర్మయోగమును గూర్చి చెప్పడము, తర్వాత చివరిలో బ్రహ్మయోగమును గురించి చెప్పడము జరిగినది. మొదట కర్మయోగమును విన్న అర్జునుడు తర్వాత విన్న బ్రహ్మయోగమే బాగున్నదని అనుకున్నాడు. శ్రీకృష్ణుడు పలానా యోగము మంచిదని గాని, గొప్పదని గాని, చెప్పకున్నప్పటికి అర్జునుడు తన భావములో పనులు చేయు యోగముకంటే పనులు చేయని యోగమే గొప్పదనుకొనుట వలన, ముఖ్యముగా శ్రీకృష్ణుడు చెప్పినంత వివరముగా కర్మయోగము అర్థము కాకపోవడము వలన, మరియు బ్రహ్మయోగమే బాగున్నదనుకొనుట వలన, ఏ పనులు చేయక ఊరకుండడమే మంచిదైనపుడు పాపము సంభవించు యుద్ధమును చేయుటకు నన్ను ఎందుకు నియమించావు అన్నాడు. అర్జునునికి కర్మయోగ విధానము అర్థము కాలేదనుటకు నిదర్శనముగా క్రింది శ్లోకము చెప్పబడియున్నది.

(2) శ్లో॥ 2 : వ్యామిశ్రేణేవ వాక్యేన బుద్ధిం మోహయసీవ మే ।
తదేకం వద నిశ్చిత్య యేన శ్రేయోఽహ మాప్నుయామ్॥
(కర్మ, బ్రహ్మయోగములు)

**భావము :** మిశ్రమవాక్యములను చెప్పి నా బుద్ధిని భ్రమింపచేయుటకంటే మోహగుణమందు చిక్కుకోకుండునట్లు ఏది చేయుట మంచిదో దానిని నిశ్చయించి చెప్పుము.

**వివరము :** మొదట కర్మయోగమును చెప్పి తర్వాత బ్రహ్మయోగమును చెప్పగ అర్జునునికి అర్థముకాలేదు. యోగ విషయములు మొదటిసారిగా వినడము వలన, కొంత బ్రహ్మయోగము అర్థమైనప్పటికి, కర్మయోగము అర్థము కాకపోయినది. ఇది ఒక అర్జునునికే కాదు. మొదట ఎవరికైన కర్మయోగము అర్థముకాదనియే చెప్పవచ్చును. ఇంకనూ యోచించి చూచిన ఎడల కర్మయోగమంటే ఏమిటో, దాని అసలు స్వరూపమేమిటో, భగవద్గీతను బోధించు వారికి కూడ పూర్తి అర్థముకాలేదు. వారు భగవద్గీతను వివరించి చెప్పినపుడు కర్మయోగమును గురించి అసలు విషయమును చెప్పలేకపోవుచున్నారు, వారు ఆచరించను లేకపోవు చున్నారు. ఇకపోతే బోధకులందరు బ్రహ్మయోగమును గురించి బాగా చెప్పగలుగు చున్నారు. మరియు చేతనైనంత ఆచరించుచున్నారు. బోధకులందరిని కదలించి చూడగ వారియందు కర్మయోగమునకు విరుద్ధమైన ధోరణి కనిపిస్తున్నది. కావున కర్మయోగము యొక్క అసలు సిద్ధాంతము చాలామందికి తెలియదనియే చెప్పవచ్చును.

నిత్యము ఆధ్యాత్మిక విషయములందే మునిగి తేలు వారికే అర్థముకాక, కర్మయోగమునకు విరుద్ధమైన పద్ధతిలో మంచి చెడు పనులను విభజన చేస్తున్నపుడు, కొన్ని పనులు వదలండి కొన్ని చేయండని చెప్పునప్పుడు, ఒక్కమారువిన్న అర్జునునికి అర్థమవడము కష్టమే కదా! అందువలననే అర్జునుడు అర్థముకాని స్థితిలో కర్మ బ్రహ్మయోగ విభజన వివరము తెలియక, శ్రీకృష్ణుడు చెప్పిన మాటలను మిశ్రమ వాక్యములన్నాడు. నీ యొక్క మిశ్రమవాక్యములు వినుట వలన నా బుద్ధికి ఏది

అర్థముకాక ముందు మాదిరి నాది నావారు అను మోహగుణములోనే చిక్కుకోగలను. అట్లు కాకుండ నేను ఏమి చేయవలెనో వివరించి చెప్పుము అన్నాడు.

అప్పుడు భగవంతుడైన శ్రీకృష్ణుడు ముఖ్యముగా రెండు యోగములను గురించి చెప్పి, అర్జునునికి ఏ యోగమవసరమో కూడ వివరించి చెప్పాడు. ***మానవుడు మెలుకువగా ఉండి చేయు ఏ కార్యమైన, కలవరింపైన, యుద్ధమైన, దైవభక్తియైన యోగమైయుండాలి.*** అర్జునుడు అప్పుడు చేయవలసినది, అతనికి అవసరమైనది రెండుగా విభజించిన యోగములలో కర్మయోగమే ముఖ్యము.

అందువలన కర్మయోగమునే గీతయందు అనేక విధములుగా అర్థమగునట్లు చెప్పాడు. భూమి మీద ఎవడైన యోగము లేక, యోగమంటే ఏమిటో తెలియక బ్రతుకువాడు ఎల్లప్పుడు వియోగముతోనే బ్రతుకుచున్నాడని తెలియుచున్నది. యోగమంటే కలయిక అని అర్థము, వియోగము అనగా విడిపోవడమని అర్థము. రాముడు సీతతో కలిసి అడవిలో ఉన్నప్పుడు రాజ్యసుఖములకు దూరముగా ఉన్నను బాధపడక సంతోషముగా ఉన్నాడు. సీత విడిపోయిన తర్వాత రాజ్యసుఖములున్నను తీరని వియోగ బాధను అనుభవించాడు. అలాగే మానవుడు దైవత్వమును విడిపోయినవాడై ప్రపంచములో ఎంతో ధనము, ఎంతో హోదా, ఎంతో పలుకుబడి ఉన్నప్పటికి, ఎన్నో సుఖములు ఉన్నప్పటికి ఏదో వెలితిగ అసంతృప్తితోనే బ్రతుకుచున్నాడు, దైవత్వముతో యోగములేని వియోగముకల్గి బ్రతుకు ఏ జీవునికైన అసంతృప్తి జీవితము తప్ప ఏమిలేదు. అందువలన భగవంతుడైన శ్రీకృష్ణుడు యోగమును గురించి అర్జునుని అడ్డుగా పెట్టుకొని సర్వులకు అర్థమగులాగున, మానవుడు ఈ హద్దులో ఉంటే యోగము, ఈ హద్దు దాటితే వియోగము పొందునని ఆ హద్దు ఏమిటో తెలిపాడు. ఆ మాటల హద్దునే **'గీత'** అంటున్నాము.

భగవంతుడు సాంఖ్యయోగమున సూచనగా చెప్పిన కర్మ, బ్రహ్మయోగము లను గూర్చి సమూలాగ్రముగా ఈ అధ్యాయము నుండి చెప్పను మొదలు పెట్టాడు. ఈ అధ్యాయములో భగవంతుడు చెప్పిన మొదటి శ్లోకమును క్రింద చూడుము.

**శ్రీ భగవంతుడిట్లనియె :-**

(2) శ్లో॥ 3 : లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయాఽనఘ! ।
జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్ ॥
(కర్మ, బ్రహ్మయోగములు)

**భావము :** మనుజులు ఆచరించుటకు రెండు రకములైన యోగనిష్టలు గలవని ముందే తెలిపియున్నాను. సాంఖ్యము తెలిసినవారు జ్ఞానయోగమును, కార్య వివరము తెలిసినవారు కర్మయోగమును ఆచరించగలరు

**వివరము :** పరమాత్మ, ఆత్మ, జీవాత్మ, శరీరము అనునవి వేరువేరుగా ఉన్నాయని తెలిసినవారు సాంఖ్యులు. వారు ఆత్మను అనుభవించితే చివరకు పరమాత్మను చేరవచ్చుననెడి మార్గము తెలిసినవారు. జీవాత్మ, ఆత్మ యొక్క సుఖమును పొందాలంటే శరీరపనులన్ని స్తంభింపచేసి లోపలయున్న మనస్సు ద్వార ఆత్మను అనుభవించ వలెను. సాంఖ్యము తెలిసినవారు ప్రతిది మనస్సు ద్వారానే అనుభవిస్తున్నామని తెలిసినవారై, ఆ మనస్సును బయటి సుఖముల నుండి వదలింపజేతురు. ఆత్మ, జీవాత్మల భేదము తెలిసిన సాంఖ్యులు మనస్సు ద్వారా ఆత్మ సుఖమును అనుభవింతురు. అందువలన సాంఖ్యయోగులు మనస్సును స్వాధీనపరచుకొని, శరీరమును స్తంభింప చేసి, బయటి విషయముల నుండి మనస్సును మళ్ళించు సాధన కల్గియుందురు. ఆ సాధననే **'జ్ఞానయోగము లేక బ్రహ్మయోగము'** అని అంటాము. మనస్సు ఆత్మ మీద లగ్నమై ఉండడమే జ్ఞానయోగమని తెలియాలి.

కర్మయోగము తెలిసిన వారెవరనగా శరీర యంత్రాంగమంతయు తెలిసిన వారై కర్మవలన గుణములు, గుణముల వలన యోచనలు, యోచనల వలన కార్యములు, కార్యముల వలన కర్మ కలుగునని తెలిసి మరియు కార్యములు జరుగుచున్నను కర్మ కలుగకుండునట్లు చేయువానిని కర్మయోగము తెలిసిన వాడంటాము. కార్యముల వలన కర్మ కలుగకుండునట్లు చేయు పద్ధతినే **'కర్మయోగము లేక రాజయోగము'** అంటాము. కర్మయోగము ఆచరించువాడు

శరీరమును కార్యములకు వదలి, శరీరము ద్వారా పనులు చేయుచు పనుల వలన కలుగు పాపపుణ్యకర్మను జ్ఞానాగ్ని ద్వారా కాల్చివేయుచుండును. కర్మను కాల్చు అగ్నిపేరు జ్ఞానాగ్ని అంటాము. **'జ్ఞానాగ్ని'** కలిగి కర్మకాలిపోవాలంటే శరీర యంత్రాంగములోని **'అహము'** యొక్క పనిని అణచివేయాలి. కార్యము జరుగు చున్నప్పుడు అహము మీద లగ్నమైయుండడమే కర్మయోగము అంటాము.

**బ్రహ్మయోగము :-** జీవాత్మ మనస్సుతో లగ్నమైయుండడమే బ్రహ్మయోగము లేక జ్ఞానయోగము. మనస్సు బయటి విషయముల మీదికి పోకుండ బుద్ధి మనస్సును బంధన చేయును. బయటి విషయధ్యాస ఎప్పుడైతే లేకుండపోవునో అపుడు మనస్సునకు ఆత్మధ్యాస కల్గును. అప్పుడే ఆత్మసుఖము మనస్సు ద్వారా జీవాత్మ తెలియుచున్నాడు. బ్రహ్మయోగమున ముఖ్యమైన పాత్ర మనస్సుది. ఎవని మనస్సు జీవాత్మతో ఏకీభవించియున్నదో వాడు బ్రహ్మయోగి, ఎవని మనస్సు ఆత్మ అనుభూతిని జీవాత్మకు అందజేయుచున్నదో వాడే బ్రహ్మయోగి, ఎప్పుడైతే జీవాత్మ మనస్సు ఏకమైవుండి బ్రహ్మయోగమైనదో అపుడే యోగికి తెలియకనే **'జ్ఞానాగ్ని'** వానియందు ప్రజ్వరిల్లుచున్నది. ఆ జ్ఞానాగ్ని వానియందుగల సంచిత కర్మను కాల్చివేయుచున్నది. మనస్సు బయటి విషయముల మీద లగ్నమైనపుడు జీవాత్మ మనస్సుతోనే లగ్నమై బయటి విషయములను అనుభవిస్తున్నది కదా! అది కూడ యోగమే కదాయని కొందరికి ప్రశ్నరావచ్చును. దానికి మా జవాబు జీవాత్మ మనస్సుతోనే లగ్నమై బయటి విషయములను అనుభవించడమును కూడ యోగమే. అయితే అది జ్యోతిష్య శాస్త్రములో చెప్పు యోగములగును. జ్యోతిష్యశాస్త్రములో చెప్పు యోగములు అనేక పేర్లు కలిగివున్నవని తెలియాలి. ఉదాహరణకు బుధార్కయోగము, గజకేసరి యోగము, చంద్రమంగళయోగము మొదలగునవి ఎన్నో కలవు. ఆ యోగము లన్నియు బయటి విషయసుఖములకు సంబంధించినవై ఉన్నవి. బయటి విషయయోగములు జ్యోతిష్యశాస్త్రమునకు సంబంధించినవి. లోపలి విషయ యోగములు యోగశాస్త్రమునకు సంబంధించినవి. బయటి యోగములు జ్ఞానాగ్ని నిర్మిత యోగములు కావు. కావున యోగశాస్త్రములో ఆధ్యాత్మిక విషయమును

కేవలము లోపలికలయికనే యోగమంటాము. అందులో మనస్సుతో జీవాత్మను కలిపి బయటి విషయముల నుండి మళ్ళించడమును బ్రహ్మయోగము అంటున్నాము. ఈ యోగమందు బాహ్య స్పర్శాదులందు మనస్సుకు సంబంధములేదు. జీవుడు బయటి సుఖములను అనుభవించడు.

**కర్మయోగము :-** జీవాత్మ అహంకారముతో లగ్నమైయుండడమే కర్మయోగము లేక రాజయోగము అంటాము. కర్మయోగమున అహము బయటి పనుల మీదికి పోకుండ బుద్ధి అహమును బంధన చేయును. బయటి కార్య ధ్యాస అహమునకు ఎప్పుడు లేకుండా పోవునో అపుడు బుద్ధి అహమును అణచివుంచి ఉండును. అప్పుడే కార్యములు తాను చేయలేదని, కర్మరీత్యా కార్యములు రూపుదాల్చుచున్నవని, జీవాత్మ తెలియుచున్నాడు. కర్మయోగమున ముఖ్యపాత్ర అహము వహించుచున్నది. ఎవని అహము కర్మను జీవాత్మకు చేర్చలేక పోవుచున్నదో వాడే కర్మయోగి. ఎప్పుడైతే జీవాత్మ బయటి ధ్యాసలేని అహముతో కలిసి కర్మయోగమైనదో అపుడే కర్మయోగికి తెలియకనే 'జ్ఞానాగ్ని' ప్రజ్వరిల్లి అప్పుడు జరుగుచున్న కార్యములందు పుట్టుకొచ్చిన కర్మను (ఆగామికర్మను) కాల్చివేయుచున్నది. కర్మయోగమున యోగి అన్ని పనులు చేయుచు అజ్ఞానివలె కనిపించును. లోపల అహమును అణచి బయటి కార్య సంబంధము లేకుండా చేయడమే యోగము. కావున కర్మయోగమును బయటికి ఎవరూ గుర్తించలేరు.

ఈ విధమైన రెండు యోగములే పరమాత్మయందు ఐక్యమగుటకు ముఖ్య మార్గములై ఉన్నాయి. పరమాత్మయందు చేరుటకు కర్మ ఏమాత్రము లేకుండా పోవాలి. కర్మశేషమున్నంత వరకు లభించని పరమపదము, కర్మశేషము లేకుండా అయిపోయినపుడే లభించును. అందువలన భగవంతుడు జ్ఞానాగ్ని తయారగు రెండు యోగములు మనకు బోధించాడు. ఒక యోగములో సంచితకర్మ మరియొక యోగములో ఆగామికర్మ పోవునట్లు యోగములను నిర్మించాడు. పుట్టినప్పటినుండి చనిపోవు వరకు క్రొత్తగా వచ్చు కర్మను ఆగామికర్మ అంటాము. అమలుకు వచ్చిన

కర్మ ప్రారబ్ధము కాగా, మిగిలిన నిలువను సంచితకర్మ అంటాము. బ్రహ్మయోగమున సంచితకర్మ క్రమముగ జ్ఞానాగ్నిచే కాలిపోవుచుండును. కర్మయోగమున ఆగామికకర్మ కాలిపోవుచుండును. ప్రారబ్ధకర్మ కాలిపోవుట ఏ యోగములో లేదు. ఒక యోగికి తనయందు రగిలిన జ్ఞానాగ్ని కర్మను నాశనము చేయగా మిగిలిన అగ్ని తన శిరో భాగమున నిలువయుండును. అట్టి నిలువ అగ్నిని ఒక యోగి ఇంకొకనికి దానము చేసిన అది కేవలము ప్రారబ్ధము మీదికే పోయి కాల్చివేయును. ఈ విధానము తప్ప ప్రారబ్ధము కాలిపోవుటకు ఏ యోగములేదని తెలియాలి.

ఉన్నవి కర్మయోగము, బ్రహ్మయోగములను రెండే పద్ధతులు. కనుక పై శ్లోకమున **'ద్వివిధా నిష్ఠా'** అని భగవంతుడు మొదటనే చెప్పాడు. ఆ రెండు నిష్ఠల పేర్లు స్పష్టముగా చెప్పుచు **'జ్ఞాన యోగేన' 'కర్మయోగేన'** అన్నాడు. ఇక క్రింది శ్లోకములలో ఈ రెండు యోగములను గూర్చి ఏమి చెప్పుచున్నాడో చూద్దాము.

(2) శ్లో॥ 4 : న కర్మణా మనారమ్భాన్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే ।
న చ సన్న్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి ॥

(ప్రకృతి)

**భావము :** కర్మ ప్రారంభింపనంత మాత్రమున మరియు చేయుచుండు కర్మలను వదులుట వలనను మోక్షము లభించదు.

**వివరము :** కర్మలను ప్రారంభించుట అనగా పాపపుణ్యములను కార్యరూపముగా చేయుటకు ఉపక్రమించుట అని అర్థము. అట్లే చేయు కర్మలను వదులుటనిన కర్మ కార్యరూపమై మానవుని ఎడల జరుగుచున్నప్పుడు వదులుటయని తెలియవలయును. కార్యములన్నియు పాపపుణ్య మిశ్రితములని తెలిసి వీటిని చేయుట వలన పాపమొచ్చునని, చేయకుండుట వలన పాపమురాదు కదా! అని ఆ పనులను చేయకుండినను, మరియు పనులు చేస్తు ఈ పనులు చేయుచుండుట వలన పాపమొచ్చుచున్నదని తెలిసి, అలా కర్మరాకుండుటకు ఆ పనులను వదలివేయుట మంచిదని తలచు వారిని తెలియని వారేనని చెప్పవచ్చును.

ఎందుకనగా! పనులు చేయనంత మాత్రమున, చేస్తున్న పనులు వదలుకొన్నంత మాత్రమున మోక్షము లభించదు. ఉదాహరణకు పెళ్ళి చేసుకొనుట వలన అనేక కర్మలు వచ్చునని పెళ్ళి మానుకొనువారు కొందరు, మరియు వివాహము జరిగి కొంత కాలము భార్యతో కాపురము చేసిన తర్వాత ఈ సంసారము చేయుట వలన కర్మలు కలుగుచున్నవని, కర్మలు కలుగకుండుటకు భార్యను కాపురమును వదలివేయవలెనని తలచి వదలివేయువారు కొందరు ఉన్నారు.

ఆ విధముగా కొందరు పనులు చేయకుందురు. మరియు ఒకవేళ చేయుచుండిన జ్ఞానమనుకొని ఎందరో పెళ్ళి చేసుకొనక బ్రహ్మచారులుగా నిలచిపోయినవారు ఉన్నారు. అట్టివారిని గొప్ప జ్ఞానులుగా దైవజ్ఞులుగా చాలా మంది భావిస్తుండడము తెలిసిన విషయమే. కాని భగవద్గీతలోని భగవంతుడు దానివలన మోక్షము లభించదంటున్నాడంటే అది సరియైన పద్ధతి జ్ఞానముకాదనియే తెలియుచున్నది. ఇంకను ఎందరో భార్యాబిడ్డలతో కాపురము చేస్తూ పెళ్ళిలేని బ్రహ్మచారులను చూచి, వారు కర్మ అంటని స్థితిలో మంచి జ్ఞానములో ఉన్నారని తలచి, అట్టివారి మార్గమునే అనుసరిస్తే కర్మలు కలుగవని, దానికంటే మించిన జ్ఞానములేదని తలచి, చిన్నగా భార్యాబిడ్డలను వదలి సన్న్యాసమును పుచ్చుకొన్న వారిని కూడ చూస్తున్నాము. అట్లు సన్న్యసించుట వలనను సిద్ధి లభించదు అన్న దేవుని వాక్యము ప్రకారము అదియును సరియైన పద్ధతికాదని తెలియుచున్నది. దీనిని బట్టి ఒక వివాహమే కాదు సర్వకార్యముల ఎడల కర్మమొచ్చునని చేయక పోవడము, చేస్తున్నది వదలుకోవడము పద్ధతి కాదన్నది జ్ఞానసూత్రమని తెలియాలి. ఎందుకనగా! క్రింది శ్లోకమును చూడుము.

*(2) శ్లో ॥ 5 : నహికశ్చిత్ క్షణ మపి జాతుతిష్ఠత్యకర్మకృత్ ।*
*కార్యతే హ్యావశః కర్మ సర్వః ప్రకృతి జైర్గుణైః ॥*
*(ప్రకృతి)*

**భావము :** ఎవ్వడుగాని ఎట్టి కర్మ ఆచరింపక ఒక్క క్షణమైన ఊరకయుండలేడు.

ప్రకృతి జనితములైన గుణములకు చిక్కినవారై, కర్మముల వశులై పనులు చేయుచుందురు.

**వివరము :** ప్రకృతిచే పుట్టినవి గుణములు. అవి సజీవముగావున్న అందరి శరీరములలో ఒకే విధముగా ఉన్నవి. ఆ గుణముల మధ్యనే జీవాత్మ నివాసము చేస్తున్నాడు. మూడు రకముల గుణ భాగములలో ఏదో ఒక భాగమున నివసిస్తూ ఆ భాగములోని గుణములందు బద్ధుడైవున్నాడు. గుణముల వలననే యోచనలు, యోచనల వలననే కార్యములు అను వరుస ప్రకారము జరుగుచున్నవి. ఏ కార్యము జరుగుటకు, ఏ గుణము పనిచేయవలెనో, ఆ గుణమును ప్రారబ్ధకర్మ ప్రేరేపించి చివరకు పనిని చేయించుచున్నది. ప్రతి జీవుడు శరీరములో కర్మ వశమున గుణములందు బంధింపబడి, కర్మ ప్రేరణ ప్రకారము కార్యములు చేయుచున్నాడు. ప్రారబ్ధకర్మ గుణమై, గుణము యోచనై, యోచన కార్యమై పోవుచున్నది. ఇది అనివార్య కార్యము.

ప్రతి మానవుడు మెలుకువలో ఉన్న ప్రతిక్షణము ఏదో ఒక ప్రారబ్ధకర్మ జరుగుచునే ఉన్నది. ఏదో ఒక యోచన మెదలుచునే ఉన్నది. **ప్రతి క్షణము కర్మననుసరించి యోచనలు రాని మానవుడు భూమి మీద లేడనియే చెప్పవచ్చును.** వచ్చిన యోచనలన్ని కార్యరూపము కావు. ఏవి కార్యరూపము కావలెనో అవియే కార్యరూపమైపోవును. మిగిలినవి యోచనల వరకే ఉండును. ఎటు తిరిగి ఏ క్షణము ప్రారబ్ధములేనిది ఉండదు. ప్రతిక్షణము ప్రారబ్ధకర్మ ఆడిస్తూనే ఉన్నది.

మానవుని నిర్ణయము ప్రకారము ఏ కార్యములు జరుగవు. జరుగు పనులన్నియు ప్రారబ్ధము ప్రకారమే జరుగును. అందువలననే **మనిషి ఒకటనుకొంటే జరుగునది వేరొకటి ఉండును.** బ్రహ్మచర్యము ఆచరించి ఆడవారి ఎడల జాగ్రత్తగా ఉండవలెనను వారు కూడ, స్వప్నావస్థయందైన తమ బ్రహ్మచర్యమును వదలి వేయడమో, లేక మెలుకువలో ఏదో ఒక సమయమున తమ నిష్ఠను కోల్పోవడమో జరుగుచున్నది. కొందరు పెళ్ళి చేసుకొని భార్యతో కాపురము చేయవలెననుకొన్నను

జీవితములో పెళ్లియే కాకపోవడము గమనించగలరు. అవన్నియు పరిశీలించి చూచిన ఎవరు స్వతంత్రులై వారి ఇష్టప్రకారము ఉండలేరని, అందరు స్వతంత్రము లేనివారై కర్మచేతిలో ఆడింపబడుచున్నారని తెలియుచున్నది. ప్రతిఒక్కరు ప్రతిఒక్క సమయమున కర్మతంత్రులై ఏదో ఒక పని చేయుచున్నారు.

*(2) శ్లో॥ 6 : కర్మేంద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్ ।*
*ఇంద్రియార్థాన్ విమూఢాత్మా మిథ్యాచారస్స ఉచ్యతే ॥*
*(బ్రహ్మ యోగము, జీవాత్మ)*

**భావము :** కర్మేంద్రియముల పనులను నిగ్రహించి, జ్ఞానేంద్రియముల యొక్క విషయములను స్మరించు వానిని మూఢాత్ముడందురు.

**వివరము :** మనస్సు యొక్క ఆదేశానుసారము పనులు మాత్రము చేయు కర్మేంద్రియములనబడు కార్యేంద్రియములైన కాళ్లు, చేతులు, నోరు మరియు గుప్తముగా ఉన్న రెండు మొత్తము ఐదింటిని కదలకుండునట్లు చేసి, గొప్ప బ్రహ్మయోగమాచరించు వానివలె పైకి కనిపిస్తు, లోపల మనస్సునందు జ్ఞానేంద్రియములైన కన్ను, ముక్కు, చెవి, నాలుక, చర్మము యొక్క విషయములను జ్ఞప్తికి తెచ్చుకొని, వాటిని యోచిస్తూ కూర్చుండు వాని సాధన యోగసాధన అనబడదు. పై ఇంద్రియములు నిగ్రహించినప్పటికి లోపలి విషయములు యోచించు వాని ఆచారమును మూఢాచారము అందురు.

**ఉదాహరణకు :** ఒక వ్యక్తి యోగము చేయుచున్నాననుకొని ఒక మంత్రమును మనస్సునందు ఉచ్చరించుచు కదలక కూర్చున్నాడనుకొందాము. అతని బయటి ఇంద్రియములు పనిచేయకున్నను లోపలి మనస్సుకు జ్ఞానేంద్రియమైన చెవి విన్న విషయము జ్ఞప్తిగ స్మరించుచున్నాడు. కావున అతని ఆచారము సరియైనది కాదని, అట్టివానిని అజ్ఞాని లేక మూఢాత్ముడని భగవంతుడు తెల్పుచున్నాడు. అట్లు కదలక కూర్చొని మేము ప్రపంచ విషయములను స్మరించలేదు కదా! దైవసంబంధమైన మంత్రమునో నామమునో ఉచ్ఛరించుచున్నాము కదా! ప్రపంచ సంబంధ విషయమైతే

మంచిది కాకపోవచ్చు. అలాకాక మంత్రమును స్మరించుట కూడ మంచిది కాదా! అను సందేహము కొందరికి రావచ్చును. దానికి జవాబు ఏమనగా! మంత్రమును స్మరించునపుడు మాది సరైన ఆచరణని అనుకొని పొరపడుటకు అవకాశమున్నది, కావున భగవంతుడు ఈ విషయమును ప్రత్యేకించి ఇచ్చుట చెప్పవలసి వచ్చినది. ఇంద్రియార్థ విషయములన్నపుడు మనము మనస్సునందు స్మరించు మంత్రము కూడ ఒక రోజు చెవి యొక్క వినికిడి ద్వార మనస్సుకు చేరినదనియే చెప్పవచ్చును. అందువలన అది దైవసంబంధ మంత్రమైన లేక ప్రపంచ విషయమైన దానిని చెవి ద్వారా వచ్చిన విషయమేనని చెప్పవచ్చును. ఆ విధముగ ఇంద్రియముల ద్వార వచ్చిన విషయములు ఏవైన ఇంద్రియార్థ విషయాలే అవును. బ్రహ్మయోగ మనునది ఏ ఇంద్రియ విషయమునకు సంబంధములేనిది. కావున కదలక కూర్చొని ఏ విషయమును స్మరించిన అది సరియైన ఆచరణకాదని, దానిని బ్రహ్మయోగమనరని తెల్పుచు కదలక మనస్సునందు దైవమంత్రమును స్మరించుటకంటే కదలుచు ప్రపంచ విషయములు ఆచరించు కర్మయోగము మంచిదని క్రింది శ్లోకమున చెప్పుచున్నాడు.

*(2)శ్లో॥ 7 : యస్త్వింద్రియాణి మనసా నియమ్యారభ తేఽర్జున ।*
*కర్మేంద్రియైః కర్మయోగ మసక్తస్స విశిష్యతే ॥*
*(కర్మ యోగము)*

**భావము :** ఎవడు జ్ఞానేంద్రియములచే మనస్సును నియమించి, కర్మేంద్రియముల చేత పని చేయుచున్నాడో, వానిని కర్మయోగి అందురు. అట్టివాడు అందరికంటే ఉత్తముడు.

**వివరము :** ప్రపంచములో ఏ పని జరగాలన్నా జ్ఞానేంద్రియములు మరియు కర్మేంద్రియముల యొక్క ప్రమేయము తప్పనిసరిగ ఉండవలసిందే. ఉదాహరణకు ఒక రేడియో మెకానిక్ రేడియోను రిపేరు చేయాలనుకొనుము. అపుడు కేవలము కర్మేంద్రియములైన చేతులొక్కటే కాక జ్ఞానేంద్రియములైన కన్నులు కూడ ముఖ్యపాత్ర

వహిస్తున్నవి. జ్ఞానేంద్రియములు కదలకున్నవి, కర్మేంద్రియములు కదలి పని చేయుచున్నవి. అందువలన ఒక పని జరగాలంటే కర్మేంద్రియములు ప్రత్యక్షముగ జ్ఞానేంద్రియములు పరోక్షముగ అవసరము.

ఒక కార్యమందు జ్ఞాన కర్మేంద్రియములకంటే ముఖ్యపాత్ర వహించునది అంతరంగముననున్న మనస్సు. లోపలయున్న మనస్సు యొక్క విధానమును బట్టి చేయుచున్నపని కర్మయోగమైతే పాపపుణ్యమను కర్మ ఏమాత్రము పని చేయుచున్న వానికి అంటదు. కర్మయోగము కాకపోతే ప్రస్తుత పనిలోని పాపము లేక పుణ్యములు తప్పక చేయువానికంటును.

పై శ్లోకమున భగవంతుడు జ్ఞానేంద్రియముల చేత మనస్సును నియమించి కర్మేంద్రియముల చేత కర్మయోగమాచరించువాడు విశిష్టత కల్గినవాడని చెప్పాడు. ప్రతి మనిషి ప్రతి దినము ఏదో ఒక పని చేయుచున్నపుడు ఎవరిది యోగముగ, ఎవరిది భోగముగ మారుచున్నదని తెలియాలంటే అది సాధ్యముకాని పని. ఎందుకనగ కర్మయోగము అంతర్గత మనస్సుకు సంబంధించిన విషయము, ఎదుటి వాని మనస్సు కనిపించదు. కావున ఎదుటి వానిని గుర్తించుట కష్టము. తనకు తాను ఆచరించు వానికి మాత్రము తనది కర్మయోగమైనది లేనిది తెలియవచ్చును. ఇప్పుడు ఉదాహరణకు ఒక పనిని వివరించుకొందాము. ఒక మెకానిక్ రేడియోను రిపేరు చేయుచున్నపుడు కంటితో చూస్తు చేతితో చేస్తు ఉన్నాడు. ఆ సమయములో ఆ మెకానిక్ మనస్సుతో తను చేయుచున్నపని యొక్క ఫలితము మీద యోచించిన మరియు నేను ఈ పనిని చేయుచున్నాను, ఇది మెకానిక్ పని, నేను మెకానిక్‌ను, ఇతరులకు చేతగాని దానిని సహితము నేను చేయగలను, నేను నైపుణ్యుడను అను మొదలగు అహము యొక్క యోచనలు వచ్చిన ఎడల వానికి ఆ పనియందు గల పాపపుణ్యములు ఏవి గలవో అవి వచ్చి చేరును. అట్లుకాక పని చేయుచున్నవాడు నేను అను అహము యొక్క ధ్యాస లేకుండా, ఆ పనిమీదనే ధ్యాసనుంచి చేసిన వానికి ఏ కర్మ అంటదు. అట్టి దానినే కర్మయోగమందుము.

నేడు ఒక చిన్న ఉద్యోగము చేయువాడు సహితము నేను పలానవాడనను అహంకారముతో చేయుచున్నాడు. ఒక మనిషికి పోలీసు డిపార్టుమెంటులో జవాన్ పని వస్తే, నేను పోలీసునను అహమును తన శరీరమంత నింపుకొని, నేనొక మనిషిని అన్నమాట మరచి పోతున్నాడు. అట్లే పై అధికారులైతే నేను పలానయని భావించుకొనుచున్నారు. ఎవడూ తాను వేరు తన వృత్తి వేరు అనుకోవడములేదు. వృత్తిని బట్టి నేను గొప్పయని సాటి మనిషికంటే గొప్పగా తలచినపుడు అతను చేయుచున్నపని అహంకారము నిండినదౌతున్నది. కావున అట్టి పనులన్నియు కర్మయుక్తములేకాని కర్మయోగములు కావు. కర్మయోగమునకు ముఖ్యముగ అహంకారము ఉండకూడదనుట సిద్ధాంతము.

ఇపుడు ఒక వ్యక్తికి అనుమానము రావచ్చును అది ఏమనగా! నేను చేయు ఉద్యోగము ఇతరులను దండించి శిక్షించునదని, ఇతరులను కొట్టునప్పుడు పాపమొచ్చుట నిజము, కర్మయోగ జ్ఞానమంటే నాకు తెలియనపుడు, నేను చేయునది అంతా పాపమైనపుడు, ఆ పని చేయుటకంటే వేరే పని చేయుట మేలు కదా! ఈ ఉద్యోగమునకు రాజీనామా ఇచ్చి వేరు పని చేసుకుంటాననుకోవచ్చును. ఇట్లు ఎందరికో వారుచేయుచున్న పనుల మీద వారికి ఏహ్యాభావము కల్గి ఈ పని మానివేయుదమనుకోవచ్చును. దానికన్నిటికి భగవంతుడు క్రింది శ్లోకమున సమాధానమిస్తున్నాడు చూడండి.

(2) శ్లో॥ 8 : నియతం కురు కర్మ త్వం కర్మ జ్యాయో హ్యకర్మణః ।
శరీర యాత్రాపి చ తే న ప్రసిద్ధ్యే దకర్మణః ॥
(బ్రహ్మయోగము)

**భావము :** నీవు చేయు నియమిత పనులను వదులుకొనుటకంటే ఆచరించుట మేలు, చేయు పనులను వదలి దేహయాత్రను చేయలేవు.

**వివరము :** మనిషి జీవితములో ఒక్కొక్కరు ఒక్కో విధమైన పనులు చేయుచుందురు. ఒకడు బస్ కండక్టర్ పనిచేసి బ్రతికితే, ఒకడు బస్‌ను నడిపి బ్రతుకుచుండును.

అట్లే ఒకడు పోలీస్ పని చేసి బ్రతుకుతుంటే, మరియొకడు దొంగతనము చేసి బ్రతుకుచుండును. ఒకడు రైతు పని చేస్తే, మరియొకడు రాజకీయముతో బ్రతుకుచుండును. ఒకడు గుడ్డలునేసి బ్రతుకుచుంటే, మరియొకడు గుడ్డలుతికి బ్రతుకుచున్నాడు. ఒకడు నాటకమాడి బ్రతుకుతుంటే, మరొకడు ఆడించి బ్రతుకుచున్నాడు. ఇట్లు ఏదో ఒక పనిచేసి దానివలన వచ్చిన డబ్బుతో ఆకలికి కావలసిన ఆహారమును సమకూర్చుకొనుచున్నారు. ఎవరు ఏమి చేసిన కోటి విద్యలు కూటికొరకేనన్నది నగ్నసత్యము. ఆరోగ్యముగ ఉండుటకు శరీరమునకు కావలసిన ఆహారమునిచ్చి పోషించడమును శరీరయాత్రను సాగించినట్లని తెలియుము.

శరీరయాత్ర సాగించుటకు మానవుడు ఎన్నో లెక్కలేనన్ని పనులు చేయుట మనకు తెలిసినదే. ఆ విధముగ ఎందరికో ఎన్నో విధములైన పనులు వారి కర్మానుసారముగ నియమితమై ఉన్నవి. ఆలోచించి చూచిన కొందరి పనులు మంచివై పుణ్యమును సంపాదించి పెట్టునవై ఉన్నవి. కొందరివి చెడు పనులై పాపమును సంపాదించి పెట్టునవై ఉన్నవి. అవి ఏవైనను వారికి నియతకర్మ వలన జరుగు కార్యములు. అనగా వారివారి ప్రారబ్ధానుసారముగ ఉన్న పనులని తెలియవలయును. ఈ జన్మలో ఏ పనులు చేయవలెనో వెనుకటి జన్మల కర్మ ప్రకారము నియమింపబడి ఉండును. కావున ప్రారబ్ధానుగుణముగ ఉన్న కర్మను నియతకర్మ అంటున్నాము.

బ్రహ్మయోగమాచరించవలెనని ప్రారబ్ధము ప్రకారము నడుచుకోక, చేయు పనులను వదలి సాధనకు కూర్చుంటే, శరీరమునకు కావలసిన ఆహారమును సమకూర్చలేరు, శరీరయాత్ర జరగదు. శరీరపోషణ చేయువారు వేరుగ ఉండిన వారు బ్రహ్మయోగము చేయబూనిన పరవాలేదు. కాని శరీరపోషణ నిమిత్తము పనులు చేయువారికి బ్రహ్మయోగ సాధన కుదరదు. గట్టిగ కూర్చుంటే వాని శరీర పోషణ జరగదు. కావున శరీరయాత్ర కొరకు నియమింపబడిన కార్యములు చేయువారందరికి తగిన విధముగ క్రింది శ్లోకము చెప్పబడినది.

2) శ్లో॥ 9: యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబంధనః ।
తదర్థం కర్మ కౌంతేయ! ముక్త సంగస్సమాచర ॥
(కర్మయోగము)

**భావము :** యజ్ఞ సంబంధము లేకుండ కర్మలు ఆచరించుట వలన మానవులకు తిరిగి కర్మబంధనములు కలుగుచుండును. కనుక అర్జునా! కర్మలయందు బంధింపబడక కార్యములు చేయుము.

**వివరము :** ఇది కర్మయోగములో అత్యంత కీలకమైన శ్లోకము. ఇక్కడ "యజ్ఞార్థ " అన్న క్రొత్తపదము వచ్చినది. యజ్ఞము అన్న పదమునకు అర్థము ముఖ్యముగ తెలియవలసి ఉన్నది. యజ్ఞము అను పదము అందరికి చాలా సుపరిచితమైనప్పటికి, యజ్ఞమంటే అందరికి తెలిసినదే కదా! అనుకొన్నప్పటికి, పరమాత్మ భావము ప్రకారము ఇంతవరకు ఆ పదభావమునకు మనము దూరముగ ఉన్నామనియే చెప్పవచ్చును. ఎందుకనగా! ఒక చోట అగ్నిగుండము కావించి అందులో కొన్ని సమిధలను కాల్చివేయడమును యజ్ఞమని అందరము అనుకొంటున్నాము. అది కేవలము యజ్ఞమునకు గుర్తుకాని, వాస్తవయజ్ఞముకాదని తెలియాలి. యజ్ఞము యొక్క విషయము తెలియుటకు కృతయుగము మొదటి కాలములోనికి వెళ్లెదము.

కృతయుగములో మనుషుల మధ్య నివాసముండుటకు ఇష్టపడని గురువులు అందరు అరణ్యములో నివాసముండెడివారు. ఆ యుగములో గురువులకు గొప్ప గుర్తింపు ఉండెడిది. రాజులు సహితము గురువుల వద్దకే పోయి ఆత్మజ్ఞానము తెలుసుకొనెడివారు. ఆ పద్ధతి ప్రకారమే ఒక గొప్పరాజు గురువు దగ్గరికిపోయి జ్ఞానాసక్తుడై వచ్చినట్లు తెలిపి జ్ఞానముకొరకు అర్థించాడు. ఆ గురువు చాలా మితభాషి, చెప్పవలసిన జ్ఞానము సూటిగ ఒకటి రెండు మాటలలో చెప్పి మౌనముగ ఉండెడివాడు. ప్రతిదినము అందరితో మాట్లాడువాడు కాదు. రాజు కొన్ని రోజులు అక్కడే ఉన్న తర్వాత ఒక రోజు సాయంకాలము రాజును చూచి **'నీవు యజ్ఞము చేయాలి'** అన్నాడట. ఆ మాటవిన్న రాజు యజ్ఞమంటే ఏమిటో తెలియక అర్థముకాని

ముఖముపెట్టి అది ఏమిటో నాకు తెలియదన్నాడు. అపుడు గురువుగారు యజ్ఞమును గురించి తెలుపుటకు యోచించి లోహములలో బంగారు ఇనుము, వస్త్రములలో పట్టువస్త్రము నూలువస్త్రము, నూనెలలో నెయ్యి వేపనూనె, కట్టెలలో గంధపుకట్టె తుమ్మకట్టె, ఔషధములలో మర్రిపుల్లలు నేలఉసిరి పుల్లలు, ధాన్యములలో బియ్యము నూగులు, ఇట్లు ఒక దానికొకటి విరుద్ధమైనవి, హెచ్చుతగ్గులు గలవి, ఒక దానికొకటి ప్రత్యేకత గలవియైన అనేక వస్తువులను తెమ్మని రాజుగారికి ఆజ్ఞాపించెను. ఆ కాలములో ఉన్న గురువులందరిలో గొప్పవాడనిపించుకొన్న ఆ గురువు చెప్పిన వెంటనే రాజుగారు స్వయముగ బయలుదేరిపోయి, గురువుగారి ఆజ్ఞమేరకు సమస్త వస్తువులను సమకూర్చుకొని ఏనుగుల మీద మోయించుకొని తెచ్చెను. ఆ విధముగ గురువుగారు చెప్పడము రాజు తేవడము ఆ కాలములో అందరికి క్రొత్తపనిగ కనిపించినది. చాలా మంది గురువులు కూడ ఏమి చేయుచున్నారో చూడాలను కొన్నారు.

గురువుగారు ఒక అగ్నిగుండమును తయారుచేయించి, మండుచున్న అగ్నిలో తెచ్చిన వస్తువులన్నిటిని వేసి స్వాహా చేయమనెను. అపుడు ఆ రాజు ఒక్కొక్క వస్తువును తీసివేస్తు దానిపేరు చెప్పి స్వాహా చెప్పను మొదలిడెను. స్వాహా అనగ అయిపోయినదని అర్థము. ఆ ఉద్దేశ్యముతోనే తెచ్చిన బంగారు అయిపోతూనే సువర్ణ స్వాహా అన్నాడు. అట్లే తెచ్చిన వస్తువులన్ని వేస్తు ఏ వస్తువు అయిపోతే ఆ వస్తువు పేరు చెప్పి స్వాహా అనుచు మొత్తము వస్తువులన్ని ముగించెను. ఆ పనిని ఎందుకు తన చేత చేయించాడో రాజుగారికి ఏమి అర్థము కాలేదు. అలా రాజుగారి చేత చేయించడము మిగత గురువులు చాలామంది తెలుసుకొని, ఆ రాత్రికి రాజుగారిని కలసి అలా ఎందుకు చేయించారని అడిగారు. అందులకు రాజుగారు యజ్ఞము చేయమని గురువుగారు చెప్పారని, యజ్ఞమంటే ఏమిటో తనకు తెలియదని గురువుకు చెప్పగ, దానిని తెలుపుటకు అనేక రకమైన వస్తువులు గురువుగారు తనచేత తెప్పించి అగ్నిగుండములో వేయించి స్వాహా చేయించాడని తెలిపాడు.

రాజుగారి మాటలువిన్న మిగతా గురువులందరు ఇలా అనుకొన్నారు. రాజుగారు తన రాజ్యము సుఖసౌఖ్యముగ ఉండుటకు గురువుగారిని అడిగి ఉంటారని, దానికి గురువుగారు ఎవరికి తెలియని గొప్ప కార్యము చేయించాడని, అలా చేసిన కార్యము రాజుగారి మాటల వలన యజ్ఞమని తెలిసినదని, ఆ యజ్ఞము వలన రాజుగారు తెచ్చిన వస్తువులన్నియు అగ్నిదేవుని ద్వార మిగతా దేవతలకు వరుణ దేవునికి అంది ఉంటాయని, ఆ వస్తువులు తీసుకొన్న వరుణుడు వర్షము సకాలముగ కురిపిస్తాడని, దానివలన రాజుగారి రాజ్యము కరువు కాటకములు లేకుండ సుఖముగ ఉండగలదని, రాజుగారు రాజ్యము కొరకే యజ్ఞమను పేరుతో ఈ పని చేశారని, తాము కూడ అలా చేస్తే వర్షాలు వస్తాయనుకొని వారి వారి రాజుల వద్దకు పోయి, ప్రజలు సుఖముగ ఉండుటకు, వర్షాలు కురిసి పంటలు బాగాపండుటకు, యజ్ఞము చేస్తామని దానికి ఇంత ఖర్చు ఇన్ని వస్తువులు కావాలని అడిగి ఇప్పించుకొని, గురువుగారు రాజుగారి చేత చేయించినట్లే చేయను మొదలిడిరి. అట్లు పూర్వము యజ్ఞములను రాజులు చేసెడివారు. ఓపికలేని రాజులు అన్ని ఇచ్చి గురువుల చేత చేయించెడివారు. ఇలా కాలక్రమేపి యజ్ఞాలు అను పేరుగల కార్యములు జరుగుచు వస్తున్నవి. నేటికిని అక్కడక్కడ గలవు. ఇప్పటికి చేయించువారు అగ్నిగుండము ముందర కూర్చుని వస్తువులు వేయడము గలదు. అట్లు ఓపిక లేకపోతే డబ్బు ఇస్తే చేయు యజ్ఞములు కలవు.

విశేషమేమిటంటే **గుడిలోని ప్రతిమ నిజముగా దేవుడుకాదని అది కేవలము దేవుని గుర్తింపని** చాలామందికి నేడు తెలియలేక పోయినట్లు, కృతయుగములో గురువు రాజుగారిచేత చేయించిన దహనకార్యము నిజముగ యజ్ఞముకాదని, అది కేవలము యజ్ఞము యొక్క గుర్తింపని తెలియక పోయినది. దహనకార్యమునే నిజముగ యజ్ఞమనుకొన్నారు. నాటి నుంచి నేటి వరకు దానిని యజ్ఞమనియే అంటున్నారు. **పూర్వము తిరుపతిలో గుణరహిత భావము వ్యక్తము చేయుటకు ఒక భక్తుడు గుండు కొరిగించుకొనగా** ఆ దినము దానిని చూచినవారు నాటి నుండి నేటివరకు మ్రొక్కుబడిగ ఎట్లు కొరిగించుకొనుచున్నారో అట్లే భావపూరిత

కార్యము కూడ భావరహితమై కోర్కెల నిమిత్తమైన కార్యమై యజ్ఞమనిపించుకొంటూ ఉన్నది.

ఆనాడు గురువుగారు రాజుకు ఆ దహన కార్యమును గురించి మరుసటి దినము ఏమి చెప్పాడో, మిగత వారికి తెలియని దానివలన గుణముల రూపములో ఉన్న మాయ తప్పుడు ఊహనందించి, అసలు మార్గమునుండి తప్పించినదనియే చెప్పవచ్చును. అగ్నికి సమిధలను (వస్తువులను) అర్పించిన రాజుగారికి కూడ చేసిన కార్యము గురించి తెలియక నాకు మోక్షము కావాలనుకొన్నాను, గురువుగారు యజ్ఞము చేయమన్నారు. నాకు తెలియదన్నాను నాచేత చేయించాడు. దీనివలన మోక్షము సాధ్యమా! ఇందులో ఏదో నాకు తెలియని రహస్యమున్నదని తలచి అది ఏమిటని తీవ్రముగ యోచిస్తూ ఉన్న సమయములో మరుసటి దినము గురువుగారు పిలిచి 'రాజా నేను చాలామందిలాగ ఎక్కువగా మాట్లాడువాడను కాను, సూటిగ సమాధానము చెప్పువాడను. అందువలన నీవడిగిన దానికి సరియైన సమాధానము ఇచ్చాను. నీవు మోక్షము గురించి అడిగావు. నేను యజ్ఞము చేయమన్నాను. నీవు తెలియదన్నావు, దానిని తెలుపు నిమిత్తము యజ్ఞమునకు ఉదాహరణగ ఒక దహన కార్యము చేయించాను. వెంటనే దానిని గురించి నీకు చెప్పలేదు. అలా చెప్పక పోవడము వలన దానిమీద నీకు శ్రద్ధ ఎక్కువై తెలుసుకోవాలను తపన మొదలిడవలెనని చెప్పలేదు. అలా శ్రద్ధ ఎక్కువైనప్పుడే తెలుపబడే విషయము బాగుగా గ్రహింపబడును. దహనకార్యము యజ్ఞమునకు ఉదాహరణయని చెప్పానుగ! ఆ ఉదాహరణ విపులముగ చెప్పుచున్నాను వినుము.

మోక్షమనగ విడుదలయని అర్థము. దేనినుండి విడుదల కావలెను? ఏది బంధనముగ ఉన్నదని యోచించిన, పాపము మరియు పుణ్యము అను కార్య ఫలితములు కర్మరూపమున జీవున్ని బంధించి జన్మలపాలు చేయుచున్నవి. పాపము పుణ్యము కంటికి కనిపించని కర్మరూపములు. అవి ఒక దానికొకటి వ్యతిరిక్తముగ ఉండి ఒకటి మంచి ఒకటి చెడు, ఒకటి సుఖము ఒకటి దుఃఖము కలుగ

చేయుచుండును. ఈ విధముగ ఉన్న విభేదములైన పాపపుణ్యములకు ఉదాహరణగ తియ్యనైన అతి మధురపు పుల్లలు, చేదైన వేపపుల్లలు, నెయ్యి, వేపనూనె, గంధపుచెక్కలు, తుమ్మచెక్కలు, ఒక దానికొకటి విభేదములు కల్గిన వస్తువులను తెప్పించాను. తెచ్చిన వస్తు సముదాయములన్ని పాప పుణ్యములకు సమానమని గుర్తించుము.

పాపపుణ్యములున్నంత వరకు మోక్షమురాదు. ఎప్పుడైతే పాపపుణ్య బంధనములు తెగిపోవునో అప్పుడే మోక్షము. కావున పాపపుణ్యములు లేకుండా చేయాలి. **పాపపుణ్యములను లేకుండ చేయునది ఒకేఒక జ్ఞానశక్తి, దానిని జ్ఞానాగ్ని అనికూడ అంటాము.** జ్ఞానాగ్నిలో పాపపుణ్యములు ఎపుడు దహించబడి లేకుండా పోతాయో అప్పుడే మోక్షము ప్రాప్తిస్తుంది. అందువలననే మోక్షకాముడైన నీవు యజ్ఞము చేయాలి అన్నాను. ఉన్న పాపపుణ్యములను లేకుండ చేయడమే నిజమైన యజ్ఞము. యజ్ఞము అనగా "నాశనము" అని నిజమైన అర్థము. ఇప్పుడు చేసినది యజ్ఞమునకు ఉదాహరణ, కాని యజ్ఞముకాదని తెలియాలి. శరీర అంతరంగమున పాపపుణ్యములను జ్ఞానాగ్ని చేత దహించడము గురించి తెలియునట్లు, బయటి సమిధలను అగ్నియందు కాల్చి చూపాను. పాపపుణ్యములు ఎలా వస్తుంటాయో, వాటిని యజ్ఞమెలా చేయాలో, వివరముగ చెప్పెదను వినుము.

నిత్యము మనము చేయు పనులయందు కొన్ని మంచి, కొన్ని చెడు పనులు తప్పక ఉంటాయి. **మంచి చెడు కార్యముల యొక్క కనపడని ఫలితములు పాపపుణ్యములు. పనులు చేయుచున్నపుడు వచ్చు పాపపుణ్యములను జ్ఞానాగ్ని ద్వారా లేకుండ చేయకపోతే, అనగ యజ్ఞము చేయకపోతే, అవి కర్మ బంధనములై కూర్చుంటాయి.** కనుక నీవు ఇప్పటినుండి ఏ పని చేసిన అహంకారరహితుడవై, కర్మములు అంటకుండునట్లు, ప్రతి కర్మను యజ్ఞము చేయాలి" అన్నాడు.

ఈ విధముగ ఆ గురువుగారు యజ్ఞము యొక్క అసలు రహస్యము చెప్పి బాహ్యాయజ్ఞములు నిజమైన యజ్ఞములుకావని, అవి కేవలము యజ్ఞము యొక్క ఉదాహరణ మాత్రమేనని, అంతరంగమున కర్మనాశనమే నిజమైన యజ్ఞమని

అర్థమగునట్లు చేశాడు. ఆనాటి భావపూరిత దహనమే, నేడు నిజమైన యజ్ఞముగ తలచుచుండుట చాలా పొరపాటని తెలియుచున్నది. భగవంతుడు శ్లోకమున **'యజ్ఞార్థా త్కర్మణోన్యత్ర లోకోయం కర్మ బంధనః'** అన్నాడు యజ్ఞముకాని కర్మ లోకములో బంధమౌనని దాని అర్థము. పనిలో వచ్చుకర్మ యజ్ఞము కావాలని ఎవరు అనుకోవడము లేదు. యజ్ఞమంటే నాశనమని తెలియక పీఠాధిపతులు, పేరుగాంచిన గురువులు వస్తు దహనకార్యమే యజ్ఞముగ బోధించుచున్నారు. కర్మ దహన కార్యమును గురించి భగవంతుడు తెల్పాడని గురువులు చెప్పలేక పోవడము వలన, దేవతల మెప్పు పొందాలనుకొన్నవారు, కోర్కెలు గల మొదలగు వారందరు విపరీతముగ డబ్బులు ఖర్చుచేసి బాహ్య వస్తుయజ్ఞములు చేయుచున్నారు. కాని శరీరము లోపల కర్మయజ్ఞము చేయలేక పోవుచున్నారు.

భగవద్గీతలో భగవంతుడు చెప్పిన యజ్ఞము యొక్క భావము అర్థము కాకుండ చేయుటకు మాయ కొందరిలో దూరుకొని లోపలి యజ్ఞములను నిర్వీర్యము చేయుటకు, బాహ్య యజ్ఞములను సమర్థించుటకు, మేము చేయు బాహ్యయజ్ఞములు తప్పు కావుయని ఎప్పటికైన వాదించుటకు అనువుగ, భగవద్గీతయందే బాహ్యయజ్ఞములను గూర్చి భగవంతుడే చెప్పినట్లు శ్లోకములు అల్లి, యజ్ఞము అని పేరు వినిపించిన ఈ శ్లోకము క్రిందనే వాటిని అమర్చారు. అట్లు అమర్చిన శ్లోకములే ఇపుడు వరుసగ ఏడు గలవు. శాస్త్రరీత్య ఇవి భగవద్గీతలో భగవంతుడు చెప్పకున్నను, అవి శాస్త్రబద్ధము కాకపోయినను, ఇంతవరకు అవి భగవంతుడు చెప్పిన శ్లోకములుగనే గురువులందరు చెప్పడము వలనను, ప్రజలందరు వాటిని నమ్మడము జరిగినది. భగవంతుడు చెప్పినది కర్మయోగమునకు సంబంధించిన యజ్ఞమైయుండగ, కర్మలు కాల్చబడుటకై ఉండగ, మోక్షము పొందుటకై ఉండగ, అందులకు విరుద్ధముగ వస్తువులను కాల్చి దేవతలకు ఇవ్వడము, దానికి బదులుగా వారు మనకు వర్షము కురిపించడము, ఒకరికొకరు సహాయము చేసుకోవడమేమిటని ఎవరు ప్రశ్నించుకోలేకపోయారు.

గీతయందు పరమాత్ముడు ఏ దేవతల గురించి చెప్పలేదు. వారి ప్రీతి కొరకు యజ్ఞములు చేయమని కూడ చెప్పలేదు. **దేవతలను ఆరాధించితే దేవతలలోనికి పోతావు, నావద్దకు రాలేవని కూడ అచ్చటచ్చట హెచ్చరిక చేశాడు. నన్నే ఆరాధించుము, నన్నే పొందుదువని హితము కూడ చెప్పాడు.** ఇచ్చట వరుసగ ఉన్న ఏడు శ్లోకములు దేవతలకు సంబంధించినవి. కావున దేవుడు చెప్పలేదని, ఎవరో కల్పించి అందులో చొప్పించారని, యోచించు ప్రతివారికి అర్థమగును. భగవంతుడు కర్మయోగము యొక్క వివరము చెప్పుసమయమున, యజ్ఞమను మాట పై శ్లోకమందు చెప్పిన వెంటనే, కొందరు ఇప్పుడు సంధు దొరికింది కదాయని ఏడు శ్లోకములు ఇరికించారు. **"యజ్ఞార్థా"** అన్న పై శ్లోకము కర్మయోగమునకు సంబంధించినది కాగ, వెంటనే బ్రహ్మయోగమునకు సంబంధించిన **'యస్త్వాత్మరతి'** అన్న శ్లోకము చెప్పబడియుండగ, వీటికి మధ్యలోనున్న "యజ్ఞార్థ" అను కర్మయోగ శ్లోకమునకు, **'యస్త్వాత్మరతి'** అన్న బ్రహ్మయోగ శ్లోకమునకు మధ్యలో ఏ యోగముకానివి, ఏ ఆత్మకు సంబంధించనివియైన ఏడు కల్పిత శ్లోకములు చేర్చబడినవి. ఈ పని ఎప్పుడు ఎవరు చేశారో కాని, ఇంతవరకు వాటిని గుర్తించక పోవడము పెద్ద పొరపాటని చెప్పుచున్నాము. ఆ కల్పిత అశాస్త్రీయ శ్లోకములు వరుసగ ఇలా ఉన్నాయి.

**2) శ్లో10: సహయజ్ఞః ప్రజాసృష్ట్వా పురోవాచ ప్రజాపతిః**
**అనేన ప్రసవిష్యధ్వమేషవో స్త్విషకామధుక్ ॥**

**(అశాస్త్రీయము)**

**2) శ్లో11: దేవాన్ భావయతానేన తే దేవా భావయంతువః ।**
**పరస్పరం భావయంత శ్రేయః పరమావప్స్యథ ॥**

**(అశాస్త్రీయము)**

**2) శ్లో12: ఇష్టాన్ భోగన్ హిచోదేవా దాస్యంతే యజ్ఞ భావితాః ।**
**తైర్దత్తానప్రదాయైభ్యోయో భుఙ్తే స్తేవ ఏవ సః ॥**

**(అశాస్త్రీయము)**

**2)శ్లో13: యజ్ఞాఃశిష్టాశినస్సంతో ముచ్యంతే సర్వకిల్బిషై ః ।**
**భుంజతే తే త్వఘం పాపా యే పచంత్యాత్మకారణాత్ ॥**

**(అశాస్త్రీయము)**

**2) శ్లో14 : అన్నాద్భవంతి భూతాని పర్జన్యాదన్న సంభవః ।**
**యజ్ఞాద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మసముద్భవః ॥**

**(అశాస్త్రీయము)**

**2) శ్లో15 : కర్మబ్రహోద్భవం విద్ధి బ్రహ్మాక్షరసముద్భవం ।**
**తస్మాత్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్ ।**

**(అశాస్త్రీయము)**

**2) శ్లో16 : ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయతీహ యః ।**
**అఘాయురింద్రియారామోఘం పార్థ! సజీవతి ॥**

**(అశాస్త్రీయము)**

ఈ ఏడు శ్లోకములందు చెప్పిన విషయము మూడవ అధ్యాయమైన జ్ఞాన యోగమందుగల 33వ శ్లోకమున చెప్పబడిన భావమునకు, అట్లే ఏడవ అధ్యాయమైన అక్షరపరబ్రహ్మయోగమందు గల 4వ శ్లోకమున చెప్పబడిన భావమునకు పూర్తి వ్యతిరిక్తముగ ఉన్నది. ఉన్నవి ద్రవ్య జ్ఞానయజ్ఞములు రెండేనని, అందులో జ్ఞానయజ్ఞము శ్రేష్ఠమైనదని, అది కర్మను మాత్రమే కాల్చునని చెప్పబడిన జ్ఞానయోగములోని 33వ శ్లోక భావమునకు, అట్లే అక్షర పరబ్రహ్మ యోగములో 4వ శ్లోకమున నేను ఆత్మగ ఉండి దేహములలో జరుగు రెండు రకముల యజ్ఞములకు అధిపతిగ ఉన్నానను దేవుని భావమునకు, పై ఏడు శ్లోకములు పూర్తి విరుద్ధముగా ఉన్నవి. ఇష్టకామములు తీర్చుకొనుటకు యజ్ఞములు చేయండని ఏడు శ్లోకములలో చెప్పడము, మానవుని కోర్కెలను రేకెత్తించడమే తప్ప, వాటినుండి తప్పించడము ఏమాత్రము కాదు. దేవతలకు యజ్ఞములు చేయుట వలన వారు మీకు వృద్ధి చేయుదురని, ఇట్లు ఒకరికొకరు అభివృద్ధి చేసుకొమ్మని పైన 11వ శ్లోకములో చెప్పడము, దేవతలు మనుష్యులు ఒకరికొకరు వస్తు మార్పిడి వ్యాపారము చేసుకొమ్మని

చెప్పినట్లున్నది. అంతేకాక 12వ శ్లోకమున యజ్ఞ పూజలందిన దేవతలు మీకు సర్వభోగములు ఇచ్చుచుందురు. వారి సొత్తు మరల యజ్ఞము చేసి వారికివ్వకపోతే, పండిన పంటలు మీరేతింటే, దొంగతనము చేసినట్లేనని చెప్పడము మరీ చోద్యముగనున్నది. ఇది ఎట్లున్నదనగా! నేను వాని పెళ్ళిలో బహుమతి ఇచ్చాను, వాడు నా పెళ్ళికి బహుమతి తిరిగి ఇవ్వలేదు అన్నట్లున్నది. భగవానుడు ధర్మసంస్థాపనకు వచ్చి తన ధర్మములను తెలుపుచున్నప్పుడు, తన మాటలకే విరుద్ధమైన ఇటువంటి విలువలేని మాటలు చెప్పునా! ఈ ఏడు శ్లోకములలో బ్రతుకు తెరువుకు సంబంధించిన ప్రపంచ ధర్మముతప్ప, మోక్షమునకు పనికి వచ్చు పరమాత్మ ధర్మములు ఏమాత్రములేవని పాఠకులు గ్రహించవలెనని కోరుచున్నాము.

ఇచ్చట చాలామందికి యజ్ఞముల మీద తమకున్న భావమునకు, ఇప్పుడు ఇక్కడ మేము చెప్పు భావమునకు వ్యత్యాసమేర్పడి, మా మాటలు కొంత బాధ కల్గించునవియే అయినప్పటికి, మేము చెప్పునది సత్యము కావున చెప్పక తప్పలేదు. అటువంటివారు ఎవరైన ఉంటే కొంత వివరణాత్మక యోచన చేయాలని కోరుచున్నాము. ఇందులో గొప్పగొప్ప గురువులే పొరపడి, పనిగట్టుకొని అదే ముఖ్యమైన ఆరాధనని తలచి, అగ్నిగుండములు కావించి కాల్చి ఖర్చు పెట్టుచుంటే, మిగతావారు కూడ పెద్దలజాడ నడవాలనుకొన్నారు తప్ప మనము చేయుచున్నది ఏమిటని యోచించలేదు. బాహ్యముగ చేయు యజ్ఞములలో కూడ ఉన్న వస్తువులను లేకుండ చేయడము ప్రత్యక్షముగ కనిపిస్తున్నది కదా! అపుడు అది నాశనము అని ఎందుకు అర్థము కాలేదు? నీటిలో ఈది బయటపడవచ్చు, గాలిలో తేలిపోవచ్చు, భూమిలోతులో కూడ బ్రతుకవచ్చు, కాని అగ్నిలో సర్వులు నాశనము కాకతప్పదు. ఒక అడవి అంటుకుంటే అందులోని ఏ జీవరాశియైన చావక తప్పదు. ఆ అగ్నితో చేయబడు యజ్ఞము నాశనమని అర్థము తెల్పుచు, జ్ఞానాగ్నిచేత కర్మను కాల్చు కొమ్మని, మోక్షము పొందమని, సందేశమిచ్చు **అగ్నిగుండమును యజ్ఞము యొక్క నమూనాయని** తెలియక యజ్ఞమే అనుకోవడము చాలా పెద్ద పొరపాటు. అగ్నిగుండములు కావించి వాటిని యజ్ఞములని కొందరనుకుంటే, గీతను బోధించు బోధకులు ఆ బోధకు "గీతాయజ్ఞము"

అని పేరు పెట్టడము ఇంకా పొరపాటు. ఉదాహరణకు 72వ గీతాయజ్ఞము, 73వ గీతాయజ్ఞము అని వరుసగ పేరు పెట్టి చెప్పడము జరుగుచున్నది. నిజార్థము ప్రకారము, పరమాత్మ గీతయందు తెల్పిన ఉద్దేశ్యము ప్రకారము గీతను 72వ మారు కాల్చుచున్నాము, 73వ మారు కాల్చుచున్నామని అర్థము. అనగ గీతను ఉద్ధరించవలెనని బోధించుట మంచిదే, కాని ఎన్నిమార్లు బోధించినది బోధించు సంఖ్య పెట్టి దానిప్రక్కన యజ్ఞమని పేరు పెట్టడము బాగలేదు. చెప్పానుగ నిజమైన అర్థము ప్రకారము యజ్ఞమనగ ఉన్న దానిని లేకుండ చేయడమేనని. దాని ప్రకారము గీతనే లేకుండ చేసినట్లగును.

జ్ఞాన యోగమైన మూడవ అధ్యాయములో యజ్ఞములు రెండు రకములని భగవంతుడు చెప్పినపుడు కూడ యజ్ఞములను గూర్చి 9 కల్పిత శ్లోకములు అమర్చబడినవి. విశేషమేమిటంటే అక్కడ కేవలము అగ్నితో చేయునవి చెప్పక, భజనలు మొదలుకొని తపస్సుల వరకు కూడ యజ్ఞములని చెప్పడము జరిగింది. ఇంకను ఇక్కడ యజ్ఞము అన్నపేరు వచ్చిన తర్వాత కల్పించి చెప్పగ, అక్కడ యజ్ఞమన్న శ్లోకమునకు ముందే కల్పించి చెప్పారు. ఇట్లు మనుషులు కల్పించిన ఈ కల్పిత యజ్ఞములను వదలి భగవంతుడు చెప్పిన **'యజ్ఞార్థా'** అన్న శ్లోకము తర్వాత ఉన్న అనుబంధ శ్లోకమును చూస్తాము.

*(2) శ్లో॥ 17 : యస్త్వాత్మరతిరేవ స్యాదాత్మతృప్తశ్చ మానవః ।*
*ఆత్మన్యేవ చ సంతుష్ట స్తస్య కార్యం న విద్యతే ॥*
*(బ్రహ్మయోగము)*

**భావము :** ఆత్మయందే లగ్నమగుచు, ఆత్మతోనే తృప్తిపొంది, ఆత్మతోనే సంతోషము పొందువానికి ఏకార్యము లేదు.

**వివరము :** పనులు చేయుచు యజ్ఞ సంబంధముగ కార్యములు చేసినప్పటికి కర్మలంటవని, లేని ఎడల కర్మబంధనములు ఏర్పడునని తెలుసుకొన్నాము. దానినే కర్మయోగమని అంటున్నాము. ఉన్న రెండు యోగములలో రెండవది బ్రహ్మయోగము.

బ్రహ్మ యోగమున మానవుడు ఏ పని చేయకుండ ఆత్మయందు లగ్నమైవుండును. అట్టి బ్రహ్మయోగి ఆత్మయందు లగ్నమైవుండి దానియందే తృప్తి, దానియందే సంతోషము పొందుచుండును. కావున అట్టి వానికి బయటి పనులతో సంబంధము లేదు. ఆత్మను పొందిన బ్రహ్మయోగికి బయటి ప్రపంచ కార్యములతో పనిలేదు.

ఈ బ్రహ్మయోగము వివాహితులకు మరియు కొందరి జీవనమునకు ఆధారమైవున్న వానికి తగదు. ఎందుకనగ అతడు ఇతరుల కొరకు పనులు చేయవలసియున్నది. ఏ పని లేనివానికి బ్రహ్మయోగము అనుకూలమైనది. అట్లుకాక పనిచేయవలసి ఉన్న వానికి కర్మయోగము తప్ప వేరు దారిలేదు.

(2) శ్లో॥ 18 : నైవ తస్య కృతేనార్థో నాకృతేనేహకశ్చన ।
న చాస్య సర్వభూతేషు కశ్చిదర్థ వ్యపాశ్రయః ॥
(బ్రహ్మ యోగము)

**భావము :** అట్టివాడు పనిచేయకుండుట వలన లాభము లేదు. మరియు నష్టము లేదు. అతడు ఏ ప్రయోజనమునకైన ఎవరిని ఆశ్రయించవలసిన పనిలేదు.

**వివరము :** బ్రహ్మయోగి ఏ పని చేయనివాడై ఆత్మయందే లగ్నమై ఉండుట వలన వానికి లాభనష్ట ఖేరీజు లేదు. బాహ్య స్పర్శలేని అతనికి కావలసినదేది లేదు. అతడు ఏ ప్రయోజనముల కొరకు ఎవరిని ఆశ్రయించవలసినది లేదు. బ్రహ్మయోగమున లోపలి ఆత్మ తప్ప బయటి ప్రపంచము తెలియదు. కావున అట్టి వానికి బయటి ప్రపంచ లాభనష్టములుగాని, వ్యర్థ ప్రయోజనములుగాని, సుఖ దుఃఖములుగాని, ప్రేమ, అసూయలుగాని లేవని తెలియాలి. కర్మయోగి యొక్క విధానము బ్రహ్మయోగి యొక్క విధానము చాలావేరై ఉన్నవి. కనుక కర్మయోగము చేయువారు పనులు చేయాలి. ఆ పనులు కర్మ సంగ వినిర్ముక్తముగ ఉండవలెనని క్రింది శ్లోకమున చెప్పుచున్నాడు చూడండి.

(2) శ్లో॥ 19 : తస్మాదసక్త స్సతతం కార్యం కర్మ సమాచర ।
అసక్తో హ్యాచరన్ కర్మ పర మాప్నోతి పూరుషః ॥
(కర్మయోగము)

**భావము :** అందువలన చేయుచుండు కార్యము యొక్క ఫలితము మీద ఆసక్తిలేని వాడవై, కర్మప్రకారము కార్యములు చేయుము. అట్లు చేయుట వలన పరమును పొందవచ్చును.

**వివరము :** నీవు బయట ప్రపంచ సంబంధము ఎక్కువ కల్గివున్నావు. కావున ఈ కార్యము నేను చేయుచున్నానని, నేను చేయుట వలన ఈ కార్యము జరుగుచున్నదని, ఈ కార్యము జరుగుట వలన ఈ ఫలితము వచ్చుచున్నదని, లేక ఈ కార్యము యొక్క పర్యవసానము పలానాయని దానిమీద ధ్యాసయుంచక చేయుము. ఉదాహరణకు ఒక పొలములో పత్తి పైరుకు పురుగు మందుకొట్టుచున్నావనుకొనుము. అపుడు మందు కొట్టుట నా పనియని చేయుటలో తప్పులేదు. కాని మందుకొట్టి ఎన్నో వేల పురుగులను చంపుచున్నాననుకోకూడదు. నీవు మందుకొట్టుట వలన పురుగులు చనిపోవుట నిజమే అయినప్పటికి దానిని నీవు యోచించకూడదు. మందుకొట్టుట కార్యము, పురుగులు చనిపోవుట కార్యము యొక్క ఫలితము, కార్యము మీద లగ్నమైన పరవాలేదు. కాని కార్య ఫలితము మీద లగ్నము కాకూడదు. ఒక వేళ కార్య ఫలితమునకు నీవే కారణమని తలపోసిన ఎడల, ఆ పురుగులను చంపిన పాపము తప్పక అంటుకొనును. దానిని తర్వాత జన్మమెత్తి అనుభవించవలసి ఉంటుంది. కార్యము చేయుటకు మాత్రమే నేను నియమితుడనని తలచి ఫలితము మీద **'నేను'** అను అహంభావము పెట్టుకోక చేసిన కార్యములలో కర్మ అంటదు. అలా చేయువాడు పరమాత్మ ప్రాప్తి పొందును.

ఇది నిజమా అని అనుమానపడవలసిన పనిలేదు. **కార్యములు చేసినప్పటికి కర్మ అంటక పోవడమును కర్మయోగమంటాము.** ఇది ఇప్పటి క్రొత్త మాట కాదు. పూర్వము కూడ ఎందరో ఈ పద్ధతి ద్వారా దైవప్రాప్తి పొందారు. ముఖ్యముగ

సంసారములో ఉండి, బయట సంబంధముండి పనులు చేయువారు తప్పక ఆచరించ వలసిన పద్ధతిది. దీనిని గురించి భగవంతుడు క్రింది శ్లోకమున ఏమి చెప్పుచున్నాడో చూడండి.

(2) శ్లో॥ 20 : కర్మణైవ హిసంసిద్ధి మాస్థితా జనకాదయః ।
లోకసంగ్రహమేవాపి సంపశ్యన్ కర్తు మర్హసి ॥
(కర్మయోగము)

**భావము :** కర్మయోగమాచరించి జనకుడు మొదలైనవారు మోక్షము పొందిరి. లోకులు తెలుసుకొనుటకైన నీవు ఈ పద్ధతిని ఆచరింపుము.

**వివరము :** జనకుడు ఒక రాజైయుండియు, తన రాజ్యములోని అనేక సమస్యలతో అనేక పనులతో ఆయన సంబంధపడియుండియు, కర్మయోగ పద్ధతి ఆచరించుట వలన మోక్షము పొందినాడు. అందువలన కర్మయోగ మార్గము ద్వారా మోక్షము పొందవచ్చునని ఇతరులు తెలుసుకొనునట్లు, నీవు అన్ని కార్యములు చేయుచు కర్మయోగమాచరింపుము.

(2) శ్లో ॥ 21 : యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరో జనః ।
సయత్ప్రమాణం కురుతే లోకస్త దనువర్తతే ॥
(కర్మయోగము)

**భావము :** శ్రేష్ఠుడు ఏది ఆచరించునో దానినే ఇతరులు ఆచరింతురు. అతడు ఏ ప్రమాణమును చూపునో దానినే ఇతరులు అనుసరింతురు.

**వివరము :** ఇక్కడ శ్రేష్ఠులు అను పదము వచ్చినది. ఇప్పటి కాలమున మనుషులలో శ్రేష్ఠులు ఎవరైనది తెలియకుండ పోయినది. పూర్వకాలములో శ్రేష్ఠులను గుర్తించి వారి ప్రకారము ఇతరులు నడుచుకొనేవారని పై శ్లోకములో అర్థమగుచున్నది. జగతిలో అన్నిటికంటే శ్రేష్ఠమైనది ఒకే ఒక దైవజ్ఞానము. దైవజ్ఞానమునకు

సమానమైనదిగాని, దానికంటే పవిత్రమైనదిగాని లేదని పూర్వమనెడివారు. శ్రేష్ఠమైన జ్ఞానమును ఎవడు తెలిసియున్నా అటువంటి వానిని శ్రేష్ఠ అనెడివారు. అంతేకాక దైవజ్ఞానము రహస్యములలోకెల్ల రహస్యమైనది, కావున అంతటి గుప్తమైన (రహస్యమైన) జ్ఞానమును తెలిసినవానిని గుప్తుడు అనెడివారు. వీడు దైవజ్ఞానము తెలిసినవాడని ఇతరులకు తెలియునట్లు అప్పటి కాలములో గురువులు వాని పేరు చివర శ్రేష్ఠ అనియు, లేకపోతే గుప్త అనియు గుర్తింపు పదమునుంచెడివారు. ఇది ద్వాపరయుగములోని మాట. కలియుగములోనికి వచ్చెటప్పటికి కాలక్రమమున శ్రేష్ఠ, గుప్త అను పదములు ఒక కులము చివరకు వచ్చాయి. కేవలము ఒక్క వైశ్య కులములోనే ఈ పదములు పేరు చివరన గలవు. గుప్త అను పదము ఇప్పటికి మారకున్నను శ్రేష్ఠ అను పదము కొంత మారిపోయి శ్రేష్ఠి అను రూపాంతము చెందినది. వంద సంవత్సరముల క్రితము గుప్త, శ్రేష్ఠ అను పదములు వైశ్యుల పేర్ల చివరిలో కనిపిస్తుండెడివి. ప్రస్తుతకాలములో శ్రేష్ఠి అను పదము మరి కొంత మారిపోయి "శెట్టి" అయిపోయినది. గుప్త, శ్రేష్ఠి అను పదములు కలియుగము మొదటికాలములోనే వైశ్యకులములో చేరిపోయినట్లు అర్థమగుచున్నవి.

బ్రాహ్మణులు అనగా బ్రహ్మజ్ఞానము కలవారని, వైశ్యులు అనగా యజ్ఞములు చేయువారని పూర్వము అర్థముండెడిది. ప్రస్తుత కాలములో ఆ అర్థములు మారి పోయినవి. వైశ్యులు అనగా వ్యాపారము చేయువారను భావము వచ్చినది. కేవలము కులమును నిర్ణయించునవిగానే బ్రాహ్మణ, వైశ్య పేర్లు మారిపోయినవి. వైశ్వానరుడు అనగ అగ్నిదేవుడని, అన్నిటిని భస్మీపటలము చేయువాడని, శరీరములో ద్రవ్యములను కాల్చు జఠరాగ్నియని, ద్రవ్యములను లేకుండ చేయువాడని భావముండెడిది. ఆ భావము కాలక్రమమున మారిపోయి, ద్రవ్యములను అమ్మువాడు వైశ్యుడు అను భావము వచ్చినది. వైశ్వానర అను పదమునుండి వైశ్యులు అను పదము పుట్టుకొచ్చినది. వైశ్వానరుడు కడుపులో ద్రవ్యము వస్తూవుంటే కాల్చివేస్తు లేకుండ చేయువాడు కాగ, నేటి వైశ్యులు దుకాణములో ద్రవ్యములు వస్తూవుంటే అమ్మివేస్తు లేకుండ చేయువారుగ గుర్తింపు పొందారు. ఈ విధముగ శ్రేష్ఠ అను పదము శెట్టిగ, వైశ్వానరులు అనుపదము వైశ్యులుగ రూపాంతము చెందినది.

దేవుడు చెప్పిన శ్రేష్ఠులు ఎవరైనది గుర్తింపు లేకుండ పోయినది. అందువలన ఎవరిని ఆదర్శముగ తీసుకొని వారిని అనుసరించాలని సంశయమేర్పడుచున్నది. దానికి జవాబుగ దేవుడు చెప్పిన సూత్రమునే ఉపయోగించుకొని చూడాలి. పవిత్రమైన, శ్రేష్ఠమైన జ్ఞానము ఎవరివద్దగలదో వారినే శ్రేష్ఠులు అనుకోవాలి. జ్ఞానమును తెలిసిన శ్రేష్ఠులలో శ్రేష్ఠుడెవడో యోచించి చూడాలి. శ్రేష్ఠులలోకెల్ల శ్రేష్ఠుడు నిజముగ భగవంతుడేనని తెలిసి భగవంతుడు చెప్పిన మార్గమును అనుసరించాలి, అదియే సరియైన మార్గము.

*(2) శ్లో॥ 22 : నమే పార్థాஉస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన ।*
*నాஉనవాప్తమవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి ॥*
*(కర్మయోగము)*

**భావము :** నాకు కర్తవ్యమనునది లేదు. ముల్లోకములందు నేనింత వరకు పొందినది ఇక పొందవలసినది లేదు. ఐనను నేను కర్మలను ఆచరించుచున్నాను.

**వివరము :** ముల్లోకములనగా మూడు గుణములని తెలియవలయును. ప్రత్యేకించి మూడు లోకములు ఎక్కడాలేవు. మూడు గుణముల ద్వారా పనులు చేయవలసిన అవసరము నాకు లేదని శ్రీకృష్ణుడు పై శ్లోకమున తెల్పాడు. అట్లే మూడు గుణములతో తానింత వరకు పొందనిది, పొందవలసినది లేదు. ఐనప్పటికి నేను మూడు గుణముల ద్వారా పనులు చేయుచున్నానని కూడ తెల్పాడు. ఆ విధముగ ఎందుకు చేయుచున్నాడనగా!

*(2) శ్లో॥ 23 : యదిహ్యాహంనవర్తేయం జాతు కర్మణ్యతన్ద్రితః ।*
*మమవర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ ! సర్వశః ॥*
*(కర్మయోగము)*

**భావము :** ఓ అర్జునా! నేనెప్పుడైనను పనులయందు అజాగ్రత్త కలిగి చేయని

ఎడల, భూమిమీద జనులందరు అన్ని విధముల నావలె వారు కూడ పనులు చేయక ఊరకుందురు.

**వివరము :** భగవంతునిగ పుట్టిన పరమాత్మ పనులు చేయుట ఏమిటని ఆశ్చర్యము కలుగకమానదు. పైగా నేను తప్పక చేయాలి అంటున్నాడు. అదియు మార్గదర్శకతకు అన్నాడు. మానవుని కర్తవ్యమును తెలుపుటకు దేవుడు భగవంతునిగ పుట్టాడు. కావున అది ఏమిటో ఆయనే చేసి చూపించాలి. ఆయన జప తపములనుగాని, వ్రతక్రతువులనుగాని, ఇలా చేయండని దేనిని చూపలేదు. ఆయన చేసినదంతా సాధారణ మానవుడు చేయుపనులనే చేసాడు. అలా చేయుటయందే కర్మయోగము కలదని తెలియజేసాడు. పనులు చేయుటయందే కర్మయోగము గలదని, పనులు చేయకపోతే కర్మయోగమనునదే లేదని, అందువలననే తాను ఎల్లప్పుడు పనులు చేసి కర్మయోగమాచరించి చూపవలెనని, అట్లు చేయకపోతే మిగతావారు కూడ కర్మయోగమును అనుసరించలేరని తెలిపాడు.

2) శ్లో॥ 24 : ఉత్సీదేయు రిమే లోకా న కుర్యాం కర్మ చే దహమ్।
సంకరస్య చ కర్తా స్యా ముపహన్యామిమాః ప్రజాః ॥
(కర్మయోగము)

**భావము :** నేను పనులు చేయకపోతే జగతిలోని మనుషులెల్లరు చెడు మార్గమున పోవుదురు మరియు వర్ణ సంకరమేర్పడును. ప్రజలనెల్ల నేను చెడగొట్టిన వాడనగుదును.

**వివరము :** దేవుడు మానవునిగ భూమిమీదకు వచ్చినపుడు సామాణ్యముగ ఎవరికి తెలియదు. వచ్చిపోయిన తర్వాత కొంత కాలమునకు పలానా మనిషి, పలానా జ్ఞానమును, ధర్మమును తెలియజేసాడు, కావున ఆయన దేవుని అవతారమైన భగవంతుడని తెలుసుకొనుటకు వీలున్నది. అలా పలాన మనిషిని భగవంతునిగ నిర్ణయించుకొనిన పిదప ఆయన తన జీవితములో ఏమి చెప్పాడు? ఏమి చేశాడు? అని ముఖ్యముగ గమనిస్తాము. చెప్పినది జ్ఞానరూపములో, చేసినది చరిత్ర

రూపములో ఉండును. భూమిమీద తెలిసిన పెద్దలు పలానావాడు భగవంతుడని తెలియజేసిన తర్వాత అతను చెప్పిన దానిని కొందరు ముఖ్యముగ చూస్తారు. కొందరు చేసిన దానిని చూస్తారు. మరికొందరు రెండిటిని గమనిస్తారు. అటువంటి మూడు రకములలో కొందరికి ఆయన చెప్పినది నచ్చినప్పటికి, ఆయన చేసినది నచ్చదు. కొందరికేమో ఆయన చేసినది నచ్చినప్పటికి, ఆయన చెప్పినది నచ్చదు. మరికొందరికి రెండు నచ్చవు. అలా భగవంతుడు పలానావాడని ఇతరుల ద్వార తెలుసుకొన్నప్పటికి చెప్పినదో, చేసినదో నచ్చక, ఆయన భగవంతుడు కాదను నిర్ణయానికి చాలామంది వస్తారు. చాలా అరుదుగ ఆయన చెప్పినది, చేసినది నచ్చిన వారుందురు. ఒక మనిషి భగవంతునిగ గుర్తింపు రావడమే కష్టము. గుర్తింపు వచ్చిన తర్వాత అతను అందరికి నచ్చడము మరీకష్టము. ఎవనికైన ఒకనికి బహు అరుదుగ రెండు విధముల నచ్చి, ఈయన దేవుని అంశతో పుట్టిన భగవంతుడని తెలియును. అట్లు తెలిసినపుడు ఆయనను అన్ని విధముల మార్గదర్శకునిగ తీసుకొని అలాగే నడుచుకొనుటకు ప్రయత్నించుదురు.

ఇక్కడ శ్రీకృష్ణుడు అన్ని విధముల భగవంతునిగ కొందరికి గుర్తింపబడినాడు. కావున ఆయన బోధను, ఆయన ప్రవర్తనను అందరు ఆదర్శముగ తీసుకొనుటకు అవకాశముగలదు. శ్రేష్ఠులు దేనిని ఆచరించితే దానినే ఇతరులు ఆచరిస్తారని ముందే చెప్పుకొన్నాము. అలా అన్ని రకముల శ్రేష్ఠుడు భగవంతుడే, కనుక ఆయన పనులు చేయకపోతే మిగతవారు కూడ ఆయనను అనుసరించి పనులు మానుకొనుటకు అవకాశము కలదు. మనుషుల లెక్కలో లోక నీతి ప్రకారము న్యాయము, అన్యాయము అనియు, చేయవలసిన పనులు, చేయకూడని పనులు అనియు, మంచి కార్యములు చెడు కార్యములు అనియు, పుణ్యమువచ్చు పనులు, పాపమువచ్చు పనులు అనియు రెండు తెగలుగ ఉండును. వీటిని బట్టి మనుషులు కొన్ని పనులు చేయవలెనని, కొన్ని పనులు చేయకూడదని కూడ నిర్ణయించుకొని ఉందురు. చేయవలసినవి, చేయకూడనవి అనునవి ప్రకృతి ధర్మము ప్రకారముంటే, **దేవుని ధర్మము ప్రకారము చేయవలసిన పద్ధతి, చేయకూడని పద్ధతి అనునవి గలవు.** దేవుని ధర్మమునకు,

ప్రకృతి ధర్మమునకు చెప్పుకోవడములో కేవలము కొంత తేడా మాత్రము అగుపించిన ఆచరించడములో చాలా భిన్నముగ ఉండును. కృష్ణుడు దేవుని ధర్మము ప్రకారము ఆచరించాడు. ఆయన ఆచరణ ప్రకృతి ధర్మములోనున్న వారికి చాలా భిన్నముగ కనిపించినది. అందువలన ఆయనను, ఆయన ప్రవర్తనను చాలామంది ఒప్పుకోలేదు. చేయవలసినవి, చేయకూడనివి మనుషుల నియమమైతే, **చేయవలసిన పద్ధతి, చేయకూడని పద్ధతి భగవంతుని నియమమై ఉన్నది.**

ఈ శ్లోకములో **"సంకరస్య"** అను పదము వాడబడినది. సంకరము అనగా ఉన్నదున్నట్లుండక ఇంకొకదానితో కలిసిపోయి వేరుగ మారిపోవడము అని అర్థము. ఉదాహరణకు నలుపురంగును ఎరుపురంగుతో కలిపితే నలుపురంగు మొదటి తన ఆకారమును కోల్పోయి వేరొక రంగుగ మారిపోవును. అలాగే దేవుని ధర్మమిదియని, చేయవలసిన పద్ధతిదియని, తాను చేసి చూపకపోతే దేవుని పద్ధతిలోనికి మనుషుల పద్ధతి చేరిపోయి దైవపద్ధతి వేరుగ మారిపోవు అవకాశమున్నది. ఎలాగైతే నలుపురంగు ఎరుపురంగుతో కలిసినపుడు ఇటు నలుపుగాక అటు ఎరుపుగాక మధ్యలో వక్క (పోక) రంగు వచ్చినట్లు ఇటు దేవుని పద్ధతికాక, అటు మనుషుల పద్ధతికాక మరియొక పద్ధతి ఏర్పడును. ఈ కాలములో కూడ అటువంటి సంకరపద్ధతి కలదని చెప్పవచ్చును. ఎలా అనగా! అజ్ఞాన మనుషుల పద్ధతి దైవజ్ఞానమను పద్ధతితో కలిసిపోయి ఆస్తికపద్ధతి ఏర్పడినది. వీరు అటు అజ్ఞానులు కాదు, ఇటు జ్ఞానులు కాదు. రెండిటికి తప్పినవారుగ సంకరపద్ధతిగ ఉన్నారు. అజ్ఞానులైతే మంచి చెడు అయిన పాపపుణ్యకార్యములనే చేయుచుందురు. పూర్తి జ్ఞానులైతే దైవపద్ధతి ప్రకారము కర్మ, బ్రహ్మ, భక్తియోగములనే చేయుచుందురు. అటు ఇటు కాని సంకరక్రియలు గలవారు యజ్ఞములు, దానములు, వేదధ్యాయణములు, తపస్సులు చేయుచుందురు. ఈ సంకరపద్ధతి భూమిమీద లేకుండ చేయుటకు పై నాలుగు క్రియలవలన దేవుడు తెలియబడడని తనబోధ అయిన గీతలో భగవంతుడు చెప్పాడు. తనబోధలో చెప్పడమే కాకుండ అసలైన దేవుని పద్ధతిని తాను ఆచరించి చూపించాడు. అట్లు ఆచరించి చూపకపోతే

మనుషులు చేయవలసిన పద్ధతిని వీడి, చేయకూడని సంకర పద్ధతిలోనికి పోవుదురని కూడ తెల్పినాడు. ఎప్పుడో అరుదుగ భూమిమీదకు దేవుని అంశ అయిన భగవంతుడు వచ్చి, తాను స్వయముగ పనులను చేసి, మీరు కూడ నా పద్ధతి ప్రకారము నడుచుకొమ్మని చెప్పిపోగా! ఆయన అజ్ఞానివలె ప్రవర్తించాడను వారు కూడ లేకపోలేదు. అట్లు మాట్లాడువారు అర్థము చేసుకొనునట్లు క్రింది శ్లోకముగలదు చూడండి.

(2) శ్లో॥ 25 : సక్తాః కర్మణ్య విద్వాంసో యథాకుర్వన్తి భారత !
కుర్యాద్విద్వాంస్తథాఽసక్త శ్చికీర్షుర్లోక సంగ్రహమ్ ॥
(కర్మయోగము)

**భావము :** ఒక అజ్ఞాని అన్ని విధముల పనులయందు ఆసక్తిపరుడై ఎట్లు చేయుచున్నాడో, జ్ఞానమంతయు తెలిసిన జ్ఞానియు అజ్ఞానివలెనె పనులు చేయవలయును. కాని ఆ పనులు చేయుటలో జ్ఞానికి ఫలితము మీద ఆసక్తి ఉండకూడదు.

**వివరము :** అజ్ఞానులు కొన్ని సందర్భములలో మాత్రము మంచి పనులు చేయుచు, అనేక సమయములలో చెడు పనులు చేయుట సహజము. వారు ఏ పనులు చేయుచున్నప్పటికి అహంకారముతో కూడుకొని జరిగిన పనికి తామే కారణమను భావము కలిగి చేయుచుందురు. అటువంటి పనులు జ్ఞానము తెలిసినవారు చేయకూడదని, అట్లు చేసిన ఎడల జ్ఞానులకు అజ్ఞానులకు ఏమి తేడాయని, జ్ఞానము తెలిసినంత మాత్రమున సరిపోదు దానికి తగిన మంచి ఆచరణ ఉండవలెనని, సత్ప్రవర్తనలేనప్పుడు జ్ఞానములేనట్లేనని, జ్ఞానము తెలిసినవారు మంచి పనులే చేయవలెనని, కలలో కూడ చెడు పనులు చేయకూడదని, ఎందరో పెద్దలు చెప్పు మాటలన్నిటిని ఇచట భగవంతుడు కొట్టివేయుచున్నాడు. మంచి చెడు పనులు ముఖ్యము కాదు. కర్మ ముఖ్యమంటున్నాడు. గత జన్మలో చేసుకొన్న కర్మప్రకారము ఎవడైన చలామణి అవుతాడు. ఒకవేళ జ్ఞానము తెలిసినప్పటికి, వాని కర్మ ప్రకారము

కొన్ని చెడుపనులు వాని ద్వార జరుగనున్న ఎడల ఎవరు మాన్పలేరు. అంతమాత్రమున వానిని అజ్ఞాని అనుట తగదని తెలుపుచున్నాడు.

కర్మ సిద్ధాంతము తెలిసిన జ్ఞాని తాను ఇట్లు చేయవలెనని, తాను చేయుట వలననే పనులు జరుగుచున్నవనిగాని అనుకోడు. కర్మప్రకారము తాను అజ్ఞానుల వలె పనులు చేయుచుండును. కాని జరిగిన పనికి తాను కారణమని ఎప్పటికి అనుకోడు. తాను జ్ఞానినని, పనులయందు అనగ ఆచరణయందు తాను అజ్ఞానికంటే వేరుగ ఉండవలెనని, వేరుగ కనిపించవలెనని అనుకోడు. అటువంటి కర్మాచరణ కల్గిన వానిని జ్ఞానిగ ఎవరు గుర్తించలేరు. కర్మయోగము పైకి కనిపించదు, కావున అజ్ఞానివలె జ్ఞానియు కనిపించును.

*(2) శ్లో॥ 26 : న బుద్ధిభేదం జనయే దజ్ఞానాం కర్మసంగినామ్ ।*
*జోషయేత్సర్వ కర్మాణి విద్వాన్ యుక్త స్సమాచరన్ ॥*
*(కర్మయోగము)*

**భావము :** జ్ఞాని పనులు చేయుటయందు అజ్ఞానుల బుద్ధికి భేదము కలిగించ కూడదు. తెలిసినవాడు అన్ని పనులు చేయుచు, ఇతరుల చేత కూడ తనవలె చేయించవలెను.

**వివరము :** అజ్ఞానులవలె తాను పనులు చేయకూడదని, తాను జ్ఞానినైనందుకు నా ఆచరణవేరని, జ్ఞానము తెలిసిన వారిపనులు అందరివలె ఉండవనియనుట వలన, అజ్ఞానులైన వారు జ్ఞానము తెలుసుకొనుటకు అవకాశమే లేకుండ పోవుచున్నది. ఉదాహరణకు ఒక అజ్ఞాని కొంతకాలమునకు తనలో కొంత మార్పు వచ్చి జీవితము శాశ్వతముకాదని, ఇప్పటినుంచైన కొంత జ్ఞానము తెలుసుకోవాలని నిశ్చయించు కొన్నాడు. జ్ఞానము కావలయునంటే లేక తెలియవలెనంటే ఆధ్యాత్మిక గ్రంథాలైనా చదవాలి లేక గొప్ప గురువులవద్దయిన బోధనలు వినాలి. ఆ ప్రయత్నములో ఒక దినము గొప్ప స్వామిజీ వ్రాసిన ఆధ్యాత్మిక గ్రంథాన్ని తీసి చదివాడు. అందులో మంచి పనులు చేయడము మంచివారి లక్ష్యమని, చెడు పనులు చేయుట చెడ్డవారి

లక్ష్యమని, అజ్ఞానులు జ్ఞానమును తెలుసుకోలేక వారికి ఇష్టమొచ్చిన చెడుపనులు చేయుచు పాపమును పొందుచుందురని, వారు తప్పక నరకమును అనుభవించవలె నని, అటువంటి వారు దైవమునెప్పటికి తెలుసుకోలేరని, మోక్షమనునది వారికి దొరకదని వ్రాయబడివున్నది. దానిని చదివిన తర్వాత అతను తన ప్రవర్తనలో ఎన్నో మార్పులు తెచ్చుకొని, అన్నీ మంచి పనులే చేయవలెనని దృఢసంకల్పముతో ప్రయత్నించుచుండెను. కొంతకాలమునకు ఒక గురువుగారి ఉపన్యాసము వినుటకు అవకాశము దొరికినది. అతను ఎంతో ఆసక్తితో జ్ఞానము తెలుసుకోవాలని ఆ గురువుగారి ఉపన్యాసము వద్దకుపోయి వినసాగాడు. అచటి గురువుగారు ఈ విధముగ చెప్పుచున్నాడు.

"మనిషి జ్ఞాని అనిపించుకోవాలంటే ఆచరణ ముఖ్యము. అతను చేయు ఆచరణను బట్టి వాడు జ్ఞానియా, అజ్ఞానియా అని నిర్ణయింపబడును. చదువు చెప్పు వానిని టీచర్ అంటాము. భూమిని దున్నువానిని రైతు అంటాము. కత్తి కర్రలతో బెదిరించు వానిని రౌడీ అంటాము. అట్లే సత్ప్రవర్తన కలిగిన వానిని జ్ఞాని అంటాము. మంచి పనులు చేయుచు చెడుపనులు ఏ ఒక్కటి చేయకుండువాడే నిజమైన జ్ఞాని. పెద్ద పాత్రలోని పాయసమైన, ఒక చిన్న విషబిందువు అందులో పడినంత మాత్రమున అది భుజించుటకు యోగ్యముకానట్లు, ఎంత పెద్ద జ్ఞాని అయిన ఒక చిన్న చెడుకార్యముతో తాను జ్ఞానమునకు యోగ్యుడు కాకుండ పోవును, జ్ఞాన భ్రష్టుడగును. అటువంటి వాడు రెండింటికి చెడినవాడనిపించు కొనును." ఆ విషయమంతయు విన్న అతను అప్పటినుండి చాలా జాగ్రత్తగ వ్యవహరించుచు, ఏ చెడుకార్యము చేయక అన్నీ మంచి పనులే చేయుచు, నేను జ్ఞానినౌచున్నానను సంతోషముతోయుండెను.

ఒకనాడు విధివశాత్తు తప్పక తప్పు చేయవలసి వచ్చినది. తనకిష్టము లేకున్న తాను తప్పు చేసినవాడై దానిని యోచించసాగాడు. అండాపాయసమైన

విషపుచుక్కతో ఆహార యోగ్యత కోల్పోయినట్లు, నేను కూడ ఈ ఒక్క చెడు కార్యముతో జ్ఞానమునకు అనర్హుడనని తలచి, నేను ఎప్పటికైన భ్రష్టుపట్టువాడనే కనుక జ్ఞానమార్గము నాకు సరిపోదు. అది సన్న్యసించి కాషాయగుడ్డలు వేసి ఏ కార్యములు చేయని వారికైతే సరిపోతుంది, మాలాంటి సంసారులకు కానిపనియని తలచి, ఆనాటినుండి జ్ఞానమను మాట విడిచి మొదటివలె నేను అజ్ఞానినే అనుకొనెను. జ్ఞానమనునది ఆచరణలో లేదని, అంతరంగ విచారణయందున్నదని తెలియక, జ్ఞానమను పేరుపెట్టి నీతిని బోధించు గురువుల మాటలు విని, అసలు జ్ఞానమార్గమంటే ఏమిటో తెలియక, జ్ఞానమార్గము యొక్క ప్రయత్నము మాటే విడచి, తనకు జ్ఞానమే వద్దనుకొని, దానికి తగనను తలపు వచ్చునట్లు చేసినదెవరు? ఉపన్యాసము చెప్పిన వారు, గ్రంథములు వ్రాసినవారు. అందువలననే పై శ్లోకమందు భగవంతుడు జ్ఞానియైనవాడు, అజ్ఞానులైన వారి బుద్ధికి కలవరము కలుగజేయ కూడదన్నాడు. మంచి చెడు పనుల మిళితమైన సంసారములోయుండక సన్న్యసించి పనులు చేయకుండ ఉండమని బోధించుటకంటే, పనులు చేయుట మంచిదని, ఆ పనులు మన ఇష్టప్రకారము జరుగక కర్మప్రకారము జరుగుచుండునని, దానికి అజ్ఞానము వలన బాధ్యులమనుకోవడము పొరపాటని బోధించి, తాను పనులు చేయుచు అందులో కర్మ అంటక ఉండు విధానము బోధించుచు, మంచి చెడు పనుల తారతమ్యములు మన వలన జరుగునవి కావని, అవి వెనుకటి జన్మల కర్మ వలన నిర్ణయింపబడినవని, వాటిని ఏమాత్రము మన దృష్టిలో పెట్టుకోక కర్మరీత్య పనులు చేయుచుండుమని చెప్పుటయే తెలిసినవారి పద్ధతి.

ఇపుడు మేము చెప్పిన భావమును చాలామంది ఒప్పుకోకపోవచ్చును. మంచిచెడు పనుల తారతమ్యములను వదలి సహజముగ ఎవరిపని వారు చేసుకుపొమ్మని చెప్పడము సమంజసమా! ఇది జ్ఞానపద్ధతాయని అడుగవచ్చును. దానికి నా తరుపున దేవుని సమాధానము క్రింది శ్లోకములో చూడండి.

(2) శ్లో॥ 27 : ప్రకృతేఃక్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః ।
అహంకార విమూఢాత్మా కర్తాహమితి మన్యతే ॥
(ప్రకృతి)

**భావము :** ప్రకృతి నిర్మాణము ప్రకారము కర్మ వలన కల్గు గుణప్రేరణ ద్వార జరుగు అన్ని పనులకు, కర్త తానేయని అహంకారము గల అజ్ఞాని తలచుచుండును.

**వివరము :** పంచభూతములచేత తయారైన ఈ శరీరమునందు శిరోభాగమున కంటికి కనిపించని నిర్మాణమొకటున్నది. అది అందరికి మూలమైనది. అందులో బ్రహ్మ, కాల, కర్మ, గుణచక్రములను నాలుగు చక్రాకారభాగములు గలవు. అందులో కర్మ, గుణచక్రములు మానవుని ఎడల చాలా ముఖ్యమైనవి. కర్మ చక్రములో జీవుడు గతములో చేసుకొన్న పాపపుణ్యములన్నియు నమోదై ఉండును. వాటినే కర్మ అంటున్నాము. ఆ కర్మ ప్రకారము క్రింది చక్రములో 3 భాగములలోని గుణములు ప్రేరేపింపబడి, ఆ గుణముల ప్రకారము బయటి కార్యములు జరుగుచుండును. అనగ ఒక పని జరుగుటకు కర్మచక్రములోని కర్మ కారణమైతే దాని వలన ప్రేరేపింపబడిన గుణము ద్వారా కార్యము ఆచరణకొచ్చుచున్నది. ఇది కార్యము జరుగుటకు శరీరమందు నెలకొల్పిన సూత్రబద్ధ నిర్మాణమై ఉన్నది. బయటి కార్యము మంచిదా చెడ్డదా అనుట లోపలనున్న కర్మనుబట్టి ఉండును. లోపలనున్న కర్మలోని పాపము ఆచరణకొచ్చినపుడు, జీవుడు కష్టమును నష్టమును అనుభవించుచున్నాడు. అదే విధముగ పుణ్యము ఆచరణకొచ్చినపుడు, సుఖము అనుభవమునకు వచ్చుచున్నది. ఇలా పాపపుణ్యములు ఆచరణకొచ్చి జీవుడు సుఖదుఃఖములు అనుభవించవలసిన పద్ధతి ప్రతి జీవరాసికి నిర్మాణమై ఉన్నది. ఇది దేవుడు నిర్మించిన ప్రకృతి యొక్క పద్ధతి. దైవ నిర్మితమైన ప్రకృతి శాసనములలో కర్మ, గుణములు, కార్యములన్నవి ఇమిడి ఉన్నవి. మానవుడు కర్మానుసారమైన కష్టసుఖములు అనుభవించుటకు గుణముల వలన ప్రేరేపింపబడిన కార్యములు చేయవలసియున్నది. బయట మానవుడు ఒక పనిని చేయుటకు ప్రకృతి నిర్మితమైన

గుణనిర్మాణము మొదలగునవి ముఖ్యకారణమై ఉన్నవి. జరుగుచున్న పని మంచిదా చెడ్డదా అనుట ముఖ్యము కాదు. అందుకు కారణమైన కర్మ, గుణములు ముఖ్యము. బయట జరుగుపని ఏదైనప్పటికి దానికి లోపల కర్మ, గుణములు సూత్రములుగ ఉన్నాయి. వాటి వలననే అన్ని పనులు జరుగుచున్నాయని తెలియక అన్నిటికి నేనే కారణమని, నా వలననే అన్ని పనులు జరుగుచున్నాయని, అజ్ఞానముతో నిండుకొని శరీరములో కేవలము ఒక భాగమై, ఒక్కచోట ఉన్న జీవుడు శరీర ఆకారము మొత్తము నేనేయను అహంకారమును పొందుచున్నాడు. అందువలన భగవంతుడు ప్రత్యేకించి ఈ శ్లోకమును చెప్పుచూ ప్రకృతి నిర్మితమైన కర్మ గుణముల ప్రకారము జరుగు పనులకు నేనే కర్తనని అహంకారము గలవాడనుకొనుచున్నాడని తెలిపాడు. అటువంటి వానికి మంచి చెడు అన్న భేదము ఉన్నది మరియు పాపపుణ్యములు ఉన్నవని తెలియాలి. జ్ఞానము కల్గినవారు ఏమి తెలిసి, ఎట్లు నడుచుకొంటాడో క్రింది శ్లోకము చూస్తాము.

(2) శ్లో॥ 28 : తత్త్వవిత్తు మహా బాహో! గుణకర్మ విభాగయోః ।
గుణాః గుణేషు వర్తన్త ఇతి మత్వాన సజ్జతే ॥
(కర్మయోగము)

**భావము :** తత్త్వ జ్ఞానమును తెలిసినవారు, కర్మలు గుణముల యొక్క భాగములను తెలిసినవారై, గుణముల వలననే కార్యములు జరుగుచున్నవని తెలిసియుందురు.

**వివరము :** ఆత్మజ్ఞానము తెలిసిన వానికి కర్మలంటే ఏమిటో, గుణములంటే ఏమిటో ముఖ్యముగ తెలిసియుండాలి. కర్మ గుణముల వివరము తెలియనివాడు ఆత్మజ్ఞానము తెలియనివాడేనని అర్థము. ఆత్మయొక్క వివరము తెలియాలంటే, ఆత్మ నివసించు శరీరము యొక్క వివరము తెలిసియుండాలి. శరీరము ఒక యంత్రములాంటిది. శరీరములో ఒకదానికొకటి అనుసంధానమైన విషయములు భాగములు ఎన్నో కలవు. శరీర యంత్రాంగములో ముఖ్యమైనవి కర్మ, గుణములు. ఒక ఇంజనులో ఇంజనుకు ఇంధనమైన నూనెను అందించు కార్బొరేటర్ మరియు దాని స్పీడును

కంట్రోలు చేయుటకు అనగ ఇంజను స్పీడును హెచ్చించుటకు తగ్గించుటకుయున్న గవర్నర్ అను పరికరములు ఎంత ముఖ్యమో, శరీరమను యంత్రమునకు కర్మ, గుణములు అంతే ముఖ్యమని తెలియాలి. ఇంజనులోని గవర్నర్, కార్బొరేటర్ పనిచేసినపుడు ఇంజను పనిచేయుచున్నది. అలాగే శరీరములోని కర్మ, గుణములు పనిచేసినపుడే శరీరము పనిచేయగలుగుచున్నది. ఇంజనులో కార్బొరేటర్‌వేరని, గవర్నర్‌వేరని, కదిలెడి భాగములైన పిస్టన్లు, చక్రములువేరని, తెలిసినపుడే దేనివలన ఇంజను కదలుచున్నదని తెలియుచున్నది. అట్లే శరీరములోని కర్మ, గుణములు వేరని, శరీరములోని కదిలెడు అవయవములు వేరని, తెలిసినపుడు శరీరము దేని కారణమున కదలుచున్నదని తెలియుచున్నది.

**ఒక మెకానిక్‌కు యంత్రము యొక్క పూర్తి వివరము తెలిసినట్లు, ఆత్మ జ్ఞానము తెలిసినవానికి శరీరములోని కర్మ గుణముల యొక్క విభాగముల వివరము పూర్తిగా తెలిసియుండును.** అటువంటివాడు కర్మవలన గుణములు ప్రేరేపింప బడుచున్నవని, ఆ గుణముల వలన శరీరము ద్వార సర్వ కార్యములు జరుగుచున్నవని, బయట జరుగు మంచి చెడు కార్యములకు లోపలయున్న కర్మ, గుణములే కారణమని, జీవుడైన తాను ఏమాత్రము ఏ కార్యమునకు కారణముకానని, శరీరము ద్వారా జరుగు పనులయందు తటస్థుడుగ ఉండవలెనని తలంచి, తాను పనులు చేయుచున్నను వాటిమీద ఆసక్తిలేనివాడై ఉండును. శరీరములో నేను ఒక భాగమైన జీవుడననుకొని, శరీరము యొక్క ఆకారము నేను కాదనుకొని, అహంకారము లేకుండ పనులు చేయుచుండును.

*(2) శ్లో॥ 29 : ప్రకృతేర్గుణ సమ్మూఢా స్సజ్జన్తే గుణకర్మసు ।*
*తానకృత్స్న విదోమందాన్కృత్స్నవిన్న విచాలయేత్ ॥*
*(ప్రకృతి)*

**భావము :** ప్రకృతి జనిత గుణములందు చిక్కియున్న మనుషునకు ఆ గుణముల

కార్యములయందే కర్మముల ప్రకారము ఆసక్తి కలిగించును. జ్ఞానులగువారు అట్టి అజ్ఞాన పరులను చలనమొందించకూడదు.

**వివరము :** కర్మప్రేరణ వలన గుణముల ప్రకారము కార్యములు చేయుట సమస్త మానవుల ఎడల నిర్మింపబడిన ప్రకృతి ధర్మము. అగ్నికి కాల్చుట ధర్మము, పాటకు రాగము ధర్మము, అట్లే మానవునకు కర్మప్రకారము కలుగు గుణముల కార్యములు చేయుట ధర్మము. ***మాటకు శబ్దమునెట్లు దూరము చేయలేమో, పాటకు రాగమునెట్లు లేకుండ చేయలేమో, అట్లే కర్మబద్ధుడైన మానవుణ్ణి ఆ కర్మ ప్రేరణవలన కలుగు గుణముల ప్రకారము కదలకుండ చేయలేము. ఇదే గీతయందు భగవంతుడు తెలియజేసిన ముఖ్యమైన ప్రకృతి ధర్మము.*** ఈ ధర్మము ప్రకారము జ్ఞానియైన అజ్ఞానియైన నడవక తప్పదు.

ఒక జీవితములోని అనేక సంఘటనలు కల్గిన చలనచిత్రమును మూడు గంటలపాటు మనము చూస్తున్నాము. ఆ చిత్రములోని అనేక దుఃఖసంఘటనలు, ఎన్నో హాస్య సంఘటనలు, మరెన్నో సంతోష సంఘటనలు మొదలగు ఎన్నో విధములైన విషయములు జరుగుట చూస్తున్నాము. ఇవన్ని తెల్లని తెరమీద చూడగల్గుచున్నాము. తెల్లని గుడ్డమీద ఇన్ని సంఘటనలు కల్గుటకు ప్రొజక్టరులోని ఫిల్ముకారణము. చిత్రములోని సంఘటనలన్ని ఫిల్ములో చిన్నగ చిత్రింపబడి ఉండి, చిత్రింపబడిన వరుస ప్రకారము తెరమీద ప్రొజక్టరు ద్వార పెద్దగ కన్పిస్తున్నాయి. హాలులో ఒక చిత్రమును మనము చూడాలంటే అందుకు అవసరము మొదటిది ఫిల్ము, రెండవది ప్రొజక్టరు, మూడవది తెల్లని పరదా(తెర). అట్లే ఒక కార్యము జరగాలంటే మొదటిది కర్మ, రెండవది గుణములు, మూడవది కర్మేంద్రియములు.

ఏ విధముగ ఫిల్ములేనిది చిత్రములేదో, అట్లే కర్మలేనిది అసలు జీవితమే లేదు. ఫిల్ము కారణముగ ఒక చిత్రమెట్లు జరుగుచున్నదో, అట్లే కర్మ కారణముగ ఒక జీవితము జరుగుచున్నది. ఫిల్ములో ఏ సంఘటనలు చిన్నగ ముద్రింపబడి ఉన్నాయో, అవియే పరదామీద కనపడుననుట జగమెరిగిన సత్యము. కాని కర్మలో

ఏమి రికార్డయి ఉన్నదో, అదే కర్మేంద్రియములైన కాల్లు, చేతులు, నోరు మొదలగు వాటిద్వార జరుగుచున్నదనుట జగమునకు తెలియని సత్యము. హాలు, ఫిల్ము, ప్రొజక్టరు, పరదా మనకు తెలియును. కావున హాలులో ఫిల్ము ఏదైతే సినిమా అదేనని అందరికి తెలియుచున్నది. కాని కర్మ, గుణములు, శరీరము, కర్మేంద్రియముల గురించి మనకు తెలియదు. కావున శరీరములో కర్మ ఏదైతే అదే కార్యము జరుగునని మనకు తెలియక పోయినది. మనకు తెలిసిన తెలియకపోయిన ఫిల్ములోని బొమ్మయే పరదా మీదకు వచ్చి ఆడునట్లు, కర్మలోనున్న సంఘటనలే కర్మేంద్రియముల ద్వారా కార్యమై జరిగితీరును. ఈ విషయము చాలామందికి తెలియదు. కావున వారందరు జరుగుచున్న కార్యమునే చూడగల్గుచున్నారు. కాని వెనుకయున్న కర్మను చూడలేకపోవుచున్నారు.

| **(హాలులో చిత్రపద్ధతి)** | **(శరీరములో జీవిత పద్ధతి)** |
|---|---|
| **ఫిల్ము** | **కర్మ** |
| ↓ | ↓ |
| **ప్రొజక్టరు** | **గుణములు** |
| ↓ | ↓ |
| **తెర (పరదా)** | **కర్మేంద్రియములు** |
| ↓ | ↓ |
| **చిత్రము** | **కార్యములు** |
| ↓ | ↓ |
| **అనుభూతి పొందువాడు ప్రేక్షకుడు** | **అనుభూతి పొందువాడు జీవుడు** |

బాహ్యముగ జరుగు కార్యములను మంచివి, చెడువి అను రెండుగ విభజించవచ్చును. జరుగుచున్నవి మంచివైన, చెడువైన వాటికి లోపలయున్న కర్మేయే కారణము. ఫిల్ములో ఉన్నదే పరదామీద చిత్రమైనట్లు, కర్మలో ఉన్నదే కరేంద్రియముల మీద కార్యమౌచున్నది. లోపలయున్న కర్మ మంచిదైన మంచి కార్యములు, చెడుదైన చెడు కార్యములు మానవులయందు జరుగుచుండును. ఈ విషయము ఏమాత్రము తెలియనివారు, ఒక దొంగను చూచి నీవు చెడు కార్యములు

చేయుచున్నావు, ఆ పని చేయవద్దని చెప్పినప్పటికి, అతను అపుడు దొంగతనము చేయకూడదని, దానివలన పాపమొచ్చుననుకొన్నప్పటికి, రెండవమారు జరుగు కర్మవుంటే తప్పక జరిగితీరును. అలా జరిగిన కార్యము అనగ దొంగతనమును గూర్చి ఆ దొంగ నేను వద్దనుకొన్నప్పటికి తిరిగి చేశానే ఇక **"నేను మంచివానిగ మారను"** అని చింతించెను. తెలిసినవాడు కర్మ రహస్యము తెలుపక మంచి చెడు భేదము చూపి వానిని కలవర పెట్టకూడదు. కర్మ సిద్ధాంతమును, దేహ ధర్మములను తెలిపి, కర్మమారితే కార్యము మారునని తెలిపి, వానికి కర్మఅంటనట్లు తెల్పాలి కాని, కార్యమును గురించి చింతించునట్లు చేయకూడదని భగవంతుడు పై శ్లోకమున తెల్పాడు. అపుడు తాను చేయుచున్నది హత్యలు, దాని వలన పాపమొచ్చునని, తనపని మంచిది కాదని చింతించిన అర్జునునకు, కార్యచింతమాని కర్మ అంటకుండ యుద్ధము చేయమని క్రింది శ్లోకమున భగవంతుడు ఏ ఉపాయము చెప్పుచున్నాడో పరిశీలించి చూస్తాము.

*(2)శ్లో॥ 30 : మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మ చేతసా ।*
*నిరాశీ ర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగత జ్వరః ॥*
*(కర్మయోగము)*

**భావము :** సర్వ కర్మలను నాయందే సన్న్యసించి, ఆధ్యాత్మికచింతన చేయుచు, రాజ్యకాంక్ష, నావారను మోహము మొదలగు గుణములను లేకుండ చేసుకొని, కలిగిన తాపమును వదలి యుద్ధము చేయుము.

**వివరము :** ఇచట భగవంతుడు సర్వకర్మలని చెప్పడములో విశేషమును ప్రతి ఒక్కరు గ్రహించవలెను. పాపమొచ్చు చెడు కార్యములు, పుణ్యమును తెచ్చిపెట్టు మంచి కార్యములు రెండింటిని కలిపి సర్వకార్యములని, వాటి ఫలితమును సర్వ కర్మలని చెప్పడము జరిగినది. గత జన్మలోని కర్మ ప్రారబ్ధమైనపుడు, దాని వరుస క్రమములో ఏ కార్యము జరుగవలయునో ఆ కార్యము జరిగితీరును. జరిగిన కార్యములలో జీవుడు అహంకార భావమును కల్గియుండుట వలన, తిరిగి ఆ

కార్యము క్రొత్త కర్మయిన ఆగామికముగా మారి తలకెక్కుచున్నది. అలా క్రొత్త కర్మ మన తలకెక్కకూడదదంటే కర్మయోగము ఆచరించడమొక్కటే మార్గము. అది సులభముగ అర్థము కావాలనుటకు భగవంతుడు కర్మలను నాకు వదలి కార్యములు చేయమన్నాడు. కార్యము చేయడములో కార్యము మీద ఆశకాని, నాది, నా అను మోహము లేకుండ చేయమన్నాడు. అట్లు చేయబడునది యుద్ధమైన దానివలన కర్మ అంటదన్నాడు.

(2) శ్లో 31 : యేమే మత మిదం నిత్యమను తిష్ఠన్తి మానవాః
శ్రద్ధావన్తోఽ నసూయన్తో ముచ్యన్తే తేఽపి కర్మభిః
(కర్మయోగము, జీవాత్మ)

**భావము :** ఎవరైతే నేను చెప్పిన ఈ నాపద్ధతి నచ్చినవారై పూర్తి శ్రద్ధకల్గి అసూయలేని వారై అనుసరింతురో వారికి కర్మ అంటకుండ పోవును.

**వివరము :** పైన జరుగు కార్యములకు లోపలి కర్మ కారణమని తెలిసి, కార్యములను త్రోసివేయు ప్రయత్నము చేసినప్పటికి ప్రయోజనము లేదని తెలిసి, కర్మనే త్రోసివేయ వలయునను నా పద్ధతి నచ్చినవారై, నేనుచెప్పిన జ్ఞానము ప్రకారము శ్రద్ధకలిగి, మంచి చెడు కార్యములు ప్రారబ్ధము ప్రకారము వచ్చునని, జరుగుచున్న కార్యములను గూర్చి యోచించక, రాబోవు కర్మ అంటకుండ ఎవరైతే ప్రపంచములో పనులు చేయుచుందురో, వారే నిజమైన కర్మయోగులని, అట్టివారికి వారు చేయు పనులయందు వచ్చు కర్మ అంటదన్నాడు.

(2) శ్లో॥32 : యే త్వేతదభ్య సూయన్తో నానుతిష్ఠన్తి మే మతమ్ ।
సర్వజ్ఞానవిమూఢాం స్తాన్ విద్ధి నష్టానచేతసః ॥
(కర్మయోగము, జీవాత్మ)

**భావము :** ఎవడైతే నా పద్ధతి మీద అసూయ పొంది అనుసరింపడో, అట్టివాడు నేను చెప్పిన అన్ని జ్ఞానములకు మూఢుడై జ్ఞానమార్గములో పూర్తి నష్టము పొందినవాడగును.

**వివరము :** సహజముగ ఎందరో మంచి చెడు కార్యముల భేదము కల్గియుందురు. వారికి జ్ఞానము తెలియనపుడు, కార్యములు ఏ విధముగ జరుగుచున్నవో వాటి విధానము తెలియనపుడు, చెడును అసహ్యించుకొనుట సహజమే. మంచిని చెడును రెండింటిని సమానముగా తలచి, ఏది జరిగినప్పటికి కర్మ అంటని విధానము ఉందన్నప్పుడు, ఎందరికో చోద్యముగ కన్పించి ఆ విధానము నచ్చక, ఆ విధానము చెప్పిన వానిమీదనే అసూయ ఏర్పరుచుకొను అవకాశము గలదు. అట్టి వారికి భగవంతుడు చెప్పిన జ్ఞానము నచ్చక పరమాత్మ జ్ఞానమునకు దూరమగుదురు. ప్రకృతి విషయాలే వానికి గొప్పజ్ఞానముగా కన్పించుచు జ్ఞానమార్గమున లాభము పొందుచున్నాననుకొనునట్లు చేసి, జ్ఞానమున నష్టపోయిన వానిగ చేయును. వాని మార్గమే వానికి గొప్పగ కన్పించునట్లు చేయును. నిజముగ వాడు జ్ఞానహీనుడైపోవును.

*(2) శ్లో॥ 33 : సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతేర్జ్ఞానవానపి ।*
*ప్రకృతిం యాన్తి భూతాని నిగ్రహః కిం కరిష్యతి ॥*
*(జీవాత్మ)*

**భావము :** జ్ఞానియైనప్పటికి తనయొక్క గత జన్మ సంస్కారములకు తగినట్లు నడుచుకొనును. మిగతా జీవరాసులు కూడ వాటివాటి కర్మప్రకారము నడుచు చున్నవి, ఫలితమును పొందుచున్నవి. నేనిట్లు నడువకూడదను నిగ్రహము ఎవనికి పనికిరాదు.

**వివరము :** చలనచిత్ర ప్రదర్శనలో ఫిల్ము ఎంత ముఖ్యమో, జీవితములో కర్మ అంతయే ముఖ్యమని ముందే తెలుసుకొన్నాము. ఫిల్మును బట్టి బొమ్మ, సంఘటనలు మొదలగునవి చిత్రములో ఉండును. ఫిల్మును మార్చకుండ బొమ్మను మార్చవలయును అనుకొంటే ఎట్లు సాధ్యము కాదో, అట్లే మానవుని లోపలి కర్మ మార్చక బయటి కార్యములు మార్చవలయుననుకొంటే అది సాధ్యము కానిపని. ధర్మము ప్రకారము ప్రతి జీవరాసి కర్మానుసారము చలించక తప్పదు. విష్ణు, ఈశ్వర, బ్రహ్మ మొదలగువారు దేవతలైనప్పటికి కర్మను అతిక్రమించి నడువలేరు. వారు కూడ

ఉన్న కర్మను అనుభవించక తప్పదు. మనిషి జ్ఞానియైనప్పటికి తన గత జన్మ కర్మ ప్రారబ్ధమై వచ్చినపుడు అది ఏ కర్మ అయినప్పటికి, దాని ప్రకారము అతను నడువవలసి వస్తుంది. జ్ఞానియైనప్పటికి తన ప్రవర్తన తన చేతిలో ఉండదు. అతని ప్రవర్తన అతని లోపల నిక్షిప్తమైవున్న కర్మను బట్టియుండును. గొప్ప జ్ఞానవంతుడైనను అతని చేత ప్రారబ్ధ కర్మరీత్య ఒక్కొక్కపుడు చెడు కార్యమైనను జరుగువచ్చును, లేక ప్రతిదినము నీచ వృత్తిలోనైన అతను బ్రతుకుతుండవచ్చును. కర్మరీత్య బయట జరుగు పనులనుబట్టి జ్ఞానము తెలియనివారు అతనిని నీచుడన్నను, తెలిసిన వారియందు అతను గొప్ప జ్ఞానియే. భగవంతుడు చెప్పిన ఈ పద్ధతియే చాలా మందికి అర్థముకాక పోయినది. కర్మ యొక్క పద్ధతి తెలియనివారు కార్యములనే చూస్తు, ఎదుటి వారిని తక్కువగ తప్పుడు అంచనా వేయగల్గుచున్నారు. అటువంటి వారికి భగవద్గీత పుస్తకము అహర్నిశలు దగ్గరేవున్నప్పటికి, గీతలోని భావము మాత్రము చాలా దూరముగ ఉండునని తెలియాలి.

జ్ఞానులైనప్పటికి తన పూర్వజన్మ కర్మమునకు తగినట్లు నడువక తప్పదను దేవుని మాటను ప్రతి ఒక్కరు గుర్తించవలయును. గొప్ప జ్ఞానులైన కర్మయోగులు కూడ కర్మబంధనము ప్రకారము నడువక తప్పనపుడు, సామాన్యుడు కర్మనుండి తప్పించుకోగలడా! తన ధర్మము ప్రకారము కర్మ ఎవరినీ వదలదు. తన లిస్టులో ఏమి ఉండునో దాని ప్రకారమే ప్రతి ఒక్కరిని ఆడించగలదు. అందువలన జ్ఞానులైన, సామాన్యులైన కర్మరీత్య ఏ వృత్తిలో నడువవలెనో, ఏ సమయమునకు ఏ పని చేయవలయునో దానిని చేయవలసి ఉండును. అట్లుకాక నేను ఈ పనులను మాత్రము చేయుదును, ఆ పనులు చేయననుకొనుట అవివేకము. వాని నిగ్రహము కర్మముందర ఏమి పనికి రాదని తెలియుము. ఎందరో చెడు కార్యములను వదలండి మంచి కార్యములు చేయండని వేదికలెక్కి హితము చెప్పుచుందురు. కాని ఆ విధముగ చెప్పినవారు కూడ చెడు కార్యములు చేయక తప్పలేదు. కారణము కర్మయని తెలియాలి. చెప్పువారు కాని, చెప్పించుకొనువారు కాని ఉన్న కర్మప్రకారము నడువక తప్పదు. ఇది దేవుని శాసనము, భగవంతుడు చెప్పిన ధర్మము.

ఇంతవరకు చెప్పిన విధానమునకు పూర్తి భిన్నముగ ఉన్నట్లు క్రింది శ్లోకము భ్రమింపజేస్తున్నది. ఇటువంటి సందర్భములోనే మెదడు పూర్తి ఉపయోగించి చూడాలి. అంత జాగ్రత్తగ చూడవలసిందేమిటో క్రింద చూస్తాము.

*(2) శ్లో॥ 34 : ఇంద్రియ స్యేంద్రియస్యార్థే రాగద్వేషౌవ్యవస్థితౌ ।*
*తయోర్నవశ మాగచ్ఛేత్తౌ హ్యస్య పరిపన్థినౌ ॥*
*(బ్రహ్మ యోగము)*

**భావము :** ప్రతి ఇంద్రియ విషయమునందు రాగద్వేషములు ఉన్నవి. ఆ రాగ ద్వేషములకు మనుజుడు వశము కారాదు. వాటిని నిగ్రహించుకోవలయును. ఆ రాగద్వేషములు మనిషికి శత్రువులలాంటివి.

**వివరము :** ఇక్కడ చెప్పిన శ్లోకముకంటే ముందు శ్లోకములో మానవుని నిగ్రహ ప్రయత్నము ప్రయోజనము లేదు. కర్మప్రకారము కార్యములు జరిగితీరునన్నాము. ఇపుడు ఈ శ్లోకమున రాగద్వేషమనెడి గుణములకు వశము కారాదన్నపుడు ఆ గుణముల జోలికి నీవు పోవద్దని అర్థము. అవి వచ్చినప్పటికి శత్రువులకు దూరముగ ఉన్నట్లు దూరముగ ఉండవలెనని అర్థము. ఈ శ్లోకము నిగ్రహించుకోమంటే పై శ్లోకము నిగ్రహించుకోలేవు అని చెప్పడము చూస్తే, ఎవరికైన పిచ్చిపట్టినంత పని అవును. ఈ రెండు శ్లోకములందు భగవంతుడు వాస్తవమునే చెప్పాడు కాని ఆయన ఏమాత్రము పొరపడి చెప్పలేదు. ఎందుకనగా! ఈ రెండు శ్లోకములలోను విధానములు వేరై ఉండుట గ్రహించవలసి ఉన్నది. కార్యముల ఎడల ఎవడు నిగ్రహించుకోలేడనుట వాస్తవము. కాని కార్యముల విషయము కాక బ్రహ్మయోగమును ఆచరించవలెనని ప్రయత్నిస్తూ ఆసనము మీద ఊరక కూర్చున్న వానికి మంచి చెడు యోచనలు వచ్చుట సహజము. ఆ సందర్భములో యోచనలరూపములో వచ్చు గుణములను తప్పక నిగ్రహించ వలయును. అట్లు నిగ్రహించని ఎడల అది బ్రహ్మయోగము కాజాలదు. శరీరమందు ఏ ఒక్క గుణము పని చేయనపుడే బ్రహ్మయోగమగును. బ్రహ్మయోగ భ్రష్టత్వమునకు

లోపల రగులుగుణములే కారణములు. బ్రహ్మయోగికి మాత్రము రాగద్వేషములు మొదలగు గుణములన్నియు పరమ శత్రువులతో సమానము. అందువలన బ్రహ్మయోగ సాధకుడు తప్పక గుణములను నిగ్రహించుకొని తీరవలెను. ఇపుడు కొందరికొక ప్రశ్న రావచ్చును. అది ఏమనగ! **"కర్మప్రకారము గుణములు, గుణముల ప్రకారము కార్యము అన్నప్పుడు అవి శాసనమైనపుడు మనము నిగ్రహించుకోలేమని తేల్చి చెప్పినపుడు గుణములను నిగ్రహించుకోమని వాటికి వశము కారాదనడమేమిటి?"** అని అడుగవచ్చును. దానికి సమాధానమేమనగా! నిగ్రహించుకోలేవు అని చెప్పినది అజ్ఞానులకు, మరియు అజ్ఞానులను కలవర పెట్టకుండ అజ్ఞానులవలె ప్రవర్తించి తీరవలెనని చెప్పినది కర్మయోగులకు, వారు ప్రపంచములో పనిచేసి తీరవలసిందే. కావున మంచి చెడు కార్యముల వరుస తప్పక వచ్చితీరును. పనిచేయు వారికి చెప్పిన ధర్మమది, పని చేయునపుడు మంచిది చేయవలెనని, చెడుది చేయకూడదను తన నిర్ణయము నిలువదు. అది కర్మను బట్టి జరిగిపోవుచుండును. ఎవడు ఆ విధానమును అతిక్రమించలేడు. కాని బ్రహ్మయోగులు ఏ కర్మను ఆచరించనివారు. వారియందు ఏ అవయవము, ఏ గుణము పని చేయదు. బ్రహ్మయోగములో ఉన్నంత కాలము కర్మ స్థంభించిపోయి ఉండును. అట్టి వానికి బాహ్య శబ్ద,స్పర్శ, రూప,రస,గంధాదులతో సంబంధములేదు. అందువలన కర్మయోగులుగాని, మిగతావారు గాని కార్యబద్ధులైనట్లు బ్రహ్మయోగులు కారు. కర్మయోగులు కార్యములు చేయవలసి ఉన్నది. జ్ఞానముతెలిసిన వారికి కర్మ ప్రకారము కార్యములు ఏవైన చేయవలసివున్నది కావున వారు నిగ్రహించుకోవడమనుట కానిపని. బ్రహ్మయోగులు కర్మనే స్థంభింప చేయువారు, కనుక గుణములను తప్పక వదలవలసివచ్చును. బ్రహ్మయోగి గుణములను స్థంభింపచేసి, వాటికి అనుసంధానమైన కర్మను స్థంభింపచేయును. ఆ ప్రయత్నమే బ్రహ్మయోగసాధన. అట్టి సాధనలో గుణములు బ్రహ్మయోగికి శత్రువులలాంటివి. ప్రయత్నము చేయుచు వాటిని జయించిన వానికి బ్రహ్మయోగము లభ్యమగును. ఆ యోగ సమయములో కర్మ స్థంభించివున్నది. కావున కార్యములు లేవు, గుణములు లేవని తెలియాలి. అట్లుకాక కర్మ గుణములు

అన్ని పనిచేయుచు కార్యములు ఆచరించునది కర్మయోగము. దీనియందు జ్ఞానము తెలిసిన కర్మయోగులకు, తెలియని అజ్ఞానులకు ఏమి తేడా ఉండదు. వారికి కర్మరీత్యా గుణములు, గుణములరీత్యా కార్యమన్న సూత్రము వర్తించును. కావున వారు కార్యములను నిగ్రహించలేరని తెలియాలి. కర్మయోగము వేరని, బ్రహ్మయోగము వేరని, తెలిసినపుడే నిగ్రహించలేని వారు వేరని, నిగ్రహించువారు వేరని తెలియును. పనులు చేయువారు నిగ్రహించలేరు. బ్రహ్మయోగులు మాత్రము నిగ్రహించవలసి ఉన్నదని తెలియుచున్నది.

2)శ్లో॥ 35 : శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్ ।
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః ॥
(జీవుడు, కర్మ యోగము)

**భావము :** అనుష్ఠితమగు పరధర్మముకంటే గుణములేని స్వధర్మమే శ్రేయస్కరము. పరధర్మములో ఉన్న భయముకంటే స్వధర్మములోని మరణమే మేలు.

**వివరము :** ఈ శ్లోకములో ముఖ్యముగ తెలుసుకోవలసినది పరధర్మము, స్వధర్మము. శాస్త్రబద్ధముగ స్వధర్మమంటే ఏమిటని తెలిస్తే దానివెంట పరధర్మము కూడ తెలియును. దానికంటే ముందు ధర్మమంటే ఏమిటని తెలియాలి. ధర్మమును తెలిస్తే దాని తర్వాత స్వధర్మమేది, పరధర్మమేదని సులభముగ తెలియవచ్చును. ***"ఒక వస్తువు లేక పదార్థము జీవమున్నది కాని, జీవములేనిది కాని దానికున్న సూక్ష్మ సహజత్వమును ధర్మము"*** అంటాము. ఆ సహజత్వము మొదట దైవత్వము నుండి లభించినదై ఉండును. ఒక పదార్థమునకున్న సహజత్వమును దానికున్న ధర్మము అనగలము. ఇక్కడ మీరు నన్ను ఒక ప్రశ్న అడుగవచ్చును. అది ఏమనగా! "ఒక మనిషి చిన్నతనము నుండి మిక్కిలి కోపము గలవాడై ఉన్నాడు. పెద్దవాడైనను అతను కోపిష్టిగనే ఉన్నాడు. అతనికి చిన్నతనము నుండి కోపము సహజముగ ఉన్నది కదా! అ మనిషికి కోపము ధర్మమేయగునా?" దానికి మా

సమాధానము. మనుష్యజాతికంతయు ఏదైతే సహజముగ ఉన్నదో అదే ధర్మమగును. ఒక్కొక్క మనిషికి ఒక్కొక్క ధర్మముండదు. ఇక్కడ ఒకడే కోపిష్టి కావున అది ధర్మము కాదు. ఉదాహరణకు ఒక నిమ్మకాయ పుల్లగా ఉన్నది. అన్ని నిమ్మకాయలు పుల్లగనే ఉన్నవి. నిమ్మకాయలో పులుపే దాని ధర్మమగును. ఈ విధముగా ఒక చెట్టుకు ఒక ధర్మముంటే ఆ జాతి చెట్లన్నింటికి అదే ధర్మముండాలి. అపుడే అది ధర్మమగును. ఒక జాతి మొక్క ఆకులో తేలు విషమును హరించు సహజత్వమున్నది. ఆ జాతి మొక్కల ప్రతి ఆకులోను అదే సహజత్వమున్నది. ఇక్కడ ఆ మొక్కకున్న సహజత్వమే దాని ధర్మమగును. అట్లుకాక ఒక మొక్కలో ఆ శక్తి ఉండి, అదే జాతి వేరు మొక్కలకు ఆ శక్తి లేకపోతే అది ధర్మమనబడదు. ఒక మనిషికి ఉన్నది ధర్మము కాదు. అందరికి ఉన్నదే ధర్మమగును. ధర్మము అనునది పుట్టుకతోనే వచ్చునది. అందువలన దానిని సహజత్వమన్నాము. **'జ'** అనగ పుట్టుట అని అర్థము. సహచరుడు అనగ వెంట తిరుగువాడని అర్థము. అట్లే **'సహజ'** అనగ వెంట పుట్టునదని అర్థము. దీని ప్రకారము **'సహజత్వము'** అనగా పుట్టుకతోనే వచ్చినదని అర్థము. ఒక జాతికి ఒకే విధముగ పుట్టుకతో వచ్చినదేదో అదే ధర్మమగును. ఇపుడు ధర్మమంటే ఏమిటి అన్న విషయము కొంత అవగాహనయైనదను కుంటాము. పై శ్లోకములో భగవంతుడు ధర్మమును రెండుగా విభజించాడు. వాటికి స్వధర్మము, పరధర్మము అని పేరు పెట్టాడు.

ప్రకృతి, పురుషుడని ప్రపంచమంతా రెండు భాగములుగ విభజింపబడి ఉన్నది. ప్రకృతి అనగ పంచభూతములు మరియు వాటివలన పుట్టిన సమస్తము. పురుషుడనగా పరమాత్మ మరియు దాని అంశయైన జీవాత్మ, ఆత్మ. పరమాత్మ, ఆత్మ, జీవాత్మ ఒక భాగముకాగా, పరమాత్మ చేతనే తయారు చేయబడిన ప్రకృతి, దానికి సంబంధమైన గుణములు, ఇంద్రియములు మొదలగునవి అన్నియు ఒక భాగమైవున్నవి. మొత్తము మీద ప్రకృతి అంశయైన దానికంతటికి ఒక ధర్మము, పరమాత్మ అంశయైన దానికంతటికి ఒక ధర్మము కలదని తెలియుచున్నది. దీనివలన ప్రకృతి పరమాత్మ ధర్మములు వేరు వేరని చెప్పకనే తెలియుచున్నది.

ఇపుడు మనము ప్రకృతిలోని భాగమైవున్నామా లేక పురుషునిలోని భాగమై ఉన్నామాయని యోచిస్తే, మన శరీరము మరియు దానిలోని భాగములన్నియు ప్రకృతికి సంబంధించినవి కాగ, అందులో జీవాత్మగనున్న మనము పరమాత్మకు సంబంధించిన అంశగలవారమై ఉన్నాము. అందువలన మన శరీరము ప్రకృతి ధర్మముతో కూడుకొనివుండగ, అందులోని జీవాత్మ అయిన మనము పరమాత్మ ధర్మమునకు సంబంధించివున్నాము. ***'స్వ' అనగ నా, 'పర' అనగ నాకంటే వేరైనదని అర్థము. స్వ, పర ధర్మములనగా జీవుని ధర్మము స్వధర్మమని, ప్రకృతి ధర్మము పరధర్మమని తెలియాలి.*** జీవాత్మలకు ఆత్మధర్మమే స్వధర్మమని తెలిసిన తర్వాత ప్రకృతి లేక శరీరము యొక్క ధర్మమంతయు పరధర్మమని సులభముగా తెలిసిపోతున్నది.

ఇక్కడ అసలు విషయానికొస్తే పై శ్లోకమున స్వధర్మములోను, పరధర్మము లోను జరుగు పనులున్నాయని తెలియుచున్నది. ఆ శ్లోకములోనే స్వధర్మము గుణములులేనిదని కూడ చెప్పారు. స్వధర్మమునకు పరధర్మము వ్యతిరిక్తమైనది. కావున స్వధర్మము గుణములులేనిదైతే, పరధర్మము గుణములు కలదిగ ఉన్నదని తెలియుచున్నది. దీనిని బట్టి గుణములు లేకుండ ఆచరించునది స్వధర్మమని, గుణములతో ఆచరించునది పరధర్మమని సులభముగ తెలియుచున్నది. ఈ రెండింటిలో స్వధర్మమును ఆచరించుట జీవునిగవున్న నీకు మంచిదని కూడ చెప్పాడు. మనమందరము జీవులమే. కావున స్వధర్మమనునది ఆనాటి అర్జునునకే కాదు మనకు కూడ అవసరమని తెలియుచున్నది. స్వధర్మమైన మనందరి ధర్మము శ్రేయస్కరమైనది.

నిమ్మకాయకు సహజముగవున్న ధర్మము పులుపు. అలా నిమ్మకాయ పుల్లగ ఉండక చేదుగనో, చప్పగనో ఉన్నదనుకొందాము. అపుడా నిమ్మకాయ తన స్వధర్మమును కోల్పోయినదని, అధర్మమైన పరధర్మములో ఉన్నదనుకొనవచ్చును. అలాగే ఒక మనిషి స్వధర్మమును కలిగివుండక పరధర్మములో ఉన్నాడనుకొనుము.

అపుడువాడు అధర్మములో ఉన్నాడని చెప్పవచ్చును. భూమిమీద చాలా వరకు చెట్లు, కాయలు పదార్థములు తమ ధర్మమును కోల్పోవడములేదు. కాని మనుషులు చాలావరకు నూటికి తొంభైతొమ్మిది పాల్లు స్వధర్మమును కోల్పోయి పరధర్మపరులైనా రని చెప్పవచ్చును. అందువలననే పై శ్లోకమున హెచ్చరించుచు స్వధర్మము మంచిదని చెప్పవలసి వచ్చినది.

ఇక్కడ స్వధర్మ ఆచరణ ఏమి? పరధర్మ ఆచరణ ఏమి? అను ప్రశ్నలు రాకతప్పవు. వాటి జవాబు క్రింద చూస్తాము. స్వధర్మము, పరధర్మము ఒకే శరీరములో ఉన్నవి. జీవితమును శరీరముతో మొదలుపెట్టిన ప్రతి జీవుడు మొదట పరధర్మములోనే ఉండును. చిన్నతనమునుండి ప్రతి ఒక్కరు పరధర్మమునే ఆచరించవలసి ఉన్నది. మొదట పరధర్మముతో మొదలిడిన జీవితము కొంత కాలమునకు స్వధర్మములోనికి రావలసివున్నది. కాని 99 శాతము మానవులు చివరి మరణము వరకు స్వధర్మములోనికి రాలేక పరధర్మములోనే పోతున్నారు.

మొదట పరధర్మమునుండి స్వధర్మమునకు దారివున్నది. ఎందుకనగ ప్రతి ఒక్కరు కడుపు కోసము ఏదో ఒక పనిని ఆచరించవలసివుండును. ఆ పని శరీరములోని గుణములు, మనస్సు, జ్ఞానేంద్రియములు చివరకు కర్మేంద్రియముల ద్వారా జరుగుచుండును. గుణముల కార్యములన్ని ప్రకృతికి సంబంధించినవి. అలాంటప్పుడు ప్రతి మనిషి ఉదయము నుండి కార్యములలోనే మునిగివుండును. కనుక వాడు ఆత్మకంటే వేరైన పరధర్మములో ఉన్నాడని చెప్పవచ్చును. ఆత్మజ్ఞానమును తెలిసినవాడు అనగ స్వధర్మమును తెలిసినవాడు గుణములను మనస్సు ద్వారా నిలిపివేసి కార్యము మీద లగ్నముకాక, ఆత్మ మీదనే లగ్నమైనాడనుకొనుము, అపుడు వాడు స్వధర్మమును ఆచరించినట్లగును. ఒకే శరీరములో రెండు ధర్మములున్న దానివలన, ఏది స్వధర్మమో, ఏది పరధర్మమో తెలియక పోవడము వలన, మరియు స్వధర్మము యొక్క వివరమే తెలియక పోవడము వలన, పరధర్మము చిన్నతనమునుండే అలవాటైన దానివలన, చాలావరకు చాలామంది పరధర్మములో సులభముగ

చిక్కుకున్నారు. స్వధర్మము యొక్క విలువకాని, దాని ఆవశ్యకత కాని తెలియక పోవడము వలన, దానిని తెలుసుకొను తీరిక ఓపిక లేని దానివలన, మరియు దానిని గురించి తెలుపువారు లేని దానివలన, ఎన్నో కారణముల వలన తన ధర్మమును తానే వదులుకొన్నవారై ఉన్నారు. చిన్న వయస్సు నుంచే అలవడినది పరధర్మము కాగ, ఇపుడు కష్టపడి నేర్చుకోవలసినది స్వధర్మము. తానెవరు అను ప్రశ్నరాని వారు తన ధర్మమును గురించి ఆలోచించరు.

స్వధర్మము వలన లాభమేమి? పరధర్మము వలన నష్టమేమి? స్వధర్మము ఎందుకు శ్రేయస్కరమైనదని యోచిస్తే, పై శ్లోకములోనే **'పరధర్మోభయా వహః'** అను మాటను బట్టి పరధర్మము భయముతో కూడుకొన్నదని, **'స్వధర్మే నిధనం'** అను మాటను బట్టి స్వధర్మములో మరణమున్నదని తెలియుచున్నది. ఇక్కడ అందరు పొరపాటుపడుటకు అవకాశము కలదు. అదేమనగా మరణము, భయము అను రెండింటిలో మరణము నుంచి దూరముగ ఉండవలెనని అందరు అనుకోవడమే పొరపాటు. ఆత్మజ్ఞానము తెలియనివారు పొరపడుటకంటే, తెలిసినవారు పొరపడుట మరీ విడ్డూరము. నిజానికి యోచిస్తే ఈ శ్లోకములోనే పరధర్మములో ఉండు భయముకంటే, స్వధర్మములో ఉండు మరణమే శ్రేయస్కరము అన్నారు. అటువంటపుడు భగవంతుడు చెప్పిన మాటకు వ్యతిరేకముగ మనుషులు మరణముకంటే భయమే శ్రేయస్కరము అనుకొనుట పొరపాటు కాదా!

జ్యోతిష్యశాస్త్రములో మొత్తము నవ గ్రహములున్నవని వాటిలో ఏడు కనిపించునవని, రెండు మాత్రము మసకగ కనిపించు ఛాయగ్రహములని, అవియే రాహువు, కేతువులని, ఈ రెండు గ్రహములు ఏడు గ్రహములకు వ్యతిరేకదిశలో తిరుగుచున్నవని, గురు శని భాగములుగ విభజింపబడిన సప్తగ్రహాలకు రాహువు, కేతువులు అధిపతులని, గురు భాగమునకు కేతువు, శని భాగమునకు రాహువు అధిపతులుగ ఉన్నారని పెద్దలు తెలిపినట్లు మన శరీరములో కూడ ఒక్కొక్క గుణభాగములో యోగశాస్త్రరీత్యా కనిపించు 12 గుణములున్నవి. అట్లే రాహువు కేతువులవలె ఛాయగ కనిపించు రెండు గుణములున్నవి. అవియే **భయము,**

**ధైర్యము.** ఇవి కాక మరియొకటి మాత్రము ప్రత్యేకత కల్గి రెండు వైపుల ఉన్నది **అదియే శ్రద్ధ.** 12 గుణములలో గురు శని పార్టీలలాగ మంచివి ఆరు, చెడువి ఆరుగ విభజింపబడి **దైవ, అసుర** గుణములని పేరు పెట్టబడినవి. ఈ విధముగ మన శరీరములోని ఒక్క గుణభాగములో 12+2+1=15 గుణములున్నవని తెలియు చున్నది. ఇందులో **అజ్ఞాన సంబంధమైనది భయము. జ్ఞాన సంబంధమైనది ధైర్యము.** శ్రద్ధ అనునది అజ్ఞానము, జ్ఞానము రెండింటికి సమానముగ ఉన్నది. గుణములు పని చేయునపుడు అజ్ఞాన వశమున భయము కూడ కల్గుచుండును. **'పరధర్మో భయావహః'** అను మాట ప్రకారము శరీరములో గుణములు పని చేయునంత కాలము భయము కల్గుచునేవుండును. దీనిని బట్టి చిన్నతనము నుండి భయము ఉన్నదని తెలియుచున్నది.

సాధారణముగ అందరు భయముకంటే మరణము పెద్దదనుకొంటారు. మరణము జీవితములో ఒక్కక్షణము మరియు ఒక్కమారే ఉండును. భయము జీవితములో ఎంతో కాలముండును మరియు ఎన్నోమార్లు ఉండును. ఎంతో కాలము పొడవుగ ఉన్న భయము పెద్దదా? ఒక్క క్షణ కాలమున్న మరణము పెద్దదా? అని యోచిస్తే చాలాకాలముండు భయమే పెద్దదగును. కాని క్షణ కాలముండు మరణమెలా పెద్దదగును? చాలా కాలము మానవున్ని పీడిస్తు అనేక వ్యథలు కలుగచేయు భయమును పెద్దదనుకోక ఒక్కక్షణము ఒక్కమారు వచ్చు ఏ బాధలేని మరణము పెద్దదనుకొనుట చాలా పొరపాటు కదా! అందువలన పై శ్లోకమున భగవంతుడు **'స్వధర్మేనిధనం శ్రేయః పరధర్మో భయావహః'** పరధర్మములో ఉన్న భయముకంటే స్వధర్మములో ఉన్న మరణమే మేలు అన్నాడు. జీవితాంతము పీడించి కృశింపజేయు భయము ప్రకృతి పరమైనది, అజ్ఞాన వశమైనది. ఏ సమస్యకైన కర్మ విధిని తెలిపి బాధలేకుండ చేయు ధైర్యము జ్ఞానపరమైనది.

ఆత్మజ్ఞానమును జీర్ణింపజేసుకొనని ఎవరినైన భయము పీడిస్తు, మరణమే గొప్పదను భావము కలుగజేసి పరధర్మములోనే నిలుచునట్లు చేయుచున్నది.

ఉదాహరణకు  ఒక గురువు దగ్గర 12 సంవత్సరములు జ్ఞానము తెలుసుకొన్నవారు కొందరున్నారనుకొందాము.  గురువువద్ద ఎంతో జ్ఞానము తెలిసినప్పటికి దానిని ఆచరించకపోతే వారు తెలియనివారితో సమానమేయగుదురు.  ఒక గురువు తన శిష్యులుగ ఉన్నవారిని వాచాజ్ఞానములోనే గొప్పవారు కాక, ఆచరణ జ్ఞానములోను గొప్పవారుగ ఉండవలెనని తలచి,  వారు ఆచరణలో ఎట్లుందురోనని వేచిచూచెను. కర్మప్రకారము గురువుగారికి పెద్దసమస్య వచ్చింది. ఆ సమస్యలో ప్రత్యక్షముగ అందరికి తెలిసినట్లు  గురువుగారికి ఎంతో కష్టము నష్టము వచ్చింది.  అంతవరకు గురువును ఎంతగానో పొగుడుచుండిన కొందరు గురువుగారి పరిస్థితిని చూచి, ఈయన వద్దకు వచ్చేదానివలన మనకు కూడ కష్టము నష్టము వస్తుందని తలచి, గురువుగారి దగ్గరకే రాకుండ మానుకొన్నారు.  ఇక్కడ భయమనునదియే ముఖ్యముగ వారియందు పనిచేసిందని తెలియాలి.  కష్టము వస్తుందను భయముతోనో, లేక నష్టము వస్తుందను భయముతోనో, వారు రాకుండా మానుకొన్నారు.  ఏది జరిగిన కర్మవలననే జరుగుతుందని, ఆ నిర్ణయమును ఎవరు మార్చుకోలేరను ఆత్మజ్ఞానమును మరచిపోయారు.  వాచాజ్ఞానము కలవారు  ఆచరణ జ్ఞానములేనివారైనారు.

ఒక వంటను ఎలా వండితే రుచిగా ఉంటుందో తెలుసుకొన్నామనుకొనుము. తెలుసుకొన్నంత మాత్రమున ఆ వంట రుచిని అనుభవించలేము.  ఆ రుచి యొక్క అనుభూతియేమో తెలియదు.  ఆ రుచి ఎట్లుండునను అనుభవము ఎలా వండితే వంట తయారవుతుందో అలా వండినపుడే తెలియును.  ఆ విధముగనే జ్ఞానము విని తెలుసుకొని చాలా గొప్పదనుకొన్నంత మాత్రమున దాని గొప్పతనమేమో నిజముగ మనకు తెలియదు.  విని తెలుసుకొన్న దానిని ఆచరించినపుడే దానియొక్క గొప్పతనము తెలిసేది.  గురువువద్ద ఎంతో కాలము జ్ఞానము తెలుసుకొని, ఏ ప్రశ్నకైన జవాబు చెప్పు స్థోమతవున్న వారు కూడ  వచ్చిన సమస్యలను జ్ఞానముతో యోచించికపోతే వారిది ఆచరణజ్ఞానము కాదు.  అలాగే గురువుగారి వద్ద జ్ఞానులైన వారు గొప్ప జ్ఞానమును మా గురువుగారు తెలిపారని  గురువును పొగుడుకొన్నప్పటికి, వారి జ్ఞానమును మాటల వరకే పెట్టుకొన్నారు.  ప్రపంచ సమస్యల మీద ప్రయోగించి

నిర్ణయము తీసుకోలేక పోయారు. గురువుగారికి కష్టమొచ్చి ఆయన అనుభవిస్తుంటే, వీరికి ఆ కష్టము లేకున్నను అలాంటిదే మాకు వచ్చునేమోనను భయముతో పారిపోయారు. అలా కొంతమంది పోగా ఇంకను కొంతమంది మిగిలివుండెడివారు. బయటి చదువులలో ఒక తరగతి నెగ్గి పై చదువులకు పోవుటకు మూడునెలల పరీక్ష, ఆరునెలల పరీక్ష, సంవత్సరము పరీక్ష ఉన్నట్లు, చివరకు ఆ మిగిలిన శిష్యులకు సంవత్సరపు పరీక్షలాంటి సమస్య ఎదురైనది. ఆ సమస్యలో గురువుగారికి శత్రువులుగ ఉన్నవారు గురువుగారిని చంపే నిర్ణయానికొచ్చారు. ఒక నెలలోపల ఎపుడు వీలు దొరికితే అపుడు చంపేదానికి నిర్ణయము చేసుకొని ఆ పని మీదనే వేచివున్నారు. ఆ విషయము మిగిలిన శిష్యులకు తెలిసినది. తర్వాత గురువు గారికి తెలిసింది. కర్మ ఎలావుంటే అలా జరుగుతుందని ఆ సమస్యను ఏమాత్రము గురువుగారు లెక్కించుకోలేదు. ఇక మిగిలిన శిష్యుల విషయానికోస్తే వారు ఈ విధముగ ఆలోచించారు. ముందే జారుకొన్నవారు ఎంతో తెలివైనవారు. మేము అపుడే చిన్నగ రాకుండ పోయివుంటే బాగుండేది. మేము తెలివితక్కువవారము. పొరపాటున ఇక్కడవున్నాము. ఇక్కడుండుట వలన మనకు ప్రమాదమే. గురువును ఎటు వారు పది ఇరవై రోజులలో చంపుతారు. ఒకవేళ మనము ఈయనతో సంబంధము పెట్టుకొని అలాగే ఉండుట వలన మనకు కూడ ముప్పు, చావు ఉండవచ్చును. ఈయన శిష్యులమనిపించుకోవడము కూడ మంచిది కాదు. ఇక్కడికి రాకుండా పోయి, గురువుగారికి శత్రువులైన వారితో చేతులు కలిపితే మనకు వారి ద్వార ఏమి ముప్పువుండదు అనుకొన్నారు. తర్వాత గురువుగారి ముఖమే చూడలేదు. బలవంతులైన శత్రువులతో పరిచయమేర్పరచుకొని వారెక్కడైన కనిపిస్తే నమస్తే అన్నా అనెడివారు.

చివరిగ మరణమను సమస్యకు చలించినవారై, చిరకాలము ఇతరులకు భయపడుచు కొందరు పోగా, అప్పటికి కూడ జ్ఞానముతో యోచన చేసినవారై, జ్ఞానసిద్ధాంతము ప్రకారము సర్వులను ఆడించునది కర్మ, కర్మ నిర్ణయము ప్రకారము జరిగెడిది జరుగును. మరణము ఎప్పుడైన ఒకమారు తప్పదు. దానికి చలించితే

మనకు జ్ఞానము తెలిసి ఏమి ప్రయోజనమని చలించక మిగిలిన శిష్యులు కొందరున్నారు. ఇలా కొంతకాలము జరుగగ చంపబడుననుకొన్న గురువు చంపబడలేదు. చంపగలరనుకొన్న శత్రువులు చంపబడ్డారు. ముందేమి జరుగుతుందో కనిపించని కర్మలో ఉన్న రహస్యము కొంతకాలానికి కనిపించింది. సమస్య మొదలైనప్పటి నుంచి నోరు మెదపని గురువు ఇలా అన్నాడు. *'నేనెంతో జ్ఞానమును తెల్పాను. చివరకు భగవద్గీతను విపులముగ వ్రాయుట నా జీవిత ధ్యేయమన్నాను. దానిని పూర్తి చేయువరకు నాకు మరణములేదన్నాను. అలా భగవద్గీత కర్మయోగములో 34వ శ్లోకము వరకు వ్రాశాను. 35వ శ్లోకము స్వధర్మము, పరధర్మమును తెలియజేయునది. 34వ శ్లోకము వరకు వ్రాసి నిలిపివేశాను. 35వది ఇంతవరకు వ్రాయక దాదాపు ఆరు సంవత్సరములు వేచి చూచాను. నా జ్ఞానమును తెలుసుకొన్నవారు స్వధర్మపరులెంత మందివున్నారు, పరధర్మపరులెంతమంది వున్నారని చూడక తప్పలేదు. జరిగిన కార్యమును బట్టి చూస్తే పరధర్మపరులు నూటికి 99 శాతము కాగ, ఒక్క శాతము మాత్రము స్వధర్మమును ఆచరించువారై ఉన్నారు. అందువలననే రచనలో నిలిచిపోయిన కర్మయోగములో 35వ శ్లోకము ఇక్కడ ఇప్పడు మొదలుపెట్టి చెప్పడమైనది. స్వధర్మ పరధర్మములను ఎంతో వివరముగ చెప్పితే కాని భవిష్యత్తులో జ్ఞానము తెలుసుకొనువారు, "తెలిసినంత మాత్రమున ప్రయోజనములేదు, తెలిసిన దానిని జీవితములో ఉపయోగించుకొన్నపుడే జ్ఞానము యొక్క విలువ పొందగలిగిన వారమౌతామనుకోగలరు."*

భగవంతుడు ఏది చెప్పిన అది సత్యమే, కనుక ఆయన చెప్పినట్లే అన్ని విధముల యోచిస్తే భయముకంటే మరణమే మేలు. పరధర్మముకంటే స్వధర్మమే మేలు. గుణములు, కర్మగల అధర్మముకంటే అవిలేని ధర్మమే మేలని పై శ్లోకము యొక్క సారాంశము తెలియుచున్నది. ఇంతవరకు స్వ, పర ధర్మముల వివరము విన్న అర్జునుడు ఎంతోమంది పరధర్మమునే ఆచరించుచున్నారని, తెలిసి తెలియక

తప్పు చేసినవారుండవచ్చును కాని జ్ఞానము తెలిసినవారు తప్పుచేయుచుండుట చాలా విచిత్రమనుకొని, ప్రపంచ విషయములలో కూడ తెలిసి కొందరు తప్పు ఎందుకు చేస్తున్నారని శ్రీకృష్ణున్ని ప్రశ్నవేశాడు.

**అర్జునుడిట్లనియె :-**

*(2) శ్లో॥36 : అథ కేన ప్రయుక్తోஉయం పాపం చరతి పూరుషః ।*
*అనిచ్ఛన్నపి వార్ష్ణేయ ! బలాదివ నియోజితః ॥*
*(బ్రహ్మ యోగము)*

**భావము :** మనిషికి ఇష్టము లేకున్నను దేనిచేత బలత్కార పూర్వకముగ నియమింప బడి పాపకార్యములు చేయుచున్నాడు?

**వివరము :** "అనిచ్ఛన్నపి" అన్నారు అనగ ఇష్టములేకున్నా అని అర్థము. ఇష్టము ఎవనికుండదనిన జ్ఞానము తెలిసి బ్రహ్మయోగమాచరించవలెనను వానికి మాత్రము పనులయందు ఇష్టముండదు. జ్ఞానము తెలిసి ఇది చెడ్డపనియని ఇది చేయకూడదని అనుకోకూడదని వెనుక చెప్పబడినది. అది కార్యములు చేయు కర్మయోగులకని తెలియాలి. పాపపుణ్య విచక్షణ ఏమాత్రము లేకుండ పనులు చేయవలెననెడి జ్ఞానము కర్మయోగ సంబంధమైనదని పాఠకులు గుర్తుంచుకోవాలి. ఏ కార్యముకాని, దాని తలంపుగాని, ఉండకూడదని చెప్పు జ్ఞానము బ్రహ్మయోగ సంబంధమైనది. ఇక్కడ అర్జునుడు అడుగు మాట బ్రహ్మయోగులకు సంబంధించినదని తెలియాలి. బ్రహ్మయోగులు పనులు చేయకూడదని, వారి మనస్సును ఆలోచనలనుంచి దూరము చేయాలని ప్రయత్నము చేయుచుందురు. అట్టివానికి యోచనలు వచ్చి ఇష్టము లేకున్నా వాని ద్వార పనులు చేయబడుచుండును. అట్లు ఎందుకు జరుగుచున్నది దానికి కారణమేమి అని అర్జునుడు వివరముగ తెలియకోరినాడు. దానికి జవాబుగ శ్రీకృష్ణుడు ఈ విధముగ అంటున్నాడు.

**శ్రీ భగవంతుడిట్లనియె :-**

*(2) శ్లో॥ 37 : కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః ।*
*మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్ ॥*
*(ప్రకృతి)*

**భావము :** రజోగుణములో పుట్టిన కామమనెడి గుణము మరియు క్రోధమనెడి గుణములు కలవు. ఈ ఆశ తృప్తిలేనిది. కోపము పాపము కలుగజేయునది. ఇవి జ్ఞానమునకు శత్రువులు.

**వివరము :** మన శరీరములో గుణములున్నాయని తెలుసుకొన్నాము. అవి ఎక్కడున్నాయి అనునది తెలుపలేదు. ఇచట భగవంతుడు సూచనగ ఒక గుణము పేరు పెట్టి చెప్పాడు. కనుక వాటి స్వరూపమును కొద్దిగ తెలుసుకోవలసి ఉన్నది. **గుణత్రయ విభాగయోగమను** అధ్యాయములో మూడు గుణముల వివరము పూర్తిగ ఇవ్వబడినది. ఇచ్చట రాజసములో పుట్టిన కామ క్రోధమన్నాడు దీనిని బట్టి ఇది ఒక తెగ అని తెలియుచున్నది. వాస్తవముగ గుణములు మూడు తెగలుగ ఉన్నవి 1) సాత్త్వికము 2) రాజసము 3) తామసమనునవి. వాటిలో మధ్యలో ఉన్న రాజసభాగములో పుట్టిన కామమునకు క్రోధమునకు ఎక్కువ బలమున్నది. రాజస కామమునకు తృప్తి చాలా తక్కువ, తృప్తి పొందనపుడు దాని వెంటనే అందులోని కోపము వస్తున్నది. ఆ కోపము ఎక్కువ చెడు కార్యములు చేయించి పాపమును పొందునట్లు చేయును. తృప్తిలేని మానవుడు తృప్తికోసమే ప్రాకులాడుచుండును. జ్ఞానమువైపు రాలేడు. అట్లే క్రోధము జ్ఞానమును తెలుసుకోనివ్వదు. మిగతా గుణభాగములలో పుట్టిన వాటికంటే రాజస భాగములోని ఈ రెండు గుణములే ఎక్కువగ జ్ఞానమునకు ఆటంకమైవున్నవి. అందువలన ఈ రెండు గుణములు జ్ఞానమునకు శత్రువులవలె ఉన్నవి.

**గమనిక :** మొట్టమొదట భగవద్గీతలో కామము అనుమాట విశేషముగ ఇచటనే చెప్పబడినది. శరీరములో దీని పాత్ర చాలా ముఖ్యమైనది. అందువలన దీని

స్వరూపము మొదటనే అర్థము కాకపోతే భావమంతయు చెడిపోవును. **పురుషునికి స్త్రీల ఎడల ఉన్న శారీరక కోరికనే కామమని చాలామంది అనుకోవడము జరుగుచున్నది. వాస్తవానికి కామము అన్నమాటకు అర్థము ఆశ లేక కోరిక అనవచ్చును.** ప్రత్యేకించి స్త్రీల మీద కోరికను కామమనకూడదు. కామము అనగ బంగారు మీద ఆశ కావచ్చును, కొడుకుల మీద ఆశ కావచ్చును, భూముల మీద ఆశ కావచ్చును, వస్తువుల మీద ఆశ కావచ్చును. అలా ఏ దానిమీద ఆశనైన కామము అనియే ఉచ్ఛరింపబడుచున్నది. కామము అన్నంత మాత్రమున స్త్రీల మీదనే అనుకోకూడదు. అట్లే స్త్రీలు పురుషుల మీదున్న ఆశనే కామము అనుకోకూడదు. సందర్భానుసారము అర్థము చేసుకోవాలి. ఈ విషయములో బాగా తెలిసిన జ్ఞానులమనిపించుకొన్నవారే పొరబడుచున్నారు. ఉదాహరణకు ఒక ఆధ్యాత్మిక ఉపన్యాసము చెప్పు పండితుని ఇంటిలో పెళ్ళి జరుగుచుండెను. పెళ్ళి సందడిగ ఉండవలెనని మైక్‌సెట్ పెట్టి అందులో ఘంటసాల భగవద్గీత రికార్డు పెట్టారు. ఆ రికార్డులో పై శ్లోకమే వచ్చినది. అందులో కామమనెడి గుణము జ్ఞానముకు శత్రువులాంటిది దానిని వదలివేయుము పార్థ అని చెప్పుట గలదు. అపుడు అచటనే ఉండి ఆ మాటవిన్న ఆ పండితుడు ఎవరీ రికార్డు పెట్టినదని కోపగించుకొని ఇలా అన్నాడట *'శుభమా అని పెళ్లి చేస్తువుంటే కామమును విడిచి పెట్టమని చెప్పు రికార్డు పెట్టవచ్చునా కామము లేకపోతే వారి పెళ్లిదేనికి'* ఈ మాట విన్నవారు వెంటనే ఆ రికార్డును తీసివేశారు. ఇచట సాధారణ మానవుడు తన తెలియని తనము చేత తప్పుగ కామమనెడి పదమును అర్థము చేసుకొన్నా ఫరవాలేదు. కాని తెలిసిన జ్ఞానియే కామమంటే వేరుగ అర్థము చేసుకోవడము అజ్ఞానమే అగును. సందు దొరికితే చాలు మాయ మనలను తప్పుత్రోవ పట్టిస్తుంది. కావున జాగ్రత్తగ జ్ఞానవిషయములు పరిశీలించవలెనని కోరుచున్నాము. కామమనెడి పదము భగవద్గీతలో చాలామార్లు, చాలా సందర్భములో ఉపయోగించబడినది. అన్ని చోట్ల ఆశ అను అర్థమునే తీసుకోవాలని తెలుపుచున్నాము.

(2) శ్లో॥38 : ధూమే నావ్రియతే వహ్నిర్యథాఽఽదర్శోమలేన చ ।
యథోల్బే నావృతో గర్భ స్తథా తే నేదమావృతమ్ ॥
(ప్రకృతి)

**భావము :** పొగచేత అగ్నియు, దుమ్ముచేత అద్దము, గర్భపొరలతో శిశువు కప్పబడినట్లు ఆశచేత జ్ఞానము కప్పబడివున్నది.

**వివరము :** పొగ ఆవహించినపుడు అగ్ని యొక్క తేజము కనిపించదు. దుమ్ము నిండుకొన్నపుడు అద్దములోని ప్రతిబింబము కనిపించదు. గర్భములోని మావి పొరలో ఉన్నపుడు శిశువు ఆడనో లేక మగనో తెలియదు. అట్లే ఆశ అను గుణము మన తలలో నిండుకొన్నపుడు, తలలోనే ఉన్న జ్ఞానము ప్రకాశింపలేదు. పొగ నిండుకొన్నపుడు పొయ్యిలోని అగ్ని ఎట్లు ప్రకాశించి మండజాలదో, అట్లే మన తలలో ఆశ నిండుకొన్నపుడు ఉన్న జ్ఞానము తెలియకుండ పోతుంది. బ్రహ్మయోగము చేయువానికి ఆ యోగము అందదు. బ్రహ్మయోగ ఆచరణకది పూర్తి ఆటంకమగును.

(2) శ్లో॥ 39 : ఆవృతం జ్ఞాన మేతేన జ్ఞానినో నిత్యవైరిణా ।
కామరూపేణ కౌంతేయ ! దుష్పూరే ణానలేన చ ॥
(ప్రకృతి)

**భావము :** తీరనిది మరియు తృప్తిలేనిదైన ఆశ జ్ఞానమునకు నిత్య శత్రువైయుండి జ్ఞానమును కప్పివేయుచున్నది.

**వివరము :** ఆశకు అంతులేదు అనుమాట చాలామంది వినివుంటారు. ఆకాశానికి హద్దు ఎట్లు లేదో, ఆశకు కూడ హద్దులేదని చెప్పవచ్చును. జ్ఞానులనే ముప్పు తిప్పలు పెట్టు ఆశ అజ్ఞానులను ఏమైన చేయగలదు, ఏమైన చేయించగలదు. జ్ఞానమును కప్పిపుచ్చునది, జ్ఞానులకు నిత్యశత్రువు అయిన ఆశ సాధారణ మానవుని ఎడల శత్రువు కాదు. ఇదేమి విచిత్రమనుకోవలసిన పనిలేదు. వేరే వర్గమువాడు శత్రువగును కాని, తన వర్గమువాడు శత్రువుకాడు మిత్రుడే అగును. అట్లే ఆత్మ

వర్గమైన జ్ఞాని శత్రువగును. కాని ప్రకృతివర్గములో ఉన్న అజ్ఞాని తన వర్గములోని వాడే కనుక కామునకు శత్రువుకాడు. ప్రకృతిని విడిచి ఆత్మవర్గములోనికి పోవాలనుకుంటే అపుడు శత్రువగును. జ్ఞానికి శత్రువు అని చెప్పబడిన ఆశ బలమైనదా కాదా? ఆ బలము దేనివలన ఉన్నదను విషయమై క్రింది శ్లోకము చూడండి.

(2) శ్లో॥ 40 : ఇంద్రియాణి మనో బుద్ధి రస్యాధిష్ఠాన ముచ్యతే ।
ఏతైర్విమోహయ త్యేష జ్ఞాన మావృత్య దేహినమ్ ॥
(ప్రకృతి)

**భావము :** మనస్సు, బుద్ధి, ఇంద్రియములు ఆశకు అధిష్ఠానములుగ ఉన్నవి. వీటి ఆధారముతో మోహమును కలుగజేసి జ్ఞానమును కప్పివేయుచున్నది.

**వివరము :** శరీరములో జ్ఞానేంద్రియములైన కన్ను, చెవి, ముక్కు, నాలుక, చర్మము. అంతరేంద్రియమైన బుద్ధి, మరియు బయట జ్ఞానేంద్రియములకు లోపలి బుద్ధికి మధ్యవర్తిగ ఉన్న మనస్సు మొత్తము ఏడును గుణములకు ఆధారముగ ఉన్నవి. బయటి జ్ఞానేంద్రియములు విషయజ్ఞానమును తెలిపితే, ఆ విషయమును మనస్సు స్వీకరించి లోపలి భాగమైన బుద్ధికి తెల్పితే, బుద్ధికి గుణములు తగులుకొని యోచింపజేయును. ఇట్లు జ్ఞానమును తెలుసుకోవలసిన బుద్ధి గుణములలో చిక్కుకొనుట వలన జ్ఞానము తెలియకుండ పోతున్నది. కామాది గుణములు బుద్ధిని భ్రమింపజేయుచున్నవి. బుద్ధినే భ్రమింపజేయు గుణములను లేక ఆశను అణచివేయాలంటే ఏమి చేయాలో క్రింది శ్లోకములో చూస్తాము.

(2) శ్లో॥ 41 : తస్మాత్త్వమింద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ ।
పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాన నాశనమ్ ॥
(బ్రహ్మ యోగము)

**భావము :** అందువలన ఇంద్రియములను అణచివేసి పాపమును చేయించునది, జ్ఞాన విజ్ఞానములను నాశనము చేయునదియైన ఆశను జయించవలెను.

**వివరము :** శరీరము యొక్క బాహ్య ఇంద్రియములైన కన్ను, చెవి, ముక్కు, నాలుక, చర్మముల యొక్క విషయములే లోపలి గుణముల ప్రేరణకు ముఖ్యమైన ఆధారము. మొదట విషయములే లేకపోతే మనస్సుకు, బుద్ధికి, గుణములకు పనిలేకుండ పోవును. అపుడు గుణములలో మొదటిదైన ఆశ నిలిచిపోవును. ఈ పద్ధతి ఒక్క బ్రహ్మయోగులకే అవసరమని మరియొకమారు గుర్తు చేయుచున్నాము. యోగము చేయాలని ఆసనము వేసుకొని కూర్చున్న వానియందు మనస్సు, బుద్ధి, గుణములు పనిచేయకుండ పోవాలంటే జ్ఞానేంద్రియములైన ఐదింటిని వాటివాటి ధ్యాసలనుండి మరల్చాలి. ఐదు ఇంద్రియములు స్తంభించినపుడే వాటితో ప్రారంభమగు కార్యములన్ని నిలిచిపోవును. ఈ విధానముతో లోపలనున్న ఆశను ప్రయత్న పూర్వకముగ అణచి వేయవచ్చును.

*(2)శ్లో॥ 42 : ఇంద్రియాణి పరాణ్యాహు రింద్రియేభ్యః పరం మనః ।*
*మనసస్తు పరాబుద్ధి ర్యో బుద్ధేః పరతస్తుసః ॥*
*( ప్రకృతి, ఆత్మ)*

**భావము :** శరీరములో ఇంద్రియములు శ్రేష్ఠమైనవి. వాటికంటెను మనస్సు శ్రేష్ఠమైనది. దానికంటెను బుద్ధి శ్రేష్ఠమైనది. బుద్ధికంటెను ఆత్మ శ్రేష్ఠమైనది.

**వివరము :** ఒక మోటారుసైకిల్‌ను తీసుకుంటే రోడ్డుమీద పరిగెత్తుటకు చక్రాలు, చక్రాలను త్రిప్పుటకు గొలుసు, గొలుసును త్రిప్పుటకు గేర్‌బాక్స్, గేర్‌బాక్స్‌లో గేర్ చక్రాలు తిరుగుటకు ఇంజను ఉన్నాయి. చక్రాలు, గొలుసు, గేర్‌బాక్స్, ఇంజను అను నాలుగు భాగాలుగా సైకిల్ మోటారును విభజించుకోవచ్చును. ఒకచోటనుండి మరొక చోటికి పోవాలంటే మోటార్‌సైకిల్‌కు ఈ నాలుగు భాగములు ముఖ్యమైనవే. ఇపుడు దానికి చక్రాలు తీసివేశామనుకొందాము. అది ముందుకు పోలేదు. కాని

ఇంజన్, గేర్లు, గొలుసు మూడు పనిచేయుచున్నవి. తర్వాత గొలుసు తీసివేశామను కొందాము. అప్పటికి గేర్స్, ఇంజన్ పనిచేయుచుండును. ఆ తర్వాత గేర్‌బాక్స్‌నే తీసి వేశామనుకొందాము. చివరకు ఇంజన్ పని చేయుచుండును. సైకిల్ మోటార్‌కు ఉన్న నాలుగు భాగములలో మూడు తీసివేసినప్పటికి, చివరి ఒకభాగమైన ఇంజన్ పనిచేయుచున్నది. ఇప్పుడు అలా కాకుండ నాలుగు భాగములలో మూడు భాగములను అలాగే ఉంచి, ఇంజన్ ఒక్కటి తీసివేశామను కొందాము. ఇపుడు మొత్తము మూడు భాగములు పనిచేయవు. ఎందుకనగ మూడు భాగములు కదిలి పనిచేయుటకు కదిలించు ముఖ్యభాగమైన ఇంజన్ లేదు. దీనిని బట్టి మోటర్ సైకిల్‌కు చక్రాలు ముఖ్యమైనవి కాగ వాటికంటే ముఖ్యమైనది గొలుసు. గొలుసుకంటే ముఖ్యమైనది గేర్‌బాక్స్. దానికంటే ముఖ్యమైనది ఇంజన్ అని తెలియుచున్నది.

మోటర్ సైకిల్‌లో నాలుగు భాగములున్నట్లు, మన శరీరములో కూడ ఇంద్రియములు, మనస్సు, బుద్ధి, ఆత్మ అను నాలుగు భాగములున్నాయి. ఇంద్రియములు లేకపోయిన మనస్సు, బుద్ధిలేకున్నా ఆత్మగల సజీవ శరీరముండును. కాని ఇంద్రియములు, మనస్సు, బుద్ధివున్నను ఆత్మలేనిది అవియేవి పనిచేయవు. ఆత్మలేని శరీరము భూమి మీద ఎక్కడ ఉండదు. ఆత్మ లేకపోతే శరీరము మొత్తము నిర్జీవమై శవముగా మారును. అందువలననే పై శ్లోకములో ఇంద్రియములకంటే మనస్సు, మనస్సుకంటే బుద్ధి, బుద్ధికంటే ఆత్మగొప్పదని భగవంతుడు చెప్పాడు.

(2) శ్లో॥ 43: ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సం స్తభ్యా త్మా నమాత్మనా ।
జహిశత్రుం మహాబాహో! కామరూపం దురాసదమ్ ॥

(బ్రహ్మ యోగము)

**భావము :** బుద్ధికంటే శ్రేష్ఠమైనది ఆత్మయని తెలిసి, జీవాత్మను ఆత్మలో ఐక్యమగునట్లు చేసి, జయింప దుస్సాధ్యమైన ఆశను జయించుము.

**వివరము :** ఈ శ్లోకము పూర్తిగ బ్రహ్మయోగమును గురించి చెప్పినది. బ్రహ్మ

యోగములో జీవాత్మ ఆత్మతో సంబంధమేర్పరుచుకొని, ఆత్మయొక్క అనుభవమును చవిచూడడమే సారాంశము. సాధారణవ్యక్తిలో ఆత్మ జీవాత్మలు రెండు ఉన్నాయి. ఆత్మ జీవాత్మను చూడగల్గుచున్నది. కాని జీవాత్మ ఆత్మను చూడలేదు. ఇద్దరు ఒకచోట ఉండి ఆత్మ జీవాత్మను చూడగల్గినపుడు, జీవాత్మ ఆత్మనెందుకు చూడలేదని ప్రశ్న అడుగవచ్చును. దానికి సమాధానము ఇద్దరు వ్యక్తులు ఒకచోట ఉండినప్పుడు, ఒకరికొకరు ఎదురెదురుగా నిలబడినపుడు, ఇద్దరు ఒకరినొకరు చూచుకోగలరు. ఎదురెదురు కాక ఒకరివెనుక ఒకరు నిలబడినారనుకొందాము. అపుడు ముందర ఉన్నవానిని వెనుకనున్నవాడు చూడగలడు. వెనుకనున్న వానిని ముందరున్న వాడు చూడలేడు. ఆ విధముగనే సాధారణవ్యక్తిలో ఆత్మ జీవాత్మ ఒక్కచోటనే ఉన్నప్పటికి, అవి ఒకదాని వెనుకల ఒకటున్నవి. జీవాత్మ వెనుక ఆత్మవున్నది. అందువలన ఆత్మకు జీవాత్మ కనిపించగలదు. కాని జీవాత్మకు ఆత్మ కనిపించదు. జీవాత్మముందు గుణములు, బుద్ధి, మనస్సు ఉండుటవలన, అతనికి అవియే కనిపించుచుండును. వాటి అనుభవములనే పొందుచుండును. వెనుకనున్న ఆత్మ తెలియదు, దాని అనుభవము తెలియదు.

అదే బ్రహ్మయోగములో జీవాత్మ గుణములు, మనస్సు, బుద్ధివైపు నుండి వెనుతిరిగి వాటి అనుభవములను వదలి, వెనుక సాక్షిగ ఉన్న ఆత్మవైపు ఎదురుగ నిలబడుచున్నాడు. అపుడు జీవుడు ఆత్మను చూడగలుగుచున్నాడు, ఆత్మానుభవము పొందుచున్నాడు. అలా ఉన్నంతసేపు ఆశ మొదలగు గుణములు కాని, వాటి జ్ఞాపకములు కాని, ఇంద్రియ విషయములు కాని, బుద్ధి యోచించడము కాని, ఏ ఇతర ధ్యాసలు జీవునికి తెలియవు. దానినే స్వచ్ఛమైన బ్రహ్మయోగము అంటున్నాము. అలవాటు చేసుకొని ఈ యోగములో ఎంతకాలమైన ఉండవచ్చును. ఈ పద్ధతి ద్వారా మనస్సును, ఆశను అణచివేయమని భగవంతుడు చెప్పాడని తెలియండి.

కర్మయోగమను ఈ అధ్యాయము ఇంతటితో అయిపోయింది. ఇందులో చెప్పబడిన శ్లోకములు మొత్తము మరియు ఏ శ్లోకము ఏ విషయమును గురించి బోధించినది క్రింది పట్టికలో వివరముగవున్నది.

| | | | |
|---|---|---|---|
| 1) | అశాస్త్రీయ శ్లోకములు (కల్పితములు) | - | 7 |
| 2) | బ్రహ్మయోగము కర్మయోగము రెండు కలిసివున్నవి | - | 3 |
| 3) | బ్రహ్మయోగము | - | 7 |
| 4) | కర్మయోగము | - | 12 |
| 5) | ప్రకృతి | - | 8 |
| 6) | ప్రకృతి, ఆత్మ | - | 1 |
| 7) | కర్మయోగము, జీవాత్మ | - | 3 |
| 8) | బ్రహ్మయోగము, జీవాత్మ | - | 1 |
| 9) | జీవాత్మ | - | 1 |
| | మొత్తము శ్లోకములు | - | 43 |

భావము, వివరము మార్చి వ్రాసిన శ్లోకములు - 9,21,24,35.

☆☆☆

## మూడవ అధ్యాయము

# జ్ఞాన యోగము

**శ్రీ భగవంతుడిట్లనియె :-**

*(3) శ్లో॥ 1 : ఇమం వివస్వతే యోగం ప్రోక్తవానహమవ్యయమ్ ।*
*వివస్వాన్ మనవే ప్రాహ మనురిక్ష్వాకవేఽ బ్రవీత్ ॥*
*(కర్మయోగము, బ్రహ్మ యోగము)*

**భావము :** ఇది అవ్యయమైన జ్ఞానము. మొదట దీనిని సూర్యునికి చెప్పియుంటిని. సూర్యుడు మనువుకు చెప్పెను. తర్వాత మనువు ఇక్ష్వాకుడను రాజుకు చెప్పెను.

**వివరము :** చెప్పినవాడు భగవంతుడు. చెప్పినది నాశనములేని జ్ఞానమును. మొదట విన్నవాడు సూర్యుడు. చెప్పినవాడు ఆనాడు ఎట్లున్నాడో, శరీరము ధరించి చెప్పాడో, శరీరము లేకనే శూన్యములో శబ్దము పుట్టించి చెప్పాడో తెలియదు. ఆయన ఎట్లు చెప్పినప్పటికి జ్ఞానము శబ్దరూపములోనే రావాలి. శబ్దరూపములో ఉన్న జ్ఞానమును సూర్యుడెలా విన్నాడు? అన్నది ప్రశ్న. పూర్వకాలమైతే ఏమి చెప్పినా నమ్మేవారమే. కాని ఈనాడు అంత గ్రుడ్డిగ నమ్మలేము. విజ్ఞానము ఎంతో పెరిగిన ఈ రోజులలో సూర్యుడు ఒక గోళమని, అది అగ్నిమయమని, భూమికంటే ఎన్నో లక్షల రెట్లు పెద్దదైన సూర్యగోళము నిత్యము మండుచూ వేడిమి వెలుతురు నిచ్చుచున్నదని అందరికి తెలుసు. మనుజుల మాదిరి శరీరములేని సూర్యుడు పరమాత్మ చెప్పిన జ్ఞానము ఎలా విన్నాడు? అను ప్రశ్న రాకమానదు. ఇంతటితోనే ఆగక మనువు భూమిమీద ఉన్న ఒక మనిషి కావున అతనికి సూర్యుడెలా చెప్పాడు? చెప్పుటకు సూర్యునికి నోరు లేదే? అంతపెద్ద సూర్యుడు ఎక్కడ? ఎంతో చిన్న భూమిమీద మరీ చిన్నగవున్న ఒక మనిషి ఎక్కడ? సూర్యుడు నిజముగ చెప్పాడా? చెప్పితే ఒక మనిషి వినగలిగాడా? మనిషి దగ్గరకు సూర్యుడు వస్తే మనిషి సూర్యుని వేడిమికి తట్టుకోగలడా? ఇట్లు అనేక ప్రశ్నలు ఉద్భవించగలవు.

ఈ ప్రశ్నలకు జవాబు లేకున్న ఎడల జ్ఞానము సంశయమయమైపోగలదు. ***సంశయములులేనిది జ్ఞానము*** అను సూత్రము ప్రకారము సంశయములున్నది అజ్ఞానమగును. ఎందరో భగవద్గీతను వ్రాసినవారు చదివినవారు ఉన్నప్పటికి వారికి ఈ ప్రశ్నలు వచ్చియుండవా? ఒకవేళ వ్రాసిన వారు ఈ విషయమును దాటివేసియుండవచ్చును. చదువు వారికైన ఈ అనుమానములు వచ్చియుండవా? వ్రాసినవారి మరియు చదివినవారి భావము మాకు అర్థముకాక, భగవద్గీతను ప్రతిదినము చదువుచున్న ఒక వ్యక్తిని మేము ఈ ప్రశ్నలు అడిగాము. దానికి అతను నవ్వి ఒక మాటన్నాడు. *'కథకు కాల్లులేవు ముంతకు చెవులు లేవు'* ఆ మాటవిన్న మేము ఒక నిమిషము స్థంభించిపోయాము. అతనితో ఏమి మాట్లాడవలెనో అర్థముకాక ఊరకుండి పోయాము. ప్రజలవద్ద భగవద్గీత ఏ రూపములో ఉన్నదో మాకు అర్థముకాలేదు.

భగవద్గీత కథ కాదు. భగవద్గీత మానవాళి ఎడల జ్ఞానరేఖ. ప్రకృతి నుండి మొదలిడి దైవము వరకు గీయబడిన గీతయే ఇది. ఇందులో అసత్యమునకు తావులేదు. అన్నీ సత్యములే. అన్నీ యదార్థ సత్యములైనపుడు, శాస్త్రబద్ధమైనపుడు ఏ ప్రశ్నకైన జవాబుండును. ఇపుడు సూర్యుని గురించి మనువును గురించి వచ్చిన ప్రశ్నలకు జవాబులను తెలుసుకొందాము.

ప్రపంచములో ఎన్నో జీవరాసులున్నవి. అనేక శరీరములు ధరించిన జీవరాసులు భూమిమీదనే కాక సముద్రములోను, ఆకాశములోను కూడ కలవు. జీవరాసులు ధరించిన శరీరములను బట్టి స్థావర జంగమములను కదలనివి కదిలెడివి రెండు రకములుగ ఉన్నవి. భూమిమీద మనుజులు, సముద్రములో జలచరములు, ఆకాశములో పక్షులేకాక విశ్వగగనములో ఉన్న ఎన్నో గ్రహములు కూడా సజీవమైనవే. సూర్యచంద్రాది గ్రహములు కూడ నాటికి నేటికి సజీవమైనవే. ఈ మాట క్రొత్తదేమి కాదు. మొదట సూర్యునికి జ్ఞానమును చెప్పానని, భగవంతుడే అన్నాడుకదా! ఆ మాటను బట్టి సూర్యుడు సజీవమైనవాడని తెలియుచున్నది. జీవులు ధరించిన శరీరములు అనేక రకములుగ ఉన్నాయని ముందే అనుకొన్నాము.

ఆ మాటప్రకారము మనిషి శరీరము కదులుచున్నది. మనిషి శరీరము మాదిరి తయారు చేయబడిన గుడిలోని ప్రతిమకు కూడ జీవము గలదు. మనిషి కదలుట వలన జీవమున్నదని సులభముగ తెలియుచున్నది. ప్రతిమ కదలదు కావున దానిలో జీవమున్నదని గుర్తించలేకున్నాము. ఇటువంటి శరీరముండి కదలనివి ఎన్నో రకముల జీవరాసులున్నవి. అటువంటి వాటిలో సూర్యగోళము కూడ ఒకటి. రకరకాల జీవ శరీరములు ఉన్నట్లు, గోళముల రూపములోవున్న జీవరాసులు కూడ ఎన్నో గలవు. అందులో సూర్యుడొకడని తెలియాలి. కనిపించని గజ్జిక్రిమి ఆకారమునకు, కనిపించెడి ఏనుగు ఆకారమునకు ఎంతో తేడావున్నది కదా! అట్లే చిన్నగ ఉన్న మనిషి ఆకారమునకు దూరముగావున్న సూర్యుని ఆకారమునకు ఎంతో తేడా ఉన్నప్పటికి ఆయా శరీరములలోని జీవాత్మలలో తేడాలు లేవు. అన్ని శరీరములలో గల జీవులు కర్మబద్ధులై ఉన్నవారే. కర్మబద్ధుడైన సూర్యునికి కూడ జ్ఞానము అవసరము. కాబట్టి పరమాత్మ సూర్యునికి మొదటనే జ్ఞానమును చెప్పానన్నాడు.

ప్రతి జీవరాశి శరీరమును విభజించితే 25 భాగములుగనున్నది. ఆ 25 భాగములలో బయటి ఇంద్రియములైన కర్మేంద్రియములు 5, జ్ఞానేంద్రియములు 5, మొత్తము 10కాగ లోపలి భాగములు 15 కనిపించనివిగ ఉన్నవి. కనిపించని జీవుడు, మనస్సు, బుద్ధి, చిత్తము, అహము అను ఐదు అంతఃకరణములు, కనిపించని వ్యాన, ఉదాన, సమాన, ప్రాణ, అపాణ వాయువులు ఐదు మరియు చూపు, వినికిడి, వాసన, రుచి, స్పర్శ అను జ్ఞానేంద్రియములలో అణిగివున్న పంచతన్మాత్రలు కనిపించనివి. కనిపించని 15 భాగములకు సూక్ష్మశరీరమని పేరు పెట్టారు. కనిపించెడి బయటి శరీరములోని భాగములైన కాళ్ళు, చేతులు, నోరు, గుదము, లింగము అను కర్మేంద్రియములు మరియు కళ్ళు, చెవులు, ముక్కు, నాలుక, చర్మము అను జ్ఞానేంద్రియములు మొత్తము పదింటిని స్థూలశరీరము అనవచ్చును. దీనిని బట్టి స్థూల, సూక్ష్మ శరీరములని శరీరము రెండు భాగములుగ విభజింపబడినది. అన్ని జీవశరీరములు సూక్ష్మ స్థూలములుగ ఉన్నవని తెలియాలి. ఈ సూత్రము

ప్రకారము ఆకాశములోని సూర్యునికి కూడ స్థూల సూక్ష్మములను రెండు శరీరములున్నవి. ఈ సూత్రము ప్రకారమే గుడిలోని ప్రతిమకు కూడ రెండు శరీరములున్నవి.

ప్రతి దేహములోను ఒక జీవుడున్నట్లు, ప్రతి దేవాలయములోని ప్రతిమలో ఒక జీవుడున్నాడు. మనిషి దేహములోని సూక్ష్మశరీరమును **గ్రహ** అంటాము. అట్లే ప్రతిమ శరీరములోని సూక్ష్మశరీరమును **విగ్రహ** అంటాము. మనిషి సూక్ష్మశరీరము ఇతరుల శరీరములో ప్రవేశించి మాట్లాడుట మనము చూచియే ఉంటాము. అట్లే గుడిలోని విగ్రహము కూడ ఇతరుల శరీరములో ప్రవేశించి మాట్లాడుట కూడ చూచియేయుందుము. స్థూలశరీర నిర్మాణము ఏ విధముగ ఉన్నప్పటికి, సూక్ష్మమునందు పంచతన్మాత్రలతో చూచుట వినుట గలదు. సూక్ష్మశరీరములు అందరిని చూస్తున్నవి. అట్లే అందరి మాటలు వినగలుగు చున్నవి. స్థూలశరీరములున్న చెట్లలో కూడ సూక్ష్మమున్నది. అందువలన చెట్లు వినగలుగుచున్నవి, చూడగలుగుచున్నవి. ఈ విధముగనే సూర్యుడు చూడగలుగు చున్నాడు మరియు వినగలుగుచున్నాడు.

ముఖ్యముగ గమనించవలసిన విషయమొకటున్నది. అదేమనగా! స్వయముగ కదిలెడు శరీరములలో ఉన్న సూక్ష్మశరీరము, ఒక్కమారు బయటికి వస్తే తిరిగి ఆ శరీరములో ప్రవేశించదు. స్వయముగ కదలని ప్రతిమ శరీరములో ఉన్న సూక్ష్మశరీరము ఎన్నోమార్లు బయటికి రాగలదు, తిరిగి ఆ శరీరములో ప్రవేశించగలదు. ***శరీరము బయటికి వచ్చి తిరిగి చేరలేని సూక్ష్మశరీరములను గ్రహాలు అన్నాము. శరీరము నుండి బయటికి వచ్చి తిరిగి శరీరమును ప్రవేశించు సూక్ష్మశరీరములను విగ్రహములు అన్నాము.*** గ్రహాలు తమ శరీరము నుండి తామనుకొన్నపుడు బయటికి రాలేవు. అట్లే శరీరములోనికి చేరనులేవు. విగ్రహాలు తమ శరీరములనుండి తామనుకొన్నప్పుడు బయటికి రాగలవు, తిరిగి అట్లే చేరగలవు. గ్రహాలు తమ ఇష్టమొచ్చినపుడు స్థూలశరీరముతో ఎక్కడికైనా

పోగలవు. విగ్రహాలు తమ స్థూలశరీరముతో తామంతకు తాము ఎక్కడికి పోలేవు. ఇట్లు స్థూల సూక్ష్మములలో స్థావర జంగమమైన వాటికి ఎన్నో తేడాలున్నాయి.

మనిషి కదిలెడి జీవరాసుల తెగలోనికి వస్తాడు. కనుక వాని సూక్ష్మమును గ్రహ అనవచ్చును. ఒక గోళము తమంతకు తాము కదలలేదు. కనుక దాని సూక్ష్మమును విగ్రహ అనవచ్చును. ఈ లెక్క ప్రకారము సూర్యుడు విగ్రహ, మనిషి గ్రహ అని గ్రహించవచ్చును. జగతి పుట్టినపుడు మొదటనే పరమాత్మ సూర్యునకు జ్ఞానమును బోధించాడు. సూర్యుడు తనలోని సూక్ష్మమునకున్న వినికిడియను తన్మాత్రచేత ఆనాటి జ్ఞానమంతయు వినగలిగాడు. తర్వాత సూర్యుడు విన్న జ్ఞానమును భూమిమీద మనిషిగ ఉన్న మానవునకు బోధించాడు. అదెట్లనగా! సూర్యుడు తన స్థూలశరీరము విడిచి, సూక్ష్మశరీరముతో భూమి మీదకు వచ్చి, వేరే మనిషి శరీరములో ప్రవేశించి, మనువుకు జ్ఞానమును బోధించియుండవచ్చును. అలా మనువునకు బోధించి తిరిగి తన స్థూలశరీరమైన అగ్ని గోళమును చేరియుండవచ్చును, ఉండవచ్చు అనుమాటకాదు, నిజముగ ఆనాడు అలాగే జరిగినది. సూర్యుని ద్వారా భూమి మీదనే జ్ఞానము తెలుసుకొన్న మనువు, తాను తెలుసుకొన్న జ్ఞానమును ఇక్ష్వాకుడను రాజుకు తెలిపినాడు.

ఇప్పుడీ వివరము తెలిసినది కావున మనలోని ప్రశ్నలన్నింటికి జవాబు దొరికినది. జ్ఞానము విన్న సూర్యుడు జీవాత్మ అని తెలియకపోయిన, శరీరము ధరించిన ప్రతి ఒక్కరికి రెండు శరీరములున్నవని తెలియకపోయిన, ఆ శరీరములకు ఉన్న ప్రత్యేకతలు తెలియకపోయిన, పై శ్లోకమునకర్థమే తెలియదు. అందులోని ప్రశ్నలకు జవాబులే ఉండవు. అందువలన స్థూల సూక్ష్మము గురించి పూర్తి అవగాహన చేసుకోవాలని కోరుచున్నాము. లేకపోతే నిన్ను నీవే తెలుసుకోలేవు.

*(3) శ్లో॥ 2 : ఏవం పరంపరా ప్రాప్త మిమం రాజర్షయో విదుః।*
*సకాలే నేహ మహతా యోగో నష్టః పరన్తప! ॥*
*(కర్మ యోగము, బ్రహ్మ యోగము)*

**భావము :** ఒకరినుండి ఒకరికి పరంపరగ తెలుస్తుపోయి రాజులు, ఋషులు తెలుసుకొనిరి. ఎంతో కాలము ఈ విధముగ జరుగగ, చివరకు యోగముల జ్ఞానము తెలియకుండపోయినది.

**వివరము :** భగవంతుడు మొదట సూర్యునికి తెలిపిన జ్ఞానము ఒకరి నుంచి ఒకరికి తెలుస్తూ పోయి, పరంపరగ గొప్ప రాజులు ఋషులెల్ల తెలుసుకొనిరి. మొదట రాజులతో మొదలైన జ్ఞానము చివరకు అడవులలో ఉన్న ఋషుల వద్దకు చేరినది. పూర్వము మొదట భగవంతుడు జ్ఞానము ప్రజలకు తెలియాలనుకొని, ప్రజలకు పెద్దలైన రాజలకు చెప్పితే, వారిద్వార సులభముగ ప్రజలలోనికి ప్రాకిపోవునని తలచి, రాజులకే తెలియునట్లు చేసెను. రాజులకు తెలిసిన దానిని ప్రజలకు బోధించగ తెలిసిన కొందరు కాలక్రమేపి అడవులలో చేరిపోయిరి. రాజులకు జ్ఞానము మీద ఆసక్తి తగ్గి చివరకు వారికే తెలియకుండ పోయెను. ఎక్కడైనా జ్ఞానము మీద ఆసక్తి కల్గిన రాజులుంటే, వారు అడవులలోని ఋషులవద్దకు పోయి జ్ఞానము తెలుసుకొనెడి వారు. కాలక్రమేపి అడవులలోని ఋషులయందు, ప్రజలలోని నాయకులయందు జ్ఞానము శూణ్యమైపోయింది. ఒకవేళ ఎక్కడైనా తెలిసిన ఋషులున్నారనుకొనిన, అట్లే తెలిసిన నాయకులున్నారనుకొనిన, వారివద్ద ఉన్నది యోగజ్ఞానము కాదు, కామ్యజ్ఞానము. పరధర్మమైన ఆశాజ్ఞానమే ప్రజలలో కూడ నిండిపోయి కోర్కెల పూజలు, కోర్కెల యజ్ఞములు, కోర్కెల వ్రతములు శ్రద్ధగ ఆచరించుచున్నారు. ఆశను అణచివేయు స్వధర్మ జ్ఞానముకాని, కర్మను నాశనము చేయు ఆత్మజ్ఞానముకాని ఏమాత్రము లేకుండ పోయినది. అందువలన దీనిని చెప్పవలసిన అవసరమొచ్చినదని క్రింది శ్లోకమున భగవంతుడు ఈవిధముగ అంటున్నాడు.

*(3) శ్లో॥ 3 : స ఏవాయం మయా తేఽద్య యోగః ప్రోక్తః పురాతనః ।*
*భక్తోఽసి మే సఖా చేతి రహస్యం హ్యేత దుత్తమమ్ ॥*
*(కర్మ యోగము, బ్రహ్మ యోగము)*

**భావము :** ఉత్తమమైనది, చాలా రహస్యమైనది, పురాతనమైనది అయిన యోగ విద్యను ఇపుడు నీవు నాకు భక్తుడవు, ప్రియుడవు కావున చెప్పుచున్నాను.

**వివరము :** యోగములకు సంబంధించిన జ్ఞానము ఎంతో విలువైనది. ఎంతో విలువైన యోగజ్ఞానము భగవంతుని మీద భక్తివున్న వారికి, ఆత్మజ్ఞానము మీద శ్రద్ధవున్న వారికి మాత్రమే తెలియజేయాలి. అపుడే జ్ఞానమునకు విలువవుండును, తెలిపిన జ్ఞానము సార్థకమగును. అట్లుగాక కోర్కెలుండి కోర్కెలు కోరుచు పూజలు చేయు భక్తులకు, యోగములందు ఆసక్తిలేనివారికి, ఈ జ్ఞానమును ఏమాత్రము తెలుపకూడదు. అట్లు తెల్పిన ఎడల జ్ఞానమునకు వారియందు ఏమాత్రము విలువ లేకుండ పోవును. జ్ఞానమును తెలుసుకొనుటకు తెలుపు వానివద్దకు వచ్చునపుడు ఖర్చయిన పదిరూపాయలే వానికి పెద్దగా ఉండును. వచ్చి తెలుసుకొన్న జ్ఞానము వానిలెక్కలో పదిరూపాయల విలువకంటే తక్కువగ ఉండును. అందువలన శ్రద్ధాభక్తులున్న వారికే తెలియజేయాలను నిమిత్తము, అర్జునుని భక్తుడవు ఇష్టుడవు అన్నాడు.

**అర్జునుడిట్లనియె :**

*(3) శ్లో॥ 4 : అపరం భవతో జన్మ పరం జన్మ వివస్వతః ।*
*కథ మేత ద్విజానీయాం త్వమాదౌ ప్రోక్తవానితి ॥*
*(జీవాత్మ, పరమాత్మ)*

**భావము :** ఆదిలో సూర్యునికి జన్మకలిగెను. నీ జన్మ ఇపుడు ఈ కాలములో కల్గినది. ఇపుడున్న నీవు పూర్వము సూర్యునికెలా చెప్పితివి. నమ్ముటెట్లు?

**వివరము :** ఇలా అర్జునుడు ప్రశ్నవేయడము చాలా సంతోషదాయకము. విషయము అర్థముకానపుడు, ప్రశ్నవేసి తెలుసుకోవలసిన అవసరమున్నపుడు, భగవంతునినైన నిలదీసి అడుగవలసిందేనని ఇక్కడ తెలియుచున్నది. అట్లు అడుగుట వలన వినేవానిలో ఆసక్తి పెరిగినదని తెలియుచున్నది. ఆనాడు శ్రీకృష్ణుడు అర్జునునికి

మధ్యలో ప్రశ్నలు వేయకూడదని చెప్పలేదు. ఆనాటి సాంప్రదాయమలావుండేది. ఈనాడు చెప్పునపుడు వినవలసిందే కాని ప్రశ్న వేయకూడదను సాంప్రదాయమొచ్చినది. అందువలన ప్రశ్నలకు జవాబులు లేకుండా పోయినవి. వినేవానికి విషయము లోపలికి దూరుతుందో లేదో అర్థముకాలేదు. వినేటప్పుడు అర్థము కాకపోతే ప్రశ్నవేసి తెలుసుకోవడము సత్ సాంప్రదాయము. అర్థము కాకపోయిన తలూపడము మంచిదికాదు. ఒకవేళ అడిగేవారున్నప్పటికి మధ్యలో ప్రశ్నవేయకూడదనుట జ్ఞానాన్ని మభ్యపెట్టడమగును. **'నాయెదుట ఇప్పుడున్న నీవు ఎంతో పూర్వము పుట్టిన సూర్యునికెలా చెప్పావు'** అని అర్జునుడు అడిగిన ప్రశ్నకు భగవంతుడైన శ్రీకృష్ణుడు క్రింద ఈ విధముగ అంటున్నాడు.

**శ్రీ భగవంతుడిట్లనియె :**

(3) శ్లో॥ 5 : బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున ।
తాన్యహం వేద సర్వాణి నత్వం వేత్థ పరంతప ! ॥
(జీవాత్మ, పరమాత్మ)

**భావము :** నాకు ఎన్నో జన్మలు కల్గినవి, నీకు కూడ ఎన్నో జన్మలు కల్గినవి. అవి అన్నియు వరుసగ నాకు తెలియును. నీకు మాత్రము ఏవీ తెలియవు.

**వివరము :** పరమాత్మ ఎన్నోమార్లు భూమిమీద పుట్టాడు. అట్లే జీవాత్మ కూడ పుట్టుచువచ్చాడు. ఆయనకు అన్ని జన్మలు జ్ఞాపకమున్నాయి. జీవులమైన మనకు ఏమాత్రము జ్ఞాపకము లేవు. ఇక్కడ మనకెందుకు జ్ఞాపకము లేకుండ పోతున్నదన్నది ప్రశ్న. ఈ ప్రశ్నను అర్జునుడు అడుగవలసివున్నది, కాని అడగలేక పోయాడు. అయిన మనము వదలడము లేదు. ఈ ప్రశ్నను ఇక్కడ అడుగుచున్నాము. ఏమి చెప్తాడో చూస్తాము.

"జీవాత్మవైన నీవు శరీరములో కొంత పరివారముతో నివశిస్తున్నావు. పరివారమంటే అర్థము కాలేదా! నీతో పాటు శరీరములో మనస్సు, బుద్ధి, చిత్తము

మొదలగు 24 మంది సహచరులున్నారు. వారిలో మనస్సు అనువాడు అన్ని విషయములను జ్ఞాపకము పెట్టుకొనువాడుగ ఉన్నాడు. జీవాత్మకు సహచరముగ ఉన్న మనస్సు జన్మతో పుట్టి పెరుగుచువచ్చి మరణముతో నశించి పోవుచున్నది. ఒక జీవుడు ఎన్ని మరణములు పొందినప్పటికి వాడు వాడుగనే ఉండును. కాని శరీరము అలా ఉండదు. ముందు జన్మలో ఉన్న ముక్కు వెనుక జన్మలో ఉండదు. ఒక జన్మలో అందమైన ముక్కు ఉండవచ్చును. మరొక జన్మలో అందహీనమైన ముక్కు ఉండవచ్చును. అట్లే అన్ని భాగములు జన్మజన్మకు అవి అలాగే ఉండక వేరు వేరుగ వచ్చుచుండును. ఆ విధముగనే మనస్సు కూడ ఒక జన్మలో ఉండునది మరో జన్మలో ఉండదు. ఒక జన్మలో జ్ఞాపకశక్తి ఎక్కువగ ఉన్న మనస్సు ఉండి, వేరు జన్మలో ఎక్కువ మరుపువున్న మనస్సు ఉండవచ్చును. ఒక జన్మలోవున్న విషయ జ్ఞాపకములన్ని ఆ జన్మ మనస్సుకే ఉండును. అది మరణములో పోయినపుడు దానితోపాటు ఆ జ్ఞాపకాలన్ని పోవును. అందువలన వెనుకటి జన్మ జ్ఞాపకాలు మరుజన్మమున ఉండవు. ఎన్ని జన్మలెత్తిన ఏ జన్మ జ్ఞాపకాలు ఆ జన్మకే పరిమితమై పోవుట వలన, జీవునికి ఎన్ని జన్మలెత్తినది, ఏ జన్మలో ఏమి చేసినది తెలియదు. నీవు జీవునివే కావున నీకు నీ జన్మల విషయము ఏమి తెలియదు.

మనకు జన్మలున్నది, జన్మల విషయము మనకు జ్ఞాపకము లేకున్నది, శ్లోకములో చెప్పడమేకాక తనకు కూడ జన్మలు కలవని, అవన్నియు ఆయనకు తెలుసునని, భగవంతుడు ప్రకటించుకొన్నాడు. తర్వాత శ్లోకములలో మానవులు పుట్టినట్లు తాను మరణిస్తూనే పుట్టువాడనుకానని, తన అవసరము భూమి మీద కల్గినపుడు మాత్రమే పుట్టువాడనని కూడ చెప్పాడు. తాను భూమిమీద భగవంతునిగ పుట్టి ఏమి చేయవలెనో అది కూడ చెప్పాడు. ఆయన జన్మల విషయములో ఇక్కడ పెద్దగ ప్రశ్నరాకున్నను, ఆ శ్లోకములలో మాత్రము ఒక ప్రశ్నవచ్చుటకు అవకాశము గలదు. ఎన్నో జన్మలు ఎత్తిన మనకు దేవుడు ఎన్ని జన్మలు ఎత్తాడని ప్రశ్నరావచ్చును. దానికి జవాబు తర్వాత శ్లోకములోకంటే ఇప్పుడే తెలుసుకోవడము మంచిది. కావున ఆ జవాబు ఏమిటో చూచెదము.

దేవుని చేత మొదట ప్రపంచము, తర్వాత జగతి రెండు సృష్ఠించబడినాయి. దేవుని చేత సృష్ఠింపబడిన మానవునికి తాను దేవుని చేత సృష్ఠింపబడినానని, తనకంటే ముందే తయారు చేయబడిన పంచభూతములైన ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి దేవుని చేతనే సృష్ఠించబడినాయని, విశ్వమంతటికి ఒక సృష్ఠికర్తయున్నాడని తెలియదు. ఆనాటి మానవునికి కనిపించు ప్రకృతి ధ్యాస తప్ప కనిపించని దేవుని జ్ఞాపకముగాని, ధ్యాసగాని ఏమాత్రములేవు. దేవుడు అను పదమే తెలియని మానవునికి దేవుడొకడున్నాడని చెప్పుటకు, దేవుని విషయము తెలిసిన వాడొకడు కావాలి. ఆ విధముగ దేవుని విషయము తెలిసిన మనిషి యొక్క అవసరము భూమి మీద మొదట ఏర్పడినది. దేవుని విషయము దేవునికి తప్ప ఇతరులెవరికి తెలియదు. కావున అటువంటపుడు దేవుడే ఒక మనిషిగ భూమిమీదకు వచ్చి తన విషయమును తానే చెప్పవలసివచ్చినది. ఈ విధముగ మొదట భూమి మీద దేవుని పుట్టుకకు అవసరమేర్పడినది. దేవుడు మనిషిగ భూమి మీద పుట్టడమును భగవంతుని అవతరణ అంటున్నాము. మొట్టమొదట దేవుడు భగవంతునిగ భూమి మీద పుట్టాడు. దేవుడు మనిషిగ పుట్టితే భగవంతుడౌతాడు. అట్లు పుట్టినవాడు దేవుడు అయినప్పటికి అతనిని భగవంతుడనే అనాలి. **దేవుడు విశ్వమంతట వ్యాపించిన వాడుకాగ, భగవంతుడు కేవలము ఒక శరీరములో మాత్రమున్నవాడు. దీనిని బట్టి సందార్భనుసారము దేవున్ని దేవుడనియే అనాలి, భగవంతున్ని భగవంతుడనియే అనాలి. దేవున్ని భగవంతుడనిగాని, భగవంతున్ని దేవుడనిగాని అనకూడదు.** నేటికాలములో చాలామంది బోధకులు దేవుని యొక్క భగవంతుని యొక్క అర్థము తెలియక, దేవుడని చెప్పవలసిన చోట భగవంతుడని చెప్పడము జరుగుచున్నది. అలా చెప్పడము వలన దేవుని యొక్క, భగవంతుని యొక్క వ్యత్యాసము ప్రజలకు తెలియకుండ పోయినది.

తన విషయమును తానే తెల్పుటకు వచ్చిన భగవంతుడు, దేవుడున్నాడనిగాని, దేవుని విషయముగాని ఏ కొద్దిగ కూడ తెలియని మానవులకు సృష్ఠి మొదలైన తర్వాత మొట్టమొదట దేవుని విషయము తెలియజేశాడు. మానవునికి భూమి

మీద కనించని దేవున్ని తెల్పుటకు, దేవుడున్నాడను విషయము మానవుని మనస్సులో నిలిచి పోవునట్లు చేయడానికి, భగవంతునికి ఒక జన్మపట్టినది. ఈ విధముగ భగవంతుని మొదటిజన్మ భూమి మీద మానవులకు దేవుని ఉనికిని తెలియజేయడానికే అవసరమైనది. భగవంతుని మొదటిజన్మతో జగతిలో దేవుని గురించిన విషయము తెలిసిపోయినది. అప్పటి కాలములో భగవంతుని బోధ వలన తమకంటే అన్యుడు, అధిపతి, విశ్వసృష్టికర్త ఒకడున్నాడను భావము మనుషులలో ఏర్పడినది. ఆ విధముగ సృష్టి తర్వాత కొంత కాలమునకు భగవంతుని వలన దేవుని సమాచారము తెలియబడినది. దేవుడొకడున్నాడను భావన మనుషులలో కొన్నివేల సంవత్సరములు నిలిచిపోయినది. తర్వాత మనుషుల తలలోని మాయ ప్రభావము వలన దేవుడున్నాడునుట అసత్యమని, ఉంటే ఎలా ఉన్నాడని, దేవుడున్నాడనుటకు ఆధారము లేదని తలంపులు రావడము మొదలైనాయి. దానివలన కొన్ని వేల సంవత్సరములకు దేవుని ఉనికి మానవులలో మాసిపోవుటకు మొదలిడినది. అలా దేవుడున్నాడను మొదటి ధర్మమునకు గ్లాని ఏర్పడను మొదలైనది. అపుడు దేవుడు సత్యమని, దేవుడిలా ఉన్నాడని మనుషులకు తెల్పుట అవసరమైనది. ఆ విధముగ దేవుని అంశ భగవంతునిగ రెండవమారు వచ్చుటకు అవసరమేర్పడినది.

దేవుని ఉనికి భూమి మీద మాసిపోకుండుటకు, దేవుడు భగవంతునిగ భూమిమీద రెండవమారు పుట్టాడు. అలా పుట్టిన భగవంతుడు దేవుడిలా ఉన్నాడని ఆధారము చూపుటకు దేవాలయములను తయారుచేశాడు. అంతవరకు దేవాలయముల ఉనికి భూమిమీద ఎక్కడలేదు. భగవంతుని రెండవరాకతో భూమిమీద దేవాలయములు వెలసినవి. **దేవుడీవిధముగ నిరాకారముగ ఉన్నాడని తెల్పుటకు ఈశ్వరలింగము గల ఆలయములు మొట్టమొదట తయారైనవి. నిరాకారముగ ఉన్న దేవుడు భూమి మీద భగవంతునిగ శరీరము ధరించి పుట్టునని తెల్పుటకు ఆకారప్రతిమ కల్గిన రంగని దేవాలయములు ఏర్పడినవి. అప్పటి కాలములో దేవునికి ఉదాహరణగ ముక్కు ముఖములేని లింగమును ప్రతిష్ఠించిన ఆలయము తయారు కాగ, భగవంతునికి ఉదాహరణగ ముక్కు ముఖమున్న**

**ప్రతిమను ప్రతిష్ఠించిన ఆలయము తయారైనది.** ఆ విధముగ భూమిమీద రెండు రకముల ఆలయములు తప్ప వేరే ఆలయములు లేవు. స్త్రీరూపము కల్గిన ఆలయములు ఏమాత్రము లేకుండెడివి. దేవాలయములు దేవుని ఉనికిని తిరిగి ప్రతిష్ఠించుటకొరకు తయారైనవి. దేవుడు నిరాకారుడు అనియు, దేవుడు మూడు విధముల ఆత్మలుగ విభజింపబడి ఉన్నాడనియు, దేవుడు ప్రకృతిని తన పీఠముగ చేసుకొని ఉన్నాడనియు, దేవునిద్వార వచ్చుచున్న జీవులు ప్రకృతినుండి బయల్పడుచున్నవనియు, దేవుడు తండ్రికాగ ప్రకృతి తల్లిగ ఉన్నదనియు, ఎంతో జ్ఞానము తెలియునట్లు అర్థములతో ఈశ్వరాలయమును భగవంతుడు నిర్మించాడు. అంతేకాక దేవుడు ఒక ఆకారముతో మనిషిలాగ భూమిమీద పుట్టునని, భగవంతునిగ పుట్టిన మనిషి దేవుని ప్రతినిధియని, అతని ద్వారానే భూమిమీద దేవుని ధర్మములు తెలియునని, జ్ఞానము శబ్దమునే చేయునదని సూచించునట్లు శంఖమును, జ్ఞానము తెలిసిన తర్వాత కర్మను నాశనము చేయునట్లు సూచననిచ్చు చక్రమును ధరించిన ప్రతిమ ఉండు ఆలయములను తయారుచేశాడు. ప్రతిమ ఆలయమునకు ఆరాధనలు కూడ కల్పించి అర్థమును కూడ తెలిపాడు. ప్రతిమ ఆలయము భగవంతుని గుర్తుగ నిర్మించాడు. ఆ విధముగ పరమాత్మ యొక్క, భగంతుని యొక్క ఆలయములు భగవంతుని చేతనే సృష్ఠించబడినాయి. మొదట దేవాలయ వ్యవస్థను స్థాపించుటకు భగవంతునికి ఒక జన్మ పట్టినది. ఈ విధముగ భగవంతుని రెండవ జన్మలో భూమిమీద ఆలయములు వెలసి వాటి ద్వార దైవము యొక్క వివరము క్షుణ్ణముగ తెలుపబడినది. దేవాలయముల ద్వార దేవుని ఉనికి తిరిగి ప్రతిష్ఠింపబడినది. దేవుని ధర్మము దేవాలయముల ద్వార ప్రతిష్ఠింపబడగ, ఆ భావము భూమిమీద ఎన్నో వేల సంవత్సరములు నిలిచిపోయినది. తర్వాత కొంత కాలమునకు మాయప్రభావము చేత ఆలయముల ధర్మము మాసిపోవను మొదలుపెట్టెను. అంతటితో మాయ ఆగకుండ మానవుని చేత స్త్రీ దేవతాలయములను ఇతర దేవాలయములను సృష్ఠించినది. దానితో దేవుని ఉనికి, ఆలయాల ఉనికి మారిపోయినది. దేవుడు ఒక్కడే అను భావము పోయి దేవుని స్థానములో ఎందరో వేల దేవతలు ఏర్పడ్డారు.

ఆ విధముగ దేవుని ఉనికి, దేవాలయ ఉనికి యొక్క ధర్మములకు గ్లాని ఏర్పడినది. కావున ఆ సమయములో భగవంతుని అవసరము తిరిగి ఏర్పడినది. మొదట దేవుని ఉనికిని ప్రతిష్ఠించుటకు దేవాలయములను చిహ్నములుగ, భావపూరిత నిర్మాణములుగ పెట్టగ, అవికూడ మాయవలన కలుషితమగుటను చూచిన దేవుడు, తర్వాత భగవంతుని రూపముతో వచ్చాడు. అట్లు మూడవమారు వచ్చిన భగవంతుడు గురువురూపములో దేవుని ధర్మములను, దేవాలయ ధర్మములను తిరిగి ప్రతిష్ఠించాడు. ఈ మారు కొందరు శిష్యులను తయారు చేసుకొని వారిద్వార దేవుని యొక్క, దేవాలయముల యొక్క ధర్మములను భూమి మీద ప్రచారము చేశాడు. ఎల్లకాలము ధర్మములు మాసిపోకుండునట్లు శిష్యపరంపరలు ఉండునట్లు ఏర్పాటు చేశాడు. ఆ విధముగ శిష్యులు దేవుని యొక్క, దేవాలయముల యొక్క ధర్మములను చాలాకాలము ప్రచారము చేయుచు, వాటికి గ్లాని ఏర్పడకుండ చూచుచుండిరి. అప్పటికాలములో భగవంతుడు ఏర్పరచిన విధానము ప్రకారము భూమి మీద ఎప్పటికి గురువు ఒక్కడే. శిష్యులు ఒకరి ద్వార ఒకరు జ్ఞానము తెలుసుకొనుచు శిష్యుల సంఖ్యను పెంచుకొనుచుండిరి. మొదట భూమి మీద తెలిపినవాడు గురువని, తర్వాత దానిని తెలియచెప్పువారు కాని, తెలుసుకొను వారుగాని అందరు శిష్యులను నియమముండెడిది. ఆ నియమము ప్రకారము మొదట తెల్పిన భగవంతుడు ఎప్పటికి గురువే. తర్వాత దానిని ఎవరు ఎవరికి చెప్పుకొనిన, ఎందరు తెలుసుకొనిన అందరు శిష్యులే. అట్లు ఎన్నో వేల సంవత్సరములు భగవంతుడు ఒక్కడే గురువుగ చలామణి అగుచువచ్చాడు. ఒకరికొకరు చెప్పుకొనుచు అందరు శిష్యులుగ నడుచుకొంటువచ్చారు. కావున ఆ కాలములో గురువు ఒక్కడే, శిష్యులు అనేకము అనెడి నానుడి ఉండెడిది. భగవంతుడు భూమి మీద తన ధర్మములను ప్రతిష్ఠించుకొలది మాయ వాటిని భగ్నము చేయుచుండెను. ఈ మారు మాయ అలాగే చేయాలనుకొన్నది. భూమి మీద భగవంతుడు తన ప్రతినిధులైన శిష్యపరంపరను ఉంచాడు. కావున మాయకు కొంత ప్రయాస అయినది. మాయ తిరిగి విజృంభించి శిష్యపరంపరనే చెడగొట్టాలనుకొన్నది. అలాగయితే తన పట్టు నెరవేరునని తలచినది. ఈ మారు శిష్యుల తలలో మాయపనిచేసి,

శిష్యపరంపరను కాస్త గురుపరంపరగ మార్చివేసినది. దానితో ఎప్పటికి గురువు ఒక్కడే అను సూత్రము పోయినది, అప్పటికి ఉన్నవాడే గురువు అను సూత్రము వచ్చినది. అప్పటినుండి శిష్యులు కొంతమంది కాగ, గురువులు అనేకమంది అయ్యారు. అందువలన శిష్యుడు ఒక్కడే, గురువులు అనేకము అనే నానుడి ఏర్పడినది. ఎవరికి వారు గురువులైపోయి తిరిగి దేవుని ధర్మములైన వాటికి గ్లాని ఏర్పడజొచ్చినది. ఈ మారు గురువు (భగవంతుని) యొక్క ధర్మములను కాపాడవలసిన అవసరము ఏర్పడినది. దేవుని ఉనికిని కాపాడుటకు దేవాలయములను నిర్మించి వాటికి ధర్మములను ఏర్పరచగ, దేవాలయ ధర్మములు నాశనమై పోయినవి. తర్వాత వాటి ఉనికిని కాపాడుటకు గురు శిష్యులను ఏర్పరచగ వాటి ధర్మములు కూడ చెడిపోయినవి. ఈ మారు గురువు యొక్క ధర్మము కాపాడుటకు భగవంతుని అవసరము ఏర్పడినది. ఉదాహరణకు ఒక యజమాని కుండలో నీరుపోసి పెట్టాడనుకొనుము. కొంతకాలమునకు కుండకు ఒక రంధ్రము ఏర్పడి కుండలోని నీరు కారిపోవను మొదలు పెట్టాయి. అది గమనించిన యజమాని ఆ రంధ్రమును సిమెంటు వేసి మూసివేశాడనుకొనుము. కొంతకాలానికి మరియొక చోట మరియొక రంధ్రముపడి నీరు కారిపోవను మొదలుపెట్టినది. దానిని కూడ గమనించిన యజమాని ఈ మారు సిమెంటుకంటే వేరుగ ఉండే లక్కతో ఆ రంధ్రమును మూసి నీరు కారనట్లు చేశాడు. కొంతకాలము బాగానే ఉన్న కుండకు మరియొక చోట మూడవమారు రంధ్రము పడినది. ఈ విధముగ కుండకు రంధ్రము పడినట్లు దేవుని ధర్మములకు గండి ఏర్పడుచుంటే, వాటిని సరిచేయుటకు భగవంతునిగ మరిమరి పుట్టవలసిన పని దేవునికి ఏర్పడినది. ఈ మారు శిష్యపరంపర పోయి గురుపరంపర అను రంధ్రము దైవధర్మము అను కుండకు ఏర్పడినది. ఈమారు భగవంతునిగ వచ్చినవాడు గురువు శిష్యుని యొక్క ధర్మమును తిరిగి నెలకొల్పుటకు బ్రహ్మవిద్యను (దైవవిద్యను) శాస్త్రపద్ధతిలో తెలపాలనుకొన్నాడు. అధర్మములను రంధ్రమును శాస్త్రధర్మమను పద్ధతితో పూడ్చాలనుకొన్నాడు. నాల్గవ మారు వచ్చిన భగవంతుడు బ్రహ్మవిద్యా శాస్త్రమును బోధించాడు. బ్రహ్మవిద్యా శాస్త్రము ద్వార

గురువు యొక్క పద్ధతిని శిష్యునియొక్క పద్ధతిని తెలియజేశాడు. దైవవిద్య ఒక గురువు ద్వారానే బయల్పడునని తెలియజేశాడు. గురువు చెప్పిన దానిని తిరిగి ఎందరు ఎందరికి చెప్పిన వారందరు గురువులుకారని, మొదట తెల్పిన వాడే గురువని, తర్వాత చెప్పిన వారందరు కేవలము బోధకులేనని తెలియజెప్పాడు. ఎన్నో విధముల దేవుని యొక్క ధర్మములను గురించి తిరిగి బ్రహ్మవిద్యాశాస్త్రము ద్వార తెలియజేశాడు. అలా నాల్గవమారు భగవంతుడు తెలియజేసిన బ్రహ్మవిద్యాశాస్త్రము కొన్ని వేల సంవత్సరముల వరకు భూమి మీద నిలిచి అందరికి తెలిసియుండెడిది. దేవునికి ప్రతిపక్షమైన మాయ మానవుని తలలో గుణముల రూపములో తిరిగి చెలరేగి హేతువాదము, నాస్తికవాదము అను వాదములను లేవదీసి బ్రహ్మవిద్యాశాస్త్రమునకు గుర్తింపు లేకుండ చేసినది. షట్ శాస్త్రములను ఆరుశాస్త్రములలో గొప్పదైన దైవశాస్త్రమును మాసిపోవునట్లు చేయుటకు భూమిమీద శాస్త్రపద్ధతిలేని అనేక శాస్త్రములను తయారు చేసినది. క్రొత్తగ వచ్చిన అనేక మాయ శాస్త్రములలో దైవశాస్త్రము అంటే ఏమిటో కూడ మనుషులకు తెలియకుండ పోయినది. ఈ విధముగ భగవంతుడు తెల్పిన ధర్మములు భగవంతునికి వ్యతిరేఖమైన మాయవలన కాలక్రమమున వేల, లక్షల సంవత్సరములకొక మారు మాసిపోతూనే వస్తున్నవి. మొదట దేవుని ఉనికిని తెలియజేసిన భగవంతుడు దానిని కాపాడుటకు దేవాలయధర్మములను తెలియజేశాడు. తర్వాత దేవాలయ ధర్మములను కాపాడుటకు గురు శిష్యధర్మమును తెలియజేశాడు. తర్వాత గురువు ధర్మములను కాపాడుటకు దైవవిద్యాశాస్త్రమును బోధించాడు. చివరకు దైవవిద్యా శాస్త్రము కూడ మాసిపోవుటకు అనేక అధర్మశాస్త్రములు బయటికి వచ్చినవి. ఈ విధముగ తిరిగి కుండకు రంధ్రము పడినట్లయినది. ఈ మారు అధర్మరంధ్రమును ధర్మమను సీసముతో భగవంతుడు పూడ్చాలనుకొన్నాడు. దాని కొరకు వచ్చినదే భగవంతుని ఐదవరాక. భగవంతుని ఐదవరాకనే మనము కొంత గుర్తించగలిగాము. అంతకు ముందు వచ్చిన రాకలను నామమాత్రము కూడ గుర్తించలేకపోయాము. ఈ గుర్తింపు కూడ స్వయముగ మనము గుర్తించినది కాదు. వచ్చినవాడు నేను పలానా వాడినని సాక్ష్యాధారాలతోసహా చెప్పియుంటే అదియు కొందరు నమ్మగలిగారు.

కొందరు ఇప్పటికి అతను భగవంతుడని నమ్మలేక పోవుచున్నారు. ఐదవమారు భగవంతునిగ వచ్చిన వాడే శ్రీకృష్ణుడు. ఎవరు నమ్మిన నమ్మకపోయిన కృష్ణుడు భగవంతుడే.

## భగవంతుని జన్మల వివరము

**1) దేవుని ధర్మముల ఉనికి → భగవంతుని మొదటి జన్మ.**

**2) దేవాలయ ధర్మముల ఉనికి → భగవంతుని రెండవ జన్మ.**

**3) గురు శిష్య ధర్మముల ఉనికి → భగవంతుని మూడవ జన్మ.**

**4) బ్రహ్మవిద్య ధర్మముల ఉనికి → భగవంతుని నాల్గవ జన్మ.**

**5) గీత ధర్మముల ఉనికి → భగవంతుని ఐదవ జన్మ.**

**6) అన్ని ధర్మముల ఉనికి → భగవంతుని ఆరవ జన్మ.**

*ఒక్క భారత దేశములో మాత్రము భగవంతుడు పుట్టిన వివరమును ఇక్కడ తెలియజేయడమైనది.*

తాను ధర్మములను నెలకొల్పితే తిరిగి కొంత కాలమునకు అధర్మము చెలరేగడమును చూచిన భగవంతుడు, తన ఐదవ జన్మలో కొంత ప్రత్యేకతతో ధర్మములను తెలియజేయాలనుకొన్నాడు. అందువలననే తనను భగవంతునిగ ప్రకటించుకొన్నాడు. అంతేకాక సాకారముగ కనిపించు తానే కనిపించని దేవుడనని తెలియజేసి అర్జునునికి జ్ఞానదృష్ఠినిచ్చి తన దైవత్వమును తెలియునట్లు చేశాడు. ఎన్నిమార్లు సరిదిద్దిన అనేక మార్లు అధర్మపరులుగ మారిపోవు మానవులకు ఒక హద్దును ఏర్పరచాలనుకొన్నాడు. హద్దును సూచించు పేరుతోనే తన బోధను గీత అని, భగవద్గీత అని పేరుపెట్టి తెలియజేశాడు. మానవునికి శరీరమే హద్దుగ చేసి దానిని దాటి చూచితే అంతా అధర్మమేనని, శరీరములోపల చూడడమే ధర్మమని తెలియజేశాడు. గీతలో శరీరాంతర్గతమునే చెప్పాడు. అందులోనే ఆత్మలు మాయ కలవని తెలియజేశాడు. దేవుని చేరు మార్గములు ఏవికావో వాటిని తెలుపుచు

దేవుని చేరు పద్ధతులను కూడ తెలియజేశాడు. ఇట్లు ఎన్నో రహస్యములను తెలిపిన గీత యొక్క బోధ ఎంతో ఉన్నతమైనప్పటికి, ఈ మారు మాయ కూడ ప్రత్యేక పద్ధతిలో ఆ గీతను మానవునికి అర్థము కాకుండ చేసినది. దేవుడు నేను పలానా, నా బోధ పలానా అని తెలిపినప్పటికి ఈ మారు మాయకూడ నేను పలానా అన్నట్లు మానవుని తన అదుపులోనే పెట్టుకొని, గీత అంటే ఏమిటో అర్థము కాకుండ చేసినది. ఇంతకుముందు నాలుగుమార్లు భగవంతుడు చెప్పినది కనీసము వెయ్యి సంవత్సరములకైన మానవులలోనికి చొచ్చుకొనిపోయి, కొన్ని వేల సంవత్సరములు వారియందుండెడిది. ఈ మారు భగవంతుని ఐదవరాకలో తాను ఎంతో బలముగ చెప్పదలచుకొని నేనే దేవున్ని అని చెప్పినప్పటికి, మాయ అంతకు రెండింతల బలముతో చెప్పినవాడు సాధారణ మనిషేనను భావమును మనుషులలో కలుగజేసినది. కొందరు భగవద్గీతను వారివారి భాషలలోనికి సంస్కృతమునుండి అనువదించుకొనినప్పటికి, వారి మనస్సులో కృష్ణుడు చెప్పిన భావము లేకుండ పోయెటట్లు చేసి వేరు భావము వచ్చునట్లు చేసినది. ఎంతో తెలివైనవారు, సంస్కృత పండితులు, గురువులని పేరుగాంచినవారు, స్వాములు, పీఠాధిపతులు, గీతబోధకులని పేరు పెట్టుకొన్నవారు, భగవద్గీత పరిశోధన సంఘము అని పేరు పెట్టుకొన్నవారు, భగవద్గీతలోని భావమును నూటికి పదింతలు కూడ అర్థము చేసుకోలేకపోయారు. ఈ విధముగ గీతను చెప్పి ఐదువేల సంవత్సరములు గడిచిపోగా, చివరకు గీతలో జీవాత్మ పరమాత్మ అను రెండు ఆత్మలు తప్ప రెండిటికి మధ్యనున్న ఆత్మ అసలుకు లేకుండపోయినది. చివరకు గీత అంటే హద్దు అని కూడ తెలియనంత మూఢులుగ మనుషులను మాయ మార్చివేసినది.

దేవుడు తయారు చేసినదే మాయ. దేవుని ఆజ్ఞ ప్రకారమే మాయ భగవంతునికి ప్రతిపక్షమై ఉన్నది. మాయకున్న బలము దేవుడిచ్చినదే. అయిన ఎవరి పని వారిది. ఎవరి ఆట వారిది. ఇది భూమిమీద సాగే ఆట. ఈ ఆటలో పోటీదారులు ఒకవైపు మాయ, ఒకవైపు భగవంతుడు. భగవద్గీతను భగవంతుడు చెప్పి ఐదు వేల సంవత్సరములైన అది ముందుకు పోక, వెనుకకు కనిపించని

విధముగ వెళ్లి పోయినది. ఈ మారు భగవద్గీతనే అధర్మమై పోవునట్లు మాయ చేసినది. ఎన్నో పెడార్థములను దానియందు ఇరికించినది. ఈ మారు తన గీతను రక్షించుకొనుటకు భగవంతుడు తిరిగి రావలసియున్నది. ఈ మారు వస్తే ఆరవమారు వచ్చినట్లగును. ఈ మారు భగవంతుడు భూమి మీదకు వస్తే, మాయను అణచివేసి ధర్మములను ఏ విధముగ నెలకొల్పునో, దానికొరకు ఏ పథకమును రచించుకొని భూమిమీదకు వస్తాడో వేచి చూడవలసియున్నది.

వేల సంవత్సరములకొకమారు భూమి మీదకు వచ్చు భగవంతుని రాక వరకు మనముండము. చచ్చి ఇంకొక చోట పుట్టినప్పటికి ఈ జ్ఞానము ఆ దినము మన మతికి లేకుండపోవచ్చును. సృష్ఠి ఆదినుండి ఉన్న మనము భగవంతుడు ఐదు మార్లు వచ్చినపుడు కూడ మనము ఉండియె ఉంటాము. ఐదుమార్లు ఆయనను కనుక్కోలేని వాళ్ళము ఆరవమారు వస్తే కనుక్కోగలమను గ్యారంటీ ఏమిలేదు. అందువలన ప్రస్తుతము ఇపుడు తెలిసిన కొద్దిపాటి మన జ్ఞానముతో భగవంతుడొస్తే ఎట్లుండగలడో, ఎట్లు ప్రవర్తించగలడో, ఎట్లు మాయ వ్యూహమును ఎదుర్కొనగలడో ఊహించుకొందాము. భగవంతుడు భూమిమీదకు వస్తే అందరికంటే తెలివైన వాడుగ వస్తాడు, కాని తెలివితక్కువ వానిగ నడుచుకొంటే ఆయనను కనుగొనలేము. ఐదవమారు తాను పలానా భగవంతుడనని ప్రకటించుకొనిన దానివలన మాయకు ఎక్కువ బలము ఏర్పడినది. కావున ఆరవమారు తన విషయమును మాయకు కూడ తెలియనీయడేమో! అలాంటపుడు మనుషులము మనము కనుగొనగలమా? ఐదు దఫాలుగ భగవంతుడు వచ్చి, ఐదు మార్లు, ఐదు అంశలతో కూడుకొన్న ధర్మములను బోధించగ, చివరకు ఐదు రకముల ధర్మములు మానవులకు తెలియకుండపోయాయి. ఈ దఫా వస్తే గీతను మాత్రమే పునరుద్దరించడన్ని, ఇంతకుముందు ఉండి చెప్పిపోయిన ధర్మములనన్నిటిని కూడ పునరుద్దరించదానికి ప్రయత్నిస్తాడను కొందాము. **ఆరవ మారు తన దృష్ఠిని మాయ మీదనే ముఖ్యముగ కేంద్రీకరిస్తాడనుకొందాము. అట్లు మాయమీద దృష్ఠిపెట్టి ఎన్నోమార్లు ధర్మములను అధర్మములుగ మార్చిన మాయయొక్క పుట్టు పూర్వోత్తమును మానవులకు విప్పి**

**చెప్పగలడనుకొందాము.** అట్లు చేస్తే మాయను గుర్తించి మానవుడు దానివైపు పోకుండుటకు కొంత అవకాశమేర్పడును. అందువలన మాయలో మునిగిపోవు మనకు మాయను గురించియే తెలుపమని వచ్చే భగవంతున్ని కోరుకొందాము. దేవుడు గీచిన గీతను మానవులు దాటి పోవునట్లు చేసిన మాయకే, ఈ మారు ఒక హద్దును ఏర్పరచగలడని అనుకొందాము.

భూమి మీదకు మొట్టమొదట వచ్చిన భగవంతుడు దేవుని ఉనికిని మానవులలో కలుగచేయగ, ఆ ఉనికి ఉన్నా లేనట్లయినది. రెండవమారు వచ్చిన భగవంతుడు తాను మొదటదఫా తెలిపిన బోధకు అనుగుణముగ మొదటి ధర్మములు తిరిగి పునరుద్ధరింపబడునట్లు, రెండవమారు దేవాలయ రహస్యములను తెలిపాడు. తాను మొదట వచ్చినపుడు చెప్పినది తనకు జ్ఞాపకముండుట వలన ముందు ధర్మములకు బలము చేకూర్చునట్లు, రెండవమారు దేవాలయముల గూర్చి చెప్పాడు. దీనిని బట్టి అన్ని జన్మలు ఆయనకు జ్ఞప్తికున్నాయని చెప్పవచ్చును. భగవంతుని జన్మకు జన్మకు మధ్యలో వేల, లక్షల సంవత్సరముల కాలము తేడాగలదు. ఆయన ఎన్ని వేల సంవత్సరములకు పుట్టిన ముందు జన్మలో ఆయన దేనికి వచ్చినది, అపుడు ఏమి చేసినది ఆయనకు జ్ఞప్తికియుండును. మనము వెంట వెంటనే పుట్టుచున్నప్పటికి మన జన్మలకు మధ్యలో ఏమాత్రము కాలవ్యవధి లేకున్నప్పటికి వెనుకటి జన్మ జ్ఞాపకాలు ఉండవని తెలుసుకొన్నాము. భగవంతునికి మన మాదిరి కాకుండ ఆయన జన్మలు వరుసగ ఆయనకు జ్ఞప్తికి ఉండును. అలా ఎందుకు జ్ఞాపకమున్నాయనగా! ఆయన శరీరములో మనస్సు మనలోగల మనస్సువలె ఉండినప్పటికి, మన మనస్సువలె జ్ఞాపకాలే దానిపని కూడ అయినప్పటికి, నిద్రలో మనస్సు లేనపుడు మనకు జ్ఞాపకములేకున్నట్లు ఆయన నిద్రలో ఉన్నపుడు ఆయన మనస్సుకు కూడ జ్ఞాపకాలు లేకున్నప్పటికి, చనిపోయిన తర్వాత వెనుక శరీరములోని మనస్సు అక్కడే పోయి మనకు వెనుకజన్మ జ్ఞాపకము లేనట్లు, ఆయనకు కూడ వెనుక శరీరములోని మనస్సు లేకుండ పోయి వెనుక జ్ఞాపకములు మనస్సు అందివ్వలేక పోయినప్పటికి, ఆయనకు అన్ని జన్మల జ్ఞాపకములు గలవు.

శరీరములో నిద్ర పోయినపుడు జరిగిన విషయము కూడ ఆయనకు జ్ఞాపకము ఉండును. ఆయన శరీరములోని ఆత్మ మనస్సువలె శరీరమంత వ్యాపించి అన్ని వేళల ఎరుక కల్గియున్నది. కావున ఆ ఆత్మే అన్ని జన్మల జ్ఞాపకములను అందిస్తున్నది. మన శరీరములో కూడ ఆత్మ ఉన్నప్పటికి మనము వేరు, ఆత్మ వేరు. కావున జీవునకు ఆత్మ జ్ఞాపకమును అందివ్వదు. భగవంతుని శరీరములో ఆత్మగ భగవంతుడు ఉండుట వలన అన్ని జ్ఞాపకములు ఆత్మవలన కల్గుచుండును. మానవుడు జీవునిగ భూమి మీద జీవిస్తే శరీరములో జీవాత్మ, ఆత్మ, పరమాత్మ ఉన్నప్పటికి, జీవుడు జీవునిగానే జీవిస్తున్నాడు. భగవంతునిలో అలాకాక పరమాత్మయే జీవునిగ, ఆత్మగ ఉంటున్నది. భగవంతుడు జీవునిగ, ఆత్మగ, పరమాత్మగ జీవిస్తున్నాడు. అందువలన మనకు లేని జన్మల జ్ఞాపకములు ప్రత్యేకించి ఆయనకుండును. కావున పై శ్లోకములో నీ జన్మలు నీకు జ్ఞాపకములేవు, నా జన్మలు అన్ని నాకు జ్ఞాపకమున్నాయన్నాడు. అంతేకాక మనము ఎన్నో జన్మలు ఎత్తినట్లు, ఆయన కూడ ఎన్నో జన్మలు ఎత్తినట్లు చెప్పాడు. మన జన్మలు ఎన్ని అన్నది మనకు ఎటూ తెలియదు. ఆయన జన్మలు ఎన్ని అను విషయము చెప్పకుండ అన్ని జ్ఞాపకములున్నాయని చెప్పాడు. అన్ని జన్మల జ్ఞాపకములున్న భగవంతుడు భూమి మీద ఎట్లు పుట్టుచున్నది క్రింది శ్లోకములో చూచెదము.

(3) శ్లో॥ 6 : అజోఽపి సన్నవ్యయాత్మా భూతానా మీశ్వరోఽపిసన్।
ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామ్యాత్మ మాయయా ॥
(నిరాకారము, సాకారము)

**భావము :** నాకు పుట్టుకలేదు, నాశనము లేదు. నేను సర్వజీవరాసులకు అధిపతినై ఉన్నాను. అయినప్పటికి నాచేత నిర్మింపబడిన ప్రకృతితో చేరి మాయతో జన్మించుచుందును.

**వివరము :** ఈ అధ్యాయము మొదటి శ్లోకములో సృష్ఠి ఆదిలో సూర్యునికి జ్ఞానము చెప్పియుంటినని, తర్వాత సూర్యుని ద్వార భూమి మీదున్న మనువుకు తెలిసినదని,

మనువుద్వార ఇక్ష్వాకుడను రాజుకు తెలిసినదని, తర్వాత అతని ద్వార ఇతరులకు తెలిసినదని చెప్పబడినది. రెండవ శ్లోకములో ఒకరి ద్వార మరొకరికి పరంపరగ తెలుస్తుపోయి అందరు తెలుసుకోగా చివరకు ఇప్పటికి ఆ యోగముల జ్ఞానము లేకుండ పోయినదని కూడ చెప్పాడు. ఇక మూడవ శ్లోకములో ఇట్లు ఎవరికి తెలియకుండ పోయిన రహస్యమైన జ్ఞానమును తిరిగి ఇప్పుడు నీకు చెప్పుచున్నానని చెప్పడము జరిగినది. నాల్గవ శ్లోకములో ఇప్పుడున్న నీవు సృష్ఠి ఆదిలో సూర్యునికెట్లు చెప్పావని అర్జునుడు అడగడము జరిగినది. ఐదవ శ్లోకములో నీవు పుట్టుచున్నావు, నేను పుట్టుచున్నాను. నీకు వెనుక జన్మలు మతికి లేవు, నాకు అన్ని జ్ఞప్తికున్నాయని కృష్ణుడు అర్జునునికి జవాబు చెప్పడము జరిగినది. ఇపుడు హేతువాదులకు మంచి అవకాశము దొరికి ఈ విధముగ ప్రశ్నించవచ్చును. ఆదిలో సూర్యునికి చెప్పిన తర్వాత ఇతరులకు చెప్పానని కృష్ణుడు తెలుపలేదు. అప్పుడు తాను చెప్పిన దానిని ఒకరికొకరు పరంపరగ చెప్పుకొన్నారని చెప్పాడు తప్ప తానెవరికి చెప్పినట్లు లేదు. అటువంటపుడు ఆయనకు ఎన్నో జన్మలు కల్గినవని చెప్పడము సత్యమా? అని అడుగవచ్చును. అట్లు జన్మలు కల్గియుంటే ఆయన భూమిమీద జ్ఞానము చెప్పేదానికే కదా పుట్టేది. అటువంటపుడు సూర్యుని దగ్గరనుండి అర్జునుని వరకు మధ్యలో ఎవరికి తాను జ్ఞానము చెప్పినట్లు లేదే? అప్పుడు చెప్పినది కాల గమనములో లేకుండపోయినది, కావున ఇపుడు నీవు నాకు ఇష్టమైనవాడివి కనుక నీకు చెప్పుచున్నానని చెప్పాడు కదా! దీనిని బట్టి ఆయన ఎన్నో మార్లు పుట్టినది వాస్తవమా? లేక ఆదిలో కృతయుగములో పుట్టి తర్వాత ఇపుడు ద్వాపరయుగములో అర్జునునితో పాటు పుట్టాడనునది వాస్తవమా? అని అడుగవచ్చును. ఆయన మధ్యలో పుట్టలేదు అంటే ఎన్నో జన్మలు నాకు కల్గినాయని అతనే చెప్పాడు కదా! అన్నది అడ్డమొచ్చును. పుట్టాడు అంటే నేను ఆదిలో చెప్పాను తర్వాత ఇపుడు నీకు చెప్పుచున్నానని ఇపుడే పుట్టినట్లు ఆయనే చెప్పుచున్నాడు కదా! అని అడుగవచ్చును. పుట్టాడంటే పుట్టలేదనుటకు పై రెండవ శ్లోకము ఆధారమవుచున్నది. పుట్టలేదంటే ఎన్నోమార్లు పుట్టాడనుటకు పై ఐదవ శ్లోకము ఆధారమవుచున్నది. ఇటుపోతే బావి, అటుపోతే

చెరువు అన్నట్లున్నది. కనుక ఏ ఆధ్యాత్మికవాది అయిన హేతువాది అడుగు ప్రశ్నకు జవాబు చెప్పలేక కప్పదాటు వేయవలసియున్నది.

ఇక్కడ ఆరవ శ్లోకములో ఏమైన జవాబు దొరుకుతుందా అని చూస్తే, మొదట వాక్యములో నాకు పుట్టుకే లేదన్నవాడు, రెండవ వాక్యములో నేను పుట్టుచున్నానని చెప్పాడు. పుట్టుకలేని వానినని చెప్పి పుట్టుచున్నాననడమేమిటి? అదియు ఒకే శ్లోకములోనే రెండు విధములుగ చెప్పడముతో ఎవరికైన పిచ్చిపట్టినంతపని కాకతప్పదు. ఇక్కడ వినేవారికైన పిచ్చి ఉండాలి, లేకపోతే అక్కడ చెప్పేవానికైన పిచ్చి ఉండాలి అనక తప్పదు. అటో ఇటో ఎవరిలోనో ఒకరిలో లోపముండాలి. వాస్తవముగ చెప్పినది భగవంతుడు కావున చెప్పేవానిలో లోపముండదు, కాని విని అవగాహన చేసుకొనేవానిలోనే లోపమున్నట్లు తెలియుచున్నది. ఇపుడు చెప్పేవానిది సత్యమెట్లో వివరించుకొందాము.

సృష్ఠి ఆదిలో పరమాత్మ (దేవుడు) సూర్యునికి జ్ఞానమును చెప్పినది వాస్తవమే. అప్పటినుండి ద్వాపరయుగములో అర్జునుని వరకు ఆయన జ్ఞానము చెప్పనిమాట వాస్తవమే. మధ్యలో మనుషులు ఒకరికొకరు తన జ్ఞానమును చెప్పుకొన్నారన్నది నూటికి నూరుపాల్లు సత్యమే. ఇకపోతే ఐదవ శ్లోకములో ఉన్నట్లు భగవంతుడు ఆదినుండి ఐదుమార్లు పుట్టినది నూటికి నూరుపాల్లు వాస్తవమే. ఇదేమిటి ఈయన కూడ అడ్డము మాట్లాడుచున్నాడే అని అనుకోవద్దండి నేను చెప్పునది కూడ నూరుపాల్లు వాస్తవమే. నా మాటలోని వాస్తవమేమనగా! కృష్ణుడు అర్జునునితో మాట్లాడినపుడు జరిగిన సంభాషణయే కదా ఈ రాద్దాంతమంతయు. అర్జునుడు సర్వసాధారణముగ మనలాంటి మనిషే. ఇకపోతే కృష్ణుడు మాత్రము మనలాంటి మనిషి కాదు. పైకి మనిషే అయిన కృష్ణున్ని భగవంతుడు అనుచున్నాము కదా! గీతలోనే శ్రీకృష్ణ ఉవాచ అనక భగవానువాచ అని కృష్ణుని మాటల ముందర చెప్పడము జరిగినది కదా! అందువలన భగవంతుడని కృష్ణున్ని ముమ్మాటికి అనక తప్పదు. భగవంతునిలో సాధారణ మనిషిలోకంటే ప్రత్యేకతయుండును. భగవంతుని ప్రత్యేకతను గురించి తెలుసుకుంటే, భగవంతుని శరీరములో జీవాత్మ, ఆత్మ, పరమాత్మ మూడు ఉండును.

సాధారణ మనిషిలో కూడ మూడు ఆత్మలుండును. సాధారణ మనిషిలో పరమాత్మ సాక్షిగ ఉండును. పరమాత్మ సామాన్యుని శరీరములో కేవలము సాక్షియై ఏ పనిచేయక, ఏమి మాట్లాడకయుండును. భగవంతుని శరీరములో కూడ సామాన్యునిలో ఉన్నట్లే పరమాత్మ సాక్షియై ఉండగ, ఆత్మ చైతన్యము నిచ్చునదై ఉన్నది. కాని కొన్ని ప్రత్యేక సందర్భములలో భగవంతుని శరీరములోని పరమాత్మ స్వయముగ మాట్లాడము జరుగుచున్నది. సామాన్యునిలోనున్న ఆత్మ శరీరములోని కార్యములను చైతన్యమై చేయుచుండగ, పరమాత్మ ఏమి చేయనిదై, ఏమి మాట్లాడనిదై ఉన్నది. భగవంతుని శరీరములో మాత్రము కొన్ని సమయములలో ఆత్మ శరీరములో నుండి బయట జోక్యము చేసుకొని మాట్లాడుచున్నది. అట్లే ప్రత్యేకించి భగవంతుని శరీరములో మాత్రము పరమాత్మ మాట్లాడగలదు. ఆ విధముగ భగవంతుని శరీరములోనుండి సృష్టి ఆదిలో సూర్యునితో స్వయముగ మాట్లాడిన పరమాత్మ ద్వాపరయుగములో తిరిగి అర్జునునితో కృష్ణుని శరీరమునుండి మాట్లాడాడు. ఆ విషయమునే మొదటి శ్లోకములో చెప్పాడు. దీనిని అసత్యమని చెప్పుటకు వీలులేదు. శరీరమును ధరించిన సాధారణ జీవునిగనున్న భగవంతుడు అప్పుడప్పుడు కొన్ని మార్లు అధర్మమేర్పడినపుడు భూమిమీద పుట్టడము వాస్తవమే. ఒక మనిషి శరీరములో మూడు ఆత్మల పనియుంటే వానిని భగవంతుడు అంటాము. భగవంతుడైన జీవుడు కూడ శరీరము ధరించియే పుట్టవలసియున్నది. కావున ఆయనకు పుట్టుకలున్నది వాస్తవమే. కనిపించే శరీరములోని కనిపించని తతంగమును తెలుసుకోగల్గితే దానినే ఆత్మజ్ఞానము తెలుసుకోవడము అంటాము. మూడు ఆత్మల జ్ఞానము తెలియకపోతే పై శ్లోకములలో తెలియని గందరగోళ స్థితి ఏర్పడును.

ఈ శ్లోకములో చెప్పినట్లు లోపలినుండి పలుకు పరమాత్మకు చావుకాని పుట్టుకగాని లేవు. బయటి ధ్యాసతో మాట్లాడు జీవాత్మకు చావు పుట్టుకలు కలవు. అందువలన ఇక్కడ ఒకే శ్లోకములో లోపలినుండి మాట్లాడు పరమాత్మ నాకు నాశనముగాని, పుట్టడముగాని లేవన్నాడు. ఈ శ్లోకములోనే మాట్లాడు జీవాత్మ నేను గుణములరూపమైన మాయతో కూడుకొని పుట్టుచున్నానని అన్నాడు. ఇదంతయు

చూస్తే అపరిచితుడు సినిమాలో ఒకే మనిషి "నేను చంపాను" అనిన వెంటనే "నేను చంపలేదు" అని ఒకే వాక్యములో రెండు విధముల చెప్పినట్లున్నది కదా! అవును అర్థము చేసుకొంటే అతను చంపాననునది వాస్తవమే, చంపలేదు అనునది వాస్తవమే. అట్లే ఈ శ్లోకములో కృష్ణుడు నాకు పుట్టుకలేదు అన్నదీ వాస్తవమే, చాలామార్లు పుట్టాను అన్నది వాస్తవమే. భగవంతుడు భూమిమీద ఎప్పుడు పుట్టునో క్రింది శ్లోకములో చూస్తాము.

(3)శ్లో॥ 7 : యదాయదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత! ।
అభ్యుత్థానమధర్మస్య తదాఽఽత్మానం సృజామ్యహమ్ ॥
(నిరాకారము, సాకారము)

**భావము :** ఎపుడెపుడు ధర్మములకు గ్లాని ఏర్పడి అధర్మము వృద్ధిచెందుచున్నదో, అపుడు నన్ను నేను తయారుచేసుకొని భూమిమీద పుట్టుచున్నాను.

**వివరము :** వెనుక శ్లోకములో వచ్చిన ప్రశ్నకు జవాబుగ పలాన సమయములోనే పుట్టుచున్నానని తెల్పాడు. అపుడే పుట్టవలసిన అవసరమేమొచ్చినది? అను ప్రశ్న మనకు రాగలదు. అందుకు జవాబేమనగా! ఒక డిపార్టుమెంటులో క్రిందిస్థాయి ఉద్యోగులు సరిగ పనిచేయనపుడు, వారిని మందలించి పనిచేయించు బాధ్యత పై అధికారికుండును. అట్లే భూమిమీద పరమాత్మ ధర్మములు సరిగ ఆచరించబడనపుడు, వాటిని సరిచేయు బాధ్యత పరమాత్మకే ఉండును. పరమాత్మ భూమిమీద తన ధర్మములను ఆచరించునట్లు, మానవుల మధ్య ఎన్నో ప్రక్రియలను ఏర్పాటుచేసి పెట్టాడు. ధర్మయుక్తమైన ఆ ప్రక్రియలు నేటికిని ఉన్నను, వాటి అర్థము తెలియక పోయిన దానివలన, ధర్మములు అధర్మములుగ మారుచున్నవి. ఉదాహరణకు **'నాకర్మ'** అనుమాటను ఎందరో అనుచుందురు. ఒక్కొక్కపుడు మనము కూడ అంటుంటాము. అది ఒక ధర్మమే అయినప్పటికి, అది ఒక ఊత పదములాగ మన నోటివెంట వస్తున్నది. దాని అర్థము మనకు తెలియదు. అది ధర్మయుక్తమైన

పదమే, ఆ పదములోని ధర్మము మన నోటి దగ్గరేవున్నది. అయినప్పటికి అర్థము తెలియక పోవడము వలన అధర్మముగ మారిపోయినది.

మొదట మనము ధర్మపరులమే, కాలక్రమేపి అధర్మపరులైనాము. ధర్మములు ఆకాశములోకాని మరి ఎక్కడోకాని లేవు. అవి భూమి మీద ధర్మముగానో, అధర్మముగానో మనమధ్యలో ఆచరణరూపముగ ఉన్నవి. మనము ధర్మముల ఆచరణ చేస్తున్నప్పటికి, అర్థము తెలియక పోవడము వలన, భావరహితమైపోయి అధర్మములుగ మారిపోయినవి. వాటి భావము తెలిసి ఆచరించితే ధర్మపరు లౌతాము. **'గోవింద'** అను పదము ధర్మమే. అది అర్థరహితమై అధర్మమై పోయినది. అట్లే **'భగవంతుడు'** అను పదము కూడ ధర్మమే. అది పెద్దపెద్ద గురువుల వద్దనే అధర్మమై పోయినది. **'పెళ్లి'** అనునది ధర్మము, దాని ఆచరణ అంతయు ధర్మయుక్తముగనున్నది. పెళ్లి ఆచరణ రూపములో ఉన్నను, దాని ఆచరణ యొక్క అర్థము తెలియకుండ పోయినది. కావున అధర్మమై పోయినవి. ఇలా ఎన్నో మన జీవితాలలో ధర్మములు మిళితమై ఉన్నాయి. వాటి వివరణ తెలియనంతవరకు అవి మనకు అధర్మములుగానే మిగులుతాయి. ఉదాహరణకు **పెళ్లికొడుకు, పెళ్ళి కూతురు, చందమామ, అబ్బా, గోవింద** అను పదములు ధర్మములే అయినప్పటికి అవి ధర్మములని ఎవరికి తెలియవు.

ఇదంతయు ఆస్తికత్వము కల్గియుండి దేవుడున్నాడను వారు అధర్మపరులుగ మారిపోవడమును గురించి చెప్పినది. ఆస్తికులు ధర్మములను ఆచరిస్తున్నామను కొనుచు అధర్మపరులుగ మారిపోయి, అధర్మములను ఆచరిస్తున్నపుడు ధర్మములకు గ్లాని ఏర్పడి, అధర్మములు అభివృద్ధి అగుచున్నవని చెప్పడము జరిగినది. ధర్మములు తెలియకుండ పోవడమే ధర్మములకుగ్లాని ఏర్పడినట్లు అర్థము చేసుకోవలెను. అధర్మపరులు రెండు విధములుగ ఉన్నారు. అధర్మములను దేవుని ధర్మములనుకొని తెలియక పొరపడి, అసలైన ధర్మములను వదలి అధర్మములను ఆచరించువారు ఒక రకము వారు. ఉదాహరణకు యజ్ఞయాగములు చేయుట, వేదములను పఠించుట, తపస్సులు చేయుట మొదలగు పనులు చేయువారు అధర్మపరులని

చెప్పవచ్చును. వేదాధ్యాయణములు, యజ్ఞములు, దానములు, తపస్సులు ధర్మములు కాకపోయినప్పటికి, అవి ధర్మాచరణలేనని పొరపడి చేయు ఆస్తికులందరు అధర్మపరులేనని చెప్పవచ్చును. ఇక రెండవ రకము అధర్మపరులెట్లు ఉన్నారనగా! దేవుడే లేడని, దేవుని ధర్మములంటూ ఏవిలేవని, ఉన్నదంతయు ప్రత్యక్ష ప్రకృతియేనని, కనిపించు ప్రకృతి అనేక పదార్థములతో కూడకొన్నదని, పదార్థమునకు ధర్మమున్నది కాని పదార్థముకానటువంటి దేవునికి ధర్మములేదని, పదార్థము దాని ధర్మము సత్యము, దేవుడు దేవుని ధర్మము అసత్యమని చెప్పు హేతువాదులు, నాస్తికవాదులు అనబడు రెండవరక అధర్మపరులు గలరు. దేవుని ధర్మమున్నదనుచు దానిని వదలి ధర్మముగాని దానిని ఆచరించు ఆస్తికులు, దేవుని ధర్మమేలేదనుచు ప్రకృతి ధర్మములను ఆచరించు నాస్తికవాదులు ఇరువురిని అధర్మపరులేనని చెప్పవచ్చును. ఇటువంటి అధర్మపరులు ఎక్కువైనపుడే అధర్మములు అభివృద్ధి అగుచున్నవని శ్లోకములో "అభ్యుత్థానమధర్మస్య" అని అన్నాడు.

ధర్మములు పూర్తిగ నశించిపోవునవి కావు. వాటికి గ్లాని మాత్రము ఏర్పడగలదు. మన శరీరమునకు గ్లాని ఏర్పడినపుడు, వైద్యుని వైద్యముతో నయమైపోయి తిరిగి శక్తివంతమైనట్లు, ధర్మములకు అలసట ఏర్పడినపుడు, భగవంతుని వైద్యము ద్వారా అలసట తీరిపోయి ధర్మములు శక్తివంతమగును. ఆ విషయమే క్రింది శ్లోకమున అంటున్నాడు.

3) శ్లో॥ 8 : పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చదుష్కృతామ్ ।
ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే ॥
(సాకారము)

**భావము :** ధర్మాచరణ కల్గిన వారిని సంరక్షించుటకు, అధర్మ ఆచరణ కల్గిన వారిని లేకుండచేయుటకు, ధర్మసంస్థాపన మొనర్చుటకు యుగ యుగమందు పుట్టుచుందును.

**వివరము :** ఇక్కడ దుష్ట జనులను చంపి మంచివారిని కాపాడుటకు దేవుడు భగవంతునిగా జన్మిస్తాడని, దుర్మార్గులను చంపివేసి ధర్మమును కాపాడునని

చాలామంది భావిస్తున్నారు. అలా అందరనుకొనునట్లు దుర్మార్గులను భగవంతుడు చంపుతూ పోయి వారిని లేకుండ చేస్తాడనుకొనుట సరియైన అర్థము కాదు. ఎందుకనగా! ఇదే భగవద్గీతలోనే ఇంకొక చోట ఏ గుణములో చనిపోయినవాడు అదే గుణములో పుట్టి పెరిగి అదే పనులు చేయునని, దుర్మార్గుడు దుర్మార్గునిగానే పుట్టి పెరుగునని కూడ అన్నారు. ఇచటేమో దుర్మార్గులను సంహరించి లేకుండ చేస్తానన్నపుడు ఆ దుర్మార్గులు ఎచటను లేకుండ పోవాలి కదా! అట్లుకాక ఒకచోట చనిపోయిన చెడ్డవాడు, ఇంకొక చోట చెడ్డవానిగనే పుట్టుచున్నాడన్నపుడు భగవంతుడు వానినెట్లు లేకుండ చేసినట్లగును? ఇలా ఎన్నో ప్రశ్నలు బయలుదేరుచున్నవి. ఇక్కడి శ్లోకమునకు అక్కడి శ్లోకమునకు విరుద్ధ భావమేర్పడినది. ఈ ప్రశ్నలకు జవాబు ఏమిటి? ఏ శ్లోకములోని అర్థము నిజము, ఏది నిజము కాదు అని యోచిస్తే వాటి పరిష్కారమిలా ఉన్నది.

ఒక చెడ్డవానిని ఒక మంచివాడు చంపడానికి పూనుకొన్నపుడు, అందరి మనోభావాల మీద ఎక్కువ ప్రభావము చూపు సినిమాలలో కూడ విలన్‌ను హీరో చంపపూనినపుడు '**పరిత్రాణాయ సాధూనాం**' అను శ్లోకమును గుర్తు చేయడము జరుగుచున్నది. దీనిని బట్టి చెడ్డవారిని చంపితే కాని మంచివారు వృద్ధి చెందరను భావము సర్వదా అందరిలో ఇమిడిపోయినది. ఈ శ్లోకములో ధర్మమును ఉద్ధరించవలెనని వచ్చిన భగవంతున్నే అధర్మపరున్ని చేశారు. భగవంతుడు చెప్పిన విషయము అర్థము కాకపోగ, ఆయనే అధర్మాచరణ చేసినట్లు వ్రాసుకోవడము చోద్యము. వాస్తవానికి భగవంతుడు ఎవరిని సంహరిస్తానని ఎక్కడా చెప్పలేదు. పై శ్లోకములో '**వినాశాయచ దుష్కృతామ్**' అన్నాడు. చెడ్డవారిని లేక అధర్మపరులను నాశనము చేస్తానన్నాడు. నాశనము అన్నంత మాత్రమున చంపివేయడము అని అర్థము చేసుకోవడము పొరపాటు. మరణము వేరు, నాశనమువేరని వెనుక చెప్పబడిన సాంఖ్యయోగమను అధ్యాయమునందు 19వ శ్లోకములో విపులముగ చెప్పడమైనది. నాశనమంటే పూర్తిగ లేకుండ పోవడము. మరణము అంటే శరీరమార్పిడి మాత్రమే అని మరొకమారు గుర్తు చేయుచున్నాము.

ఏ రీతిలో చనిపోయినవాడు తిరిగి అదే రీతిలో పుట్టును. ఒక ఊరిలో చనిపోయి లేకుండపోయినవాడు తిరిగి వేరొక చోట పుట్టి ఉంటున్నాడు. ఎక్కడో ఒక చోట ఉంటున్నాడు కాని లేకుండ పోలేదు. ఈ సూత్రము భగవంతునికి బాగా తెలుసు కనుక దుర్మార్గున్ని చంపపూనలేదు. వానిని ఎక్కడా లేకుండ నాశనము చేయాలనుకొన్నాడు. అట్లు చేయుటకు ఒకటే మార్గము కలదు. వానిలోని అధర్మములను ధర్మములుగ మారిస్తే వాడు శాశ్వతముగ ధర్మపరుడై పోతాడు. ఉదాహరణకు ఒక చిన్న ఊరిలో వేయిమంది అధర్మ పరులున్నారనుకొనుము. అట్లే కేవలము పదిమంది ధర్మపరులున్నారనుకొనుము. అంత మంది అధర్మపరులలో కేవలము పదిమంది ధర్మపరులకు ఇబ్బందిగనే ఉండును. అపుడు భగవంతుడు ఒక మనిషిగ ఆ ఊరిలో చేరి, అధర్మపరులను లేకుండ చేయాలనుకొన్నాడు. రోగులకే వైద్యుడు అవసరము, ఆరోగ్యవంతులకు వైద్యమవసరము లేదు. అందుకే భగవంతుడు ఆ ఊరిలో ధర్మపరులతో ఏమాత్రము స్నేహమేర్పరుచుకోలేదు. ఆయన అధర్మపరులతో పూర్తిగా కలిసిపోయాడు. వారుచేయు పనులే తాను చేయుట వలన చెడ్డవారందరు ఆయనకు బాగాదగ్గరైనారు. అలా కొంత కాలముండగ సందర్భానుసారము వారు చేయుపనులను మాన్పక, వాటి ఫలితము చెప్పుచు వచ్చి పాపభీతి ఏర్పరచి, తర్వాత తాము చేయుపనులలో అర్థమిలాగున్నదని తెల్పుచు చివరకు యోగసారమును, దానివలన వచ్చు ఫలితమును, బోధించడము వలన వారందరు ధర్మపరులుగ మారిపోవుటకు మొదలిడిరి. అలా కొంత కాలము జరుగగ చివరకు కేవలము పదిమంది మాత్రము అధర్మపరులు మిగలగా, ధర్మపరులు వేయిమందిగ తయారైనారు.

ఈ విధముగ ఒకరకమైన ఆస్తికత్వముగల అధర్మపరులకు మనిషిగ వచ్చిన భగవంతుడు ధర్మములను తెలియజేసి, వారిని తిరిగి ధర్మపరులుగా మార్చును. ఇక రెండవ రకమైన నాస్తికత్వముగల అధర్మపరులను ఏమి చేయుననగా! రెండవరక అధర్మపరులను రెండు విధములుగ విభజించవచ్చును. దైవత్వము మీద ప్రశ్నలు వచ్చి, వారి ప్రశ్నలకు జవాబులు దొరకనపుడు, హేతువాదులను పేరు పెట్టుకొని

దేవునికి దూరమైనవారు ఒక రకము. దైవత్వము మీద ప్రశ్నలు కూడ రాకుండనే దైవత్వము మీద ద్వేషభావము కల్గి, అసలు దేవుడే లేడను నాస్తికులు రెండవరకమువారు. ఈ విధముగ దేవుని మీద విశ్వాసములేని అధర్మపరులు రెండు భాగములుగ ఉన్నారు. దైవత్వము మీద అనుమానముతో ప్రశ్నించు హేతువాదులతోగాని, నాస్తికవాదులతో గాని భగవంతుడు ప్రత్యక్షముగ సంబంధము పెట్టుకోడు. మనిషిగ ఎటువంటి సంబంధము పెట్టుకోని భగవంతుడు భూమిమీద ఉన్నపుడు కేవలము హేతువాదుల ప్రశ్నలకు జవాబులు దొరుకునట్లు చేయును. జవాబులు దొరికినప్పటికి దేవుడులేడని, దేవుని ఉనికిని ప్రశ్నించుట వారి స్వభావమైయుండుట వలన, భగవంతుడే జవాబిచ్చినప్పటికి ఆ జవాబులను ఒప్పుకోరు. ఇక నాస్తికవాదులు దైవత్వము మీద అసూయ కల్గియుందురు, కావున వారికి దైవజ్ఞానమును భగవంతుడు ఏ విధముగ తెలియజేయడు. హేతువాదులు, నాస్తికులు మరుజన్మలలో భయంకరమైన కర్మకుగురియై, నష్టాత్ములగుదురు. అపుడు హేతువాదులు కొంత మారగలరు. అట్లు జన్మజన్మకు కొంత తేడాతో కొన్ని జన్మలకైన అధర్మపరులైన హేతువాదులు ధర్మపరులగుటకు అవకాశము గలదు. నాస్తికవాదులకు మాత్రము ఏ జన్మకుగాని ఎటువంటి దైవజ్ఞానము లభించదు. వారు జన్మజన్మకు అధోగతిచెందుచు ఉగ్రకర్ములై పోవుచుందురు. దేవుని ఉనికిని ప్రశ్నించు హేతువాదులకైన దేవుడు కొంత అవకాశము ఇచ్చాడు. కాని నాస్తికవాదులకు ఎటువంటి అవకాశము ఇవ్వలేదు. రెండు విధములుగ ఉన్న అధర్మపరులతో ప్రత్యక్షముగ, పరోక్షముగ భగవంతుడు సంబంధము పెట్టుకొంటున్నాడు. కేవలము నాస్తికులను మాత్రము క్షమించరాని పాపము క్రిందికి వదలి వేయుచున్నాడు. అధర్మపరులను సాధ్యమున్నంత వరకు మాటలతో మార్చగలను. వినని వారిని వదలి వేయగలనని చెప్పాడు తప్ప ఎవరిని ఆయుధములతోగాని, అణ్వాయుధములతో గాని చంపుతానని చెప్పలేదు.

ఇక్కడ ధర్మపరులను పెంపొందింపజేసి, అధర్మపరులను లేకుండా చేశాడనుట తప్పు కాదుకదా! పై శ్లోకములోనే **"ధర్మ సంస్థాపనార్థాయ"** అన్నాడు. మంచివారిని

కాపాడి చెడ్డవారిని లేకుండ చేయుటకు ధర్మసంస్థాపనకొరకు నేను వచ్చానన్నాడు. ధర్మ సంస్థాపన ద్వారనే దుష్టులను లేకుండ చేయుచున్నానని అర్థము తప్ప, ఆయుధములతో లేకుండా చేస్తానని చెప్పలేదు కదా! భగవంతుడు ధర్మసంస్థాపనార్థమే వచ్చి, ఆ పని ద్వారనే సాధుజనుల సంఖ్యను రక్షించి, దుష్ట జనుల సంఖ్యను తగ్గించాడు. ఈ పద్ధతియే ఈ శ్లోకమందున్నదని, సంహరించు పద్ధతి లేదని, సంహరించుట ద్వార ఎవరు లేకుండ పోరని తెలియాలి. భగవంతుడు ఎంతో ఉన్నతుడైనప్పటికి, నీచములో ఉన్న మానవులతో కలిసిపోయి, వారివలె పనులు చేయుచు, వారివలె ఎన్నో బాధలను అనుభవించుచు, మానవుల మధ్య ఎన్నో అవమానములను కూడ చవిచూస్తు, సాధారణ మానవునికంటే తక్కువ వానివలె కనిపించు భగవంతున్ని, భగవంతునిగ ఎవరు గుర్తించగలరు. ఏ ఆధారములేని భగవంతున్ని గుర్తించగలిగిన వానికేమి లభ్యమగునను విషయము క్రింది శ్లోకమున చూస్తాము.

*(3) శ్లో॥ 9 : జన్మ కర్మచ మే దివ్య మేవం యో వేత్తి తత్త్వతః ।*
*త్యక్త్వా దేహం పునర్జన్మనైతి మామేతి సోఽర్జున ! ॥*
*(సాకారము, నిరాకారము)*

**భావము :** నా దివ్యమైన పనులను జన్మను తెలుసుకొన్నవాడు మరణించిన తర్వాత, వేరు జన్మమునకు పోక నాలోనికి ఐక్యమగును.

**వివరము :** ఇంతవరకు మూడు అధ్యాయములలోను పరమపదమును, మోక్షమును పొందుదువు అంటూ వచ్చిన శ్రీకృష్ణుడు, మొట్టమొదటి సారిగా ఇక్కడ **'మామేతి'** అనడము విశేషము. మామేతి అనగా నాయందే ఐక్యమగుదువు అని అర్థము. ముందు రెండు అధ్యాయములలోను పరమాత్మను గూర్చి చెప్పినప్పటికి, ఆ పరమాత్మను నేనేనని చెప్పలేదు. ఈ అధ్యాయములో పరమాత్మను నేనేనని ప్రకటించుకోవడమేకాక, మోక్షము లేక పరపదము అను స్థితిని నేనేననియు, కర్మ అయిపోయిన తర్వాత జన్మలు లేకుండ పోయిన జీవులు నాయందే ఐక్యమై,

వారుకూడ నేనుగ (పరమాత్మగ) మారి పోవుదురని చెప్పాడు. అంతేకాక ఈ అధ్యాయములో ఇక్కడి ప్రత్యేకత ఏమిటంటే! కర్మయోగము లేక బ్రహ్మయోగముల ద్వార మోక్షము పొందవచ్చని ఇంతవరకు చెప్పిన భగవంతుడు, ఇపుడు ఆ యోగములతో ఏమాత్రము సంబంధము లేకున్నప్పటికి, పరమాత్మ పలానా మనిషిగ జన్మించాడని ఆయన జన్మను తెలిసి, ఆ జన్మలో ఆయన కర్మ అంటని విధానముతో పనులు చేయుచున్నాడని తెలిసి, ఆయన పనులను గ్రహించిన జనుడు ఎవడైనగాని, వాడు మరణించిన పిమ్మట నాలోనికి ఐక్యమగునని తెలిపాడు.

అట్లయితే సాధనతో కూడుకున్న యోగములను, మధ్యలో భంగమగు యోగములను, ప్రజల మధ్య ఎన్నో ఆటంకములతో కూడుకున్న యోగములను, అనేక జన్మలలో సాధించి మోక్షము పొందడముకంటే, పరమాత్మ పుట్టుకైన భగవంతున్ని, ఆయన కార్యములను తెలుసుకోవడము వలన ఒకే జన్మలో మోక్షమును సులభముగ పొందవచ్చును కదా! అని చాలామంది అనుకోవచ్చును. కాని అది అంతసులభముగ ఉండదని చెప్పవచ్చును. ఎందుకనగా! యోగములు ఆచరించుటకు తగిన విధానములున్నవి. ఆ విధానముల ప్రకారము ఆచరించి ఎప్పటికైన మోక్షమును పొందవచ్చును. కాని ఏ విధానములేని భగవంతుని యొక్క జన్మను తెలుసుకోవడము చాలా కష్టము. సాధారణ వ్యక్తిగ ఉంటూ ఏ ప్రత్యేకతలులేని వానిని గుర్తించుట కష్టమగును. ఒకవేళ కార్యములను బట్టి తెలుసుకొనవచ్చుననుకొనుటకు, ఆయన చేయుపనులు ఉచ్ఛ నీచములగు రెండు కార్యములుండును. ఇటువంటి సాకార భగవంతుని తెలుసుకొనుటకంటే ప్రత్యేక విధానములున్న యోగములను ఆచరించుట వలననే సులభముగ మోక్షము పొందవచ్చును. భగవంతున్ని తెలుసుకొనుటకు ఆధారమేలేనపుడు, నా జన్మను కర్మను తెలిసిన వానికి మోక్షము వచ్చునని ఎలా చెప్పాడు? అలా చెప్పుట వలన ఏదో ఒక అవకాశముండును కదా! అను సంశయము మనకు రావచ్చును. అలా యోచిస్తే ప్రమాణ పూర్వకమైన ఆధారములు లేకపోయినప్పటికి సంశయ పూర్వకమైన ఆధారమొకటున్నది. అదియు ఆయన చెప్పినదే, అదేమనగా! ఆయన భూమి

మీదకు వచ్చునది ధర్మసంస్థాపన కొరకే కదా! ఆ ఒక్క ఆధారమును బట్టి ఆయనను గుర్తించుటకు అవకాశమున్నది. అయినప్పటికి అది సంశయాలతో కూడుకొన్నది. అన్ని సంశయములకు జవాబులున్నపుడే ఆ ఆధారమును విశ్వసించి భగవంతున్ని తెలియవచ్చును. ఆ ఒక్క ఆధారము ప్రకారము **ఎచ్చటైతే తెలియని ధర్మములు తెలియబడుచున్నవో, ఎచ్చటైతే ఆచరణలో ఉండి అర్థరహితమై పోయిన కార్యక్రమాలకు ధర్మయుక్తార్థము బోధింపబడుచున్నదో, ఎచ్చటైతే పూర్వము ఉండి ఇపుడులేని పరమార్థ రహస్య విషయములు తెలియబడుచున్నవో, ఎచ్చటైతే మానవుని బుద్ధికి అందని ఆత్మ విషయములు బోధించబడుచున్నవో, ఎచ్చటయితే మతాతీత బోధ కలదో అచట పరమాత్మ జన్మవున్నదని తెలియవచ్చును.** ఒక శరీరము నుండి బయటికి వచ్చు బోధను బట్టి భగవంతుడనుకొనినప్పటికి, ఆయన చేయు కార్యములు అనేక సంశయములను రేకెత్తించునవిగ ఉండును. ఆయన జీవిత విధానమంతయు ఇతను భగవంతుడుకాదను నిరూపణలతో కూడుకొని ఉండుట వలన ఎవరు గుర్తించలేరని చెప్పవచ్చును. చెప్పెడి బోధలకంటే చేయు కార్యములే ముఖ్యమని మాయ మనలో మాటిమాటికి గుర్తుచేయుచుండుట వలన, ఒకరు సంవత్సర కాలము భగవంతున్ని భగవంతునిగ గుర్తించినప్పటికి, సం॥చివరికి ఒక రోజు ఆయన భగవంతుడుకాదని వాని నోటిద్వారానే మాయ చెప్పించును. దుర్లభమైన భగవంతుని గుర్తింపుకావాలంటే మనిషిలో విశేషమైన జ్ఞానముండి, మన శరీరములో మాయ ద్వారా వచ్చు అన్ని సంశయములకు సమాధానములు ఉన్నప్పుడే భగవంతున్ని గుర్తించవచ్చును. అఖండమైన, బ్రహ్మాండమైన ఆత్మజ్ఞానము గలవాడు పరమాత్మ జన్మయగు భగవంతున్ని గుర్తించవచ్చును. అట్లు గుర్తించిన వానికి తిరిగి జన్మలేని స్థానము లభించును.

ముఖ్యముగ గమనించవలసిన విషయమేమిటంటే భూమిమీద భగవంతుడు ఉన్నపుడే గుర్తించుటకు అవకాశముండును. ఎన్నో వేల, లక్షల, కోట్ల సంవత్సరములకు ఒకమారు అవసరమొచ్చినపుడు వచ్చు భగవంతున్ని ఆ సమయములోనే గుర్తించు అవకాశ ముండును. ఆయన జన్మ భూమిమీదలేనపుడు

మోక్షము పొందడానికి రెండు యోగములే ఆధారమార్గములు. ఆయన భూమి మీద ఉన్నపుడైతే సాకార గుర్తింపు కూడ ఒక మార్గమగును. మోక్షము పొందుటకు ఎల్లపుడు ధర్మయుక్తమైన యోగములనబడు రెండు మార్గములు, ధర్మాతీతమైన యోగమనబడు ఒక మార్గము, ఒకప్పుడు మాత్రము సాకార గుర్తింపు అను ఒక మార్గము మొత్తము నాలుగు మార్గములున్నవి. ఎల్లప్పుడు ధర్మయుక్త, ధర్మాతీత రెండు విధముల యోగములే ఉండును. సాకార గుర్తింపు ఎల్లప్పుడు ఉండునది కాదు.

*(3) శ్లో॥ 10 : వీతరాగ భయక్రోధా మన్మయా మాముపాశ్రితాః ।*
*బహవో జ్ఞాన తపసా పూత మద్భావ మాగతాః ॥*
*(సాకారము)*

**భావము :** భయము, ప్రేమ, కోపము విడిచి నామీద ధ్యాసకలవారై నన్ను ఉపాసించువారు ఎందరో జ్ఞాన తపనచే పవిత్రులై నాస్వరూపమును పొందిరి.

**వివరము :** పరమాత్మ సాకారమైన భగవంతున్ని తెలుసుకొనుటకు, ఆయన కొన్ని మార్గములు ఈ శ్లోకమున చెప్పాడు. ఈ పద్ధతిలో చాలామంది ముక్తిని పొందారని కూడ చెప్పాడు. ఆ మార్గములను వివరముగ తెలుసుకొందాము. ప్రేమ, కోపము, భయము వదలి ధ్యాస నామీదనే పెట్టుకొనుము అన్నాడు. మనచుట్టు ఉన్న వారిమీద ప్రేమగుణముండుట వలన మనస్సు యొక్క ధ్యాస వారిమీద ఉండును. సాకార భగవంతుని మీద ఉండదు. అందువలన నీకు మిక్కిలి ప్రేమ ఎవరి మీద ఉందో వారిమీద ప్రేమను వదలివేయాలి. అట్లే ఇతరుల మీద క్రోధముండుట వలన మనసులో ఆ శత్రువే మెదలుచుండును. శత్రువును మనసులో నుండి తొలగించాలంటే కోపమును వదలివేయాలి. నీవు ఎవరికి భయపడుచుందువో, వాని ధ్యాస కూడ లేకుండ పోయి, భగవంతుని మీద ధ్యాస రావాలంటే భయమును కూడ వీడాలి. భయక్రోధ రాగములు విడిచినవారు, భగవంతుని రూపము మీద

ధ్యాసకల్గినవారు, ఆయన ద్వార బయల్పడు జ్ఞానము కోసము తపన కల్గియున్నవారు, చాలామంది భగవంతుని సాకారమును తెలిసి మోక్షము పొందినారు.

జ్ఞాన తపన అందరికి ఉండవచ్చును. కాని ప్రేమ, భయము వదలాలంటే చాలా కష్టము. ప్రేమను జయించాలంటే ప్రేమ కల్గిన భార్యనో, పిల్లలో బంధనములై కట్టిపడేయగలరు. భయమును జయించాలనుకొన్నవానికి నీకు జ్ఞానమేవద్దు, జ్ఞానము కావాలంటే నిన్ను అట్లు చేస్తాము, ఇట్లు చేస్తామని ఇంట్లో వారే బెదిరిస్తారు. అందువలన జ్ఞాన తపన ఉన్నా మనచుట్టు దగ్గరగ ఉన్నవారే బంధములగుదురు.

*(3)శ్లో॥ 11 : యే యథామాం ప్రపద్యన్తే తాం స్తథైవ భజామ్యహం ।*
*మమ వర్త్మాను వర్తన్తే మనుష్యాః పార్థ! సర్వశః ॥*
*(సాకారము, నిరాకారము)*

**భావము :** ఎవరు నన్ను ఏ విధముగా భావించి పూజించుచున్నారో, అట్లే వారు నా అనుగ్రహము పొందుచుందురు. మనుజులు ఎన్నో రకములుగ నన్నారాధించు చున్నారు.

**వివరము :** చాలా మంది నన్ను చేరుటకు ఎన్నో మార్గములలో నన్ను ఆరాధించు చున్నారని పై శ్లోకములో భగవంతుడన్నాడు. అట్లు ఆరాధించు ఆరాధనలు ఎన్నివున్న వాటిని రెండుగ విభజించవచ్చును. **ఒకటి సాకార ఆరాధన, రెండవది నిరాకార ఆరాధన.** నిరాకారమంటే యోగపద్ధతులను అనుసరించడమని అర్థము. సాకార ఆరాధనలే చాలా రకములుగ ఉన్నాయి. ఒక్కొక్కడు ఒక్కొక్క ఆకారమును పెట్టుకొని, అదే భగవంతుడనుకొని పూజించుచుందురు. భగవంతుని రూపు కాకపోయినప్పటికి, వాడు తన భావములో చిన్న ప్రతిమను దైవస్వరూపమని తలంచియుండును. అట్లు అనేకులు అనేక రూపములను పూజించుచున్నారు. అయినప్పటికి వారిలో పరమాత్మ భావము కల్గి మోక్షమును కోరువారు చాలా తక్కువ. ఎక్కువ మంది కష్టాలు తీరవలెననియో, ధనము కల్గవలెననియో, అనేక కోర్కెలతో ఆరాధించువారు కలరు.

మోక్షమును కోరి పూజించువారు కూడ ఉన్నారు. కర్మఫలములందు ఆశ కల్గి పూజించువారు కూడ ఉన్నారు. ఆ విషయము క్రింది శ్లోకములో చూస్తాము.

(3) శ్లో॥ 12 : కాంక్షంతః కర్మణాం సిద్ధిం యజంత ఇహ దేవతాః ।
క్షిప్రంహి మానుషే లోకే సిద్ధిర్భవతి కర్మజా ॥
(ప్రకృతి)

**భావము :** కర్మఫలములందు ఆశగలవారు దేవతా పూజచేతురు. జగతిలో కామ్య కర్మఫలములు వేగముగ సిద్ధించును.

**వివరము :** ఈ పనికి ఇంత విలువ అన్నట్లు, వేరు వేరు పనులకు వేరు వేరు లాభములున్నట్లు, వేరు వేరు దేవతల పూజకు వేరువేరు ఫలములున్నాయని ఆశించిన ప్రజలు, ఆయా దేవతలను ఆరాధించుచున్నారు. కర్మ వలన జరిగెడి పనులకు వెంటనే కనిపించు ఫలితమొస్తున్నది. ధనికులు కొందరు ఒక దేవుని ఆరాధిస్తు తమ వ్యాపారములో ఎక్కువ లాభాలు రావాలని కోరుచుందురు. వారు డబ్బు కోసము అక్రమ వ్యాపారము కూడ చేయుచుందురు. సంవత్సరము చివరకు వారు చేసిన వ్యాపారములో లాభము కనిపించగ, అది వారి పూజా ఫలమే అనుకొందురు. మనము చేసిన కర్మాచరణలో సిద్ధించినదనుకోరు.

'*క్షిప్రం సిద్ధిర్భవతి కర్మజా*' వెంటనే కర్మ ఫలములు కల్గును అను భగవంతుని మాటప్రకారము, పనులను చేయు కూలివానికి సాయంకాలమునకు, ఉద్యోగస్తునికి నెల చివరికి, వ్యాపారస్తునికి సంవత్సర ఆఖరుకు ఫలితము కనిపిస్తున్నది. ఈ ఫలితములు దేవతా పూజలవలన కలుగుచున్నవని ఆశ పడుట వలన, ఇంకనూ కావాలను కోర్కెలతో దేవతలనారాధించుచున్నారు. కార్యము వలన కనిపించు ఫలితము డబ్బు, కనిపించని ఫలితము కర్మ వస్తున్నదని తెలియని ప్రజలు ఆశతో కర్మాచరణ వలన వచ్చు ఫలితముల కొరకు దేవతాపూజ చేయుచున్నారని భగవంతుడు పై శ్లోకమున చెప్పాడు.

(3) శ్లో॥ 13 : చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణకర్మవిభాగశః ।
తస్యకర్తార మపి మాం విద్ధ్యకర్తార మవ్యయమ్ ॥
(పరమాత్మ)

**భావము :** కర్మ, గుణ విభాగములను బట్టి నాల్గు వర్ణములు నాచేత సృష్ఠింపబడినవి. వాటి కర్తనైనను కాకుండ నాశనములేనివాడనై ఉన్నాను.

**వివరము :** భగవంతుడు నాలుగు వర్ణములు సృష్ఠించాడు వాస్తవమే. అవి ఏవి అనుటయే ఇక్కడ పెద్ద సమస్య. ఇంతవరకు ఆ నాల్గు వర్ణములను గురించి చాలామంది నాల్గుకులాలుగ వర్ణించుకోవడము జరిగినది. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులుగ నాల్గువర్ణములు సృష్ఠించబడినవని ప్రచారమైనది. అది నిజమాయని చూచిన, సమస్త ప్రపంచమును సృష్ఠించిన పరమాత్మ ప్రపంచములో ఉన్న మనుషులను కూడ ప్రకృతిచేత తయారు చేశాడు. కాని ప్రపంచ జనాభాలో ఈ నాల్గుకులాలు ఎక్కడ కనిపించవు. దీనిని బట్టి మనకు సంశయమేర్పడుచున్నది. భగవంతుడు చెప్పిన ప్రతి మాట సర్వ జీవరాసులకు వర్తించునదై ఉండగ, ఈ నాల్గు వర్ణములు నాలుగు కులాలను మాట, విదేశాలలోనే కాదు ఇండియాలో కూడ వర్తించదు. పరమాత్మ బాహ్యముగ ఉన్న ఏ మతమునుగాని, ఏ కులమునుగాని ఇంతవరకు ఏర్పరచలేదు. కులాలు మతాలు భూమిమీద ఏర్పరచుకొన్నవారు మనుషులే. కుల మత భేదములు మనుషులు ఏర్పరచుకున్నవే కాని పరమాత్మ సృష్ఠించలేదు. ఇంకా కొందరు *'భగవంతుడు గుణకర్మ విభాగ అన్నాడు కదా! మనుషులు చేయు పనులను బట్టి, గుణములను బట్టి వారిని విభజించుకోవచ్చును. వ్యాపారము చేయువారు ఎవరైన వైశ్యులని, నీచ పనులు చేయువారు శూద్రులని, రాజ్యమునేలు వారిని క్షత్రియులని చెప్పుకోవచ్చును. వారి పుట్టుకతో వచ్చిన కులము ముఖ్యము కాదు. వారు చేయు పనులను బట్టి కులమేర్పరచాలి. పుట్టుకతో బ్రాహ్మణుడైనప్పటికి నీచ పనులు చేస్తే శూద్రుడని చెప్పాలి.'* అని అంటున్నారు. ఆయన చేసినది కాని, చెప్పినది కాని, ప్రతి జీవరాసికి వర్తించునదిగ ఉన్నపుడు,

మనుషులలో అయితే నాల్గుకులాలు ఏర్పరచినట్లు చెప్పుకోవచ్చు. మిగత జీవరాసులెన్నో ఉన్నాయి కదా! వాటిని ఏ కులాలుగ చెప్పగలము? కుక్కలను, నక్కలను, పిల్లులను, ఎలుకలను బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులుగ విభజించి చెప్పగలరా? అట్లు చెప్పుటకు వీలులేదు. కావున ఈ నాల్గువర్ణములు పరమాత్మ చెప్పినవి కావు. మానవులు సృష్ఠించుకొన్నవే అని తెలియాలి. పై శ్లోకములో నాల్గువర్ణములు నాచేత సృష్ఠింపబడినాయి అన్నాడు. కాని అవి బ్రాహ్మణ, క్షత్రియ కులములని పేరు పెట్టలేదు కదా! ఈ విధముగ యోచిస్తే ఇంతవరకు ఈ శ్లోకమునకు వ్రాసుకొన్న భావము సరియైనదికాదని తేలిపోవుచున్నది. ఇది సరియైన అర్థము కానపుడు ఏది సరియైనదనుట అందరికి వచ్చు ప్రశ్నయే. దాని జవాబు క్రింద చూస్తాము.

భగవంతుడైన శ్రీకృష్ణుడు తన తలమీద నెమలిపింఛమును ధరించాడు. ఎవరు ధరించని పింఛమును ఆయన ధరించడములో ప్రత్యేకత ఏమిటని ఎవరు ఇంతవరకు యోచించలేదనియే చెప్పవచ్చును. ఇపుడు మనము యోచిస్తాము. శ్రీకృష్ణుడు నెమలిపింఛమును అందమునకో, అలంకారమునకో ధరించలేదు. తానున్న స్థితిని గూర్చి నెమలిపింఛము ద్వారా తెలుపుచు, మీరు కూడ ఈ మాదిరే ఉండవలెనని బహిర్గతము చేయు ఆధ్యాత్మిక రహస్యమే పింఛము ధరించడములోని విశేషార్థమని తెలియాలి. నెమలి పింఛము గొప్ప ఆధ్యాత్మిక రహస్యమును గూర్చి బోధించు విశిష్టత కల్గివున్నది. దాని విశేషమేమనగా! పింఛము యొక్క మధ్య భాగము నలుపు కలిసిన నీలిరంగుతో కూడుకొని కొద్దిగ గుండ్రముగ ఆకర్షణగ కనిపిస్తూ ఉండును. ఈ భాగము పింఛములో అన్ని రంగులకంటే ముఖ్యముగ తెలియునట్లుండును. దానికి చుట్టు మెరుపు గల ఆకుపచ్చ రంగు ఉండును. దాని తర్వాత లేతగోధుమ రంగు గల ఆకారము చుట్టు ఉండును. ఈ లేత గోధుమరంగు చుట్టు చివరియందు మెరియుచుండును. దీని చివరి అంచు మెరుపు తర్వాత చుట్టు గుర్తించలేనంత లేతగ ఒకరంగు భాగముండును. వీటిని బట్టి పింఛములో మొత్తము నాలుగు భాగములున్నట్లు గుర్తు తెలియుచున్నది. 1) మధ్యలో నలుపు రంగు

కలిసిన నీలిరంగు ఉన్నది. 2) గుండ్రని మెరుపుగల ఆకుపచ్చ భాగము 3) లేత గోధుమ రంగు 4) రంగు గమనించలేనంతగా ఒక భాగముండును. నాల్గవ దాని అంచు చివరలో కూడ సులభముగ గుర్తించవచ్చును. బయటి నుండి మూడు గుండ్రని భాగములుండి మధ్యలో కన్నుగ లేక కేంద్రముగయున్న నెమలిపింఛమును బ్రహ్మవిద్యయైన మరియు యోగశాస్త్రమైన గీతాశాస్త్రమును చెప్పిన శ్రీకృష్ణుడు ధరించడము గొప్ప అర్థమై ఉన్నది. దాని వివరమేమనగా!

మన శరీరములో శిరోభాగమునందు గుణములు కలవు. శరీరముచే జరుగు కార్యములన్నిటికి కారణమైన గుణములు ఒక పద్ధతిగ అమర్చబడి ఉన్నవి. ఆ పద్ధతి ఒక చక్రముగ నిర్మితమై ఉన్నది. గుణములు మూడు రకములుగ విభజింపబడి ఉన్నవి. వాటి పేర్లు 1) సాత్త్వికము 2) రాజసము 3) తామసము. ఈ మూడు రకముల గుణములు గుణచక్రములో మూడు భాగములుగ విభజింపబడి ఉన్నాయి. ఆ మూడు భాగములకు సాత్త్వికభాగము, రాజసభాగము, తామసభాగము అని పేర్లు పెట్టబడినవి. ఈ మూడు భాగములకు మధ్యలో గుండ్రని భాగమొకటున్నది. దానినే బ్రహ్మనాడి అనుచున్నాము. దానియందే ఆత్మ నివాసమై ఉన్నది. ఆత్మ నివాసమున్న బ్రహ్మనాడిని ఇరుసుగ చేసుకొని కంటికి కనిపించని గుణచక్రము అమరివున్నది. దాని అమరిక తర్వాత పేజీలోని పటము చూడవచ్చును.

నేనుకాని, నీవుకాని, సర్వజీవులుగాని ఈ గుణచక్రములోనే చిక్కుకొని ఉన్నాము. ఈ మూడు భాగములలో జీవుడు ఎక్కువ ఏ భాగములో ఉండునో, ఆ జీవునికి ఆ భాగము యొక్క పేరు పెట్టబడినది. తామస భాగములో ఎక్కువ కాలమున్న జీవుని తామసుడని, రాజసగుణభాగములో ఉన్న జీవుని రాజసుడని, సాత్త్వికములో ఉన్న జీవున్ని సాత్త్వికుడని పేరు పెట్టడమైనది. ఏ భాగములో ఉన్న జీవునికైన మధ్యలో ఉన్న ఆత్మయే సాక్షిగ ఉన్నది. మధ్యలో ఉన్న ఆత్మకు తెలియని జీవరాసి లేదు. ప్రతి శరీరములో గల గుణచక్రము మధ్యలో ఉన్న ఆత్మ తన చుట్టు ఉన్న గుణములతో సంబంధము లేక సాక్షిగ ఉన్నది.




గుణ చక్రము

ప్రతి జీవరాసి గుణముల వలన పనులుచేయుచున్నది. జరిగెడి పనుల వలన పాపపుణ్యములు ఆ జీవునికి సంభవించుచున్నవి. పాపపుణ్య కర్మలు జీవాత్మకే గాని మధ్యనున్న ఆత్మకు అంటవు. ఆత్మశక్తియే శరీరమంత వ్యాపించి కదలిక నిచ్చునదైనప్పటికి, ఆ కదలికలు గుణములననుసరించి ఉండును. ఆ గుణములు కర్మననుసరించి ఉండును. శరీరములో గుణముల ఆదేశాల ప్రకారము వివిధ పనులు జరుగుచున్నప్పటికి, ఆ పనులకు శక్తినిచ్చునదైన ఆత్మకు మాత్రము కర్మ అంటక అన్నిటికి సాక్షిగ ఉన్నది.

నెమలి పింఛములో మధ్యనగల గుర్తింపు భాగము గుణచక్రములో మధ్యన గల ఆత్మ నివాస స్థానమని తెలియాలి. దానికి చుట్టుగల రెండవ భాగమును సాత్త్విక భాగమనియు, దాని చుట్టు గల మూడవ భాగమును రాజసభాగమనియు, అట్లే చివరి నాల్గవ భాగమును తామస భాగమనియు తెలియాలి. ఈ విధముగ



**నెమలి పింఛము**

నెమలి పింఛముతో గుణచక్రముకు సమాన పోలికలున్నవి. శ్రీకృష్ణుడు నేను పనులు చేయుచున్నాను, నాకు ఏ గుణకర్మ అంటదు. నేను మూడు గుణముల మధ్య కర్మ అంటని ఆత్మగ ఉన్నానని తెలుపు నిమిత్తమే మూడు రంగుల మధ్యలో గుర్తింపుగ కనిపించు ప్రత్యేక రంగున్న పింఛమును ధరించాడు.

మన శరీరములో బ్రహ్మనాడి తలనుండి గుదస్థానమువరకు వెన్నెముక మధ్యలో వ్యాపించి ఉన్నది. ఈ నాడియందే ఆత్మ నివాసముంటు, తన శక్తిని వెన్నెముకకు ఇరువైపుల బ్రహ్మనాడి నుండి చీలిపోయిన చిన్న నరముల ద్వార శరీరమంత వ్యాపింప చేసి, అన్ని అవయవములను కదులునట్లు చేయుచున్నది. పైన శిరస్సులోని గుణచక్రము నుండి ఆదేశములు బ్రహ్మనాడి నరముల ద్వార చివరకు అవయవములకు చేరుచున్నవి. అవయవముల నుంచి వచ్చు విషయములు కూడ బ్రహ్మనాడినుంచే పైకి చేరుచున్నవి. బ్రహ్మనాడి యొక్క చిన్న నరముల అమరిక నెమలిపింఛమును గమనిస్తే అర్థమగును. పింఛము యొక్క కాడ లావుగ తెల్లగ మొదలై పొడవుగ ఉండును. ఆ కాడను బ్రహ్మనాడిగ అర్థము చేసుకోవలెను. పింఛము యొక్క కాడ పొడవునా చిన్న చిన్న ఈక వెంట్రుకలు రెండువైపుల వ్యాపించి ఉండును. వాటిని బ్రహ్మనాడి నుంచి బయల్పడిన చిన్న చిన్న నాడులుగ

గుర్తుంచుకోవలెను. పింఛము పైన కనిపించు నాల్గు భాగములను గుణచక్ర భాగములుగ లెక్కించుకోవలెను.

తలలోని గుణచక్రమును మరియు బ్రహ్మనాడిని పోలు పింఛము శ్రీకృష్ణుడు ధరించడములో విశేషములు 1) సర్వ జీవరాసుల శరీరములో ఈ విధ అమరిక ఉన్నదను జ్ఞానము తెలుపు నిమిత్తము పింఛము ధరించాడు. 2) సర్వ జీవులకు ఆత్మ సాక్షిగ ఉన్నదను సూచన నిమిత్తము పింఛము ధరించాడు. 3) ఆత్మ మూడు గుణములకు మధ్యన ఉండి, ఏ గుణములకు సంబంధములేదని తెలుపు నిమిత్తము పింఛము ధరించాడు. 4) ఏ పనులు చేయుచున్నను వాటికర్మ మధ్యన గల నాకంటదని తెలుపు నిమిత్తము పింఛము ధరించాడు. 5) సర్వ జీవరాసుల శిరస్సులలోనే ఆత్మ మరియు గుణములున్నాయను తెలుపు నిమిత్తము తల మీదనే పింఛము ధరించాడు. 6) చివరి అంచు రంగు లేతదై, రెండవది దానికంటే ఎక్కువ కనిపించునదై, మూడవది రెండవ దానికంటే మరీ ఎక్కువ కనిపించునదై, నాల్గవది అన్నిటికంటే మిన్నగ కనిపించునదై ఉన్నది. అటువంటి పింఛము ధరించడములో ఏ జీవరాసియైన చివరకు ఇక్కడకు రావలసిందేనని అర్థము తెలియవలెను. 7) రెండవ అధ్యాయమైన కర్మయోగము 28వ శ్లోకమున **'తత్త్వ విత్తు మహాబాహో గుణకర్మ విభాగయోః గుణాగుణేషు వర్తన్త ఇతి మత్వాన సజ్జతే'** గుణకర్మ విభాగములు తెలిసినవాడు ఆత్మను తెలిసినవాడగును. అటువంటి వాడు గుణముల వలన జరిగెడి పనులు ఎన్ని చేయుచున్నను, చేయని వాడేనని తెలుపు నిమిత్తము శ్రీకృష్ణుడు పింఛము ధరించాడు.

ఇపుడు అసలు విషయానికొస్తాము. భగవంతుడు పై శ్లోకములో చెప్పిన నాలుగువర్ణములు గుణచక్రములోని నాలుగు భాగములేయని తెలియాలి. వాటి ప్రకారము బయట మొదటి భాగములో ఉన్నవారు తామసులు, రెండవ భాగములో ఉన్నవారు రాజసులు, మూడవ భాగములో ఉన్నవారు సాత్త్వికులు, నాల్గవ భాగములో ఉన్నవారు యోగులు. యోగమాచరించు వారు గుణరహితులై ఆత్మను పొందినవారు కనుక వారిని యోగులనుట జరిగినది. ఈ లెక్క ప్రకారము

సర్వజీవరాసులలోను నాల్గు వర్ణములు కలవని అవియే తామసులు, రాజసులు, సాత్త్వికులు, యోగులని పిలువబడుచున్నవని తెలియుచున్నది. ఈ నాల్గు వర్ణములతో పరమాత్మ సంబంధములేనివాడై ఉన్నాడు. కనుక వాటికి కర్తనై కాకుండనున్నానన్నాడు. ఇపుడు దైవ నిర్మితమైన నాల్గువర్ణములు సర్వ జీవరాసులకు సంక్రమించిన నాల్గువర్ణములని తెలిసిందా!

(3) శ్లో॥ 14 : నమాం కర్మాణి లింపన్తి నమే కర్మఫలే స్పృహా ।
ఇతి మాం యోఽభిజానాతి కర్మభిర్న స బధ్యతే ॥
(కర్మయోగము, సాకారము)

**భావము :** నాకు కర్మములంటవు. నాకు వాని ఫలములందు ధ్యాసలేదు. నేనిట్టివాడనని ఎవడెరుగునో, వానికి కర్మబంధనములు కలుగవు.

**వివరము :** ఇంతవరకు నెమలి పింఛము ధరించడములో ఏ అర్థమున్నదో దాని ప్రకారము నాకు కర్మలంటవు అన్నాడు. ఆయన ఏ విధముగ కర్మలు నన్నంటవన్నాడో తెలియగలిగితే, వాడు కూడ అదే విధానము అనుసరించి, కర్మలనంటకుండ చేసుకొనును.

(3) శ్లో॥ 15 : ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వైరపి ముముక్షుభిః ।
కురు కర్మైవ తస్మాత్త్వం పూర్వైః పూర్వతరం కృతమ్ ॥
(కర్మయోగము)

**భావము :** ఏ విధముగ కర్మ అంటదో తెలిసిన మోక్షకాములు ఆ విధముగనే ఆచరించిరి. వారు ఆచరించినట్లే నీవు ఆచరించుము.

(3) శ్లో 16 : కిం కర్మ కి మకర్మేతి కవయోఽప్యత్ర మోహితాః ।
తత్తే కర్మ ప్రవక్ష్యామి యద్జ్ఞాత్వా మోక్షసేఽశుభాత్ ॥
(కర్మయోగము)

**భావము :** ఏది కర్మయో, ఏది కర్మకాదో అనుభవమున్న జ్ఞానులు కూడ తెలియక

భ్రమపడుచున్నారు. అందరికి అర్థము కాని కర్మ రహస్యమును నీకు చెప్పెదను. దాని వలన మోక్షమును పొందగలవు.

**వివరము :** నేడు నిత్య జీవితములో అనేక సమస్యలతో చిక్కుకొని తప్పనిసరిగ పనులు చేయువారికి ఏ విధముగ కర్మ అంటుతున్నదో, ఏ విధముగ కర్మ అంటకుండ పోవునో, పెద్ద జ్ఞానులమనుకొన్నవారికి కూడ అర్థము కాలేదు. అందువలననే వారు మంచి పనులు చేయండి, చెడు పనులు చేయద్దండని చెప్పుచున్నారు. ఆ లెక్క ప్రకారము పోతే అర్జునుడు కూడ యుద్ధము చేయకూడదు. యుద్ధము హింసతో కూడుకున్న పని కనుక పాపమొచ్చునని అంగీకరించక తప్పదు. మరి యుద్ధము చేయమని చెప్పు శ్రీకృష్ణుడు చెడు పనిని ఎందుకు చేయమంటున్నాడు. జ్ఞానులమనుకొన్న వారికంటే ఎక్కువ ఏదో తెలుసును కనుక యుద్ధము చేయమన్నాడు. ఈ విషయము శ్రీకృష్ణుడు కూడ చెప్పుచు 'ఎందరో జ్ఞానులకు కూడ ఈ విషయము తెలియక భ్రమపడుతున్నారు. ఏది కర్మనో, ఏది కర్మకాదో చెప్పెద వినుము' అన్నాడు.

3) శ్లో॥ 17 : కర్మణో హ్యాపి బోద్ధవ్యం బోద్ధవ్యం చ వికర్మణః ।
అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః ॥
(ప్రకృతి, కర్మయోగము, బ్రహ్మయోగము)

**భావము :** కర్మను తెలుసుకోవాలి. అట్లే వికర్మను తెలుసుకోవాలి మరియు అకర్మను తెలుసుకోవాలి. ఈ కర్మ గతులు తెలుసుకోవడము చాలా కష్టము.

**వివరము :** కర్మ, అకర్మ, వికర్మ అన్నీ గందరగోళము. అందుకే *'గహనా కర్మణో గతిః* అని ఈ శ్లోకములో అన్నాడు. ఈ కర్మ గతులు తెలియడము చాలా గహనముగ ఉండును. అందువలననే ఇంతవరకు ఈ శ్లోకమునకు వివరము వ్రాసుకొన్నవారు కూడ తికమకమై పోయి శాస్త్రబద్ధమైన కర్మ అని, శాస్త్రబద్ధము కాని కర్మ అని రకరకములుగ వ్రాసుకొన్నారు. ఎందరో గీతను వ్రాసినవారు ఏ అధ్యాయములోను వివరము వ్రాయుటలో ఇంత ఇబ్బందిపడివుండరు. కాని ఇక్కడ ఈ శ్లోకములో

కర్మ, అకర్మ, వికర్మ అను మాటలకు వివరము వ్రాయడములో నానా తంటాలు పడినారు. చివరకు కుప్పించి ఎగిరి దాటి పోయారు. కర్మలు నానా రకములుగ ఉన్నాయి. ఆ కర్మలు ఎవరి ఆధీనములో లేక వాటి ధర్మమును అవి నెరవేర్చుచు, నీకు ఇష్టమున్నా ఇష్టము లేకపోయినా బలవంతముగ నియమించి చేయించు చున్నాయి. ఇది చేయకూడని పని, ఇది చేయవలసిన పని, ఇది శాస్త్రబద్ధమైన పని, ఇది శాస్త్రబద్ధముకాని పని అనడము ఇక్కడ అనర్థమగును. మన ఇష్టాయిష్టములు కార్యముల ఎడల సంబంధములేదని శ్రీకృష్ణుడు పదేపదే చెప్పుచునే ఉన్నాడు. ఆయన మాటనుకాదని వివరము వ్రాసుకోవడము మంచిది కాదు. ఈ విషయములో పండితులు కూడ తెలియక భ్రమపడుదురని ఆయన ముందే చెప్పాడు. అందువలన మనమెక్కడైన ఈ విషయములో పొరపాటుపడినామేమో పునరాలోచన చేయమని అందరికి మనవి చేయుచున్నాము. మన కథ వదలివేసి ఆయనేమి చెప్పాడో చూస్తాము.

పై శ్లోకములో మూడు విధానములున్నాయి. 1) కర్మ 2) వికర్మ 3) అకర్మ. ఈ మూడు కర్మలలో మొదటిదైన కర్మ అనుపదమును గురించి తెలుసుకొందాము. సాధారణ మనిషి చేయు పనులను కార్యములు అంటున్నాము. ఈ కార్యములు వెనుకటి కర్మవలన జరుగుచున్నవి. జరుగుచున్న కార్యములు జీవుడే చేయుచున్నాడని అహము జీవున్ని భ్రమింప చేయుచున్నది. అహము యొక్క భ్రమలో పడిన జీవాత్మ తానే చేశాననుకొంటున్నాడు. వాస్తవానికి జీవాత్మకు శరీరము ద్వారా జరిగెడి పనులకు ఏమాత్రము సంబంధములేదు. అయినప్పటికి అహము యొక్క మహిమచేత పొరపడినవాడై జీవుడు కార్యములకు కర్తను తానే అనుకొనుచున్నాడు. అట్లనుకొనుట వలన శరీరము ద్వారా జరుగబడు కార్యములకు పాపము లేక పుణ్యమను క్రొత్తకర్మ జీవునికి చేరుచున్నది. అగ్నిశిఖలకు వేడిమి సహజమైనట్లు ప్రతి పనికి కర్మ సహజమే. జీవుడు అహము పొందినపుడు కర్మ వానిని అంటుకొనును. అహము పొందనపుడు కర్మ నశించిపోయి వానికి అంటదు. జ్ఞానము తెలిసి కర్మయోగమాచరించు వారికి కర్మ అంటని విధానముండును.

సాధారణముగ ప్రకృతి మాయలో ఉండి జ్ఞానము తెలియని మనిషి, నిత్యము కర్మ ఆడించినట్లు కార్యములు చేయుచు, అహము చేత తిరిగి క్రొత్త కర్మను పొందుచున్నాడు. పనులు చేయుచు కర్మను సంపాదించుకొనుటను పై శ్లోకమున **'కర్మ'** అని అన్నారు. ఈ విధముగ మనిషికి కర్మ అంటుచున్నదని తెలియడమునే **'కర్మణోహ్యపి బోద్ధవ్యం'** కర్మను తెలుసుకోవలెను అన్నాడు. అంతేకాక **'బోద్ధవ్యంచ వికర్మణః'** వికర్మను తెలుసుకోవలెను అన్నాడు. వికర్మ అంటే ఏమిటో చూద్దాము. సహజముగ కర్మచేత ప్రేరేపించబడి జరుగు కార్యములను బ్రహ్మయోగము ద్వార స్థంభింపచేసి నిలిపివేయు అవకాశముగలదు. ప్రారబ్ధకర్మను జరగకుండ నిలిపివేయు శక్తి ఒక్క బ్రహ్మయోగము (జ్ఞానయోగము)నకే గలదు. తలలోని ప్రారబ్ధకర్మ గుణములు, బుద్ధిద్వార బయలుదేరి, మనస్సు ద్వార బయటి ఇంద్రియములకు ప్రాకి, బయటి అవయవముల ద్వార పని చేయించుచుండును. బ్రహ్మయోగ సాధకులు ప్రయత్నము చేత శరీరములో బాహ్య అంతర భాగములకు మధ్యనవున్న మనస్సును పనిచేయకుండ చేయుట వలన ప్రారబ్ధకర్మ ఆచరణ పూర్తిగ నిలిచిపోవుచున్నది. ఇట్లు బ్రహ్మయోగము ద్వార ప్రారబ్ధకర్మను దాని పనులను జరుగకుండ చేయడమును **'వికర్మ'** అంటాము. *వికర్మ అనగ కర్మ జరగడము కాని కర్మ రావడము కాని లేదని అర్థము.*

మూడవదైన అకర్మ అనగా! ప్రారబ్ధము ప్రకారము పనులు జరుగుచున్నను, శరీరములోని అహము పనిచేయని దానివలన, కర్మ అంటక పోవడమును **'అకర్మ'** అంటున్నాము. అకర్మ కర్మయోగులకే సాధ్యమగును. కర్మయోగమున అహము పనిచేయదు. అందువలన ఆ విధానములో పనులు చేసినప్పటికి కర్మ అంటదు.

1) ప్రారబ్ధకర్మ చేత పనులు జరుగుచు క్రొత్తకర్మ రావడమును 'కర్మ' అంటాము. ఇది అజ్ఞానుల ఎడల జరుగును. పాతకర్మ ఆచరణకు వచ్చి క్రొత్తకర్మ అంటుకోవడమును కర్మ అంటున్నాము.

2) ప్రారబ్ధకర్మ ఆచరణవుండదు, క్రొత్తకర్మరాదు, అన్ని స్థంభించి కర్మలన్ని నిలిచి పోవడమును 'వికర్మ' అంటాము. ఇది బ్రహ్మయోగులకు మాత్రమే జరుగును. శరీరములోని మనస్సు నిలిచిపోవడము వలన వికర్మలో మనిషికి బయటి జ్ఞప్తియే ఉండదు.

3) ప్రారబ్ధకర్మ ఆచరణ ప్రకారము పనులు జరుగుచున్నప్పటికి, క్రొత్త కర్మ రాకుండ పోవడమును 'అకర్మ' అంటాము. ఇది కర్మయోగులకే సాధ్యపడును. ఈ యోగములో శరీరములోని అహము నిలిచిపోవుచున్నది. అకర్మలో సాధారణ అజ్ఞానికి జరిగినట్లు పనులు జరుగుచుండును. అయినప్పటికి నూనెకు నీరంటనట్లు వానికి కర్మ అంటక పోవుచున్నది.

*(3) శ్లో॥ 18 : కర్మణ్య కర్మయః పశ్యే దకర్మణిచ కర్మయః ।*
*సబుద్ధి మాన్మను ష్యేషు సయుక్తః కృత్స్న కర్మకృత్ ॥*
*(కర్మయోగము)*

**భావము :** కర్మలను రాకుండ నిగ్రహించుట అకర్మ అనియు, కర్మములయందే అకర్మ కలదని తెలిసి, ఎవడు అన్ని కర్మలాచరించుచున్నాడో, వాడే జ్ఞానియని తెలిసిన పెద్దలందురు.

**వివరము :** సమస్త కార్యములు చేయుచున్నను, క్రొత్తకర్మ రాకుండ చేసుకొను విధానము అకర్మ అని, పనులు చేయుచు ఏ విధానమును అనుసరిస్తే పాప పుణ్యములురావో బాగా తెలిసి, మంచిచెడు కార్యములనుకోక సమయానుసారము ఏ కర్మ ఆచరణకొస్తే ఆ పనులు చేయువాడు సంపూర్ణ జ్ఞాని అనియు, సంపూర్ణ కర్మయోగి అనియు చెప్పవచ్చును. ఇక్కడ కొందరికొక సంశయమొచ్చి "మంచిపనులు చేసినవానిని జ్ఞాని, యోగి అనవచ్చును. చెడుపనులను చేయువానిని జ్ఞాని అనిగాని, యోగి అనిగాని అనుట బాగుండునా? ఈ మాట ఏ గీతలోను వ్రాయలేదే. ఎక్కడ వ్రాయనిది ఇక్కడ నిజమగునా" అని అడుగవచ్చును. భగవంతుడు మాత్రము ఈ విషయమును ఇంతకుముందు, ఇపుడు, తర్వాత వచ్చు అధ్యాయములలోను

చాలామార్లు చెప్పాడు. అలా కార్య భేదము పెట్టుకొనువాడు యోగియేకాదని కూడ చెప్పాడు.

*(3)శ్లో॥ 19 : యస్య సర్వే సమారమ్భాః కామ సంకల్ప వర్జితాః ।*
*జ్ఞానాగ్ని దగ్ధకర్మాణం త మాహుః పండితం బుధాః ॥*
*(కర్మయోగము)*

**భావము :** ఎవడైతే ఆశ అను గుణము లేకుండ సర్వ (మంచిచెడు) కార్యములు చేయునో, ఎవడైతే జ్ఞానాగ్నిచేత కర్మను కాల్చునో, వానిని బుధులు జ్ఞానపండితుడని అందురు.

**వివరము :** "సర్వే సమారంభా" అని ఈ శ్లోకములో కూడ అన్నారు. సర్వే అనుటలో అన్ని అని అర్థము. మంచివి కావచ్చు, చెడువి కావచ్చని అర్థము. సర్వకార్యములు కోర్కెలేకుండ చేయువానిని పండితుడని చెప్పవచ్చునన్నాడు. ఇక్కడ ఒక సంశయము కొందరికి రావచ్చును. అదేమనగా! 'ఆశ ఉన్నప్పుడే కదా! పని చేసేది ఆశలేనపుడు ఎవడు ఏ పని చేయడు కదా!' అని అడుగవచ్చును. నిజమే అందరు ఆశ ఉన్నపుడే చేస్తున్నారు, అట్లు చేయువాడు జ్ఞానికాడు. ఆశతో చేయువానికి కర్మరహస్యము తెలియదు. ఆశ వలననే కార్యమనుకొనుచున్నాడు. నిజమైన జ్ఞానము తెలిసినవాడు కర్మవలనే కార్యమనుకొనుచున్నాడు. ఆశ వెనుకల ఉన్న కర్మను కూడ జ్ఞప్తిలో పెట్టుకొని చేయుచుండుట వలన వానిని 'కర్మయోగి' అంటున్నారు.

'జ్ఞానాగ్ని దగ్ధ కర్మాణాం' జ్ఞానాగ్నిచేత కర్మ కాలినవాడు అని అర్థము. ఇక్కడ జ్ఞానాగ్ని అనుమాట క్రొత్తగ వచ్చినది. జ్ఞానాగ్ని యోగమాచరించు వారియందే ప్రజ్వరిల్లును. యోగులు జ్ఞానాగ్ని కలవారైయుందురు. వారియందు జ్ఞానాగ్ని కర్మలను కాల్చునదై ఉన్నది. జ్ఞానాగ్ని యోగియందెట్లున్నది? అది అతనికెట్లు లభించుచున్నది? అను ప్రశ్నలు కొందరికిరావచ్చును. సంశయములు లేకుండ పోవాలంటే జ్ఞానాగ్ని విషయము కొంతైన ఇక్కడ తెలుసుకోవాలి. మామూలు అగ్నిచే వంటలు చేయుచున్నాము. మనము వంట ప్రారంభింపక ముందు పొయ్యిలో

అగ్ని లేదు. వంట ప్రారంభించిన తర్వాత పొయ్యిలో అగ్నిని రగుల్చుతాము. మొదట లేని అగ్నిని అగ్గిపుల్లనుండియో లేక చెకుముఖి రాయివల్లనో అగ్నిని పుట్టించు చున్నాము. మనము బయట తయారు చేయు అగ్ని కంటికి కనిపించును. తాకితే చేయికూడ కాలును. అగ్ని ఏ వస్తువునైన కాల్చివేయును. గంధపు చెక్కైన, తుమ్మచెక్కైన అగ్నికి సమానమే. అట్లే ప్రాణములేని వస్తువునుకాని, ప్రాణమున్న మనిషినికాని రెండిటిని కాల్చివేయు స్థోమత కలది అగ్ని. ఈ అగ్నిని గురించి తెలియని వారుండరు. మరొకటి మనకు తెలియని అగ్ని కూడ ఉన్నది. అది బయటి వస్తువులను కాల్చలేని అగ్ని. మన శరీరమును కొద్దిగ కూడ కాల్చలేనిది, కేవలము కర్మలను మాత్రము కాల్చునది. కంటికి కనిపించని ఆ అగ్నియొక్క పేరు **జ్ఞానాగ్ని.** జ్ఞానాగ్నికి సాధారణ అగ్నికి చాలా తేడాలున్నాయి. ఆ తేడాలు వరుసగ క్రింద పట్టికలో చూస్తాము.

| అగ్ని | జ్ఞానాగ్ని |
| --- | --- |
| 1) కంటికి కనిపించునది. | (1) కంటికి కనిపించదు. |
| 2) కట్టెలను కాల్చును, కర్మలను కాల్చలేదు. | (2) కర్మలను కాల్చును, కట్టెలను కాల్చలేదు. |
| 3) స్థూల శరీరమునకు వేడి కలుగజేయును. | (3) సూక్ష్మ శరీరమునకు వేడి కలుగజేయును. |
| 4) మంచి, చెడు వస్తువుల భేదము లేకుండ కాల్చును. | (4) పాప, పుణ్య కర్మ భేదము లేకుండ కాల్చును. |
| 5) ప్రకృతి సంబంధమైనది. | (5) పరమాత్మ సంబంధమైనది. |
| 6) స్థూలమునకు కనిపించును. | (6) సూక్ష్మమునకు కనిపించును. |

| | |
|---|---|
| 7) అజ్ఞానులైన వెలిగించగలరు. | (7) యోగులకు మాత్రము వెలుగును. |
| 8) శరీరము బయట నిలువవుండును. | (8) శరీరము లోపల నిలువవుండును. |
| 9) నీటికి ఆరిపోవును. గాలికి మండును. | (9) నీటికి ఆరిపోదు, గాలికి మండదు. |
| 10) ఇతరుల యొక్క వస్తువులను వేటినైన కాల్చును. | (10) ఇతరుల ప్రారబ్ధమును మాత్రము కాల్చును. |
| 11) తన శరీరములోని ఏ భాగమునైన కాల్చును. | (11) తన శరీరములో ఆగామికకర్మను సంచితకర్మను కాల్చును. |
| 12) ఎక్కడైన ఎప్పుడైన తయారు చేయవచ్చును. | (12) యోగము చేయు సమయములోనే తయారగును. కర్మయోగులకు శరీరములోపల నుంచి, బ్రహ్మయోగులకు శరీరము బయటి నుండి చేరును. |

జ్ఞానాగ్ని అను మాట విషయము అర్థమగుటకు చెప్పిన ఉపమానము గాని, వాస్తవానికి జ్ఞానాగ్నిలేదని చాలామంది చెప్పుచున్నారు. ఎవరు ఏమి చెప్పినప్పటికి, గీతలో దీనిని ప్రత్యేకించి వ్రాయనప్పటికి, సత్యము కొంతకాలము కనిపించక పోయినప్పటికి, దానికి నాశనము లేదు. ఏనాటికైన అది బయట పడగలదు. అట్లే భగవద్గీతలోని సత్యములను ఎవరు గుర్తించనంత మాత్రమున అవి మాసిపోవు. మానవాళికి తెలియాలను భగవంతుని ఉద్దేశ్యము వృథాకాదు. నూరు మంది గుర్తించలేకపోయిన చివరకు ఒకడైన గుర్తించును. అట్లు చివరకు ఒకడు కూడ గుర్తించకపోతే, ఆయన తన (పరమాత్మ) మళ్లీ జన్మలోనైన దానిని గూర్చి తెలియజేయును. ఇక్కడ జ్ఞానాగ్ని విషయము కూడ అలాంటిదే.

జ్ఞానాగ్ని ఉపమానము కాదు. అగ్నిని జ్ఞానాగ్నికి ఉపమానముగ చెప్పడమైనది. అగ్నిలో కట్టెలు కాలునట్లు, జ్ఞానాగ్నిలో సర్వ కర్మలు కాలిపోవునని భగవంతుడు ఇదే భగవద్గీతలో మరొకచోట కూడ చెప్పాడు. దీనిని బట్టి జ్ఞానాగ్ని ఉన్నదేనని, దానికి ఉపమానముగ బయట అగ్నిని చెప్పడమైనదని తెలియుచున్నది. అంతేకాక జ్ఞానాగ్ని కర్మయోగులలో ఒక విధముగ, బ్రహ్మయోగులలో ఒక విధముగ పనిచేయుచు తన ఉనికిని చాటుకొనుచున్నది. జ్ఞానాగ్ని యోగుల శరీరములో ప్రత్యేకమైన పనులు చేయుచు, అది అజ్ఞానుల మీద యోగుల ద్వార ప్రసరించి ప్రత్యక్ష ప్రమాణములు చూపుచున్నది. అది ఉన్నదనుటకు అంతకంటే నిదర్శనములు వేరే అవసరము లేదనుకుంటాము. జ్ఞానాగ్ని విషయము తెలియకపోతే జ్ఞానదృష్టికి మసక చీకటి ఉన్నట్లే. అందువలన జ్ఞాననేత్రము యొక్క చూపు సరిగా ఉండాలంటే ఇక్కడ జ్ఞానాగ్నిని గూర్చి విపులముగ తెలుసుకొందాము. వెనుక పట్టికలో చెప్పబడిన వరుస ప్రకారము

1) కంటికి కనిపించునది కాదన్నాము. జ్ఞానాగ్నికి స్థూల ఆకారము లేదు. ఇది మామూలు అగ్నివలె ఎర్రగ ఉండునని కూడ చెప్పలేము. కొందరి దేవతల జ్ఞానుల చిత్రపటములలో వారి తల వెనుక ప్రకాశమున్నట్లు గుర్తించివుండుట కనిపించగలదు. అది వారి జ్ఞానప్రకాశమని, వారి తలలో జ్ఞానాగ్ని ఉన్నదని, తెలిసినవారు పూర్వమునుంచి అట్లు చిత్రించుచున్నారు. ఈ చిత్రములు జ్ఞానాగ్ని తలలో ఉండునని తెలియజేయుచు దాని ఉనికిని సూచిస్తున్నాయి.

2) జ్ఞానాగ్ని అగ్నివలె బయటి వస్తుజాలమును ఏమి చేయలేదు. దాని ప్రభావమంతయు పాప పుణ్యములను కాల్చివేయడమే. కావున జ్ఞానాగ్నికి సమిధలు కర్మలేనని చెప్పవచ్చును.

3) సూక్ష్మశరీరముతో తిరుగు గ్రహాలను జ్ఞానాగ్ని వేడెక్కించును. అందువలన యోగుల సమీపములో దయ్యాలనబడు సూక్ష్మశరీరములు నిలువజాలవు. జ్ఞానాగ్ని వేడికి తట్టుకోలేక వారికి భయపడును. యోగులు చెప్పినట్లు నడుచుకొనును. ఈ

ప్రకారము ఏసుప్రభువు వద్ద ఎన్నో దయ్యములు నమస్కరించి ఆయన మాట ప్రకారము పోయినవని బైబిలులో కలదు.

4) కర్మ అనగ పాపము మరియు పుణ్యము యొక్క కలయిక. జ్ఞానాగ్ని యొక్క సహజత్వము కర్మను కాల్చుట. కర్మలో ఉన్న పుణ్యము మంచిదని, పాపము చెడ్డదను భేదములు దానికి లేవు. తన పద్ధతి ప్రకారము కర్మలోవున్న దేనినైన కాల్చును.

5) జ్ఞానాగ్ని పరమాత్మ సంబంధమైనది. ప్రకృతి సంబంధమైన కర్మలకు వ్యతిరేఖమైనది. అంతేకాక పరమాత్మవలె బయలులో కూడ అణిగివున్నది. బ్రహ్మయోగులకు బయటినుండే వారిలోనికి ప్రవేశిస్తున్నది.

6) జ్ఞానాగ్ని గ్రహాలు విగ్రహాలు అనబడు సూక్ష్మశరీరములకు కనిపించును. జ్ఞానాగ్ని ఏ యోగివద్ద ఎంత ఉన్నది, యోగులలో ఎవరివద్ద ఎక్కువ ఉన్నది వాటికి తెలియును. అందువలననే యోగులకు దయ్యాలు మరియు చిన్న చిన్న దేవతలు సహితము భయపడుదురు. దేవతలు సహితము యోగులకు నమస్కరించుచుందురు. చరిత్రలో మనుష్యులైన యోగుల మాటను గౌరవించి దేవతలు కూడా పనిచేశారని అనేక సందర్భాలలో విన్నాము.

7) జ్ఞానాగ్ని యోగులందుమాత్రము వెలుగును. యోగ సమయములో మాత్రము ప్రజ్వరిల్లు అగ్ని జ్ఞానాగ్ని. అందువలన యోగులు తప్ప ఎవరియందును వెలుగునది కాదు.

8) జ్ఞానాగ్ని బయటి అగ్నివలె నీటికి ఆరిపోవునది కాదు. ఇది ప్రకృతిలోని శక్తులకు లొంగునది కాదు. పంచభూతములకు అతీతమైనది.

9) జ్ఞానాగ్నిని ఇతరుల కర్మమీద యోగి సంకల్పముచేత ప్రసరింపజేయవచ్చును. హస్తము, పాదము, చూపు ద్వార యోగి శరీరము నుండి ఇతర శరీరములో ప్రవేశించిన జ్ఞానాగ్ని ఆ శరీరములో ఉన్న సంచిత, ఆగామి, ప్రారబ్ధమనబడు

కర్మలలో ప్రారబ్ధము మీదకు పోయి దానిని కాల్చివేయును. ఇది జ్ఞానాగ్ని ఉన్నదనుటకు ప్రత్యక్ష ప్రమాణము. ఏసుప్రభువు తన చేతితో తాకి ప్రారబ్ధకర్మ అయిన కుష్ఠురోగమును పోగొట్టెను. అట్లే గ్రుడ్డివాని కళ్లకు చూపు తెప్పించెను. ఇక్కడ ఏసుప్రభువు శరీరము నుంచి బయటికి వచ్చిన జ్ఞానాగ్ని గ్రుడ్డివాని శరీరములో అంధత్వమునకు కారణమైన ప్రారబ్ధమును కాల్చివేయుట వలన వానికి వెంటనే చూపు వచ్చెను. ఇట్లు ఎందరో యోగులు వారి జ్ఞానాగ్నిచేత కొందరి రోగములను అంగలోపములను పోగొట్టినట్లు ఎన్నో ఆధారములున్నవి.

10) యోగుల శరీరము నుండి బయటికి వచ్చి ఎదుటివాని ప్రారబ్ధము మీద దాడిచేసిన జ్ఞానాగ్ని యోగుల శరీరములలో మాత్రము ప్రారబ్ధము మీద పని చేయదు. ఉదాహరణకు ఒక యోగి కడుపునొప్పితో బాధపడుచున్న ఎదుటి వానిని చూచి దయతలచి, తన యొక్క యోగాగ్ని (జ్ఞానాగ్ని) చేత వాని ప్రారబ్ధమును కాల్చివేసి, వానికి కడుపునొప్పి లేకుండ చేసెను. ఆ యోగికి ఉన్న చిన్న చెవి నొప్పిని తప్పని సరిగ అనుభవించుచుండెను. వానికి కడుపు నొప్పి బాగు చేసిన వానివి నీకున్న చెవినొప్పిని బాగుచేసుకోలేవా అని ప్రశ్నించితే, నా శక్తి నామీద పనిచేయదనెను. దీనిని బట్టి యోగి శరీరములోని జ్ఞానాగ్ని అతని ప్రారబ్ధము మీద పని చేయదని తెలియుచున్నది. యోగి శరీరములోని అగ్ని ఏ కర్మ మీద పని చేయుననిన? ఇది బ్రహ్మయోగిలో ఒక విధముగ, కర్మయోగిలో ఒక విధముగ పనిచేయుచున్నది. బ్రహ్మయోగిలోని జ్ఞానాగ్ని అతని సంచితకర్మ మీద పనిచేయును. అట్లే కర్మయోగి శరీరములోని జ్ఞానాగ్ని అతని ఆగామికకర్మ మీద పనిచేయును. ***ప్రారబ్ధమనగ! ప్రస్తుతము అనుభవించునదనియు, ఆగామికకర్మయనగా! చేయుచున్న కార్యములలో క్రొత్తగ వచ్చునదనియు, సంచితకర్మ అనగ ! జన్మజన్మల నుండి మిగులుచు వచ్చిన కూడలియని తెలియాలి.***

11) జ్ఞానాగ్ని అగ్గిపుల్లలోని అగ్నివలె కనిపించక ప్రపంచమంత వ్యాపించి ఉన్నప్పటికి అగ్గిపుల్ల గీచినపుడే మండినట్లు, జ్ఞానాగ్ని యోగులు యోగము

చేయునపుడే ప్రజ్వరిల్లును. బ్రహ్మయోగమాచరించు వానికి బయటవున్న జ్ఞానాగ్ని కణములు యోగదండము ఉపయోగించిన ప్రక్కగాక, దానికి వ్యతిరిక్త దిశలోని బ్రహ్మనాడిలో చేరి, దాని ద్వార శిరోభాగమున చేరి ప్రజ్వరిల్లుచుండును. ఈ విషయము ఐదవ అధ్యాయము ఆత్మసంయమ యోగములో బ్రహ్మయోగమును గురించి చెప్పిన చోట వివరముగ చెప్పబడినది. కర్మయోగము ఆచరించువానికి తలలోనే ప్రజ్వరిల్లును. కర్మయోగులకు బ్రహ్మయోగులవలె చర్మాసనము, యోగదండము, పద్మాసనము యొక్క ఆవశ్యకత ఉండదు. బ్రహ్మయోగులకు బయటినుండి లభించు జ్ఞానాగ్ని బ్రహ్మనాడిని చేరి, భూమి ఆకర్షణచేత కొంత క్రింది భాగములో నుండి బయటికి పోవు అవకాశముండుట వలన, జ్ఞానాగ్ని అలా కొంచెము కూడ నష్టము కాకుండునట్లు దర్భలు, చర్మములు ఆసనముగ సమకూర్చుకోవలెనని పెద్దలు చెప్పారు. ఇవన్నియు జ్ఞానాగ్ని ఉన్నదని చెప్పుటకు తార్కాణములు.

(3) శ్లో॥ 20 : త్యక్త్వా కర్మ ఫలా సంగమ్ నిత్యతృప్తో నిరాశ్రయః ।
కర్మణ్యభి ప్రవృత్తోఽపి నైవ కించిత్కరోతి సః ॥
(కర్మయోగము)

(3) శ్లో॥ 21 : నిరాశీర్యత చిత్తాత్మా త్యక్త సర్వ పరిగ్రహః ।
శారీరం కేవలం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్ ॥
(కర్మయోగము)

(3) శ్లో॥ 22 : యదృచ్ఛా లాభ సంతుష్టో ద్వంద్వాతీతో విమత్సరః ।
సమస్సిద్ధావ సిద్ధౌ చ కృత్వాపి న నిబద్ధ్యతే ॥
(కర్మయోగము)

**భావము :** కర్మఫలము ఎడల ధ్యాసలేక, నిత్యతృప్తుడవై ఆశను నిగ్రహించుకొని సర్వ కార్యములను సదా చేయువాడు చేయని వానితో సమానము.

ఆశ విడిచి, నియమిత చిత్తుడై, దేని మీద శ్రద్ధలేక కేవలము శరీర సంబంధముగ పనులు చేయవలెను. అట్లు చేయువానికి కర్మలంటవు.

దొరికినట్టి లాభముతో తృప్తిపొంది, ద్వంద్వములు వీడి, మత్సరము లేని వాడై లాభనష్టములను సమానముగ ఎవడు చూచునో వానికి కర్మబంధములు కలుగవు.

**వివరము :** ఇక్కడ మూడు శ్లోకములకు ఒకేమారు వివరమివ్వడము జరుగుచున్నది. ఈ మూడు శ్లోకములు ఒకే కర్మయోగమును గూర్చి చెప్పినవి. ఈ మూడుకంటే ముందు చెప్పిన 19వ శ్లోకము వీటి తర్వాత ఉండు 23వ శ్లోకము కూడ కర్మయోగమునకు సంబంధించినవే. దైవమును తెలుసుకొనుటకు మోక్షమును పొందుటకు రెండే మార్గములున్నవి. అవియే కర్మయోగము, బ్రహ్మయోగము. ఇవి బాగా అర్థము కావాలని మార్చి మార్చి అనేక శ్లోకాలరూపములుగ చెప్పారు. కర్మయోగమును గూర్చి సాంఖ్య, కర్మ, జ్ఞానయోగములను అధ్యాయములలో, బ్రహ్మయోగమును గూర్చి కర్మ సన్యాస, ఆత్మ సంయమయోగములను అధ్యాయముల లోను ఎక్కువగ చెప్పారు. అంతేకాక మిగతా అధ్యాయములలో అక్కడక్కడ కూడ చెప్పారు. ఇపుడు కర్మయోగమునకు సంబంధించి మూడు శ్లోకములకు ఒకే భావ వివరము చెప్పుచున్నాము.

*(3)శ్లో॥ 23 : గత సంగస్య ముక్తస్య జ్ఞానావస్థిత చేతసః।*
*యజ్ఞా యాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే ॥*
*(కర్మయోగము)*

**భావము :** సంగము లేనివాడై, ఫలాసక్తి లేక దైవమును చేరవలెనను కోర్కెగలవాడై, కర్మయజ్ఞము చేయువానికి వాని కర్మ అంతయు కాలి నాశనమగును.

**వివరము :** ఈ శ్లోకములో **'యజ్ఞాయాచరతః కర్మ'** అను వాక్యము ముఖ్యము. ఇదే అర్థమునిచ్చు **'యజ్ఞార్థాత్కర్మణోన్యత్ర'** అని కర్మయోగము 9వ శ్లోకములో చెప్పినపుడు

బాహ్యయజ్ఞములు చేయమని కల్పితమైన ఏడు శ్లోకములు అక్కడ చేర్చారు. వాటిని గుర్తించి అవి అశాస్త్రీయమైనవని మనము తీసివేయడము జరిగినది. అదేవిధముగ ఇక్కడ కూడ యజ్ఞమను మాట వినిపిస్తూనే 9 కల్పిత శ్లోకాలను చొప్పించారు. అనేక రకముల యజ్ఞాలున్నాయని చెప్పిన 9 శ్లోకముల భావములు, రెండే యజ్ఞములు ఉన్నాయని చెప్పిన భగవంతుని మాటకు విరుద్ధముగా ఉన్నాయి. 23వ శ్లోకములో **'యజ్ఞాయాచరతః కర్మ'** యజ్ఞకర్మ చేయుము అన్న భగవంతుడు ప్రక్క శ్లోకములోనే యజ్ఞములు రెండు రకములు 1) ద్రవ్యయజ్ఞము 2) జ్ఞానయజ్ఞము అని, వాటిలో ద్రవ్యయజ్ఞముకంటే జ్ఞానయజ్ఞమే శ్రేష్టమైనదని కూడ చెప్పుచు **'శ్రేయాన్ ద్రవ్యమయా ద్యజ్ఞాత్ జ్ఞాన యజ్ఞః'** అన్నాడు. 24వ శ్లోకముగ ఉండవలసిన దానిని 33వ శ్లోకముగ చేసి మధ్యలో 9 కల్పిత శ్లోకములు ఇరికించారు. వివిధరకాల యజ్ఞాలను తెలుపు 9 శ్లోకాలు 23వ శ్లోకమునకు వ్యతిరేకమైనవిగ ఉన్నవి. అందువలన వాటిని తీసివేయడమైనది. ఇంతవరకు మూడు అధ్యాయములలోను కల్పిత శ్లోకాలున్నట్లు కనుగొన్నాము. మూడు అధ్యాయములలోను వరుసగ 7+7+9 మొత్తము 23 శ్లోకములున్నవి. ఈ అధ్యాయములో 23వ శ్లోకము తర్వాత అనుబంధ శ్లోకము 33వదని గ్రహించాలి.

**3) శ్లో॥ 24 :** **బ్రహ్మార్పణం బ్రహ్మహవిర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్ ।**
**బ్రహ్మైవ తేన గంతవ్యం బ్రహ్మకర్మసమాధినా ॥**

**(కల్పితము)**

**3) శ్లో॥ 25 :** **దైవమేవాపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే ।**
**బ్రహ్మాగ్నావపరే యజ్ఞం యజ్ఞేనైవోపజుహ్వతి ॥**

**(కల్పితము)**

**3) శ్లో॥ 26 :** **శ్రోత్రాదీనీంద్రియాణ్యన్యే సంయమాగ్నిషు జుహ్వతి ।**
**శబ్దాదీన్విషయానన్య ఇంద్రియాగ్నిషు జుహ్వతి ॥**

**(కల్పితము)**

**3) శ్లో॥ 27 :** సర్వాణీంద్రియకర్మాణి ప్రాణకర్మాణి చాపరే ।
ఆత్మసంయమయోగాగ్నౌ జుహ్వతి జ్ఞానదీపితే ॥

**(కల్పితము)**

**3) శ్లో॥ 28 :** ద్రవ్యయజ్ఞాస్తపోయజ్ఞా యోగ యజ్ఞాస్తథా పరే ।
స్వాధ్యాయజ్ఞానయజ్ఞాశ్చ యతయస్సంశిత వ్రతా ॥

**(కల్పితము)**

**3) శ్లో॥ 29 :** అపానే జూహ్వతి ప్రాణం ప్రాణే పానం తథా పరే ।
ప్రాణాపానగతీ రుధ్వా ప్రాణాయామపరాయణాః ॥

**(కల్పితము)**

**3) శ్లో॥ 30 :** అపరే నియతాహారాః ప్రాణాన్ప్రాణేష్వ జూహ్వతి ।
సర్వ ప్యేతే యజ్ఞ విదూ యజ్ఞ క్ష పితకల్మషాః ॥

**(కల్పితము)**

**3) శ్లో॥ 31 :** యజ్ఞశిష్టామృతభుజో యాన్తి బ్రహ్మసనాతనం ।
నాయం లోకో ఽస్త్యయజ్ఞస్య కుతో ఽన్యః కురుసత్తమ! ॥

**(కల్పితము)**

**3) శ్లో॥ 32 :** ఏం బహువిధా యజ్ఞా వితతా బ్రహ్మణో ముఖే ।
కర్మజాన్విద్ధి తాన్ సర్వానేవం జ్ఞాత్వా విమోక్ష్యసే ॥

**(కల్పితము)**

*3) **శ్లో**॥ 33 : శ్రేయాన్ ద్రవ్యమయా ద్యజ్ఞాత్ జ్ఞాన యజ్ఞః పరంతప! ।
సర్వం కర్మాఽఖిలం పార్థ! జ్ఞానే పరిసమాప్యతే ॥
(కర్మయోగము, బ్రహ్మయోగము)*

**భావము :** ద్రవ్యయజ్ఞముకంటే జ్ఞానయజ్ఞము శ్రేష్ఠమైనది. సర్వకర్మలు జ్ఞానయజ్ఞములో పరిసమాప్తమగును.

**వివరము :** ఇక్కడ యజ్ఞమంటే ఏమిటి? రెండు యజ్ఞములు ఎక్కడ జరుగును? ఎవరు చేయుదురు, వాటి ఫలితమేమి? ఇన్ని ప్రశ్నలకు జవాబులు దొరికితే అప్పుడు యజ్ఞము వివరము పూర్తి తెలిసినవారమగుదుము. జవాబుల కోసము క్రింద వివరము చూస్తాము. **'యజ్ఞ' మనగా 'కాల్చుట' అని అర్థము.** ఒక యజ్ఞము జరుగవలయునంటే కాల్చబడుటకు పదార్థములు కావాలి. కాల్చుటకు అగ్ని కావాలి. ఆ వస్తువులను అగ్నిలో కాల్చుటకు ఒక మనిషి కావాలి. ఇది అందరికి తెలిసిన విషయమే. ఎక్కడ యజ్ఞము జరిగిన గుండములో అగ్ని ఉంటుంది. అందులోనికి వేసే సమిధలు చిన్న పుల్లలు మొదలుకొని గొప్ప ఔషధములు, పట్టుచీరలు, బంగారు, నెయ్యి మొదలగునవి ఎన్నో ఉండును. యజ్ఞములను నెరవేర్చు ఋత్త్విక్కులు ఉండుట సహజమే. బయట జరుగు ఈ యజ్ఞములు ధర్మయుక్తమైనవా, అధర్మయుక్తమైనవా అని యోచిస్తే, గీతలో భగంవతుడు చెప్పినవే ధర్మయుక్తములు. మానవులచే కల్పించబడిన యజ్ఞములు అధర్మయుక్తమైనవని తెలియుచున్నది. ఇక్కడొక ప్రశ్నరావచ్చును. అగ్నిలో ద్రవ్యములు వేసి మంత్రయుక్తముగ కాల్చడము, దేవుడు చెప్పిన రెండు యజ్ఞములలో ద్రవ్యయజ్ఞము కాదా అని అడుగవచ్చును. దానికి మా జవాబు ఏమనగా! 7వ అధ్యాయము అక్షర పరబ్రహ్మ యోగమున 4వ శ్లోకములో, శరీరములోపల జరుగు యజ్ఞములకు నేనే అధిపతిగ ఉన్నానని చెప్పడమైనది. దీని ప్రకారము యజ్ఞములు బయట జరుగునవి కావు. శరీరములోనే జరుగుచున్నవని తెలియుచున్నది. అలాంటపుడు బయట జరుగు యజ్ఞములు అధర్మమైనవని, భగవంతుడు చెప్పినవి ధర్మయుక్తమైనవని తెలియుచున్నది. కనుక ఆయన చెప్పిన రెండు యజ్ఞములను బాగా వివరముగా తెలుసుకోవాలి.

పై శ్లోకములో చెప్పిన ద్రవ్యయజ్ఞము, జ్ఞానయజ్ఞము అనబడు రెండిటిలో జ్ఞానయజ్ఞము శ్రేష్ఠమైనదన్నారు. ద్రవ్యయజ్ఞము ఎందుకు శ్రేష్ఠముకానిదని యోచిస్తే, ద్రవ్యయజ్ఞము ప్రకృతి సంబంధమైనది. పరమాత్మను పొందుటకు ఈ యజ్ఞము పనికిరాదు. ప్రకృతికి సంబంధించిన ద్రవ్యములు ఈ యజ్ఞములో కాలిపోవును. ద్రవ్యయజ్ఞములో జన్మకు కారణమైన కర్మలు అభివృద్ధి అగును. భగవంతుడు

తెల్పిన యజ్ఞముల గురించి మనకు తెలిసిన తెలియకపోయిన, ప్రతి ఒక్కరు ప్రతిదినము యజ్ఞము చేయుచున్నారు. **'తెలిసిన జ్ఞానులు చేయవచ్చునేమో, ఏమి తెలియని మేము యజ్ఞము చేయడమేమిటి'** అని ఆశ్చర్యపోనవసరము లేదు. వాస్తవముగ ప్రతి ఒక్కరు దినమునకు రెండు లేక మూడుమార్లు యజ్ఞము చేయుచునే ఉన్నారు. దానిపేరే ద్రవ్యయజ్ఞము.

యజ్ఞములు దేహములో జరుగుచున్నవను సూత్రము ప్రకారము, మన శరీరములో భగవంతుడు తెల్పిన ద్రవ్యయజ్ఞము, జ్ఞానయజ్ఞము రెండు జరుగు చున్నవి. అందరు చేయగలిగినది, ప్రస్తుతము చేస్తున్నది ద్రవ్యయజ్ఞము. సర్వ జీవరాసుల శరీరములోని జీర్ణాశయములో జఠరాగ్నిచేత మనము తినిన ఆహార ద్రవ్యములన్ని జీర్ణము చేయబడుచున్నవి. జఠరాగ్నిలో నోటిద్వారా లోపలికి వేయు పదార్థములన్ని కాలిపోవుచున్నవి. జీర్ణాశయమను యజ్ఞగుండమున జఠరాగ్ని యొక్క మంటలలో అనేక రకముల ఆహారపదార్థములు కాలిపోవు జీర్ణప్రక్రియను ద్రవ్యయజ్ఞము అన్నారు. ఈ ద్రవ్యయజ్ఞము ప్రతిదినము మన శరీరములో జరుగుచున్నదని ఒప్పుకోక తప్పదు. దినమునకు రెండు లేక మూడు పర్యాయములు ఈ అగ్నిగుండములోనికి ఆహారపదార్థములను వేయుచున్నాము. అట్లు వేయని పక్షములో కాని, కొద్ది ఆలస్యమైన కాని, ఆ అగ్ని ప్రకోపించి జీర్ణాశయగోడలను వేడి పుట్టించుట వలన ఆకలియని, కడుపులో మంటలేసినదని అంటుంటాము. కడుపులో మంటలేసినదని మన నోట వచ్చు మాటలో ఎంతో సత్యమున్నది. ఆ మాట నోటివెంట వచ్చుచున్నప్పటికి, ఈ మంట ఏ అగ్నిదని ఆలోచింపకపోయిన దానివలన, అక్కడ జరుగు యజ్ఞము కూడ తెలియకుండపోయినది. ఈ యజ్ఞములో ఉన్న అగ్ని జఠరాగ్నియని, కాల్చబడునవి ద్రవ్యములని, యజ్ఞము చేయించువాడు జీవుడని, అగ్నిగ ఉండి కాల్చివేయువాడు ఆత్మయని తెలియుచున్నది. దీనిని గురించి పురుషోత్తమ ప్రాప్తియోగమున 14వ శ్లోకములో *'అహం వైశ్వానరోభూత్వా ప్రాణినాం దేహ మాశ్రితః ప్రాణా ప్రాణ సమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్'* అన్ని దేహములలో

జీర్ణాశయమున అగ్ని స్వరూపుడుగా ఉండి  వారు తినిన నాలుగు విధముల పదార్థములను నాశనము (జీర్ణము) చేయుచున్నానని భగవంతుడు తెల్పివున్నాడు.

సైన్సు ప్రకారము శరీరములోని జీర్ణాశయములో మూడు రసములు ఇతర గ్రంథులనుండి వచ్చి కలియుచుండును.  ఈ మూడు రసములలోని రసాయనిక కలయికలో అగ్నితత్త్వమేర్పడుచున్నది.  ఈ అగ్ని తత్త్వమునకు ఏ పదార్థమునైన భస్మీపటలము చేయు శక్తి కలదు.  ఈ అగ్ని ప్రకృతి జనిత శరీరములోని గ్రంథులలో పుట్టినది.  ఈ గ్రంథులను, వాటిరసమును అందులో ఏర్పడుశక్తిని దాని ప్రక్రియ అయిన ద్రవ్యయజ్ఞము ప్రత్యక్షముగ కనిపించకున్నను అందరి శరీరములో జరుగుచున్నది.  జీర్ణాశయములో జరుగు ఈ యజ్ఞమునకు నిత్యము వస్తువులు అవసరము.  ఉప్పు, చింతపండు, మిరపకాయలు, కందిబేడలు (పప్పు), జిలకర్ర, ఆవాలు, కరివేపాకు మొదలగు వస్తువులన్ని అవసరము.  ఆ వస్తువులు కావాలంటే డబ్బుకావలెను.  డబ్బు కావాలంటే పనులు చేయాలి.  పనులు చేయుట వలన క్రొత్త కర్మ వస్తుంది.  దానిని అనుభవించుటకు పుట్టాలి.  పుట్టినవాడు తిరిగి క్రొత్త కర్మ తెచ్చుకొనుట దానిని అనుభవించుటకు పుట్టుట చూస్తే  ఇదొక చక్రములాగ తయారైనది.  ఈ చావు పుట్టుకల చక్రములో ఎన్నో యుగముల నుండి చిక్కుకొన్న జీవుడు బయటపడాలంటే ఒక్కటే మార్గమున్నది.  అదే జ్ఞానయజ్ఞము.  ద్రవ్యయజ్ఞము ద్వార జీవుడు కర్మచక్రములో ఇరుక్కుంటే, దానినుండి తప్పించగల స్థోమతగలది జ్ఞానయజ్ఞము.  అందువలననే ద్రవ్యయజ్ఞముకంటే జ్ఞానయజ్ఞము శ్రేష్ఠమైనదని భగవంతుడు చెప్పాడు.

జ్ఞానయజ్ఞము అందరు చేయలేరు.  దానిని చేయువారు కర్మయోగులు బ్రహ్మయోగులు మాత్రమే.  రెండు రకముల యోగుల శరీరములో జరుగు జ్ఞానయజ్ఞము వారి తలలయందు జరుగుచున్నది.  ద్రవ్యయజ్ఞ స్థానము జీర్ణాశయము కాగ జ్ఞానయజ్ఞ వేదిక శరీరములోని శిరస్సని తెలియాలి.  యోగుల శిరస్సులో జ్ఞానాగ్ని ఉండునని ఇంతకు ముందే తెలుసుకొన్నాము.  జ్ఞానాగ్నిలో వారివారి

కర్మలు కాలిపోవుచుండును. ఈ విధానమునకు **'జ్ఞానయజ్ఞము'** అని గీతలో పేరు పెట్టబడినది. ద్రవ్యయజ్ఞములో సంపాదించుకొన్న కర్మలన్ని జ్ఞానయజ్ఞములో కాలిపోవును. కర్మలు కాలిపోవుట వలన జీవునికి పుట్టుక లేకుండపోయి మోక్షము పొందును. 'జ్ఞానాగ్ని సర్వ కర్మాణి భస్మసాత్' అనుమాట ప్రకారము కర్మలన్ని నాశనమగు ఈ యజ్ఞమును జ్ఞానములేని మనుషులు చేయలేక పోవుచున్నారు. వారు ప్రతి దినము ద్రవ్యయజ్ఞము కొరకు కర్మలు సంపాదించుకొని వాటిని మోయుచున్నారు. వారి యజ్ఞము కొరకు మాత్రమే కర్మలు సంపాదించుకొనుటయే కాక, వారి వెనుక తరాలవారి యజ్ఞములకు కూడ ఇప్పుడే సంపాదించవలెనను కోర్కెలతో విపరీత పనులు చేసి, విపరీతముగ కర్మలు మూటకట్టుకొనుచున్నారు.

జ్ఞానము తెలిసినవారు జ్ఞానయజ్ఞము చేసి వారి కర్మలు బాపుకోవలసి ఉండగ, కొందరు జ్ఞానులు కూడ ప్రకృతి మాయలోపడి శరీరయజ్ఞమేదో తెలియక, బాహ్యాయజ్ఞములు చేయుచు స్వాములని పేరు తెచ్చుకొని, ప్రజలను కూడ బాహ్యాయజ్ఞముల వైపే మళ్లించుట మరీ చోద్యము. జ్ఞాన విషయములో ఎంత పెద్దవారు చెప్పినప్పటికి, గ్రుడ్డిగ నమ్మక శాస్త్రబద్ధముగ యోచన చేసి సరియైన దారి ఎంచుకొన్నపుడే, భగవంతుడు చెప్పిన విషయములు అర్థము కాగలవు. కర్మలు లేకుండచేసి మోక్షము పొందింపజేయు జ్ఞానయజ్ఞమును గూర్చి తెలియాలన్న, దానిని ఆచరించి చేయాలనిన, తప్పనిసరిగ జ్ఞానయజ్ఞము తెలిసిన గురువులు అవసరము.

ఇంత విన్న తర్వాత కొందరికి కొంత సంశయము వచ్చి ఈ విధముగ "ద్రవ్యయజ్ఞమనగా! ద్రవ్యములను కాల్చివేయు కార్యము అను అర్థము ప్రకారము జ్ఞానయజ్ఞమనగా! జ్ఞానమును కాల్చివేయు కార్యమని భావము రాగలదు కదా! యజ్ఞమనగా లేకుండా చేయుట అనినపుడు, జ్ఞానయజ్ఞము యొక్క కార్యములో జ్ఞానమును లేకుండ చేయడమే ముఖ్యకార్యమగును కదా! జ్ఞానమును సంపాదించుకొమ్మని చెప్పిన మీరే జ్ఞానమును లేకుండ చేసుకొమ్మని చెప్పడము

మంచిదా" అని కొందరడుగ వచ్చును. దానికి మా జవాబేమనగా! ద్రవ్యయజ్ఞమనగా ద్రవ్యములను కాల్చివేయడమన్నది వాస్తవమే. అలాగే జ్ఞానయజ్ఞమనగా జ్ఞానములను కాల్చివేయడము వాస్తవమే. ఇక్కడ జ్ఞానము అనగానే ఏ జ్ఞానము అని యోచించివలసిన అవసరమున్నది. జ్ఞానము రెండురకములుగ కలదు. ఒకటి ప్రపంచ జ్ఞానము, రెండు పరమాత్మ జ్ఞానము. ఇక్కడ కాల్చివేయమన్నది ప్రపంచ జ్ఞానమును, కాని పరమాత్మ జ్ఞానమును కాదని గుర్తుంచుకోవాలి. ప్రపంచ జ్ఞానము ఐదు రకములుగ కలదు. పంచ జ్ఞానేంద్రియముల ద్వార లోపలి మనస్సుకు అందించబడు ఐదు విషయ జ్ఞానములను ప్రపంచజ్ఞానము అంటున్నాము. కన్ను ద్వార కనిపించు దృశ్యము యొక్క విషయమునంతటిని దృశ్యజ్ఞానము అంటాము. అదే విధముగ శబ్ద విషయమును, రుచి విషయమును, వాసన విషయమును, స్పర్శ విషయమును ప్రపంచ జ్ఞానములు అనుచున్నాము. ఈ విషయములను లోపలికి తెలియజేయు కన్ను, చెవి, నాలుక, ముక్కు, చర్మములను జ్ఞానేంద్రియములు అంటున్నాము. ఇవి ఐదు ప్రపంచ జ్ఞానేంద్రియములు మాత్రమే, శరీరమునకున్న ఐదు జ్ఞానేంద్రియముల ద్వార వచ్చు విషయ జ్ఞానము వలననే పాపపుణ్య కర్మలు వస్తున్నవి. ఐదు జ్ఞానేంద్రియముల ద్వార సంభవించు పాపపుణ్యములను అంటకుండ చేసుకోవడమును జ్ఞానయజ్ఞము అన్నారు. ద్రవ్యయజ్ఞములో నాలుగు ద్రవ్యములు కాల్చి వేయబడుచుండగ, జ్ఞానయజ్ఞములో ఐదు జ్ఞానములు కాల్చివేయబడుచున్నవి. 1) పిండిపదార్థములు, 2) కొవ్వుపదార్థములు, 3) ఖనిజలవణములు 4) మాంసకృత్తులు అనబడు నాలుగు ద్రవ్యములు జఠరాగ్నిలో కాలిపోవడమును ద్రవ్యయజ్ఞము కాగ, శబ్ద, రూప, రస, గంధ, స్పర్శ అను ఐదు జ్ఞానములు దైవజ్ఞానమను అగ్నిలో కాలిపోవడము జ్ఞానయజ్ఞము అవుచున్నది. దీనిని బట్టి నాలుగు ఆహార ద్రవ్యములను కాల్చివేయునది ద్రవ్యయజ్ఞము, ఐదు ప్రపంచ జ్ఞానములను కాల్చివేయునది జ్ఞానయజ్ఞము అని తెలియుచున్నది. ద్రవ్యయజ్ఞమునకు జ్ఞానయజ్ఞమునకు గల తేడాను తర్వాత పేజీలో గమనిస్తాము.

| ద్రవ్య యజ్ఞము | జ్ఞాన యజ్ఞము |
|---|---|
| 1) ద్రవ్యయజ్ఞము కడుపులో జరుగును. | (1) జ్ఞాన యజ్ఞము తలలో జరుగును. |
| 2) దీనిలో అనేక రకములైన ఆహార పదార్థములు కాలిపోవును. | (2) దీనిలో అనేక రకములైన పాప పుణ్యములు కాలిపోవును. |
| 3) దీనిని అందరు ఆచరింతురు. | (3) దీనిని యోగులు మాత్రమే ఆచరింతురు. |
| 4) ప్రతి దినము విధిగ తప్పనిసరిగ చేయవలసి ఉండును. | (4) జ్ఞానయజ్ఞము విధిగ జరుగునది కాదు. ప్రయత్నము చేస్తే జరుగును. |
| 5) దీనిలో పాపపుణ్యములు వచ్చును. | (5) దీనిలో పాపపుణ్యములు పోవును. |
| 6) ఇది బయటికి కనిపించునది. | (6) ఇది బయటికి కనిపించదు. |
| 7) దీనిలో ఉన్న అగ్ని జఠరరసములచే ఉత్పత్తియగు జఠరాగ్ని. | (7) దీనిలో ఉన్న అగ్ని జ్ఞానముచే ఉత్పత్తియగు జ్ఞానాగ్ని. |
| 8) దీని అగ్ని గ్రంథి రసములతో పుట్టును. | (8) దీని అగ్ని గురూపదేశముతో పుట్టును. |
| 9) ద్రవ్యయజ్ఞము ఆత్మకు ఉపయోగపడుచున్నది. | (9) జ్ఞానయజ్ఞము జీవాత్మకు ఉపయోగపడుచున్నది. |
| 10) దీనిలో నాలుగు పోషకములు ఆహుతి అగుచున్నవి. | (10) దీనిలో ఐదు జ్ఞానములు ఆహుతి అగుచున్నవి. |

*(3) శ్లో॥ 34 : తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా ।*
*ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వ దర్శినః ॥*
*(కర్మయోగము, బ్రహ్మయోగము)*

**భావము :** ఆత్మను తెలిసినట్టి గురువులను చేరి వినయవిధేయతలతో నమస్కరించి సేవలు చేయుచు, సమయానుకూలముగ ప్రశ్నలడిగిన వారు జ్ఞానమును ఉపదేశించి, కర్మలు నశించిపోవు జ్ఞానమార్గమును చూపగలరు.

**వివరము :** ఎక్కడ పొరపడిన ఫరవాలేదు, కాని గురువును ఎన్నుకొనుటలో పొరపడ కూడదు. జీవితమంత వారిని బట్టి నీవు నడచుకొను విధానముండును. కనుక ఈ శ్లోకములో భగవంతుడు స్వయంగా తానే జోక్యము చేసుకొని గురువుల విషయము చెప్పాడు. శ్లోకములో ఆయన మొదటి మాట '**తద్విద్ధి**' అన్నాడు. దానికి తత్త్వమును తెలిసినవారని అర్థము. తత్త్వము అనగా శరీరములోని రెండవ ఆత్మ. ఆత్మను తెలిసినవారు మాత్రమే గురువులని ఈమాటలోని అంతరార్థము. గురువులు జన్మరాహిత్యమును కలుగజేయువారుగ ఉండాలి. జన్మలు లేకుండ పోవాలంటే కర్మలు లేకుండపోవాలి. కర్మలు లేకుండ పోవాలంటే అవి కాలిపోవాలి. అవి కాలిపోవాలంటే శరీర అంతర్ముఖయజ్ఞము చేయాలి. శరీరములోపలి యజ్ఞము చేయాలంటే వాటి వివరము చెప్పువారుండాలి. యజ్ఞముల గురించి చెప్పువారు యజ్ఞముల విషయము పూర్తి తెలిసినవారై ఉండాలి. అట్లు తెలిసినవారు దొరకాలంటే వారి కోసము వెతకాలి. వెతకడములో దొరికిన, వారు తెలిసిన వారో కాదో తెలియాలంటే మనకూ అంతో ఇంతో జ్ఞానముండాలి.

గురువులేనిది జ్ఞానము ఎలా వస్తుందనుకోవలసిన పనిలేదు. పుస్తకము ద్వార లేక తనలో తాను ఆలోచించడము వలన, గురువును గుర్తించుటకు కావలసిన జ్ఞానము లభించగలదు. ముఖ్యముగ తెలియవలసినదేమనగా **గురువు లేకపోయిన జ్ఞానము లభిస్తుంది, కాని గురువులేనిది మోక్షమురాదు.** కర్మలనాశనము చేయు విధానము గురువుల ద్వారానే తెలియాలి. కర్మలు పోనిది మోక్షమురాదు, కనుక గురువు తప్పనిసరిగ అవసరము. గురువుల విషయములో తప్పనిసరిగ అందరు ఆలోచించాలి. ఏమని ఆలోచించాలి అనుకోకూడదు. నీ సంశయములు ఎక్కడ తీరునో అక్కడే గురువున్నాడని తెలియాలి. నీకు ఆలోచనలు రాలేదనుకో, మేము అడుగు ప్రశ్నలకు జవాబున్నదో లేదో చూచుకో.

నీకు గురువు ఉన్నాడా? ఉంటే ప్రకృతితో నిండిన బోధనా? లేక పరమాత్మకు సంబంధించిన బోధ చేయుచున్నాడా! ఏది? కర్మలు కలుగజేయు యజ్ఞము యొక్క పనులు చెప్పాడా? కర్మలు తొలిగిపోవు జ్ఞానయజ్ఞము గురించిన పనులు చెప్పాడా? ఇవి బోధ గురించిన ప్రశ్నలు, ఇక ఉపదేశమును గురించిన ప్రశ్నలు. ఏమనగా! ఉపదేశమును పొందావా! లేదా? ఆ ఉపదేశము ప్రకృతి సంబంధ దృశ్యమా, శబ్దమా? ఇట్లు అనేక ప్రశ్నలు వేసుకొని వాటికి జవాబు దొరికినపుడు పరవాలేదు. జవాబు దొరకకపోతే దొరికేంతవరకు గురువుకోసము అన్వేషణ చేయాలి.

'**ఉపదేక్ష్యంతితే జ్ఞానం**' అన్న వాక్యమును బట్టి గురువులు ఏమి ఉపదేశము చేస్తారో తెలుసుకొందాము. ఉపదేశము ప్రకృతి సంబంధము కాకుండ ఉండాలి. కర్మలు కాల్చుకొనుటకు అనుకూలముగ ఉండాలి. ప్రక్క ఇంటిలో పొయ్యి ఉంది. అందులో అగ్నివుంది. కట్టెలు కాలుట వలన ఏర్పడిన అగ్నిచే పక్కింటివారు వంటచేసుకొని తిని రుచి అనుభవించి ఆకలి తీర్చుకొంటున్నారు. మనము ఆ పని చేయాలి. వంట పాత్రలు, వంట సామాగ్రి అన్నీ సమకూర్చుకున్నాము. పొయ్యి కూడ ఉన్నది. వంట తయారగుటకు లేనిది అగ్నియే. ఆ అగ్నిని ప్రక్కింటివానిని అడిగి, వాడు దానము చేసిన నిప్పురవ్వను మన పొయ్యిలో వేసి, కొద్దిసేపు ఊదితే మన పొయ్యిలోని కట్టెలు అంటుకొంటాయి. కట్టెలు కాలిపోతాయి. ఫలితము వంట తయారై ఆకలి తీరుతుంది. ఈ విధముగనే జన్మబంధమను ఆకలి పోవాలంటే, శరీరమను పొయ్యిలో కర్మలను కట్టెలను, జ్ఞానాగ్ని అను అగ్నితో రగిల్చినపుడు, దాని ఫలితముగ మోక్షము అను వంట తయారగును. మనవద్ద శరీరమను పొయ్యి, కర్మలను కట్టెలు, సాధన అను సామాగ్రి ఉన్నప్పటికి గురువుల శరీరములో ఉన్న జ్ఞానాగ్ని రవ్వంత వారి నుండి ఇప్పించుకోవాలి. మొదట గురువు దగ్గరినుండి కొంత నిప్పును పొంది, దాని ద్వార ప్రయత్న పూర్వకముగ అనగ యోగసాధన ద్వార కర్మలను కాల్చాలి.

మొదట గురువు దగ్గరి నుండి అగ్నిని పొందడమే ఉపదేశమందురు. జ్ఞానాగ్ని హస్తము ద్వార, పాదము ద్వార, చూపు ద్వార గురువుల నుండి బయటికి

వస్తుందని తెలుసుకొన్నాము. అందువలన గడిచిన కాలములో ఏసుప్రభువుకు ఆయన గురువు యోహాను తన హస్తము ద్వార జ్ఞానాగ్నిని దానము చేసినట్లు ఉన్నది. అలాగే వేమన తన గురువు ద్వారా హస్తము చేతనే జ్ఞానాగ్నిని పొందాడు. ఇంకనూ ఎందరో గురువులు వారి పాదమును శిష్యుని శిరస్సున ఉంచి జ్ఞానాగ్నిని దానము చేశారు. ఇట్లు ఉపదేశము యొక్క తార్కాణములు గలవు. ఈ ఉపదేశములన్ని ప్రకృతి సంబంధమైనవి కావు.

ఈ శ్లోకమందే గురువువద్ద శిష్యుడు ఎలా మెలగవలెనను విషయము కూడ చెప్పారు. విధేయతతో నమస్కరించుట, సమయోచితముగ ప్రశ్నలడుగుట, సేవలు చేయుట మొదలగునవి కల్గియుండవలెనన్నారు. మనస్ఫూర్తిగ సేవలు చేసి సద్భక్తితో ప్రశ్నలడుగు వారికే ఫలితముండును. గీతలో భగవంతుడు చెప్పినట్లు నడుచుకొనుచుండిన నిజగురువే దొరకగలడు.

*(3) శ్లో॥ 35 : యజ్జ్ఞాత్వాన పునర్మోహ మేవం యాస్యసి పాండవ ।*
*యేన భూతాన్యశేషేణ ద్రక్ష్యస్యాత్మన్యథో మయి ॥*
*(బ్రహ్మయోగము)*

**భావము :** ఏ జ్ఞానము చేత మోహము కలుగదో, ఏ జ్ఞానము చేత సమస్త జీవరాసులలో ఆత్మను, ఆత్మలో జీవరాసులున్నట్లు తెలియునో అట్టి జ్ఞానము పొందగలవు.

**వివరము :** తత్త్వవేత్తలైన గురువులవద్ద జ్ఞానమార్జించితే, అట్టి జ్ఞానము చేత సాధనా పరులై తనలోని ఆత్మదర్శనమును పొందుదురు. ఆత్మ విషయము తెలిసి పోయిన తర్వాత ఆత్మలేని జీవరాసిలేదని, తనయందున్నట్లే అన్ని శరీరములలోను ఆత్మ ఉన్నదని సులభముగ తెలియును. శరీరములలో ఆత్మ, ఆత్మలో శరీరములున్నట్లు తెలిసిపోవును. గురువుగారి వద్ద కర్మలు పోవు జ్ఞానము తెలుసుకొమ్మని చెప్పాము కదా! అలా గురువు కర్మ నిర్మూలనా విధానములు రెండునూ బోధించిన పిమ్మట, అందులో ఒకటైన బ్రహ్మయోగములో ఆత్మను చూడగలరు. కంటితో కాదు జ్ఞానదృష్టికి

ఆత్మ తెలియును. రెండవదైన కర్మయోగములో ఆత్మదర్శనము అనుమాటయే ఉండదు. కర్మయోగములో సాధారణముగా పనులు చేయుట తప్ప ఏ సాధన ఉండదు. కర్మయోగములో లోపలి సాధన తప్ప బయట కనిపించునట్లు ఏమీ ఉండదు. బ్రహ్మయోగము బయటికి కనిపించు సాధనగాయుండును. ఆత్మను తెలియుట బ్రహ్మయోగములోనే సాధ్యమని తెలియాలి.

(3)శ్లో॥ 36 : అపి చేదసి పాపేభ్యస్సర్వేభ్యః పాపకృత్తమః ।
సర్వం జ్ఞానప్లవేనై వ వృజినం సంతరిష్యసి ॥
(కర్మయోగము, బ్రహ్మయోగము)

**భావము :** అఖిల పాపాత్ములందు నీవెంత అధమ పాప యుతుడవైనప్పటికి, పాపమను సముద్రమును జ్ఞానమను చిన్న ఓడచే దాటగలవు.

**వివరము :** ఎన్నో జన్మల నుండి పాపము సంపాదించుకొని సంచితకర్మ సముద్రమువలె ఉన్నప్పటికి, కర్మలు కాల్చు విధానము తెలుసుకొనుటవలన, యోగమను ఓడచే కర్మలను సముద్రమును సులభముగ దాటగలవు. ఎంత పెద్దకర్మలు కలవాడైనను దిగులుపడవలసిన అవసరము లేదు. ఎందుకనగ గురువువద్ద నుంచి తీసుకొన్న అగ్నితో జ్ఞానయజ్ఞము శరీరములో జరుగులాగున, కర్మయోగము ఆచరించు విధానము తెలిసియున్నపుడు భయపడవలసిన పనిలేదు. కర్మలనుంచి సులభముగ బయటపడగలవు. పెద్ద సముద్రమునైన చిన్న పడవతో దాటునట్లు ఎంత కర్మనైన చిన్న అగ్నితో కాల్చివేయవచ్చును. ఆ విషయమే క్రింది శ్లోకములో చెప్పుచున్నాడు.

(3) శ్లో॥ 37 : యథైధాంసి సమిద్ధోఽగ్ని ర్భస్మసాత్కు రుతేఽర్జున ।
జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసాత్కు రుతే తథా ॥
(కర్మయోగము, బ్రహ్మయోగము)

**భావము :** ఏ విధముగ అగ్నిలో కట్టెలు కాలిపోవుచున్నవో, అదేవిధముగ జ్ఞానాగ్నిలో సర్వకర్మలు కాలిపోవుచున్నవి.

**వివరము :** ఈ విషయము ముందే చెప్పుకొన్నాము. 'జ్ఞానాగ్ని దగ్ధ కర్మాణాం' అని 19వ శ్లోకములో జ్ఞానాగ్నిని గురించి చెప్పినపుడు, నమ్మలేనివారెవరైన ఇక్కడ పూర్తిగ నమ్మవలసి ఉన్నది. నిజముగ జ్ఞానాగ్ని ఉన్నదని దానికి ఉదాహరణ కూడ ఇవ్వడము జరిగినది. సర్వ కర్మనాశనము చేయు జ్ఞానాగ్నిలేనివాడు యోగికాదు అని, ముందు ఆత్మసంయమయోగములో మొదటి శ్లోకములో చెప్పబడినది. ***లోకము దృష్టిలో నేను గీతను వ్రాసిన స్వామిగ, పెద్ద జ్ఞానిగ, గొప్ప మర్యాదతో ఉన్నప్పటికి నాలోపల జ్ఞానాగ్నిలేనిది ఏమి ప్రయోజనములేదు. దైవ దృష్టిలో గాని, ఆధ్యాత్మిక విద్య ప్రకారము గాని, నేను యోగిననుటకు వీలులేదు. ఎవరికైనను ఈ సూత్రమే వర్తించును.***

(3) శ్లో॥ 38 : న హి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే ।
తత్స్వయం యోగ సంసిద్ధః కాలేనాత్మని విందతి ॥
(కర్మయోగము)

**భావము :** జ్ఞానమునకు ప్రపంచములో సాటియైనదేది లేదు. దానికంటే పవిత్రమైనది లేదు. కర్మయోగమాచరించెడు కర్మయోగి కాలము జరుగుకొలది మోక్షమునకు దగ్గరవాడగును.

**వివరము :** జ్ఞానాగ్నికి సమానమైనదేదీ ప్రపంచమున లేదు. ఈ అగ్నికంటే పవిత్రమైనది లేదు. కర్మయోగికి కాలము జరుగుకొలది కర్మలు కాలిపోవుచుండును. కర్మయోగిలో ఉన్న అగ్ని కర్మను కాలుస్తూ చివరికి లేకుండజేయును. అపుడు ఆ యోగి మోక్షము పొందును.

(3) శ్లో॥ 39 : శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పర స్సంయతేంద్రియః ।
జ్ఞానం లబ్ధ్వా పరాం శాంతి మచిరేణాధి గచ్ఛతి ॥
(బ్రహ్మయోగము)

**భావము :** శ్రద్ధ కలిగి ఇంద్రియములను నిగ్రహించు తత్పరులకు జ్ఞానము లభించును. జ్ఞానము కల్గిన తర్వాత అచిరకాలములోనే మోక్షమును పొందగలరు.

**వివరము :** దైవమును తెలియాలను శ్రద్ధ గలవాడు, ఒక్కటే ధ్యాస కల్గి, ఇంద్రియములను నిగ్రహించు జ్ఞానము కలవానికి జ్ఞానాగ్ని కలుగును. జ్ఞానాగ్ని కల్గిన కొంతకాలమునకు కర్మలు పూర్తిగ కాలిపోవును. కనుక అతడు తొందరగ మోక్షము పొందగలడు. ఇంద్రియములు నిగ్రహించి వాటి పనిని లేకుండ చేయడము బ్రహ్మయోగమునకే ఉండును.

(3) శ్లో॥ 40 : అజ్ఞ శ్చా శ్రద్ధాధాన శ్చ సంశయాత్మా వినశ్యతి ।
నాయం లోకోஉస్తి నపరో నసుఖం సంశయాత్మనః ॥
(జీవాత్మ)

**భావము :** సంశయాత్ముడై, శ్రద్ధలేనివాడై, జ్ఞానశూన్యుడైన జనుడు తప్పక చెడును. సంశయాత్మునకు ఇహ పరములలో ఎక్కడైన సుఖము లేదు.

**వివరము :** ఈ శ్లోకములో సంశయాత్ముని గురించే ఎక్కువగా చెప్పారు. సంశయములుండి వాటి పరిష్కారము తెలుసుకోలేని వానికి ఇహపరములలో సుఖముండదన్నారు. మానవునికి కొన్ని విషయములలో సంశయములు వచ్చుట సహజమే. ఎటువంటి సంశయమునైన కొంత యోచిస్తే పరిష్కారమార్గము లభిస్తుంది. అలా యోచించక ఈ విషయము ఇంతే అని గోడకట్టుకొని కూర్చున్న వానికి ఎప్పటికి సత్యము తెలియదు. ఒక విషయమును పూర్తి పరిశీలించకనే, ఆ విషయము మీద ముందే ఒక నిర్ణయము కల్గియుండి, ఆ విషయము యొక్క సత్యమును గ్రహించక, తనకు ముందునుండి ఉన్న నిర్ణయమే సరియైనదనుకొని, తమ నిర్ణయమే సత్యమైనదను భ్రమలో పడినవారు కొందరున్నారు. అటువంటివారు అసత్యములో ఉండి సత్యములో ఉన్నామనుకొంటుంటారు. ఉదాహరణకు దయ్యము అన్నది వాస్తవమే అయిన ఆ మాటవింటూనే ఇందులో సత్యమెంత ఉందో పరిశీలిస్తామనుకోక దయ్యమనునది అసత్యమంటారు. దయ్యము యొక్క బాధను అనుభవించువానిని చూచి అదొక రోగమంటారు. ఏ మందులతో నయము కాకపోతే వాని మానసిక పరిస్థితి అటువంటిది అంటారు. ఈ విధముగ ముందే తమ లోపల ఉన్న నిర్ణయమును

సమర్థించుకొనుచుందురే కాని సత్యమును తెలియలేరు. అటువంటి అసత్యవాదులు తాము నిజముగ సత్యవాదులము అనుకొంటుంటారు. అటువంటి వారికి ఇహములో ఎప్పుడైన దయ్యముల బాధ కలిగితే దానినుండి బయటపడలేరు. అంతేకాక అటువంటి వాదులు తర్వాత జన్మలలో అదోగతిపాలగుదురని, అటువంటి వారికి తర్వాత జన్మలలో ఇహములో సుఖముగాని, పరములో మోక్షముగాని లభించదని తెలియజేశాడు.

*(3) శ్లో॥ 41 : యోగ సన్న్యస్త కర్మాణం జ్ఞాన సంఛ్ఛిన్న సంశయం ।*
*ఆత్మ వన్తం న కర్మాణి నిబధ్నన్తి ధనంజయ ॥*
*(కర్మయోగము, బ్రహ్మయోగము)*

**భావము :** జ్ఞాన వివరముచే సంశయములు లేకుండ పోయిన వానికి, యోగ పద్ధతుల ద్వారా కర్మలను కాల్చివేయువానికి, మనస్సును ఆత్మను తెలియువానికి కర్మలు బంధములు కావు.

*(3) శ్లో॥ 42 : తస్మా దజ్ఞాన సంభూతం హృత్ స్థం జ్ఞానాసినాऽऽత్మనః ।*
*చిత్త్వైనం సంశయం యోగ మాతిష్ఠో త్తిష్ఠ భారత ! ॥*
*(కర్మయోగము)*

**భావము :** అజ్ఞానము వలన నీ హృదయములో నెలకొన్న సంశయమును జ్ఞాన ఖడ్గముచే నరికివేసి కర్మయోగమాచరించపూనుకొనుము.

**వివరము :** మొదట అర్జునునికి ఏమి సంశయమొచ్చినదో జ్ఞప్తికి ఉన్నదా! యుద్ధము చేయుట వలన, ఎంతో మందిని చంపుటవలన పాపమొచ్చును కదా! పాపమొచ్చు పనిచేయ వచ్చునా? అను సంశయమేర్పడి యుద్ధము చేయనని కూర్చున్నాడు. ఇపుడు ఇంతవరకు తెల్పిన కర్మయోగ సంబంధ జ్ఞానముచే యుద్ధము వలన పాపమొచ్చునను అనుమానము పోగొట్టుకొనవచ్చును. చేయుచున్న ఏ పనియైన దానివలన సంభవించెడుకర్మను కాలిపోవునట్లు చేయునది కర్మయోగము. ఈ విషయము ఎంతో వివరముగ విన్న అర్జునుని సంశయము పటాపంచలై పోగలదు. అందువలన శ్రీకృష్ణుడు ఈ జ్ఞానముతో నీ సంశయమును త్రుంచి వేయమన్నాడు.

ఇంతటితో జ్ఞానయోగము అను అధ్యాయము ముగిసినది. ఈ అధ్యాయము లోని శ్లోకముల వివరము క్రిందగలదు.

| | | | |
|---|---|---|---|
| 1) | సాకారము, నిరాకారము | : | 4 |
| 2) | సాకారము | : | 2 |
| 3) | సాకారము, కర్మయోగము | : | 1 |
| 4) | బ్రహ్మయోగము, కర్మయోగము | : | 8 |
| 5) | బ్రహ్మయోగము | : | 2 |
| 6) | కర్మయోగము | : | 10 |
| 7) | ప్రకృతి | : | 1 |
| 8) | జీవాత్మ, పరమాత్మ | : | 2 |
| 9) | ప్రకృతి, కర్మయోగము, బ్రహ్మయోగము | : | 1 |
| 10) | జీవాత్మ | : | 1 |
| 11) | పరమాత్మ | : | 1 |
| 12) | అశాస్త్రీయమైనవి | : | 9 |
| | మొత్తము శ్లోకములు | : | 42 |

భావము, వివరము మార్చి వ్రాసిన శ్లోకములు – 5,6,7,8,13,17,33.

*****

## నాల్గవ అధ్యాయము

# కర్మ సన్న్యాస యోగము

**అర్జునుడిట్లనియె :-**

*(4) శ్లో॥ 1 : సన్న్యాసం కర్మణాం కృష్ణ ! పునర్యోగం చ శంససి ।*
*యచ్ఛ్రేయ ఏతయోరేకం తన్మే బ్రూహి సునిశ్చితమ్ ॥*
*(కర్మయోగము, బ్రహ్మయోగము)*

**భావము :** కర్మ సన్న్యాసము చెప్పితివి మరియు కర్మ చేయుట యోగమంటున్నావు. రెండింటిలో ఏది శ్రేష్ఠమో నిశ్చయముచేసి నాకు చెప్పుము.

**వివరము :** కర్మ అనగ పాపము మరియు పుణ్యము. కార్యమనగ పనులు. కార్యములను (పనులు) గురించి చెప్పునపుడుగాని, కర్మలను (పాపపుణ్యములు) గురించి చెప్పునపుడు గాని, రెండు సందర్భములలోను కర్మ అను పదమునే శ్లోకములో ఉపయోగించారని మరొక మారు జ్ఞప్తి చేయుచున్నాము. ఇచట అర్జుననకు ఒక అనుమానమొచ్చి వెంటనే అడిగాడు. ఈ కాలములో అయితే అటువంటి అవకాశము లేదనుకోండి. చెప్పేది వినక మధ్యలో అడుగకూడదనుట అప్పుడు లేదు. అందువలన సంశయము వస్తూనే ప్రశ్న వేశాడు. అలా అడుగక పోతే ఆ అనుమానము మనసులో ఉండుట వలన తర్వాత విషయము బుర్రకెక్కదు. మనసులో మెదిలిన ప్రశ్నను వెంటనే అడగడము మంచిది.

పరమాత్మలో కలిసిపోవడానికి, జన్మలు లేకుండ మోక్షము పొందడానికి రెండే యోగములు కలవు. అవియే ఒకటి బ్రహ్మయోగము, రెండవది కర్మయోగము. బ్రహ్మయోగములో శరీరముతో జరుగుపనులన్ని వదిలివేసి కూర్చోవడము. రెండవ కర్మయోగములో శరీరముతో జరుగు పనులన్ని చేయడము. ఈ రెండు యోగ విషయములను విన్న అర్జునుడు రెండింటిలో నాకు ఏది శ్రేష్ఠమో తెలుపమన్నాడు. ఆ మాటకు శ్రీకృష్ణుడు వెంటనే జవాబు చెప్పాడు.

**శ్రీ భగవంతుడిట్లనియె :-**

*(4) శ్లో॥ 2 : సన్న్యాసః కర్మయోగశ్చ నిశ్శ్రేయ సకరావుభౌ ।*
*తయోస్తు కర్మసన్న్యాసా త్క ర్మయోగో విశిష్యతే ॥*
*(కర్మయోగము, బ్రహ్మయోగము)*

**భావము :** కర్మయోగము, బ్రహ్మయోగము రెండును శ్రేష్ఠమైనవే. కాని బ్రహ్మయోగముకంటే కర్మయోగమే గొప్పది.

**వివరము :** పరమాత్మను చేరుటకు రెండే యోగమార్గములన్నాము కదా! అందులో ఒకటి మంచిదని మరొకటి మంచిది కాదనుట ఏమిలేదు. రెండును సమానమే అయినవి. రెండును కర్మను కాల్చునవే. రెండిటియందును సాధారణ మానవునికి ఆచరణ యోగ్యమైనది కర్మయోగమే. అందువలన కర్మయోగము సంసారములో చిక్కుకొన్న సాధారణ వ్యక్తుల ఎడల విశిష్ఠత కల్గియున్నదని చెప్పవచ్చును. బ్రహ్మయోగము సంసారములేని వారికి సులభమగును.

*(4) శ్లో॥ 3 : జ్ఞేయస్స నిత్య సన్న్యాసీ యోనద్వేష్టి న కాంక్షతి ।*
*నిర్ద్వంద్వోహి మహాబాహో! సుఖం బందాత్ప్ర ముచ్యతే ॥*
*(కర్మయోగము)*

**భావము :** ఎవనికి అసూయ ప్రేమలు లేవో, ఎవడు సుఖదుఃఖ ద్వంద్వములను వదలివేయునో వాడే నిత్యసన్న్యాసి. వానికి బంధనములు లేవు.

**వివరము :** మనకు తెలిసినంత వరకు సన్న్యాసులంటే కాషాయరంగు గుడ్డలు ధరించిన వారని, సంసారము వదలివేసి భిక్షాటన చేయువారని సాధారణముగ అనుకొనుచుంటాము. పనులు చేయనివానిని మందలించునపుడు సన్న్యాసివి కావాలనుకున్నావా అనియో లేక ఇట్లుంటే సన్న్యాసులలో కలిసిపోతావనియో అంటుంటారు. దీనిని బట్టి చూస్తే పనులు చేయనివాడు సన్న్యాసి అను భావము అందరిలో ఇమిడిపోయింది. సంసార బాధ్యత లేకుండ పోవడము, పనులు

చేయకుండ పోవడమే సన్న్యాసమని అందరు అనుకొన్నంత మాత్రమున అది సత్యము కాదు. నిజమైన సన్న్యాసమేదో భగవంతుడు చెప్పాడు. మనమనుకొన్న భావమునకు వ్యతిరిక్తముగ సన్న్యాసమును గూర్చి భగవంతుడు ప్రకటించాడు. పనులు మానుకోవడము సన్న్యాసముకాదని, ఒక పద్ధతి ప్రకారము పనులు చేయుటే నిజమైన సన్న్యాసమని తెలిపాడు. నిజమైన సన్న్యాసిని బాహ్యముగ గుర్తించుటకు వీలుపడదని, అతను అందరివలె పనులు చేయుచుండునని, అతనికి బాహ్యముగ ఏ గుర్తులుండవని తెల్పాడు.

బయటికి కన్పించు వేషధారులైన ఈ సన్న్యాసులంత ఎవరను ప్రశ్న వచ్చిందను కొంటాము. దానికి జవాబు ప్రేమ అసూయలు, కష్ట సుఖములను ద్వంద్వములైన గుణములు వదలి, వాటి ఫలితముల మీద ఇష్టము లేనివాడై, జరుగుచున్న పనులు కర్మరీత్య జరుగుచున్నవని, వాటి అనుభవములు కర్మరీత్య వచ్చునవేనని, మంచిచెడు అను భేదము లేక శరీరము ద్వారా పనులు చేయుచు, తాను వేరను భావము కల్గియున్న కర్మయోగియే నిజమైన సన్న్యాసి అయినపుడు మిగతావారు కాదనియే అర్థము.

*(4) శ్లో॥ 4 : సాంఖ్యాయోగౌ పృథగ్బాలాః ప్రవదన్తి నపండితాః ।*
*ఏకమప్యాస్థితస్సమ్యక్ ఉభయోర్విన్దతే ఫలమ్ ॥*
*(కర్మయోగము, బ్రహ్మయోగము)*

**భావము :** కర్మయోగము వేరని, బ్రహ్మయోగము వేరని తెలియనివారనుచుందురు.. తెలిసిన వారు రెండిటిలో దేనినాచరించిన ఫలసిద్ధియగునని చెప్పుచుందురు.

**వివరము :** రెండవ శ్లోకములో కర్మయోగము విశిష్ఠత కల్గినదని చెప్పి, ఇక్కడేమో రెండు వేరువేరని తెలియని వారనుచున్నారని చెప్పడము చూచి ఇదేమిటి రెండురకములుగ చెప్పారని అడుగవచ్చును. దానికి మా జవాబు ఏమనగా! మేము అక్కడ కూడ రెండు యోగములు పరమాత్మను చేర్చునవేనని చెప్పాము. దేనినాచరించిన ఫలసిద్ధి ఒక్కటే. వాటి విషయములో అవి రెండు ఒక్కటే. కాని

ఆచరించు మానవులలో ఏది అనుకూలము, ఏది అనుకూలము కాదు అనుటలో సాధారణ జనులలో కర్మయోగము అనుకూలతలో విశిష్ఠతగాంచినదని చెప్పాము. రెండు యోగములు చూపుదారి ఒక్కటే అయినప్పటికి భార్యపిల్లలున్న వారికి, తప్పక పనులు చేయు ఆవశ్యకత ఉన్నవారికి కర్మయోగము శ్రేష్ఠమైనది. భార్యపిల్లలులేని వారికి, సంసార బాధ్యత లేక పనులు చేయకుండినను జీవితము సాగిపోవు వారికి బ్రహ్మయోగము అనుకూలముగ ఉండును. వీటి తేడాలు ఆచరించు మనుషులకే, కాని యోగములలో లేవని తెలియాలి. ఆ విషయమే క్రింది శ్లోకములో కూడ చెప్పుచున్నారు.

(4) శ్లో॥ 5 : యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగై రపి గమ్యతే ।
ఏకం సాంఖ్యంచ యోగంచ యః పశ్యతి సపశ్యతి ॥
(కర్మయోగము, బ్రహ్మయోగము)

**భావము :** బ్రహ్మయోగము ద్వార ఏ స్థానము ప్రాప్తించుచున్నదో, అదే కర్మ యోగములోను ప్రాప్తించుచున్నది. బ్రహ్మయోగము, కర్మయోగము రెండు సమానమైనవని తెలియువాడే వాస్తవ జ్ఞానదృష్ఠి కలవాడగును.

4) శ్లో॥ 6 : సన్న్యాసస్తు మహాబాహో ! దుఃఖ మాప్తు మయోగతః ।
యోగయుక్తో మునిర్బ్రహ్మ న చిరేణాఽధిగచ్ఛతి ॥
(కర్మయోగము, బ్రహ్మయోగము)

**భావము :** యోగము లేనివాడు, కర్మను సన్న్యశించనివాడు దుఃఖమునే పొందు చుండును. యోగముతో కూడుకొన్నవాడు, మనస్సును అణచినవాడు పరబ్రహ్మ పదవిని తొందరగ పొందును.

**వివరము :** ఈ శ్లోకములో ఇక్కడ మేము వ్రాసిన భావమునకు అనేక భగవద్గీతలలోని భావము విభిన్నముగ వ్రాయబడివున్నది. ఒకరుకాదు ఇద్దరుకాదు అందరు అలా

వ్రాయడములో శ్లోకముల భావము వివరము తెలిసి వ్రాయబడినవి కావని, ఒకరినొకరు చూచుకొని వ్రాయబడినవని తెలియుచున్నది. పరీక్షలు వ్రాయునపుడు ముందువానిని చూచి వెనుకవాడు వ్రాశాడనుకో, ముందు వానిది తప్పయిన వెనుక వానిది కూడా తప్పగును. ఆ విధముగనే శ్లోకములోని భావమేమిటని చూడక, ముందు ఇతరులు వ్రాసిన దానిననుసరించి వ్రాయుట వలన అందరిది ఒకే భావమై పోయినది. ఇది తప్పో ఒప్పో అని చూడకుండానే వ్రాశారు.

ముందు 4,5 శ్లోకములలో రెండు యోగములు ఒకే సామర్థ్యము కల్గివున్నవని చెప్పిన పెద్దలు, ప్రక్కనే ఉన్న శ్లోకములో మోక్షము పొందుటకు కర్మయోగ సహాయము అవసరము, కర్మయోగ సహాయము లేకుండ కేవలము బ్రహ్మయోగము ద్వార మోక్షము పొందుట కష్టతరము, కర్మయోగము తెలిసిన బ్రహ్మయోగి తొందరగ మోక్షము పొందుననుట విచిత్రము కాదా! ఇచట ప్రతి పద అర్థము వివరించుకొందాము.

**1) సన్న్యాసస్తు** = సన్న్యసించుట, లేక వదిలివేయుట, లేక లేకుండ చేసుకొనుట, దేనిని వదలుకోవడము, దేనిని సన్న్యసించడమంటే కర్మను సన్న్యసించడమని తెలియుచున్నది. కర్మను సన్న్యసించుటకు రెండు మార్గములున్నవి. ఒకటి సంచితకర్మను వదలించునది బ్రహ్మయోగము, రెండవది ఆగామికకర్మను వదలింపజేయునది కర్మయోగము. రెండు కర్మలను లేకుండ చేయు అర్థముతో **'సన్న్యాసస్తు'** అన్నారు. ఈ మాట రెండు యోగములకు సంబంధించినదని తెలియాలి. సన్న్యాసము రెండు యోగములలో సమానముగ ఉన్నదని తెలియాలి.

**2) అయోగతః** = యోగము లేకుండుట, రెండు యోగములు లేకుండుటని అర్థము, కర్మ సన్న్యాసము కల్గివున్న రెండు యోగములు లేకపోవడము.

**3) దుఃఖమాప్తు** = దుఃఖము పొందుదువు. యోగములు లేనపుడు జీవుడు కర్మలచే దుఃఖమును పొందుచూనే ఉండును. కర్మలు నశించు యోగమున్నపుడే జీవుడు దుఃఖము పొందడు.

**4) యోగయుక్తో** = యోగముతో కూడుకొన్నవాడు అనగా పనులు చేయుచున్నను కర్మయోగముతో కూడుకొన్నవాడు.

**5) ముని** = మౌనము వహించిన వాడు. మనస్సు కాని ఇంద్రియములు కాని కదలక బ్రహ్మయోగమాచరించువాడు.

**6) బ్రహ్మ** = పరమాత్మను లేక మోక్షమును

**7) నచిరేణాధి గచ్ఛతి** = తొందరగ పొందుదువు

**భావము :** కర్మనశించు రెండు యోగములు లేకపోయిన దుఃఖము పొందుదువు. కర్మయోగము, బ్రహ్మయోగము పొందినవాడు శీఘ్రముగ మోక్షము పొంది పరమాత్మలోనికి ఐక్యమగును.

*(4) శ్లో॥ 7 : యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేంద్రియః।*
*సర్వభూతాత్మ భూతాత్మా కుర్వన్నపి నలిప్యతే ॥*
*(బ్రహ్మయోగము)*

**భావము :** విశుద్ధాత్ముడై జితేంద్రియుడై సర్వ జీవుల యొక్క ఆత్మను తన ఆత్మగా తలచు యోగికి కర్మలుండవు.

**వివరము :** గుణములంటని శుద్ధాత్ముడైన జీవుడు, ఇంద్రియముల యొక్క పనులను నిలిపివేసి బ్రహ్మయోగమును పొంది, ఆ యోగములో ఆత్మను చూడగలిగి, మిగత జీవరాసులలోని ఆత్మయు తనలోని ఆత్మవలెనున్నదని తెలుసుకోగల్గిన వానికి, ముందు చేసిన సంచితకర్మలు నశించిపోవును. ఇది పూర్తి బ్రహ్మయోగులకు సంబంధించిన శ్లోకము.క్రింద కర్మయోగమునకు సంబంధించిన శ్లోకములను తెలియజేయుచున్నాడు.

*(4)శ్లో ॥8 : నైవ కించిత్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్।*
*పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్ అశ్నన్ గచ్ఛన్ స్వపన్ శ్వసన్ ॥*
*(కర్మయోగము)*

(4) శ్లో ॥ 9 : ప్రలపన్ విసృజన్ గృహ్ణన్ ఉన్మిషన్నిమిషన్నపి ।
ఇంద్రియాణీంద్రియార్థేషు వర్తన్త ఇతి ధారయన్ ॥
(కర్మయోగము)

(4) శ్లో ॥ 10 : బ్రహ్మణ్యాధాయ కర్మాణి సంగం త్యక్త్వా కరోతియః ।
లిప్యతే న స పాపేన పద్మపత్ర మివాంభసా ॥
(కర్మయోగము)

**భావము :** ఆత్మజ్ఞానమును తెలుసుకొన్న కర్మయోగి ఏ కార్యమునకు తాను కర్తను కాదని తలచి చూస్తు, వినుచు, తాకుచు, వాసన చూస్తు, తినుచు, నడుస్తు, నిద్రిస్తు, శ్వాస విడుచుచు తీసుకొనుచు, పల్కుచు, మల మూత్రములను విసర్జిస్తు, దేనినైన గ్రహిస్తు, కనులు తెరచుచు మరియు కనులు మూయుచు తమ తమ కార్యములను ఇంద్రియములు చేయుచున్నవని తలచుచుండును. ఈ విధముగ తన శరీరమందు జరుగు పనులను బ్రహ్మార్పణమొనర్చి సంగమనునది వర్జించినవాడు తామరాకుకు నీరంటనట్లు అఖిల పాపములచే అంటబడడు.

**వివరము :** పైన చెప్పబడిన కార్యములన్ని రెండు రకములుగ విభజింపబడివున్నవి. ఒకటి ఇష్టముండి జరుగునవి, రెండు మన ఇష్టమున్నా లేకున్నా జరుగునవి. బయటనే కాక శరీరములోపల కూడ పనులు జరుగుచూనే ఉన్నవి. వీటిని సైన్సులో కూడ **ఇచ్ఛాధీన, అనిచ్ఛాధీన** కార్యములంటున్నారు. చూచుట, వినుట, తాకుట, తినుట, నడుచుట మొదలగునవన్ని మన ఇచ్ఛ ప్రకారమే జరుగుచున్నవని ఇటువంటివన్ని ఇచ్ఛాధీన కార్యములని, మనకు తెలియకుండ జరుగు శ్వాస, కనులు మూయుట, తెరచుట అలాగే శరీరములో జరుగు గుండె, మూత్ర పిండముల, జీర్ణాశయముల కార్యములను అనిచ్ఛాధీన కార్యములని అంటున్నారు.

వాస్తవానికి సైన్సు ప్రకారము ఈ మాట తప్పేనని నిరూపించవచ్చును. ఎందుకనగ ఒకానొక సమయములో ఇచ్ఛాధీనముగ కదులు కాళ్ళు, చేతులు కూడ

అనిచ్ఛాధీనముగ పనిచేయుచున్నవి. కాలిమీద చిన్నగ ఏదో ప్రాకినట్లనిపిస్తూనే నీకు తెలియకుండానే కాళ్ళు, చేతులు కదులుచున్నవి. నిద్రలో నీకు తెలియకుండానే నీ ఇచ్ఛ లేకుండానే కాళ్ళు చేతులు కదులుచున్నవి. నిద్రలో నడచిపోవువారు కూడ కలరు. దీనిని బట్టి ఇచ్ఛాధీన కార్యములు అనుట సైన్సు ప్రకారము కూడ పూర్తి సత్యము కాదు.

మనకు తెలిసినంతవరకు తెలిసి జరుగునవి, తెలియక జరుగునవని రెండు రకములుగ చెప్పవచ్చును. ఈ మాటను ఎవరు ఖండించలేరు. కొన్ని పనులు జీవునకు తెలిసి జరుగుచున్నవి. కొన్ని తెలియక జరుగుచున్నవి. తెలిసి జరిగెడు పనులు కూడ కొన్ని సమయములలో తెలియక జరుగుచున్నవి. ఉదాహరణకు మూత్రము తెలిసి పోస్తున్నాము. కొన్ని సమయములలో తెలియకనే పోసుకోవడము కూడ జరుగుచున్నది. ప్రతిది నా ఇష్టప్రకారము జరుగుచున్నవనుకోవడము అహముతో కూడిన అజ్ఞానమగును. ఉదాహరణకు నడుస్తున్నపుడు నా ఇష్టప్రకారము నడుస్తున్నాననుకోవడము అజ్ఞానము. ఇందులో అహము నిండివున్నది. కాళ్ళు నడుస్తున్నవని నాకు తెలుస్తుందనుకోవడము జ్ఞానమగును. ఇందులో అహము లేదు. నిద్రలో నడిచినపుడు నీకు తెలియకుండ నడవడమే కదా! అపుడు నాకు తెలియకుండ నడవడము జరిగినదనుకోవచ్చును. అట్లుకాక నాఇష్టప్రకారము నడచినామని చెప్పలేము కదా!

శరీరములో జరిగెడి పనులన్నియు మనకు తెలిసి జరుగుచున్నవి. కాని ఇష్టప్రకారము జరుగుచున్నవనుకోకూడదు. ఈ విధముగనే తెలిసిన జ్ఞానియు శరీరములో జరుగు కార్యములన్నిటిని కొన్ని నాకు తెలిసి జరుగుచున్నవి, కొన్ని తెలియక జరుగుచున్నవని, శరీరములో వాటి వాటి కార్యములు అవి చేయుచున్నవని అనుకుంటాడు. అజ్ఞానమున్నప్పుడు ఎలా ఉండునంటే రాత్రి ఇంటి బయట నిద్రపోయినవాడు ఉదయము ఇంటిలో లేయుచున్నాడు. బయటి నుండి ఇంటిలోపలికి ఎపుడొచ్చినది నిజంగా తెలియదు, ఎంత యోచించిన అర్థము కాలేదు.

ఇతరుల నడిగాడు, కొద్దిగ వర్షము వచ్చినది వెంటనే వచ్చి లోపల పడుకున్నావని చెప్పారు. జరిగినది వాస్తవమే నీకాళ్ళు నడచినవి. చేతులు కప్పుకున్న గుడ్డలు తీసుకున్నవి. లోపలికి వచ్చి పడుకోవడము జరిగినది. ఇవన్ని తెలియక జరిగాయి. ఈ ఒక్క సంఘటన చాలు మనము మన శరీరమువేరని, మన శరీరమును నడిపించి పనిచేయించు శక్తి వేరొకటున్నదని సులభముగ తెలియగలదు. అప్పటికీ తెలియకపోతే నీవెటువంటివాడవంటే! అపుడపుడు అడిగినపుడు నీకు కావలసిన అన్నము, కూరలు పెట్టినంతమాత్రమున ప్రక్కింటావిడను నీ భార్యగ అనుకోవడము ఎంత తప్పో, నీకవసరమైనపుడు అనుకూలముగ కదిలిన అవయములకు నీవే అధిపతివనుకోవడము కూడ అంతే తప్పగును. ప్రక్కింటావిడకు భర్తవున్నట్లు నీ అవయవములను ఆడించు భర్త ఒకడున్నాడు. ఆ స్థానము నాదేననుకోవడము పొరపాటు.

మన శరీరములో నూటికి ముప్పయి పాళ్ళు పనులు తెలిసి జరుగుచున్నవి. డెబ్బయి పాళ్ళు తెలియక జరుగుచున్నవని తెలిసినవాడు, తెలిసీ తెలియక జరిగెడి పనులకు తాను కారణముకాదని, అవి జరుగుటకు కర్మేకారణమని తెలిసినపుడు వాడు నిజమైన కర్మయోగి అగును. జరిగెడి పనులలో కర్మలు వానిని అంటవు. యోగము చేత ఏర్పడు అగ్నికి అవి కాలిపోవును.

*(4) శ్లో॥ 11 : కాయేన మనసా బుద్ధ్యా కేవలైరింద్రియైరపి ।*
*యోగినః కర్మ కుర్వన్తి సంగమ్ త్యక్త్వాஉஉత్మ శుద్ధయే ॥*
*(కర్మయోగము)*

*(4) శ్లో॥ 12 : యుక్తః కర్మఫలం త్యక్త్వా శాంతి మాప్నోతి నైష్ఠికీమ్ ।*
*అయుక్తః కామ కారేణ ఫలే సక్తోనిబధ్యతే ॥*
*(కర్మయోగము)*

**భావము :** శరీరము, మనస్సు, బుద్ధి ఇంద్రియముల చేత జరిగెడి పనులకు సంగమము లేకుండ, ఆత్మశుద్ధియే ఆశయముగ కర్మఫలములందుకాంక్ష మానిన

కర్మయోగి పనులు చేయుచున్నను శాంతి పొందును. కర్మయోగికానివాడు కోర్కెలను మానుకోలేక బంధనములో (కర్మలలో) చిక్కుచుండును.

(4) శ్లో॥ 13 : సర్వ కర్మాణి మనసా సన్న్యస్యాస్తే సుఖం వశీ ।
నవద్వారే పురే దేహీ నైవ కుర్వన్న కారయన్ ॥
(కర్మయోగము)

**భావము :** మనసుచే సన్న్యసించి, కర్మకార్యములను తన నవద్వారపుర దేహమునకు విడిచి, కార్యకర్త కాక యోగి సుఖముగ నివశించుచుండును.

(4) శ్లో॥ 14 : నకర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః ।
న కర్మ ఫల సంయోగం స్వభావస్తు ప్రవర్తతే ॥
(ప్రకృతి)

**భావము :** భూమిమీద కర్మములనుగాని, కార్యములనుగాని, వాటి ఫలితములందు ఆశనుగాని ఆత్మ ఎవనికి కలుగజేయదు, ప్రకృతి స్వభావము చేతనే అవి కల్గుచుండును.

**వివరము :** స్వధర్మము పరధర్మమును చెప్పినపుడే ఆత్మధర్మము వేరని, ప్రకృతి ధర్మము వేరని చెప్పాము. పరధర్మమైన ప్రకృతి మన శరీరమంతా ఇమిడివున్నది. దాని స్వభావము చేతనే సర్వము జరుగుచున్నవి. జరుగుచున్నవాటిని ఆత్మ సాక్షిగ చూస్తున్నది కాని, ఆత్మ దేనిని కలుగజేయలేదు.

(4) శ్లో॥ 15 : నాదత్తే కస్యచి త్పాపం న చైవ సుకృతం విభుః ।
అజ్ఞానే నావృతం జ్ఞానం తేన ముహ్యన్తి జన్తవః ॥
(ప్రకృతి)

**భావము :** ఎవని పాపముకాని, ఎవని పుణ్యముకాని ఆత్మ తొలగింపదు. అజ్ఞానము చేత జ్ఞానము కప్పబడివున్నది. దానిచేత ధరణిలో జనులు భ్రమిస్తున్నారు.

**వివరము :** ఎవడు ఎంత యోగమాచరిస్తే అంత కర్మ కాలిపోవునని ముందే

చెప్పుకొన్నాము. ఆత్మ ఎవని కర్మను తొలగించదు. తొలగించుకోవడమేదో ఎవనికొద్ది వాడు చేసుకోవలసిందే. అదియును యోగపద్ధతి ద్వారానే సాధ్యమగును. అట్లుకాక అజ్ఞానులు మేము ఎన్నో ఆరాధనలు చేస్తున్నాము, మా పాపమును దేవుడు తీసివేస్తాడనుకోవడము పరిపాటిగవుంది. ఉదయము నుంచి పాపము పనులు చేసి సాయంకాలము నమస్కరిస్తే దేవుడు క్షమిస్తాడని కొందరనుకొంటారు. మరికొందరు మేము చేసిన పాపములు పోయి మాకు లాభము చేకూర్చమని కదా మేము వేల డబ్బు ఖర్చుపెట్టి పూజలు చేయిస్తున్నాము అంటున్నారు. అజ్ఞానము జ్ఞానమును కప్పివేయడము వలన, భూమిమీద పాపముల నివృత్తి కోసము అనేక ఆరాధనలు ఏర్పడి, అవి చేయువారికి దేవుడు పాపము లేకుండ చేస్తాడని భ్రమింప జేయుచున్నవి. వాస్తవానికి ఇవన్నియు మానవుడు భ్రమతో చేయుచున్నవని తెలియాలి.

(4) శ్లో॥ 16 : జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశిత మాత్మనః ।
తేషా మాదిత్యవద్ జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్ ॥
(ఆత్మజ్ఞానము)

**భావము :** జ్ఞానముచేత ఎవరి అజ్ఞానమంతయు లేకుండపోవునో, అట్టివారికి జ్ఞానము సూర్యునివలె ప్రకాశిస్తు వారికున్న భ్రమలన్ని తొలగిపోవును.

**వివరము :** ఆరాధిస్తే పాపములు పోతాయని భ్రమించువారికి ఆత్మజ్ఞానము కల్గుటచే, వారికున్న అజ్ఞానమంతయు తొలగిపోయి జ్ఞానచూపు కలుగుట వలన, కర్మలు పోవు మార్గము బాగా కనిపించును. అంతవరకు వారికున్న అంధత్వము తొలగిపోవును. స్వచ్ఛమైన జ్ఞానదృష్టి చేత పాపములు పోవుటకు యోగమార్గము తప్ప వేరులేదని, అది తన మీదనే ఆధారపడివున్నదని తెలియును. తెలిసిన తర్వాత యోగమార్గమున ప్రయాణించుటకు ప్రయత్నించును.

(4) శ్లో ॥ 17 : తద్బుద్ధయ స్తదాత్మానః స్తన్నిష్ఠా స్తత్పరాయణాః ।
గచ్ఛన్త్య పునరావృత్తిం జ్ఞాన నిర్ధూత కల్మషాః ॥
(బ్రహ్మయోగము)

**భావము :** ఆత్మయందు ధ్యాసకల్గి, మనోబుద్ధి నిష్ఠలన్నియు ఆత్మయందే నిలిపి, యోగమాచరించువారు జ్ఞానాగ్నిచేత కల్మషములన్నియు కాల్చివేయబడినవాడై జన్మలులేని మోక్షము పొందును.

**వివరము :** ఆత్మజ్ఞానము కల్గినవాడు తన పాపపుణ్యములెలా పోవునో తెలిసిన వాడై, బ్రహ్మయోగమాచరించవలెనని తలంపు కల్గి తన మనస్సును బుద్ధిని ప్రక్క ధ్యాసలకు పోనీయక ఉంచుట వలన లభించునది ఆత్మప్రాప్తియని గ్రహించి, ఆ విధముగనే ఆచరించి అతని కర్మనంతయు నాశనము చేసుకొని తిరిగి పుట్టనటువంటి స్థితిని పొందును. అట్టి బ్రహ్మయోగము నాచరించు వాని అనుభూతులెట్లుండుననగా!

(4) శ్లో 18 : విద్యా వినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని ।
శుని చైవ శ్వపాకేచ పండితాః స్సమదర్శినః ॥
(బ్రహ్మయోగము)

**భావము :** విద్యయు వినయము కల్గు విప్రులందును, గోవులందును, ఏనుగు లందును, కుక్కలందును, కుక్కలను తిను చండాలునియందును పండితుల దృష్టి సమముగా ఉండును.

**వివరము :** ఈ శ్లోకములో ఉచ్ఛము, నీచము, మధ్యము, మూడు చెప్పి వాటిని సమానముగ చూచువారు యోగి అని చెప్పారు. మనుషులలో ఉచ్ఛము బ్రాహ్మణులను, నీచము కుక్కమాంసమును తిను చండాలుడని చెప్పడమైనది. అట్లే జంతువులలో ఉచ్ఛమమైన ఆవును, మధ్యమమైన ఏనుగును, నీచమైన కుక్కను చెప్పడమైనది. ఈ విధముగ ఉచ్ఛ నీచ జీవరాసులలోను, మధ్యమమైన వాటిలోను, ఆత్మ సమానముగ ఉన్నదని బ్రహ్మయోగి గ్రహించగలడు. ముందు తన శరీరములో ఆత్మను చూచినవారు మిగతా శరీరములలో ఎట్లున్నది తెలియగలరు. తన శరీరములో ఆత్మ ఎట్లున్నదో, ఎక్కడ ఉన్నదో, ఎంత ఉన్నదో, ఏమి చేయుచున్నదో తెలిసినవారు మిగత అన్ని ఉచ్ఛనీచ శరీరములలో కూడ తన శరీరములో ఉన్నట్లే తలచి, తన శరీరములో

ఎక్కడుందో అక్కడే ఉన్నదని, తనయందెంతున్నదో అంతే ఉన్నదని, తనయందేమి చేయుచున్నదో అదే పని చేయుచు సమానముగ ఉన్నదని తెలుసుకోగలరు. అందువలన బ్రహ్మయోగి ఏ జీవరాసిని చూచిన దానియందున్న ఆత్మను తన ఆత్మవలె తలంచును.

కొందరేమో ఉచ్ఛనీచములు తలచకుండ రెంటిని సమానముగ ఆదరించ వలెనని, అదే సమత్వమని చెప్పారు. అది బాహ్య ఆదరణే అగును. అలాగైతే ఆవును ఆదరించినట్లు కుక్కను ఆదరించగలము కాని, వానపామును ఆదరించినట్లు నాగుపామునాదరించలేము. జింకను దగ్గరకు తీసుకున్నట్లు పులిని దగ్గరకు తీసుకోలేము. ప్రకృతి సహజత్వము వలన వాటి గుణములు, నడవడిక వేరు వేరుగ ఉండును. అందువలన మనము పొరపాటుగ ఒకటిగ చూచిన అవి అట్లుండవు. కావున మనము వాటి ప్రకృతి సహజత్వమును వదిలి వాటిలోని ఆత్మయొక్క సహజత్వమును చూడాలి. అన్నింటియందు పరధర్మములు ఎలా ఉన్నా స్వధర్మము మాత్రము ఒక్కటేనని గ్రహించవలెను.

(4) శ్లో॥ 19 : ఇహైవ తైర్జితః సర్గో యేషాం సామ్యే స్థితం మనః ।
నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాద్బ్రహ్మణి తే స్థితాః॥
(బ్రహ్మయోగము)

**భావము :** ఎవని మనస్సు సర్వ జీవరాసులందు సమత్వమును గ్రహించునో, అతడు ఇహమందే సంసార సముద్రమును దాటినవాడగుచున్నాడు. నిర్దోషమైన అందరియందు సమముగ గల ఆత్మను తలంచుటవలన వాడు ఆత్మను పొందును.

**వివరము :** ఇక్కడ కొంత లోతుగ యోచించాలి. బ్రహ్మయోగమాచరించి ఆత్మను తెలిసి, అది అందరియందు ఒకే విధముగ ఉన్నదని గ్రహించుట వలన, ఆ జన్మలోనే మోక్షము వచ్చినట్లు తలచకూడదు. మోక్షము రావాలంటే కర్మ నిశ్శేషముగ పోవాలి. కర్మ నిశ్శేషముగ పోవాలంటే కొన్ని జన్మలు పట్టును. ఇక్కడ

బ్రహ్మయోగమున ఇహమునందే సంసారమును జయించినవాడగును, అనుటలో దేహము ఉన్నట్లే మరియు మరణించకనే శరీరములో జీవుడు ఉన్నట్లే యోగ సమయములో బయటి ప్రపంచముతో సంబంధము లేకుండ పోవుచున్నాడు. కనుక వాడు ఆ సమయములో జగతిలో కర్మను జయించినట్లే వాడు ఆత్మను పొందుచున్నాడు. కాని పరమాత్మను పొందలేదని గ్రహించాలి. పరమాత్మను పొందిన వానికి పునర్జన్మవుండదు. ఆత్మను పొందినవాడు జన్మనే స్థంభింపచేసినంత యోగ్యతను పొందినట్లు కనిపించును. ఆత్మనే పొందివున్నాడు కనుక జన్మ తప్పదు. ఆ జన్మలోనే కర్మ అయిపోయినట్లయితే పరమాత్ముని చేరి మోక్షము పొందగలడు. బ్రహ్మయోగి యోగములో ఎట్లుండునది క్రింది శ్లోకములో చెప్పుచున్నాడు.

(4) శ్లో॥ 20 : నప్రహృష్యేత్ప్రియం ప్రాప్య నోద్విజేత్ ప్రాప్య చాప్రియం ।
స్థిరబుద్ధి రసమ్మూఢో బ్రహ్మవిద్బ్రహ్మణి స్థితః ॥
(బ్రహ్మయోగము)

**భావము :** బ్రహ్మవిదుడు తన అజ్ఞానమునంతయు వదిలి బుద్ధిని ఆత్మయందే నిలుపును. వానికెంత సంప్రీతి కల్గిన సంతోషపడడు. అట్లే ఇష్టములేనిది కల్గిన బాధపడడు.

**వివరము :** బ్రహ్మయోగము ఆచరించునపుడు వాని మనస్సు బయటి విషయములను సేకరించక కదలకుండా ఉండి, మనోదృష్ఠియంతయు ఆత్మ మీద కేంద్రీకరించి, ఆత్మయొక్క అనుభవము ఏమిటో, దాని సమాచారము ఏమిటో గ్రహించి బుద్ధికి తెలియజేయుచుండును. బుద్ధియు ఆత్మ విషయములను మనస్సు ద్వారా గ్రహించి గ్రహించిన దానిని జీవునకు అందిస్తున్నది. జీవుడు మనస్సు చూపిన విషయమునే బుద్ధి ద్వార చూస్తూవుండును. మనస్సు బాహ్య విషయములను తెచ్చిపెట్టినపుడు వాటిని గుణములతో యోచించుట బుద్ధిపని. ఇప్పుడు మనస్సు గుణములతో సంబంధములేని లోపలి ఆత్మ విషయమును తెచ్చినది కావున గుణములతో సంబంధములేకుండ బుద్ధి యోచిస్తున్నది. మనస్సు బుద్ధికి ఏ విషయమును

అందించిన దాని అనుభూతిని పొందడము జీవుని పని. ఇప్పుడు యోగ సమయములో బయటి విషయములైన ప్రకృతి విషయములను కాక లోపలి ఆత్మ విషయమును మనస్సు తెచ్చినది కనుక దానినే జీవుడు అనుభవిస్తున్నాడు. ఈ విధముగ బుద్ధికి, మనస్సుకు, జీవునకు లోపలి విషయమైన ఆత్మ ధ్యాసయే సరిపోయినది. బయటి ధ్యాస ఏమాత్రము లేదు. కావున బయట ఎంత సంప్రీతి కల్గిన అట్లే ఎంత అసంప్రీతి కల్గిన దానిని గ్రహించు స్థితిలో లేడు. అటువంటప్పుడు వానికి సంప్రీతిలో సంతోషము గాని, అసంప్రీతిలో దుఃఖముగాని రెండు లేవు. యోగనిష్టలో ఉన్నపుడు మణులు, బంగారము వాని ముందర పెట్టి నీకేనని చెప్పిన అతడు సంతోషించలేడు.

*(4) శ్లో ॥ 21 : బాహ్య స్పర్శే ష్వసక్తాత్మా విన్దత్యాత్మనియస్సుఖమ్ ।*
*సబ్రహ్మ యోగ యుక్తాత్మా సుఖ మక్షయ మశ్నుతే ॥*
*(బ్రహ్మయోగము)*

**భావము :** బాహ్యస్పర్శ శబ్దాదులందు సంబంధపడక అంతరాత్మలోనే సుఖము పొందునతడు బ్రహ్మయోగి అనబడును. వానికి అక్షయమైన సుఖము కలుగును.

**వివరము :** బ్రహ్మయోగమాచరించు యోగి ఆత్మానందము పొందును. ఆ అనుభూతి ఆ యోగికి మాత్రమే తెలియును. దానిని బయటికి చెప్పుటకు వీలులేదు. అక్షయమైన ఆత్మను పొందుటవలన అక్షయమైన సుఖము కలుగుచున్నది. తన శరీరములో ఉన్నది ఒకటే ఆత్మ. యోగి అనుభవించునది ఒకే సుఖము. ఎప్పుడు యోగము ఆచరించిన అదే సుఖము పొందును. అందులో ఏ తేడా ఉండదు. అక్షయ సుఖము అంటే ఎడతెరపిలేకుండా ఎల్లవేళల జీవితాంతము వరకు ఉండునదని అనుకోకూడదు. ఎంతసేపు యోగములో ఉండునో అంతసేపు అక్షయసుఖము ఏర్పడును. అంతేగాని యోగములో లేని సమయములో బాహ్య ప్రపంచములో ఉన్నప్పుడు కూడా ఆ సుఖమే ఉండుననుకోకూడదు.

(4)శ్లో॥ 22 : యే హి సంస్పర్శజా భోగా దుఃఖ యోనయ ఏవతే ।
ఆద్యన్తవన్తః కౌన్తేయ నతేషు రమతే బుధః ॥
(బ్రహ్మయోగము)

**భావము :** బాహ్యేంద్రియములనుండి పుట్టు సుఖములు దుఃఖహేతువులు. అవి వచ్చుచు పోవుచువుండును. వాటిని జ్ఞానులు లెక్కచేయరు. మరియు వాటి వలన సంతోషింపరు.

(4)శ్లో॥ 23 : శక్నోతీ హైవ యస్సోఢుం ప్రాక్చరీర విమోక్షణాత్ ।
కామ క్రోధోద్భవం వేగం సయుక్త స్సుఖీ నరః ॥
(బ్రహ్మయోగము)

**భావము :** శరీరమును విడువక మునుపే కామ క్రోధములు వాటి వేగమును లేకుండ చేసి శాంతము దాల్చు సమర్థుడెవడో వాడే బ్రహ్మయోగయుక్తుడు, వాడే ఆత్మ సుఖము పొందువాడు.

(4)శ్లో॥ 24 : యోఽన్త సుఖోఽన్త రారామ స్తథాఽన్త ర్జ్యోతి రేవ యః ।
స యోగీ బ్రహ్మ నిర్వాణం బ్రహ్మ భూఽతో ధి గచ్ఛతి ॥
(బ్రహ్మయోగము)

**భావము :** ఎవడు అంతరమున సుఖము పొందుచున్నాడో, అంతరమున ఆత్మారాధన చేయుచున్నాడో, ఎవని లోపల జ్ఞానాగ్ని జ్యోతివలె వెలుగుచున్నదో అట్టివాడు బ్రహ్మయోగియై బ్రహ్మమునే పొందును.

(4) శ్లో॥ 25 : లభన్తే బ్రహ్మ నిర్వాణ మృషయః క్షీణ కల్మషాః ।
ఛిన్న ద్వైధాయతాత్మాన స్సర్వభూత హితే రతాః ॥
(బ్రహ్మయోగము)

**భావము :** సర్వభూత హితము సల్పుచున్నవాడై, పాపము క్షీణింప చేసుకున్న వాడై

సంశయము లేకుండ చేసుకొన్నవాడై, ఎవడు ఉన్నాడో వాడు బ్రహ్మయోగియై ఆత్మ స్థానము పొందుచున్నాడు.

*(4)శ్లో॥ 26 : కామ క్రోధ వియుక్తానాం యతీనాం యతచేతసామ్ ।*
*అభితో బ్రహ్మ నిర్వాణం వర్తతే విదితాత్మనామ్ ॥*
*(బ్రహ్మయోగము)*

**భావము :** కామమును, క్రోధమును వీడగల్గువాడు, జ్ఞానముచే ఇంద్రియములను నిగ్రహించినవాడు, భూమిమీదనే ఆత్మస్థానము పొందియున్నాడు.

*(4)శ్లో॥ 27 : స్పర్శాన్ కృత్వా బహిర్బాహ్యాం శ్చక్షుశ్చైవాంతరే భ్రువోః ।*
*ప్రాణాపానౌ సమౌకృత్వా నాసాభ్యన్తర చారిణౌ ॥*
*(బ్రహ్మయోగము)*

*(4)శ్లో॥ 28 : యతేంద్రియ మనోబుద్ధిర్ముని ర్మోక్ష పరాయణః ।*
*విగతేచ్ఛా భయక్రోధో యస్సదాముక్త ఏవసః ॥*
*(బ్రహ్మయోగము)*

**భావము :** బాహ్య శబ్దాది ఇంద్రియ విషయములను వదలి, కనుబొమ్మల మధ్యలో మనోదృష్టినివుంచి, ముక్కురంధ్రములలో సంచరించు ఉచ్ఛ్వాస నిచ్ఛ్వాసములను సమానముగ నిలిపివేసి, స్వాధీనపడిన ఇంద్రియములు కలవాడై, మనస్సుచే రాగభయ ద్వేషములను వదలి, మోక్షమే పరమాశయముగ తలచుచు బ్రహ్మయోగులు సదా ఆత్మను అనుభవించుదురు.

**వివరము :** మనస్సుకు దృష్టి కలదు. దానినే మనోదృష్టి అనగలము. అట్లే చెవులకు, నాలుకకు, చర్మమునకు కూడా దృష్టికలదు. వంటలో ఉప్పు ఎంత ఉన్నది చూచి చెప్పుతామనుట వినియే ఉంటాము. ఆ మాటను బట్టి నాలుకకు రుచిని చూచు దృష్టి ఉన్నదని తెలియుచున్నది. అట్లే ఐదు జ్ఞానేంద్రియములకు చూపు కలదనియే చెప్పవచ్చును. వాటి చూపు వలననే ప్రపంచములోని

విషయములను అవి చూడగల్గి ఆ చూచిన విషయమును మనస్సుకు చూపితే మనస్సు బుద్ధికి చూపును. బ్రహ్మయోగములో బాహ్య జ్ఞానేంద్రియములైన ఐదింటిని చూడకుండా చేసి, వాటి విషయములను మనస్సుకు తెలియకుండా చేసి, అనగా మనోదృష్ఠిని వాటినుండి మరలించి కనుబొమ్మల మధ్యలో తల లోపలి భాగమున చూచినపుడు ఏమి కనిపించకపోవును. ఇది సాధన పొందిన యోగి యొక్క విషయము. ఏది కనిపించని స్థితిలో ఉన్నదేదో మనస్సు చూస్తు, బుద్ధి గ్రహిస్తుండి పోవును. ఎప్పుడైతే మనస్సు బయటి విషయముల మీదలేదో అప్పుడు ముక్కు రంధ్రములలోని శ్వాస కూడ క్రమేపి తక్కువై ఉన్నదా లేదా అనిపించును. అటువంటి సమయములో ఆత్మయేదో దానిని మనస్సు చూస్తూవుండి బుద్ధికి తెలియపరుస్తున్నది. ఆ అనుభవమును మనోబుద్ధుల ద్వారా జీవుడు అనుభవిస్తున్నాడు. ఈ బ్రహ్మయోగ పద్ధతి తెలిసినవాడు ఎల్లప్పుడు ఆ పద్ధతిలోనే ఉండగల్గి ఆత్మానుభవమును పొందుచున్నాడు. అట్లు చేయుట వలన వానిలోని సంచితకర్మ కాలిపోయి మోక్షము పొందుటకు అర్హుడగును.

*(4)శ్లో॥ 29 : భోక్తారం యజ్ఞ తపసాం సర్వలోక మహేశ్వరం ।*
*సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వామాం శాన్తి మృచ్ఛతి ॥*
*(ఆత్మ)*

**భావము :** యజ్ఞ తపములు స్వీకరించువాడనై, సర్వ గుణములకు మహేశ్వరుండనై, సర్వ జీవరాసులకు సుహృదయుడైన నన్ను తెలుసుకొనుట వలన నరుడు శాంతి చెందగలడు.

**వివరము :** శరీరములో జరుగు యజ్ఞ తపస్సులకు అధిపతి ఆత్మ. అట్లే సర్వ లోకములకు అధిపతి ఆత్మ. ఇచ్చట లోకములను మాటకు గుణములని అర్థము చేసుకోవాలి. ఉదాహరణకు ఒక గురువు శిష్యుని **'లోకము ఎట్లున్నది శిష్యా!'** అనగా శిష్యుడు జవాబుగా **'ఎవని లోకము వానిది గురువుగారు'** అన్నాడట. ఎవని గుణములలో వాడు ఉన్నాడని శిష్యుని జవాబు. ఇంకను త్రిలోకములని పెద్దలు

చెప్పుట వినియే ఉందుము. ఊర్ధ్వ, మధ్య, పాతాళ లోకములు అనుట కూడ వినియే ఉందుము. మూడు లోకములు అనగ మూడు గుణములని తెలియాలి. అట్లే ***ఊర్ధ్వలోకము అనగ సాత్త్వికగుణము అనియు, మధ్యలోకము అనగా రాజస గుణమనియు, పాతాళము అనగా తామసమని తెలియాలి.*** మూడు లోకములకు అనగా మూడు గుణములకు అధిపతి మధ్యలోవున్న ఆత్మయని తెలియాలి. అట్లు మూడు గుణములను వదలి వాటిమధ్యలో అధిపతిగా ఉన్న ఆత్మను తెలియుట చేత నరుడు శాంతిని పొందుచున్నాడు. శరీరములో గుణములులేని ప్రశాంత కాలమును శాంతి అనుచున్నాము.

ఇంతటితో కర్మసన్యాస యోగము అను ఈ అధ్యాయము సమాప్తమైనది. ఈ అధ్యాయములోని శ్లోకముల వివరము క్రింద వ్రాయబడినది.

| | | | |
|---|---|---|---|
| 1) | కర్మయోగము, బ్రహ్మయోగము | = | 5 |
| 2) | కర్మయోగము | = | 7 |
| 3) | బ్రహ్మయోగము | = | 13 |
| 4) | ప్రకృతి | = | 2 |
| 5) | ఆత్మ | = | 1 |
| 6) | ఆత్మజ్ఞానము | = | 1 |
| మొత్తము శ్లోకములు | | = | 29 |

భావము, వివరము మార్చి వ్రాసిన శ్లోకములు - 6, 18.

*****

## ఐదవ అధ్యాయము

# ఆత్మ సంయమ యోగము

**శ్రీ భగవంతుడిట్లనియె :-**

(5) శ్లో॥ 1 : అనాశ్రితః కర్మఫలమ్ కార్యం కర్మకరోతి యః ।
స సన్న్యాసీ చ యోగీ చ న నిరగ్ని ర్నచాక్రియః ॥
(కర్మ యోగము)

**భావము :** కర్మఫలమును ఆశ్రయింపక కార్యములు చేయవలెనని తలచి ఎవడు చేయునో వాడే నిజమైన సన్న్యాసి, నిజమైన యోగి. అగ్నిలేనటువంటివాడు, పనులు మానుకొన్నవాడు యోగికాడు మరియు సన్న్యాసి కాడు.

**వివరము :** యోగిని సన్న్యాసి అనియు, సన్న్యాసిని యోగి అనియు పిలువవచ్చును. సన్న్యాసి అనిన యోగి అనినా రెండు ఒకే అర్థమని తెలియాలి. ఈ అధ్యాయములో మొదటనే సన్న్యాసి అంటే ఎవరని అర్థమగులాగున భగవంతుడు చెప్పాడు. నిత్య జీవితములో బ్రతుకుతెరువు కోసము ఎందరో ఎన్నో పనులను చేయుచున్నారు. దీనికి సమతగా **'కూటి కొరకు కోటి పనుల'**న్నారు. ఎన్నో పనులతో కూడుకొన్న మన జీవితములో అన్ని పనులు మంచివి ఉండవు, అట్లే అన్ని పనులు చెడ్డవి ఉండవు. పనులు మంచివైన చెడువైన మనమెందుకు చేస్తున్నాము అనుకుంటే, పనిచేయుట వలన దానికింత కూలియను ప్రతిఫలితముండును. ఒక రోజు పనిచేయుట వలన 100 రూపాయలు ప్రతిఫలితము వస్తున్నదనుకొందాము. ఇలా ఒక్కొక్కరి పని వేరు మరియు ఫలితము వేరుగ ఉండును. రోడ్డు ప్లాన్ వేయు ఇంజనీరుకు ఒక ఫలితము, అదే రోడ్డుపని చేయువానికి ఒక ఫలితముండును. ఒక మనిషికి రోజుకు కొంత కంటికి కనిపించు ఫలితమున్న విషయము అందరికి తెలిసినదే.

అందరికి తెలియని విషయము కూడ ఒకటున్నది. అదేమనగా! మనిషి చేయు ప్రతి పనిలోనూ కంటికి కనిపించని ఫలితము కూడ ఒకటి ఉన్నది. కంటికి కనిపించు ఫలితము డబ్బురూపముగా, కనిపించని ఫలితము కర్మ రూపముగ ఉన్నది. కర్మ కనిపించనిది కావున ఏ పనిలో ఎవనికెంత కర్మవచ్చునది చెప్పలేము. బయటి ఫలితములను సంపాదించుకొన్న దానిని బట్టి వాడు ఇంత ధనికుడు, వీడు ఇంత పేదవాడు అని చెప్పవచ్చును. కనిపించని ఫలితమైన కర్మను బట్టి ఎవడెంత కర్మపరుడో చెప్పలేము. దీనినంతటిని బట్టి మండుచున్న అగ్నికి క్రింద కనిపించు కట్టెలు పైన కనిపించని గాలి తగులుకొని ఉన్నట్లు, జరుగుచున్న పనికి ఒక ప్రక్క కనిపించు ఫలితము మరియొక ప్రక్క కనిపించని ఫలితము ఉన్నది. రూపాయి బిళ్లకు బొమ్మ బొరుసులాంటిదే కార్యమునకు కనిపించు, కనిపించని ఫలితములని తెలియాలి. మనకు తెలియని మరొక విషయమొకటి ఉన్నది. అదేమనగా! చేయుచున్న పనిలో కంటికి కనిపించని కర్మను లేకుండా చేసుకోవడము. చేసిన పనికి కూలి రూపాయలుగ తీసుకొంటే బొమ్మ బొరుసు రెండు రూపములు ఉండును. వేరే ధాన్యరూపముగానో, వస్తురూపముగానో తీసుకొంటే దానికి ఒక రూపము తప్ప రెండు రూపములు ఉండవు. అట్లే కనిపించు ఒక ఫలితము తప్ప కనిపించని రెండవ ఫలితములేని కార్యములు, వాటిని చేయు విధానము కూడ ఉన్నదని భగవంతుడు తెలియజేశాడు. అది ఎట్లనగా! ఒక కార్యము జరుగునప్పుడు కర్మ ఎలా తగులుకొనుచున్నదో మొదట తెలుసుకోవాలి. తర్వాత కర్మ అంటని విధానమును తెలుసుకోవచ్చునన్నాడు. ఇదంతయు ఇతర దేశాలకు పోయి తెలుసుకోవల్సినది కాదు, మన దేహమునందే తెలుసుకోతగినది. కావున చాలా సులభముగా ఉండును. ఒక కార్యము చేయునప్పుడు ఆ కార్యము జరుగుటకు కారణము ఏమిటని మొదట తెలుసుకొందాము. గత జన్మల సంచితకర్మ ప్రస్తుతమున్న జన్మలో ప్రారబ్ధకర్మయై నిత్యము అనుభవమునకు వస్తుండును. ఒక కార్యము జరగాలంటే ఆ ప్రారబ్ధమే మొదటి కారణము. ప్రారబ్ధము ప్రకారము ఒక విషయము మొదట మనస్సుకు జ్ఞప్తికి వచ్చును. ఆ విషయమును వెంటనే బుద్ధి గ్రహించి, ఆ సమయమునకు

అందుబాటులో ఉన్న గుణములతో యోచించును. గుణములు రెండు రకములుగా ఉన్నవి. కావున బుద్ధి యొక్క యోచన కూడ రెండు రకములుగా ఉండును. ఒక రకము యొక్క గుణముల ప్రకారము బుద్ధి యోచన ఆ విషయము యొక్క పని చేయమని సూచిస్తే, రెండవ రకము యొక్క గుణముల ప్రకారము ఆ పని చేయవద్దు అని బుద్ధి సూచిస్తుంది. ఇట్లు అందులో లాభముంటుందని ఒక రకము, అందులో లాభము ఉండదని మరొక రకము, ఇది మంచి పనేనని ఒక రకము అంటే, దానికి వ్యతిరేఖముగా ఇది చెడు పనేయని మరొక రకము చెప్పుచుండును. ఇట్లు అన్ని రకములుగా యోచన చేయడమే బుద్ధియొక్క కర్తవ్యము. అట్లు యోచన చేయబడిన విషయమును వెంటనే ప్రక్కనే ఉన్న చిత్తము గ్రహించి ఆ పని చేయమనో, చేయవద్దనో ఏదో ఒక దానిని నిర్ణయించును. అట్లు నిర్ణయించడమే చిత్తము యొక్క పని. ఆ నిర్ణయము ఏదియైన చిత్తము తన ఇష్టానుసారము చేయదు. అది ఒక ఆధారముతోనే నిర్ణయము చేయును. ఆ ఆధారము ఏమిటనగా! అప్పటి ప్రస్తుత ప్రారబ్ధకర్మ ఏది జరుగవలెనని చూపిస్తున్నదో, దానినే చిత్తము చిత్తగించి, ఆ విషయమును అమలు చేయవలసిన విధానమును మనస్సుకు తెలియజేయును. మనస్సు వెంటనే ఆ విషయమును శరీర బాహ్యేంద్రియములకు చేర్చును. మనస్సు ఆదేశించినట్లు శరీర అవయములు పనిచేయును. ఇదంతయు ఒక కార్యము జరుగుటకు నిర్ణయింపబడిన శరీర యంత్రాంగమని తెలియాలి. ప్రారబ్ధకర్మ కార్యరూపమౌటకు మనస్సు, బుద్ధి, చిత్తము, శరీర అవయవములు పది మొత్తము 13 పాత్రధారులై ఉన్నవి.

ఒక కార్యము జరుగునప్పుడు శరీర యంత్రాంగమెలా ఉన్నదో గ్రహించాము కదా! ఇందులో జీవుని పాత్ర ఏమిలేదు. జీవుడు సాక్షిగా చూస్తూవుండువాడే, ప్రారబ్ధకర్మ అమలుకు రావడములో మనస్సు, బుద్ధి, చిత్తము వాటివాటి పనిచేయు చున్నప్పుడు జీవుడు కూడ అక్కడే ఉన్నాడు. కనుక ఆ విషయమంతయు జీవునికి తెలుస్తూనే ఉండును. అట్లే ఒక దాని విషయము మరొక దానికి తెలుస్తూనే ఉండును.

శరీరములో జీవుడు, మనస్సు, బుద్ధి, చిత్తము, అహము అను ముఖ్య అంతరంగములైన వాటిలో కర్మ కార్యరూపమౌటకు మనస్సు, బుద్ధి, చిత్తము మూడు మాత్రమే పాత్రధారులై ఉండగ జీవాత్మ, అహము ఏమాత్రము సంబంధము లేనివై ఉన్నవి. కార్యము జరుగుటకు వీటి సంబంధము ఏమాత్రము లేదు. మనో,బుద్ధి, చిత్తముల స్పందన ప్రకారము శరీరము ద్వార కార్యము జరుగు చున్నప్పుడు ఆ కార్యములో ఉన్న బాధలుగాని, సుఖములుగాని అనుభవించు వాడు జీవాత్మ. జీవుడు శరీరములో కష్ట సుఖముల అనుభవములను పొందుటకే ఉన్నాడని తెలియాలి. ఒక సమయములో లడ్డు తినవలెనను జ్ఞప్తిరావడము, అప్పటి ఆశ గుణము ప్రకారము బుద్ధి తినమని యోచించిన దానిని చిత్తము నిర్ణయించడము, శరీరములోని చేతులు తినిపించడము, నోరు తినడము, అందులోని రుచి యొక్క అనుభూతిని నాలుక మనస్సుకు అందివ్వడము, దానిని వెంటనే మనస్సులోపలనున్న జీవునికి చేర్చడము, జీవుడు ఆ అనుభూతిని పొంది సంతోషించడము జరుగుచున్నది. ఆ విధముగనే వైద్యము ప్రకారము మందు తినవలసి వచ్చినప్పుడు, తినే మందులోని చేదును కూడ మనస్సు ద్వార అనుభవించి బాధపడవలసి వస్తున్నది. పని చేయించునది మనో, బుద్ధి, చిత్తములు కాగ సుఖ దుఃఖములు అనుభవించువాడు జీవాత్మ. ప్రారబ్ధము యొక్క ఉద్దేశ్యము జీవున్ని అనుభవింపచేయడమే కావున దానికి తగినట్లు శరీర యంత్రాంగమంతయు అమర్చి పెట్టబడినది.

ఇంతవరకు అహము యొక్క పని ఏమిటో తెలియలేదు కదా! ఇప్పుడు చూస్తాము. ఒక కార్యములో మనస్సు, బుద్ధి, చిత్తములు శ్రమించగ, జరిగిన పనిలోని అనుభవమును జీవుడు పొందుచుండగ, ప్రక్కనే ఉన్న అహము ఈ పని మొత్తమునకు నీవే అధిపతివి, నీవలననే ఈ పని జరుగుచున్నదని జీవునికి బోధిస్తున్నది. జీవుడు అహము యొక్క భావమును గ్రహించినవాడై, అనగా అహంభావుడై ఈ పనిని నేనే చేయుచున్నానని భావిస్తున్నాడు. అప్పుడు కార్యములో స్వభావముగా పుట్టిన ఆగామికకర్మ జీవుని కర్మచక్రములో చేరిపోవుచున్నది.

జీవాత్మ పాత ప్రారబ్ధకర్మను అనుభవించినవాడైనప్పటికి క్రొత్త ఆగామికకర్మ తిరిగి సంపాదించు కొన్నవాడైనాడు. అనుభవించి పాతకర్మను లేకుండా చేసుకొనగ తిరిగి క్రొత్త కర్మ వచ్చి చేరినది. ఇది సాధారణ జీవుని యొక్క నిత్యకర్మ విధానము, నిత్య కార్యాచరణలో పుట్టుకొస్తున్న నిత్య కర్మాభివృద్ధి. ఈ విధానము సర్వ జగత్తులో జీవుల ఎడల జరుగు యాంత్రిక విధానము. ఇది అంతర్ముఖముగా జరుగుచున్నది. కావున ఎవరికి తెలియకపోయినది. బాహ్యకార్యముల మీద ఉన్న దృష్ఠి అంతరంగ విధానము మీద ఏమాత్రము ఎవరికి లేదు. అందువలన కర్మ తరగడమే గాక పెరుగుచూ పోవుచున్నది. కర్మవున్నంత వరకు జన్మలు తప్పవు. కావున జీవుడు జనన మరణచక్రము నుండి బయటపడలేక పోవుచున్నాడు.

కర్మ ఎలా వస్తున్నదో తెలుసుకొన్నాము. కర్మ ఎలా రాకుండ చేసుకోవాలో కూడా తెలుసుకొందాము. ఇంతవరకు శ్లోకము యొక్క నిజార్థములోనికి మనము రాలేదు. ఇప్పుడు శ్లోకములో చెప్పబడిన విషయములోనికి వస్తున్నాము. ప్రారబ్ధము ప్రకారము కార్యములు ఎలా జరుగుచున్నవో, శరీరములోనున్న మనో, బుద్ధి, చిత్త, అహంకారముల యొక్క పనియేమో, ఏమిచేయని జీవుడు ఎందుకున్నాడో తెలుసు కొన్నాము. చివరిలోనున్న అహము కార్యమునకు కారణము నేను అను భావము జీవునకు పుట్టించుట చేత క్రొత్తకర్మను తగిలిస్తున్నదని తెలుసుకొన్నాము. కర్మ అంటుకొనుటకు కారణము అహమేనని తెలిసిపోయినది. కర్మను తగిలించడమే అహము యొక్క పనియైనపుడు, కర్మ నిర్మూలణము కూడ అహము వద్దనే ఉన్నదని తెలిసిపోవుచున్నది. అహము యొక్క మాటను జీవుడు గ్రుడ్డిగా వినడము వలననే కర్మ అంటుచున్నది. కావున జీవునకు అహమునకు ఉన్న సంబంధములోనే కర్మ అంటు సారాంశమున్నది. వాస్తవానికి కార్యములో జీవునకు సంబంధములేనప్పుడు నేనే చేయుచున్నానని జీవుడు అనుకోవడము, అహము యొక్క మాటను నిజమా కాదా అని చూడక జీవుడు గ్రుడ్డిగా నమ్మడము ఎందుకు జరుగుచున్నదని యోచించి చూచిన, జీవునకు సత్యమేది? అసత్యమేదని తెలుసుకొను విచక్షణాదృష్ఠిలేదని తెలియుచున్నది. అజ్ఞాన అంధత్వముతోనున్న జీవుడు ప్రక్కన ఉన్న అహము మీద

ఆధారపడుచున్నాడు. అహము యొక్క పని ఉన్నది లేనట్లు, లేనిది ఉన్నట్లు చెప్పడమే, కావున జీవునకు సంబంధములేని విషయమును సంబంధమేర్పరచి అహము చెప్పుచున్నది. అజ్ఞానమను గ్రుడ్డితనము గల జీవుడు అహముమీద ఆధారపడి అది చెప్పినది నిజమేనని నమ్ముచున్నాడు.

జ్ఞానదృష్ఠి కల్గిన జీవుడు అహము మీద ఆధారపడడము లేదు. కార్యమునకు కారణమూలము కర్మని, దాని ప్రేరణలో మనస్సు, బుద్ధి, చిత్తము గుణములను ఉపయోగించుకొని కార్యము చేయుచున్నవని, జీవుడైన తనకు కార్యములోని అనుభవము తప్ప ఇతరత్రా సంబంధమేమిలేదని తన జ్ఞానదృష్ఠితో తెలుసు కొనుచున్నాడు. అటువంటప్పుడు అహము యొక్క మాటను అసత్యమని త్రోసివేయు చున్నాడు. బాహ్యముగా అగ్నిమండుటకు ఆక్సిజన్ (ప్రాణవాయువు) అవసరము. అట్లే అగ్ని ఆరిపోవుటకు కార్బన్ డై ఆక్సైడ్ (బొగ్గుపులుసు వాయువు) అవసరము. ఆక్సిజన్ ఉన్నప్పుడే మంట మండగల్గుచున్నది. ఆ విధముగానే అహము పని చేయకున్నప్పుడే జ్ఞానాగ్ని మంట ప్రకాశముగా మండుచున్నది. కార్బన్ డై ఆక్సైడ్ ఉన్నప్పుడు అగ్ని ఆరిపోవునట్లు అహము యొక్క పని ఉన్నప్పుడు జ్ఞానాగ్ని మండక ఆరిపోవుచున్నది. బాహ్యాగ్ని మండుటకు ఆరిపోవుటకు వాయువు యొక్క ఆక్సిజన్, కార్బన్ డై ఆక్సైడ్‌లు కారణమైనట్లు. శరీరములో జ్ఞానాగ్ని మండుటకు ఆరిపోవుటకు అహము యొక్క వృత్తి నివృత్తులు కారణమగుచున్నవి. అహము వృత్తిగా ఉన్నప్పుడు జ్ఞానాగ్ని ఆరిపోయి కర్మలను కాల్చలేని స్థితిలోనున్నది. అప్పుడు సంభవించు ఆగామికర్మ జీవుని కర్మచక్రమును చేరుచున్నది. అహము నివృత్తి అయినప్పుడు జ్ఞానాగ్ని ప్రజ్వరిల్లి మండుచు కర్మను కాల్చు స్థోమత కల్గివున్నది. అప్పుడు సంభవించు ఆగామికర్మ జ్ఞానాగ్నిలో పూర్తి కాలిపోవుచున్నది. ఆగామికర్మ దహనమగుటకు మరియు కాకుండుటకు అహంకారవృత్తి నివృత్తుల మీద ఆధారపడివున్నది.

అహంకారము శరీరములో ఒక్కమారు కొంత సమయము లేకుండా పోయిన తర్వాత ఎప్పటికి లేకుండా పోతుందనుకోకూడదు. జీవునకు ఒకమారు

మరణమొచ్చినంత మాత్రమున వేరేచోట పుట్టడని చెప్పలేము కదా! అట్లే అహము కూడ ఒక విషయములో నివృత్తి అయినంతమాత్రమున వేరే విషయములో పుట్టదనుకోకూడదు. శరీరము ఉన్నంతవరకు అది ఉండును. అది మాటి మాటికి తన పని తాను చేయుచుండును. జ్ఞానము కల్గిన జీవుడు కూడ మాటి మాటికి దాని మాటను పెడచెవిన పెట్టుచు అహమును నివృత్తి చేయుచూనే ఉండవలెను. ఎప్పుడైతే అహమున్నదో అప్పుడు జ్ఞానాగ్ని లేదు, ఆగామికర్మ కలదు. ఎప్పుడైతే అహము లేదో అప్పుడు జ్ఞానాగ్ని వున్నది, ఆగామికర్మలేదు. అహమును బట్టి జ్ఞానాగ్ని, జ్ఞానాగ్నిని బట్టి కర్మ కలదని తెలియాలి. అహంకారమున్నప్పుడు ఆగామికర్మ ఉన్నది. అహంకారము లేనప్పుడు ఆగామికర్మ లేదు. అహంకారములేనప్పుడు జ్ఞానాగ్ని వున్నది. అహంకారము ఉన్నప్పుడు జ్ఞానాగ్ని లేదు. జ్ఞానాగ్ని ఉన్నపుడు ఆగామికర్మ కాలిపోవుచున్నది. జ్ఞానాగ్నిలేనప్పుడు ఆగామికర్మ వృద్ధి అగుచున్నది.

జ్ఞానము కల్గినవాడు, శరీర యంత్రాంగమంత తెలిసినవాడు, పని చేయునప్పుడు ప్రారబ్ధకర్మ ప్రకారము పని జరుగునని తెలిసినవాడై, ప్రారబ్ధకర్మ ప్రకారమే కనిపించు ఫలితము వచ్చునని తెలిసి చేయుచుండును. ఫలితము మీద ఆశ పెట్టుకొనక దానిని ప్రారబ్ధము ముందే నిర్ణయించివుండునని, తన ఇష్ట అయిష్టముల మీద ఫలితముండదని తెలిసిచేయుచుండును. ఈ విధముగా ఫలితము మీద ఆశలేక అంతటికి ప్రారబ్ధకర్మే కారణమని, దాని ప్రకారమే శరీర భాగములన్నియు పనిచేయుచున్నవని, శరీరములో తానొక భాగమని, తన పని కష్టసుఖములు అనుభవించడమేనని తెలిసివుండును. అట్లు తెలిసి నిమిత్తమాత్రముగ కార్యములు చేయువానిని కర్మయోగి అంటున్నాము. వానిలో జ్ఞానాగ్నివుండి ఆగామికర్మ రాకుండ కాల్చి బూడిద చేయుచున్నది. కర్మల బూడిద కల్గినవాడు కనుక సన్న్యాసి అంటున్నాము. సన్న్యాసి దగ్గర బూడిద తప్ప ఏముంటుందని మాటవరుసకు అంటుంటాము కదా! సన్న్యాసి అంటే కర్మయోగియని, బూడిద అంటే కర్మకాలినదని ఎవరు అనుకోరు. బయటికి కనిపించు బూడిద లేకున్నప్పటికి వాని దగ్గర బూడిద తప్ప ఏముంది అనడము విచిత్రమేకదా!

దీనికంటే మరొక పెద్ద విచిత్రమేమిటంటే **'నిరగ్ని' 'అగ్నిలేనివాడు'** అని పై శ్లోకములో చెప్పగ, బాహ్యముగా ఉన్న అగ్నితో యజ్ఞయాగాదులు చేయనివాడు అని అర్థము చెప్పడము మరీ విచిత్రము కాదా! జ్ఞానాగ్నికి ఎంతో చరిత్ర ఉండగ దానిని మచ్చుకైన వివరించక, బాహ్య అగ్నిని పోల్చిచెప్పడము ఏమాత్రము సమంజసమైన పనో మీరే యోచించండి. కర్మఫలము మీద ఆశలేక కార్యములు చేయువాడు నిజమైన సన్న్యాసి, నిజమైన యోగి అని శ్లోకములో చెప్పబడివున్నది. దీనికర్థము శరీర యంత్రాంగమంతయు తెలిసి, సర్వ కార్యములకు ప్రారబ్ధము కారణమని, ఫలితము కూడ దాని నిర్ణయమేనని తెలిసినవాడు, నిజమైన యోగి అని తెలియాలి. అట్లే అగ్నిలేనటువంటి వాడు, పనులు మానుకొన్నవాడు సన్న్యాసికాదు, యోగికాదు అనుటలో అర్థము జ్ఞానాగ్ని లేనివాడని, పనులు చేయుట వలన కర్మ వస్తుందని భయపడి పనులు చేయనివాడని అర్థము. పై శ్లోకములో ***'ఫలితము మీద ఆశ పెట్టుకోక కార్యములు చేయవలెనని తలచి చేయువాడు నిజమైన సన్న్యాసి నిజమైన యోగి. అగ్నిలేనటువంటి వాడు, పనులు చేయనివాడు సన్న్యాసి కాడు, యోగికాడు'*** అను విషయము వ్రాయబడిన వివరములో పూర్తి అర్థమైందను కొంటాము. దీని విషయమే క్రింది శ్లోకములో కూడా చూడుము.

*(5) శ్లో॥ 2 : యం సన్న్యాస మితి ప్రాహుర్యోగం తం విద్ధి పాండవ!*
*నహ్య సన్న్యస్త సఙ్కల్పో యోగీ భవతి కశ్చన ॥*
*(కర్మయోగము, బ్రహ్మయోగము)*

**భావము :** జ్ఞానులు దేనిని సన్న్యాసమందురో అదియే కర్మయోగమని తెలియుము. మనిషి సంకల్పరహితుడైనప్పుడే యోగము ప్రాప్తించును.

**వివరము :** పనులు చేయుచు అందులోని కర్మను సన్న్యసించిన వానిని నిజమైన సన్న్యాసియందురు. నిజమైన సన్న్యాసి యొక్క సన్న్యాసత్వము శరీరము లోపల ఉండునది. కావున బయటకు కనిపించునది కాదు. బాహ్యముగా వీడు సన్న్యాసియని గుర్తించుటకు వీలుకాదు. నిజమైన సన్న్యాసియైనవాడు నేను సన్న్యాసినని బయటికి చెప్పుకోవల్సిన అవసరము లేదు. అంతరంగములో అగ్నికల్గి కర్మను కాల్చి

సన్న్యసించువానిని కర్మయోగి అనుచున్నాము. పూర్వకాలములో జనకమహారాజు మొదలైనవారు కర్మయోగమును ఆచరించిన వారై మోక్షము పొందియున్నారు. వారు బయటికి కనిపించునట్లు ఏ గుర్తులేని నిజమైన సన్న్యాసులైవున్నారు. వారు రాజ్యమును పాలించుచు అన్ని పనులు చేయుచు యోగమాచరించిరని తెలియాలి. దీనినే కర్మయోగమంటున్నాము.

బ్రహ్మయోగమనునది మరొకటి ఉన్నది. అది బయటికి కనిపించునదై ఉన్నది. బ్రహ్మయోగము బాహ్యాచరణలన్నియు నిలిపి చేయునది. కావున పనులు ఆచరించక ఒకచోట స్థంభించి కూర్చున్న వానిని బ్రహ్మయోగి అని సులభముగా గుర్తించవచ్చును. బ్రహ్మయోగములో అంతరంగములోని మనస్సు తన సంకల్పములన్ని విసర్జించవలసి ఉన్నది. మనస్సు సంకల్ప వికల్పములులేనిదగుట వలన లోపలనున్న గుణములు ఉపయోగపడక ఉండును. బుద్ధి, చిత్తమునకు కూడ పనిలేదు. అట్లే బాహ్య శరీరమంతయు కదలక ఉండును. శరీరమును, లోపల సంకల్పమును కదలక ఉంచువాడు నేరుగా మనస్సుచేత ఆత్మను చూడగల్గుచున్నాడు. బ్రహ్మయోగికి బాహ్య ప్రపంచ దృష్టిపోయి లోపలనున్న ఆత్మదర్శనము ఏర్పడుచున్నది. ఆత్మదర్శనము కల్గుటకు సర్వసంకల్పములను వదలవలసివున్నది. అందువలన **సర్వసంకల్పసన్న్యాసి** అని పై శ్లోకములో చెప్పబడివున్నది. సర్వసంకల్పసన్న్యాసి అయినవాడు బ్రహ్మయోగి అనబడును. ఈ శ్లోకములో కర్మయోగ విధానము, బ్రహ్మయోగ విధానము రెండును చూచాయగ చెప్పబడివున్నవి.

(5) శ్లో॥ 3 : ఆరురుక్షో ర్మునే ర్యోగం కర్మ కారణ ముచ్యతే ।
యోగారూఢస్య తస్యైవ శమః కారణ ముచ్యతే ॥
(కర్మయోగము, బ్రహ్మయోగము)

**భావము :** యోగసాధనకు కారణము కర్మ అని చెప్పబడుచున్నది. యోగికి కారణము కర్మనాశనమని చెప్పబడుచున్నది.

**వివరము :** ఒక మనిషి యోగసాధన చేయుటకు కారణమైనదేది? అట్లే ఒక మనిషి యోగము చేయుటకు కారణమైనదేది? అను రెండు ప్రశ్నలకు ఇందులో జవాబు కావలసివున్నది. ప్రతిపనికి ఒక కారణముండియే తీరును. అట్లే యోగసాధనకు ఒక కారణము. యోగమునకు ఒక కారణమువున్నది. యోగసాధనకు ముఖ్యకారణము కర్మేనని శ్లోకములో చెప్పబడినది. కర్మ ఉన్నది కాబట్టి యోగము నేర్చుకోవలసి వచ్చినది, యోగమున్నప్పుడే కర్మ పోవును కనుక కర్మను పోగొట్టు కొనుటకు యోగసాధన చేయవలసి వచ్చినది. దీనిని బట్టి యోగసాధనకు కర్మే కారణమని చెప్పారు.

యోగము చేయుటకు ముఖ్యకారణము కర్మ నివృత్తేనని కూడ శ్లోకములో చెప్పారు. కర్మను కాల్చవలయును కాబట్టి యోగమాచరించవలసి వచ్చినది. ఎప్పుడైతే శరీరములో కర్మ కాలుచున్నదో అప్పుడు యోగము జరుగుచున్నది. కావున యోగమునకు కారణము కర్మ నిర్మూలణమేనని తెలియాలి. ఈ శ్లోకములో యోగసాధనవేరు, యోగమువేరని చెప్పబడుట ముఖ్యముగ గమనించవలసి ఉన్నది. యోగసాధన చేయువారందరు యోగులు కారు, యోగులు యోగసాధకులు కారు. ఇక్కడ పొరబడు అవకాశమున్నది. కావున సాధనవేరు, యోగము వేరని ఒక్కొక్క దానికి ఒక్కొక్క కారణమున్నదని చెప్పవలసి వచ్చినది. ఇది రెండు యోగములకు సంబంధించిన విషయము.

ఈ శ్లోకమునకు మిగతా గీతలలో భావము పూర్తి వేరుగ చెప్పబడివున్నది. ఏది సరియైనదో మీరే గ్రహించుకోమని కోరుచున్నాము.

*(5) శ్లో॥ 4 : యదా హి చేంద్రియార్థేషు నకర్మ స్వను షజ్జతే ।*
*సర్వ సంకల్ప సన్న్యాసీ యోగారూఢస్త దోచ్యతే ॥*
*(బ్రహ్మయోగము)*

**భావము :** ఇంద్రియ విషయములయందు, వాటి పనులయందు ఎప్పుడైతే

సంగవర్జితము ఏర్పడునో అపుడే వానిని యోగి అనియు, మరియు సర్వసంకల్పసన్న్యాసి అనియు అందురు.

**వివరము :** శరీరములో ఒక్కొక్క భాగమునకు ఒక్కొక్క ప్రత్యేకమైన పని నిర్ణయించబడివున్నది. ప్రత్యేక పనులను బట్టి శరీరమును 25 భాగములుగ విభజించడమైనది. అందులో బాహ్యముగనున్నవి 10, వాటిలో జ్ఞానేంద్రియములు ముఖ్యము. కన్నుకు చూచుట, చెవికి వినుట, ముక్కుకు వాసన గ్రహించుట, నాలుకకు రుచి తెలుసుకొనుట, చర్మమునకు స్పర్శను గ్రహించుట కార్యములై ఉన్నవి. ఇవి తమ కార్యములను మనస్సుకు తెలియజేయుచుండును. ఈ ఐదు లోపలనున్న మనస్సుకు అనుబంధమైవున్నవి. జ్ఞానేంద్రియములైదు తెలియజేసిన విషయములను లోపలనున్న బుద్ధికి తెలియజేయడము మరియు వీటిని జ్ఞప్తికి పెట్టుకోవడము మనస్సు యొక్క పనియైవున్నది. ఇంతకు ముందు జరిగిన ఇంద్రియ విషయములను మననము చేయడము ఒక పనికాగ, ప్రస్తుత ఇంద్రియ విషయములను లోపలి బుద్ధికి తెలియజేయడము రెండవ పనిగ ఉన్నది. మనిషి నిద్రనుండి మేల్కొన్నది మొదలుకొని రెండు పనులలో ఏదో ఒక పనిని మనస్సు చేయుచునే ఉండును. మనస్సు యొక్క రెండు పనులు నిద్రలోనే నిలిచిపోవును.

ప్రయత్నము చేసి మెలుకువలో మనస్సు యొక్క రెండు పనులు నిలిపి వేయడము బ్రహ్మయోగమగును. ఈ ప్రయత్నములో జ్ఞానేంద్రియములను పని చేయకుండ చేసి, వాటి విషయములను మనస్సుకు చేరకుండ సులభముగ చేయవచ్చును. ఉదాహరణకు కన్నులు మూయుట ద్వార కంటి విషయము అనగ దృశ్య విషయము లోపలికి చేరవేయుట మనస్సుకు లేకుండ పోవుచున్నది. అట్లే చెవులకు శబ్దము లేని గదిలో కూర్చొనుట ద్వార ఆ విషయము మనస్సుకు లేదు. నాలుకకు ఏమి పెట్టకుండుట వలన రుచి తెలియదు. ఏమి తాకని ప్రాకని దాని వలన చర్మము యొక్క స్పర్శ మనస్సుకు తెలియదు. అట్లే ఏ వాసనలేని చోటుండుట వలన మనస్సుకు ఒక విధమైన పని లేకుండపోయినది. బ్రహ్మయోగ సాధకుడు

నిర్జన నిర్మలమైన ప్రదేశములో కూర్చొని, జ్ఞానేంద్రియ విషయములకు మనస్సుకు సంబంధము లేకుండ చేసి, మనస్సుకు పనిలేకుండ చేయుచున్నాడు. అయినప్పటికి మనస్సు రెండవ పనిని ప్రారంభించి గడచిన కాలములోని ఇంద్రియ విషయములను, చూచిన దృశ్యములనో, విన్నమాటలనో జ్ఞప్తికి తెచ్చిపెట్టుచుండును. మనస్సు యొక్క ఈ పనిని నిలిపివేయడము బ్రహ్మయోగమగును. మనస్సు పనిచేయుచుండుట బ్రహ్మయోగము కాదు. మనస్సుకు ఇంద్రియ విషయములను తాత్కాలికముగ లేకుండ చేసినప్పటికి, మనస్సు గడచిన ఇంద్రియార్థ విషయములను జ్ఞప్తికి తెచ్చిపెట్టు పని చేయుచుండుటవలన, బ్రహ్మయోగము సాధించుటకు చాలా కష్టముగా ఉండును. ఎంతో అభ్యాసముతో మనస్సు విషయములను మననము చేయుటమానును. అపుడే బ్రహ్మయోగము సాధ్యమగును. మనస్సు యొక్క రెండు పనులలో ఒకటైన ఇంద్రియ విషయములను మనస్సుకు చేరకుండ చేయడము. రెండవ పనైన ఇంద్రియ విషయములు మనస్సుకు జ్ఞప్తి రాకుండ చేయడము జరిగినపుడే బ్రహ్మయోగము సాధ్యపడును. అందువలననే పై శ్లోకమున ఇంద్రియ విషయములను వాటి పనులను మనస్సుకు లేకుండ చేసిన వానిని సర్వసంకల్పసన్యాసి అనియు యోగి అనియు చెప్పుచున్నారు.

(5) శ్లో ॥ 5 : ఉద్ధరే దాత్మనాఽఽత్మానం నాఽఽత్మాన మనసాదయేత్ ।
ఆత్మైవ హ్యాత్మనో బన్ధు రాత్మైవ రిపురాత్మనః ॥
(పరమాత్మ, ఆత్మ, జీవాత్మ)

**భావము :** ఆత్మచేత ఆత్మకు ఔన్నత్యగతియు, మరియు ఆత్మచేత ఆత్మకు అధోగతియు ఏర్పడుచున్నది. అందువలన ఆత్మకు ఆత్మే బంధువు మరియు ఆత్మకు ఆత్మే శత్రువుగ ఉన్నది.

**వివరము :** ఈ శ్లోకములో రెండు ఆత్మలున్నవి. ఆత్మల వివరము తెలియక పోతే ఈ శ్లోకములోని అర్థము అపార్థమైపోవును. అందువలన ఏ శ్లోకము ఏ ఆత్మకు

చెప్పబడుచున్నదో గ్రహించాలని మొదటనే చెప్పాము. కొందరు ఇక్కడ ఈ శ్లోకమునకు సంబంధములేని మనస్సును తెచ్చి పెట్టుకొన్నారు. ఇందులో మనస్సుకు సంబంధించినది ఒక్కమాట కూడా లేదు. ఇది కేవలము ఆత్మల విషయమైవున్నది. ఒక ఆత్మచేత ఒక ఆత్మ ఉద్ధరించబడి గొప్పస్థాయికి చేరుకోవడము, అట్లే ఒక ఆత్మచేత ఒక ఆత్మ ఉద్ధరించబడక అధోగతి చెందడము జరుగుచున్నదని ఈ శ్లోకములో చెప్పారు. అంతేకాక ఒక ఆత్మ మరొక ఆత్మకు బంధువుగనున్నది. అట్లే ఒక ఆత్మ మరొక ఆత్మకు శత్రువుగ కూడ ఉన్నదని చెప్పడమైనది.

ఇక్కడ రెండు ప్రశ్నలకు స్థానమున్నది. ఒకటి ఏ ఆత్మ, ఏ ఆత్మను ఉద్ధరించుచున్నది? అట్లే ఏది దేనిని అధోగతికి పంపుచున్నది? రెండవది ఏ ఆత్మ ఏ ఆత్మకు బంధువుగనున్నది? అట్లే ఏది దేనికి శత్రువుగనున్నది? ఈ ప్రశ్నలలో ఒక ఆత్మ ఇంకొక ఆత్మకు ఎందుకు బంధువగుచున్నది, అట్లే ఎందుకు శత్రువగుచున్నదను విషయము ప్రక్కనే 6వ శ్లోకములో చెప్పబడివున్నది. ఏ ఆత్మ ఏ ఆత్మకు శత్రువు, మిత్రువు అగుచున్నదను ప్రశ్నకు వివరము ఇక్కడ ముందే మనము తెలుసుకోవలసివున్నది.

మన శరీరములో మూడు ఆత్మలున్నవని ఆత్మల వివరము తెలుసుకొన్నాము. మూడు ఆత్మలలో ఎవరికి ఎవరు శత్రువు? ఎవరు ఎవరికి మిత్రువు అన్నదే ముఖ్యమైన ప్రశ్న. ఎవరు ఎవరికి ఏమౌచున్నారని తెలిసిన తర్వాత ఎందుకగుచున్నారని సులభముగ తెలియవచ్చును. మూడు ఆత్మలలో వరుసగ మొదటిది జీవాత్మ, రెండవది ఆత్మ, మూడవది పరమాత్మ. ఈ మూడు ఆత్మలను, వస్తువులను తూకము చేయు త్రాసు (తక్కెడ)గ పోల్చుకుందాము. మొదటిదైన జీవాత్మ తక్కెడలో ఒక ప్రక్క వ్రేలాడబడిన పళ్లెమనుకొందాము. అట్లే రెండవ ప్రక్క వ్రేలాడబడిన పళ్లెమును పరమాత్మ అనుకొందాము. తక్కెడకు కట్టెకు మధ్యలో ఉన్న ఆధారమును ఆత్మ అనుకుందాము. తర్వాత పేజీలో బొమ్మను గమనించుము.



తక్కెడలో రెండువైపులనున్న రెండు పళ్లెములకు మధ్యలో సమాన దూరములో ఉన్న ఆధారము రెండు పళ్లెములకు సమానమని తక్కెడలో తెలిసినట్లే జీవాత్మ పరమాత్మలకు మధ్యలోనున్న ఆత్మ రెండిటి ఎడల సమానముగనున్నదని, అది దేనివైపు పక్షపాతము లేని విధముగ తక్కెడలోని ఆధారమువలె కలదని తెలియాలి. దీనివలన రెండవదైన ఆత్మ, జీవాత్మ, పరమాత్మలకు సమానముగావుండి ఎవరికి శత్రువుకాక, మిత్రువుకాక ఉన్నదని తెలియాలి. ఆత్మను ప్రక్కకు పెట్టగ మిగిలినవి జీవాత్మ, పరమాత్మలు. ఈ రెండు ఒకదానికొకటి మిత్రశత్రువులుగ మారుటకు అవకాశము గలదు. దీనిని బట్టి పరమాత్మచేత జీవాత్మ ఉద్ధరించబడుచున్నదని, మరియు పరమాత్మచేత జీవాత్మ అధోగతియు కూడ చెందుచున్నదని తెలియుచున్నది. ఉద్ధరింపబడిన జీవాత్మ పరమాత్మకు బంధువని, అధోగతి చెందిన జీవాత్మ పరమాత్మకు శత్రువని కూడ తెలియుచున్నది. ఎట్లు శత్రువో ఎట్లు మిత్రువో? క్రింది శ్లోకమున చూస్తాము.

(5) శ్లో6: బంధు రాత్మాఽఽత్మన స్తస్య యేనాత్మైవాఽఽత్మనా జితః ।
అనాత్మనస్తు శత్రుత్వే వర్తే తాఽత్మైవ శత్రువత్ ॥
(పరమాత్మ, ఆత్మ, జీవాత్మ)

**భావము :** ఎవడు ఆత్మను తెలుసుకొన్నాడో, వానికి ఆత్మ బంధువుగనున్నది. అట్లే ఎవడు ఆత్మను తెలుసుకోలేడో, వానికి ఆత్మ శత్రువుగ కూడా ఉన్నది.

**వివరము :** జీవాత్మగనున్న మానవుడు బ్రహ్మయోగమాచరించి తన శరీరములోని

ఆత్మను తెలుసుకోవడము వలన పరమాత్మకు బంధువుగ మారిపోవుచున్నాడు. అదే విధముగనే యోగపద్ధతులు తెలియక ఆత్మను తెలియనటువంటివాడు పరమాత్మకు శత్రువుతో సమానముగ ఉన్నాడు. ఈ శ్లోకములో **'ఆత్మనాజితః'** అను పదము ఉపయోగించబడినది. ఆత్మను జయించుటని ఆ పదము యొక్క అర్థము. మీరు భావములోగాని, వివరము చెప్పడములోగాని ఆత్మను జయించినవాడని చెప్పక ఆత్మను తెలుసుకొన్నవాడని చెప్పారే! అని కొందరడుగవచ్చును. వాస్తవముగా తనకంటే పెద్దదైన, తనకు దేవుడైన ఆత్మను ఎవడూ జయించలేడు. జీవాత్మ ఆత్మను జయించడమంటే మనిషి దైవాన్నే జయించినట్లగును. ఇక్కడ ఆత్మను జయించినవాడని చెప్పకుండ ఆత్మను తెలుసుకొన్నవాడని చెప్పుటయే సరియైనదని తెలియాలి. ఆత్మను తెలుసుకోవడములో సాధన అను పెద్ద పోరాటమున్నది.

ఒక రాజు కోటలో ఉండి కోటచుట్టూ సైన్యమును కాపలాగ పెట్టారు. ఇతర శత్రువులెవరు కోటలోనికి ప్రవేశించకూడదు. రాజు సైనికుల శక్తికి కావలసిన ఆహారమును పెట్టి పోషిస్తు గట్టి బందోబస్తు ఏర్పాటు చేసుకొన్నాడు. ఒకవేళ శత్రురాజులు ఎప్పుడైన దాడిచేసి సైన్యమునంతయు జయించి రాజును చేరగలిగితే, రాజును చూడగలిగితే, రాజును జయించినట్లే. యుద్ధము చేయునది సైన్యము తప్ప రాజు చేయడు. రాజు కోటలోపలనుండువాడే. శత్రురాజులు పోరాడి గెలిచినప్పటికి, వారు జయించినది నిజముగ సైనికులనే కాని రాజును కాదు. చివరిగ రాజుతో కూడ పోట్లాడనవసరము లేదు. సైనికులకు కోట వశమౌతూనే శత్రురాజులు రాజ్యమును, రాజును జయించినట్లే. ఆ విధముగనే మన శరీరము కోటలాంటిది. అందులో రాజు ఆత్మ. జీవుడు తప్ప మిగత బాహ్యేంద్రియములు, అంతరేంద్రియములు అన్నియు సైన్యమనుకొందాము. సైన్యాధిపతి మనస్సు, మనస్సును సంబంధించివుండు లోపల బయట ఇంద్రియములన్నియు సైనికులుగ గుర్తించుము. జీవుడు శత్రురాజుతో సమానము. జీవుడు మనస్సను సైన్యాధిపతిని, ఇంద్రియములను సైన్యమును జయించినపుడు, శరీర కోటలోపలనున్న రాజైన ఆత్మను చూడగలడు. మనస్సును ఇంద్రియములను జయించి ఆత్మను దర్శనము

చేసుకోవడమే '**ఆత్మనాజితః**' అని శ్లోకములో అన్నారు. అదియు అంత సులభముగ ఉండదు. శరీరమను కోటలో జీవుడను రాజు, ఆత్మయను రాజును చూడాలంటే ఆత్మశక్తిచే కదలుచున్న మధ్యలోని సైన్యమను ఇంద్రియములు, సైన్యాధిపతియైన మనస్సు అనేక ఆటంకములు కలుగజేయుచునేవుందురు. శరీర కోటలోని ఆత్మయను రాజును చూడాలంటే, జీవుడను శత్రురాజు అనేక సంవత్సరములు సైన్యముతోను, సైన్యాధిపతితోను, యుద్ధము చేయగ, చివరకు వారు ఓడిపోతే రాజును జయించినట్లగును. సైన్యాధిపతి యొక్క ధాటికి ఓడిపోతే లోపలనున్న రాజు కనిపించడు.

ఒక చక్రవర్తి ఆధీనములోని సామంతరాజు, వేరొక సామంతరాజును జయించినపుడు చక్రవర్తి తన సామంతరాజును పొగుడును. అట్లుకాక సామంత రాజు వేరొక సామంత రాజుతో లాలూచిపడి యుద్ధము చేయక తనే ఓడిపోతే ఆ సామంత రాజు మీద చక్రవర్తికి కోపమొచ్చును. పరమాత్మ చక్రవర్తికాగ, జీవాత్మ సామంతరాజుగ ఉన్నాడనుకొనుము. ఆత్మ వేరొక సామంత రాజనుకొనుము. జీవాత్మయను రాజు ఆత్మయను రాజును జయిస్తే పరమాత్మయను చక్రవర్తి సంతోషించును. అట్లుకాక జీవాత్మయను రాజు ఆత్మయను రాజు సైన్యముతో యుద్ధము చేయక వారితో కలిసిపోతే జీవుడు కూడ శత్రువుతో సమానమేయగును.

(5) శ్లో॥ 7 : జితాత్మనః ప్రశాన్తస్య పరమాత్మా సమాహితః ।
శీతోష్ణ సుఖ దుఃఖేషు తథా మానావ మానయోః ॥
(బ్రహ్మయోగము)

**భావము :** ఆత్మను తెలిసినవాడు పరమాత్మ ఎడల ప్రశాంతత పొందియుండును. అట్టివాడు శీతోష్ణ సుఖదుఃఖములందు, అట్లే మానావమానములందు సమానత్వము కల్గివుండును.

**వివరము :** ఆత్మ పరివారమును జయించి ఆత్మదర్శనము చేసుకొన్న జీవుడు, పరమాత్మకు తనకు మధ్య శత్రుత్వములేనివాడై, ఇద్దరి మధ్య ప్రశాంతత కల్గినవాడై ఉండును. అతడు శీతోష్ణములందును, సుఖదుఃఖములయందును, మానావ

మానములయందును సమానత కల్గివుండును. ఇక్కడ గమనించవలసిన విశేషత ఒకటున్నది. అదేమనగా ఈ శ్లోకము బ్రహ్మయోగమునకు సంబంధించినది. యోగియైనవాడు మెలుకువతో వచ్చు సుఖదుఃఖములకు సమానముగ ఉన్నాడని అనుకోకూడదు. సుఖదుఃఖములకు సమానత యోగములో ఉన్నప్పుడేనని తెలియాలి. ఒకడు బ్రహ్మయోగములో ఉన్నప్పుడు కన్నులు మూసుకొని నిశ్శబ్దమైన ప్రదేశములో శుభ్రమైనచోట కూర్చొని యోగములో లగ్నమై ఉన్నప్పుడు, అతని ముందర సుఖమును కల్గించు అందమైన దృశ్యమునుంచినను, అట్లే కష్టమును బాధను కల్గించు సమీప బంధువు యొక్క శవమును తెచ్చిపెట్టినను, బయటి ధ్యాస లేనివానికి రెండు సమానమే. మానావమానములందును, శీతోష్ణములందును సమానత్వము కల్గినవాడనగ, పూర్తి బ్రహ్మయోగములో లగ్నమై బాహ్య విషయధ్యాసలేనివాడని అర్థము. వాని శరీరము లోని మనస్సు ఏమాత్రము పనిచేయనిదై ఉన్నప్పుడే, బాహ్యవిషయముల సుఖమును దుఃఖమును మానావమానములను లోపలి జీవునికి అందించలేదు. ఈ శ్లోకములోని విషయమును ఈ విధముగ అర్థము చేసుకోక, మెలుకువలోనున్న యోగి కష్టసుఖము లలో సమానత్వము కల్గివున్నాడంటే, యోగి శరీరములోని జీవునికి కష్టసుఖ అనుభూతుల భేదము లేదంటే మొత్తము కర్మ సిద్ధాంతమే తలక్రిందులై పోవును. ధర్మములను తెలియజేయు భగవద్గీతకే అర్థము లేకుండపోవును. అందువలన ఈ విషయము బ్రహ్మయోగములోనున్న సమయములో సంభవించునదని, మిగత సమయములో కర్మయోగికి కాని, బ్రహ్మయోగికి కాని కష్టసుఖ అనుభూతులను జీవుడు అనుభవించి తీరవలసిందేనని, అపుడు వాటి భేదము జీవునకు తప్పనిసరిగ తెలియుచునే ఉండునని గ్రహించాలి. ఈ శ్లోకములో కూడ **జితాత్మనః** అని చెప్పియున్నారు. ఆత్మను అనుభవించు సమయమునే **జితాత్మనః** అన్నారని తెలుసుకోవాలి. బ్రహ్మయోగములో మనస్సు ఆత్మమీద లగ్నమై, ఆత్మయొక్క విషయమును బుద్ధికి జీవునకు తెలియజేయు సమయములో, బయటి విషయములన్ని సమానముగ తెలియకుండ పోవుచున్నవని క్రింది శ్లోకములో కూడ తెల్పుచున్నారు చూడండి.

(5) శ్లో॥ 8 : జ్ఞాన విజ్ఞాన తృప్తాత్మా కూటస్థో విజితేంద్రియః ।
యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మ కాంచనః ॥
(బ్రహ్మ యోగము)

(5) శ్లో॥ 9 : సుహృన్మిత్రా ర్యుదాసీన మధ్యస్థ ద్వేష్య బంధుషు ।
సాధుష్వపిచ పాపేషు సమబుద్ధి ర్విశిష్యతే ॥
(బ్రహ్మ యోగము)

**భావము :** జ్ఞాన విజ్ఞాన తృప్తుడు, ఆత్మతో ఆనందములో మునిగియున్నవాడు, ఇంద్రియములను జయించినవాడు, నిజమైన బ్రహ్మయోగములో కూడుకొన్నవాడు, మన్ను, రాయి, బంగారను భేదముల ధ్యాసలేనివాడు, స్నేహితులందు సుహృద్భావము కలవానియందు శత్రువులయందు, బంధువులయందు మిగతావారందరి ఎడల సమతనుండువాడే యోగి.

**వివరము :** ఆత్మజ్ఞానమును ఆచరణ చేయడమే బ్రహ్మయోగము యొక్క ఆచరణ, బ్రహ్మయోగములో ముఖ్యమైన పని మనస్సును జయించడమే. ఎంతో కాలము ప్రయత్నముచేత చివరకు మనోజయమును సాధించినపుడు బ్రహ్మయోగము ఏర్పడుచున్నది. ఇంద్రియ ధ్యాసలు అప్పటివికాని, గడచిన కాలమువికాని, మనస్సుకు మననము లేకుండ చేయడము మనోజయములోనున్న కష్టము. బయటి ఇంద్రియ ధ్యాసలులేని మనస్సు లోపలి ఆత్మను గూర్చి తెలియజేయుటకు మొదలుపెట్టును. అట్లు ఆత్మను తెలియజేయడమే బ్రహ్మయోగము. బ్రహ్మయోగ ఆచరణ సమయములో శరీర బయటి ధ్యాసలు ఏమాత్రములేవు. అప్పుడు వానిముందర మన్నుపెట్టిన, రాయిపెట్టిన, విలువైన బంగారు పెట్టిన ఏవి వానిని ఆకర్షింపలేవు. ఆ బ్రహ్మయోగి ఎడల రాయి, మన్ను, బంగారు అన్ని ఒక్కటే. అదే విధముగనే వాని ముందరికి శత్రువు వచ్చి నిలబడిన, మిత్రువు వచ్చి నిలబడిన, బంధువుగాని, మిగులపాపిగాని, పవిత్రమైన సాధువుగాని అందరూ సమానమే. ఎవరిని ప్రేమించడు ఎవరిని ద్వేషించడు. అతను బాహ్యరంగములో ఇట్లుండ అంతరంగములో ఎలా ఉన్నాడో క్రింది శ్లోకము వివరిస్తున్నది చూడుము.

(5) శ్లో॥ 10 : యోగీ యుంజీత సతత మాత్మానం రహసి స్థిత : ।
ఏకాకీ యత చిత్తాత్మా నిరాశీ రపరిగ్రహః ॥
(బ్రహ్మయోగము)

**భావము :** యోగి సతతము ఆత్మతో కలసియుండి రహస్యముగ ఉండును. ఏకాకిగ ఆశలెల్ల విడచి ఏది గ్రహించనివాడై, నియమించిన చిత్తము కలవాడై ఉండును.

**వివరము :** ఈ శ్లోకమును చాలా మంది బాహ్యముగ అర్థము చేసుకోవడము జరిగినది. రహస్యముగ అంటే ఎవరూ చూడని కొండగుహలందని, ఏకాకి అంటే ఎవరూలేని స్థలములోనని చెప్పుకోవడము జరిగినది. ఆ విధముగ బాహ్యమునకు సంబంధించిన అర్థమునే తీసుకోకూడదని మరిమరి తెలియజేయుచున్నాము. ఈ శ్లోకములో బ్రహ్మయోగి యొక్క అంతర్గతస్థితిని గూర్చి చెప్పియున్నారు. బ్రహ్మయోగి అయినవాడు ఎల్లప్పుడు ఆత్మ యొక్క అనుభవముతో కూడుకొని ఉండును. బ్రహ్మయోగి శరీరములోని జీవాత్మ, తన శిరస్సులో బాహ్యప్రజలకు తెలియని రహస్యస్థావరములో ఆత్మయొక్క అనుభూతులను అనుభవిస్తుండును. **తలయందు భృకుటికి మధ్యమున ఉపజిహ్వకు ప్రాక్‌దిక్కున ఆ రహస్య స్థావరమున్నది.** ఇతరులకు తెలియనిది రహస్యమగును. కొంతవరకు ఆ స్థలము యొక్క ఆచూకీని చెప్పినప్పటికి, దానిని కనుగొనలేనపుడు అది రహస్యమే కదా! కనుబొమలకు మధ్యలో చిరునాలుకకు పై భాగమున అని కూడ కొంత వివరము చెప్పినప్పటికి, జీవుడు ఆత్మను పొందు ఆ స్థలమును ఎవరు చూడలేనపుడు అది రహస్యస్థావరమనియే చెప్పబడును. అందువలననే శ్లోకములో బ్రహ్మయోగి రహస్యమైన స్థలములో ఆత్మతో కలసియున్నాడని చెప్పారు. అంతేకాక ఏకాకి అనుమాట కూడకలదు. ఏకాకి అనగ శరీరములో ఆత్మ జీవాత్మ రెండుజోడు పక్షులవలెనున్నవి. అవి కనిపించునవి కావు. కనుక వాటిని నల్లని చీకటితో సమానముగ పోల్చారు. నల్లని చీకటిలో ఏమీ కనిపించదు, కావున వాటిని నల్లని పక్షులైన కాకులతో సమానముగ పోల్చి చెప్పారు. జీవాత్మ ఆత్మలు శరీరమను వృక్షములో పైన మారుమూల కొమ్మమీద

ఉన్నాయి, ఆ రెండు కలిస్తే ఏకమగును. బ్రహ్మయోగములో జీవాత్మ ఆత్మలు కలిసిపోవుటవలన, ఆ సమయములో రెండు ఆత్మలు లేకుండ పోయి ఒకే ఆత్మగ ఏర్పడుట వలన, వానిని అప్పుడు ఏకాకి అనడము జరుగుచున్నది. కావున ఆత్మతో కలిసిన బ్రహ్మయోగిని ఏకాకి అని అనవచ్చును. యోగసమయములో రహస్య స్థలములో ఉన్న జీవాత్మ, అంతకు ముందు తనతో సంబంధమున్న విషయములన్నిటిని వదలి, తానొక్కడుగ మిగిలిపోయి ఆత్మను అనుభవిస్తున్నాడు. మనస్సు అనేకమునుండి ఏకములోనికి పోయి జీవుని ఏకాగ్రత పొందించుచున్నది. అనేకములైన గుణవిషయములను మనస్సందివ్వని దానివలన బుద్ధికూడ ఏకముగనే నిలుచును. బుద్ధి అందించు అనేక విషయములను గ్రహించి నిర్ణయించు పని చిత్తమునకు లేనిదానివలన చిత్తము కూడ ఏకమైపోయినది. ఈ విధముగ మొదట మనస్సు అనేకము నుండి ఏకమైపోగ, దానిననుసరించి బుద్ధికూడ అనేకమునుండి ఏకమైపోగ, బుద్ధిననుసరించి చిత్తము ఏకముకాగ, చివరకు జీవుడు ఏకమైపోయాడు. మనస్సు బుద్ధి చిత్తము యంత్రములోని చక్రములవలె ఒకదానికొకటి సంబంధమున్నవి. యంత్రములో ఒకచక్రము కదలితే దానికి అనుసంధానమైన వేరొక చక్రము తిరుగునట్లు, మనస్సు, బుద్ధి, చిత్తములలో ఒకటి కదులుచున్నదంటే మిగిలినవి కదులుచున్నట్లే. చివరిదైన చిత్తము అపరిగ్రహమై నిలిచినదంటే, మిగత మనస్సు బుద్ధి కూడ నిలిచినవనే అర్థము. మనో, బుద్ధి, చిత్తములందించు అనుభూతులు కూడ జీవునికి నిలిచిపోయినట్లే. అందువలన బ్రహ్మయోగము పొందిన జీవుడు రహస్య స్థావరములో ఏకాకిగనున్నాడని చెప్పియున్నారు. అటువంటి స్థితిని పొందకోరువారు చేయవలసిన ఆచరణ ఏమిటో క్రింది శ్లోకములో వివరిస్తున్నారు చూడండి.

*(5) శ్లో॥11 : శుచౌదేశే ప్రతిష్ఠాప్య స్థిర మాసన మాత్మనః ।*
*నాత్యుచ్ఛ్రితం నాతినీచం చేలాజిన కుశోత్తరమ్ ॥*
*(బ్రహ్మయోగము)*

**భావము :** ఎత్తు తగ్గులులేని శుభ్రమైన స్థలములో యోగసాధనకు కూర్చొనునట్లు

స్థిరాసనము ఏర్పరుచుకొని దానిమీద దర్భలువేసి, దర్భలమీద చర్మము, చర్మముమీద గుడ్డ పరచియుంచుకొని కూర్చొనవలెను.

**వివరము :** బ్రహ్మయోగ సాధనకు హెచ్చుతగ్గులులేని శుభ్రమైన స్థలములో ఆసనము కూర్చొనుటకు తగినట్లు ఏర్పాటు చేసుకోవడము వరకు అందరికి అర్థమైవుంటుంది. ఆ స్థలములో దర్భలు, చర్మము, గుడ్డ ఉపయోగించడము దేనికని కొందరికి సంశయమేర్పడి ఉండవచ్చును. విషయము పూర్తి తెలుసుకొనుట మంచిదే కనుక వాటి అవసరము ఏమిటో తెలుసుకొందాము. మొదట దర్భలు గురించి ఆరాతీసిన దానికొక పెద్దకథ కలదు. అది నిజమో కాదో మనకు తెలియదు, కావున ఆ కథను వదలివేసి మనకు తెలిసిన విషయమును గూర్చి తెలుసుకొందాము. దర్భలు కరుకుగ ఉండునవి, దర్భలు గడ్డిజాతిలోనివి. దర్భ గడ్డి మెత్తగ కరుకుగ ఉండుటవలన క్రిమికీటకాదులు వాటిమీద ప్రాకలేవు. యోగసమయములో చీమలు సహితము ఆసనము మీదికి రాకుండుటకు తగినట్లు దర్భలు వేసుకోవలసి వచ్చినది. చిన్న చీమలు శరీరము మీదికి ప్రాకికుట్టుట వలన యోగసాధనకు భంగమేర్పడును. అట్లు సాధనాపరునికి ఆటంకము కలుగకుండుటకు దర్భలను ఉపయోగించ వలసివున్నది. తర్వాత జింక చర్మము దర్భల మీద పరచవలసియున్నది. దర్భల కరుకు సాధకుని శరీరమునకు తగలనట్లు దర్భలమీద చర్మము పరచవలెను. యోగసాధనలోను, యోగముచేయు సమయములోను చర్మాసనము యొక్క విశిష్టత ఏమంటే! ప్రతి జీవరాసి శరీరము క్రిందినుంచి పై వరకు కుడి ఎడమ అను రెండు భాగములుగ విభజించబడి తయారైనది. శరీరములో కుడిప్రక్క కన్నుంటే ఎడమప్రక్క కన్నుండును. ఎడమ ప్రక్క చెవివుంటే కుడిప్రక్క కూడ చెవివుండును. ఇట్లు ఏ అవయవముండునో, దానికి వ్యతిరేకదిశలో అదే అవయవము మరొకటుండును. ఒకే అవయవముగ కనిపించు ముక్కు రెండు భాగముల అతుకుగనున్నది. ముక్కుకు కుడి ఎడమలలో రంధ్రములున్నవి. ముక్కుకొన మధ్యలో రెండు కందరముల విభాగము బాగా కనిపించుచుండును. పై పెదవి మీద బాణము గుర్తుగ మధ్యలో సూచించునట్లు, కనిపిస్తు శరీరమధ్యలో ఒక రేఖ క్రిందివరకున్నట్లు కనిపిస్తునది.

క్రింది బీజముల మధ్య దారములాంటి విభజన గుర్తును కూడ చూడవచ్చును. అట్లే లోపల కూడ కుడి ఎడమ రెండు అవయవముల నిర్మాణమున్నది. ఇది మనుషులకే కాక జంతువులకు, చెట్లకు కూడ ఉన్నది. చెట్లకు ప్రతి ఆకు మధ్యలో రెండు భాగముల విభజనవుండును. ఈ విధముగ సర్వజీవరాసుల శరీరములు రెండు భాగములుగ విభజింపబడుటకు కారణము కర్మ. కర్మ రెండు భాగములుగ ఉండిన దానివలననే శరీరములు కుడి ఎడమ రెండు భాగములుగ పుట్టినవి. పాపపుణ్య రెండు భాగములైన కర్మను పాలించు నవగ్రహాలు కూడ రెండు భాగములుగ విడిపోయి గురు, శని పక్షములుగనున్నవి. కర్మ రెండు భాగములు, కర్మను పాలించు గ్రహాలు రెండు భాగములు. గ్రహాల గ్రహచారమనుభవించు శరీరము రెండు భాగములు. అట్లే జరుగు కాలము కూడ రెండు భాగములుగ ఉన్నది. అదెట్లనగ! మధ్యలో వచ్చిన రాహుకేతువులను ఛాయా గ్రహములను వదలి మిగత ఏడు గ్రహాలకు ఏడు దినములు కేటాయించబడినవి. అవియే ఈ రోజు ప్రపంచమంత అమలులోనున్న ఆదివారము, సోమవారము అను దినముల పేర్లు. ఒక్కొక్క గ్రహము ఒక్కొక్క దినమునకు అధిపతిగ ఉన్నది. నవగ్రహములు రెండు భాగములుగ విభజింపబడి ప్రతిదిన పగటి కాలమునకు అధిపతిగనున్నవి. పగలు 12 గంటల కాలములో పదిన్నర గంటకాలము ఆ దినము ఒక గ్రహానికి కేటాయించగ, ఒకటిన్నర గంటకాలము రాహుకేతువులకు నిర్ణయించబడివున్నది. ప్రతిదినము రాహుకాలముండుట వలన 7 దినములు ఒకటిన్నర గంట ప్రకారము, పదిన్నర గంటలు అన్ని గ్రహములవలె సరిపోవును. ఈ విధముగ కాలమును కూడ విభజించుకొని గ్రహాలు పాలించుచున్నవి.

విభజింపబడిన కాలములో, విభజింపబడిన శరీరములో, బ్రహ్మయోగము చేయు యోగికి జ్ఞానాగ్ని కూడ ఆయా గ్రహాల దినములను బట్టి కుడి ఎడమలలో చేరుచుండును. ఏడు గ్రహాలలో సూర్యుడు, కుజుడు, గురువు ముగ్గురు గురు పక్షముకాగ, శుక్ర, బుధ, శని ముగ్గురు శనిపక్షములోనున్నారు. చంద్రుడు మాత్రము శుక్ల, కృష్ణ పక్షములను బట్టి గురు శనిపార్టీలలో మారుచుండును.

శుక్లపక్షములో గురుపార్టీలోనికి, కృష్ణపక్షములో శనిపార్టీలోనికి మారుచుండును. ఆయా గ్రహాల కాల అధికారమునుబట్టి శుక్లపక్షము 15 రోజులలో మనిషి యోగమాచరించు సమయమున ఆది, సోమ, మంగళ, గురువారములలో శరీరమునందు కుడి ప్రక్క భాగమున జ్ఞానాగ్ని ప్రవేశించును. అట్లే కృష్ణపక్ష బుధ, శుక్ర, శని, సోమవారములలో ఎడమప్రక్క జ్ఞానాగ్ని ప్రవేశించును. దీనిని బట్టి పూర్వము యోగులు యోగదండమును కూడ ఉపయోగించెడివారు. జ్ఞానాగ్ని ప్రవేశించు దిశకు వ్యతిరిక్త దిశలో యోగదండమును ఉపయోగించెడివారు. యోగదండముతో పాటు చర్మాసనములు కూడ ఉపయోగించెడి వారు. ఇప్పుడు చర్మాసనము యొక్క ప్రాధాన్యత సులభముగ అర్థము కాగలదు.

బ్రహ్మయోగి యోగమాచరించు సమయములో ప్రపంచమంతా అణు వణువున వ్యాపించిన పరమాత్మశక్తి జ్ఞానాగ్నిగ మారి, యోగి శరీరములో కుడి ఎడమలుగా ఆయా దినములనుబట్టి ప్రవేశించుచుండును. అట్లు శరీరములోనికి ఒక్క ప్రక్కనుండి బ్రహ్మనాడి పొడవున ప్రవేశిస్తున్నది. గుదస్థానము మొదలుకొని శిరస్సు వరకు శరీర మధ్యలోని వెన్నెముకలోనున్న వెన్నుపాము లేక బ్రహ్మనాడి అనబడు పెద్దనరములో భృకుటి, కంఠము, గుండె, నాభి, లింగము, గుద స్థానములకు సరిగ ఆరు నాడీకేంద్రములున్నవి. చివరిలో ఏడవ పెద్ద నాడీకేంద్రమైన మెదడు ఉన్నది. క్రింది ఆరు నాడీకేంద్రములలోనికి జ్ఞానాగ్ని ప్రవేశించుచుండును. అట్లు ప్రవేశించిన జ్ఞానాగ్ని పైకిప్రాకి ఏడవ కేంద్రమైన మెదడు స్థానములో నిలిచిపోవును. అచటనే సూక్ష్మముగనున్న సంచితకర్మను కాల్చుచుండును. ఈ అగ్ని యొక్క వెలుగునే దేవతా చిత్రపటములలో తల వెనుక వెలుగుగ చూపించారు. యోగి శరీరములో ఆరు కేంద్రములలో ప్రవేశించు జ్ఞానాగ్ని భూమ్యాకర్షణ శక్తి వలన సగము అనగ మూడు కేంద్రములలో ప్రవేశించునది భూమిలోనికి లాగుకొనబడును. అందువలన యోగి యోగ సమయములో వచ్చు జ్ఞానాగ్నిని సగము నష్టపోవుట జరుగును. అట్లు నష్ట పోకుండుటకు పెద్దలు చర్మమును ఆసనములో వాడారు. విద్యుశ్చక్తికి

రబ్బరు నిరోధకమైనట్లు జ్ఞానశక్తికి లేక జ్ఞానాగ్నికి చర్మములు నిరోధకములు. విద్యుత్తు రబ్బరును దాటిపోనట్లు, జ్ఞానాగ్ని చర్మమును దాటిపోదు. కావున యోగి తన ఆసనములో చర్మమును ఉపయోగించుట వలన మూడు కేంద్రముల నుండి జారిపోవు శక్తిని నష్టపోడు. చర్మములను ఆసనములుగ వాడుట వలన పూర్తి శక్తి తన శిరోభాగమున చేరును.

జ్ఞానాగ్ని యోగసమయములో శరీరమందు చేరుచున్న వివరము తెలిసిన పెద్దలు చాలామంది చాలారకముల చర్మములను వాడినట్లు చరిత్ర చెప్పుచున్నది. దీనిని బట్టి యోగి శరీరమునకు ఇతరముగానున్న ఏ జీవరాసి చర్మమైన జ్ఞానాగ్నికి నిరోధముగ ఉన్నదని తెలియుచున్నది. అది సజీవ జీవరాసిది కాని, నిర్జీవ జీవరాసిది కాని ఒకటే సామర్థ్యమున్నదనుటకు అనేక ఆధారములు కలవు. ఉదాహరణకు శివుడు ఏనుగు చర్మము, జింకచర్మము, పులిచర్మము ధరించినట్లు చాలా చిత్ర పటములలో చూడవచ్చును. క్రైస్తవ మతకర్తయిన ఏసుప్రభువు గురువుగారైన యోహాను ఒంటె చర్మమును ధరించెడివాడు. విష్ణువు పాము మీద యోగము ఆచరించుట వలన అక్కడ పాము చర్మము ఉపయోగపడినట్లు తెలియుచున్నది. శివుడు ఎద్దు మీద కూర్చున్నట్లు, మిగతా దేవతలందరు యోగసమయములో వారివారి వాహనములుగ చెప్పుకొను జంతువుల మీద కూర్చొన్నట్లు కలదు. కొందరు మునులు చర్మమును చాపవలె తమవెంట తీసుకుపోయెడివారు. చరిత్రను బట్టి ఏ చర్మమైన తప్పనిసరిగ ఉపయోగించవలెనను విషయము తెలియుచున్నది.

ఈ శ్లోకములో చర్మము వాడవలెనని చెప్పారు. పలానా చర్మమే వాడమని చెప్పలేదు. క్రూరమైన పులి చర్మముకంటే సాధు జంతువైన జింకచర్మము యోగమునకు మంచిదని కొందరనుచుందురు. అటువంటి నియమముకాని, దానివలన ప్రయోజనముకాని లేదు. కావున యోగమునకు ఇది అది అనక ఏ చర్మమైన వాడవచ్చును. గుడ్డనుపయోగించమని శ్లోకములోనే చెప్పారు. చర్మము మీద గుడ్డను ఉపయోగించాలి. చర్మము మీద రోమములు కుచ్చుకోవడము వత్తుకోవడము

వంటి ఇబ్బంది లేకుండునట్లు మెత్తని నూలువస్త్రమును పరచుకొనుట మంచిది. ఈ విధముగ ఆసనము తయారు చేసుకొన్న సాధకుడు తర్వాత ఏమి చేయాలన్నది క్రింది శ్లోకములో చూస్తాము.

*(5) శ్లో॥ 12 : తత్రై కాగ్రం మనః కృత్వాయత చిత్తేంద్రియ క్రియః।*
*ఉపవి శ్యాసనే యుంజ్యాద్యోగ మాత్మ విశుద్ధయే ॥*
*(బ్రహ్మయోగము)*

**భావము :** ఆసనము తయారు చేసుకొని కూర్చొని మనస్సును ఏకాగ్రతనొనర్చి, ఇంద్రియములను, చిత్తము యొక్క పనులను అణచివేసి ఆత్మప్రాప్తి కొరకు బ్రహ్మయోగమును అభ్యసింపవలెను.

**వివరము :** ముందు శ్లోకములో చెప్పబడినట్లు సమ స్థలములో దర్భలు చర్మము గుడ్డను వేసుకొని కూర్చొని, మనస్సును ఏకాగ్రత పరచుకొనుటవలన ఇంద్రియముల పనులు, వాటిని అనుసరించు బుద్ధి, చిత్తము యొక్క పనులు మొత్తము నిలిచి పోవును. అట్లుచేసి ఆత్మ ప్రాప్తికొరకు యోగము చేయవలెను. ఇక్కడ మనస్సును ఏకాగ్రత పరచుకొనుట వలన బయటి ఇంద్రియములు మొదలుకొని లోపలి చిత్తము వరకు అన్నిటి కార్యములు నిలిచిపోవును. కావున ఇందులో మనస్సును ఏకాగ్రత పరచుకొనుటయే ముఖ్యము. అది ఎట్లు సాధించవలెనో దాని ప్రక్రియ ఏమిటో ఇపుడు చూస్తాము.

మనస్సు బాహ్యేంద్రియముల విషయమును జ్ఞప్తి చేయడము దాని రెండవ పనియని ముందు చెప్పుకొన్నాము. అది ఉదయము మొదలుకొని నిద్రించు వరకు అనేక విషయములను జ్ఞప్తి చేయుచునే ఉండును. సాధన చేయువానికి ఆ సమయములో మరీ ఎక్కువ జ్ఞాపకాలను తెచ్చిపెట్టుచుండును. ముందు కన్ను చూచిన విషయములనే కాక చూడని దృశ్యములను కూడ జ్ఞప్తికి తెచ్చును. చూడని అరణ్యమును, చూడని జంతుజాలములను, చూడని మనుషలను స్మృతి పథములో (మనోదృష్టిలో) తెచ్చి పెట్టును. అట్లు చూచినవి చూడనివి, విన్నవి విననివి జ్ఞాపకము

వచ్చుట వలన యోగసాధకునకు యోగము లేకుండ విషయములే ఎక్కువగ ఒకదానివెంట ఒకటి ఎడతెరపి లేకుండ ఉండును. ఒక సమయములో ఒక జ్ఞాపకము మనసులో మెదలును, అది నిమిషమో, అరనిమిషమో లేక కొన్ని నిమిషాలో ఉండి ఆ జ్ఞాపకము వదలి పోయిన వెంటనే మరొక జ్ఞాపకము ఏర్పడి ఉండును. ఇట్లు అనేక విషయములలో మనస్సు సంచరించుచుండును.

ఏకమనగ ఒకటి అని అర్థము. అనేకమనగా ఒకటి కానిది ఎన్నైన కావచ్చును. ఏకాగ్రము అనగ ఒకటికంటే పైన ఉండునదని అర్థము. ఒకటి తరువాత రెండు మూడు అనువరుసగ ఉన్నవి. ఒకటికంటే ముందు లేక పైన ఏమిలేదు అనగ సున్న అని అర్థము. ఏకాగ్రత అనగ ఒకటికి పైనున్న సున్న అని అర్థము. ఈ శ్లోకములో మనస్సు ఏకాగ్రత చేయమని "ఏకాగ్రం మనః" అన్నారు. ఒక సంకల్పము కూడ లేని శూణ్యస్థితిలోనికి మనస్సును ఏకాగ్రత పరచడము వలన యోచించుటకు బుద్ధికి ఒక విషయము కూడా లేకుండ పోవును. చిత్తమునకు కూడ ఏ విషయము లేకుండపోయి స్థంభించిపోవుచున్నది. ఆ సమయములో లభించు ఆత్మసిద్ధికై యోగి ప్రయత్నించవలెను. బ్రహ్మయోగ సాధకుడు ఇంకా ఎట్లుండుననగా !

*(5) శ్లో॥ 13 : సమంకాయ శిరోగ్రీవం ధారయ న్నచలం స్థిరః ।*
*సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశశ్చా ఒన్నవలోకయన్ ॥*
*(బ్రహ్మయోగము)*

**భావము :** శరీరము, శిరస్సు, కంఠము మూడిటిని సమముగ అచంచలముగ నిలిపి, తన దృష్ఠిని నాసికాగ్రములో నిలిపి ప్రక్కదిక్కులు చూడకుండనుండవలెను.

**వివరము :** శరీరములోని వీపు భాగమును, కంఠమును, తలను మూడిటిని చక్కగ నిటారుగ ఉండునట్లు చేసి, కదలకుండ కూర్చొని యోగసాధన చేయవలయును. వీపు భాగము, కంఠము, తల వంగిపోవుట వలన వెన్నెముక చక్కగ లేకుండ

వంకరులుగ ఉండును. అట్లుండుటవలన ఆరు స్థానములలో చేరు జ్ఞానాగ్ని వెన్నెముకలో గల బ్రహ్మనాడిలో సులభముగ ప్రవహించక నిరోధమేర్పడుచుండును. నిరోధమేర్పడుట వలన లోనికి చేరు శక్తి పూర్తి చేరలేదు. ఒక గంటకు చేరు శక్తి ఒకటిన్నర గంటకాలమునకు చేరును. వెన్నుపాము నిటారుగనుండుట వలన జ్ఞానాగ్ని సులభముగ లోపలి ఏడవస్థానమును చేరును. అందువలన వీపు, తల, కంఠము నిటారుగ పెట్టి కూర్చోమన్నారు. తలనుండి వెన్నెముక వంగకుండుటకు తగిన ఆసనము పద్మాసనము. పద్మాసనము వేసి నిటారుగ కూర్చొన్న సాధనా పరుడు, తన మనోదృష్ఠిని నాసికాగ్రమైన కనుబొమల మధ్య స్థానములో లోపలి భాగమున ఉంచవలెను. కనుబొమలకు సమతలములో శిరస్సు మధ్యభాగమున మనోదృష్ఠిని కేంద్రీకరించవలెను. అట్లు కేంద్రీకరించుట వలన మనస్సు ప్రక్క విషయముల మీదికి పోకుండ వాటి మీద దృష్ఠిలేకుండ పోవును. ప్రక్క విషయముల మీదికి మనోదృష్ఠిని సారించక తల మధ్యభాగములో చూపు కల్గినవాడు ఎట్లుండుననగా !

*(5) శ్లో॥ 14 : ప్రశాన్తాత్మా విగతభీ ర్బ్రహ్మ చారి వ్రతే స్థితః ।*
*మనస్సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః ॥*
*(బ్రహ్మయోగము)*

**భావము :** ప్రశాంతుడగుచు, బ్రహ్మచారి వ్రతము పూనినవాడై, భయములేనివాడై, ఆత్మయందే చిత్తమునుంచి మనస్సును అణచి కూర్చొనవలయును.

**వివరము :** శాంతమనగ ఏ గుణములేనిదని అర్థము. ప్రశాంతత పొందిన వానికి భయముండదు. బ్రహ్మయొక్క ఆచరణే వానికి దీక్షగనుండును. వాని మనస్సు అణచివేయబడి ఏ విషయ ప్రస్తావన తేలేని దానివలన, చిత్తము కూడ నిలిచిపోయి ఉండును. ఆ విధముగ బ్రహ్మయోగమును పొందినవాడు ఆత్మను మనస్సు ద్వార అనుభవించుచుండును.

(5) శ్లో ॥ 15 : యుంజన్నేవం సదాఽఽత్మానం యోగీ నియత మానసః ।
శాంతిం నిర్వాణ పరమాం మత్సంస్థా మధిగచ్ఛతి. ॥
(బ్రహ్మయోగము)

**భావము :** యోగి ఎల్లప్పుడు మనస్సును నియమించిన వాడైయుండి నేననుగ్రహించు మోక్షమను శాంతిని పొందగలుగును.

**వివరము :** బ్రహ్మయోగి అయినవాడు, అప్పుడప్పుడుగాని ఎల్లప్పుడుగాని మనస్సును నియమించగలిగి ఆత్మను అనుభవిస్తున్నవాడు, కొంతకాలమునకు అనగ కర్మ అయిపోయిన తర్వాత శరీరమును వదలి మోక్షమును చేరును. వాడు తిరిగి పుట్టడు. వాడు పరమాత్మయందే ఐక్యమైపోయి శాశ్వత శాంతిని పొందును.

(5) శ్లో ॥16 : నాత్యశ్నతస్తు యోగోఽస్తి న చైకాంత మనశ్నతః ।
నచాతి స్వప్న శీలస్య జాగ్రతో నైవ చార్జున ॥
(బ్రహ్మయోగము)

**భావము :** అమితముగ భుజించువాడు, ఎక్కువగా ఉపవాసముండువాడు, నిదుర పోతు, నిష్ప్రయోజనముగ మేల్కొనువాడు బ్రహ్మయోగమును అభ్యాసము చేయలేడు.

(5) శ్లో॥ 17 : యుక్తాహార విహారస్య యుక్త చేష్టస్య కర్మసు ।
యుక్త స్వప్నావ బోధస్య యోగో భవతి దుఃఖహా ॥
(బ్రహ్మయోగము)

**భావము :** మితమైన భోజనము, మితమైన పనులు, మితమైన నిద్ర మెలుకవ కల్గువాడు బ్రహ్మయోగమును పొంది దుఃఖమును పొందడు.

(5) శ్లో॥ 18 : యదా వినియతం చిత్త మాత్మన్యేవాఽవతిష్ఠతే ।
నిస్పృహ స్సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా ॥
(బ్రహ్మయోగము)

**భావము :** ఎపుడు నియమితమైన చిత్తమును ఆత్మయందే నిలుపగలుగుచున్నాడో, అపుడువాడు సర్వకోర్కెలయందు ధ్యాసలేనివాడై, ఆత్మయందే ధ్యాసతోయుండి యోగమును పొందివున్నాడు.

*(5) శ్లో॥ 19 : యథా దీపో నివాతస్థో నేంగతే సోపమా స్మృతా ।*

*యోగినో యత చిత్తస్య యుంజతో యోగ మాత్మనః ॥*

*(బ్రహ్మయోగము)*

**భావము :** నియతచిత్తుడై యోగముతో కూడుకొన్న జీవాత్మకు ఉపమానముగ గాలి వీచనిచోట దీపము కదలకుండ వెలుగునట్లుండునని చెప్పవచ్చును.

**వివరము :** మనస్సు, బుద్ధి, చిత్తములలో ఏది నిలిచిపోయిన మిగిలినవి అనుబంధముగ నిలిచిపోవును. నియమింపబడిన చిత్తము గలవాడన్నపుడు వానినే నియమిత మనస్సు గలవాడని కూడ చెప్పవచ్చును. ఈ శ్లోకమున చిత్తము నిలిచిపోయిన యోగి అన్నారు. అట్టివానికి ఆ సమయములో మనస్సు కూడ నిలిచిపోయినదని తెలియాలి. మనో సంకల్ప వికల్పములున్నపుడు బుద్ధి, చిత్తమునకు కూడ పని ఉండును. మనస్సుకు పనిలేనపుడు మిగత రెండిటికి కూడ పనిలేదు. అట్లే బయటి జ్ఞాన కర్మేంద్రియములకు కూడ పని ఉండదని ముందు కూడ చెప్పియున్నాము.

సాధారణముగ మనస్సు పనిచేయు శరీరములోని జీవాత్మ క్షణక్షణము బయటి నుండి వచ్చు మరియు మనస్సు తెలియజేయు విషయములలోని మానావమానములకు, కష్ట సుఖములకు, శీతోష్ణములకు వచ్చు అనుభూతులు పొందుచుండును. అన్ని వైపుల వీచు గాలి తాకిడికి దీపము అల్లాడునట్లు అనేక విషయముల సుఖదుఃఖముల తాకిడికి అనేకముగ అల్లాడుచునే ఉండును. బ్రహ్మయోగము పొంది మనస్సు ద్వార ఏ విషయము తన వరకు చేరనపుడు, ప్రశాంతత పొంది గాలి వీచనిచోట దీపము కదలక వెలుగునట్లు శరీరములోని జీవుడుండును. బ్రహ్మయోగము పొందినవాడు ఇంకనూ ఎట్లుండుననగా!

(5) శ్లో॥ 20 : యత్రో పరమతే చిత్తం నిరుద్ధం యోగ సేవయా ।
యత్ర చైవాత్మనాఽఽత్మానం పశ్యన్నాత్మని తుష్యతి ॥
(బ్రహ్మయోగము)

**భావము :** ఎపుడు యోగమాచరించుటచేత చిత్తము పనిచేయకుండ పోవుచున్నదో, అపుడు జీవాత్మ ఆత్మను చూచి ఆత్మానందము అనుభవించుచున్నాడు.

**వివరము :** బ్రహ్మయోగము చేయుట వలన దేహములోని భాగముల కార్యములు అన్నియు స్తంభించిపోవును. నిద్రలో తప్ప మిగత సమయములలో బుద్ధికి, చిత్తమునకు, జీవునకు ఏదో ఒకటి అందించవలసిన బాధ్యత మనస్సుకున్నది. మానవుని జీవితకాలము ముఖ్యముగ నాలుగు భాగములుగ ఉన్నదని చెప్పవచ్చును. అవియే 1) నిద్ర 2) మెలుకువ 3) స్వప్నము 4) యోగము. నిద్రలో మనస్సుకు ఏ పని ఉండదు. మెలుకువలో మనస్సు, ఇంద్రియములు పనిచేయుట అందరికి తెలిసినదే. స్వప్నములో బాహ్యాకర్మేంద్రియములు తప్ప అన్ని పని చేయుచున్నవి. యోగములో అనగ బ్రహ్మయోగములో శరీర భాగములన్నియు స్తంభించి ఉన్నప్పటికి మనస్సు, బుద్ధి, చిత్తము, జీవుడు ఎరుక కల్గివుందురు. మనస్సు మాత్రము బయటి విషయములను వదలివుండి అంతర్ముఖముగనున్న విషయమునే తెలుపుచుండును. బ్రహ్మయోగములోనున్నది ఆత్మ తప్ప మనస్సుకు వేరేది లేదు. కనుక ఆత్మయొక్క విషయమునే జీవునకు, బుద్ధికి, చిత్తమునకు తెలియజేయుచుండును. అప్పుడు జీవాత్మ తన మనస్సుచేత ఆత్మను చూడగల్గుచున్నాడు. మనస్సు మధ్యలో లేకపోతే, జీవాత్మ ఆత్మను నేరుగ చూడలేడు. జీవాత్మ మనోదృష్టిచేతనే ఆత్మను చూడగల్గుచున్నదని గ్రహించాలి. యోగములో జీవాత్మ మనస్సు అందించు ఆత్మానుభూతిని బుద్ధిద్వార పొందుచున్నదని తెలుసుకొనుము. ఆ సమయములో జీవాత్మ ఆత్మయొక్క అనుభవమును, దానియొక్క ఆనందమును పొందుచున్నాడు.

(5) శ్లో ॥ 21: సుఖ మాత్యన్తికం యత్తద్బుద్ధిగ్రాహ్య మతీంద్రియమ్ ।
వేత్తి యత్రన చైవాయం స్థితశ్చలతి తత్త్వతః ॥
(బ్రహ్మయోగము)

**భావము :** అనంతమైన ఆ సుఖము ఇంద్రియాతీతము. దానిని బుద్ధిమాత్రము గ్రహించుచున్నది. ఆ సుఖమును గ్రహించినవాడు దానినుండి చలించక నిశ్చలత పొందివుండును.

**వివరము :** బ్రహ్మయోగ సమయములో మనస్సు జీవునకందించు ఆత్మసుఖము బయటి జ్ఞానేంద్రియములు గ్రహించలేనిది. ఎందుకనగ ఆత్మ సుఖము కన్నులకు కనిపించు అందమైన దృశ్య సుఖముకాదు. కన్నులు అందించు ఏ సుఖము దానికి సరికాదు. కన్నులు, చెవులు, నాలుక అందించు సుఖములకు అతీతముగ ఉన్నది. కావున జ్ఞానేంద్రియములు విషయజ్ఞానమును అందులోని సుఖమును తెలియ జేయునవి మాత్రమే. జ్ఞానేంద్రియములకంటే గొప్పదైన బుద్ధిమాత్రము ఆత్మసుఖమును గ్రహించగలదు. మనస్సు తెలియజేయు ఆత్మయొక్క సుఖమును బుద్ధిగ్రహించి దానిలోని సారమునంతయు వివరముగ తెలుసుకోగల్గుచున్నది. పుట్టినప్పటి నుండి నిత్యము చూస్తున్న ఇంద్రియ సుఖములకంటే ఆత్మసుఖము అనంతమైనదని బుద్ధిగ్రహించి, జీవాత్మకు తెలుపుట చేత జీవుడు స్థిరముగ ఆ సుఖమునే పొందగోరి ఉండును. ఇంతకు ముందెప్పుడు ఇంద్రియముల ద్వార అటువంటి సుఖము పొందని జీవుడు దానినే గొప్పగ తలచియుండును.

(5) శ్లో ॥22 : యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికమ్ తతః ।
యస్మిన్ స్థితో నదుఃఖేన గురుణాపి విచాల్యతే ॥
(బ్రహ్మయోగము)

(5) శ్లో ॥ 23 : తం విద్యా దుఃఖ సంయోగవియోగం యోగసంజ్ఞితమ్ ।
స నిశ్చయేన యోక్తవ్యో యోగోఽనిర్విణ్ణ చేతసా ॥
(బ్రహ్మయోగము)

**భావము :** తనకు లభించు వాటిలో ఇతరములకంటే ఏది అధిక లాభముగ

కనిపిస్తున్నదో, పెద్ద దుఃఖము తటస్థించినప్పటికి ఏ స్థితిలో అది తనకు విచారము చలనము కల్గించదో, దుఃఖము పొందుట దేనివలన లేదో, దానిపేరే బ్రహ్మయోగ మని తెలియుము. ఈ యోగము యొక్క సారాంశము నిశ్చయముగ తెలిసినవాడు వ్యాకులము లేనివాడై బ్రహ్మయోగమునే ఆచరించును.

**వివరము :** శరీరము లోపలనున్న జీవునకు చేరు విషయ సుఖములతో పోల్చితే ఆత్మసుఖముకంటే ఇతర ఏ సుఖము అధికముగా కనిపించదు. బ్రహ్మయోగము ఆచరించు సమయములో బయట పెద్ద దుఃఖము కలుగజేయు విషయము సంభవించి ఉన్నప్పటికి ఆ విషయము తనవరకు చేరి విచారమును కల్గించదు. ఈ యోగములో దుఃఖసంయోగమను మాటేలేదు. ఈ యోగమున్నంత వరకు దుఃఖమునకు తావులేక అపరిమితమైన మాటలకందని ఆనందమునే పొందుట కలదు. దీని విషయము తెలిసినవాడు వ్యాకులము లేని మనస్సు గలవాడై ఈ యోగమునే ఆచరించును.

(5) శ్లో॥ 24 : సంకల్ప ప్రభవా న్కామాం స్త్యక్త్వా సర్వానశేషతః ।
మనసైవేంద్రియగ్రామం వినియమ్య సమన్తతః ॥
(బ్రహ్మయోగము)

(5) శ్లో॥ 25 : శనై శ్శనై రుపరమే ద్బుద్ధ్యా ధృతి గృహీతయా ।
ఆత్మసంస్థం మనః కృత్వా నకించిదపి చిన్తయేత్ ॥
(బ్రహ్మయోగము)

**భావము :** మనో సంకల్పము వలన సంభవించు ఆశ మొదలగు గుణములను నిశ్శేషముగ లేకుండ చేసి, ఇంద్రియ విషయముల నుండి మనస్సును నిగ్రహించి, మరియు ధైర్యముగల బుద్ధిచేత కొద్ది కొద్దిగ మనస్సును విషయముల నుండి మరల్చి ఆత్మయందే నిలుచునట్లు చేయవలెను.

**వివరము :** మనస్సుకు యోచనలచేత గుణ విషయములను రేకెత్తించడము ఒక పనికాగ, బయటి ఇంద్రియ విషయములను తెలియజేయడము రెండవ పనిగ

ఉన్నదని చెప్పుకున్నాము. ధైర్యముగల బుద్ధిచేత మనస్సును మెల్లమెల్లగ ఇంద్రియ విషయములనుండి మరియు సంకల్పముల నుండి మరల్చవలెను. మనస్సు మాటిమాటికి చంచలముగనుండుట దాని సహజత్వము. అది అధిక చంచలమగుట వలన బుద్ధి అధైర్యపడక, మాటిమాటికి మనస్సుకు హితము చెప్పి విషయముల నుండి మరల్చు ప్రయత్నము చేయుచుండవలెను. మనస్సు యొక్క రెండవ పనియైన సంకల్పమును లేకుండ చేయడమే కష్టమైనపని.

(5) శ్లో॥ 26 : యతోయతో నిశ్చరతి మనశ్చంచల మస్థిరం ।
తతస్తతో నియమ్యైత దాత్మన్యేవ వశం నయేత్ ॥
(బ్రహ్మయోగము)

**భావము :** అస్థిరము అధిక చంచలమైన మనస్సు దేనివైపు పరుగిడునో, ఆ విషయము నుండి మనస్సును నిగ్రహించి మరల్చి ఆత్మయందే వశమగునట్లు చేయవలెను.

**వివరము :** మనస్సు అధిక చంచలమైనది మరియు దృఢమైనది. పరమ నీచ విషయములను సహితము యోచించు నీచమైనదియును. దీనిని గురించి వేమనయోగిగారు ఒక పద్యమును కూడ చెప్పాడు.

కుక్కను తిన్నవాడు గురులింగ జంగడు
పందిని తిన్నవాడు పరమయోగి
ఏనుగును తిన్నవాడు ఎంత సుజ్ఞానియో
విశ్వదాభిరామ వినుర వేమ !

మన శరీరములో మనస్సు కుక్కవలె అతి చంచలమైనది. ఒక్క క్షణము కూడ స్థిరముగ ఉండక ఇల్లిల్లు తిరిగినట్లు, మనస్సు కూడ విషయముల మీదికి చలించుచుండును. కుక్క మాదిరి వున్న చంచలమైన మనస్సును ఎవడు జయించునో వాడు నిజముగ గురువుతో సమానమే. గురువు మనస్సు జయించి ఉన్నవాడను విషయమును కుక్కను తిన్నవాడు గురులింగడని పై పద్యములో చెప్పారు.

మనస్సు చంచలమైనదియే కాక పరమ నీచమైన విషయముల మీదికి కూడ పోవుచుండును. అందువలన దానిని పందితో సమానముగ పోల్చి, దానిని జయించినవాడు పరమయోగి అని తెల్పుచు, పందిని తిన్నవాడు పరమయోగి అని వర్ణించారు.

మనస్సు చంచలమైనది, నీచమైనదియే కాక దృఢబలమైనదిగ కూడ ఉన్నది. దానిని జయించవలయునని ప్రయత్నము చేసినవారికి సులభముగ లొంగదు. ఎంత బలముగ మనస్సును నిలుపవలయునని ప్రయత్నము చేసిన, అది బలమైనది కనుక పోవుచునే ఉండును. ప్రయత్నమను పగ్గములకు నిలబడక మనలను సులభముగ లాగుకొనిపోవు మనస్సును బలమైనదిగ వర్ణించుచు దానిని ఏనుగుగ పోల్చి చెప్పినారు. అటువంటి బలమైన మనస్సును జయించినవాడు సుజ్ఞాని అని చెప్పుచు ఏనుగును తిన్నవాడు అని అన్నారు.

మనస్సు చంచలమైనది కనుక కుక్కగను, నీచమైనది కనుక పందిగను, బలమైనది కనుక ఏనుగుగాను వర్ణించి, దానిని జయించుటను తిని లేకుండ చేయడమని వర్ణించి చెప్పినారు.

మనస్సుకు అనేక ఇంద్రియ విషయములు మరియు సంకల్పములు ఆహారములుగ ఉన్నవి. మనస్సుకు బలము లేకుండ చేసి ఒక్కచోట ఉండునట్లు చేయుటకు ముఖ్యముగ సంకల్పములను లేకుండ చేయవలయును. యోగ సాధకునకు ప్రస్తుత ఇంద్రియ విషయములతో అంత ఇబ్బంది ఉండదు. ఎందుకనగ సాధకుడు ప్రస్తుతము ఆ సమయములో వాటి ఇబ్బంది లేకుండునట్లు చేసుకొని కూర్చుండును. వచ్చిన కష్టమంతయు మనస్సు యొక్క సంకల్ప జ్ఞాపకాలతోనేనని తెలియుచున్నది. సాధకునకు ఒక్క మారుగ సంకల్పములు రావు. ఒక దాని తర్వాత ఒకటి వచ్చుచుండును. సాధకుడు బుద్ధిచేత మనస్సును హెచ్చరించుచు సంకల్పములు లేకుండ చేసుకొను ప్రయత్నము చేయుచుండును. అట్లు ప్రయత్నము చేయగా.. చేయగ మనస్సు కొన్ని సెకండ్లు నిలబడి తిరిగి ఆలోచనలోపడుచుండును.

ఇట్లు మనస్సుతో పోరాటము చేస్తుండగ, కొంతకాలము జరుగగ అప్పటికి కొంత ఫలితముండును. మనోవేగము తగ్గి వెంటవెంటనే సంకల్పములు రాకుండును. ఒక జ్ఞాపకము తర్వాత ప్రయత్న పూర్వకముగ ఆ విషయమును మనస్సుకు లేకుండ చేసిన వెంటనే మరొక జ్ఞాపకమురాదు. మధ్యలో కొంత వ్యవధి నిరామయస్థితి ఏర్పడును. ఆ స్థితినే నిర్వికల్ప సమాధి అంటున్నారు. అనగ సంకల్పములు లేని సమాధి స్థితి అని అర్థము. ఆ స్థితిని అభ్యాసముచేత పెంచుకుంటూపోగా కొంతకాలమునకు ఒక గంటసేపు యోగసాధన చేస్తే కనీసము 15 లేక 20 నిమిషములైన మనస్సుకు సంకల్పములేనిస్థితి ఏర్పడును. అదియే నిజమైన బ్రహ్మయోగమని తెలియును. కొంతకాలము అట్లే సాధన చేయగ చివరకు ఒక గంటకాలము సాధనలో 30 నిమిషాలో, 40 నిమిషాలో యోగము కాగలదు. పది సంవత్సరములు సాధన చేసినవానికి కూడ గంటకు గంట పూర్తి యోగము కాదు.

మరికొందరు ప్రతిదినము గురూపదేశము ప్రకారము సాధన చేస్తు, నియమము తప్పక పది పదిహేను సంవత్సరములు అభ్యాసము చేసి, మనస్సు ప్రక్క విషయముల మీదికి పోకుండ చేసుకొన్నవారు కూడ ఉన్నారు. ఎందరో భూమి మీద సాధనలు చేస్తు మనస్సును నియంత్రించుకొనుచున్నారు. మనస్సును జయించుటకు సంవత్సరముల కాలము పట్టునా అని కొందరికి అనుమానము రావచ్చును. అది వారి వారి సాధనా తీవ్రతను బట్టి ఉండునని చెప్పుచున్నాము. శ్లోకములో మనస్సును గూర్చి చెప్పుచు ఎక్కడెక్కడకు పోవునో అక్కడ నుంచి మరల్చవలెనన్నారు. ఈ అధ్యాయములో 12వ శ్లోకములో "ఏకాగ్రం మనః" అన్నారు. మనస్సును ఏకాగ్రపరుచుకోమని దాని అర్థము. మనస్సును గూర్చి ఇంతవరకు ఎంతో తెలుసుకొన్నప్పటికి, ఇక్కడ మరికొంత తెలుసుకోవలిసిన అవసరమున్నది. మనస్సుకు అనేక సంకల్ప వికల్పములున్నప్పటికి, అవి అన్నియు ఒక్క మారుగ రావని, ఒకదాని తర్వాత ఒకటి వచ్చునని కూడ తెలుసుకొన్నాము. ***మనస్సుకు***

*ఒక సూత్రము గలదు. అది ఏమనగా! ఒక్క సమయములో ఒక్క యోచన చేయునది మనస్సు. ఒక్క సమయములో ఒకటికంటే ఎక్కువ యోచనలు మనస్సులో ఉండవని అనుభవపూర్వకముగ కూడ తెలియుచున్నది. మనస్సుకు ఒక యోచన తరువాత మరొక యోచనవచ్చును.* ఒక సమయములో ఒక యోచన అన్న సూత్రము ప్రకారము ఒక యోచన ఎంత సమయమైన ఉండవచ్చును. అది పోయిన వెంటనే మరొకటి రాగలదు. ఇట్లు అనేక విషయములు మారుచుండును. అనేక విషయములు మనస్సుకు రాకుండా ఒక్క విషయము మీదనే ఉండునట్లు ఎందరో సాధకులు సాధించారని కూడ చెప్పుకొన్నాము. అసలు సమస్య ఇక్కడే ఉన్నది. అది ఏమనగా!

మనస్సుకు సహజమైన పని ఏమి? అను ప్రశ్నవేసుకుంటే దానికి ఇంద్రియ విషయముల జ్ఞప్తి చేయడము లేక బయటి ప్రస్తుత విషయములు లోపలికి తెలియజేయడము. మనస్సు చలించు అనేక విషయములలో ఐదు జ్ఞానేంద్రియము లైన కన్ను, ముక్కు, చెవి, చర్మము, నాలుక యొక్క విషయము తప్ప వేరేది ఉండదు. ఈ ఇంద్రియాల యొక్క అనేక విషయములలో ఏక సమయమున, ఏక విషయము మీద ఉన్నది మనస్సను సూత్రము కలదు. ఇప్పుడు అసలు విషయానికొస్తాము. ఒక గురువువద్ద ఒక శిష్యుడు ఉపదేశము తీసుకొన్నాడు. గురువుగారు **'సోహం'** అను మంత్రోపదేశముగాని, లేక **'రామ'** అను మంత్రోపదేశముగాని, **'నమఃశివాయ'** అను మంత్రోపదేశముకాని చేశాడనుకొందాము. అట్లే మరొక శిష్యుడు మరొక గురువునాశ్రయించాడు. ఆ గురువుగారు తన శిష్యునికి మంత్రోపదేశము చేయక ఒక గుర్తును చూపి దానినే చూస్తుండమని దృశ్యోపదేశము చేసాడు. దీనిని తప్ప మరొక విషయమును మనస్సున చేరనీయక సాధన చేయమన్నాడు. గురువులవద్ద ఉపదేశము పొందిన శిష్యులు నియమము ప్రకారము గురువుగారు చెప్పినట్లు మనస్సులో ఇతర విషయములు చేరనీయక వారివారి సాధన చేస్తున్నారు. దాదాపు కొన్ని సంవత్సరములు గడచిన తర్వాత సాధనలో వారి మనస్సును ప్రక్క విషయముల

మీదికి పోకుండ చేసుకోగలిగారు. అంతలో ఒక దినము మాలాంటి ఒకవ్యక్తి వారివద్దకు రావడము జరిగినది. మాటల సందర్భములో వారి సాధన విషయము వచ్చినది. వారు చెప్పు విషయమంతా విన్న తర్వాత ఆ క్రొత్త వ్యక్తి మనస్సును గూర్చి వారికర్థమగులాగున చెప్పను మొదలుపెట్టాడు. అనేక విషయములలో చలించు మనస్సు ఒక సమయములో ఒక విషయము మీదనే ఉండును. దానిని మరొక విషయము మీదికి పోకుండ సాధన చేయుట వలన అది ఒక విషయము మీదనే నిలబడును. దానివలన అనేకమునుండి మనస్సును ఏకము మీదికి తెచ్చినట్లైనది. భగవద్గీతలో 'ఏకాగ్రం మనః' అన్నారు. మనస్సును ఏకం నుండి ఏకాగ్రతకు చేర్చమన్నారు. ఏకాగ్రత అనగ ఏ ఒక్క విషయము లేకుండ చేయడమని అర్థము. అట్లు చేయుట వలన ఇంద్రియ ధ్యాసలు పోయి ఆత్మధ్యాస మనస్సుకు ఏర్పడును. ఇప్పుడు అనేక సంవత్సరములనుండి సాధన చేసినప్పటికి ఏకములోనున్నారు తప్ప ఏకాగ్రతకు రాలేదు. ఒక్క ఇంద్రియ విషయమును కూడ మనస్సుకు రాకుండ చేయడమే ఏకాగ్రత కాగ, ఒకరేమో చెవి యొక్క వినికిడి విషయమైన శబ్దమునకు సంబంధించిన మంత్రోపదేశము, మరొకరేమో కన్ను చూపు యొక్క విషయమైన దృశ్యోపదేశము పొంది, దానినే సాధన చేయుట ద్వారా ఇంద్రియానికి సంబంధించిన ఒక్క విషయములోనే ఇరుక్కుపోయారు. తమ మనస్సును ఒక విషయము మీదనే ఉంచారు తప్ప ఒకటికంటే పైనవున్న సున్న లేక శూణ్యము మీదికి పంపి ఏకాగ్రత పరుచుకోలేదు. కావున తమది ఏమాత్రము యోగముకాదు అని నిగ్గు తేల్చి చెప్పెను.

వారేకాదు అలాంటి సాధకులు ఎందరో ఉన్నారు. వారు ఇప్పటికైన వారి మనస్సును ఏకాగ్రత పరుచుకోవాలి. అట్లుకాని ఎడల ఒక రేడియో మెకానిక్ రిపేరు చేయడంలో అరగంటసేపు ఒకే ధ్యాసలో ఉన్నాడనుకొందాము. అట్లే సాధకుడు 'సోహం' మంత్రము మీద అరగంటసేపు ఒకే ధ్యాసలో ఉన్నాడనుకొనుము. ఇద్దరి పని ఒకటే అగును. అందులో ఇద్దరి మనస్సు ఇంద్రియ విషయ ధ్యాసలోనే

ఉన్నది తప్ప వేరుకాదు. అందువలన ఈ శ్లోకములో ఏ ఇంద్రియ విషయము మీదికి మనస్సు ప్రాకిన దానినుండి మరల్చవలెనన్నారు. అట్లు చేయుట వలన ఇంద్రియ విషయములు మనస్సునకు చేరవు.

*(5) శ్లో॥ 27 : ప్రశాన్త మనసం హ్యేనం యోగినం సుఖ ముత్తమమ్ ।*
*ఉపైతి శాన్త రజసం బ్రహ్మభూత మకల్మషమ్ ॥*
*(బ్రహ్మయోగము)*

**భావము :** ప్రశాంతత పొందిన మనస్సు గలవాడును, రాజసగుణములేనివాడు, ఆత్మానుభవము పొందినవాడు, కర్మకల్మషము లేకుండ చేసుకొనువాడు ఎల్లవేళల ఉత్తమమైన ఆత్మసౌఖ్యమునే పొందుచుండును.

*(5)శ్లో॥ 28 : యుంజన్నేవం సదాஉஉత్మానం యోగీ విగత కల్మషః ।*
*సుఖేన బ్రహ్మసంస్పర్శ మత్యన్తం సుఖ మశ్నుతే ॥*
*(బ్రహ్మయోగము)*

**భావము :** బ్రహ్మయోగి సాధనచేసి ఎల్లవేళల ఆత్మయందునే మనస్సును లయమొనర్చి కర్మ కల్మషములు నశించగ, ఆత్మసుఖమునే పొందుచు అపరిమితమగు ఆనందమును అనుభవించుచుండును.

*(5) శ్లో॥ 29 : సర్వ భూతస్థ మాత్మానం సర్వభూతాని చాஉஉత్మని ।*
*ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః ॥*
*(బ్రహ్మయోగము)*

**భావము :** బ్రహ్మయోగములో కూడుకొన్నవాడు, అందరి ఎడల ఒకే సమదృష్టి కల్గివున్నాడు, సర్వులలో ఆత్మను చూడగల్గుచున్నాడు. మరియు ఆత్మయందే సర్వ భూతములను చూడగల్గుచున్నాడు.

**వివరము :** బ్రహ్మయోగియైనవాడు సర్వజీవరాసులందు సమదృష్టికల్గి ఉన్నాడు.

సర్వజీవరాసుల శరీరములలో జీవాత్మతోపాటు ఉన్న ఆత్మను చూడగల్గుచున్నాడు. తన శరీరములో తనతోపాటు ఆత్మవున్నట్లు, మిగత అన్ని శరీరములలో కూడ అట్లే కలదని అతనికి తెలియుచున్నది. అంతేకాక సర్వజీవరాసులు పరమాత్మయందే కలవని కూడ తెలియుచున్నది. సర్వ సజీవశరీరములలో ఆత్మకలదని, పరమాత్మ యందే సర్వ సజీవశరీరములు వానిలోని ఆత్మయు కలదని తెలియువాడే నిజమైన బ్రహ్మయోగి. బ్రహ్మయోగియైనవాడు తన శరీరములోని ఆత్మను చూడగలిగి, తన శరీరమునకు తనకు (జీవునకు) ఆధారము ఆత్మనియు, తన శరీరములోనున్న ఆత్మవలె అన్ని శరీరములలోని ఆత్మలకు ఆధారము మరొకశక్తి ఉన్నదనియు, అదియే ఆత్మకంటే పరముగ ఉన్న పరమాత్మయని తెలియుచున్నాడు.

(5) శ్లో॥ 30 : యో మాం పశ్యతి సర్వత్ర సర్వంచ మయి పశ్యతి ।
తస్యాహం న ప్రణశ్యామి సచమేన ప్రణశ్యతి ॥
(జీవాత్మ, ఆత్మ, పరమాత్మ)

**భావము :** ఎవడు నన్ను అంతటా చూస్తున్నాడో, అంతయు నాయందే చూడగల్గు చున్నాడో, వానిని నేను చూస్తున్నాను. వాడు నన్ను చూస్తున్నాడు.

**వివరము :** ఎవడైతే సర్వచరాచర ప్రపంచమంతయు అణువణువున పరమాత్మను చూడగల్గుచున్నాడో, వాడు సర్వ ప్రపంచమంతయు పరమాత్మయందే ఉన్నట్లు చూడగల్గును. వాడు ఎల్లపుడు నన్ను చూస్తున్నాడు. నేను ఎల్లపుడు వానిని చూస్తున్నానని పరమాత్మ పల్కిన మాటలివి. ఆత్మను తెలుసుకొన్నవాడు పరమాత్మను సులభముగ తెలుసుకోగలడు. పరమాత్మను తెలుసుకొనుటకు ముఖ్య ఆధారము మన శరీరములోని ఆత్మ. అందువలననే ఈశ్వరలింగము మీద మూడు విభూతిరేఖలను మూడు ఆత్మలుగ పోల్చి మొదటిదైన జీవాత్మ మూడవదైన పరమాత్మను తెలియాలంటే మధ్యదైన ఆత్మను తెలియవలెనని, దానినే ఆరాధించవలెనని, అదియే ఆధారమని తెలియునట్లు మధ్యరేఖకు గుర్తుగ బొట్టుపెట్టారు. మూడు విభూతిరేఖలలో

మధ్యదానికి బొట్టుపెట్టుట అర్థముతో కూడుకొన్న పని, అట్లుకాక మధ్యదానిని వదిలి క్రిందిదానికో పైదానికో బొట్టుపెట్టిన అది అర్థములేని కార్యమగును.

(ఇచట ఈ శ్లోకములో చెప్పిన సారాంశమును గ్రహించగా ఆత్మను తెలిస్తే పరమాత్మ యొక్క ఉనికి విధానము ఎట్లున్నది తెలియుచున్నది. కాని పరమాత్మ సంపూర్ణముగ తెలిసినదని అనుకోకూడదు. ఆత్మను తెలియుట వలన పరమాత్మ అంతట వ్యాపించి ఉన్నదను సత్యము, అంతయు ఆయనయందే ఇమిడి ఉన్నదను సత్యము తెలియుచున్నది. అంతమాత్రమున పూర్తి తెలిసి పరమాత్మను అనుభవించినట్లు కాదు. చూచుటకు అనుభవించుటకు ఎంత తేడా ఉండునో ఇక్కడ కూడ అంతే తేడా కలదని తెలియాలి. సజీవముగ ఆత్మను అనుభవించవచ్చును కాని పరమాత్మను సజీవముగ ఎవరు అనుభవించలేరని జ్ఞప్తి పెట్టుకోవలెను.)

(5) శ్లో॥ 31 : సర్వ భూత స్థితం యోమాం భజత్యేకత్వ మాస్థితః ।
సర్వథా వర్తమానోఽపి సయోగీమయి వర్తతే ॥
(జీవాత్మ, ఆత్మ, పరమాత్మ)

**భావము :** సర్వ జీవరాసులలో నేను ఏకరూపముగ ఉండుట తెలిసి ఎవడు నన్ను సేవించునో, పొగడునో అట్టియోగి సర్వదా వర్తించుచున్నప్పటికి అతడు నాయందే వర్తించును.

**వివరము :** సర్వ జీవరాసులలో ఆత్మలున్నవని తెలిసినవాడు, ఆత్మలకు ఆధారమైన శక్తి మరొకటున్నదని తెలిసినవాడు, ఆ శక్తి లోపల బయటనున్నదని తెలిసినవాడు ఎవడో వాడు యోగములనాచరించుట వలన నన్నారాధించినట్లేయగును. అట్టివాడు ఎక్కడ ఏమి చేయుచున్నను, అతడు నాయందే చేయుచుండునని పరమాత్మ తెలిపాడు. ఆత్మను తెలిసినవాడు పరమాత్మ యొక్క ఉనికిని మాత్రము తెలుసుకోగల్గుచున్నాడు. ఆత్మను అనుభవించినట్లు, దాని సుఖము తెలిసినట్లు పరమాత్మను అనుభవించడము గాని, దాని సుఖము తెలియడముగాని ఎవనికి జరుగదు. యోగి అయినవాడు

పరమాత్మ గొప్పతనమును, ఆయన వ్యాపకమును మరియు ఆయన ప్రకృతికి, ఆత్మకు ఆధారమని తెలియగలడు. అంతేగాని ఆయనలోనికి పూర్తి ఐక్యముగాడు. బ్రతికి ఉండువాడు ఎవడు ఆయనవలె మారలేడు. అది మోక్షము పొందిన వారికే సాధ్యమగును. యోగి మోక్షకామియే కాని మోక్షయుతుడు కాడు. పరమాత్మను చేరవలెనను యత్నపరుడేగాని పరమాత్మను చేరినవాడు కాడు.

(5) శ్లో॥ 32 : ఆత్మౌ పమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున ।
సుఖం వా యది వాదుఃఖం సయోగీ పరమో మతః ॥
(జీవాత్మ, ఆత్మ, పరమాత్మ)

**భావము :** ప్రపంచములో సర్వ జీవరాసులకు సంభవించు సుఖమైన దుఃఖమైన వారిలోని ఆత్మకు సమానముగనున్నట్లు చూచువాడు నిజమైన యోగియని నేననుకొందును.

**వివరము :** చాలామంది ఈ శ్లోకములో కూడ ఆత్మకు చెప్పుకోవలసిన విషయమును జీవాత్మకు చెప్పుకోవడము జరిగినది. ఒక కష్టము తనకెంతో ఇతరులకు అంతేకావున జీవహింస చేయకూడదని కూడ కొన్ని గీతా రచనలలో వ్రాయబడివున్నది. అక్కడ అర్జునునకు భగవంతుడు ఎవరి కర్మను వారనుభవిస్తున్నారు. నీవు బాధ్యుడవు కావు, పాపమును రాకుండ కర్మయోగపద్ధతి ద్వార యుద్ధము చేయమన్నాడు. అలా చెప్పిన శ్రీకృష్ణుడు శత్రువులను చంపుట హింసయని దయాగుణమును బోధించునా? మంచిది చెడ్డదని యోచించక కర్మరీత్య పనిచేయమని చెప్పినవాడే ఇది పాపము, ఇది పుణ్యము, ఇది చేయమని, ఇది చేయవద్దని చెప్పునా? ఇదంతయు చూచి ఆలోచించిన గీతలో ఈ శ్లోకమునకు వివరము చెప్పినవారిదే పొరపాటని తెలియుచున్నది.

నిజమైన అర్థమేమనగా నీ శరీరములోని ఆత్మ నీవు దుఃఖిస్తున్నను, సంతోషిస్తున్నను రెండిటిని సమానముగ చూస్తున్నది. అలాగే అందరిలో వారివారి

ఆత్మ ఆ జీవులు అనుభవించు సుఖమైన, వ్యసనమైన సమానముగ చూస్తున్నది. ఆత్మ సర్వజీవరాసుల ఎడల కష్టసుఖములలో సమముగ సాక్షిగనున్నదని జ్ఞాన దృష్టిచే చూడగల్గినవాడు నిజమైన యోగి అని పరమాత్మ పలికినాడు. శ్లోకములో చెప్పువాడు పరమాత్మ కాగ, కర్మ అనుభవించువాడు జీవుడు, సాక్షియై సమానముగ చూచువాడు ఆత్మ. ముగ్గురు పురుషుల విషయము శ్లోకములో ఇమిడి ఉన్నది.

**అర్జునుడిట్లనియె :**

*(5) శ్లో॥ 33: యోஉయం యోగస్త్వయా ప్రోక్తస్సామ్యేన మధుసూదన! ।*
*ఏత స్యాహం నపశ్యామి చంచలత్వాత్ స్థితిమ్ స్థిరామ్ ॥*
*(కల్పితము)*

*(5) శ్లో॥ 34: చంచలమ్ హి మనః కృష్ణ! ప్రమాథి బలవ ద్దృఢమ్ ।*
*తస్యాహం నిగ్రహం మన్యే వా యోరివ సుదుష్కరమ్ ॥*
*(బ్రహ్మయోగము)*

**భావము :** నాలోని మనస్సు చంచల స్వభావము కలదైనందువలన నీవు చెప్పిన స్థిరమైన స్థితిని యోగమున పొందలేక ఆత్మసామ్యమును తెలియకున్నాను. అమిత చంచలము, దృఢమైనది, బలమైనదియునైన మనస్సును నిగ్రహించుట దుస్సాధ్యమని తోయుచున్నది కృష్ణా! గాలినెవరు మూటకట్టగలరు.

**వివరము :** శ్రీకృష్ణుడు చెప్పిన మాటలన్ని విని అర్జునుడు యోచించి తన అనుమానమును వెంటనే బయటికి చెప్పాడు. గాలిని నూలుగుడ్డలో మూటకట్టుట ఎట్లు సాధ్యము కాదో అట్లే మనస్సును నిగ్రహపరుచుకోవడము సాధ్యముకాదని అర్జునుడు అన్నాడు. ఇక్కడ చెప్పబడిన రెండు (33,34) శ్లోకములలో రెండవదైన 34వ శ్లోకము అర్జునుడు అడిగినదే. 33వ శ్లోకము విషయానికొస్తే భగవంతుడైన శ్రీకృష్ణుడు చెప్పుచుండగానే అర్జునుడు ప్రశ్న అడిగాడు. ఆ శ్లోకములో అర్జునుడు యోగము చేసి మనస్సు స్వాధీనపడకయుండినపుడు నీవు చెప్పినట్లు యోగము

చేయగా నా మనస్సు స్వాధీనపడలేదు. ఆత్మను సర్వులలో చూడలేక పోయానని అన్నాడంటే నిజమని ఒప్పుకోవచ్చును. అట్లుకాక చెప్పుట మానకనే, వినుట అయిపోకనే యోగము చేసినట్లు ఆయన అనుభవమును అర్జునుడు చెప్పాడనుట పూర్తి అసత్యము. కావున ఈ రెండు శ్లోకములలో క్రిందిదైన 34వ శ్లోకము వాస్తవమని 33వ శ్లోకము అవాస్తవమని తెలియాలి.

**శ్రీ భగవంతుడిట్లనియె :-**

*(5)శ్లో॥ 35 : అసంశయం మహా బాహో! మనోదుర్ని గ్రహం చలమ్ ।*
*అభ్యాసేన తు కౌంతేయ! వైరాగ్యేణ చ గృహ్యతే ॥*
*(బ్రహ్మయోగము)*

*(5) శ్లో॥ 36 : అసంయ తాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః ।*
*వశ్యాత్మనా తు యతతా శక్యోఽ వాప్తు ముపాయతః ॥*
*( బ్రహ్మయోగము)*

**భావము :** అర్జునా! నీవు చెప్పుమాటలో అనుమానము లేదు. మనస్సు నిగ్రహింపబడనిది, చంచలమైనది. అట్టి మనస్సును అభ్యాసవైరాగ్యముల చేత నిల్పవలెను. మనస్సు నిల్పకపోతే ఈ యోగము పొందుట సాధ్యపడదు. కావున మనస్సును నిగ్రహించుటకు చేయు ప్రయత్నమే మంచి ఉపాయము.

**వివరము :** అర్జునుడు అడిగిన ప్రశ్నకు భగవంతుని జవాబులో క్రొత్తదనమేది లేదు. ఇంతకు ముందు చెప్పినట్లే సాధన తప్ప వేరు ఉపాయములేదని తేల్చి చెప్పాడు. ఏదో అడిగాడుకదాయని ఏ రాయితీ ఇవ్వలేదు. తప్పనిసరిగ అభ్యాసము చేయవలసిందే, ఆ అభ్యాసములో విషయములందు మనస్సుకు వైరాగ్యము కలుగజేయవలసిందే. అదే మనస్సును జయించుటకు ముఖ్యమైన ఉపాయము. మనస్సు నిగ్రహించుట కష్టతరమైన పనియేనని భగవంతుడు కూడ చెప్పాడు. మరియు ఆయనే దానికి కావలసిన ఉపాయము కూడ చెప్పాడు. అందువలన బ్రహ్మయోగ

సాధకులు అభ్యాసముతోనే మనస్సును స్వాధీనపరచుకోవలెను. శబ్దమునకు సంబంధించిన మరియు దృశ్యమునకు సంబంధించిన మంత్రములు, ఆకారములు యోగసాధనకాదని తెలియాలి. ఆ సాధనలో మనస్సును నిగ్రహించుకోవలసిన అవసరమే లేదు.

**అర్జునుడిట్లనియె :-**

*(5) శ్లో॥ 37 : అయతి శ్శ్రద్ధయో పేతో యోగాచ్చలితమానసః ।*
*అప్రాప్య యోగ సంసిద్ధిం కాం గతిం కృష్ణ! గచ్ఛతి ?*
*(బ్రహ్మయోగము)*

*(5) శ్లో॥ 38 : కచ్చిన్నోభయ విభ్రష్ట శ్ఛిన్నా భ్ర మివ నశ్యతి ।*
*అప్రతిష్ఠో మహాబాహో! విమూఢో బ్రహ్మణః పథి ?*
*(బ్రహ్మయోగము)*

*(5) శ్లో॥ 39 : ఏతం మే సంశయం కృష్ణ! ఛ్ఛేత్తు మ్మర్హ స్యశేషతః ।*
*త్వదన్య స్సంశయ స్యాస్యచ్ఛేత్తా న హ్యుప పద్యతే ॥*
*(బ్రహ్మ యోగము)*

**భావము :** శ్రద్ధ కలిగియుండి సంపూర్ణ ప్రయత్నము చేసినను మనోచలనము చేత యోగి కాలేనివాని గతి ఏమి? ఆత్మదర్శన మార్గములో అప్రతిష్ఠుడైన మూఢుని గతి ఏమి? ఓ కృష్ణా నాకున్న ఈ సంశయమును నీవే తీర్చవలయును. నీవు తప్ప నా సంశయమును ఇతరులెవరు తీర్చలేరు.

**వివరము :** బ్రహ్మయోగమాచరించి దానిద్వార ఆత్మను తెలియాలనుకొన్నవాడు పూర్తి శ్రద్ధతో యోగసాధన చేయుచుండగ, మనస్సు విషయ ధ్యాసలనుండి మరలక యోగము లభ్యము కాలేదు. కాని వాడు అలాగే పట్టుదలగ సాధన సాగించుచుండగ ఆయువు అయిపోయిన దానివలన మరణము సంభవించినది. అట్టివానిని గురించి అర్జునునకు అనుమానము వచ్చినది. వాడు అందరివలె ప్రపంచ విషయములలో

లేకుండ ఆత్మను తెలుసుకోవాలను ప్రయత్నములో యోగసాధన చేయుచున్నాడు. అయినప్పటికి వాడు పూర్తిగ యోగము సాధించకనే చనిపోతే వాని పుట్టుక ఎట్లుండును? ఇప్పుడు చేసిన యోగసాధనా ప్రయత్నమంతయు వృథాయేనా? లేక అంతో ఇంతో ఫలితముండునా? ఈ జన్మలో జ్ఞానము మరుజన్మలో కల్గునా? ఇట్లు అనేక ప్రశ్నలు అర్జునునికి రాగ వచ్చిన సంశయమును వెంటనే అడిగాడు. వాస్తవానికి బ్రహ్మయోగి యోగము పొందిన తర్వాత కూడ కర్మ అయిపోవువరకు కొన్ని జన్మలెత్తవలసి ఉండును. మోక్షము పొందుటకు పూర్తిగ కర్మ అయిపోవాలి కదా! యోగముచే కర్మ అయిపోవు వరకు యోగికి జన్మలుండవలెను. ఒకే జన్మలో పూర్తి కర్మ అయిపోదు. అటువంటి జన్మరాహిత్య ప్రయత్నములోనున్నవాని జన్మల గూర్చి భగవంతుడిట్లనుచున్నాడు.

**శ్రీ భగవంతుడిట్లనియె :-**

*(5) శ్లో॥ 40 : పార్థ! నైవేహ నాఽముత్ర వినాశ స్తస్య విద్యతే ।*
*నహి కళ్యాణకృ త్కశ్చి ద్దుర్గతిం తాత! గచ్ఛతి ॥*
*(జీవుడు)*

**భావము :** మంచి పనులు చేయువానికి మంచే జరుగును. ఈ జన్మలోగాని మరి ఏ జన్మలోగాని వాని సాధనకు నాశనముండదు.

**వివరము :** మంచి చేయువానికి మంచి ఫలితము తప్పకవుండును. ఈ జన్మలో యోగమాచరించి మరణములోపల సాధించలేని యోగికి చెడు ఎప్పటికి జరుగదు. వాని మనస్సులోని ఉద్దేశ్యమేముండునో మరణానంతరము మరుజన్మలో కూడ అదియే ఉండును. అందువలననే పుట్టి పెరుగువారు కొంత వయస్సుకు ఒక్కొక్కడు ఒక్కొక్క పనిలో ఆసక్తి చూపువాడై ఉండును. వానికున్న ఆసక్తి ప్రకారమే ఆ పనిలోనే ప్రావీణ్యత సంపాదించును. చిన్న వయస్సులోనే సంగీతమును మొత్తమును సాధించినవాడు గడచిన జన్మలో సంగీత సాధకునిగ ఉండును. అట్లే యోగవిద్యలో కూడ ఉండవచ్చును.

5) శ్లో॥ 41 : ప్రాప్య పుణ్య కృతాం లోకా నుషిత్వా శాశ్వతీ స్సమాః ।
శుచీనాం శ్రీమతాం గేహే యోగ భ్రష్టో౽ భిజాయతే ॥
(జీవాత్మ)

**భావము :** యోగభ్రష్టులైనవారు పుణ్యము చేసినవారు పొందులోకములనే తాము పొంది, పరిశుద్ధమైన జ్ఞానము కలవారింటిలో పుట్టగలుగుదురు.

**వివరము :** ఇక్కడ ఈ శ్లోకములో ఇతరులు వ్రాసిన దానికి మేము వ్రాయుదానికి చాలా భేదమున్నది. ఒకటి రెండు శ్లోకాలకైతే ఏదో పొరపాటనుకోవచ్చును, సవరించి వ్రాయవచ్చును. చాలా శ్లోకాలకు భావాలను సరిదిద్ది ముందు వ్రాసిన వారికి వ్యతిరిక్త దిశలో వ్రాయాలంటే మాకు కూడా కష్టమే. చాలా చోట్ల విభేదించుట వలన కొందరు మా వ్రాతలే తప్పనుకొనుటకు అవకాశము గలదు. ఇన్ని శ్లోకములకు తప్పు వ్రాసియుంటారా! అను అనుమానము ఎవరికైన రాకతప్పదు. ఆ అనుమానము మాకే వస్తుందంటే నమ్మలేరు. ఎంతో చిన్న విషయమును కూడ గ్రుడ్డిగ తప్పు వ్రాసిన దానిని బట్టి గొప్పవారు ఇలా వ్రాయుటేమిటని అనుకోవలసిందే. దైవ విరుద్ధమైన మాయ మాములు ప్రజలందరికంటే బోధకుల మీదనే ఎక్కువగా పనిచేస్తుంది. ఎందుకనగ వీరు చెప్పు బోధను బట్టి మిగతా ప్రజలు నడుచుకుంటారు. మొదట బోధకులనే తప్పుదారి పట్టిస్తే అందరిని పట్టించినట్లగును. అందువలన బోధకుల తలలోనున్న మాయ అక్కడక్కడ తప్పుదారి పట్టించి వ్రాయించిందను కుంటాము. అలాకాకపోతే యోగసాధకులు ధనికుల ఇల్లలో పుట్టడమేమిటి.? శ్రీమంతులకు జ్ఞానము లభించుట సూదిరంధ్రములో ఒంటె దూరినట్లేనని ఏసుప్రభువు సెలవిచ్చాడు. వాస్తవముగ అనుభవపూర్వకముగ చూచిన, కష్టాలలో ఉన్నవాడే అంతో ఇంతో దైవాన్ని తలచుకొనుచున్నాడు తప్ప, ధనికులలో ఆ ధ్యాసలేదనియే చెప్పవచ్చును. ధనికుడుగనున్న వాడు తిరిగి ధనమునే సంపాదించు ధ్యాసలో మునిగివున్నాడు. ధనికులలో ఎక్కడైన భక్తి కనిపిస్తే అదియు డబ్బుతో చేయించునదియే కాని మనసుతో చేయునదిగ ఉండదు.

ఇంకో విధముగ గమనిస్తే యోగభ్రష్టులు శ్రీమంతుల ఇల్లలో పుట్టుదురను మాట పెద్దలు గ్రుడ్డిగ వ్రాసినది తప్ప వాస్తవము కాదని చెప్పవచ్చును. ఎందుకనగా నేడు డబ్బున్నవారు ఉదయము లేచింది మొదలు పాపపుపనులు చేయుటలో నిమగ్నమైనారు. దీనిని బట్టి వారికి వెనుకజన్మలలో జ్ఞానమనునది ఏమాత్రము లేదనియే చెప్పవచ్చును. మరికొందరు ధనికులైనవారు జ్ఞానులను సహితము వారి మాట ప్రకారము నడువవలెనని చెప్పుచున్నారు. గురువులన్నా, యోగులన్నా ఏమాత్రము విలువనివ్వని ధనమున్నవారు పూర్వజన్మలో యోగులా? కావున యోగభ్రష్టులైనవారు శ్రీమంతుల ఇల్లలో పుట్టుట శుద్ధ అబద్ధము. శ్రీమంతుల ఇల్లలో పుట్టినవారు ఒకవేళ ఈ జన్మలో జ్ఞానము సంపాదించుకొనుట జరుగవచ్చును. ఇప్పటి ధనికులు వెనుకటి యోగులు మాత్రము కారు.

పై శ్లోకములో **'శ్రీమతాంగేహే యోగ భ్రష్టోభిజాయతే'** అన్న మాటలో **'శ్రీమతాం'** అనుమాటకు శ్రీమతులు అని అర్థము. శ్రీ అనగ శుభమైన, మతి అనగ జ్ఞానము. శ్రీమతాం అనగ శుభప్రదమైన ఆత్మజ్ఞానము కలవారని అర్థముండగ శ్రీమతాం అను పదమునకు ధనికులనడమేమిటి. **శ్రీమంతాం** అనగ ధనికులనియే చెప్పవచ్చును. కాని **శ్రీమతాం** అన్నమాటకు జ్ఞానులనియే చెప్పాలి. చాలామంది వ్రాసినట్లు యోగులు మరుజన్మలో ధనికులుగ పుట్టుదురను మాటను వదలివేసి, యోగులకు మరుజన్మ యోగుల గృహములలోనే కల్గునను అర్థముతోనే చెప్పుకొందాము.

మనము చేయు పనులను బట్టి పాపపుణ్యములు రావడము జరుగుచున్నది. రకరకాల పాపపుణ్యములలో భక్తిమార్గపు పుణ్యములు కూడ ఉండును. అటువంటి పుణ్యము గలవాడు సాత్త్వికులుగ పుట్టగలుగుదురు. వారికున్న భక్తి ప్రవృత్తుల బట్టి నెమలిపింఛములో చూపినట్లు ఆత్మకు దగ్గరగనున్న గుణభాగమైన సాత్త్వికములో పుట్టుచుందురు. సాత్త్విక గుణభాగములోనున్నవారు పరిపూర్ణ జ్ఞానులై చివరకు యోగులగుటకు అవకాశము గలదు. తామస, రాజస, సాత్త్వికములైన ముల్లోకములలో యోగభ్రష్టులైన వారు సాత్త్విక లోకములో పుట్టుచుందురు. వారికి మోక్షము

కలుగువరకు ఎన్ని జన్మలు కల్గిన, శాశ్వితముగ జన్మలన్ని సమానముగ సాత్త్వికములోనే కల్గును. సాత్త్వికలోకమున గల మనుషులలో పరిశుద్ధ పవిత్ర ఆత్మజ్ఞానము కల్గిన వారుండు గృహములలోనే జన్మించుదురు. తల్లిదండ్రులే జ్ఞానులుగ ఉండనవసరము లేదు. పుట్టు ఇంటిలో తాత ముత్తాతలైన జ్ఞానులుగ ఉండవలెను. అట్లుండుటవలన వారి వంశ పరంపరకు సంబంధించిన జీన్సు వలన కొడుకుగనో, మనువడిగనో, మునిమనువడుగనో పుట్టవచ్చును.

ఈ విషయమునంతటిని బట్టి పై శ్లోకము యొక్క నిజభావము ఇలాగున్నది. యోగభ్రష్టుడైనవాడు పుణ్యపరులకు లభించు సాత్త్వికలోకములో ఎన్నో జన్మలు సమానముగ కల్గుచుండును. ఆ జన్మలు శుచి కల్గిన పవిత్రమైన జ్ఞానముగల వారిల్లలోనే కల్గుచుండును. ఇంతకుమినహా వేరుగ అర్థము చేసుకోకూడదు. లోకములనగ స్వర్గ, నరకలోకములని అవి ఎక్కడోనున్నవని చెప్పుకోకూడదు. లోకములున్నవి మూడే, అవి మనలోనే ఉన్నవి. లోకములు మనలో తప్ప బయట ఎక్కడలేవు. ఇవి మూడుకాక లోకముకానిలోకమొకటున్నది. దానితో నాల్గు లోకములగును. దానినే **ముల్లోకముల కావల ఆలోకంబున్నదని** పోతన కూడ చెప్పాడు. స్వర్గనరక లోకములు ఎక్కడున్నాయను అనుమానము కొందరికుండ వచ్చును. మూడు లోకములైన వాటిలోనే స్వర్గ నరకములున్నాయి. శరీరములోనే అనుభవించు సుఖములు స్వర్గము. మరియు శరీరములోనే అనుభవించు కష్టములు నరకము. స్వర్గనరకములు రెండు మన శరీరములో సజీవముగనున్నపుడే ఉన్నవి. అవి మూడు గుణభాగములలోనే ఉన్నవి. కనుక వాటిని కూడ లోకములనుట జరిగినది. అవి మూడులోకములలోనివేనని తెలియాలి. ఈ శ్లోక వివరము అర్థమగుటకు బాగా ఆలోచించాలని కోరుచున్నాము.

(5) శ్లో॥ 42 : అథవా యోగినా మేవ కులే భవతి ధీమతామ్ ।
ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశమ్॥

(జీవాత్మ)

**భావము :** అట్లుకాకున్న ధీమంతులైన యోగుల వంశములోనైన పుట్టును. అట్టి లోకపు జన్మ పొందుట ఎంతో దుర్లభము కదా!

**వివరము :** యోగ సాధకుడు జ్ఞానపరుల ఇండ్లలో పుట్టునని చెప్పుకొన్నాము. అట్లుకాకపోతే యోగపరుల ఇండ్లలోనైన పుట్టవచ్చునని కూడ భగవంతుడు తెలియజేశాడు. భూమి మీద ఆధ్యాత్మికతతో సంబంధమున్నవారు, ఆత్మజ్ఞానము తెలిసిన జ్ఞానులు మరియు తెలిసినది సాధించిన యోగులుకలరు. అట్టి జ్ఞానులు, యోగుల వద్దనే యోగభ్రష్టుడు పుట్టుట వలన తిరిగి యోగము సాధించుటకు వీలగును. పుట్టిన ఇంటిలో ప్రస్తుతము యోగులు ఉండవచ్చును లేక రెండు మూడు తరముల క్రిందయైన ఉండవచ్చును. అందువలన శ్లోకములో *'యోగినామేవకు లేభవతి'* అన్నారు దానికి యోగులకు సంబంధించిన వంశమందేనని అర్థము.

(5) శ్లో॥ 43 : *తత్ర తం బుద్ధి సంయోగం లభతే పౌర్వదైహికమ్ ।*
*యతతే చ తతో భూయ స్సంసిద్ధౌ కురునందన! ॥*
*(జీవాత్మ)*

**భావము :** అట్లు మరుజన్మము పొందినవాడు, తన పూర్వదేహమునందు గల జ్ఞానము బుద్ధికి తోయగ, మరల మోక్షసిద్ధి కొరకు సంపూర్ణ ప్రయత్నము చేయుచుండును.

**వివరము :** యోగపరుడు మరణించిన తర్వాత జ్ఞానుల వంశములోకాని, యోగుల వంశములోకాని పుట్టి కొంతకాలము పెరిగి, తర్వాత వయస్సు రానురాను వానియందు బుద్ధికి జ్ఞానజిజ్ఞాస ఏర్పడును. అట్లు జిజ్ఞాస ఏర్పడుట వలన వాడు తిరిగి యోగసాధనకు సంబంధించిన మార్గముననే నడుచుటకు ప్రయత్నము చేయును. మొదట ఏదో ఒక కారణముచేత వాని బుద్ధికి జ్ఞానము మీద శ్రద్ధ ఏర్పడును. అట్లు ఏర్పడిన శ్రద్ధయే అన్ని శ్రద్ధలకంటే ఎక్కువగా ఉండును. ఒకచోట వందమంది కలిసి యోగమునకు సంబంధించిన పుస్తకము చదివారనుకొనుము. అందులో ఒక్కనికి మాత్రము అదే చింత వాని బుద్ధికి యోచనై కూర్చున్నదనుకొనుము. అది

వాని పూర్వజన్మ సుకృతమని కొందరందురు. అట్లే పూర్వజన్మ సంస్కారమని కూడ అందురు.

*(5) శ్లో॥ 44 : పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపి సః ।*
*జిజ్ఞాసు రపి యోగస్య శబ్ద బ్రహ్మాఽ తి వర్తతే ॥*
*(జీవాత్మ)*

**భావము :** పూర్వజన్మ అభ్యాస బలముచేత లాగబడి ఈ జన్మలో కూడ యోగము ఆచరించవచ్చును. అటువంటి జిజ్ఞాసులు శబ్ద బ్రహ్మమధిగమించి పోవుచున్నారు.

**వివరము :** నాద బ్రహ్మము, దృశ్యబ్రహ్మము అని రెండు రకములు కలవు. భూమి మీద గురువులు అందరు వారివారి శిష్యులకు వీటినే ఉపదేశిస్తుందురు. నాదబ్రహ్మమనగ శబ్దముతో కూడుకొన్న దైవము మంత్రమని, అట్లే దృశ్య బ్రహ్మమనగా ఆకార స్వరూప బ్రహ్మము గుర్తు అని చెప్పుకొనుచుందురు. వాటినే ఉపదేశములుగ చెప్పుట పరిపాటైనది. ఇక్కడ యోగమాచరించువాడు దృశ్యనాదములకతీతమైన ఆత్మశక్తి (జ్ఞానాగ్ని)ని పొందుచున్నాడు. నాదబ్రహ్మము అనబడు మంత్రోపదేశము కంటే యోగము ఉత్తమమని తెలియుచున్నది. మంత్రధ్యాసలో తపోఫలము లభించుచున్నది. యోగములో జ్ఞానాగ్నియే లభిస్తుంది. తపోఫలముకంటే జ్ఞానశక్తి ఎన్నో రెట్లు అధికమని చెప్పవచ్చును. కావున యోగి శబ్దబ్రహ్మమధిగమించిన వాడని చెప్పవచ్చును.

*(5) శ్లో॥ 45 : ప్రయత్నా ద్యత మానస్తు యోగీ సంశుద్ధ కిల్బిషః ।*
*అనేక జన్మసంసిద్ధ స్తతో యాతి పరాంగతిమ్ ॥*
*(జీవాత్మ)*

**భావము :** అనేక జన్మలనెత్తుచు దృఢప్రయత్నము చేసి యోగమును పొందగల్గి, తనకువున్న సర్వకర్మలు పోయిన తర్వాత పరమును పొందగల్గును.

**వివరము :** యోగి కావాలనుకొన్నవాడు యోగమును సాధించుటకు వాని

ప్రయత్నమును బట్టి సంవత్సరకాలముగాని, కొన్ని సంవత్సరములుకాని, లేక జన్మలు కాని పట్టవచ్చును. చివరకు యోగి అయినవాడు మోక్షము పొందుటకు కొన్ని జన్మలు పట్టును. కర్మమంతయు నశించుటకు కొన్ని జన్మలు తప్పక పట్టును. కర్మ అయిపోవునంత వరకు జన్మలు తప్పవు. కర్మంతయు అనగ తనకున్న పాపపుణ్యములన్నియు శేషములేకుండ అయిపోయిన క్షణమే శరీరమును వదలి సర్వవ్యాపి అయిన మోక్షమును పొందును. ఒకే జన్మలో యోగమును సాధించవచ్చునేమో కాని మోక్షమును సాధించలేము. ప్రయత్నపరునికి అనేక జన్మల సంస్కార ఫలమే మోక్షము కాగలదు.

*(5)శ్లో॥ 46 : తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః ।*
*కర్మిభ్య శ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున ॥*

*(జీవాత్మ)*

**భావము :** తపస్వికులకంటే యోగి అధికుడు. అట్లే జ్ఞానులకంటే ఉత్తముడు కర్మములు చేయువారికంటే గొప్పవాడు. కావున నీవు యోగివేకమ్ము.

**వివరము :** దైవమును ఆరాధించు విధానములను మూడు రకములుగ విభజించు కోవచ్చును. ఒకటి యోగము, రెండు తపస్సు, మూడు వ్రతక్రతవులు, యజ్ఞ యాగములు, అనేక విధ గ్రహ విగ్రహ పూజలు. మూడు తెగలలో ఎవరినడిగిన మేము దైవారాధకులమనియే చెప్పుచుందురు. ఈ మూడు విధానములలో ఏది పెద్దదని యోచించిన, అనేక విధ పూజలు చేయువారికంటే తపస్సు చేయువారు గొప్పని, తపస్వికులకంటే యోగులు గొప్పవారని తెలియుచున్నది. సాధారణ పూజలు చేయువారిలో ఏ శక్తి ఉండదు. వారు తమ కోర్కెల నిమిత్తము చెట్లకు, జంతువులకు, గ్రామ దేవతలకు పూజ చేయుచుందురు. మరికొందరు మంత్రోపాసకులై చిన్నచిన్న క్షుద్రదేవతలను వశముగావించుకొన్నవారున్నారు. మంత్రమును నియమము ప్రకారము జపించి దానివలన కొంత శక్తిని పొందినవారు కూడవున్నారు. మంత్రము జపించడమును తపస్సని చెప్పవచ్చును. చిల్లర పూజలు చేయువారు మొదటి

తరగతివారైతే, మంత్రజపము చేయువారు రెండవ తరగతివారు. ఈ శ్లోకములో మొదటితరగతివారైన పూజా కార్యములు అనగ కార్యములతో కూడుకొన్న పూజలు చేయువారని చెప్పారు. వంగడము, లేవడము ప్రదక్షిణలు చేయడము మొదలగు కార్యములతో కూడుకొన్న దానివలన వారిని కార్యములు చేయువారని చెప్పడము జరిగినది.

రెండవ తరగతి క్రిందికి లెక్కగట్టబడిన మంత్రజపము చేయువారిని తపస్వికులు అంటున్నాము. మంత్రమును ఉద్దేశ్యముతో తపించడము వలన వారు చేయునది తపస్సని అంటున్నాము. వీరిలో తీవ్ర తపముచేసి దేవతలను సాక్షాత్కరింప జేసుకొన్నారని పూర్వులు చెప్పగ విన్నాము. ఇప్పటి కాలములో మంత్రజపము చేసి దేవతలను వశపరుచుకొని వారిద్వార కొన్ని పనులు జరుపుకొనువారున్నారని చెప్పవచ్చును. అలా జరుగుటకు దేవతలు వశమగుటకు ఏదో ఒక శక్తి అవసరము. ఆ శక్తినే తపశ్శక్తి అనగలుగుచున్నాము. మంత్రమేదైనకావచ్చును, వానిలో ఉద్దేశ్యమేదైన కావచ్చును, మంత్రజపము చేయువానిని తపస్వికుడని చెప్పవచ్చును.

మూడవ తరగతికి చెందిన యోగులు ప్రత్యేకించినవారై ఉన్నారు. వీరు పూజాకార్యములు చేయరు. మంత్రజపములు చేయరు. ఇంద్రియాలకు అతీతమైన మనస్సు అహముల యొక్క జయమే వీరి ముఖ్య ఉద్దేశ్యమైవుండును. దానిద్వార వీరి కర్మ కాలిపోయి అన్నిటికంటే గొప్పదైన పరమాత్మలోనికే ఐక్యమై పోవుదురు. వీరు బ్రహ్మయోగులుగ కొందరు, కర్మయోగులుగ కొందరు కలరు. కర్మయోగులైన వారు పూజలు చేయువారికంటే, తపస్సు చేయువారికంటే తక్కువ వారిగ కనిపిస్తారు. సాధారణ పూజలు చేయువారిని మంత్రజపము చేయువారు వారి శక్తిచేత ఇబ్బంది పెట్టవచ్చును. ఉదాహరణకు ఒక మాంత్రికుడు తన వశములో ఉన్న ఒక దేవతాపేరుకల శక్తితో మరొక పూజారిని అనారోగ్యపాలు చేశాడు. మా వద్దకు వచ్చిన పూజారిలోపలనున్న అనారోగ్యకారణమైన ఆ దేవతను ప్రశ్నించగ పలానా మాంత్రికుని ఆదేశానుసారము ఈ విధముగ చేశానని ఆ దేవత చెప్పడము

జరిగినది. దీనిని బట్టి పూజలు చేయువారికంటే తపస్వికుడు అధికుడని తెలియుచున్నది.

మాంత్రికులచేత ప్రయోగింపబడిన శక్తులు యోగులవద్ద భంగపడి వెను తిరిగిపోయిన ఎన్నో సంఘటనలు జరిగినవి ఉన్నాయి. మంత్రసాధనచే లభించిన తపశ్శక్తికంటే యోగులవద్ద గల జ్ఞానాగ్ని ఎంతో పవిత్రమైనది. అణువణువున వ్యాపించిన పరమాత్మశక్తియే జ్ఞానాగ్నిగా తయారైనది. కనుక దానిని ఏ శక్తి తాకలేదు. అందువలన తపస్వికులకంటే యోగులధికులు. అంతేకాక యోగమునకు మార్గమును చూపునది జ్ఞానము. జ్ఞానము తెలిసిన తర్వాత యోగము సాధించనగును. జ్ఞానము యొక్క ఫలము యోగమగును. అందువలన జ్ఞానముకంటే యోగమధికమైనది. పూజా కార్యములు చేయువారికంటే తపస్వికులు అధికులుకాగ, తపస్వికులకంటే జ్ఞానులు అధికులు కాగ, జ్ఞానులకంటే యోగులధికులని చెప్పవచ్చును. అన్నిటికంటే యోగులధికులైన దానివలన శ్లోకములో పూజకర్మలు చేయువారికంటే తపస్వికులకంటే, జ్ఞానులకంటే యోగులధికులన్నారు.

*(5) శ్లో॥ 47 : యోగినా మపి సర్వేషాం మద్గతే నాన్త రాత్మనా ।*
*శ్రద్ధావాన్ భజతే యోమాం స మేయుక్తతమో మతః ॥*
*( జీవాత్మ, ఆత్మ, పరమాత్మ)*

**భావము :** సర్వయోగులందు ఎవడు నా గతియైన మోక్షము కొరకు ఆత్మను యోగ ఆచరణచే పొందగల్గి నన్నే భజించునో, వాడు ఉత్తమ యోగి అని నా అభిమతము.

**వివరము :** భూమిమీద మానవులలో పూజలు చేయువారు ఎందరో ఉన్నారు. అట్లే మంత్రజపము చేయువారు కూడ ఉన్నారు. అంతో ఇంతో జ్ఞానము కలవారు ఉన్నారు. చాలా తక్కువ సంఖ్యలో కొన్ని వేలలో ఒక్కడు యోగసాధన చేయువాడు ఉన్నాడు. అటువంటి వారిలో ఎవడో అరుదుగ యోగము సాధించకల్గువాడు కలడు. చివరకు లెక్కవేస్తే కొన్ని లక్షల జనాభాలో ఒక యోగి దొరకవచ్చును. ఇది ఇప్పటి పరిస్థితి. ఆ కొద్దిమంది యోగులలో పరమాత్మను చేరుటకు ముఖద్వారము ఆత్మయేనని తెలిసి, ఆత్మను తొందరగ పొంది కర్మలనాశనము తొందరగా కావాలంటే,

సాకారమైన భగవంతుని భజించాలని తెలిసి భజించువాడు యోగులలో ఉత్తముడు అన్నారు.

యోగులలో యోగము పొందిన తర్వాత యోగియే అగును. అందులో ఉత్తముడని నీచుడని హెచ్చుతగ్గులుండవు. ఇక్కడ ఉత్తముడనుటలో ఆ అర్థము తీసుకోకూడదు. యోగము ద్వార కర్మ కాలిపోవు కాలముకంటే తొందరగ మోక్షము పొందువాడని అర్థము. ఉదాహరణకు టేప్‌రికార్డర్‌లో నిదానముగ రికార్డ్ అవడము సాధారణమైన పనికాగ, ప్రత్యేకించి వేగముగ రికార్డు చేయు పద్ధతొకటున్నది. అన్ని టేప్‌రికార్డులలో మామూలుగ రికార్డవు అవకాశముండగ, ప్రత్యేకించిన రికార్డర్లలో మాత్రమే స్పీడ్ రికార్డింగ్ ఉన్నట్లు, యోగులందరికి లేని ప్రత్యేకత వానికెందుకు ఉన్నదనగా వాడు సాకారమైన భగవంతున్ని కూడ గుర్తించి భజించుచున్నాడు. అందువలన వానికర్మ స్పీడ్‌గా కాలిపోవుచున్నది. మామూలు యోగి ఒకే జన్మలో మోక్షము పొందలేడు. కర్మ అయిపోవుటకు కొన్ని జన్మలు పట్టవచ్చును. పూర్తి కర్మ అయిపోయిన జన్మలో మోక్షము పొందునని 45వ శ్లోకములో **'అనేక జన్మసంసిద్ధ'** అని చెప్పుకొన్నాము. ఇక్కడ **'యోగినామపి సర్వేషాం ఉక్త తమోమతః'** అన్నారు. సర్వ యోగులలో ప్రత్యేకించినవాడని చెప్పారు. ప్రత్యేకత కల్గిన యోగి ఒకే జన్మలోనే మోక్షము పొందును. దీనిని బట్టి యోగులలో ఉత్తముడన్నారు తప్ప వేరు అర్థము లేదు. సాకారమైన పరమాత్మ భగవంతునిగ భూమిమీద తెలియడము దుర్లభమైన పని అంత దుర్లభమైన దానిని తెలియుటలో ఆ యోగికి ప్రత్యేకతవున్నదని తెలియుము.

సర్వయోగులలో పరమాత్మ సాకారమును తెలిసి యోగము చేయువాడు ఉత్తమ యోగి. సాకారరూపము గురించి ఏమాత్రము తెలియక యోగము మాత్రము తెలిసినవాడు సాధారణ యోగి. సాధారణ యోగులే కరువైన ఈ కాలములో ఒకే జన్మలో మోక్షముపొందు ప్రత్యేకమైన యోగి దొరకడము కష్టము. అదియు పరమాత్మ భూమిమీద భగవంతునిగ సాకారరూపములో ఉన్నపుడే ఉత్తమ యోగులుండుటకు అవకాశము గలదు.

ఇంతటితో ఈ ఆత్మసంయమ యోగమను అధ్యాయము అయిపోయినది. ఈ అధ్యాయములోని ఎన్ని శ్లోకములు ఎవరిని గూర్చి ఉన్నవో ఆ వివరము క్రింద చూడగలరు.

| | | | |
|---|---|---|---|
| 1) | కర్మయోగము | = | 1 |
| 2) | కర్మయోగము, బ్రహ్మయోగము | = | 2 |
| 3) | బ్రహ్మయోగము | = | 30 |
| 4) | కల్పితము | = | 1 |
| 5) | జీవాత్మ, ఆత్మ, పరమాత్మ | = | 6 |
| 6) | జీవాత్మ | = | 7 |
| | మొత్తము శ్లోకములు | = | 47 |

భావము, వివరము మార్చి వ్రాసిన శ్లోకములు – 1,3,5,6,32,41.

*****

## ఆరవ అధ్యాయము

# విజ్ఞాన యోగము

ఇంతవరకు చెప్పిన అధ్యాయములలో ఎక్కువ కర్మయోగమును, బ్రహ్మయోగమును గురించి చెప్పడమైనది. ఇప్పుడు ఈ అధ్యాయములో జీవాత్మ, పరమాత్మల గురించి ఎక్కువగ ఉండును. రాబోవు అధ్యాయములో ప్రకృతి, ఆత్మల విషయమే ఎక్కువగా ఉన్నది. యోగముల విషయము బహుతక్కువగ ఉండును. ముఖ్యముగ చెప్పడమేమనగా! పూర్వకాలములో రోగమునకు తగ్గవాత, విషమునకు తగ్గమంత్రము, జాఢ్యమునకు తగ్గమందు అవసరమని పెద్దలనెడివారు. వాస్తవముగ వారు ఆ పద్ధతినే అనుసరించెడివారు. ఆ కాలములో నేటి వైద్య సదుపాయములు సూదిమందులేదు. కావున అప్పటి కాలములో వాతలతో కొన్ని రోగములు నయమైపోయెడివి. నేడు కూడ కొన్ని చోట్ల కామెర్ల రోగమునకు అదే పద్ధతి అనుసరిస్తున్నారు. విషమునకు తగ్గ మంత్రములు ఈ కాలములో కూడ అక్కడక్కడ పనిచేయుచునే ఉన్నవి. బాధపడుచున్న వానికి రోగము వలన బాధపడుచున్నాడా, లేక విషము వలన బాధపడుచున్నాడా అని కనిపెట్టి, ఏ వైద్యము అవసరమో ఆ వైద్యము చేయాలి. అట్లు చేయుట వలననే వాడు బాగుపడును. అట్లుకాక రోగమున్న వానికి మంత్రము, విషమున్నవానికి మందువేస్తే పనిచేయదు, వాడుబాగుపడడు. ఆ విధముగనే గీతలో మనము చదువు శ్లోకమును బాధగ్రస్తునికున్నది విషమా, రోగమా అని పరిశీలించినట్లు ఆలోచించి చూచి, ఈ శ్లోకము పలానా విషయమై ఉన్నదని తెలిసినపుడె చదువువాడు బాగుపడును. అట్లు తెలియక అక్కడొకటుంటే మనమొకటి అర్థము చేసుకొంటే గీత అర్థము కాదు, మనము బాగుపడలేము. ఈ అధ్యాయములో శ్లోకములన్ని ఆత్మల గురించి చెప్పియున్నారు. వాటిలో ఏ శ్లోకము ఏ ఆత్మదో తెలిసినపుడే భావము తెలియును. అట్లు తెలియకపోతే గీత భావమునకు మనము చాలా దూరముగ ఉన్నవారమౌతాము.

**శ్రీ భగవంతుడిట్లనియె :-**

(6) శ్లో॥ 1: మయ్యాసక్తమనాః పార్థ! యోగం యుంజన్మదాశ్రయః ।
అసంశయం సమగ్రం మాం యథా జ్ఞాస్యసి తచ్ఛృణు ॥
(జీవాత్మ, పరమాత్మ)

**భావము :** నా మీదనే ఆసక్తికల్గి, నన్నే ఆశ్రయించి యోగాభ్యాసము చేయుచు, సంశయము లేకుండ సంపూర్ణముగ నన్ను ఎట్లు తెలియగలవో ఆ విధానమును వినుము.

**వివరము :** ఇక్కడ శ్రీకృష్ణుని శరీరమునుండి పరమాత్మ అర్జునునిగనున్న జీవాత్మకు ***"జీవాత్మయిన వాడు ఎవరైన పరమాత్మ అనువాడొకడున్నాడని గ్రహించి, వానిని తెలియాలను ఆసక్తి పెట్టుకొని, ఆయనను తెలియుటకు ఆధారమైనది యోగమని తెలిసి, ఆ విధానము ప్రకారమే యోగమాచరించి చివరకు అనుమానము లేకుండ పూర్తిగ పరమాత్మను తెలియు విషయమంతా చెప్పెదను వినుము"*** యని తెలియజేయుచున్నాడు. ఇక్కడ ముఖ్యముగ గ్రహించవలసిన విషయమేమంటే! జీవాత్మ పరమాత్మల మధ్యవారధిలాంటిది ఆత్మ, జీవాత్మ స్థానమునుండి పరమాత్మ స్థానమునకు చేరాలంటే ఆత్మయను దానిని తప్పక తెలియవలసిందే. ఆత్మను తెలియని జీవాత్మ పరమాత్మను చేరలేడని దీని భావము.

(6) శ్లో ॥ 2 : జ్ఞానం తేఽహం సవిజ్ఞాన మిదం వక్ష్యామ్య శేషతః ।
యద్జ్ఞాత్వా నేహభూయోఽన్యత్ జ్ఞాతవ్య మవ శిష్యతే ॥
(జీవాత్మ)

**భావము :** జ్ఞానమును నీకు నేను విజ్ఞాన పూర్వకముగా తెలియచేసెదను. దానిని తెలిసిన తర్వాత ఇంకొకటి తెలియవలసినదుండదు.

**వివరము :** ప్రపంచములో అన్నిటికంటే ముఖ్యముగ తెలుసుకోవలసినది కర్మను పోగొట్టుకొను యోగవిధానము. జన్మలకు కారణమైన కర్మనే భస్మీపటలము చేయు

విధానమును తెలుసుకొన్న తర్వాత ఇంకొక దానిని తెలుసుకోనవసరములేదు. కర్మను కాల్చివేయు యోగ విషయ జ్ఞానమును అనుభవసహితముగ ఎట్లు తెలుసుకోవాలో, ఆ విషయమును తెల్పెదనని భగవంతుని శరీరములోని పరమాత్మ చెప్పాడు.

(6) శ్లో॥ 3 : మనుష్యాణాం సహస్రేషు కశ్చి ద్యతతి సిద్ధయే ॥
యతతా మపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః ॥
(జీవాత్మ)

**భావము :** నరులలో మోక్షమునకై ప్రయత్నము చేయువాడు వేయిమందిలో ఒకడుండుట అరుదు. అట్లు ప్రయత్నము చేయువారిలో చివరకు ఎవడో ఒకడు నన్ను తెలుసుకోగలడు.

**వివరము :** జన్మరాహిత్యము చేసుకొని పరమాత్మలోనికి ఐక్యము కావలెననుకొనువారు లక్షకొకరు కనబడుట కూడ కష్టము. భగవద్గీతను అర్జునునికి చెప్పిన దినమున వేయిమందికి ఒకడు అరుదే అయివుండవచ్చును. అప్పటికంటే అజ్ఞానము పెచ్చు పెరిగిన ఈ దినములలో లక్షకొకడు కనబడుట కూడ అరుదుగనే ఉన్నది. అటువంటి వారిలో చివరకు ఎవడో ఒకడు మోక్షము పొందును. భగవంతుని మాటప్రకారము వేలలో ఒకడు ప్రయత్నము చేయువాడుండగ, వారిలో ఎవడో ఒకడు మాత్రము మోక్షము పొందగలడనుకొందాము. అదియునుకాక వేయిమందికొకడు అరుదుకాకుండ ఒకడు తప్పనిసరిగ ఉంటాడనుకొందాము. ఆ ఒక్కడు తప్పనిసరిగ ఎందుకు మోక్షము పొందలేక పోవుచున్నాడని యోచిస్తే తెలియునదేమనగా! ఉదాహరణకు ఒక ఊరిలో వేయిమంది జనాభా ఉన్నారనుకొనుము. అందులో ఒకడు దైవచింతన కల్గి ధ్యానము, యోగము అనుకొంటు ప్రయత్నము చేయుచుండెను. వానికి ఇంటిలోనివారు ప్రథమశత్రువులుకాగ ఊరిలో 999 మంది వ్యతిరేఖులుగనే తయారైనారు. ఊరంత ఉత్తరమంటే వానిదొక్కనిది దక్షిణమన్నట్లున్నది. 999 మంది వ్యతిరేఖులతో ఒక సంవత్సరము, రెండు సంవత్సరములు జరుగగ, మిగతా

వారితో ఇబ్బందులు పడలేక చివరకు వాడు కూడ వారి దారిననే నడుచుటకు మొదలుపెట్టెను. ఆ విధముగ వాడుకూడ మారిపోవుట వలన ఆ ఊరిలో వేయికి వేయి ఒకే అజ్ఞాన మార్గములో నడుచువారై ఉండిరి. అట్లుకాక అందరికి ఎదురీత ఈది, చివరకు మరణమైన పరవాలేదనుకొనువాడైతేనే మోక్షము పొందగలడు. అంత తెగింపుగల వారెక్కడున్నారు. ఉన్నా మాయ వానినుండనివ్వదు. బయటి ప్రజలకు, లోపలి మాయకు లొంగనివాడైతేగాని మోక్షసిద్ధికి సాధ్యపడదు. అందువలన అనుకొన్నవారందరు మోక్షము పొందలేరని భగవంతుడు చెప్పాడు.

(6) శ్లో॥ 4 : భూమి రాపోஉనలో వాయుః ఖం మనో బుద్ధి రేవ చ ।
అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా ॥

(ప్రకృతి)

**భావము :** భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశము, మనస్సు, బుద్ధి, అహము అను అష్ట భాగములుగ నా ప్రకృతి గలదు.

**వివరము :** యావత్ చరాచర ప్రపంచమునంతటిని రెండుగ చెప్పుకోవచ్చును. అవియే ప్రకృతి, పరమాత్మ. కంటికి కనిపించునదంతయు ప్రకృతికాగ, ప్రకృతికి ఆధారమై కంటికి కనిపించక సూక్ష్మముగ ఉండునది పరమాత్మ. ప్రకృతిని చర అచర ప్రకృతియని రెండు భాగములుగ చెప్పుకోవచ్చును. చర ప్రకృతి అనగ సకల జీవరాసుల శరీరములు మరియు వాటిలోని భాగములుగ ఉండి మార్పు చెందునది. అచర ప్రకృతియనగా మార్పు చెందక ఎప్పటికి ఒకేలాగుండు ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి. అచర ప్రకృతి 5 భాగములుగ ఉండగ, చర ప్రకృతి శరీరములో జీవుడు తప్ప 24 భాగములుగ ఉన్నది. పంచభూతములుగను మరియు శరీర రూపములుగనున్న ప్రకృతియంతయు ఒక భాగముకాగ, శరీరములకు ఆధారమైన ఆత్మ, జీవాత్మలు, పంచభూతములకు ఆధారమైన పరమాత్మ మూడు ఒక భాగముగ ఉన్నవని చెప్పవచ్చును. పంచభాగములుగ ఉన్న ప్రకృతియంతయు

ఒక్కటికాగ, మూడు భాగములుగ ఉన్న ఆత్మలు అన్నీ ఒకే పరమాత్మ అంశగనున్నవి. ప్రకృతి పరమాత్మలను రెండు భాగములతో కూడుకొన్న ఈ చరాచర ప్రపంచములో మానవుని కర్మాచరణకు ప్రకృతిలో ముఖ్యమైన భాగములేవియని యోచించిన బయట తెలియబడు పంచభూతములు ఐదు, శరీరములోని మనస్సు, బుద్ధి, అహంకారము అనునవి మూడు. మొత్తము ఎనిమిది ముఖ్య ప్రకృతి భాగముల చేత కర్మాచరణ ప్రపంచములో జరుగుచున్నది. అందువలన ఈ శ్లోకములో నా ప్రకృతి ఎనిమిది విధములనున్నదని పరమాత్మ తెలియజేశాడు.

6) శ్లో॥ 5 : అపరేయ మిత స్త్వన్యాం ప్రకృతిం విద్ధిమేపరాం ।
జీవభూతాం మహాబాహో! యయేదం ధార్యతే జగత్ ॥
(ప్రకృతి, పరమాత్మ)

**భావము :** దేనిచేత ఈ ప్రపంచమంతయు ధరింపబడుచున్నదో అనగా ప్రపంచ మునకు ఏది ఆధారముగనున్నదో, అదే జీవరూపమై ప్రకృతికంటే అన్యమై ఉన్నది, దానిని తెలుసుకొనుము. దానికంటే ప్రకృతి చాలా తక్కువై ఉన్నది.

**వివరము :** ఈ శ్లోకములో **'అన్యాం ప్రకృతిం'** అను మాటకు ప్రకృతికంటే వేరైనది అను అర్థము సరైనది కాగ, వేరొక ప్రకృతి అను అర్థము సరికానిది. ఈ శ్లోకములో అన్ని గీతలలోను వేరొక ప్రకృతి అను మాటనే ఉపయోగించి దీని భావము ఇలా వ్రాశారు. **'ఈ ప్రకృతి చాలా తక్కువైనది, జీవరూపమై శ్రేష్ఠమై జగత్తంతయు ధరింపబడు ప్రకృతి వేరొకటున్నది. దానిని తెలుసుకొనుము'** ఇది సరైన భావము కాదు. ప్రకృతి పురుషులు వేరువేరని చెప్పుకొన్నాము. జీవాత్మ పరమాత్మ సంబంధమైన పురుషుడని కూడ చెప్పుకొన్నాము. జీవరూపమైనది, శ్రేష్ఠమైనది, జగత్తంతయు వ్యాపించినది, ప్రకృతికంటెను వేరుగనున్న పురుషుడైన పరమాత్మను మరొక ప్రకృతి అనడము సమంజసము కాదు. ప్రకృతికంటే భిన్నమై, సర్వ శరీరములలో జీవరూపమై, సర్వ శరీరములకు చైతన్యము నిచ్చు ఆత్మస్వరూపమై, అణువణువున

వ్యాపించినది ప్రకృతికంటే శ్రేష్ఠమైనది మరొకటున్నదని దానిని తెలుసుకొమ్మని, దానికంటే ప్రకృతి చాలా తక్కువైనదని, ఈ శ్లోకములోని పూర్తి భావము గలదు. అలా కాకుండ ప్రకృతి తక్కువైనదేనని, దానికంటే శ్రేష్ఠమైన ప్రకృతి మరొకటున్నదని వ్రాసుకొనుట చాలా తప్పు. ఇదేమో నీచమైన ప్రకృతి, దీనికంటే శ్రేష్ఠమైన పురుషుడొకడున్నాడు. వానినే తెలుసుకొమ్మన్నాము. ఆ పురుషుడెట్టివాడనగా! వాని ప్రభావము ఎట్టిదనగా! క్రింది శ్లోకాలలో చూస్తాము.

(6) శ్లో॥ 6 : ఏత ద్యోనీని భూతాని సర్వాణీ త్యుపధారయ ।
అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రళయస్తథా! ॥
(ప్రకృతి, పరమాత్మ)

**భావము :** ప్రకృతి సమస్త జీవరాసుల పుట్టుకకు స్థానమైన యోనిలాంటిది. నేను జీవరాసుల పుట్టుకకు కారణమైన వానిని, మరియు వాటి ప్రళయమునకు కూడ కారణమైన వానిని.

**వివరము :** ఒక మనిషి పుట్టుటకు భౌతికముగ తల్లి తండ్రి ఇద్దరు అవసరమే. తల్లివుండి తండ్రి లేకుండ, అట్లే తండ్రివుండి తల్లి లేకుండ ఎవడు పుట్టజాలడు. ఎవరి తల్లితండ్రి వారికి తెలుసు. మీ తల్లి పేరేమని అడిగిన చెప్పగలరు, తండ్రిపేరును చెప్పగలరు. ఒకనికి ఒక తల్లి తండ్రి ఉన్నట్లు, జీవరాసులన్నిటికి సమిష్ఠిగ ఒక తల్లి తండ్రి ఉన్నారు. అందరికి కలిసి ఒకే తల్లి, ఒకే తండ్రి ఎవరో చాలామందికి తెలియదు. సర్వ జీవరాసులకు శరీరమును తయారు చేసి ఒక రూపమిచ్చునది ప్రకృతి. తల్లిగర్భములోని శిశువు ఒక రూపము సంతరించుకొన్నట్లు, ప్రకృతిలోని జీవుల శరీరములన్ని స్త్రీస్వరూపమైన ప్రకృతినుండే తమ తమ ఆకారమును పొందాయి. తల్లి గర్భములోని శిశువు ఆకారము పొందుటకు పైనున్న తల్లి ఏమి చేయకున్నను, లోపలనున్న చర ప్రకృతియొక్క కార్యముల వలననే గర్భములోని శిశువుకు ఆకారమేర్పడుచున్నది. దీనిని బట్టి తల్లి వెనుక సర్వ జీవరాసులకు తల్లిగ ప్రకృతి పేరుగాంచినది. ఆ విధముగనే శిశువు పుట్టుటకు కారణమైనవాడు తండ్రి.

లోపల చైతన్యమై ఉండి, శిశువు శరీరము తయారగుటకు భీజదాతయై కనిపించకయున్న లోపలి తండ్రి పరమాత్మ. కనుక సర్వజీవరాసులకు తండ్రి పరమాత్మయని తెలియాలి. జీవరాసులన్ని భూమి మీద పుట్టుచు, పెరుగుచు, గిట్టుచు మరియు పుట్టుచు, తిరిగి పెరుగుచు జరుగుచున్న ప్రపంచమునకు ప్రకృతి, పురుషులే కారణముగ ఉన్నారు. ఈ పుట్టి పెరిగిన ప్రపంచమంతయు ఒకానొక రోజు లేకుండపోవును, దానినే ప్రళయమంటారు. **'ప్ర'** అనగ పుట్టునది. **'ళయము'** అనగా నాశనమని తెలియాలి. ప్రళయమనగా పుట్టినదంతయు లేకుండ పోవుటని అర్థము. అటువంటి ప్రళయమునకు కూడ పరమాత్మయే కారణము. ఎప్పుడో ఒకప్పుడు సంభవించు ప్రళయములో పరమాత్మ ప్రకృతిని ప్రేరేపించి, దానిచేతనే జీవులను లేకుండ చేసి, చివరకు ప్రకృతిని కూడ లేకుండ చేయును. కావున ప్రళయమునకు కారణము, ప్రభవమునకు కారణము నేనేనని శ్లోకములో చెప్పాడు. ఇంకనూ పురుషుడైన పరమాత్మ ఎట్లున్నాడనగా! క్రింది శ్లోకము చూడుము.

*(6) శ్లో ॥ 7 : మత్తః పరతరం నాన్యత్ కించి దస్తి ధనంజయ ।*
*మయి సర్వమిదం ప్రోతం సూత్రేమణిగణా ఇవ ॥*
*(పరమాత్మ)*

**భావము :** జగతిలో నన్నుమించి ఘనత పొందినది వేరేదియులేదు. దారమందు మణులు ధరింపబడునట్లు సర్వ ప్రపంచమును నేనే ధరింతును.

**వివరము :** పరమాత్మ ప్రకృతినే సృష్టించి దానిద్వార జీవరాసులను తయారు చేసి పెద్ద ప్రపంచమునకే అధిపతిగనున్నది. పరమాత్మకంటే అన్యమైన వస్తువేదియు లేదు. కావున దానికంటే మించినది మరొకటి ఎక్కడినుండి వచ్చును. పరమాత్మకంటే మించినది భూతకాలములో లేదు. భవిష్యత్ కాలములో ఉండబోదు. సర్వజీవరాసుల హృదిమధ్యలో చైతన్యమై ఆత్మగవుంటూ, సర్వ జీవాత్మల యొక్క ఆత్మలను తనతో సంబంధమున్నట్లు చేసి, సర్వజీవరాసులకు సూత్రధారై పరమాత్మ ఉంటున్నాడు. చర ప్రకృతియైన సర్వ జీవరాసులలోను తాను వ్యాపించి, వాటియందు కనిపించక

పూలలో దారమువలె ఉన్నాడు. పూలన్నిటికి దారమాధారమైనట్లు పరమాత్మ సర్వజీవులకు ఆధారముగ శరీరములో ఆత్మరూపమై కనిపించక ఉన్నాడు.

ఈ విధముగ చర ప్రకృతికేకాక, అచరప్రకృతికి కూడ పరమాత్మ ఆధారమై ఉన్నాడు. ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమికి గురుత్వాకర్షణశక్తిగ ఉంటు, గగనములో అణువణువున వ్యాపించి సూర్యచంద్రాది గ్రహాలకు, నక్షత్రములకు, పాలపుంతలకు, నల్లరంధ్రము (బ్లాక్‌హోల్)నకు అధిపతియై, శరీరములో ఆత్మవలె జీవరాసులను కదిలించునట్లు గగనములో అయస్కాంతశక్తియై సర్వగోళములను కదిలించుచున్నాడు. ఈ విధముగ అచర ప్రకృతికి, చర ప్రకృతికి సర్వ ప్రపంచమునకు ఆధారమై పరమాత్మ ఉన్నాడు, అది ఇంకా ఎట్లున్నదనగా!

(6) శ్లో॥8 : రసోఽహ మప్సు కౌంతేయ! ప్రభాఽస్మి శశిసూర్యయోః।
ప్రణవ స్సర్వ వేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు ॥
(పరమాత్మ)

**భావము :** జలములోనున్న రసమును నేను, సూర్య చంద్రులకున్న ప్రకాశమునేను, వేదములందలి ఓంకారమును నేను. ఆకాశములోనున్న ధ్వనిని నేను. అట్లే పురుషులలోని పౌరుషము కూడ నేనే అయివున్నాను.

**వివరము :** ఒకే విద్యుశ్ఛక్తి ఫ్యానుతో కలిసినపుడు గాలిగను, రేడియోతో కలిసినపుడు పాటగను, టి.వి.తో కలిసినపుడు దృశ్యముగను, బల్బులోని నైక్రోమ్ తీగతో కలిసినపుడు వెలుతురు వేడి ఉత్పత్తిగ మారినట్లు ఒకే పరమాత్మ శక్తి నీటితో కూడి దానిలోని రుచిగను, సూర్యచంద్రులతో కలసి వెలుతురు వేడిమిగను, శరీరములోని గుణములతో మిళితమగుటవలన శ్వాసగను, గగనముతో కలియుట వలన శబ్దముగను, పురుషులతోనుండుట వలన పౌరుషముగను తయారగుచున్నది. ప్రపంచములో దేనికైన ప్రత్యేకత కల్గించునది పరమాత్మయే.

*(6) శ్లో॥ 9 : పుణ్యో గంధః పృథివ్యాం చ తేజశ్చాస్మి విభావసౌ ।*
*జీవనం సర్వభూతేషు తపశ్చాస్మి తపస్విషు ॥*
*(పరమాత్మ)*

**భావము :** భూమిలోగల సువాసన, అగ్నిలోగల తేజస్సు, జీవరాసులలోని జీవనము, తపస్వికులలోని తపస్సు అయివున్నాను.

**వివరము :** పరమాత్మ అగ్నిలో, భూమిలో అణువణువున వ్యాపించి మట్టి కణములకు వాసననిచ్చుచున్నాడు. అగ్నికణములకు తేజస్సునిచ్చుచున్నాడు. అచర ప్రకృతిలో అగ్ని, భూమికెట్లు వాటి వాటి ప్రత్యేకతల వెనుక కారణభూతుడై ఉన్నాడో, అట్లే చర ప్రకృతిలోని జీవరాసుల వెనుక కనిపించని కర్మరూపమై వాటి జీవన విధానము నేర్పరుచుచున్నాడు. అంతేకాక ఒకదానికై పరితపించు వారిలోని తపము కూడ తానేయైవున్నాడు. ఇంకనూ ఎట్లున్నాడనగా!

*(6) శ్లో॥ 10 : బీజం మాం సర్వ భూతానాం విద్ధి పార్థ! సనాతనమ్*
*బుద్ధిర్బుద్ధి మతా మస్మి తేజస్తే జస్వినా మహామ్ ॥*
*(పరమాత్మ)*

**భావము :** సర్వ జీవరాసులకు శాశ్వతముగ బీజము నేనేయని తెలియుము. బుద్ధిమంతులలోని బుద్ధిని మరియు తేజస్సులందు తేజంబునేనై ఉన్నాను.

**వివరము :** బీజం అనగా పుట్టుకకు కారణమైనదని అర్థము. "జం" అనగా పుట్టుట అనియు, "బీ" అనగా కారణమైనదనియు చెప్పుకోవచ్చును. బీజం అనగా చెట్టు యొక్క విత్తనమేనని అనుకోక, జీవరాసి యొక్క పుట్టుకకు కారణమైనదని తెలియవలెను. చెట్టుకు బీజము విత్తనముకాగ, పక్షికి బీజము గ్రుడ్డుకాగ, మనిషికి బీజము వీర్యకణమైవున్నది. విత్తనముకాని, గ్రుడ్డుకాని, వీర్యకణముకాని ఈ మూడింటిని బీజము అంటాము. బీజము మూడు రూపములలోనున్నది. మూడు రూపములలోనున్న బీజముతో మూడు రకముల జన్మలు భూమిమీద కలవు.

గ్రుడ్డునుంచి పుట్టుదానిని అండజము అనియు, వీర్యమునుండి పుట్టుదానిని పిండజము అనియు, విత్తనము నుండి పుట్టుదానిని ఉద్భిజము అనియు అనుచున్నాము. భూమి మీద పుట్టు అండజ, పిండజ, ఉద్భిజ అను మూడు విధ జన్మలకు కారణము బీజము మూడు విధములుగ ఉన్నప్పటికి వాటిలోని బీజశక్తి ఒకటే. విత్తనము, వీర్యము, అండము స్థూలముగ కనిపించునవే అయినప్పటికి వాటిలోని కనిపించని శక్తి ఒకటి కలదు. విత్తనములోని బీజము వేరు, విత్తనము వేరు. అందువలన బీజశక్తిలేని విత్తనములు కూడ కొన్ని ఉండవచ్చునని చెప్పవచ్చును. అటువంటి విత్తనములు భూమిలో పడినప్పటికి మొలకెత్తవు. అలాగే బీజశక్తిలేని వీర్యము ఉండవచ్చును. అటువంటి వీర్యమునకు గర్భమురాదు. అదే విధముగ బీజశక్తిలేని గ్రుడ్లు పిల్లలుగా మారవు. విత్తనము, వీర్యము, గ్రుడ్డులోని బీజశక్తికి కారణమైన శక్తి ఒకటి కలదు. అదియే పరమాత్మశక్తి. అన్నిటిలోను అణువణువున వ్యాపించిన పరమాత్మ వీర్యములోను, విత్తనములోను, గ్రుడ్డులోను బీజశక్తిగ ఉన్నాడు. అందువలన "**బీజం మాం సర్వభూతానామ్**" అని శ్లోకములో చెప్పాడు.

విత్తనములోని బీజశక్తి కనిపించక పోయినప్పటికి చెట్టు మొలకెత్తుటకు కారణము విత్తనమని అందరికి తెలుసు. కనిపించే పదార్థము పుట్టుటకు కనిపించని శక్తి కారణమై ఉన్నది. పదార్థములు జీవమున్నవి, జీవములేనివి కూడ ఉండవచ్చును. అన్నిటికి కారణమైనది పరమాత్మ శక్తియే. ఇక్కడ సర్వభూతానామ్ అని జీవమున్న వాటినే గురించి మాట్లాడుచున్నామని జ్ఞప్తికుంచుకోవలెను. ఏ ఇంద్రియమునకు తెలియని పరమాత్మశక్తి జీవరాసుల శరీరములో అనేక విధ శక్తులుగ మారియున్నది. మనస్సుతో చేరి మనస్సుకు జ్ఞాపకశక్తిని, బుద్ధితో చేరి బుద్ధికి యోచనాశక్తిని అందిస్తున్నది. ఎవడైన ఎక్కువ తెలివైనవాడు ఉంటే వాని తెలివియొక్క ప్రావీణ్యత కూడ పరమాత్మశక్తి చేతనే కల్గియున్నది. ఆ విధముగ మనిషిలోగాని మరి ఏ ఇతర జీవరాసిలోగాని ఏదైన ప్రావీణ్యతయుంటే ఆ ప్రావీణ్యతయంత పరమాత్మ శక్తి వలననే కల్గినదని తెలియవలెను. ఏ విద్యలోగాని, ఏ ఆటలోగాని, ఏ కళలోగాని,

ఎవని మాటలోగాని, ఎవని పనిలోగాని గొప్ప ప్రావీణ్యతయుంటే అది అంత దైవశక్తి వలన ఏర్పడినదేనని తెలియవలెను.

ఇక్కడొక గమనిక పరమాత్మను ఒకచోట ఉన్నాడని పురుషునిగ, మరొకచోట ఉన్నదని స్త్రీలింగముగ చెప్పడమేమిటని అనుమానమురావచ్చును. పరమాత్మ అనునది స్త్రీను కాదు పురుషుడును కాదు. అది ఏదీ కానిది. దానికి రూపులేదు, పేరులేదు, పరమాత్మనునది పేరు కూడ కాదు. ఆత్మకు వేరైనదని తెలుపు అర్థము పరమాత్మ. ఏదీ కానిదానిని ఏ దానిగైన చెప్పవచ్చును. ఒకప్పుడు స్త్రీతత్త్వముగ, ఒకప్పుడు పురుషతత్త్వముగ చెప్పడములో రెండింటియందు ఇమిడి, రెండింటికి అతీతునిగను ఉన్నాడని అర్థము చేసుకోవలయును. పరమాత్మను సందర్భానుసారముగ అది అనియు అతడు అనియు చెప్పుచుందుము. స్త్రీగ పురుషునిగ పిలువబడువాడు ఒక్క పరమాత్మ అనియే తెలియవలెను.

(6) శ్లో ॥ 11 : బలం బలవతాం చాహం కామరాగ వివర్జితమ్ ।
ధర్మా విరుద్ధో భూతేషు కామోஉస్మి భరతర్షభ ॥
( పరమాత్మ)

**భావము :** కామ రాగ వివర్జిత మొనరించు బలవంతులయందలి బలము నేను. ధర్మమునకు విరుద్ధముగనున్న వారిలో ఆశయును నేను.

**వివరము :** మేము వ్రాసిన భావము చూచారు గదా! గుణములను జయించుట ఒక యుద్ధములాంటిదని మొదట చెప్పుకొన్నాము. యుద్ధము చేయుటకు బలము అవసరము. ఇక్కడ కూడ అదే విషయము ప్రస్తావిస్తు కామ, క్రోధ, లోభ, మోహ, మధ, మత్సరములను ఆరు గుణములు వాటి విరుద్ధమైన దానము, దయ, ఔదార్య, వైరాగ్య, వినయ, ప్రేమ అను ఆరు గుణములు మొత్తము పండ్రెండులో మొదటిదైన ఆశ (కామము) చివరిదైన ప్రేమ వరకు ఉన్న గుణములను జయించవలెనన్న, వాటిని నిరోధించవలెనన్న, జీవునకు శ్రద్ధ అను బలము ఎంతో అవసరము. శరీర

బలము ఇక్కడ అవసరములేదు. శరీర బలమున్నవారు గుణములను జయించలేరని, శరీరములోపల గల శ్రద్ధ ఎంత బలవంతమైనదైతే అంత తొందరగ గుణములను జయించవచ్చునని తెలియాలి. గుణములను జయించు శ్రద్ధాబలము గలవారి యందలి బలము కూడ పరమాత్మయే అయివున్నాడు. ఆయన (పరమాత్మ) శరీరములో కూడ అంతట వ్యాపించివున్నాడు. అందువలన శరీర భాగములలో ఎక్కడ ఏది ఉన్నదో అక్కడ దాని ప్రభావము కూడ పరమాత్మయేయై ఉన్నాడు. మంచి వాటిలో మంచిది, చెడువాటిలో చెడ్డది ఆయనేయని గ్రహించాలి, అట్లుకాక మంచివి మాత్రము పరమాత్మయని, మంచివి కానివి పరమాత్మకాదని అనుకోకూడదు. ఈ విషయమై ఉదాహరణగ పై శ్లోకమున **'ధర్మా విరుద్ధో భూతేషు కామోస్మి'** అన్నాడు. ధర్మ విరుద్ధమైన జీవరాసులలోని కామమును నేనే అయినాను అని చెప్పాడు. ఇతర గీతలలో ధర్మవిరుద్ధముకాని కామమునేనని భావము వ్రాయడము శోచనీయము.

*(6) శ్లో॥ 12 : యేచైవ సాత్త్వికా భావా రాజసా స్తామసాశ్చ యే ।*
*మత్త ఏవేతి తాన్విద్ధి న త్వహం తేషు తే మయి ॥*

*( పరమాత్మ)*

**భావము :** సాత్త్విక, రాజస, తామస భావములు నాచేత సృష్ఠింపబడినవని తెలుసుకొనుము. వాటియందు నేను లేను అవి నాయందున్నవి.

**వివరము :** ముల్లోకములనబడు మూడు గుణభాగములు ప్రకృతి జనితము లైనప్పటికి అనగా ప్రకృతినుండి పుట్టినప్పటికి, మొదట ప్రకృతినే పుట్టించిన వాడు పరమాత్మ. కావున గుణముల పుట్టుక కూడ పరమాత్మవలననే జరిగినదని మూలము తీసుకొని చెప్పవలెను. దాని ప్రకారము ముల్లోకములు నా వలన పుట్టినవన్నాడు. గుణములకు ఆధారముగ పరమాత్మ ఉన్నాడు. పరమాత్మకు ఆధారముగ గుణములు లేవు. కావున వాటిలో నేనులేను అవి నాయందే ఉన్నాయన్నాడు. సాత్త్విక, రాజస,

తామసమనబడు మూడుగుణములు ప్రకృతిలోని భాగములే అయినప్పటికి వాటికి ఆధారము పరమాత్మేనని తెలియుము.

(6)శ్లో॥ 13 : త్రిభి ర్గుణమయై ర్భావై రేభి స్సర్వమిదమ్ జగత్ ।
మోహితం నాభిజానాతి మామేభ్యః పర మవ్యయమ్ ॥
(పరమాత్మ)

**భావము :** ఈ జగమంతయు సాత్త్విక, రాజస, తామస గుణమయమగుటచే వాటి ప్రభావముచేత మోహింపబడినవారై, నేను అవ్యయమైన మోక్షముననని తెలియకున్నారు.

**వివరము :** ఈ ప్రపంచములోని అన్ని జీవరాసులు మరియు మనుషులు సాత్త్విక, రాజస, తామస గుణములచేత ప్రవర్తించుచున్నందున, ఆ గుణ ప్రభావముల వలన ప్రపంచమునే గుర్తించి దానియందే సంచరించుచున్నారు. గుణములు ప్రకృతి జనితములైనందువలన అవి ప్రకృతికి సంబంధించిన విషయములందే మానవులను ఉంచుచున్నవి. గుణముల ప్రభావము వలన ప్రకృతికంటే వేరుగనున్న సాకారుడైన భగవంతుని గాని, నిరాకారుడైన పరమాత్మను కాని గుర్తించలేక పోవుచున్నారు. గోడ వెనుకలనున్నవాడు గోడ యివతల వైపుననున్న వాడిని చూడలేనట్లు, గుణముల వెనుకలనున్న జీవుడు గుణముల ఇవతలవైపున ఉన్న పరమాత్మను చూడలేకున్నాడు.

(6) శ్లో॥ 14 : దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా ।
మామేవ యే ప్రపద్యన్తే మాయా మేతాం తరన్తి తే ॥
(పరమాత్మ)

**భావము :** దైవనిర్మితమైన గుణములతో కూడుకొన్న నా మాయ దుస్సాధ్యమైనది. ఎవరైతే నన్ను శరణుజొచ్చుదురో వారు మాయను దాటిపోగలరు.

**వివరము :** ఆదికర్త అయిన పరమాత్మ సర్వజగత్‌కంతటికి అధిపతియై, సర్వమును తానే సృష్టించి అవి అన్ని నడుచుటకు కావలసిన పద్ధతిని ఏర్పరిచాడు. తాను

ఏర్పరిచిన పద్ధతికి సమస్తము కట్టుబడి ఉండునట్లు చేశాడు. సర్వప్రపంచమునకు తానే సృష్ఠికర్త, అధిపతియైనప్పటికి ప్రపంచముతో తాను ఏమాత్రము జోక్యము చేసుకోక, బంధము పెట్టుకోక, తాను నిర్మించిన పద్ధతిచే నడుచునట్లు నిర్మాణము చేశాడు. తాను నిర్మించిన పద్ధతికి సమస్తము ఆధీనమైయుండి, ఆ పద్ధతి ప్రకారమే నడుచుకొనుచున్నవి. ఈ లెక్క ప్రకారము సర్వప్రపంచమును ఆధీనపరుచుకొని ఆడించుచున్నది స్వయముగా పరమాత్మగాదు. పరమాత్మచే నిర్మింపబడిన ప్రత్యేకమైన విధానము. ఆ విధానమునకు లేక పద్ధతికి ముఖ్యమైన పేరు గలదు. దానినే మాయ అనుచున్నాము. మాయకు మరికొన్ని పేర్లు గలవు. ఏసుప్రభువు దానికి సాతాన్ అని పేరు పెట్టగ, ఇస్లాం ప్రవక్త సైతాన్ అను పేరుతో పిలిచాడు. పరమాత్మ నిర్మించినది మాయ కావున ఈ శ్లోకములో **'దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా'** అని అన్నాడు.

మాయ పరమాత్మచే నిర్మింపబడి ఆయన మొదట చెప్పిన ఆదేశానుసారము తన పనిని తాను చేస్తూపోతున్నది. ప్రపంచములో మాయకు లోబడనిది ఏదీలేదు. పుట్టినవన్నియు మాయకు లోబడివున్నాయి. మాయకు లోబడనిది మాయనే పుట్టించిన పరమాత్మ ఒక్కటే. మాయపద్ధతి ప్రకారము తన ఆధీనములో ఉండు వారిని సాధారణముగ నడిపించుచుండును. అలాకాక తనకు వ్యతిరేఖముగ నడువవలెననుకొను వారికి పూర్తి విరుద్ధముగ చేయుటకు ప్రయత్నించును. ప్రకృతిసిద్ధమైన జననము మరణము నుండి తప్పించుకోవలెనను వారందరు మాయ ఆధీనమునుండి తప్పించుకోవలెననుకొనెడివారే. కనుక మాయకు ముక్తి కావలెననువారు వ్యతిరిక్తులు, ముక్తి కావలెననుకొనువారికి మాయ వ్యతిరిక్తము. ముక్తికావలెను అనుకొనువాడు ప్రపంచాధినేతయైన మాయను ఏమిచేయలేడు. కాని మాయ అనుకొంటే ఎవరినైన ఏమైన చేయగలదు. దానిని జయించవలెనంటే దుస్సాధ్యముగా ఉండును. అందువలన **'మమమాయా దురత్యయా'** అని పై శ్లోకములో చెప్పారు. అట్లయిన మోక్షమును ఎవరూ పొందలేరుకదాయను ప్రశ్నకూడ రాగలదు.

ఎవరూ జయించలేని అతిబలమైన మాయను జయించి, దాని ఆధీనము నుండి బయటపడుటకు పరమాత్మను శరణుజొచ్చిన వారికే సాధ్యమగును. కనుక పై శ్లోకములో **'మామేవ యేప్రపద్యన్తే'** అన్నాడు. పరమాత్మ జ్ఞానము ఫలానాయని కొద్దిగైన తెలిస్తే కదా! ఆయనను శరణుజొచ్చవలెనను జ్ఞప్తి రాగలదు. దానికి పరమాత్మ ఒక ప్రత్యేకమైన విధానమును నిర్మించాడు. అవియే ధర్మములు (జ్ఞానము). పరమాత్మ ధర్మములను ఆచరించువారిని మాయ ఎంత ఆటంక పరచిన దానినుండి బయటపడి చివరకు పరమాత్మనే చేరగలరు. అలా ఆచరించుటకు పరమాత్మ ధర్మములు ఫలానా అని తెలియాలి గదా! అని కొందరడుగవచ్చును. దీనికి జవాబేమనగా! ప్రపంచ సృష్ఠి ఆదిలో మాయను తయారు చేసిన పరమాత్మ, మాయకు ప్రత్యర్థిగ ఉండునట్లు సూత్రబద్దమైన జ్ఞానమును ధర్మములను కూడ తయారు చేసి పెట్టాడు. మాయపని మాయకు, ధర్మముల పని ధర్మములకు నిర్మించిపెట్టాడు. అప్పటినుండి అవి రెండు వాటి వాటి పనిని నిర్వర్తించుచునే ఉన్నవి. మాయ దానికి వ్యతిరిక్తమైన ధర్మములు ప్రపంచములోని జీవరాసుల కొరకే నిర్మించినప్పటికి, జీవరాసులన్ని మాయ ఎడలయే ఎక్కువగా ప్రభావితమగు చున్నవి. ధర్మముల ప్రక్క చేరలేక పోవుచున్నవి. దీనికి కొంత కారణముగలదు. పరమాత్మ మాయను మూడు విధములుగ జీవరాసుల మీద పనిచేయునట్లు నిర్మించాడు. దానికొరకు జీవరాసులను మూడు రకములుగ సృష్ఠించాడు అవి ఏవనగా! ఒకరకము పైకి పెరుగునవి, రెండవరకము అడ్డముగ పెరుగునవి, మూడవరకము క్రిందికి పెరుగునవి. మొదటి రకము పైకి పెరుగు వాటి మీద మాయ ప్రభావము తక్కువగ ఉండును. ఆ జాతి జీవరాసులు కర్మను చాలా తక్కువ సంపాదించుకొనునవై, మాయకు దూరముగ దేవునికి దగ్గరగ ఉన్నవి. రెండవ రకమైన జీవరాసులు మొదటి జాతికంటే కొంత ఎక్కువ కర్మ సంపాదించు కొనునవైవుంటు, మాయకు దేవునికి సమాన దూరములో ఉన్నాయి. మూడవరక జీవరాసులు ఎక్కువ కర్మను సంపాదించుకొనుచు, మాయకు దగ్గరగ దేవునికి దూరముగ ఉన్నవి. ఆ మూడు రకముల జీవరాసులు ఏవి అని పరిశీలించి

చూచిన, భూమినుండి పుట్టుచున్న చెట్లు తీగలు మొదలగునవన్నియు మొదటి తరగతి జాతియని, వాటి శరీరములో ఆత్మ స్థానమైన మొదులు లేక వేర్లనుండి పైకి పెరుగుచున్నవని తెలియాలి. అట్లే అండజములుగ, పిండజములుగ పుట్టుచున్న అనేక విధ జంతు, క్రిమి, కీటక, చేపలు, పాములు మొదలగునవన్నియు రెండవ తరగతికి చెందినవనియు, అవి తమ శరీరములోని ఆత్మ స్థానమైన శిరస్సు నుండి ప్రక్కకు పెరుగుచున్నవని తెలియాలి. ఇక పిండోద్భవములైన ఒకే ఒక మానవజాతి మాత్రము మూడవ తరగతికి చెందినది. ఈ జాతి ఆత్మ స్థానమైన శిరో స్థానము నుండి క్రిందికి పెరుగునదై ఉన్నది. ఈ మూడు జాతులలో వాటివాటి అంతఃకరణములైన మనో, బుద్ధి, చిత్తముల పనిలోగాని, గుణముల చురుకుదనములో గాని చాలా తేడా ఉండును. అన్నిటికంటే ఎక్కువ చురుకుదనముగ పని చేయునవి మూడవ జాతియైన మనిషిలోని బుద్ధి, చిత్తము, అహము, మనస్సు. మానవునిలో అంతఃకరణములు బలమైనవిగ ఉన్నవి కనుక గుణములు బాగా పనిచేయుచున్నవి. మాయ గుణముల రూపములో శరీరమందుండి మనిషిని తన ప్రభావములోనే ఉంచుకొనుచున్నది. అందువలన పై శ్లోకములో కూడ 'గుణమయీ మమ మాయ' అన్నాడు. దేవుడు మాయను గుణములరూపములో మానవునియందు ప్రతిష్ఠించాడు. కావున మాయకు మానవుని మీద ఎక్కువ బలమున్నది. దేవుడు మానవునియందు మాయను, ధర్మములను రెండింటిని ప్రతిష్ఠించినప్పటికి, ధర్మము లేవో మనిషికి తెలియని కారణమున, మరియు దేవుడు తనకిచ్చిన అధికారము వలన, మాయ మానవులందరిని తనవైపుకు లాగుకొనుచున్నది. తన పక్షమే అందరికి మంచిగ కనిపించునట్లు చేయుచున్నది. మాయ మరియు దానికి వ్యతిరిక్తమైన జ్ఞానము వాటి వాటి ఉనికిని కోల్పోకుండ ఉండుటకు వాటి ప్రయత్నము అవి చేయుచునే ఉన్నవి. ఆ ప్రయత్నములలో మాయజ్ఞానము దైవధర్మములవలె నటిస్తు తన ప్రాబల్యమును పెంచుకొనుచున్నది. ఏది ఏమైన ప్రపంచములో దైవజ్ఞానముకంటే మాయ యొక్క ప్రాబల్యము అధికముగా ఉండుటకు ముఖ్యమైన కారణమొకటి కలదు. దైవజ్ఞానమునకు ఒకవంతు బలముండగా, మాయకు వేయివంతులు

బలమెక్కువ ఉండునట్లు ముందే నిర్ణయించబడియున్నది. ఒకవంతు బలము కూడ జ్ఞానమునకు సరిగాలేదు. కనుక గీతలో భగవంతుడు మనుషులలో వేయింటికొకడు సిద్ధికొరకు ప్రయత్నించుట కూడ అరుదుగ ఉందురని తెలియజేశాడు.

భూమిమీద కొందరు గురువులుగ బయలుదేరి జ్ఞానమును బోధించుట, ఉపదేశములు ఇచ్చుట జరుగుచున్న పనియే. మాయ వారి మీదనే దృష్టిని సారించి, వారిని మంచి జ్ఞానులుగ బయటికి కనిపించునట్లు చేసి, వారిని చాలామంది ప్రజలు ఆశ్రయించునట్లు చేసి, ఆ గురువులు చెప్పిన విషయములు బాగా వినునట్లు చేయుచుండును. అంతేకాక బోధించునదంతయు పరమాత్మ జ్ఞానము ధర్మమేనన్నట్లు, జ్ఞానము దేవుడు అను పదములుపయోగించుచు, ఎంతో ఆకర్షణీయమైన బోధలు చేయుచుండును. ఆ బోధలలో ఒక్క శాతము దైవజ్ఞానము ఉండగ 99% మాయకు సంబంధించిన జ్ఞానమే ఇమిడివుండును. ఇది చాలా ఆశ్చర్యకరమైన విషయమైనప్పటికి, ఇది మాయకు సంబంధించిన జ్ఞానమని, పరమాత్మలోనికి ఐక్యము చేయునదికాదని ఎవరూ గుర్తించలేరు. అదియే మాయయొక్క గొప్పతనము. ఎంతో పెద్ద ఆధ్యాత్మిక గురువున్నప్పటికి, స్వచ్ఛమైన ఆధ్యాత్మికమును బోధిస్తున్నప్పటికి వారియందు కూడ చివరకు 95% దైవధర్మములేని మాయ యొక్క బోధయేవుండును. ఇలా కనిపించు గురువులలో కూడ ఉండి వారిచేతనే దైవజ్ఞానమన్నట్లు దైవధర్మములన్నట్లు అధర్మములను బోధిస్తుండుట వలన, దేవుని తెలుసుకోవాలనుకొనువారు కూడ మాయలోనే చిక్కుకొని పరమాత్మవైపు ప్రయాణించలేకున్నారు. ఉన్న కోట్ల ప్రజలలో వేలసంఖ్యలో కొందరికి మాత్రమే జ్ఞానము మీద ఇచ్ఛ కలుగగా, వారిని కూడ మాయ గురువులరూపములో బోధిస్తూనే తన వైపుకు లాగుకొనుచున్నది. కావున గీత విజ్ఞానయోగములో మోక్షము కోరువారిలో చివరకు ఎవరో నన్ను తెలుసుకోగలిగేది అన్నాడు. మాయ అనేక స్థాయిలలో రకరకముల గురువులను ఆవహించి ఉండుట వలన, జ్ఞానము కోరువారు ఏదో ఒక గురువును ఆశ్రయించి మాయ ఆవరణములోనే చేరి పోవుచున్నారు. అందువలన నిజమైన పరమాత్మ జ్ఞానము దొరకాలంటే అనేక జన్మల సంస్కారము వలననే లభించునని

గీతయందన్నాడు. అనేక అంటే వందలు కావచ్చు, వేలు కావచ్చు. ఇక్కడ కొందరికొక అనుమానమురావచ్చును. అది ఏమనగా! గురువులందరిని మాయ మభ్యపెట్టి భ్రమింపజేసి, తన బోధనే బోధిస్తున్నదన్నప్పుడు, ఎవరూ పరమాత్మ జ్ఞానము బోధించువారే లేరని చెప్పినపుడు, అనేక జన్మల తర్వాతైన వారికి పరమాత్మ జ్ఞానమెట్లు లభించును అని అడుగవచ్చును. దానికి మా సమాధానము పరమాత్మ యొక్క జ్ఞాన ధర్మములను నూటికి నూరుపాల్లు బోధించు గురువులు భూమిమీద ఉంటే పరమాత్మ పుట్టవలసిన అవసరమే లేదుకదా! అలా తన ధర్మములు తెలిసి బోధించువారు లేని దానివలన, పరమాత్మయే స్వయముగ భూమిమీద పుట్టి బోధించవలసి వస్తున్నది. అందువలన ధర్మములకు గ్లాని ఏర్పడినపుడు నేను జన్మించి, నా ధర్మములను తెలియజేస్తానని గీతయందు చెప్పాడు.

దైవధర్మముల తరుపున పరమాత్మయే స్వయముగ ఉద్భవించి, తన ధర్మములను పూర్తిగ తెలుపుటవలన మాయకు ఇబ్బంది ఏర్పడి, గురువుల మీదనే తన పట్టు తప్పిపోవు పరిస్థితి ఏర్పడును. కనుక అటువంటి పరిస్థితి రాకుండ మాయ కూడ స్వయముగ జన్మ ఎత్తి, భగవంతునికంటే గొప్పగ కనిపించి, తనే భగవంతుడనని పేరుగాంచుచుండును. మాయ అవతార భగవంతుని ముందర అసలైన పరమాత్మ అవతారము కూడ తక్కువగా ఉండును. అందువలన నిజమైన భగవంతుని జ్ఞానులు సహితము గుర్తించలేరు. కాని మాయా భగవంతుని అజ్ఞానులు సహితము గుర్తించగలరు. భూమిమీద ధర్మములు తెలియనపుడు, అనేక జన్మ సంస్కారపరులకు ధర్మములు అవసరమైనపుడు, వేల సం॥లకో లేక లక్షల సం॥లకో పరమాత్మ జన్మము ఎత్తవలసి వస్తున్నది. మాయ మాత్రము పరమాత్మ జన్మకు ముందు వెనుక అవతారమెత్తడమేకాక, పరమాత్మ భగవంతునిగ జన్మించినపుడు తాను కూడ మూడు నాలుగు చోట్ల జన్మించి, అందరిని తనవైపు ఆకర్షించుకొనుటకు ప్రయత్నించును. పరమాత్మ భగవంతునిగా ఏ దేశములో పుట్టునో మాయ కూడ అదే దేశములో పుట్టుచున్నది. పరమాత్మ ఏ ప్రదేశములో పుట్టునో, ఆ ప్రదేశమునకు చుట్టు ప్రక్కల మాయ మూడు లేక నాలుగు జన్మలు కలిగివుండును. పరమాత్మ

కేవలము జ్ఞాన ధర్మములనే బోధించగ,  మాయకూడ ధర్మములులేని ఆధ్యాత్మికమునే ఆకర్షణీయముగ చెప్పుచుండును.  తినెడి ఆహారము రుచిగా ఉన్నను అందులో పోషక పదార్థములు విటమిన్లులేనట్లు మాయ బోధించునది నిజజ్ఞానమే అన్నట్లుండును ,కాని అందులో ధర్మయుక్త జ్ఞానముండదు.  మాయ ప్రపంచమునకే అధిపతియై ఉన్నది, కావున  ప్రపంచములోని ఏ విషయమునైన తానను కొన్నట్లు చేయగలదు. పరమాత్మ జన్మ కేవలము ధర్మములనే బోధించగ,  మాయ తనది నిజమైన జ్ఞానమన్నట్లు బోధించడమే కాక ప్రపంచములోని ఏ అద్భుతమైన చేసి దానిని దైవ మహత్యమనుకొనునట్లు భ్రమింపచేయగలదు. బంగారును రాయిగా, రాతిని బంగారుగ చూపగలదు.  ఉన్న వస్తువులను లేకుండ పోవునట్లు, లేని వస్తువులను ఉండునట్లు చేయగలదు. రోగములను సృష్టించగలదు.  మరియు లేకుండ చేయగలదు. అమెరికాలో ఉండి రష్యాలో, రష్యాలో ఉండి అమెరికాలో కనిపించగలదు.  చెప్పేది ధర్మములుకాకున్న అంతా ధర్మప్రచారమే చేయునట్లు తెలియగలదు.  అన్నిటికి అధిపతియైన దాని వలన ఎన్ని కోట్ల డబ్బునైన సృష్టించగలదు.  ఎంతటి వారి చేతనైన పాదాభివందనము చేయించగలదు.  తానే నిజదైవముగా ప్రత్యక్ష దైవముగా అందరిచేత  అనిపించగలదు.

పరమాత్మ భూమిమీద జన్మించి తన ధర్మముల ప్రకారము తాను నడుచుకొనుచు,  తన ధర్మములనే బోధించుచుండును.  తన బోధలో మహత్యములు లేని దానివలన లక్షల సంఖ్యలోని మనుషులలో ఆయన బోధను ఒకరైన గుర్తించగలరను నమ్మకము లేదు. ఎవనికైన కొంత నమ్మకము ఏర్పడినప్పటికి వాని తలలోని మాయ ఏదో ఒక విధముగా దానిని వమ్ముచేయును.  మాయనే సృష్టించిన పరమాత్మ  మాయ ముందర తక్కువగా కనిపించడమేమిటని కొందరడుగవచ్చును.  దానికి జవాబేమనగా! పరమాత్మ మాయకంటే ఎప్పటికీ గొప్పవాడే.  కాని పరమాత్మ భూమి మీద జన్మించి భగవంతుడైనపుడు మాత్రము మాయకంటే బలహీనుడే.  అందువలన పరమాత్మయే స్వయముగ ఏసుప్రభువుగ

పుట్టిన దినమున బలహీనుని చేసి మాయ తన ప్రజలచేతనే కొట్టించింది, తిట్టించింది. శ్రీకృష్ణునిగ పుట్టిన సమయములో ఆయనకు కూడ శత్రువులనేర్పరచి కంసుని చేత తిట్టించడమే కాక, అనేక సమయములలో అనేక ఇబ్బందుల పాలు చేసినది. జారునిగా, చోరునిగా చూపించింది. భూమిమీద మాయకంటే భగవంతుడు బలహీనుడుగాన ఇది నారాజ్యముకాదు, నా రాజ్యము వేరుగనున్నది, నా రాజ్యమునకు రాజును నేనే అన్నాడు. అంతేకాక ఇది జన్మలు మరణములు గల స్థలము దీనికి అధిపతి మాయ. జనన మరణములు లేని మరియొక స్థలము కలదు అచటికి చేరండని అచట నేను తప్ప ఎవరులేరని కూడ చెప్పాడు.

మాయ కూడ భగవంతునివలె జన్మించుచున్నదంటున్నారు కదా! పరమాత్మ భగమునుంచి సజీవముగ బయటికి వస్తున్నాడు కావున ఆయనను భగవంతుడు అనవచ్చును. మాయ ఏ విధముగ జన్మ తీసుకొంటున్నది. సాధారణ మానవులవలెనా లేక భగమునుండి వచ్చు భగవంతునిగనా? అని కొందరడుగవచ్చును దానికి వివరమేమనగా! మాయ భగవంతునివలె చలామణి అగునుకాని భగమునుండి సజీవముగ పుట్టలేదు, కాన భగవంతుడుకాదు. అట్లని సాధారణ మనుజులవలె కూడ పుట్టలేదు. మాయ తల్లి గర్భములోపల నుండికాని, గర్భము బయటగాని జన్మ పొందలేదు. అటుకాక ఇటుకాక ఏ విధముగా జన్మించినదనిన? భూమి మీద పరమాత్మ జన్మించు అవకాశము గల ప్రాంతమును మాయ ముందుగానే పసిగట్ట గలదు. అటువంటి ప్రాంతమును తెలుసుకొన్న మాయ, ఆ ప్రాంతము చుట్టు ప్రక్కలగల సాధారణ మనుషులలో ఒకనిని గుర్తించి ఎన్నుకొని వానియందు కొంత కొంతగా ప్రవేశించి పూర్తిగా నిండుకొనును. అట్లు వానియందు పూర్తిగా నిండుకొనుటకు ఆరునెలల నుండి సం॥ కాలమైన పట్టును. అలా పూర్తి ప్రవేశించిన వానినుండి తన పూర్తిస్థాయి కార్యములు మొదలు పెట్టును. మాయ ప్రవేశించువాడు బీదవాడు కావచ్చు, యుక్తవయస్కుడు కావచ్చు లేక ముసలివాడు కావచ్చును. ఎవనియందు మాయ ప్రవేశించిన, దానిని మాయ యొక్క జన్మ అనవచ్చును.

మాయ ప్రవేశించిన వ్యక్తికి తనయందు మాయ పూర్తి స్థాయిలో ఉన్నదని ఏమాత్రము తెలియదు. అందువలన మొదట తన ద్వారా జరుగు కొన్ని మహత్యములు ఎలా జరిగినవో తనకే తెలియకుండును. తరువాత తనకేదో మహత్తుగలదని, తను అందరివలే సామాన్యుడుకాదని తను ప్రత్యేకమైన మనిషినని అనుకొనును. ఇలా మాయ కొందరియందు ప్రవేశిస్తున్నది కాని క్రొత్తశరీరములో జన్మించలేదు, పరమాత్మవలె పుట్టనూలేదు, కావున మాయ ఎప్పటికీ భగవంతుడు కాదు. భగవంతునివలె కనిపించినప్పటికి నిజముగా భగవంతుడుకాదని తెలియాలి.

ఇంకొక విచిత్రమేమిటంటే మాయ జన్మించితే రెండు మూడు చోట్లయిన ఉండి తన మహత్యమును నూటికి నూరుపాల్లు చూపగలదు. కాని పరమాత్మ జన్మించి భూమిమీద ఉన్నప్పుడు శరీరములోని జీవునిగ, ఆత్మగ, పరమాత్మగ ఉంటూ కొన్ని సమయములలో కేవలము సాధరణ జీవునిగ కష్ట సుఖములను అనుభవిస్తుండును. కొన్ని సమయములలో మాత్రము ఆత్మగ అనుభూతులకు అతీతముగ ఉండును. ప్రత్యేకించి కొన్ని సమయములలో మాత్రము ఆదికర్తయైన పరమాత్మగ ఉండగలడు. భగవద్గీతలో శ్రీకృష్ణుడు జీవునిగ, ఆత్మగ, పరమాత్మగ మూడుస్థాయిలలో మాట్లాడినట్లు అర్థమగుచున్నది. అలాగే ఏసుప్రభువుగ వచ్చిన దినములలో జీవునిగ శరీర బాధలు అనుభవించాడు. ఆత్మగ నిన్నెప్పుడూ చూస్తున్నానన్నాడు. పరమాత్మగ తుఫానులో చెలరేగిన సముద్రమునే నిశ్చలమగునట్లు శాసించాడు.

పరమాత్మ జన్మలో ఉన్నప్పుడు జీవునిగ ఉన్న సమయములో మాయ హింసిస్తుంది, ఆత్మగ ఉన్న సమయములో ద్వేషిస్తుంది మరియు ధూషిస్తుంది, పరమాత్మగ ఉన్నప్పుడైతే పూర్తి భక్తి వినయముకల్గి ఆయన మాట ప్రకారము నడుచుకుంటుంది. ఏసు జీవునిగ ఉన్నప్పుడు కొరడాలతో కొట్టించి కష్టమును అనుభవింపచేసింది. ఆత్మగ ఉన్నపుడు ఆధ్యాత్మిక గురువులలో నుండి నిందించింది. పరమాత్మగ ఉన్నప్పుడు చెప్పినట్లు నడుచుకొని శవమును సజీవముగ చేసింది.

ఏసు జీవునిగ ఉన్నప్పుడు మాయ అతనితో నాకెంతో బలముందని రాళ్లను ఆహారముగా మార్చగలనని, ఈ రాజ్యానికి రాజును చేయగలనని కూడ చెప్పినది. అలాగే ఏసుప్రభువు జీవునిగ నా తండ్రి ఒకడున్నాడని చెప్పాడు. ఆత్మగ నీపొరుగువానిని ప్రేమించమన్నాడు. పరమాత్మగ జీవము (జీవుడు), మార్గము (ఆత్మ), గమ్యము (పరమాత్మ) నేనే అన్నాడు. శ్రీకృష్ణ జన్మలో తామరాకు మీద నీరంటనట్లు కర్మ అంటకుండ ఉన్నానని జీవునిగ, శరీరములో అగ్నినై తిన్న ఆహారమును జీర్ణము చేయుచున్నానని ఆత్మగ, క్షయమును వృద్ధిని కల్గించు కాలుడను నేనే. ఎల్లలులేని విశ్వరూపమును నా అనుగ్రహమున నీకు చూపానని పరమాత్మగ మాట్లాడిన సందర్భములు గలవు. పరమాత్మ ఆధీనములోనున్న మాయ పరమాత్మ ఎడల మాత్రము పూర్తి భక్తిగా వినయముగా ఉంటూ, మిగతా వారి ఎడల తన కర్తవ్యమును తాను నిర్వర్తించుచున్నది. అంతేకాక జ్ఞానము యోగము, ధర్మములకంటే అతీతునిగనున్న పరమాత్మను లేక భగవంతున్ని పూర్తి విశ్వసించి ఆరాధించువానిని మాయ ఏమి చేయలేదు. వాడు పూర్తి అధిపతియైన పరమాత్మనే నేరుగ నమ్మినవాడు, కనుక మాయ వాని ఎడల ఏమి చేయలేదు. అట్టివాడు ఆ జన్మలోనే మోక్షము పొందవచ్చును. అందువలననే గీతయందు పరమాత్మ **'మామేవ యే ప్రపద్యన్తే మాయా మేతాం తరంతితే'** ఎవరైతే నన్ను ఆరాధించుచున్నారో వారు మాయనుండి సులభముగ దాటి పోగలడన్నాడు. కావున మాయను తయారు చేసివుంచిన పరమాత్మనే ఆరాధించవలెను. అట్లు ఆరాధించని ఎడల జగతి మీద సర్వ హక్కులు కల్గిన మాయ, జగతిలో నిజమైన దైవముగ కూడ కనిపిస్తుంది. పరమాత్మ విభూతులు ఎంత గొప్పవో, అంతకంటే గొప్పవిగ భూమిమీద మాయ యొక్క విభూతులు కనిపించును. మేము ఎంత చెప్పిన పరమాత్మ జ్ఞానము అనేక జన్మల సంస్కారము గలవారికే అర్థమగును. వారిలో ఇంకనూ సంస్కరింపబడిన వారికే భగవంతుడర్థమగును. ఎంత అర్థమైనప్పటికి నేనే గొప్పయను మాయ మాటలు వినని వారెవరో అరుదుగా ఉందురు. గీత చివరిలో భగవంతుడు **'మన్మనాభవ మద్భక్తో మద్యాజీమాం నమస్కురు'** నన్నే నీ మనసులో గొప్పగ పెట్టుకొనుము, నాకే

భక్తిగ ఉండుము, నన్నే నమస్కరించుము నాయందే కలిసి పోవుదువనగా! మాయ కూడ నన్నే గొప్పగ పెట్టుకొనుము, నన్నే నమస్కరింపుము, నీకు ఏ కష్టములు రాకుండా ఏ లోటు లేకుండా చూస్తానంటుంది. ఏది వింటారో ఎటువైపు పోతారో మీ ఇష్టము.

*(6) శ్లో॥ 15 : న మాం దుష్కృతినో మూఢాః ప్రపద్యన్తే నరాధమాః ।*
*మాయయాఽ పహృతజ్ఞానా ఆసురం భావ మాశ్రితాః ॥*
*( జీవాత్మ, పరమాత్మ)*

**భావము :** పాపకార్యములు చేయువారు, మూఢులైనవారు, మాయచేత మూసి వేయబడిన జ్ఞానము కలవారు, అసుర భావము గల జనులు నన్ను తెలియలేరు, పొందలేరు.

*( 6 ) శ్లో ॥ 16 : చతుర్విధా భజన్తే మాం జనాస్సుకృతి నోఽర్జున ! ।*
*ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీచ భరతర్షభ ॥*
*( జీవాత్మ, పరమాత్మ)*

**భావము :** అర్జునా నన్ను భజించు సుకృతులు నాల్గురకములుగ ఉన్నారు. వారిని ఆర్తులు, జిజ్ఞాసులు, అర్థార్థులు, జ్ఞానులు అని విభజించి చెప్పవచ్చును.

**వివరము :** పరమాత్మను అనేక రకములుగ విభజించుకొని ఆరాధించువారున్నారు. మేము దైవమునే ఆరాధిస్తున్నామని వారి నమ్మకము. అసలు దైవమను వాడెట్లుండునను వివరము తెలియక, ఎవరి ఊహకు వారు పేరు రూపము కల్పించుకొని ఆరాధిస్తున్నారు. ఎవరికి తోచినది వారు చేయగ వారి మనస్సులో మేము దైవమునే ఆరాధిస్తున్నామను భావముండుట వలన వారు పరమాత్మను ఆరాధించినట్లే. అట్లు ఆరాధించువారిలో నాల్గురకములుగా ఉన్నారని చెప్పవచ్చును.

**1) ఆర్తుడు 2) జిజ్ఞాసి 3) అర్థార్థి 4) జ్ఞాని అని చెప్పవచ్చును.**

**1) ఆర్తుడు** :- ఆర్తుడనగా ఆపదలందు మాత్రము మ్రొక్కువాడని అర్థము. ఏదైన కష్టమొచ్చినపుడో, రోగమొచ్చినపుడో, ఆర్థిక ఇబ్బంది వచ్చినప్పుడో, ఏ దైవమైతే తొందరగ ఫలితమిస్తాడో అతనికి ముడుపు కట్టి మరీ మ్రొక్కువాడు. ఉదాహరణకు తిరుపతి వెంకటేశ్వరస్వామికి ఆపద మ్రొక్కులవాడని పేరు పెట్టి ఆపదలందే మ్రొక్కు వారెందరో కలరు. అంతేకాక ఒక్కొక్కరు ఒక్కొక్క దేవున్ని వారి వారి ఆపదలకు అడ్డము పెట్టుకొని ఆరాధిస్తుందురు. పిల్లవానికి జ్వరము వచ్చిన అప్పటికప్పుడు మ్రొక్కువారందరిని ఆర్తులని చెప్పవచ్చును.

**2) జిజ్ఞాసి** :- జిజ్ఞాసులనగా! దైవమును గూర్చి తెలుసుకోవలెనని ప్రయత్నము చేయువారు. వీరు ఆపద నిమిత్తము అక్కడక్కడ చిన్న చిన్న పూజలు చేస్తున్నప్పటికి అంతటితో ఆగక దైవమును తెలుసుకోవాలని ప్రయత్నము కూడ చేయుచుందురు. ఉదాహరణకు ఆర్తుడనగ తిరుపతి వెంకటేశ్వరస్వామిని దర్శించుటకు తిరుపతికి పోయినవాడు. అందరివలె తాను గుండు కొరిగించుకొని తర్వాత అందరివలె ఊరకుండక, మనము గుండుకొరిగించుకొనుట వలన దైవమునకు ఏమి లాభము. దైవమునకు లాభముగాని, మనకు నష్టముగాని లేని ఈ పనినెందుకు అందరు చేస్తున్నారు. దీనికేదో మనందరికి తెలియని రహస్య అర్థమున్నది. దానిని తెలుసుకొంటే దైవమును అంతో ఇంతో తెలుసుకొన్నవారమైతామని, ఆ వివరము తెలుసుకోవాలని, దైవమును తెలుసుకోవాలని ప్రయత్నించుచుండును. అట్టివారిని జిజ్ఞాసులు అనవచ్చును.

**3) అర్థార్థి** :- అర్థార్థి అనగ అర్థము కోసము అర్థించువాడని వివరము. అర్థమనగా డబ్బు, డబ్బు కోసము దేవుళ్లను పూజించి అర్థించువానిని అర్థార్థి అందురు. ఉదాహరణకు ఒకనికి ఏ ఆపద ఏ కష్టములేదు. వానికి దైవమును గూర్చి తెలుసుకోవలెనని జిజ్ఞాస లేదు. మరియు ఆపదయందు ఆర్తునిగ మ్రొక్కు అవసరములేదు. అయినప్పటికి ధనము ఇంకనూ కావలెనని మ్రొక్కుటయే వాని అభిమతమై ఉండును. ఉదాహరణకు ఒక ధనికుడున్నాడనుకొనుము. వానికి

ఆపదలేదు. దైవమును తెలియవలెనను ధ్యాసలేదు. కాని ధనము ఇంకనూ కావలెనను ఆశవున్నది. కనుక అతను ధనము కొరకు పేరున్న దేవతలను, పేరున్న మహత్యముగల స్వాములను కోర్కెలు కోరుచుండును. నాకు ఈ సంవత్సరము వ్యాపారములో 10 కోట్లు లాభమొస్తే పదిలక్షలు ముడుపు ఇస్తాననో, బంగారు కిరీటము చేయిస్తాననో మ్రొక్కుచుందురు. ఎలాగో లాభమొచ్చేటట్లే చేసుకొంటారు. లాభమొచ్చిన వెంటనే ముడుపు రూపముగానో, కానుకల రూపముగానో వారి మ్రొక్కు చెల్లించుకొనుచుందురు. ఈ విధముగ దేవుళ్ళకు కిరీటము చేయించిన వారున్నారు. లక్షల కానుకలు బహూకరించిన వారున్నారు. ఇటువంటి వారినందరిని అర్థార్థులని అనవచ్చును.

**4) జ్ఞాని :-** ఇతడు ఆర్తుడు, అర్థార్థుడు కాక జిజ్ఞాసుడై ఉండి జ్ఞానమును తెలుసు కొనుచుండును. అట్లు తెలుసుకొనుచు చివరికి సంపూర్ణ జ్ఞానమును పొందగలుగును. ఉదాహరణకు దైవజ్ఞానము మీద జిజ్ఞాసకల్గి కోర్కెలు కోరడము దైవారాధనలో తగదని తెలుసుకొని, ఆరాధనలో ఎంతో జ్ఞానమున్నదని గ్రహించి, వాటి అర్థముల కొరకు ప్రయత్నము చేయుచు చివరకు దైవపూజలోని మరియు దేవాలయములలోని గుర్తుల అర్థములన్ని గ్రహించును. దైవారాధనలోని ప్రతిపనికి అర్థము తెలుసుకొని పూర్తి జ్ఞానికాగలడు. అట్లు జ్ఞానియైనవాడు జ్ఞానము ప్రకారము నడచుకొనుచు దైవత్వమును తెలుసుకోవాలని, మానవత్వమునుండి దైవత్వమునకు చేరుకోవాలని ప్రయత్నము చేయుచుండును. **ఆర్తుడు-అర్థార్థి, జిజ్ఞాసి - జ్ఞాని** అను వరుసక్రమమని తెలియవలెను. ఆర్తునికి, అర్థార్థికి దగ్గర సంబంధమున్నది. అట్లే జిజ్ఞాసికి, జ్ఞానికి దగ్గర సంబంధమున్నది. ఆర్తుడు అర్థార్థి కాగలడు, జిజ్ఞాసి జ్ఞాని కాగలడు.

*(6) శ్లో ॥ 17 : తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏక భక్తిర్విశిష్యతే ।*
*ప్రియో హి జ్ఞానినోఽత్యర్థ మహం స చ మమప్రియః ॥*
*( జీవాత్మ, పరమాత్మ)*

**భావము :** అట్టివారిలో జ్ఞాని నిత్యము నాతో పొందుకోరి ఒకే భక్తి కల్గియుండు

వాడు శ్రేష్ఠుడని చెప్పవచ్చును. వానికి నేను ఎక్కువ ప్రియుడను, అట్లే నాకు వాడు ప్రియుడు.

**వివరము :** ఆర్తుడు, అర్థార్థి, జిజ్ఞాసుడు, జ్ఞాని అను నాల్గురకములలో ఎక్కువ శాతము ఆర్తులుగలరు. నూటికి 50 మంది ఆర్తులు కాగా 45 మంది అర్థార్థులు గలరు. కేవలము నలుగురు జిజ్ఞాసులుండగ, ఒక్కరు అదియు అరుదుగ జ్ఞానికలడను కొనుము. ఉన్న ఒక్క జ్ఞాని ఆత్మతో పరమాత్మతో కూడుకోవాలని నిత్యము ప్రయత్నము చేయుచు, ఒకే భక్తి కల్గి అనగ ఇతర దేవతలను ఆరాధించక ఆత్మ మీదనే భక్తి కల్గి ఉన్నవాడైవుండును. అట్టివానిని మిగత మూడు మార్గముల వారికంటే శ్రేష్ఠుడని చెప్పవచ్చును. అట్టివాడు పరమాత్మను అన్నిటికంటే పెద్దగ, దైవములన్నిటికి దైవముగ తలచుకొనుచు పరమాత్మ మీదనే తన ఇష్టతను కల్గియుండును. ఎంత కష్ట సమయములోకాని పరమాత్మ విషయప్రస్తావన వస్తూనే అంతటిని మరచిపోయి ఆనందబరితుడగుచుండును. అట్టివానిని పరమాత్మ కూడ పరమ ప్రియునిగ భావించుకొనునని చెప్పబడివున్నది.

(6) శ్లో॥ 18 : ఉదారా స్సర్వ ఏవైతే జ్ఞానీత్వాత్మైవ మేమతం ।
ఆస్థిత స్సహి యుక్తాత్మా మామేవానుత్తమాం గతిం ॥
(జీవాత్మ, పరమాత్మ)

**భావము :** ఈ నాలుగు రకములలోని సర్వులు ఉదారులే. అందులో జ్ఞానిని నా ఆత్మగ తలచుచున్నాను. అతడు నా ఆత్మతో కూడుకొని ఉండి నా యొక్క ఉత్తమమైన గతిని పొందుచున్నాడు.

**వివరము :** ఆర్తుడు, అర్థార్థి, జిజ్ఞాసుడు, జ్ఞాని అనువారిలో జ్ఞాని అనువానిని పరమాత్మ వేరువానిగ తలవక తన ఆత్మగానే లెక్కించుకొనుచున్నాడు. ఎందుకనగా సంపూర్ణ జ్ఞానియైనవాడు యోగమునే ఆచరించుచు ఆత్మయందే కూడుకొని ఉన్నాడు. వాని మనస్సుకు బాహ్యచింతలు లేవు. ఆత్మధ్యాస కల్గిన ఆ జీవున్ని ఆత్మగనే

పరమాత్మ చూచుచున్నాడు. ఆ జీవాత్మ ఆత్మధ్యాసకల్గివుండి చివరకు పరమాత్మను పొందగల్గుచున్నాడు.

(6) శ్లో ॥ 19 : బహూనాం జన్మనా మంతే జ్ఞాన వాన్మాం ప్రపద్యతే ।
వాసుదేవ స్సర్వ మితి స మహాత్మా సుదుర్ల భః ॥
(జీవాత్మ, సాకారము)

**భావము :** జ్ఞానవంతుడు ఎన్నో జన్మలు పొంది చివరకు వాసుదేవుడే సర్వమని తలచి నన్ను పొందగలుగుచున్నాడు. అట్టివాడు ఎంతో దుర్లభముగ లభించును.

**వివరము :** ఇంతవరకు ముందు చెప్పిన శ్లోకములలో నిరాకారమును గూర్చి చెప్పగ ఇక్కడ సాకారమును గూర్చి చెప్పడము జరుగుచున్నది. ఇది పరమాత్మ భూమిమీద భగవంతునిగ ఉన్నప్పటి అరుదైన విషయము. ఎప్పుడో అవసర మొచ్చినపుడు వేల సంవత్సరములకో, లక్షల సంవత్సరములకో ఒక మారువచ్చు భగవంతున్ని ఆ సమయములో కనిపెట్టినవాడు చాలా అరుదైనవానిగ చెప్పవచ్చును. ఆ విషయమును శ్లోకములో కూడ 'సమహాత్మాసుదుర్లభః' అట్టి మహాత్ముడు సులభముగ దొరకడని చెప్పారు. జ్ఞానియైనవాడు ఎన్నో జన్మలు ఎత్తగా చివరకు భూమిమీద పరమాత్మను భగవంతునిగ గుర్తించు యోగ్యత కల్గియుండును. ఆ సమయములో భగవంతుడు భూమిమీద ఉంటే అతను గుర్తించగలడు. అట్టివాడు దొరుకుట చాలా దుర్లభము. పరమాత్మ జన్మ దుర్లభముగ ఎప్పుడో జరుగునది. అప్పుడే అంతటి జ్ఞాని ఉండుట కూడ దుర్లభమేకదా! పూర్వము పెద్ద యోగులు కూడ గ్రహించలేని భగవంతుని జన్మను శ్రీకృష్ణునిగ గుర్తించిన భీష్ముడు సూక్ష్మములో మోక్షమును పొందాడు. సూక్ష్మములో మోక్షమనగా ఏ యోగము చేయకనే నేరుగ సులభముగ మోక్షము పొందడము.

(6) శ్లో ॥ 20 : కామైస్తైస్తైర్హృత జ్ఞానాః ప్రపద్యంతేఽన్యదేవతాః ।
తంతం నియమ మాస్థాయ ప్రకృత్యా నియతా స్స్వయా ॥
(జీవాత్మ)

**భావము :** ప్రకృతి సంబంధములైన ఆశ గుణములచేత, జ్ఞానములేనివారై అన్యదేవ తారాధన చేయుచున్నారు. ఆయా దేవతల నియమ నిష్ఠలననుసరించి వారిని ఆరాధించుచున్నారు.

**వివరము :** ప్రకృతి గుణములచేత ఆశ అను తాటికి లాగబడినవారై, ఆర్తులు అర్థార్థులు అన్నిటికంటే పెద్దదైన పరమాత్మను వదలి చిల్లర దేవుళ్ళను నమ్ముకొని, వారివలన తమకెంతో లాభము కల్గునని తలచినవారై ఆ దేవుళ్ళనే ఆరాధిస్తున్నారు. ఆరాధనలో నియమనిష్ఠలు లేని ఆత్మ విధానమును వదలి, నియమ నిష్ఠలుగల ఇతర దేవతారాధన చేయుచున్నారు. పరదేవతారాధనలో శరీర శ్రమ ఎంత ఉన్నా ఓర్చుకొని ఆరాధించడము జరుగుచున్నది.

*(6) శ్లో ॥21: యోయో యాం యాం తనుంభక్త శ్రద్ధ యార్చితు మిచ్ఛతి ।*
*తస్య తస్యాఽచలాం శ్రద్ధాం తా మేవ విదధామ్యహామ్ ॥*
*( జీవాత్మ)*

**భావము :** ఎవడెవడు ఏ ఏ దేవతను శ్రద్ధతో ఆరాధించవలెననుకొనునో, వాని వానికాశ్రద్ధను దృఢమైనదిగా ఉండునట్లు నేను కలుగజేయుదును.

**వివరము :** గ్రుడ్డికంటే మెల్ల మేలన్నట్లు ఏదో ఒక దేవతా భక్తి అయినను వానిలో ఉండుట మంచిది. ఏ భక్తిలేనివాడు వాసనలేని పువ్వులాంటివాడగును. అట్లు వ్యర్థ జీవుడు కాకుండ వానికున్న ఆ భక్తినైన దృఢముగ ఉండునట్లు పరమాత్మయే చేయుచున్నాడు.

*(6) శ్లో॥ 22 : సతయా శ్రద్ధ యా యుక్త స్త స్యా రాధన మీహతే ।*
*లభతే చ తతః కామాన్ మయైవ విహితాన్ హితాన్ ॥*
*( జీవాత్మ)*

**భావము :** వాడు శ్రద్ధవహించి ఆ దేవతలనే ఉపాసన చేయగ దానివలన కామ్యార్థసిద్ధి కలుగును. వాని హితము కోరి నేనే కామ్యార్థసిద్ధి కలుగజేయుచున్నాను.

**వివరము :** ఎవని ఇష్టమునకు అనుగుణముగ వానికా శ్రద్ధయే పరమాత్మ కలుగ జేయగ, ఆ శ్రద్ధతోనే వాడు దేవతారాధనలు చేయగ, ఆ ఆరాధనల వలన వాడు కోరుకొన్న కోర్కెలను నెరవేరునట్లు పరమాత్మయే చేయుచున్నాడు. వాని కర్మాను సారము లభ్యమగు ఫలితములనే, కోరినవి లభించినట్లు వానికర్థమగులాగున చేయుచున్నాడు. లభించిన ఫలములను బట్టి వాడు నాస్తికుడుగ మారక ఆస్తికునిగైన ఉండగలడు.

*(6)శ్లో॥ 23 : అంత వత్తు ఫలం తేషాం తద్భవ త్యల్ప మేధసామ్ ।*
*దేవాన్ దేవ యజో యాంతి మద్భక్తా యాంతి మామపి ॥*
*(జీవుడు)*

**భావము :** అల్పబుద్ధి గలవారు పొందు ఫలము అనిత్యమైనది. దేవతలను పూజించువారు దేవతలను చెందగా, నన్ను పూజించువారు నన్నే చెందగలరు.

**వివరము :** తెలివి తక్కువవారు విశాలమైన పరమాత్మను వదలి, రవ్వంతైన దేవతలను పూజించువారికి కలుగు ఫలితము కూడ కొద్దిగనే కొంతకాలమే ఉండును. ఆ ఫలితములు అప్పటికి రుచించిన శాశ్వతమైనవి కావు. అంతేకాదు దేవతలను ఆరాధించువారు చనిపోయిన తర్వాత ఏదో ఒక ప్రతిమలో జీవముగ చేరి వారు కూడ దేవతలై పోవుచుందురు. వారు వారు చేసుకొన్న ఆరాధనలను బట్టి, ఆయా దేవతలను బట్టి, ఎన్నో చిన్న పెద్ద రకములుగనున్న దేవత ప్రతిమలలో పుట్టి, రకరకాల దేవతలుగ మారిపోవుచున్నారు. మనిషి శరీరములో జన్మలున్నట్లే ప్రతిమ శరీరములో కూడ జన్మలున్నవి. దేవతలుగ పుట్టిన జీవులు విగ్రహాలుగ చెప్పబడుదురు. మనుషులుగ పుట్టు జీవులు గ్రహాలుగ చెప్పబడుదురు. చాలామందికి ప్రతిమలలో జన్మలున్న మాట తెలియదు. పై శ్లోకమును బట్టి నమ్మగలరనుకొంటాము. కొందరు దేవతారాధకులు దేవతలలో పుట్టగ, పరమాత్మను చేరవలెనని అన్యదేవతార్చన చేయక, నిత్యము కర్మబాపుకొను పనిలో, అంతరాత్మ ధ్యాసలో ఉన్నవాడు పరమాత్మనే చేరి జన్మించకుండపోవును.

(6) శ్లో॥ 24 : అవ్యక్తం వ్యక్తి మాపన్నం మన్యంతే మామ బుద్ధయః ।
పరం భావ మజానన్తో మమావ్యయ మనుత్తమమ్ ॥
( జీవాత్మ, పరమాత్మ)

**భావము :** నాశనములేని ఉత్తమమైన పరమమైన నా నిజస్వరూపమును బుద్ధిహీనులు తెలుసుకోలేక అవ్యక్తుడనైన నన్ను వ్యక్తుడని తలచుచున్నారు.

**వివరము :** పరమాత్మ మిగతా దేవుళ్లవలెనుండడు. దేవతల ఆకారమువలె పరమాత్మకు ఆకారముండదు. అట్లే పేరు ఉండదు. పరమాత్మ దేవతల మాదిరి కనిపించు మూర్తియుకాదు. వ్యక్తముగనున్న (తెలియబడు) దేవతలవలె కాక అవ్యక్తముగ కనిపించనివాడై ఉన్నాడు. దేవతలు ఒక్కచోట స్థిరస్థాయిగ ప్రతిమ రూపములో ఉండి, సూక్ష్మముగ అప్పుడప్పుడు అక్కడక్కడ తిరుగుచుందురు. పరమాత్మ ఇక్కడ అక్కడ అను తారతమ్యము లేకుండ అంతట కనిపించక ఉన్నాడు. అలా పోల్చితే ఎన్నో రెట్లు దేవతలకంటే అధికుడై, నాశనములేనివాడై, ఉత్తముడై ఉన్న పరమాత్మ కనిపించని శక్తిగ ఉన్నప్పటికి, తెలివితక్కువవారు జ్ఞానహీనులైనవారు కొందరు పరమాత్మను కూడ కనిపించు దేవతలలో ఒక్కనిగ పోల్చుకొనుచున్నారు. పరమాత్మ దేవతలకే దేవుడని, అందరివలె కనిపించు వాడుకాదని తెలియలేకున్నారు. కనిపించు దేవతలకు, కనిపించని పరమాత్మకు ఏ ఏ భేదములున్నవో క్రింద చూడుము.

| <u>దేవతలు</u> | <u>పరమాత్మ</u> |
|---|---|
| 1) దేవతలు కనిపించు ఆకారమున్నవారు. | (1) పరమాత్మ ఆకారమే లేనివాడు. |
| 2) దేవతలు వివిధ పేర్లు కలవారు. | (2) పరమాత్మ ఏ పేరు లేనివాడు. |
| 3) దేవతలకు మరణము కలదు. | (3) పరమాత్మకు మరణము లేదు. |
| 4) దేవతలకు నాశనము కలదు. | (4) నాశనములేనివాడు పరమాత్మ. |
| 5) పురుషదేవతలు, స్త్రీదేవతలుకలరు. | (5) పరమాత్మ స్త్రీకాదు, పురుషుడుకాదు. |

| | |
|---|---|
| 6) ఒకచోటునుండి మరొక చోటుకు సూక్ష్మముగ పోగలరు. | (6) అంతటనున్నవాడు. పోవలసిన పనేలేదు. |
| 7) ప్రతిమే దేహముగ గలవారు | (7) ప్రత్యేకించి ఎట్టి దేహము లేదు. |
| 8) వీరు కూడ తపము యోగము ఆచరించుదురు. | (8) ఏవి ఆచరించడు. |
| 9) జీవాత్మలుగ ఉన్నవారు | (9) పరమాత్మగ ఉన్నవాడు. |
| 10) ధనికులు బీదవారు కలరు. | (10) ఆయన ఏదీ కాదు. |
| 11) మాంత్రికులకు భయపడుదురు వశమౌదురు. | (11) ఎవరికీ భయపడడు ఎవరికీ వశము కాడు. |
| 12) ప్రళయములో లయమై పోవుదురు. | (12) ప్రళయములో కూడ మిగిలి ఉన్నవాడు. |
| 13) ఒక్కచోట ఉండి, ఒక్కచోటనే చూడగల్గువారు. | (13) విశ్వవ్యాపి, అంతటా చూస్తున్నాడు. |
| 14) వీరికి కష్ట సుఖములున్నవి. | 14) కష్టసుఖములకు అతీతుడు. |
| 15) ఎవరైనా ఫలానా దేవుడని గుర్తించగలరు. | 15) యోగులకు మాత్రము గుర్తింపు కలవాడు. |

> 6) శ్లో॥ 25 : నాహం ప్రకాశ స్సర్వస్య యోగమాయా సమావృతః ।
> మూఢోఽయం నాభిజానాతి లోకోమా మజ మవ్యయమ్ ॥
> (జీవాత్మ, పరమాత్మ)

**భావము :** 'యోగమాయా సమావృతః' అన్న పదము ఈ శ్లోకములో ఉపయోగించ బడినది. మాయ అనగ త్రిగుణముల సారము. యోగమనగ కూడుకొనుట. "సమావృతః" అనగ కొట్టబడిన లేక కప్పబడిన అని అర్థము. గుణములచేత

కూడుకొని గుణముల సారమైన మాయతో కప్పబడువారు పరమాత్మనా? లేక సర్వ మానవులా? అని యోచించాలి.

మిగతా గీతలలో ఇలా వ్రాయబడివున్నది. యోగమాయచే కప్పబడివున్న నేను ఎవరికీ తెలియబడను. పుట్టుక నాశనములేని నన్ను మూఢులు తెలుసుకోలేరు. మూఢులైన మానవులు పరమాత్మను తెలుసుకోలేరను మాట నిజమే. పరమాత్మకు మాయ కూడుకొని ఉన్నదా? పరమాత్మ మాయచే కప్పబడినవాడా! పరమాత్మకంటే మాయ పెద్దదా? అను ప్రశ్నలు ఈ భావమును చూచినవారికి రాగలవు. పై శ్లోకములో సర్వ మానవులు మాయచే యోగమైనారు, అనగ మాయచే కూడుకొన్నారు. మాయచేత కప్పబడిన మూఢులు నన్ను చూడలేరు. పుట్టుక నాశనములేని నన్ను ఎవరూ తెలియలేరు అను భావము స్పష్టముగనుండగ మాయచే పరమాత్మ కప్పబడివున్నాడనడము, మాయచే కూడుకొని ఉన్నాడనడము చాలా పొరపాటు. మాయచే కూడుకొనువాడు, గుణములచే పూడ్చబడి ఉన్నవాడు జీవుడు. గుణముల ప్రభావమువలన, మాయ అను పొర అడ్డముండుట వలన, పరమాత్మ అంశ అయిన ఆత్మను జీవుడు చూడలేక పరమాత్మను అర్థము చేసుకోలేకున్నాడు. సర్వులు మాయలో మునిగి దైవమును చూడలేకున్నారనుట వాస్తవము. అలాకాక దైవమే మాయతో కూడివుండుట వలన ఎవరు తెలియలేకున్నారనుట అవాస్తవము. శుద్ధపొరపాటు. మూఢులైనవారు నాకు పుట్టుక నాశనము లేదను మాటను తెలియజాలకున్నారు. మేము ప్రత్యేకించి వ్రాయు టీక-భావము క్రింద గలదు.

**టీక** :- **<u>సర్వస్య</u>**=మానవులందరు, **<u>యోగమాయ</u>**= మాయచే కూడుకొని

**సమావృతః** = కప్పబడి ఉన్నవారై, **<u>అహం</u>**=నేను

**నప్రకాశః** = అగుపడువాడను కాను లేక తెలియబడువాడను కాను

**మామ్** = నన్ను, **<u>అజ</u>** = పుట్టుకలేని, **<u>అవ్యయమ్</u>** = నాశనములేని

**లోకోమూఢ** = మూఢులైన లోకులు, **<u>అభిజానాతి</u>** = తెలియలేకున్నారు.

**భావము :** మాయతో కూడుకొన్నవారు, మాయతో కప్పబడినవారైన సర్వులు నన్ను తెలియజాలకున్నారు. మూఢులైన లోకులు నాకు పుట్టుక నాశనము లేదని తెలియలేకున్నారు.

*(6) శ్లో॥ 26 : వే దాహం సమతీతాని వర్తమానాని చార్జున ! ।*
*భవిష్యాణి చ భూతాని మాంతు వేద న కశ్చన ॥*
*( జీవాత్మ, పరమాత్మ)*

**భావము :** సర్వ జీవులకు జరిగిపోయినవి, జరుగుచున్నవి, జరుగబోవునవి నాకు తెలుసు. నన్ను మాత్రము ఎవడు తెలియలేడు.

**వివరము :** సర్వ జీవరాసుల కర్మలు వాని శిరస్సులోని కర్మచక్రములో అమరి ఉండును. కాలచక్రము, కర్మచక్రము ఆత్మను ఇరుసుగ చేసుకొని తలలో తిరుగుచుండును. ఏ కాలములో ఏ కర్మ గడచిపోయినది, ఏ కాలములో ఏ కర్మ జరుగబోవునో, ప్రస్తుతకాలములో ఏమి జరుగుచున్నదో అన్ని అక్కడ ఆ చక్రములలో తెలియగలవు. పరమాత్మ ప్రతి శరీరములో కూడా వ్యాపించి ఉన్నాడు. ప్రతి తలలోని కర్మ కాలము ఆయనకు తెలియును. కావున ఎవరికి ఏమి జరుగునో, ఏమి జరిగినదో కూడ ఆయనకు సులభముగ తెలిసివుండును.

*(6) శ్లో॥ 27 : ఇచ్ఛాద్వేష సముత్థే న ద్వన్ద్వ మోహేన భారత ।*
*సర్వ భూతాని సమ్మోహం సర్గేయాంతి పరంతప! ॥*
*( జీవాత్మ, ప్రకృతి)*

**భావము :** రాగద్వేషములవలన పుట్టుచున్న ద్వంద్వములచే భ్రాంతి చెందినవారై, సర్వ జీవరాసులు పుట్టినది మొదులకొని వాటియందే సమ్మోహమై పోవుచున్నారు.

**వివరము :** ప్రేమ, ద్వేషము అను రెండు రకముల గుణములవలె, మిగత గుణముల వలన కల్గు సుఖదుఃఖములకు లొంగిపోయి, సర్వజీవరాసులు పుట్టింది మొదులుకొని మంత్రించబడిన వారివలె ఆ గుణములలోనే చిక్కుకొని ఉన్నారు.

(6) శ్లో॥ 28 : యేషాం త్వన్తగతం పాపం జనానాం పుణ్యకర్మణామ్ ।
తేద్వన్ద్వ మోహనిర్ముక్తా భజన్తే మాం దృఢవ్రతాః ॥

( జీవాత్మ, పరమాత్మ)

**భావము :** మనుషులలో ఎవడు వాని యొక్క ద్వంద్వ గుణముల మోహము వదలబడి నన్నే భజించుచున్నాడో, అట్టివాడు తన పుణ్యపాపములను నశింప చేసుకొనును.

**వివరము :** చాలా గీతలలో ఎవని యొక్క పాపపుణ్యములు నశించుచున్నవో, అట్టివాడు ద్వంద్వములను వదిలి పరమాత్మనే భజించునని వ్రాశారు. ద్వంద్వములు వదిలి యోగమాచరించిన తర్వాత పాపపుణ్యములు పోతాయి కాని, పాప పుణ్యములు పోయిన తర్వాత ద్వంద్వములు వదలడము పరమాత్మను భజించడము అర్థములేని మాట అగును. ఏది ముందు ఏది వెనుక అని యోచించక వ్రాశారు. ముందు ద్వంద్వ గుణములను లేకుండ చేసుకొని, యోగము ద్వార పరమాత్మను ఆరాధించగ, తర్వాత పాపపుణ్య కర్మ నశించును.

(6) శ్లో॥ 29 : జరామరణ మోక్షాయ మా మాశ్రిత్య యతన్తి యే ।
తే బ్రహ్మ తద్విదుః కృత్స్న మధ్యాత్మం కర్మ చాఖిలమ్ ॥

( జీవాత్మ, పరమాత్మ)

**భావము :** జరామరణ మోక్షము కొరకు నన్నే ఆశ్రయించి ఎవడు ప్రయత్నించు చున్నాడో వాడు ఆత్మను, ఆధ్యాత్మికమును, కర్మమును తెలిసినవాడై ఉండును.

**వివరము :** చావు పుట్టుకల నుండి విడువబడి, వాటిని పొందకుండ మోక్షమును చేరాలంటే పరమాత్మే దీనికి ఆధారమని, పరమాత్మనే ఆశ్రయించి ఆయనను చేరవలెనని ప్రయత్నము చేయువాడు ఎవడో, అటువంటి వాడు ఆధ్యాత్మికమును కర్మముల వివరము అన్నియు తెలిసివుండును.

(6)శ్లో॥ 30 : సాధిభూతాధి దైవం మాం సాధియజ్ఞం చ యేవిదుః ।
ప్రయాణకాలేఽపిచ మాం తే విదుర్యుక్త చేతసః ॥
( జీవాత్మ, పరమాత్మ)

**భావము :** సర్వజీవరాసులకును, సర్వదేవతలకును, సర్వయజ్ఞములకును నేనే ఆధారభూతుడనని ఎవరు తెలుసుకొందురో, వారు అవసానదశలో వారి మనస్సును నాయందే ఉంచుకొని నన్ను తెలుసుకోగలరు.

**వివరము :** సంపూర్ణ జ్ఞానము తెలిసి ప్రపంచమునకంతటికి అధిపతి ఒకడున్నాడని, వాడు సమస్త జీవకోటికి, సర్వదేవతలకు అధిపతియై ఉన్నాడని, మరియు సమస్త కర్మనిర్మూలనకు అగ్నియై ఉన్నాడని, తెలిసినవాడు అంత్యకాలములో మనస్సుచే ఆత్మనే స్మరించుకొనువాడై చివరకు పరమాత్మను చేరును.

ఇంతటితో విజ్ఞాన యోగమను అధ్యాయము సమాప్తము. ఈ అధ్యాయములోని శ్లోకములు ఇలా ఉన్నవి.

| | | | |
|---|---|---|---|
| 1) | జీవాత్మ, పరమాత్మ | = | 11 |
| 2) | జీవాత్మ | = | 6 |
| 3) | ప్రకృతి | = | 1 |
| 4) | ప్రకృతి, పరమాత్మ | = | 2 |
| 5) | పరమాత్మ | = | 8 |
| 6) | జీవాత్మ, సాకారము | = | 1 |
| 7) | ప్రకృతి, జీవాత్మ | = | 1 |
| | మొత్తము శ్లోకములు | = | 30 |

భావము, వివరము మార్చి వ్రాసిన శ్లోకములు - 5,11,25.

*****

## ఏడవ అధ్యాయము

# అక్షర పరబ్రహ్మ యోగము

అక్షరము అనగ నాశనములేనిదని అర్థము. అక్షర పరబ్రహ్మమని పేరు పెట్టబడిన ఈ అధ్యాయములో ఎక్కువగ మోక్షమును గురించిన విషయమేకలదు. ఇంకనూ యోగమాచరించు యోగులు ఆ జన్మలో మోక్షము పొందారా లేదా అని తెలుసుకొను విధానము కూడ తెలియబరచబడినది. భగవంతుడు యుద్ధరంగములో ఇలా అధ్యాయములుగ గీతను చెప్పలేదని, యుద్ధము తర్వాత వ్యాసునిచే భగవంతుడు చెప్పిన విషయము వ్రాయబడినదని ముందే చెప్పాము. వ్యాసుడు అధ్యాయములుగ విభజించి చెప్పిన వాటిలో దాదాపు ఆత్మసంయమ యోగమను అధ్యాయమువరకు ఎక్కువగా యోగముల గురించియే చెప్పాడు. అక్కడినుండి ఎక్కువగా జీవాత్మ, ఆత్మ, పరమాత్మల గురించి చెప్పుచూ వచ్చి ఈ అధ్యాయములో మోక్షమును గూర్చి ఎక్కువగా చెప్పాడు. అంతేకాక అధ్యాయము మొదటిలో మంచి ప్రశ్నలనిచ్చి వాటికి జవాబులు తెల్పడము ఎంతో ప్రత్యేకముగ, పాఠకులకు సులభముగ జ్ఞానము అర్థమగులాగున ఉన్నది.

**అర్జునుడిట్లనియె :-**

*(7) శ్లో ॥ 1 : కిం త ద్బ్రహ్మ? కిమధ్యాత్మం? కిం కర్మ పురుషోత్తమ! ।*
*అధిభూతం చ కిం? ప్రోక్త మధిదైవం కిముచ్యతే? ॥*
*(ప్రకృతి, ఆత్మ, పరమాత్మ)*

*(7) శ్లో ॥ 2 : అధి యజ్ఞః కథం కోఽత్ర దేహేఽస్మి న్మధుసూదన! ।*
*ప్రయాణ కాలేచ కథం జ్ఞేయోఽసి నియతాత్మభిః ॥*
*(ఆత్మ, పరమాత్మ)*

**భావము :** బ్రహ్మమేది? ఏది ఆధ్యాత్మికము? కర్మయేది? ఏది భూతములకు అధిపతి? అట్లే దేవతలకు అధికుడైనవాడెవడు? తెలియచెప్పుము. పురుషోత్తమ.!

దేహములో యజ్ఞములకు అధిపతియైనవాడు ఎట్లున్నాడు? నియాతాత్ములు వారి అంత్యకాలములో నిన్ను ఎట్లు పొందుచున్నారు?

**వివరము :** ఇక్కడ అర్జునుడు ఒక్కమారుగ ఏడు ప్రశ్నలడిగాడు. ఈ ఏడు ప్రశ్నల చివరిలో అంత్యకాలములో యోగులు ఎట్లు నిన్ను పొందుచున్నారను ప్రశ్న కలదు. మొదటి ఆరు ప్రశ్నలకు రెండు శ్లోకములలో జవాబులు చెప్పబడి ఉన్నాయి. ఈ అధ్యాయములోని 28 శ్లోకములలో రెండు శ్లోకములు అర్జునుని ప్రశ్నలుకాగ రెండు శ్లోకములలో ఆరు ప్రశ్నలకు జవాబులు చెప్పగ మిగత 24 శ్లోకములలోను ఏడవ ప్రశ్నకు జవాబు ఇమిడివున్నది. అర్జునుడు అడిగిన ఏడు ప్రశ్నలేవనగా! బ్రహ్మమనగా ఏది? ఇచట గమనించవలసినది ఈ ప్రశ్న విష్ణు, ఈశ్వర, బ్రహ్మలను వారిలోని నాలుగు తలల బ్రహ్మను గూర్చి అడిగినదికాదు. ఈ సర్వసృష్ఠికి మూలకర్త, అన్నిటికి అధిపతి, అంతట వ్యాపించినవాడు, దేవతలకు దేవుడైనవాడు, పరమాత్మయని పిలువబడువాడు ఎవడని అర్జునుడు మొదట ప్రశ్న వేశాడు. రెండవ ప్రశ్న ఆధ్యాత్మికము అనగా ఏమిటి? మూడవది కర్మ అంటే ఏమిటి? నాల్గవది సర్వజీవరాసులకు అధిపతియైనవాడెవడు? ఐదవ ప్రశ్న సర్వ దేవతలకు పెద్ద ఎవరు? ఆరవ ప్రశ్న దేహములో యజ్ఞములకెవరు అధిపతి? చివరి ఏడవ ప్రశ్న యోగులు అవసానదశలో ఎట్లు మోక్షము పొందగల్గుచున్నారు.? ఈ ప్రశ్నలకు జవాబుగ శ్రీకృష్ణుడిట్లన్నాడు.

**శ్రీ భగవంతుడిట్లనియె :-**

*(7) శ్లో॥ 3 : అక్షరం బ్రహ్మ పరమం స్వభావోఽధ్యాత్మ ముచ్యతే ।*
*భూత భావోద్భవకరో విసర్గః కర్మ సంజ్ఞితః ॥*
*(ప్రకృతి, పరమాత్మ)*

**భావము :** అన్నిటికంటే శ్రేష్ఠమైన నాశరహితమైనదే బ్రహ్మము. తన్నుతాను

తెలుసుకోవడమే ఆధ్యాత్మికము అనబడును. జీవరాసుల ఉనికికి కారణమైన లెక్కాచారమును కర్మ అందురు.

**వివరము :** మొదటి ప్రశ్నకు జవాబుగ అన్నిటికంటే శ్రేష్ఠమైన, నాశరహితమైనదే బ్రహ్మము అని చెప్పాడు. బ్రహ్మ అంటూనే ఏ బ్రహ్మ అని యోచించక కొందరు వారికి ఇష్టమొచ్చిన దైవమును గురించి తలచుకొనుచున్నారు. చాలామంది చతుర్ముఖ బ్రహ్మననుకోవడము జరుగుచున్నది. బ్రహ్మము అనునది పేరుకాదు. ఒక గొప్పతనమును తెలుపుపదము. **బ్రహ్మ అనగ పెద్దది అని అర్థము చేసుకోవాలి.** విశేషతను చూపునపుడు బ్రహ్మ పదమునుపయోగించుచుందురు. బ్రహ్మోండము, బ్రహ్మరథము అను పదములు కూడ విశేషతను చూపునవియే. ఇక్కడ అన్నిటికంటే పరమాత్మ విశేషత కల్గినవాడు కనుక ఆయనను బ్రహ్మ అను పదమును గూర్చి చెప్పారు. వాస్తవముగ జవాబులో చెప్పు శ్రేష్ఠమైన బ్రహ్మము అనువానికి అసలు పేరు లేదు. అది ఒక పెద్ద విచిత్రమైనశక్తి. ఆ శక్తిని ఏమని పేరు పెట్టాలో ఎవరికి తెలియక ఇలా బ్రహ్మమని, పరమాత్మని, ఈశ్వరుడని చెప్పుకొనుచుందురు. బ్రహ్మయనినా, పరమాత్మనినా, ఈశ్వరుడనినా అవి పేర్లు కావు. బ్రహ్మ అంటే పెద్దదని, పరమాత్మంటే ఆత్మకంటే వేరైనవాడని లేక అత్మకంటే శ్రేష్ఠమైనవాడని అర్థము. అట్లే ఈశ్వరుడు అంటే అధిపతి అని అర్థము. వాస్తవానికివి పేర్లుకావని ఏదీ కానివానికి ఏ పేరు పెట్టాలో ఎవరికి తెలియదనియే చెప్పవచ్చును. పరమాత్మ స్త్రీలింగముకాదు, పురుషలింగముకాదు. అందువలన ఒకచోట పురుషునిగ, ఒకచోట స్త్రీగ ఎట్లు చెప్పిన సరిపోవుచున్నది. **భగవద్గీతను చెప్పినది, శ్రీకృష్ణుని శరీరమునుండి పల్కినది కూడ ఆ శక్తియే. ఇప్పుడు అన్ని ప్రశ్నలకు జవాబు చెప్పునది కూడా అదియే.** అది మూడవ అధ్యాయము జ్ఞానయోగములో చెప్పినట్లు అప్పుడప్పుడు అవసరమొచ్చినపుడు మానవావతారములో పుట్టి తన ధర్మములను తెలియజేసి పోవుచుండును. అలా పరమాత్మ శరీరమును ధరించడమునే అవతారము అంటున్నాము. ఆయన ఎక్కడ ఏ అవతారమెత్తాడో కాని శ్రీకృష్ణునిగ పుట్టి నేను

పలనావాడినని స్వయముగ ప్రకటించుకొంటేగాని మనకు తెలియలేదు. అలాంటి జన్మనే భగవంతుడని వెనుక ఎన్నోసార్లు చెప్పుకున్నాము. భగవంతుడైనవాడు అర్జునుడడిగిన రెండవ ప్రశ్నకు ఏమి జవాబు చెప్పాడనగా!

తన్నుతాను తెలుసుకోవడమే ఆధ్యాత్మికము అన్నాడు. అధ్యయనమనగా వెనుతిరిగి చూచుకోవడమని లేక తిరిగి చదువుకోవడమని అర్థము. గీతను అధ్యయనము చేయడమనగా గీతను తిరిగి తెలుసుకోవడము లేక చదువుకోవడమని అర్థము. అట్లే ఆత్మ అధ్యయనము అనగా ఆత్మను చూచుకోవడము లేక ఆత్మను తెలుసుకోవడమని అర్థము దీనిప్రకారము ఆధ్యాత్మికము అన్నమాటకు తన ఆత్మను తాను తెలుసుకోవడమని అర్థము. లేక తన్నుతాను తెలుసుకోవడమని కూడ చెప్పవచ్చును. తన ఆత్మను తాను అధ్యయనము చేసుకోవడము ఆధ్యాత్మికము అను జవాబు తర్వాత కర్మఅంటే ఏమిటి అను ప్రశ్నకు జవాబు కూడ చెప్పాడు.

కర్మ అనగా జీవరాసులకు సంబంధించిన లెక్కాచారముల పట్టిక. ఒక జీవుడు ఎప్పుడు పుట్టాలి, ఎట్లు పుట్టాలి. ఏ శరీరముతో పుట్టాలి, పుట్టినపుడు ఎంత ఏడ్వాలి, పుట్టిన తర్వాత ఎంత సేపటికి పాలు త్రాగాలి అని, నిమిషమునకు ప్రతి సెకండుకు ఏమి జరగాలి అను నియంత్రిత వివరమునే కర్మ అంటున్నారు. ఇది పుట్టినది మొదలు చచ్చువరకు ముందే లెక్కలుగ వ్రాసి పెట్టబడివుండును. ఆ రాతనే కర్మ అంటున్నారు. ఈ విషయమై బైబిలులో ఏసుప్రభువు ఇలా అన్నాడు. **'నీ తలలోని వెంట్రుకలు కూడ లెక్కించబడి ఉన్నవి'** మన తలలో ఎన్ని వెంట్రుకలు ఉండాలి, ఎన్ని పోవాలి, ఎప్పుడు ఏది పోవాలను విషయము కూడ వ్రాయబడివున్నది. అట్లే ఎన్నిమార్లు కనురెప్పమూసి తెరువాలో కూడ వ్రాయబడివుండగ జీవితములో జరుగు పెద్ద చిన్న కార్యములన్నియు లిఖితమై ఉన్నాయని ఆ వివరమునే కర్మ అంటారని తెలుసుకోవాలి. విసర్గ అనగ నియంత్రించబడివున్న లెక్కాచారమని తెలుసుకోవాలి. దాని ప్రకారమే జీవితములో ప్రతి చిన్న పెద్ద పని జరుగుచున్నది. దాని అనుభూతిని జీవుడు పొందుచున్నాడు.

(7) శ్లో॥ 4 : అధిభూతం క్షరోభావః పురుషశ్చాధిదైవతమ్ ।
అధి యజ్ఞోఽహమే వాత్ర దేహేదేహ భృతాంవర ॥
(ఆత్మ)

**భావము :** నాశన స్వభావమున్న శరీరములు గల జీవరాసులకును, దేవతలకును ఆధారమైనవాడిని నేనే. దేహమందు జరుగు యజ్ఞములకు నేనే అధిపతినని తెలియుము.

**వివరము :** ఈ శ్లోకము యొక్క అర్థము వ్రాయడములో చాలా గీతలలో భూతములకు ఆధారము నాశన స్వభావముగల శరీరములని చెప్పబడివున్నది. అలా అనుకొంటే ఒక మనిషి బ్రతికున్నపుడు, ఆ జీవునికి వాని శరీరము ఆధారమై అధిభూతమై ఉందనుకొందాము. వాడు అకాలమరణము పొంది స్థూలశరీరమును మాత్రము కోల్పోయి, సూక్ష్మశరీరముతో ఇంకా కొన్ని సంవత్సరములు జీవించి ఉన్నాడనుకొనుము. ఆ జీవునికి అపుడు శరీరమే లేదు. అప్పుడు వానికి అధిభూతమెవరగుదురు? అలా బ్రతుకు వానికి అధిభూతముండదా? ఇలాంటి ప్రశ్నలు బయలుదేరి వాటికి జవాబులు వెదికినా దొరకవు. అందువలన శరీరములధిభూతమను మాట నిజముకాదు.

నాశన స్వభావములైన జీవరాసులకు ఆధారమైనది అధిపతియైనది, మరియు దేవతలకు కూడ ఆధారమైనది, అధిపతియైనది ఆత్మ (పురుషుడు) అని చెప్పబడి ఉన్నది. నాశనమగు శరీరములకు, వాటిని ధరించిన జీవులకు, సకల దేవతలకు ఆత్మయే ఆధారమైనది. వాటి జీవన విధానము నడుచుటకు కారణమైవున్నది. ఆత్మశక్తి లేనిది నాశనస్వభావముగల శరీరములు కదలలేవు మరియు పెరుగలేవు. ఆత్మలేనిది జీవుడు శరీరములోనే ఉండలేడు. సకల దేవతల ప్రతిమలలో ఆత్మలేనిదే వాటికి శక్తిలేదు. అవి ప్రతిమనుండి బయటకు రాలేవు, లోపలికి పోలేవు. అవి సంచరించనూలేవు. క్షర భావముగల శరీరములకు, జీవులకు, దేవతలకు అధిపతియైనవాడు ఆత్మయేనని తెలియుము.

యజ్ఞములు బయట జరుగునవి కావు. శరీరములోనే రెండు విధములైన యజ్ఞములు జరుగుచున్నవని ముందే జ్ఞానయోగములో చెప్పుకొన్నాము. ఆ యజ్ఞములకు అధిపతియైనవాడు కూడ ఆత్మయేనని తెలియాలి. కోర్టుకు జడ్జిలేనిదే కోర్టు ఎట్లు జరుగదో అట్లే ఆత్మలేనిది శరీరములో ఏ పని జరుగదు. కోర్టుకు ముఖ్య ఆధారమైనవాడు, మరియు అధిపతి జడ్జియైనట్లు, శరీరమునకు అధిపతి, ముఖ్య ఆధారము ఆత్మయేయైవున్నది. సర్వజీవరాసుల శరీరముల లోపల జరుగు రెండు యజ్ఞములకు, జీవరాసుల శరీరములతో పూజింపబడు బయటి దేవతలకు, జీవరాసులకు అధిపతియైనవాడు ఆత్మ లేక పురుషుడని చెప్పవచ్చును. విభజన ప్రకారము పురుషోత్తముడు వేరు, పురుషుడు వేరని గ్రహించవలెను. ఇక్కడ అధిభూతము, అధియజ్ఞము, అధిదైవమైనవాడు పురుషుడని గ్రహించవలెను. క్రింది శ్లోకములో పురుషోత్తముని గురించి చెప్పబడుచున్నది. ఎక్కడ పురుషుడు, ఎక్కడ పురుషోత్తముని గురించి చెప్పుచున్నారో గ్రహించకపోతే అర్థములన్నియు తలక్రిందులైపోయి భగవద్గీత స్వరూపమే తెలియకుండ పోవును.

*(7) శ్లో॥ 5 : అన్తకాలే చ మామేవ స్మరన్ముక్త్వా కళేబరమ్ ।*
*యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః ॥*
*(ఆత్మ, పరమాత్మ)*

**భావము :** చివరి కాలములో నన్నే స్మరించుకొంటు శరీరమును వదలువాడు నన్నే పొందగల్గుచున్నాడు. ఈ విషయములో ఏమాత్రము సంశయము లేదు.

**వివరము :** ఒక్కొక్కపుడు పరమాత్మ నేను అని చెప్పినప్పుడు ఎచట జీవాత్మ పాత్ర ఉన్నది, ఎచట ఆత్మ పాత్ర ఉన్నదని యోచించి చూడవలెను. ఈ శ్లోకములో అవసానదశలో నన్ను స్మరించువాడు మరణించిన తరువాత నన్నే పొందుచున్నాడని చెప్పబడినది. శరీరములో అవసానదశ ఏర్పడుచున్నది. శరీరములో మనోధ్యాస ఆత్మ మీద ఉండాలి. అటువంటపుడు మరణించినవానికి శరీరములేదు. శరీరము ఉన్నపుడు స్మరింపబడునది ఆత్మయితే, శరీరము విడిచిన తర్వాత పొందబడునది

పరమాత్మ. ఆత్మగ శరీరములో నన్నే స్మరించుచున్నారని, పరమాత్మగ శరీరము బయట నన్నే పొందుచున్నారని చెప్పినది ఒక్కడే, వాడే పరమాత్మ. పరమాత్మ శరీరము లోపల స్మరణకు అందుబాటుగ ఆత్మయై, శరీరము బయట పొందుటకు వీలుగ పరమాత్మయై ఉన్నాడు. అందువలన నన్నే స్మరించువాడు నన్నే పొందగలడని చెప్పాడు. ఇక్కడ మనము మాత్రము స్మరించబడువాడు ఆత్మని, పొందబడువాడు పరమాత్మని వేరువేరుగ విభజించి తెలుసుకోవాలి.

(7)శ్లో॥ 6 : *యం యం వాఽపి స్మరన్ భావం త్యజత్యన్తే కళేబరమ్ ।*
*తం త మేవైతి కౌంతేయ ! సదాతద్భావ భావితః ॥*
*(జీవాత్మ)*

**భావము :** ఏ ఏ భావమును స్మరించుకొంటూ శరీరమును వదలుచున్నాడో, ఆయా భావమునే అభ్యాస బలముచేత పొందుచున్నాడు.

**వివరము :** ఈ శ్లోకము నిర్ధిష్టముగ పలానా వారిని గూర్చి చెప్పారనుటకు వీలుకాదు. ఈ శ్లోకము ఒక సూత్రములాంటిది. ఒక సూత్రము ప్రకారము ఏ లెక్కనైన చేసినట్లు, ఇక్కడ చెప్పిన సూత్రము కూడ జ్ఞానులకు అజ్ఞానులకు అందరికి పనికివచ్చునది. ఇది ఎవరికైన వర్తించునది. అందువలన ఇది పలానా వారికని, పలాన విషయమునకని ఏమాత్రము చెప్పలేము. ఈ సూత్రమేమిటంటే శరీరమును వదలునపుడు అనగ **'అవసానదశలో ఎవని మనుసులో ఏ జ్ఞాపకమున్నదో, మరణము తర్వాత దానినే వాడు పొందును'** అన్నది సూత్రము. ముఖ్యముగ గమనించవలసినది ఏమనగా! ఇది మరణములో అవసానదశ ఏర్పడువారికి మాత్రమే. అవసానదశ ఏర్పడని మరణములెన్నో ఉన్నవి. వాటికి ఈ సూత్రము వర్తించదు. కాలమరణములకే గాని అకాల మరణములకు ఈ పద్ధతి సరిపోదని తెలియాలి. అవసానదశలో ప్రకృతికి సంబంధించిన విషయము ఉండవచ్చు, ఆత్మకు సంబంధించిన విషయమైన ఉండవచ్చును. ఒకవేళ ప్రకృతికి సంబంధించిన విషయముంటే తిరిగి జన్మవుంది. ఏ విషయమును తలచుచుండునో దానినే పొందగలుగును. అట్లుకాక ఆత్మ

జ్ఞాపకముంటే మరుజన్మ పొందక పరమాత్మనే పొందగలుగును. ఆ చివరి కాలములో అనగ అవసానదశలో జీవితములో బలమైనదిగా ఏ విషయముంటే అదే జ్ఞాపకము వచ్చును. కొందరు చివరిలో దేవున్ని తలచుకుంటే సరిపోతుంది కదా! చివరి కాలములో నన్ను స్మరించితే మోక్షము పొందవచ్చునన్నారు కదా! ఇప్పటినుంచి దేనికి ప్రాకులాడవలెను. వృద్ధాప్యమొచ్చినపుడు దానిని గురించి యోచిస్తాము అనువారున్నారు. మనమనుకొన్నట్లు చివరి సమయములో ఏది కావలసివస్తే అది జ్ఞప్తికిరాదు. జీవితకాలములో గల విషయములన్నిటిపైకి ఏ విషయము మనస్సుకు ఎక్కువ గాఢముగ హత్తుకొని ఉండునో, ఆ విషయమే చివరిలో జ్ఞప్తికిరాగలదు. అలా ఎందుకు జరుగుచున్నదనగా! అవసానదశలో మనస్సు బలము కోల్పోవు చుండును. బలహీనపడిన మనస్సు ముఖ్యముకాని చిన్న చిన్న విషయములన్నిటిని మరచిపోవును. జీవితములోని ముఖ్య విషయములను మాత్రమే జ్ఞాపకము చేయగల్గుచుండును. మరణము దగ్గరవుకొలది పూర్తి జ్ఞాపకాలన్నిటిని మరిచిపోవును. చివరగ ఏదైతే జీవితములో ఎక్కువగ మనస్సుకు అంటుకొని ఉండునో దానినే జ్ఞాపకము చేయగలదు. ఆ విషయ జ్ఞాపకమే చివరిదగును.

కొందరికి దైవ విషయమే మనస్సులో ఎక్కువగ లగ్నమైవుండును. కొందరికి ప్రపంచ విషయములలో ఏదో ఒకటి పెద్దదుండును. దీనిని బట్టి జన్మనా లేక మోక్షమా అని తెలియును. ఉదాహరణకు ఒకనికి సంగీతమే ప్రాణముగ ఉండుననుకొందాము. వానికి మరణ సమయములో కూడ అదే జ్ఞాపకము వచ్చి మరుజన్మ కల్గును. ఆ జన్మలో కూడ సంగీతమునే నేర్వగలిగి దానియందు ఆసక్తితోనే కొనసాగును. ఒకడు ఒక పరిశోధన సాగిస్తు వాని మనసునిండా ఆ పరిశోధన విషయమే నింపుకొని బ్రతుకుతున్నాడు. చివరికి మరణసమయములో కూడ చివరి ధ్యాస పరిశోధన మీదనే ఉండుట వలన వానికి జన్మకల్గి మరుజన్మలో ఆ పరిశోధనే తిరిగి కొనసాగించును. మనసులో ఏదైతే ఇష్టతనున్నదో దానినే జన్మాంతరమునందు పొందుచున్నాడు. ప్రపంచ విషయములలో ఏదైతే ఇష్టముగ ఉన్నదో దానినే వాడు పొందగలుగుచుండును. ఎన్ని జన్మలు మారిన దాని నుండి బయటపడలేదు.

వానిని ఆ శ్రద్ధనుంచి మరల్చాలంటే చాలా కష్టము. ఇష్టము జిగురులాంటిది. ఏ దానికంటుకొంటే దానికే అంటిపెట్టుకొనివుండును. అందువలననే ఒకరి ఇష్టమునొకరు మార్చలేరని పెద్దలు చెప్పారు. ఒకనికి ఇష్టమైన దానిని ఎందరు నివారించిన వాడు వదలుకోడు. శ్రద్ధ అనునది దైవవిషయముల మీద ఉంటే పరవాలేదు. ప్రపంచ విషయముల మీద ఉన్నవారిని పెద్ద పెద్ద గురువులు సహితము మార్చలేరు. ఎవనికి వాడు శ్రద్ధయను దానిని దేనిమీద ఉంచితే బాగుండునో బాగా యోచించి నిర్ణయించుకోవలెను. దీనిని గురించే అర్జునునికి భగవంతుడు క్రింది శ్లోకములో సలహా ఇస్తున్నాడు.

(7) శ్లో॥ 7 : తస్మాత్సర్వేషు కాలేషు మామనుస్మర యుధ్యచ ।
మయ్యర్పిత మనోబుద్ధి ర్మామే వైష్యస్యసంశయః ॥
(ఆత్మ, సాకారము)

**భావము :** కావున సర్వకాలము నీ మనసునందు నన్ను స్మరించుచుండుము. బుద్ధి మనస్సు నాకే సమర్పించుట వలన నన్నే పొందగలవు. దీనిలో సంశయము లేదు.

**వివరము :** అంత్యకాలములో జ్ఞప్తిని బట్టి మరుజన్మగాని, మోక్షముగాని ఉండును. చివరి జ్ఞాపకముకోసము ఇప్పటినుండి ప్రయత్నము చేయవలెనని, అలా చేయుట వలననే చివరిలో అనుకొన్నదానిని పొందవచ్చని అర్జునునికి భగవంతుడు తెల్పుచు ఇలా అన్నాడు. **"సర్వకాలము నీ మనస్సును బుద్ధిని నాయోచనలే చేయునట్లు అభ్యాసము చేసుకొనుము. అట్లు సర్వకాలములో నన్ను స్మరించుచుండుట వలన నన్నే పొందవచ్చును.'** ఇక్కడ చెప్పినది కంటికి కనిపిస్తున్న శ్రీకృష్ణుడు. శ్రీకృష్ణుడు నన్ను స్మరించమన్నాడు. ఆ మాట శ్రీకృష్ణుడున్నంత వరకు సరిపోతుంది శ్రీకృష్ణుడు పోయాక ఎవరిని స్మరించాలి? ఆయన పోయిన తర్వాత కూడ ఆయన రూపమునే స్మరించాలా? లేక నిరాకారమైన ఆత్మను స్మరించాలా? ఆయనున్నపుడు ఆయనను వదలి ఆత్మను స్మరించాలా? ఇలా ఇన్ని ప్రశ్నలుద్భవించుచున్నవి. ఈ శ్లోకము చెప్పి ఇరకాటములో పెట్టాడు కావున యోచించాలి.

సాకారము, నిరాకారము అను రెండిటిలో ఎపుడు సాకారమును, ఎపుడు నిరాకారమును ధ్యానించాలన్నది పూర్వమునుండి ఉన్న సమస్యయే. పరమాత్మ సాకారుడై భగవంతునిగ వచ్చిన జన్మవున్నంతవరకు సాకారమునకే పూజ, సాకారమునకే మనోబుద్ధి పనిని లగ్నము చేయాలి. పలానా సాకారమని తెలిసిన తర్వాత పూజకాని మనోలగ్నముకాని ఆ సాకారమును వదలి చేయకూడదు. శ్రీకృష్ణుడు భగవంతుడని తెలిసిన తర్వాత బ్రహ్మయోగమని నిరాకార ధ్యానము చేయడము, గొర్రెపిల్లను చంకలో పెట్టుకొని దానికోసము వెతికినట్లగును. భూమిమీద పరమాత్మ భగవంతునిగ జన్మించుట అరుదు. అది ఎన్నో వేల సంవత్సరములకో జరుగును. అప్పుడు అదృష్టవశాత్తు ఆ జన్మ సామాన్యమైనదికాదని, అపుడపుడు బుద్ధి యోచనకర్థమగుచున్నపుడు ఆ సాకారమును వదలి నిరాకారము మీదికి పోనవసరము లేదు. భగవంతుని జన్మ శ్రీకృష్ణునిదని తెలిసిన మనము ఆయన భగవంతునిగ లేని సమయములో ఉన్నాము, కనుక ఆయన ప్రతిమకు సాకారపూజ చేసినప్పటికి నిరాకార ధ్యానము చేయక తప్పదు. శ్రీకృష్ణుడున్నపుడు ఆయనతో శత్రుత్వము కల్గియుండి యోగము చేయువారు కొందరుండెడివారు. అనగ సాకారముతో శత్రుత్వము, నిరాకారముతో మిత్రుత్వము అటువంటి వారు నష్టయోగులగుదురు. పూర్తి జ్ఞానాగ్ని వారిని చేరదు. సాకారము నుండి రావలసినది రాదు. సగము అగ్నిని నష్టపోయిన వారగుదురు. శ్రీకృష్ణుని జన్మ అయిపోయిన తర్వాత ఆయన ప్రతిమ విగ్రహకాదని గ్రహించాలి. ప్రతిమ ఏదైన విగ్రహగా ఉండగలదు. భగవంతుని ప్రతిమ విగ్రహగాలేదు. భగవంతుని ప్రతిమను పూజించినవారు యోగము చేసిన దానితో సమానమే అగును. ఆ అవకాశము మిగత విగ్రహములగు ప్రతిమలకు లేదు.

*(7) శ్లో॥ 8 : అభ్యాస యోగ యుక్తేన చేతసా నాన్యగామినా ।*
*పరమం పురుషం దివ్యం యాతి పార్థానుచింతయన్ ॥*
*(ఆత్మ, పరమాత్మ)*

**భావము :** అభ్యాసము చేత మనస్సును ఇతర విషయముల మీదికి పోనీయక

యోగముతో కూడుకొని చింతించువాడు శ్రేష్ఠమైన, దివ్యమైన పురుషుని పొందగల్గుచున్నాడు.

**వివరము :** సాకారము తెలియని మనము ఆత్మయోగులు కావాలి. ఆత్మను తెలియాలంటే మనస్సును అభ్యాసముచేత నిలుపగలగాలి. స్వాధీనపడిన మనస్సును అంతర్ముఖముగ చింతచేయించాలి. మనస్సు ఆత్మ మీద చింతగలదై ఉంటూ జ్ఞానాగ్ని సముపార్జనతో కర్మ కాలిపోయిన తర్వాత మరణించినవాడు మరుజన్మకు పోడు. వాడు మరుజన్మకు పోకుండ ముగ్గురు పురుషులలో శ్రేష్ఠమైన దివ్యమైన పురుషుని చేరగల్గుచున్నాడు. మూడవ పురుషుడెటువంటివాడో అటువంటి వానిలాగే వానియందే కలిసి పోవుచున్నాడు.

*(7) శ్లో॥ 9 : కవిం పురాణ మనుశాసితార మణోరణీయాంస మనుస్మరేద్యః ।*
*సర్వస్యధాతార మచింత్య రూప మాదిత్యవర్ణం తమసః పరస్తాత్ ॥*
*( జీవాత్మ, ఆత్మ, పరమాత్మ)*

*(7) శ్లో॥ 10 : ప్రయాణకాలే మనసాऽచలేన భక్త్యాయుక్తో యోగబలేనచైవ।*
*భ్రువోర్మధ్యే ప్రాణమావేశ్య సమ్యక్సతం పరం పురుష ముపైతి దివ్యమ్ ॥*
*( జీవాత్మ, ఆత్మ, పరమాత్మ)*

**భావము :** సర్వదర్శి, పురాణుడు, జగత్తును శాశించువాడు, సూక్ష్మములకు సూక్ష్మమైనవాడు, సర్వస్వమును రక్షించువాడు, చింతచేత తెలియనివాడు, సూర్య ప్రకాశము కల్గినవాడు, అజ్ఞానమునకంటే వేరైనవాడునైన పరమాత్మను పొందకోరువాడు, మరణ సమయములో యోగబలము చేత మనస్సును కనుబొమల మధ్యలో నిలుపగలిగి, ప్రాణవాయువును స్థిరపరచినవాడై పరమాత్మలో చేరగల్గును.

**వివరము :** చేరవలసినది పరమాత్మలోనికి, దృష్టిని సారించవలసినది ఆత్మ మీదికి, చేరవలసినవాడు జీవాత్మ. ప్రయాణీకుడు జీవాత్మ, దారి ఆత్మ, గమ్యము పరమాత్మ. ప్రయాణికునికి ముందు గమ్యము తెలియాలి. ఏ ఊరికి పోవాలో, ఆ ఊరెట్టిదో,

కొంత ఇతరుల ద్వారా తెలిసిన తర్వాత ఆ ఊరికి పోవు దారేదో తెలుసుకొని, దానివెంట ప్రయాణించిన గమ్యము చేరవచ్చును. అలాగే గమ్యమైన మోక్షమును గురించి భగవంతుడు మనకు కొంత తెలియజేశాడు. మోక్షమనగ ఒక ప్రదేశముగాని, ఒక లోకముకాని కాదు. మోక్షమనగ విడుదల అని అర్థము. జనన మరణములను కల్గించు కర్మనుండి బయటపడడమే మోక్షము. అలా కర్మనుండి మోక్షము పొందినవాడేమగుననగా, సర్వదర్శిగ మారి సర్వప్రపంచమును చూడగల్గును. ఒక శరీరములో ఉన్నపుడు తనముందు ఉన్న దానిని మాత్రము చూడగల్గువాడు, మోక్షము పొందిన తర్వాత సర్వమును చూడగల్గుట ఎంత గొప్పో ఆలోచించండి. అంతేకాక పూర్వము నుండి ఉండువాడై, ఆది నుండి ఉన్నవన్ని తెలియగలడు. మనిషిగ ఉన్నపుడు మన జీవితము కూడ పూర్తి జ్ఞప్తిలేని మనము, సనాతన కాలమునుండి తెలిసిన వారమగుట గొప్పకాదా! జన్మతో ఉన్నపుడు మన కొడుకులు కూడ మన మాట వినరు, వారిని శాశించి చెప్పలేము. జన్మలేక మోక్షము పొందినపుడు సర్వజగత్తును శాశించి నడిపించు అధికారము కల్గి ఉందుము. ఇంటిలోని వారిని కూడ శాశించలేనివాడు జగత్తుకే శాసనకర్తయగుట గొప్పకాదా! సామాన్య జీవరాసిగ ఉన్నపుడు స్థూలమును తప్ప సూక్ష్మమును తెలియనివాడు, సూక్ష్మములకు సూక్ష్మముగ మారిపోవుట ఎంత గొప్పనో ఆశ్చర్యము కాదా! శరీరముతో ఉన్న మనము అందరి దృష్టికి కన్పించుచున్నాము. మోక్షమునకు పోయిన తర్వాత ఎవరి మనోదృష్టికి కూడ కనిపించమంటే, ఆ గమ్యము ఎంత గొప్పదో ఆలోచించండి. ఇపుడు ఏ ప్రకాశములేని మనము, విడుదలతో కోటి సూర్యప్రకాశవంతులమగుట గొప్ప స్థాయిని పొందడము కాదా!

అట్టి స్థితిని పొందగోరువాడు మరణ సమయములో తన మనస్సును ఇతర విషయముల మీదికి పోకుండజేసి, కనుబొమల మధ్య స్థానమున తలమధ్య భాగములో మనోదృష్టిని నిలిపి, అక్కడున్నదేదో చూస్తున్నపుడు మనోనిలకడ కల్గుటచేత, ముక్కురంధ్రములలోని ప్రాణవాయువు కూడ సంచరించక నిలిచిపోవును. భ్రూమధ్య స్థానములో ధ్యాసకల్గి అక్కడి ఆత్మను చూచువాడు బయటి విషయములను మరచి,

తన పూర్తి ధ్యాస తలమధ్య కేంద్రములోనుంచగ శ్వాస తనంతట తానే నిలిచిపోవును. అలా జీవుడు ఎరుకకల్గి ఉన్నప్పుడు శ్వాస నిలిచిపోవడము యోగులకు మాత్రమే సాధ్యమగును. మిగతావారికి మరణము మరుపులో జరుగుచున్నది. ఎరుకలో మరణము పొందువారు యోగులు మాత్రమే. **విజ్ఞాన పరముగ (సైన్సు ప్రకారము) చూచిన శరీరమును పెంచునవి, ఆరోగ్యముగ ఉంచునవి, ఆయుష్షును నిర్ణయించునవి, వృద్ధాప్యము కల్గించునవి శరీరములోని గ్రంథులు.** గ్రంథులలో తయారగు రస ప్రభావము శరీరమును తీర్చిదిద్ది దాని పెరుగుదలకు, తరుగుదలకు అన్నిటికి కారణమని విజ్ఞానశాస్త్రవేత్తలు కూడ చెప్పుచునే ఉన్నారు. అన్ని గ్రంథులపైకి అతిచిన్న గ్రంథి తల మధ్య భాగములో ఉన్నది. చిన్నదైనప్పటికి గ్రంథులనన్నిటిని శాసించి నడిపించు స్వభావము గలది. **కావున దానికి గ్రంథిరాజమని పేరు గలదు. దీనినే పిట్యూటరి గ్లాండ్ అని కూడ పిలుతురు.** దీని స్థానము తల మధ్యభాగములో కనుబొమల మధ్యన గలదు. చిరునాలుక పై భాగమున కనుబొమల మధ్య స్థలమున గల ఈ గ్రంథి చాలా ముఖ్యమైనది. ఇందులో ఏదో అతీతమైన శక్తి ఉండుటవలన, ఆ గ్రంథి నుంచి కనిపించని కిరణములు అలల రూపముగ శరీరమంత ప్రాకుచుండును. యోగుల శరీరములో ఆ తరంగముల ప్రభావము మరీ ఎక్కువగా ఉండును. మెదడు మధ్య భాగములో గల ఈ చిన్న గ్రంథి దగ్గర కేంద్రీకృతమైన మనస్సుకు ఆత్మ అనుభవము లభించును. ఆ అనుభవమును మనస్సు ద్వారా జీవుడు అనుభవిస్తుండగ, ప్రాణవాయువు ముక్కురంధ్రములలో తనంతట తాను నిలిచిపోవును. ఆ ప్రాణవాయువు సాధారణ మానవుని మరణములో చివరి శ్వాసగ బయటికి పోవును. ఇక్కడ యోగుల మరణములో ఆఖరి శ్వాసగ బయటికి పోక శరీరమునందే నిక్షిప్తమై నిలువగ, జీవుడు శరీరములోని ఆత్మను కలుసుకోగలిగి దానిద్వార శరీరములోనే చివరగ పరమాత్మను కూడ కలుసుకోగల్గుచున్నాడు.

సాధారణ మానవుని మరణములో ఆ జీవుడు శరీరమును వదిలి ఆత్మతో సహా మరో శరీరమును చేరుచున్నాడు. వానితోపాటు వాని కర్మ, గుణములు వేరే

శరీరమును ఆశ్రయించుచున్నవి. ఇక్కడ యోగుల మరణములో కర్మ అంతయు నాశనమై పోయినది. గుణములు నిర్వీర్యమైపోయాయి. మనస్సు ఆత్మయందే లగ్నమై జీవున్ని లగ్నము చేయుచున్నది. బుద్ధి, జీవుని వెంట చివరి వరకు ఉండి మనస్సు, బుద్ధి, జీవుడు ఏకముగ మారి ఆత్మయందు కలిసి కనిపించక పోయినపుడు జీవుడు ఆత్మ రెండు కలిసి ఒకే పదార్థమై పోయి పరమాత్మలో కలిసిపోవుచున్నవి. అప్పుడు శరీరము నిర్జీవమై పోవుచున్నది.

ప్రతి రోజు యోగము చేయుచున్నపుడు కనుబొమల మధ్యలోనే మనస్సును నిలిపి ఆత్మానుభవమును జీవుడు పొందినపుడు శ్వాస కూడా నిలిచి పోవుచున్నది కదా! అపుడు శరీరమును వదలి పరమాత్మలో ఐక్యము కావచ్చును కదా! బ్రహ్మయోగ సమయములో సాధారణముగ మనస్సు నిలిచిపోవడము, ఆత్మ అనుభవము పొందడము, శ్వాస నిలిచిపోవడము జరుగుచున్నపనియే కదా! సాధారణముగ జరుగుపనియే ఒక రోజు మరణమై పోవుటలో ఏదైన ప్రత్యేకత ఉన్నదా అను ప్రశ్న కొందరికి రావచ్చును. దానికి జవాబు ఏమనగా! ప్రతిసారి యోగము చేసినపుడు జరుగు పనియే చివరి మరణములో జరిగినప్పటికి చాలా ప్రత్యేకతలున్నట్లు మనము గ్రహించవచ్చును.

ప్రతి యోగములోను ఆత్మను పొందిన, శ్వాస నిలిచిపోయిన, మనో నిలకడ కల్గినప్పటికి కర్మ అయిపోలేదు, కర్మశేషమున్నది. కావున మనస్సు, బుద్ధి, జీవుడు ఒక్క స్వరూపము కాలేదు. మనస్సు అనుభూతిని అందిస్తు వేరుగనుండగ బుద్ధి మనస్సును హెచ్చరించుచూ కదలనట్లు చేస్తూ అది అందించు అనుభూతిని జీవునికి అందిస్తుండును. బుద్ధి అందించిన దానిని జీవుడు పొందుచుండగ ఆ అనుభూతిని గురించి బుద్ధి తేల్చి చెప్పుచుండును. ఇట్లు యోగ సమయములో వేరు వేరు పదార్థములుగ వాటివాటి పనిని అంతర్ముఖముగ నిర్వర్తించు మనస్సు, బుద్ధి, జీవుడు చివరి మరణము సమయములో ఒక్క పదార్థముగ మారిపోవుదురు. అలా మారిన పదార్థము ఆత్మలో కలిసి పోవుచున్నది. యోగ సమయములో ఆత్మ, జీవాత్మ వేరువేరుగ ఉండి ఆత్మను జీవాత్మ అనుభవించుచుండగ చివరి సమయములో

మనో, బుద్ధి, జీవుడు కలిసిన జీవపదార్థము ఆత్మతో కలిసి ప్రత్యేకమైన ఆత్మగ మారిపోవును. అంతవరకు శరీరములో పరమాత్మ ఆత్మ వేరు వేరుగ ఉండగ, ఆ సమయములో ప్రత్యేకముగ మారిన ఆత్మ పరమాత్మలోనికి సులభముగ కలిసి పోవుచున్నది. అంతవరకు పరమాత్మతో కలియుటకు వీలుగాని ఆత్మ, జీవముతో కలిసిన ఆత్మగ ప్రత్యేకతకల్గి పరమాత్మలో ఐక్యమగుటకు సామర్థ్యము పొంది శరీరమందే కలసి పోవుచున్నది. ఈ విధముగ శరీరములోనున్న జీవాత్మ పరమాత్మను పొందగల్గుచున్నాడు. ఇది బ్రహ్మయోగుల అంత్యకాలములో శరీరమందే జరుగు పనికాగ కర్మయోగుల చివరిదశలో మనో బుద్ధులతో అహము కూడ కలిసి జీవునితో ఐక్యమగుచున్నవి. కర్మయోగులలో మనోనిలకడ అవసరము లేదు. దానితో సమానమైన నిగ్రహము అహము ఎడల ఉన్నది. బ్రహ్మయోగములో మనోనిలకడ కాగా, కర్మయోగులలో అహము యొక్క నిలకడ జరుగవలెను. తర్వాత జీవుడు ఆత్మతో, ఆత్మ పరమాత్మతో కలియుచున్నది. కర్మ అయిపోయిన వెంటనే యోగులలో జరుగు మరణమిది. ఈ విధముగ యోగులు తమ శరీరములోనే పరమాత్మను పొందగల్గుచున్నారు. ఎక్కడ వెతికితే అక్కడ దొరుకునని **'ఇందుగలడందులేడని సందేహము వలదని'** పెద్దలు చెప్పిన మాట ప్రకారము, శరీరములోపల యోగము చేయు యోగులకు శరీరములోనే పరమాత్మ లభించగలదు.

*(7) శ్లో॥ 11: య దక్షరం వేదవిదోవదన్తి విశన్తి యద్యతయో వీతరాగాః ।*
*యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరన్తి తత్తేపదం సంగ్రహేణ ప్రవక్ష్యే ॥*
*(పరమాత్మ)*

**భావము :** వేద వేత్తలందరు దేనికి నాశనములేదనుచున్నారో, గుణములు వదలిన వారికి ఏది గమ్యస్థానమో, బ్రహ్మచర్యముచే దేనిని పొందగల్గుదురో అ పదమును గూర్చి సంగ్రహముగ చెప్పుచున్నాను.

**వివరము :** వేదములు తెలిసినవారనగ ఏవో పెద్ద గ్రంథములు చదివినవారనో, మరెవరనో అనుకోవద్దు. **'త్రైగుణ్య విషయా వేదా'** అన్న భగవంతుని వాక్యము ప్రకారము గుణములు, వాటి వలన జరుగు పర్యవసానములు తెలిసిన పెద్దలు,

అనగ సంపూర్ణ జ్ఞానులు దేనిని నాశనములేనిస్థితి అనుచున్నారో అనగ ప్రళయములో కూడ నాశనము కాని స్థితియేదో, మరియు గుణములు జయించిన వారందరు పొందు మరణములేని స్థితి ఏమిటో చెప్పెదనని భగవంతుడు చెప్పాడు. అంతేకాక బ్రహ్మచర్యముచే దేనిని పొందుదురో అనికూడ అన్నాడు. ఇక్కడ బ్రహ్మచర్యమంటే పెళ్ళి చేసుకోకుండ ఉండడమా? సంసారము వదలుకోవడమా? స్త్రీ సాంగత్య నిషేధమా? అను సంశయములురావచ్చును. కాని అవేవి కావు. **బ్రహ్మ యొక్క ఆచరణ ఆచరించువాడు బ్రహ్మచారి అను అర్థముగలదు.** బ్రహ్మ అనగ పెద్ద, అధిపతి, పరమాత్మ అను అర్థములలో నిండినవాడని తెలుసుకోవాలి. పరమాత్మకు ఆచరణ ఉన్నదా? అంటే ఉన్నదని చెప్పవచ్చును. ఆయన భగవంతునిగ పుట్టి ఆచరించినదే ఆయన ఆచరణ. అదే బ్రహ్మ ఆచరణ. పరమాత్మ సాకారముగ కర్మయోగము ఆచరించి చూపాడు. తనవలె ఆచరించమని కూడ చెప్పాడు. నేను మార్గదర్శకత కొరకు ఆచరించుచున్నాను. నావలె ఆచరించమని చెప్పాడు. అట్లు ఆచరించడమే బ్రహ్మ ఆచరణమగును. అలా ఆచరించువాడే బ్రహ్మచారి. కర్మయోగిని బ్రహ్మచారి అనవచ్చును. కాని పెళ్ళి చేసుకోనివానిని బ్రహ్మచారి అనకూడదు. బ్రహ్మచారులు ఏ గమ్యమును పొందుచున్నారో చెప్పెదనని భగవంతుడు క్రింది శ్లోకమును తెలియజేశాడు.

*(7) శ్లో 12 : సర్వద్వారాణి సంయమ్య మనోహృది నిరుధ్య చ ।*
*మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణ మాస్థితో యోగధారణామ్ ॥*
*(జీవాత్మ, ఆత్మ, పరమాత్మ)*

*(7) శ్లో 13 : ఓ మిత్యే కాక్షరం బ్రహ్మ వ్యాహర న్మామను స్మరన్ ।*
*యః ప్రయాతి త్యజన్ దేహం సయాతి పరమాం గతిమ్ ॥*
*(జీవాత్మ, ఆత్మ, పరమాత్మ)*

**భావము :** సర్వద్వారములను నియమించి, మనస్సును హృది మధ్యలో నిలిపి, ప్రాణవాయువును పై ముఖముగ నిలిచునట్లు చేసి, స్థిరయోగత్వము పొంది 'ఓం'

అను అక్షరమునే స్మరించుకొంటు, శరీరమును వదలి పోవువాడు పరమమైన నన్ను పొందును.

**వివరము :** శరీరమునకు విషయ ప్రవేశ ద్వారములు ఐదు కలవు. ఐదు జ్ఞానేంద్రియముల ద్వార విషయములు లోపలికి ప్రవేశిస్తున్నవి. యోగి అయిన వాడు ఐదు జ్ఞానేంద్రియములను మనస్సుద్వార నియమించి, వాటి వలన ఏ విషయము ప్రవేశించకుండ చేసుకొనును. అట్లు విషయప్రవేశము లేకుండ చేసుకొన్నవాడు, తన మనస్సును హృది మధ్యభాగములో నిలుపుకొనుచున్నాడు. హృదయమనగ గుండె అని చాలామంది అనుకోవడము జరుగుచున్నది. వాస్తవముగ **'హృది'** అంటె గుండెకాదు. **బ్రహ్మనాడిలో గల ఏడుకేంద్రములలో చివరిదైన పెద్దదైన నాడీకేంద్రము ఏదో అదే హృదయమనబడును. ఏడవ కేంద్రముగనున్నది తల భాగములో మెదడు. మెదడునే హృదయమనగలము.** హృది మధ్య భాగములో మనస్సునుంచవలెననగా! భ్రూమధ్య స్థానమునకు సమతలములో మెదడునందు మధ్యలోగల గ్రంథిరాజమనబడు పిట్యూటరి గ్రంథివద్ద మనస్సునుంచవలెనని అర్థము. అట్లు నిలుపుట వలన ముక్కురంధ్రములలో ఆడు శ్వాస పైకి వచ్చినది క్రిందికి పోకుండ నిలిచిపోగలదు. అట్లు స్థిరయోగము పొంది **'ఓం'** అను అక్షరమే పరమాత్మని ధ్యానించువాడై ఉండును. ఇచ్చట 'ఓం' అను దానిని గురించి తెలుసుకోవలసి ఉన్నది.

మన ముక్కురంధ్రములలో శ్వాస పైకి క్రిందికి పోవునపుడు చిన్న శబ్దము పుట్టుచున్నది. బయట రెండు రంధ్రములలో ప్రవేశించుశ్వాస ఒక శబ్దము. లోపలినుండి ఒకే రంధ్రము ద్వార వచ్చి రెండుగ చీలి బయటికి వచ్చు శ్వాస మరొక శబ్దమును చేయుచున్నది. పైకి పోవు శ్వాసలో 'సో' శబ్దమును, క్రిందికి వచ్చు శ్వాసలో 'హం' అను శబ్దమును ఏర్పడుచున్నవి. 'సో' శబ్దము చివరిగ 'ఓ' అనియు 'హం' చివరలో 'మ్' కారమును ఉన్నవి. సోహం శబ్దములో చివరిగ అణిగిన శబ్దము 'ఓమ్' అగును. ఒక మారు శ్వాస లోపలికి పోయి బయటికి వస్తే

‘ఓం’ శబ్దమేర్పడుచున్నది. ఇది ప్రతి ఒక్కసారి శ్వాసలో ఇమిడివున్నది. **‘ఓం’** శబ్దము పుట్టుటకు శ్వాస కారణము. శ్వాస ఆడుటకు ఊపిరితిత్తులు ఆధారము. ఊపిరితిత్తులు కదలుటకు కొన్ని నాడులలోని స్పదాందన కారణము. ఆ నాడులలోని చైతన్యమెక్కడిదని చూచిన చివరకు బ్రహ్మనాడిలోని హృది నుంచి బయలుదేరుచున్నది. ఆ హృదిలోనున్నది ఆత్మ. చివరకు ముక్కు రంధ్రములలో పుట్టు ‘ఓమ్’ శబ్దమునకు ఆత్మ కారణమైవున్నది. ఆత్మ నాశనము లేనిది. అందువలననే దానిని అక్షరమని చెప్పుచున్నాము. క్షరము కాని అక్షరమైన ఆత్మ బయటికి శ్వాస ద్వారా ‘ఓం’ శబ్దముగ తెలియుచున్నది. లోపలి ఆత్మ బయటికి ‘ఓమ్’గ ఉన్నది కావున ‘ఓం’ అనునది నాశనము లేనిదని చెప్పారు. అట్టి ‘ఓం’ అక్షరమును మనస్సులో ధ్యానించుచు, అనగా మనసు చేత ఆత్మ ధ్యాసకల్గి యోగమాచరించుచు, శరీరమును వదలువాడు పరమమైన పరమాత్మనే పొందును. చివరిలో శరీరము వదలునపుడు మనోబుద్ధి జీవునితో కలువగ, జీవుడు స్థితి మారినవాడై ఆత్మలో కలసిపోగ, జీవాత్మ కలిసిన ఆత్మ తన స్థితిని కోల్పోయి పరమాత్మలో కలియగ, జీవుడు ముక్తుడై అంతట వ్యాపించి పోవుచున్నాడు.

*(7) శ్లో॥ 14 : అనన్యచేతాః సతతం యోమాం స్మరతి నిత్యశః ।*
*తస్యాహం సులభః పార్థ! నిత్యయుక్తస్య యోగినః ॥*
*(పరమాత్మ)*

**భావము :** వేరు చింతలు మనసున చేరనీయక ఎవడు సర్వదా నన్నే స్మరించునో వానికి సులభుడనౌదును. అతడే నిత్యము నాతో కూడుకొన్న యోగి అనబడును.

*(7) శ్లో ॥15 : మా ముపేత్య పునర్జన్మ దుఃఖాలయ మశాశ్వతమ్ ।*
*నాఽఽప్నువంతి మహాత్మాన సంసిద్ధిం పరమాం గతాః ॥*
*(పరమాత్మ)*

**భావము :** శ్రేష్ఠమైన సంసిద్ధి పొందిన జనులు నన్ను పొందినవారైవుండి తర్వాత దుఃఖముతో కూడుకొన్న అశాశ్వతమైన జన్మలు పొందరు.

**వివరము :** మోక్షము పొందినవాడు పరమాత్మలోనికి ఐక్యమగును. వాడు తిరిగి పుట్టడు. పుట్టుటకు కర్మ అవసరము. కర్మలేని వాడే సిద్ధి పొందగలుచున్నాడు. సిద్ధిపొందిన తర్వాత కర్మలేని కారణమున వాడు పుట్టడు. అట్టివాడు విశాలముగ జగత్తంతయు వ్యాపించిపోయి ఉండును. మరణించు సమయములో శ్వాస బయటికి పోక శరీరములోపలే అణిగిపోయి జీవుడు బయటికి రాక శరీరములోనే ఇమిడి పోవుటవలన వాడు మరొక శరీరమును పొందలేదని తెలియాలి.

*(7) శ్లో॥ 16 : ఆబ్రహ్మ భువనా ల్లోకాః పునరావర్తి నో౽ర్జున ।*
*మా ముపేత్య తు కౌంతేయ! పునర్జన్మ న విద్యతే ॥*
*( పరమాత్మ)*

**భావము :** బ్రహ్మలోకము మొదలైన లోకములను పొందినప్పటికి పునర్జన్మ కలదు. నన్ను పొందువానికి పునర్జన్మలేదు.

**వివరము :** లోకములు ఎన్నో ఉన్నవని అందులో స్వర్గలోకమని, నరకలోకమని అతల, వితల, సుతల, రసాతల, పాతాలలోకములని రకరకములుగ చెప్పుకొనుట మేము వినియున్నాము. ఆ లోకములన్నియు ఊహాగానములేనని చెప్పవచ్చును. ఉన్నవి మూడే లోకములు. ఊర్ధ్వ, మధ్య, అధమ అను మూడు లోకములుగ విభజింపబడి ఉన్నవి. అవి సాత్త్వికలోకము, రాజసలోకము, తామసలోకము. ఈ మూడు లోకములు భూమి మీద జీవుల శరీర తలలోనున్నవి. పై శ్లోకములో **భువనాల్లోకాః** అని చెప్పబడివున్నది. దానికి ప్రపంచములో గల లోకములని అర్థము. భూమిమీద గల లోకములలో పెద్దది సాత్త్వికము. ఇది పెద్దది కావున దీనికి బ్రహ్మలోకమని పేరు పెట్టబడినది. భూమిమీద బ్రహ్మలోకము మొదలగు లోకములను పొందుట వలన జన్మకల్గుననుటలో, జీవుడు ఏ గుణభాగమునందు ప్రవేశించినప్పటికి పునర్జన్మ తప్పదని భగవంతుడు తెలియజేశాడు. ముల్లోకములు వీడి వాటికి లోపల మధ్యనున్న లోకమునకు పోయినవాడు నావలెనగునని, భగవంతుడు నెమలిఫించమును తన శిరస్సు మీద ఉంచి చూపించాడు.

ముల్లోకములు వీడి అలోకమైన దానిని చేరినవానికి పునర్జన్మ ఉండదు. లోకములుకాని అలోకము మన శరీరమందే గలదు. మూడు గుణముల మధ్యనున్నది, నెమలిఫించములో మధ్యన చూపబడినది లోకముకాని అలోకమని, అదే పరమాత్మ స్థానమని, అదే మోక్షస్థానమని తెలియవలెను.

*(7) శ్లో॥17 : సహస్ర యుగ పర్యంత మహర్య ద్బ్రహ్మణో విదుః ।*
*రాత్రిం యుగ సహస్రాన్తాం తేఽహోరాత్ర విదో జనాః ॥*
*( పరమాత్మ)*

**భావము :** పరమాత్మకు వేయియుగములు ఒక పగలుగ, వేయియుగములు ఒక రాత్రిగ ఉన్నదని తెలిసినవారు రాత్రిపగలును తెలుసుకోగలుగుచున్నారు.

**వివరము :** కాల, కర్మ, గుణచక్రములు ఒకే ఇరుసుకు అతికించబడివున్నవి. క్రింద గుణచక్రము మూడు భాగములుగ ఉన్నది. దానిపైన కర్మచక్రము 12 భాగములుగ ఉన్నది. కర్మచక్రము మీద కాలచక్రము కూడ 12 భాగములుగ ఉన్నది. ఈ మూడుచక్రముల పైన రెండు భాగములుగ ఉన్న బ్రహ్మచక్రమను పేరుగల మరొక చక్రము గలదు. ఇది ఒక చుట్టు తిరుగుటకు రెండువేల యుగముల కాలము పట్టును. సగము చుట్టు తిరుగుటకు వేయియుగముల కాలము పట్టును. ఈ చక్రములో సగభాగము పగలుగ, సగభాగము రాత్రిగ ఉన్నది.

వారములోని ఏడు దినములకు పేర్లు ఉన్నట్లు, యుగములు నాలుగు వాటికి పేర్లు కలవు. 1) కలియుగము 2) ద్వాపరయుగము 3) త్రేతాయుగము 4) కృతయుగము. ఈ నాల్గుయుగములు వారములు మారినట్లు మారుచు కృతయుగముతో మొదలై కలియుగముతో అయిపోవుచుండును. ఈ నాలుగు యుగములు 250 మార్లు జరిగితే పరమాత్మకు ఒక పగలగును. అట్లే 250 మార్లు రాత్రిగనున్నవి. పరమాత్మ యొక్క రాత్రి పగలు తెలిసినవారు, మనకు జరుగు రాత్రి పగలు కాలము ప్రకారము కూడ వివరించి చూచుకోగలరు. మనకు 1) కలియుగ కాలము 4,32,000 సంవత్సరములు 2) ద్వాపరయుగము 8,64,000

3) త్రేతాయుగము 12,96,000 4) కృతయుగము 17,28,000. ఈ విధముగ మొత్తము నాల్గుయుగముల కాలము 43,20,000 సం॥లు. నాల్గుయుగములు 250 మార్లు జరిగిన 108 కోట్ల సంవత్సరములు అగుచున్నవి. బ్రహ్మ పగలు 108 కోట్ల సంవత్సరములు. అనగ ప్రపంచ ఆయుస్సు 108 కోట్ల సంవత్సరములే.

భూమిగాని, ఆకాశముగాని భూమిమీద సామ్రాజ్యము గాని, మతములు గాని మనగలిగేది 108 కోట్ల సం॥లే అన్నమాట. నీవు ఈ ప్రపంచములో ఆడే నాటకమునకు చివరగా తెరపడేది 108 కోట్ల సం॥రములకే. జీవాత్మల యొక్క చావు, పుట్టుకల కథ జరుగునది 108 కోట్ల సం॥రములని తెలియాలి. ఇది దేవుడు జీవుల వెంట పంపిన ఆయుఃకాలము. ఇది మన ఆయువు యొక్క ధర్మమని అందరికి తెలియులాగున, 108 సంఖ్య ఏమిటని తెలియనివారు యోచించునట్లు, తెలిసినవారు మరచి పోకుండునట్లు, ప్రతి దైవారాధనలోను, నామ జపములోను, మంత్ర జపములోను 108 చేయాలని, విరాళము చేయు సొమ్ముగాని 108 సంఖ్యగా ఉండునట్లు తెలిపారు. అంతేకాక 108 సంఖ్యకు మనకు చాల అమూల్యమైన దగ్గర




బ్రహ్మ, కాల, కర్మ, గుణచక్రముల చిత్రము

సంబంధమొకటున్నది. అదెట్లనిన మన శరీరములో ఆశ, కోపము, లోభము, మోహము, గర్వము, అసూయ అను ఆరు చెడు గుణములు కలవు. వాటికి వ్యతిరేఖమైన ఆరు మంచి గుణములు కూడా కలవు. అసూయకు ప్రేమ వ్యతిరేఖమైనట్లు ఆరుకు ఆరు వ్యతిరేఖ గుణములు గలవు. ఇవన్నియు శరీరములో ఉండుట వలన వీటిమీద కర్మ, కర్మమీద గ్రహములు అధికారము కల్గియున్నవి. అందువలన నవగ్రహములను అనుసరించి కర్మ, కర్మను అనుసరించి గుణములు స్పందించు చుండును. నవగ్రహముల ప్రభావము కర్మ ద్వార గుణముల మీద కలదు. ఆదిత్యాది 9 గ్రహములు, గుణములను కూడ ఒక్కొక్క దానిని 9 రకములుగా విభజించినవి. ఆశ 9 స్థాయిలలోనుండగా, అట్లే మిగతా గుణములు కూడా 9 స్థాయిలుగా ఉన్నవి. అందువలననే మనకు వచ్చు కోపములలో పెద్దస్థాయి కోపము, చిన్న స్థాయి కోపము కలదు. అట్లే పెద్ద ఆశకలదు చిన్న ఆశ కలదు. మిగతా అన్ని గుణములు అట్లే ఉన్నవి. ఇది ప్రత్యక్షముగా కనిపించు విషయమే. ఈ విధముగా మన శరీరములోని చెడు గుణములు ఆరు ఒక్కొక్కటి తొమ్మిదిగా చీలిపోగా, అట్లే వాటికి వ్యతిరేఖమైన ఆరు మంచి గుణములు కూడ చీలి పోయినవి. ఒక వర్గమైన ఆరు గుణములు చీలికలెన్నియని లెక్కించి చూచిన 6×9=54 కాగలవు. అట్లే మరొక వర్గమును గుణించి చూచిన 6×9=54 కాగలవు. ఈ విధముగా ఒక గుణభాగములోని మొత్తము గుణముల సంఖ్య 108 అని తెలియుచున్నది.

ప్రపంచ ఆయుస్సు 108 కోట్ల సంవత్సరములను అనుసరించియే మానవుల జీవితమును నడుపు గుణముల సంఖ్య 108 ఉండునట్లు దేవుడు సరిచేసి పెట్టాడు. గణితములో అతి పెద్ద సంఖ్య కోటి. గణితములోని 108 కోట్లు జ్ఞప్తికుండునట్లు 108 ఆలోచనా వికారములను మన శరీరములో పెట్టాడు. ఆ వికారములు గుణితము వలన వచ్చినవి. కావున దగ్గర పదమైన గుణితము నుండి ఉద్భవించునదిగా కన్పించునట్లు వాటిని **'గుణము'** లన్నారు. ఈ విధముగా శరీరములో గల యోచనలకు గుణములను పేరు కల్గినది. ఇన్ని విధముల పెద్దలు యోచించి గుణములని ప్రత్యేకమైన పేరు పెట్టి వాటి యొక్క 108

సంఖ్యను కూడా ప్రత్యేకముగా పెట్టారు. 108 కోట్లు సం॥లు 108 గుణములతో జీవితమును గడుపవలెనని గుర్తుండునట్లు మనము జపించు జపమాలలో 108 పూసలనుంచారు. అయినప్పటికి మన పెద్దలు తెల్పిన విధానము కొంత మాసిపోయింది. జీవుని వెంట పంపిన ఆయువు యొక్క ధర్మము అధర్మముగా మారిపోవుచున్నది. జపమాలలో 108 సంఖ్య ఇంకనూ మిగిలి ఉన్నప్పటికి, దాని అర్థము తెలియకుండా పోయినది. విరాళము చేయుటలోను, ముడుపులు కట్టడములోను, పెళ్ళిలో డబ్బులు చదివించడములోను 108 బదులు 116 వచ్చి పడుచున్నది. దేవుని ధర్మములలో ముఖ్యమైన ఆయుఃధర్మము ఇలా అధర్మముగా మారిపోవుటకు దగ్గరపడుచున్నది. ఈ విధముగా 108 కోట్ల సం॥లు జీవులతో సంబంధమేర్పరుచుకొని ఉన్నవి. 108 కోట్ల సం॥లు జగతివున్న కాలమునకు పగలు, జగతిలేని నిరామయ కాలమునకు రాత్రి అను పేరు పెట్టడములో అంతరార్థమేమో చూస్తాము.

*(7)శ్లో ॥ 18 : అవ్యక్తా ద్వ్యక్తయ స్సర్వాః ప్రభవన్త్య హరాగమే ।*
*రాత్ర్యాగమే ప్రలీయన్తే తత్రైవా౭వ్యక్త సంజ్ఞకే ॥*
*( పరమాత్మ, జీవాత్మ)*

**భావము :** బ్రహ్మపగలు జగతిగ మారుచు కనిపించు సర్వము కనిపించని దానినుండి పుట్టినవి. అట్లే బ్రహ్మరాత్రిలో జగత్తంతయు ప్రళయము చెంది కనిపించుచున్నవన్నియు కనిపించకుండ పోవుచున్నవి.

**వివరము :** కాలచక్రము మీద తిరుగు బ్రహ్మాచక్రములో సగము పగలుగ మొదలైనపుడు జగత్తంతయు ఏర్పడి కనిపిస్తున్నది. అంతవరకు అవ్యక్తముగ కనిపించక ఉండిన జగత్తంతయు కనిపిస్తున్నది. కనిపించనిదంతయు క్రమేపి కనిపిస్తూవస్తు కొంత కాలమునకు పూర్తి ప్రపంచమేర్పడుచున్నది. అలా ఏర్పడిన ప్రపంచము వేయియుగముల కాలము జీవుల సంతతితో నిండిపోవును. చస్తూ పుట్టుచున్న జీవుల చరిత్ర వేయియుగములు గడువగ ప్రళయమేర్పడి ప్రపంచమంతయు చివరకు

అదృశ్యమైపోవుచున్నది. **ప్ర అనగ కలిగినది, పంచమనగా ఐదు. పంచభూతములచే ఏర్పడినది కావున జగతిని ప్రపంచమన్నారు.** పుట్టినదంతయు నాశనము కావడమును ప్రళయము అన్నారు. ప్రభవము, ప్రళయములతో పరమాత్మ యొక్క పగలు రాత్రిళ్లు గడుస్తున్నవి.

*(7) శ్లో॥ 19 : భూతగ్రామ స్స ఏవాయం భూత్వా భూత్వా ప్రలీయతే ।*
*రాత్ర్యాగమేఽవశః పార్థ! ప్రభవ త్యహరాగమే ।*
*(జీవాత్మ)*

**భావము :** సర్వజీవరాసులు బ్రహ్మపగలులో పుట్టి చివరకు రాత్రి అయిన వెంటనే ప్రళయము పొంది నాశనమై కనిపించకపోయి తిరిగి పగలు మొదలైన వెంటనే పుట్టుచున్నవి.

*(7) శ్లో॥ 20 : పరస్తస్మాత్తు భావోఽన్యోఽ వ్యక్తోఽవ్యక్తాత్సనాతనః ।*
*యస్స సర్వేషు భూతేషు నశ్యత్సు న వినశ్యతి ॥*
*(పరమాత్మ)*

**భావము :** నాశనములేని, మార్పుచెందని, ప్రకృతికంటే వేరైన, శ్రేష్టమైన, జగతి నాశనమైనను తాను నాశనము కాని అన్యమగుస్థితి ఒకటి కనిపించకవున్నది.

**వివరము :** ప్రళయములో సర్వ జగత్తును దానిలోని సర్వజీవరాసులును కనిపించునది అంతయు నాశనమైపోయి ఏమిలేకుండ పోవుట సంభవించును. పంచభూతములైన ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి కూడ ఉండవు. నీకు నాకు మధ్యలోగల బయలు కూడ లేనిస్థితి అంటే అదెట్లుండునో ఊహించుటకు కూడ సాధ్యముకాదు. శూణ్యము కూడ కానిదెలా ఉండునో అగమ్యగోచరము. ఆ స్థితిలో కూడ నాశనముకానిది ఒకటున్నది. ప్రపంచమంతయు లయమై పోయినప్పటికి లయము గాని అన్యమైనదేదో క్రింది శ్లోకములో చూస్తాము.

(7) శ్లో 21 : అవ్యక్తోఽక్షర ఇత్యుక్త స్త మాహుః పరమాం గతిమ్ ।
యం ప్రాప్య న నివర్తన్తే తద్ధామ పరమం మమ ॥
( పరమాత్మ)

**భావము :** దానినే కనిపించని నాశనములేని స్థితియనుచున్నాము. పరమగతి కావున దానిని తెలియవలయును, పొందవలెను. అది లభించిన జన్మములు లేకుండ పోవును. దానినే నాదగు నియమస్థానమని, పరంధామమని చెప్పవచ్చును.

**వివరము :** ప్రపంచమంతయు నాశనమైన నాశనముగాని కనిపించనిస్థితినే మోక్షము అంటున్నాము. శ్రేష్ఠమైనగతి అదియే కావున దానిని పొందుటే మానవుని లక్ష్యము. లక్ష్యమైన దానిని ఎన్నో జన్మల ప్రయత్నము చేసి పొందినట్లయితే ఇక జన్మలుండవు. జన్మలులేని ఆ స్థానము లేక స్థితినే పరమార్థమనబడును. అదే పరమాత్మని దానికంటే వేరే దైవములేదని తెలియాలి. పరమాత్మే తానుగ మారిపోవు స్థితికి ఏదీ సమానము కాదు. అన్నిటికంటే గొప్పదైన లాభమును వదలి కొద్దిసేపు కనిపించి తన వెంట రాకపోవు ధనము, బంగారము మీద ఆశ పెంచుకోవడము తెలివి తక్కువ కాదా!

(7) శ్లో॥ 22 : పురుష స్స పరః పార్థ! భక్త్యా లభ్య స్త్వనన్యయా ।
య స్యాన్తస్థాని భూతాని యేన సర్వమిదం తతమ్ ॥
( పరమాత్మ)

**భావము :** సర్వ జీవరాసులు ఎవనిలోపల ఉన్నవో, ఈ జగత్తంతయు ఎవనిచే వ్యాపించివున్నదో అట్టి పురుషుని అనన్యమైన భక్తిచే పొందవచ్చును.

**వివరము :** పరమాత్మ అణువణువున ప్రపంచమంత వ్యాపించి ఉండుటవలన సర్వజీవరాసులు పరమాత్మయందేనున్నవి. ప్రపంచమంత సూక్ష్మముగ పరమాత్మయే వ్యాపించి ఉన్నాడు. అంత గొప్ప పరమాత్మను మనకున్న చిన్న శరీరములోనే అన్యమైన చింతలేని భక్తితోనే పొందవచ్చును.

(7) శ్లో 23 : యత్రకాలే త్వనా వృత్తి మావృత్తించైవ యోగినః ।
ప్రయాతా యాన్తి తం కాలం వక్ష్యామి భరతర్షభ! ॥
( జీవాత్మ, మోక్షము)

**భావము :** యోగులు ఏ కాలములో మరణిస్తే తిరిగి పుట్టుచున్నారో, ఏ కాలములో మరణిస్తే తిరిగి పుట్టక మోక్షము పొందుచున్నారో, వారు శరీరమును వదలిపోవు ఆ కాలమును చెప్పుచున్నాను.

**వివరము :** ఒక పందెమును కాచిన వాడిని గెలిచాడా లేదా అని చూడవచ్చును. పందెము కాయని వానిని గెలిచాడా లేదాయని చూడవలసిన అవసరము లేదు. అట్లే నదిలో దిగినవాడిని ఆవలిగట్టుకు చేరుచున్నాడా లేదా అని చూడవలెను. నదిలో దిగనివానిని అసలు చూడనవసరములేదు. ఆ విధముగనే మోక్షము పొందవలెనని ప్రయత్నము చేయు యోగులను మరణ సమయములో మోక్షము పొందుచున్నాడా లేదాయని చూడవచ్చును. అసలు ప్రయత్నమే చేయని యోగులు కానివారిని గూర్చి వారి మరణ సమయమేదని చూడనవసరములేదు. శ్లోకములో కూడ 'యోగినః' అను పదమును ఉపయోగించి ఇది యోగులకు మాత్రమేనని తెలుసుకొనునట్లు చెప్పారు.

యోగులు అయినంతమాత్రమున ఆ జన్మలోనె మోక్షము పొందుదురని తలచుట పొరపాటు. ఎన్నో జన్మలు ప్రయత్నము చేయుటవలన, యోగులైనప్పటికి కొన్ని జన్మల వరకు కర్మకాలిపోవుటకు కాలము పట్టుట వలన, అంతవరకు మోక్షము పొందలేరు. అందువలననే యోగులు మోక్షము పొందు మరణ కాలమేదో, పొందని మరణకాలమేదో చెప్పెదనని భగవంతుడు ఆ కాలమును తెలియజేయు చున్నాడు. యోగులు మోక్షము పొంది జన్మించని మరణకాలమును, యోగులు మోక్షము పొందక తిరిగి జన్మించు మరణకాలమును తెలుసుకొందాము.

7) శ్లో॥ 24: అగ్నిర్జ్యోతి రహ శ్శుక్ల షణ్మాసా ఉత్తరాయణమ్ ।
తత్రప్రయాతాగచ్ఛన్తి బ్రహ్మ బ్రహ్మావిదో జనాః ॥
(జీవాత్మ, మోక్షము)

**భావము :** యోగి అయినవాడు ఏ ప్రాంతములో ఉండి మరణము పొందుచున్నాడో ఆ ప్రాంతము మీద సూర్యప్రకాశము కల్గివుండాలి. మేఘముల నీడ ఉండకూడదు. యోగి మరణించు సమయము పగలుగ ఉండి, ఆ పగలు శుక్లపక్షములోనిదై ఉండాలి. ఆ శుక్లపక్షము ఉత్తరాయణములోనిదై ఉండాలి. ఈ విధముగ సూర్యతేజస్సు కల్గిన పగలు, శుక్లపక్షము, ఉత్తరాయణము చేకూరినకాలములో చనిపోయిన యోగి జన్మించక మోక్షము పొంది పరమాత్మయందైక్యమగుచున్నాడు.

**వివరము :** సర్వ జీవరాసులకు బ్రహ్మనాడియందు ఆత్మవున్నది. బ్రహ్మనాడి యొక్క సప్తస్థానమున ఆత్మశక్తి కేంద్రీకృతమైవున్నది. సప్తస్థానమును కేంద్రముగా చేసుకొని దానిచుట్టు కర్మ, కాలచక్రములు తిరుగుచున్నవి. కాలచక్రములో రాత్రిపగలు, శుక్లకృష్ణపక్షములు, మాసములు, ఉత్తర దక్షిణాయనములు, సంవత్సరములు జరుగుచునే ఉన్నవి. రాత్రిపగలు మొదలుకొని సంవత్సరకాలము వరకు కర్మను జీవరాసులు అనుభవించుచున్నవి. కాలచక్రములో రాత్రి పగళ్లు ఎలా సంభవించు చున్నవనగా! కర్మచక్రములోయున్న భాగములను సూర్యుడు దాటుచు ప్రయాణము చేయుచుండును. ఒక్కొక్క భాగమును దాటుటకు రెండు గంటల కాలముపట్టును. సూర్యోదయము మొదలుకొని ఆరు భాగములు దాటుటకు పన్నెండు గంటలు పట్టును. దీనిని పగలుగా మనము చూస్తూవున్నాము. అట్లే మిగతా ఆరు భాగములు దాటుటకు పన్నెండు గంటల కాలముపట్టును. దీనినే రాత్రి అనుచున్నాము. మన కపాలములోయున్న కర్మచక్రమును దాటుచు సూర్యుడు కాలచక్రములో పయనించు చున్నాడు. ఇట్లు కాలచక్రములో పయనించుచు కర్మచక్రము పన్నెండు భాగములను దాటుటకు 24 గంటలు కాలము పట్టుచున్నది. 24 గంటలను ఒక దినము అని అనుచున్నాము. కర్మచక్రములో మధ్యరేఖ ఉన్నది. మధ్యరేఖకు ఎడమ ప్రక్క ఆరు

భాగములు పగలు, కుడిప్రక్క ఆరు భాగములు రాత్రిగా సూర్యభ్రమణములో తెలియుచున్నది. పగలు, రాత్రి క్రింది పటములో చూడుము.




**కర్మ చక్రము**

సూర్యుడు కాలచక్రములో పరిభ్రమించుచున్నాడు కదా! కాలచక్రము పన్నెండు భాగములు కదా! సూర్యుడు ఒక్కొక్క భాగమును దాటుటకు ఒక మాసపుకాలము పట్టును. కాలచక్రము యొక్క పన్నెండు భాగములను సూర్యుడు పూర్తి దాటుటకు పన్నెండు మాసములు పట్టును. దానినే ఒక సంవత్సరము అని అనుచున్నాము. కాలచక్రములో మధ్య ఆత్మ రేఖయున్నది. ఆత్మ రేఖకు ఎడమ ప్రక్కయుండు ఆరు భాగములను సూర్యుడు దాటుటకు ఆరు మాసములు పట్టును. ఆ కాలమునే ఉత్తరాయణమని అనుచున్నారు. అట్లే కుడి ప్రక్కయుండు ఆరు భాగములను దాటుటకు ఆరు మాసములు పట్టును. ఆ కాలమునే దక్షిణాయణమని అనుచున్నాము. ఉత్తర దక్షిణాయణములను తర్వాత పేజీలోని పటము చూడవచ్చును.

కాలచక్రములో చంద్రుడు ఒక్కొక్క భాగమును దాటుటకు రెండున్నర దినములు పట్టును. ఆత్మరేఖకు ఒక ప్రక్కయున్న ఆరు భాగములు దాటుటకు 15 దినములు, మరియొక ప్రక్కయున్న ఆరు భాగములు దాటుటకు 15 దినములు




కాల చక్రము

పట్టును. చంద్రుడు 12 భాగములు దాటుటకు 30 దినముల కాలము పట్టును. కాలచక్రము మీద చంద్రుడు ఆత్మరేఖకు ఎడమప్రక్కయున్న భాగములు దాటు కాలమును శుక్లపక్షము అనియు, కుడి ప్రక్కయున్న భాగములు దాటుకాలమును కృష్ణపక్షము అనియు అందురు. కృష్ణ శుక్లపక్షములను క్రింది పటములో చూడవచ్చును.




కాల చక్రము

ఈ విధముగా కాలచక్రములో రాత్రి పగలు, శుక్ల కృష్ణపక్షములు, ఆయనములు జరుగుచున్నవి. జీవునకు యోగముచేత లభించిన యోగశక్తియంతయు కర్మ కాలచక్రముల మధ్యయందున్న గురుకేంద్రమును చేరుచుండును. ఎవనికి యోగశక్తి పరిపూర్ణస్థితికి వచ్చునో వానికి సూర్యుడు ఆత్మరేఖకు ఎడమ ప్రక్క ఉన్నప్పుడే, చంద్రుడు కూడ కాలచక్రములో ఆత్మరేఖకు ఎడమప్రక్క ఉన్నప్పుడే మరణము సంభవించును. ఆ విధముగా మరణించిన యోగి మధ్యలోయున్న కేంద్రములోనికి పోవుచున్నాడు. అనగా ఆత్మయందు లీనమగుచున్నాడు. ఇతర సమయములలో చనిపోయిన యోగి కేంద్రములోయున్న పరమాత్మను చేరలేడు. పగలు, శుక్లపక్షము, ఉత్తరాయణము కలసిన కాలములో పరమాత్మను చేరుటకు యోగికి మార్గము ఏర్పడును. పగలు, శుక్లపక్షము, ఉత్తరాయణములో కాలచక్రమందు జీవునికి ఏర్పడిన దారిని క్రింది పటములో చూడవచ్చును.




7) శ్లో॥25: ధూమో రాత్రి స్తథా కృష్ణ షణ్మాసా దక్షిణాయనమ్ ।
తత్ర చాంద్రమసం జ్యోతిర్యోగీ ప్రాప్య నివర్తతే ॥
(జీవుడు)

**భావము :** యోగి మరణించు ప్రాంతము మేఘావృతమైవుండినా, రాత్రి సమయమైనా, కృష్ణపక్షము 15 రోజులలోనైనా, దక్షిణాయన ఆరునెలల కాలములోనైన యోగి

మరణించిన ఎడల అతడు మోక్షము పొందక, జ్ఞానతేజస్సు కల్గినవాడై తిరిగి జన్మించును. ఈ మరణ సమయములను చాలా గీతలలో తప్పుదోవ పట్టించడము జరిగినది. '**ప్రయాతియాన్తితం కాలమ్**' అని 23వ శ్లోకములో చెప్పినప్పటికి కాలమును గూర్చి చెప్పక పగటి దేవత, శుక్లపక్ష దేవత, ఉత్తరాయణ దేవత పోవు దారిలో పోతే మోక్షము లభిస్తుందని వ్రాయబడివున్నది. అలా పగలు దేవతని శ్లోకములో లేని విషయమును తెచ్చి పెట్టడము వలన చాలామంది పొరపడి పోవుచున్నారు. పగలు దేవతను వ్రాసినవారు కూడ చూడలేదు. విన్నవారెక్కడ వెదకగలరు.

**వివరము :** రాత్రి, శుక్లపక్షము, దక్షిణాయణములో మరణించిన యోగి ఆత్మను చేరలేదు. ఆ సమయములో మరణించిన యోగికి కాలచక్రములో ఆత్మను చేరు మార్గము లభించదు. రాత్రి, శుక్లపక్షము, దక్షిణాయణములో కాలచక్రమందు మార్గము ఎట్లువున్నది క్రింది పటములో చూడవచ్చును.




పగలు, శుక్లపక్షము, దక్షిణాయణములో మరణించిన యోగి ఆత్మను చేరలేదు. ఆ సమయములో మరణించిన యోగికి కాలచక్రములో ఆత్మను చేరు మార్గము ఉండదు. పగలు, శుక్లపక్షము, దక్షిణాయణములో కాలచక్రమందు మార్గము ఎట్లు ఉన్నది తర్వాత పేజీ పటములో చూడవచ్చును.




ఆత్మను చేరుటకు అన్ని ద్వారములు ఒకే ప్రక్క అనగా ఎడమవైపే వచ్చి ఉండవలయును. అట్లుకాక కాలచక్రములో ఏ ద్వారము కుడిప్రక్కకు పోయిన యోగికి ఎడమవైపు మార్గము లభించక తిరిగి వేరే శరీరమును ఆశ్రయించి పుట్టుచుండును. ఇది యోగులకు మాత్రము నిర్ణయించబడివున్నది.

యోగి ఉత్తరాయణములో, కృష్ణపక్షములో, పగలు మరణించిన ఆత్మను చేరలేడు. ఆ సమయమున మరణించిన యోగికి కాలచక్రములో ఆత్మను చేరు మార్గముండదు. ఆ సమయమున కాలచక్రము ఎట్లుండుననగా క్రింది పటములో చూడవచ్చును.



(7) శ్లో॥ 26 : శుక్ల కృష్ణే గతీ హ్యేతే జగత శ్శాశ్వతీమతే ।
ఏకయా యా త్యనావృత్తి మన్యయాఽఽవర్తతే పునః ॥
(జీవాత్మ)

**భావము :** జగతిలో శుక్ల కృష్ణ గతులు శాశ్వతముగ గలవు. ఒకదాని వలన వృత్తి, మరొక దానివలన అనావృత్తి కల్గుచున్నది.

**వివరము :** ప్రపంచములో పక్షములు మారకుండ శాశ్వతముగ ఉండునట్లు ఏర్పరచబడివున్నది. కృష్ణ, శుక్లపక్షములు రెండు శాశ్వతముగ ఉండి యోగులకు వృత్తి అనావృత్తి కలుగజేయుచున్నవి. ఈ విషయమును యోగులకు తప్ప సాధారణ వ్యక్తులకు లెక్కించకూడదని మరొకమారు జ్ఞప్తి చేయుచున్నాము.

(7) శ్లో॥ 27 : నైతే సృతీ పార్థ! జానన్ యోగీ ముహ్యతి కశ్చన ।
తస్మాత్సర్వేషు కాలేషు యోగయుక్తో భవార్జున ॥
(జీవాత్మ)

**భావము :** ఇపుడు విన్న రెండు విధముల కాలములను తెలిసిన యోగి పొరపాటు పడడు. కనుక అర్జున ఎల్లకాలములలోను నీవు యోగయుక్తునిగనుండవలెను.

**వివరము :** యోగి మరణములో తేడాలున్నవని, యోగియొక్క కర్మ పూర్తి అయిపోనిదే చివరికాలము శుక్లపక్షవర్గముకాదని, అలా కాలము తప్పిపోవుటలో తిరిగి జన్మ కల్గునని, తెలిసినవాడు కర్మ తొందరగ అయిపోవుటకు ఎల్లకాలము యోగముతో కూడుకొనివుండుటకు ప్రయత్నించును. ఆ విషయమై భగవంతుడు అర్జునునికి ఎల్లకాలము యోగయుక్తునిగ ఉండమన్నాడు.

(7) శ్లో॥28: వేదేషు యజ్ఞేషు తపస్సు చైవ దానేషు యత్పుణ్య ఫలంప్రదిష్టమ్।
అత్యేతి తత్సర్వమిదం విదిత్వాయోగీపరంస్థానముపైతి చాద్యమ్ ॥
(జీవాత్మ, మోక్షము)

**భావము :** ఈ విషయము తెలిసినవాడు వేదాధ్యాయణము, యజ్ఞాచరణము, తపస్సు, దానము వలన కల్గు పుణ్యఫలములను అతిక్రమించి మోక్షమును పొందును.

**వివరము :** యోగవిధానము తెలిసి ఫలానా కాలములో చనిపోతేనే మోక్షము పొందుటకవకాశము కలదని తెలిసినవాడు గొప్ప జ్ఞాని యోగి అయివుండును. అటువంటివాడు వేద, యజ్ఞ, దాన, తపస్సుల వలన వచ్చు సుకర్మను ఆశించడు. ఎందుకనగా వాడు కర్మను పోగొట్టుకోవాలని ఉన్నవాడు కనుక అటువంటి కర్మలనన్నిటిని అతిక్రమించి వద్దని తలచినవాడై, ఆ కర్మల వలన వచ్చు సుఖముకంటే మోక్షమే మిన్నగ తలచినవాడై యోగమునే ఎల్లవేళల ఆచరించి చివరకు పరమపదము పొందగల్గును.

ఇంతటితో అక్షర పరబ్రహ్మ యోగమను అధ్యాయము సమాప్తము. ఈ అధ్యాయములోని శ్లోకముల వివరములు క్రింద గలవు.

| | | | |
|---|---|---|---|
| 1) | ప్రకృతి, ఆత్మ, పరమాత్మ | = | 1 |
| 2) | ఆత్మ, పరమాత్మ | = | 3 |
| 3) | ప్రకృతి, పరమాత్మ | = | 1 |
| 4) | ఆత్మ | = | 1 |
| 5) | జీవాత్మ | = | 5 |
| 6) | ఆత్మ, సాకారము | = | 1 |
| 7) | పరమాత్మ | = | 8 |
| 8) | పరమాత్మ, జీవాత్మ | = | 1 |
| 9) | జీవాత్మ, మోక్షము | = | 3 |
| 10) | జీవాత్మ, ఆత్మ, పరమాత్మ | = | 4 |
| | మొత్తము శ్లోకములు | = | 28 |

భావము, వివరము మార్చి వ్రాసిన శ్లోకములు - 4,13,23,24,25.

*****

## ఎనిమిదవ అధ్యాయము

# రాజవిద్యా రాజగుహ్యా యోగము

**శ్రీ భగవంతుడిట్లనియె :-**

*(8)శ్లో॥ 1 : ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యా మ్యన సూయవే ।*
*జ్ఞానం విజ్ఞాన సహితం యద్జ్ఞాత్వా మోక్ష్యసేஉశుభాత్ ॥*
*(ధర్మములు)*

**భావము :** ఇది అతి రహస్యమైన జ్ఞానము. దీనిని విజ్ఞాన సహితముగ విశద పరుతును. దీనిని తెలియుట వలన అశుభములనుండి ముక్తుడవుకాగలవు.

**వివరము :** బ్రహ్మవిద్య అనునది రహస్యమైనదే. ఎవరికి తెలియని దానివలన అది రహస్యమైనది. అటువంటి జ్ఞానమును అనుభవపూర్వకముగ మరియు విజ్ఞానసహితముగ అర్థమగునట్లు విశదముగ తెలియ చెప్పెదనని భగవంతుడన్నాడు. అట్లు తెలియుట వలన కర్మముల నుండి విడువబడి మోక్షము పొందునని కూడ తెల్పాడు.

*(8)శ్లో॥ 2 : రాజవిద్యా రాజగుహ్యం పవిత్ర మిద ముత్తమమ్ ।*
*ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తు మవ్యయమ్ ॥*
*(ధర్మములు)*

**భావము :** అన్ని విద్యలయందు పెద్దది, అట్లే అన్ని రహస్యములందు పెద్దది, పవిత్రమైన ఉత్తమమైన ప్రత్యక్షముగ జరుగు ధర్మము. మంచి సుఖమైనది నాశనములేనిది.

**వివరము :** ఈ చెప్పబడు జ్ఞానము విద్యలలోకెల్ల రాజులాంటిది. మనుషులలో రాజు గొప్పవాడు, ఇది గొప్ప విద్య కాబట్టి రాజుగ పోల్చి చెప్పడమైనది. అట్లే

రహస్యములలోకెల్ల గొప్ప రహస్యమైనది. ఎవరికి తెలియనిది రహస్యమే. ఎవరు చెప్పలేని రహస్య విషయము భగవంతుడు తెలియజేయుచున్నాడు. అటువంటి రహస్యమైన ఎవరికి తెలియని విషయమును తెలుసుకోవడము వలన అశుభములు కలుగజేయు గుణముల మీద ఆసక్తి తగ్గిపోవును. ఈ జ్ఞానము ప్రత్యక్ష ధర్మమైనది, నాశనములేనిది అయిన దానివలన ప్రత్యక్ష పనులు చేయువాడు తప్పక తెలిసి చేయవలసివున్నది. అట్లుకాక వాడు చేస్తుంటే నేను చేస్తున్నాననిన తెలివితక్కువ వాడగును. అలా తెలివి తక్కువ పనులు, అర్థములేని పనులు చేయకుండుటకైన ధర్మములు తెలియాలి. ఉదాహరణకు టెంకాయ (కొబ్బరికాయ) అందురు కొట్టుచుంటే మనము కొట్టుచున్నాము, కాని అర్థము తెలియదు. పెళ్ళిరోజు తలంబ్రాలు పోస్తున్నాము. అందరు చేస్తుంటే మనము చేస్తున్నాము, కాని అర్థము తెలియదు. అందరు బ్రతుకుతున్నట్లే బ్రతకుచున్నాము, కాని మన బ్రతుకు యొక్క అర్థము తెలియదు. ఇంకా మనము చేయు ఎన్నో పనులకు, మాట్లాడే మాటకు అర్థము తెలియదు. ఇట్లు గుంపులో గోవింద అని అందరంటే నీవు అనక గోవిందలో అర్థమేమో తెలుసుకోవాలి. అన్నిటికి అర్థము ఆచరణ తెలుపునవి ధర్మములు. వాటిని గూర్చి తప్పక తెలియాలి. ధర్మములను తెలియమని క్రింది శ్లోకములో కూడ చెప్పుచున్నాడు.

*(8)శ్లో॥ 3 : అశ్రద్ధధానాః పురుషా ధర్మ స్యాస్య పరన్తప! ।*
*అప్రాప్య మాం నివర్తన్తే మృత్యుసంసార వర్త్మని ॥*
*(ధర్మములు)*

**భావము :** ధర్మముల మీద అశ్రద్ధ కల్గినవాడు, నన్ను తెలియలేక మృత్యు సంసారములోనే వర్తించుచుండును.

**వివరము :** నీతి న్యాయయుక్తమైనది, జ్ఞానము ధర్మయుక్తమైనది. నీతి న్యాయము ప్రపంచములో నడుచుకొనుటకు అవసరమైన సక్రమ పద్ధతిని చూపించును. జ్ఞానధర్మములు ప్రపంచసంబంధమైనవి కావు. ఇవి పరమాత్మ సంబంధమైనవి.

జ్ఞానధర్మముల వలన పరమాత్మను చేరుటకు కావలసిన విధానములు తెలియును. ముఖ్యముగ నీతి న్యాయములేవో, జ్ఞానధర్మములేవో ముందు తెలుసుకోవలసి ఉన్నది. మేము చూచినంతలో జ్ఞానధర్మముల స్థానములను, నీతి న్యాయములు ఆక్రమించుకొన్నవి. జ్ఞానము తెలుపవలసిన పెద్దలు జ్ఞానమనుకొని నీతిని బోధిస్తున్నారు. అలాగే ధర్మముల స్థానములో న్యాయాన్ని బోధిస్తున్నారు. అసలు జ్ఞానము ధర్మము అగమ్యగోచరమైపోయి, మనవరకు నీతి న్యాయములే పెద్దవై పోయాయి. సత్యమునే పలుకమని, పరోపకారము చేయండని, ఇతరులను మోసగించవద్దని, మంచినే ఆచరించండని, అన్యాయముగ వర్తించవద్దని చాలామంది బోధిస్తున్నారు. ఇవి నీతి న్యాయమునకు సంబంధించిన విషయములు. పెద్దలు వీటిని బోధిస్తే పరవాలేదు. కాని గురువులైనవారు వీటిని వదలి జ్ఞానమును ధర్మమును బోధించుట మంచిది.

ధర్మములేవో తెలియని ఈ కాలములో, జ్ఞానము యొక్క అర్థమే తెలియని ఈ పరిస్థితిలో, నీతి న్యాయములు తెలిసినవారే గొప్ప జ్ఞానులుగ, యోగులుగ, గురువులుగ చలామణి అవుచున్నారు. ఇటువంటి పరిస్థితిలో అసలైన జ్ఞానము ధర్మము తెలియబడినప్పటికి గుర్తించలేనిస్థితిలో చాలామంది ఉన్నారు. **'వినాలనుకొన్న వానికి చెప్పబడును. తెలియాలనుకొన్నవానికి తెలుపబడును.'** అను సూత్రము ప్రకారము శ్రద్ధవున్నవానికి జ్ఞానము ధర్మములు తెలియబడును. శ్రద్ధలేనివానికి ఒకవేళ తెలియబడిన అశ్రద్ధచే వాటిని ఆచరించడు. ధర్మములు తెలిసినప్పటికి అశ్రద్ధాపరుడు వాటిని వ్యర్థము చేసుకొంటే, పరమాత్మను వాడెప్పటికి తెలుసుకోలేడు. అటువంటి వారు మృత్యువుతో కూడుకొన్న ఈ జగత్తులోనే మునిగి తేలుచుండును. శ్రద్ధగలినవాడు ధర్మయుక్తముగ ఆచరించుచు తొందరలో పరమాత్మను పొందగలడు. ఈ జగత్తునుండి బయటపడగలడు.

*(8) శ్లో॥ 4 : మయా తత మిదం సర్వం జగదవ్యక్త మూర్తినా ।*
*మత్ స్థాని సర్వభూతాని న చాహం తేష్వవస్థితః ॥*
*(పరమాత్మ)*

**భావము :** అవ్యక్తముగ ఈ ప్రపంచమంతయు వ్యాపించియున్నాను. నాయందే సర్వజీవరాసులున్నవి. నేను వాటియందులేను.

**వివరము :** కంటికి కనిపించకుండ పరమాత్మ ప్రపంచమంతా వ్యాపించివున్నాడు. వ్యక్తముకాని పరమాత్మ అణువణువున వ్యాపించివున్నాడు. పరమాత్మ పదార్థము నందేకాక శూణ్యములో కూడ వ్యాపించి ఉండుట వలన ఖగోళములో సమస్త గోళములు, నక్షత్రములు, సూర్యచంద్రాది గ్రహములు మొదలగునవన్నియు పరమాత్మలోనే ఉన్నవి. భూగోళము దానిమీదున్న సమస్తము పరమాత్మయందున్నవే యగును. సముద్రము సహితము, సముద్రములోని ప్రాణులు సహితము, ఇది లేదనకుండ అన్నియు పరమాత్మలో నివశించునవేనని తెలియుచున్నది. ప్రదేశమంతా పరమాత్మదే అయినప్పుడు ఏ జీవరాసి ఎక్కడున్న పరమాత్మ స్థలములోనున్నట్లే యగును. అందువలన **'మత్‌స్థాని సర్వభూతాని'** నా స్థానములోనే జీవరాసులుంటున్నవి అన్నాడు. ఏ బాడుగ కట్టకుండ ఉచితముగ పరమాత్మ స్థానములో ఉన్నామని జ్ఞప్తి చేసుకోండి. మనము ఆయన స్థానములో ఉన్నాము, కాని ఆయన మన స్థలములోలేడు.

అనంత విశ్వమంతా ఆయనే అయినపుడు సూక్ష్మమైన భూగోళమెంత? ఈ చిన్న భూగోళములో సముద్రము 70 శాతము పోగా 30 శాతము భూమి ఎంత? ఆ కొద్ది భూమిలో అమెరికా, రష్యా మొదలగు వందల దేశాలలో నీదేశమెంత? అందులో నీ దేహమెంత? నీ దేహములో తలలో ఒకచోటున్న నీవెంత? ఇంత చిన్న మనము అంత పెద్ద పరమాత్మలో నివశిస్తున్నాము. అంత పెద్ద పరమాత్మ ఇంత చిన్న మనలోపల పట్టునా? పట్టడు. ఎంతో అనంతముగ విశాలమైన ఎల్లలులేని వాడేమి, నీలోపల ఇమిడివుండేదేమి. ఆయన మనలో ఉండడము సాధ్యపడదు. మనము ఆయనలో ఉండడము సహజమే. అందువలననే ఈ శ్లోకములో సర్వజీవులు నాయందున్నవి, వాటియందు నేను లేను అన్నాడు.

అణువణువు అన్నిటియందు పరమాత్మ వ్యాపించియున్నది. జీవరాసుల శరీరములలోను కూడ పరమాత్మ వ్యాపించి ఉన్నదని చెప్పవచ్చును. ఈ విధముగ జీవరాసులన్ని పరమాత్మయందిమిడి దానితో కలిసి ఉన్నవని తెలియుచున్నది. పరమాత్మలేని వస్తువుగాని, జీవరాశికాని జగత్తులో లేదు. పరమాత్మ ఎట్లు అందరిలో వ్యాపించి ఉన్నాడో, ఎక్కడ తనను చెప్పాలో, ఎక్కడ చెప్పకూడదో క్రింది శ్లోకములో తెలియజేయుచున్నాడు చూడండి.

(8)శ్లో॥ 5 : న చ మత్ స్థాని భూతాని పశ్య మే యోగమైశ్వరమ్ ।
భూతభృ న్న చ భూతస్థో మమాత్మా భూత భావనః ॥
(పరమాత్మ)

**భావము :** సర్వ జీవులు నాయందులేవు. నేను ఈశ్వరునిగ ( అధిపతిగ) ఎట్లు కలిసి ఉన్నది చూడుము. జీవులు ధరించు శరీరములోని ఆత్మగను, భూతములుగ భావింపబడు జీవాత్మలుగను నేను లేను.

**వివరము :** అలిగినవాడు అద్దము తిరిగినట్లు ముందు శ్లోకములో ***'అన్ని జీవరాసులు నాయందు ఉన్నవి.'*** అన్న పరమాత్మ ప్రక్క శ్లోకములోనే ఇక్కడ ***'ఏ జీవరాసి నాయందు లేవు'*** అన్నాడు. ***'మత్ స్థాని భూతాని'*** అన్నవాడు ప్రక్కనే ***'నచమత్థా ని భూతాని'*** అనడమేమిటి, మనుషులకంటే దేవుడు చాలా స్పీడ్‌గా ప్లేటు ఫిరాయిస్తాడేయని అనుమానము వస్తుంది కదా! అలా ఏమి కాదు. తనను అర్థము చేసుకోడానికి పరమాత్మ ఇన్ని విధాల చెప్పవలసి వచ్చింది. ఇలా చెప్పడము వలన వివరముగ అవగాహన చేసుకోవచ్చును. అలాకాకపోతే ఉదాహరణకు ఇపుడు బోధకులు భగవంతుడను పదమును ఎక్కడ ఉపయోగించాలను వివరము తెలియకుండి పరమాత్మ అను పదము చెప్పవలిసిన చోట భగవంతుడని, భగవంతుని గూర్చి చెప్పవలసినచోట పరమాత్మయను పదము వాడినట్లుండును. భగవంతుడు పరమాత్మ ఇద్దరు ఒకరే అయినప్పటికి సాకారరూపుడు భగవంతుడు. నిరాకార రూపుడు పరమాత్మ. నిరాకారమైన పరమాత్మను గూర్చి చెప్పవలసిన చోట,

సాకారమైన భగవంతున్ని చెప్పడములో చాలా పొరపాటగును. ఉదాహరణకు గొప్ప పేరుగాంచిన స్వామీజి తన ఉపన్యాసములో *'భగవంతుడు సర్వవ్యాపి అంతట చూస్తున్నాడు'* అన్నాడు. అక్కడ చెప్పవలసినది పరమాత్మ సర్వవ్యాపి అని చెప్పవలసి ఉండగ తప్పుగ భగవంతుడు సర్వవ్యాపి అని చెప్పడమైనది. తప్పేమిటంటే భగవంతుడు ఒక శరీరములో మాత్రముండి, ఆ శరీరములోని కన్ను యొక్క చూపు పరిధిలో మాత్రమే చూడగల్గుచున్నాడు. దీనిని బట్టి భగవంతుడు అంతట చూచుట అబద్ధమగును. పరమాత్మ అంతట వ్యాపించి చూచుట నిజమగును. ఆ మాటతో ఆ స్వామీజీకి జ్ఞానము అంతో ఇంతో తెలుసును, కాని సూక్ష్మమైన వివరము వరకు తెలియదని అనుకోవచ్చును. అలా చెప్పడము వలన వినేవారు ఆలోచించక నమ్మడము జరుగును. అలాగే ఇప్పుడు ఇక్కడ పరమాత్మ నేను అంతా చూస్తున్నాను, కాని నేను అంతా చూడడములేదు అన్న విషయమొచ్చినదనుకోండి. అప్పుడు విన్న ప్రజలు ఏమనుకోవాలి. వారు సందిగ్ధావస్థలోపడి అనుమానము తీరక ఈ జ్ఞానమే వద్దనుకోవడము జరుగును. అందువలన జ్ఞానములో ప్రతి విషయమును క్షుణ్ణముగా పరిశీలించి బోధించవలెనని బోధకులకు మా మనవి.

ఇప్పుడు అసలు విషయానికొస్తాము. ముందు చెప్పిన శ్లోకములో నాయందు అందరున్నారని చెప్పి, ఈ శ్లోకములో నాయందు ఎవరు లేరని చెప్పడములో వివరమేమిటని యోచించిన, అదే శ్లోకములోనే *'ఈశ్వరునిగ కలిసివున్నది చూడుము'* అన్నాడు. అంతేకాక *'భూతములుగ భావింపబడు వాటిగను భూతస్తునిగ నేను లేను'* అన్నాడు. వీటన్నిటిని గమనించిన ఒకే పరమాత్మ మూడుగ విభజింపబడి ఉన్నదని తెలియుచున్నది. రెండు నేను కాదు అనుచున్నాడు. ఆయన కాని రెండు **'మమాత్మనచ భూతస్థో భూత భావనః'** అనునవి. **భూతస్థో** అనగ భూతములందు నివశించువాడైన ఆత్మ, **భూత భావనః** అనగ భూతములనబడు జీవాత్మలు, **మమాత్మ** అనగ నేను, **నచ** అనగ కాను అని అర్థము.

పరమాత్మయిన వాడు ఆత్మ జీవాత్మలుగ నేను లేను అంటున్నాడు. దీనిని బట్టి పరమాత్మకు, ఆత్మకు, జీవాత్మకు విభిన్న భేదములున్నవని తెలియుచున్నది.

అవి ఏమిటనగా! *1) పరమాత్మ అనగ అంతట వ్యాపించివున్నది. అక్కడా ఇక్కడాయను ప్రశ్నలేకుండా అంతట ఉండునది. 2) ఆత్మ అనగ సర్వ జీవుల శరీరములందు మాత్రము వ్యాపించివున్నది. 3) జీవాత్మ అనగ ఒక శరీరములో ఒక్క చోట మాత్రముండునది.* ఇలా వేరు వేరుగ మూడు ఆత్మలుండుట వలన మొదటిదైన పరమాత్మలోనికి చివరిదైన జీవాత్మ కలవాను ప్రయత్నము చేయవలసి వచ్చినది. పరమాత్మకంటే, ఆత్మ, జీవాత్మలు వేరై వాటి పనులు కూడ వేరై ఉండుట వలన, అవి నేను కాను అన్నాడు. పరమాత్మ అంశమే ఆత్మ జీవాత్మలుగ విభజింపబడి ఉన్నవి. ఆ రెండు ఆత్మలకు పరమాత్మయే అధిపతి. వాస్తవముగ ఆత్మ జీవాత్మలలో ఉన్నది పరమాత్మయే, అయినప్పటికి వాటికి పరిధి ఏర్పడినది. అందువలన నేను వాటిలో ఎట్లు కలిసి అధిపతిగనున్నానో చూడుము (తెలియుము) అని శ్లోకములో '**పశ్యమే యోగమైశ్వరమ్**' అన్నాడు.

పరమాత్మను ఒకే శక్తిగ చూచినట్లయితే ముందు శ్లోకములో చెప్పినట్లు అన్ని జీవరాసులు దానియందే గలవు. ఆ మాట అక్కడ వాస్తవమే. పరమాత్మను మూడుగ విభజించి చూడగల్గితే సర్వజీవరాసులు ఆత్మయందున్నవి గాని పరమాత్మయందులేవు. శరీరమంత వ్యాపించి చైతన్యముగనున్నది ఆత్మ. శరీరమంత వ్యాపించిన ఆత్మయందే శరీరములోని జీవాత్మ కూడ గలదు. శరీరమందు ఒకచోటున్న జీవాత్మ శరీరమంత నిండిన ఆత్మలోనున్నదని చెప్పవచ్చును. అందువలన పరమాత్మగ చెప్పబడిన దానియందు జీవాత్మలు లేవనుట ఇక్కడ వాస్తవము.

ఒకే పరమాత్మ మూడుగ విభజింపబడినదైనప్పటికి, విభజించబరచక చూచిన ఎడల సర్వజీవులు పరమాత్మలోనివేనని, విభజించి చూచిన సర్వజీవులు పరమాత్మలో లేవని స్పష్టముగ చెప్పవచ్చును. ఉదాహరణకు ఒకనికి ఆస్తి 9 ఎకరములున్నదనుకొనుము. వానికి ముగ్గురు కొడుకులున్నారనుకొనుము. వారికి యుక్తవయస్సు వచ్చిన తరువాత ఒక్కొక్కరికి మూడు ఎకరముల ప్రకారము పంచాడనుకొనుము. అందులో ఒక మూడెకరాల స్థలాన్ని చూపి ఇదెవరిదని

అడిగిన, వాని కొడుకుదని చెప్పవచ్చును. పంచక పూర్వము అడిగినట్లయితే ఆస్తి మొత్తము తండ్రిదని చెప్పవచ్చును. అప్పుడది నిజము. పంచిన తరువాత ఆస్తి తండ్రిది కాదు కొడుకులదని చెప్పవచ్చును. ఇప్పుడిది నిజము. ఈ విధముగనే ఏకముగనున్న పరమాత్మయందు సమస్త జీవరాసులుగలవను మాట నిజము. విభజింపబడిన పరమాత్మయందు ఏ జీవరాసిలేదు అన్న మాట కూడ వాస్తవ మైనదేనని గ్రహించాలి.

*(8)శ్లో॥ 6 : యథాఽఽకాశస్థితో నిత్యం వాయు స్సర్వత్రగో మహాన్ ।*
*తథా సర్వాణి భూతాని మత్స్థానీ త్యుపధారయ ! ॥*
*(పరమాత్మ)*

**భావము :** బలము కలిగి సర్వత్ర సంచరించు గాలి నిత్యము ఆకాశమందెట్లున్నదో, అట్లే సర్వ జీవరాసులు నాయందున్నవని గ్రహించుము.

**వివరము :** ఆకాశము శూన్యమైనది. శూన్యములో ఏ పట్టు ఉండదు. అటువంటి ఏ పట్టులేని ఆకాశములో పట్టుగల్గి బలముగ దేనినైన త్రోయగల మహాశక్తికల్గియున్న గాలి అంతట సంచరించుచున్నది. ఆధారములేని ఆకాశములో ఆధారముకల్గ చేసుకొని సంచరించడము, మరీ బలముకల్గి సంచరించడము గొప్ప విధానమే కదా! అని మేమన్నపుడు కొందరు *'నేడు స్కైలాబ్‌లను, ఉపగ్రహములను మానవుడు తయారుచేసి వదిలాడు కదా! అవియు ఆధారములేని ఆకాశములో ఎగురుచు ముందుకు పోవుచున్నవి కదా! అట్లే కదా వాయువు కూడ ఆకాశములోనున్నది'* అని అనవచ్చును. మనిషి ఉపగ్రహములకు యంత్రములున్నవి, కనిపించు రూపమున్నది. గాలికి రూపములేదు. కావున ఉపగ్రహములకు, గాలికి పోలిక కాదు.

కనిపించని ఆకాశములో, కనిపించని గాలి బలముకల్గి ఎట్లు కదులుచున్నదో, అట్లే కనిపించని పరమాత్మలో, కనిపించని జీవాత్మలు బలముకల్గి కదులుచున్నవి. ఆకాశములో గాలికి స్థానమెట్లున్నదో, పరమాత్మయందు కూడ

జీవులకు స్థానమట్లే ఉన్నది. ఇక్కడ గ్రహించవలసిన విషయమేమనగా! ఒక శ్లోకములో జీవరాసులు నాయందున్నవన్నాడు. రెండవ శ్లోకములో ఏ జీవరాసి నాలో లేవన్నాడు. తిరిగి ఇపుడు మూడవ శ్లోకములో ఆకాశములో గాలి ఉన్నట్లు, జీవులు నాలో ఉన్నవంటున్నాడు.

విభజించి చూచిన జీవులకు ఆధారము ఆత్మని స్పష్టముగ తెలియుచున్నది. విభజించక పోయినట్లయితే జీవులకు కనిపించక పరమాత్మ ఆధారమై ఉన్నదని జ్ఞాపకముంచుకోవాలి.

(8)శ్లో॥ 7: సర్వ భూతాని కౌంతేయ! ప్రకృతిం యాన్తి మామికామ్ ।
కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజామ్యహమ్ ॥
(పరమాత్మ)

**భావము :** సర్వ జీవరాసులు కల్పక్షయములో నా ప్రకృతియందే లీనమగుచున్నవి. కల్పాదిలో నేనే తిరిగి వాటిని పుట్టించుచున్నాను.

**వివరము :** జీవరాసుల తలలలో నాలుగు చక్రముల చట్రమొకటి భిగించబడి ఉన్నది. బ్రహ్మనాడి ఇరుసుగా గల ఆ నాలుగుచక్రములు పై నుండి వరుసగ 1) బ్రహ్మచక్రము 2) కాలచక్రము 3) కర్మచక్రము 4) గుణచక్రము గలవు. పై నుండి బ్రహ్మచక్రము రెండు భాగములుగ విభజించబడి సగభాగములో ప్రపంచము ఉండునట్లు, సగభాగములో ప్రపంచములేనట్లు నిర్ణయించబడివున్నది. బ్రహ్మచక్రము సగభాగము తిరుగునపుడు ప్రపంచమున్నది. సగభాగము తిరుగుటకు పట్టుకాలము వేయియుగములు. ప్రపంచమున్న వేయియుగముల కాలము పరమాత్మకు పగలుగ, ప్రపంచములేని కాలము పరమాత్మకు రాత్రిగ చెప్పుకొన్నాము. పగలు వేయి యుగముల కాలమును కల్పము అంటున్నాము. కల్పము మొదటిలో ప్రపంచ పుట్టుక, కల్పము చివరిలో ప్రపంచ క్షయము అనగ నాశనమని తెలియాలి. దీనిని బట్టి ప్రపంచము మొదటి నుండి చివరి వరకు వేయియుగముల కాలములో బ్రహ్మచక్రము సగము చుట్టు తిరుగుచున్నది. అలాగే దానిక్రింద చక్రమైన కాలచక్రము

సంవత్సరమునకొక చుట్టు తిరుగుచున్నది. కాలచక్రముకంటే క్రిందగల కర్మచక్రము దినముకొక చుట్టు తిరుగుచుండగ, దానికంటే క్రిందగల గుణచక్రము గంటకొకచుట్టు తిరుగుచున్నది.

అన్నిటికంటే క్రిందగల గుణచక్రము మూడు భాగములుగ విభజింపబడి ఉన్నది. దానిలోనే ఏదో ఒక భాగములో జీవుడు నివాసముండును. జీవుని నివాస కేంద్రమునుండి యుగపర్యంతము లెక్కాచారముగలదు. జీవుడు నివశించు గుణభాగములోని గుణములు మంచివి ఆరు, చెడువి ఆరు మొత్తము 12 గలవు. ఒక్కొక్క గుణము నవగ్రహముల ప్రకారము తొమ్మిది భాగములుగ విభజింపబడి ఉన్నది. 12 గుణములు 9 భాగములుగ విభజింపబడుటవలన మొత్తము 12×9 = 108 భాగములుగ విడిపోయివున్నవి. 108 గుణములు గల గుణ భాగములో జీవుడు నివశిస్తున్నాడని ముఖ్యముగ గుర్తుంచుకోవలెను. ఒక్కొక్క జీవుడు శరీరములలో మూడు గుణ ఆవరణములలో ఏదో ఒక భాగమున నివాసముండుట వలన, ఒక గంటకు గుణచక్రము ఒకచుట్టు తిరుగుట వలన, మూడు గుణ ఆవరణములలోని మొత్తము ముఖ్య గుణములు 12×3 = 36 ఒక గంటకు తిరిగినట్లగుచున్నది. అందువలననే పూర్వపు పెద్దలు ఇతరులను గూర్చి చెప్పేటప్పుడు వానికి గంటకు ముప్పైఆరుగుణములు మారుతుంటాయని అనడము పరిపాటిగనున్నది. అలా ఒక గంటకు గుణచక్రములోని మూడు ఆవరణములలో ఉన్న 36 గుణములు తిరుగుచుండగ, ఒక దినమునకు అనగ 12 గంటల కాలమునకు 36×12=432 గుణములు మారినట్లగును.

మానవుని పగలు కాలములో 432 గుణములు తిరుగుచున్నవి. పరమాత్మ పగలు కాలము వేయియుగములు కావున మానవుని పగలును వేయిమార్లు హెచ్చించవలసి వచ్చినది. దానిప్రకారము వేయిమార్లు మానవుని పగలును హెచ్చింపు చేసుకొనుట వలన మానవుని పగలులోని 432 గుణములను వేయిమార్లు హెచ్చించవలసి వచ్చినది. అప్పటికి మొత్తము 4,32,000 గుణముల సంఖ్య

వచ్చినది. గుణముల వలననే ఈ ప్రపంచము పెరుగుట తరుగుట జరుగుచుండుట వలన ఆ గుణముల సంఖ్యనే ఆధారము చేసుకొని ఒక యుగకాలమును నిర్ణయించవలసి వచ్చినది. ఈ లెక్క ప్రకారము మొదటి కలియుగము 4,32,000 సంవత్సరములు. రెండవదైన ద్వాపరయుగము దానికంటే రెండింతలు 8,64,000 సంవత్సరములు, మూడవదైన త్రేతాయుగము మూడింతలు 12,96,000 నాల్గవదైన కృతయుగము నాల్గింతలుగ 17,28,000 సంవత్సరములు. ఈ విధముగా యుగముల ఆయుస్సు నిర్ణయింపబడినది. నాల్గవదైన కృతయుగముతో ప్రపంచము మొదలు పెట్టబడినది. నాల్గుయుగములు 250 మార్లు జరిగినట్లయితే వేయి యుగములగును.

**నాలుగుయుగముల లెక్కప్రకారము మొత్తము సంవత్సరములు**

| | | | |
|---|---|---|---|
| **1)** | **కలియుగము** | **=** | **4,32,000** |
| **2)** | **ద్వాపరయుగము** | **=** | **8,64,000** |
| **3)** | **త్రేతాయుగము** | **=** | **12,96,000** |
| **4)** | **కృతయుగము** | **=** | **17,28,000** |
| **మొత్తము 4 యుగములు** | | **=** | **43,20,000** |

**మొత్తము కాలము 43,20,000 సంవత్సరములు**

నాలుగు యుగములు 250 మార్లు జరిగిన 43,20,000×250= 108,00,00,000 మొత్తము సంవత్సరములగును. పరమాత్మ పగలు 108 కోట్ల సంవత్సరములు 108 ఉప గుణములకు ప్రతీకగనున్నవి. మానవుని పగలు కాలములో 432 గుణములు తిరుగగ నాల్గవయుగమైన కలియుగకాలము 4,32,000 సం॥ములైనవి. నాల్గుయుగముల మొత్తము కాలము 43,20,000. జీవుని గుణఆవరణములో జీవుడుండు గుణముల సంఖ్యనుబట్టి యుగముల

వరకు లెక్కించి నిర్ణయింపబడి ఉన్నది. జీవుని గుణములను కేంద్రముగ చేసుకొని నిర్ణయించబడిన లెక్కాచారమే యుగములు, యుగములతో కూడుకొన్న కల్పము ఇపుడర్థమైందనుకొంటాము. కల్పమంటే 108 కోట్ల సంవత్సరములని, ఈ కల్పము మొదలైనపుడు జీవులు పుట్టుట ప్రపంచమేర్పడుట జరుగునని, కల్పము నాశనమైనపుడు సర్వము నాశనము చెందిపోవునని తెలియవలెను. ఈ విషయమునే భగవంతుడు తెల్పుచు కల్ప అంత్యములో సర్వజీవులు నా ప్రకృతియందే లీనమగుచున్నవని, కల్పాదిలో సర్వజీవులను నేనే తిరిగి పుట్టించుచున్నానని అన్నాడు.

(8) శ్లో॥ 8 : ప్రకృతిం స్వా మ వష్టభ్య విసృజామి పునః పునః ।
భూతగ్రామ మిమంకృత్స్న మవశం ప్రకృతేర్వశాత్ ॥
(పరమాత్మ)

**భావము :** ప్రకృతి వశములోనుండి అస్వతంత్రమైయున్న ఈ సమస్త జీవరాసులను నా ఆధీనములోనున్న ప్రకృతిచేతనే మళ్ళీ మళ్ళీ పుట్టించుచున్నాను.

**వివరము :** పరమాత్మ తనకు జీవరాసులకు మధ్యలో ప్రకృతినుంచుకున్నాడు. ప్రకృతి ఆధీనములో జీవరాసులుండునట్లు చేసి, తన ఆధీనములో ప్రకృతిని ఉండునట్లు చేసుకున్నాడు. తనకు జీవులకు మధ్య నేరుగ సంబంధము లేకుండ చేసుకున్నాడు. జీవులన్ని ప్రకృతి ఆధీనములోనుండుట వలన వాటికి స్వతంత్రత లేదు. గుణములు, కర్మ, మనస్సు, బుద్ధి, చిత్తము, అహము అను ఎన్నో భాగములుగ విభజింపబడి ఉన్న ప్రకృతిలో చిక్కుకున్న జీవుడు వాటి ప్రకారము పుట్టవలసిందే, కాని తన ఇష్టప్రకారము పుట్టుటకు వీలులేదు. తన పుట్టుక కూడ తన చేతిలో లేని జీవాత్మలు శ్లోకములో చెప్పినట్లు అన్ని విషయములలో అస్వతంత్రమైనవే. అలా స్వతంత్రతలేని జీవరాసులను పరమాత్మయే తన ప్రకృతిచేత, దానిలోనుండు కర్మ భాగములచేత రక రకములుగ పుట్టించుచున్నాడు. జీవరాసులు పుట్టుటకు మూలకర్త పరమాత్మే అయినప్పటికి పైకి కనిపించునట్లు ప్రకృతినుంచాడు.

(8) శ్లో॥ 9 : న చ మాం తాని కర్మాణి నిబధ్నన్తి ధనంజయ! ।
ఉదాసీనవ దాసీన మసక్తం తేషు కర్మసు ॥
(పరమాత్మ)

**భావము :** ఆసక్తిలేని వాడును, ఉదాసీనత కల్గియున్న వాడునునైన నాకు ఆ కర్మలంటవు.

**వివరము :** వాని వాని కర్మానుసారము ప్రకృతియే జీవులను పుట్టించుచున్నది. ప్రకృతి చేయుపనిలో ఆసక్తిలేనివానిగ సాక్షిగ చూస్తుండుటవలన జీవులను పుట్టించుట లోని కర్మ ఏమాత్రము పరమాత్మకు అంటలేదు. ఇక్కడ ఒక సాధారణ మనిషికి ఎలా కర్మఅంటదో, అదే పద్ధతిలో జగత్తును సృష్ఠించు పెద్దకార్యములో కూడ కర్మ అంటకుండునట్లు, పరమాత్మ కూడ నడుచుకోవడము ముఖ్యముగ గమనించదగ్గ విషయము. జగత్తు సృష్టికి మూలకర్త తానే అయినప్పటికి ప్రకృతి ద్వార పని చేయిస్తు, తనకేమి అంటనివానివలె అనాసక్తుడై పరమాత్మ ఉన్నాడు. ప్రకృతి చేయు పనులను నేను చేయలేదనుచున్నాడు. అందువలన జగతికి కల్గు ప్రళయ సంభవముల రెండిటి యొక్క పాపపుణ్యములు నాకంటవని చెప్పుచున్నాడు. ఈ విధానమునే మనిషి అనుసరించినట్లయితే, వానికి కూడ కర్మలంటవని వెనుక అధ్యాయములో చెప్పాడని జ్ఞప్తి చేసుకోవలెను.

(8) శ్లో ॥ 10 : మయాஉధ్యక్షేణ ప్రకృతి స్సూయతే సచరాచరమ్ ।
హేతునాஉనేన కౌంతేయ! జగ ద్విపరివర్తతే ॥
(పరమాత్మ)

**భావము :** నా అధ్యక్షతన గల చరాచర ప్రపంచమునంతటిని ప్రకృతి పుట్టించు చున్నది. ఆ కారణముచేతనే జగత్తు పరివర్తించుచున్నది.

**వివరము :** పరమాత్మ ప్రకృతికి అధ్యక్షత వహించియుండగ ప్రకృతి సకల చరాచర జీవరాసులను సృష్ఠించుచున్నది. కారణము పరమాత్మకాగ, కార్యము

ప్రకృతి చేయుచున్నది. ఈ విధానము శాశ్వతముగనుండుట వలన, చావు పుట్టుకలను ప్రకృతి చేయుచుండుట వలన, జగత్తు చక్రమువలె తిరుగుచువున్నది. ఒక యంత్రమును తయారు చేయువాడు యంత్రము తయారగువరకు కష్టించి తయారు చేయును. యంత్రము తనంతట తానే పనిచేయుటకు మొదలు పెట్టిన తరువాత వానికేమి శ్రమవుండదు. మొదట ఒక నమూనాను తయారు చేసినవాడు ఆ నమూనాను ఎక్కడైన ఉపయోగించి పని చేయించవచ్చును. మొదటి నమూనా ప్రకారమే అన్ని యంత్రములు తానంతటవే పనిచేయును. మొదట ప్రకృతియను యంత్రమును పరమాత్మ తయారు చేసిపెట్టాడు. ఆ యంత్రము ఎల్లపుడు తిరుగుచు పని చేయుచునేవున్నది. పరమాత్మ సామర్థ్యముతోనే యంత్రము తిరుగుచున్నదని చెప్పవచ్చును.

*(8) శ్లో ॥ 11: అవజానన్తి మాం మూఢా మానుషీం తనుమాశ్రితమ్ ।*
*పరం భావ మజానన్తో మమ భూత మహేశ్వరమ్ ॥*
*(పరమాత్మ, సాకారము)*

**భావము :** సర్వజీవరాసులకు అధిపతినైన నేను నరశరీరము ధరించుట వలన, నాశ్రేష్ఠమైన భావము తెలియజాలక మూఢులు నన్ను అవమానించుచున్నారు.

**వివరము :** పరమాత్మ ఏదో ఒక సమయమున మానవునిగ శరీరము ధరించక తప్పదు. శరీరము ధరించిన అంత గొప్ప పరమాత్మ ఆ సమయములో మానవునివలె సహజముగ మెలగవలసిందె. మానవునికున్న అన్ని కష్టసుఖములు ఆయనకు కూడ తప్పనిసరిగ ఉండును. కర్మలేని పరమాత్మ శరీరము ధరించినపుడు తనకొక కర్మను తానే ఏర్పాటు చేసుకొనవచ్చును. తానే స్వయముగ నిర్మించుకొన్న కర్మ గ్రహముల ఆధీనములో లేదు. గుణములచేత పుట్టిన కర్మ నవగ్రహముల ఆధీనములో ఉండును. పరమాత్మకు ముందు జన్మ కర్మలేదు. కనుక ఆ జన్మలో తానే సృష్టించుకొని వచ్చిన కర్మ ఏ జ్యోతిష్యశాస్త్రమునకు అంతుబట్టదు. ఇలా గ్రహములకు సంబంధములేని కర్మను, ఒక జీవితమునకు సరిపడు దానిని తయారు

చేసుకొని పుట్టిన పరమాత్మ, భగవంతునిగ శరీరముతో ఉండుట ఎవరు గ్రహించలేరు. కావున ఆయనను కూడ సామాన్య మానవునివలె లెక్కించి, ఆయన గొప్పతనమును ఏమాత్రము గుర్తించలేని మూఢ మానవులు భగవంతుని కూడ అవమానింతురు. భగవంతుడు భూమి మీదకొచ్చినది ధర్మములు తెలియజేయునిమిత్తము. ఆయన ఏమి చేయుచున్నాడని గ్రహించని మనుషులు, ఆయన విశిష్టతను ఏమాత్రము తెలియక ఎన్నో అవమానములకు గురిచేతురు.

*(8) శ్లో ॥ 12 ః మోఘాశా మోఘ కర్మాణో మోఘ జ్ఞానా విచేతసః ।*
*రాక్షసీ మాసురీం చైవ ప్రకృతిం మోహినీం శ్రితాః ॥*
*(జీవాత్మ, ప్రకృతి)*

**భావము :** రాక్షస భావములు కలవారు భ్రాంతితోకూడిన ప్రకృతి స్వభావమును ఆశ్రయింతురు. అట్టివారికి వ్యర్థమైన ఆశ, వ్యర్థమైన కర్మ, వ్యర్థమైన విపరీత జ్ఞానము కల్గుచుండును.

**వివరము :** ప్రకృతి మార్గము, పరమాత్మ మార్గము అను రెండు మార్గములలో రాక్షస భావములు కలవారు ప్రకృతి మార్గమునే ఆశ్రయింతురు. అసురభావము గలవారికి పరమాత్మ మార్గము రుచించదు. పరమాత్మ మార్గమేదని కొంచెమైన ఆలోచింపరు. ప్రకృతి సంబంధమైన దానినే గొప్పగ తలచుకొనుచు అదే గొప్ప జ్ఞానమనుకొనుచుందురు. వారి బుద్ధికి నిష్ప్రయోజనమైన కార్యములే మంచిగ తోచుచుండును. వారి జీవితములో వ్యర్థమైన కార్యములే చేయుచుందురు.

*(8) శ్లో ॥ 13ః మహాత్మానస్తు మాం పార్థ! దైవీం ప్రకృతి మాశ్రితాః ।*
*భజన్త్య నన్య మనసో జ్ఞాత్వా భూతాది మవ్యయమ్ ॥*
*(జీవాత్మ, పరమాత్మ)*

**భావము :** మహాత్ములైనవారు ప్రకృతికి దైవమైన నన్ను ఆశ్రయించి, అవ్యయునిగ

భూతముల మూలకారునిగ నన్ను తెలిసినవారై, మనస్సున అన్యచింత లేకుండ నన్ను ఆరాధిస్తున్నారు.

**వివరము :** ఈ శ్లోకములో **'దైవీం ప్రకృతి'** అన్న పదమునకు దైవప్రకృతి అని లేక సత్వప్రకృతి అని చాలామంది వ్రాయుట జరిగినది. అలా ఇంకొక ప్రకృతి ఉన్నదనుకోవడము పొరపాటు. ఉన్నది ఒకే ప్రకృతి, అది పంచభూత నిర్మితమైనది. ప్రకృతి ఒకటి, దైవప్రకృతి మరొకటి లేవు. 'దైవీం ప్రకృతి' అన్న పదమునకు ప్రకృతికి దైవమైనది అని అర్థము చేసుకోవాలి. గడచిన జన్మలలో పరమాత్మను ఆరాధించినవారు తర్వాత జన్మలో మహాత్ములగుదురు. వారి జీవాత్మ జ్ఞానాగ్ని అను గొప్పధనము కలిగివున్నది. కావున వారు మహాత్ములనబడుదురు. అటువంటి మహాత్ములు ఆ జన్మలో కూడా ప్రకృతికంతటికి దైవమొక్కడున్నాడని, ఆయనే నాశనములేని పరమాత్మయని తెలిసినవారై, వారి మనస్సులో అన్యదేవతల యొక్క యోచన ఏమాత్రము లేనివారై, అన్నిటిని మించినవాడు పరమాత్మేనని ఆయననే ఆరాధించుచుందురు.

*(8) శ్లో ॥ 14 : సతతం కీర్తయన్తో మాం యతంతశ్చ దృఢ వ్రతాః ।*
*నమస్యంతశ్చ మాం భక్త్యా నిత్య యుక్తా ఉపాసతే ॥*
*(జీవుడు, పరమాత్మ)*

**భావము :** ఎల్లపుడు నన్ను కీర్తించి భజించువారు, గొప్ప వ్రతములచే ప్రయత్నించు వారు, నన్నే నమస్కరించువారు, భక్తిచే నిత్యయుక్తులైనవారు, అందరు నన్ను ఉపాసించువారే.

**వివరము :** పరమాత్మను మానవులు తమ తమ బుద్ధికి తోచినట్లు ఊహించుకొను చుందురు. వారు భావించుకొన్న భావమునే గొప్పగ తలచి కీర్తనలతో ఎల్లపుడు భజనలు చేయువారు కొందరుండగ, వ్రతముల వలననే దైవమును తెలియవచ్చునను బుద్ధి కల్గినవారు కొందరున్నారు. వారు నియమనిష్టలుగల వ్రతములనే ఆచరించు చున్నారు. మరికొందరు విధేయతతో నమస్కరించుట మంచిదని, ప్రతిరోజు

నియమము తప్పక నమస్కరించువారు గలరు. అట్లే భక్తితో వారి మనసులందు నిత్యము సంబంధము పెట్టుకొనువారు గలరు. వీరందరు ఎన్ని విధముల ఏ దేవతలను పూజించినను, అందరు పరమాత్మను ఆరాధించువారేనని అనుకోవచ్చును. ఎందుకనగ పరమాత్మ అంతట నిండివున్నవాడు కనుక వారి ఆరాధనలన్ని పరమాత్మకే చేరుచున్నవి. కాని వారు మాత్రము చేరలేరు. వారు ఆరాధించినవారినే చేరుదురు.

(8) శ్లో॥ 15 : జ్ఞాన యజ్ఞేన చా ప్యన్యే యజన్తో మాముపాసతే ।
ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతో ముఖమ్ ॥
(సాకారము, పరమాత్మ)

**భావము :** మరికొందరు జ్ఞానయజ్ఞముచే ఆరాధించువారు, విశ్వవ్యాప్తియై అనేక రూపములుగ ఉన్న నన్ను ఏకరూపునిగ సాకారమును పూజించువారు కలరు.

**వివరము :** పరమాత్మ నిరాకారముగ అంతట వ్యాపించియున్నాడు. మరియు విశ్వవ్యాపియై అనేక రూపములుగనున్న పరమాత్మ ఒక్క సాకారరూపము ధరించి భగవంతునిగ కూడ ఉన్నాడు. ఇట్లు నిరాకారునిగ, సాకారునిగ ఉన్న పరమాత్మను ఎందరో ఉపాసించుచున్నారు. కొందరు నిరాకారమైన పరమాత్మను చేరుకొనుటకు జ్ఞానాగ్నిచే కర్మను కాల్చివేయుచు జ్ఞానయజ్ఞము చేయువారున్నారు. మరికొందరు సాకారమైన భగవంతుని భక్తితో ఆరాధించువారు గలరు. పరమాత్మ సాకార నిరాకారముగనే కాక ఇంకా ఎట్లున్నాడనగా! క్రింది శ్లోకములో చెప్పుచున్నాడు చూడండి.

(8) శ్లో॥ 16 : అహం క్రతు రహం యజ్ఞః స్వధాఽహ మహ మౌషధమ్ ।
మంత్రోఽహ మహ మే వాఽజ్య మహమగ్ని రహం హుతమ్ ॥
(పరమాత్మ)

**భావము :** నేను క్రతువును, నేను యజ్ఞమును, నేను స్వధయును, ఔషధంబు నేను, మరియు మంత్రము నేను, ఆజ్యమునేను, అగ్ని నేను, హోమము సహితము నేనే అయివున్నాను.

**వివరము :** పరమాత్మ అణువణువున విశ్వమంత వ్యాపించి ఉండుటవలన మనుషులచేత చేయబడు క్రతువు యజ్ఞము ఆయనే అగును. పితృదేవతలకు పెట్టు శ్రాద్ధము, మనము తిను ఆహారములోని ఔషధము కూడ ఆయనే అగును. మరియు హోమములో ఉచ్ఛరించబడు మంత్రము, అక్కడ హోమములో వేయు ఆజ్యము (నెయ్యి), హోమములో మండు అగ్ని హోమము మొత్తము పరమాత్మే అయివున్నాడు. దీనిని బట్టి పరమాత్మకానిది లేనిది ఏదిలేదని తెలియుచున్నది.

*(8) శ్లో॥ 17 : పితాఽహ మస్య జగతో మాతా ధాతా పితామహః ।*
*వేద్యం పవిత్ర మోంకార ఋక్సామ యజురేవచ ॥*
*(పరమాత్మ)*

**భావము :** అఖిల జగతికి తల్లి తండ్రినగుదును, మరియు దాతను, తాతను నేనే అగుదును. తెలుసుకొంటే పవిత్ర ఓంకారమును నేనే. ఋక్, సామ, యజుర్వేదములును నేనే.

*(8) శ్లో॥ 18 : గతి ర్భర్తా ప్రభుస్సాక్షీ నివాస శ్శరణం సుహృత్ ।*
*ప్రభవః ప్రలయ స్థానం నిదానం బీజ మవ్యయమ్ ॥*
*(పరమాత్మ)*

**భావము :** గతియు, ప్రభువు, సాక్షి, సుహృత్ జనుల నివాస శరణములును, పుట్టు స్థలము, లయము జరుగు స్థలము, నిదానము, బీజము, అవ్యయము అన్నియు నేనే.

*(8) శ్లో॥19: తపా మ్యహ మహం వర్షం నిగృహ్ణా మ్యుత్సృజామిచ ।*
*అమృతం చైవ మృత్యుశ్చ సదసచ్చాహ మర్జున ! ॥*
*(పరమాత్మ)*

**భావము :** నేను తపియింప చేయుదును. నేను వర్ష జలమును స్వీకరించి మరల విడుతును. మృత్యువును నేను మరియు అమృతమునేనే. సత్తునేనే అసత్తునేనే.

**వివరము :** జగత్తులో సూర్యరశ్మి అధికము చేసి దానివలన మనుషులు ఎండ వేడిమికి తపించునట్లు చేయువాడు పరమాత్మయే. భూమి మీద కురిసిన జలములన్నియు ఆవిరైపోవునట్లుచేసి లేకుండ చేయువాడు, మరియు వర్షరూపమున నీటిని కురిపించువాడు పరమాత్మయే. సర్వప్రాణులకు మృత్యువు, అట్లే మృత్యువులేని మోక్షము రెండు పరమాత్మయే. ఇంకనూ ఆలోచించి చూచిన శరీరములోని ఆత్మ చైతన్యశక్తి అయిన సత్తు, చైతన్యములేని అసత్తయిన శరీరము రెండు పరమాత్మయే. అన్నిటికి మూలకర్త ఆయనే అయినప్పటికి తన ప్రకృతి ద్వార పనులు చేస్తు నేను చేయలేదంటున్నాడు. చేయనివాడుగనున్నాడు.

*8) శ్లో॥20: త్రైవిద్యామాం సోమపాః పూతపాపాయజ్ఞైరిష్ట్వా స్వర్గతిం ప్రార్థయన్తే*
*తే పుణ్య మాసాద్య సురేంద్రలోకమశ్నన్తి దివ్యాన్ దివిదేవభోగాన్॥*
*(జీవాత్మ, పరమాత్మ)*

*8) శ్లో॥ 21: తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం క్షీణే పుణ్యేమర్త్యలోకం విశన్తి।*
*ఏవం త్రయీధర్మ మనుప్రపన్నా గతాగతం కామకామా లభన్తే॥*
*(జీవాత్మ, పరమాత్మ)*

**భావము :** మూడు విద్యలు నేర్చినవారు, సోమపానులు, పాపములులేనివారు, యజ్ఞములందిష్టము కలవారు, స్వర్గమును పొందుటకు నన్ను ప్రార్థించుచున్నారు. వారు పుణ్యముగలవారై సురేంద్రలోకము పొంది అక్కడ దివ్యమైన దేవభోగములను పొందుచున్నారు. వారు అచట స్వర్గ సుఖములననుభవించి పుణ్యమైపోయిన వెంటనే తగ్గుస్థితికి వచ్చుచుందురు. అట్లు ఆశపరులకు మూడు విద్యల ధర్మములందుండు సుఖఫలములు అశాశ్వతమైనవిగ గలవు.

**వివరము :** భూమి మీద మనుషులలో కొందరు తెలివైనవారుందురు. వారిలో జ్ఞానులు పరమాత్మ విషయమును మాత్రము తెలియుదురు. జ్ఞానులుకాని తెలివైనవారు మూడుగుణములలోని మెలకువలన్ని కలిగి ఎక్కడ ఏమి మాట్లాడాలి, ఎక్కడ ఏమి

చేయాలని బాగా తెలిసివుందురు. ఏ యోగులకు జ్ఞానులకులేని గుణముల తెలివుండుట వలన వారు యోగులు జ్ఞానులకంటే బాగా బ్రతుకగలరు. మూడు గుణాల విద్యలన్ని నేర్చిన దానివలన ఎలా డబ్బు సంపాదించాలన్నది వారికి బాగా తెలుసును. అందువలన వారు బాగా ధనికులుగ ఉందురు. వారు పాపపు పనులు చేయక పుణ్యమువచ్చు పనులనే తెలివిగ చేయుచుందురు. పూర్వము సోమరసమను నేటి ఖరీదైన మత్తుపానీయమును త్రాగుచుందురు. వారు బాహ్యాయజ్ఞములచే దేవతా పూజ చేయించువారై, దానిద్వార స్వర్గసుఖములు కావలెనని ప్రార్థించుచుందురు. అట్టివారు వారి కోర్కెల ప్రకారమే పుణ్యఫల విశేషము వలన జనులలో ఉన్నతస్థితి కల్గిన ఐశ్వర్యవంతుల ఇల్లలో పుట్టి, స్వర్గసుఖములైన దేవతా భోగములను అనుభవించుచుందురు. వారి లోకమే వేరుగ వారు కట్టే బట్ట, తినేతిండి, ఉండే స్థలము అన్నియు భోగములతో కూడుకొన్నవిగనే ఉండును. ఆ లోకపు వారిని అనగ ఆ సెక్షన్ వారిని భూమిమీదనే చూడవచ్చును.

లోకములనగా ఎక్కడోనున్నవని, స్వర్గలోకమంటే పైన ఉన్నదని అనుకోవడము పొరపాటు. లోకములన్ని ఇక్కడ భూమిమీదనే ఉన్నవి. స్వర్గ, నరకలోకములు ఇక్కడే కలవు. ఇంద్రలోకము అందులోని రంభ, ఊర్వసులు కూడ ఇక్కడే కలరు. పుణ్యము చేసుకొన్నవాడు రంభ, ఊర్వసులేమిటి వారికంటే మిన్నగనున్నవారి పొందును కూడ పొందుచున్నాడు. దేవతలనువారు భూమిమీదనే ఉన్నారని ముఖ్యముగ తెలియవలసి ఉన్నది. పై శ్లోకములో చెప్పిన సుఖములన్ని భూమి మీదనే పుణ్యజన్మములో అనుభవించి, ఆ పుణ్యమైపోయిన వెంటనే తగ్గు స్థితికి పోవుచున్నారు. ఎంతో సుఖము అనుభవించినవారు చివరకు ఎన్నో కష్టములననుభవించవలసి వచ్చుచున్నది. ఉన్నతస్థితి నుండి తగ్గుస్థితికి రావడమునే ఊర్ధ్వలోకమునుండి మర్త్యలోకమునకు వచ్చుచుందురన్నారు. ఈ విధముగ సుఖములనుభవించడము, వీటి నుండి దిగజారి క్రిందిస్థాయికి పోవడము, మూడు గుణముల విద్యలు నేర్చినవారికి సహజమే అగును. త్రయీ ధర్మముల (మూడు ధర్మముల)లో అశాశ్వత సుఖములు సహజముగ ఉండును.

జ్ఞానులకు యోగులకు మూడుగుణముల విద్యలో ఆసక్తి లేదు. వారికి స్వర్గలోకసుఖముల ప్రాప్తిలేదు. అటువంటి వారి గూర్చి భగవంతుడు చెప్పునదేమనగా!

(8) శ్లో॥ 22 : అనన్యాశ్చిన్త యన్తోమాం యే జనాః పర్యుపాసతే ।
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ ॥
(జీవాత్మ, పరమాత్మ)

**భావము :** ఎవడైతే అన్యచింత లేకుండ నన్ను ఎల్లపుడు ఉపాసించుచున్నాడో, వాడు నిత్యము నాతో కూడుకొనివున్నాడు. అట్టివాని యోగము యొక్క క్షేమమును నేనే వహించుచున్నాను.

**వివరము :** మానవునికి భక్తి అంటూ ఉంటే అది ఎందరో దేవతలకు సంబంధించి ఉండడము సహజము. భూమిమీద ఎందరో దేవుళ్లుండడము అందరికి తెలిసిన విషయమే. సంపూర్ణ జ్ఞానము తెలియనంతవరకు మానవుడు దేవుళ్లను ఆరాధించడము పరిపాటైపోయింది. దేవుళ్లందరికి దేవుడైన పరమాత్మ ఒకడున్నాడని తెలియకపోవడమే ముఖ్యకారణము. ఎవనికైతే సంపూర్ణ జ్ఞానము తెలియునో వాడప్పుడు భూమిమీదున్న దేవుళ్లందరు తనవలె జీవాత్మలని, తన శరీరములోవలె ఆత్మ జీవాత్మలు వారికి ఉన్నవని తెలిసినవాడై, అందరికి అతీతుడైన ప్రపంచమునకు ఆదికర్తయైన పరమాత్మను తెలియవలెనను పట్టుదలతో ఉండును. అటువంటివాడు వాని మనస్సులో ఇతర దేవతల ఆలోచన రానీయక, ఆత్మకంటే పరమైన పరమాత్మను శ్రద్ధతో ఉపాసించును. పరమాత్మను ఉపాసించుటంటే అందరు ఆచరించునట్లు ప్రత్యేకమైన పూజా విధానమేది కాదని తెలియాలి. జీవాత్మగనున్నవాడు తన స్థితిని కోల్పోయి పరమాత్మలోనికి ఐక్యమగుటకు చేయు ప్రయత్నమని తెలియాలి. దానినే యోగమంటాము. పరమాత్మలోనికి ఐక్యమగుటకు మార్గము యోగము. యోగమవలంభించి దైవమును చేరవలెనని ప్రయత్నించు వానికి ఆరోగ్యము సరిగ లేకుండపోవచ్చును. ఆర్థిక ఇబ్బందులు రావచ్చును. శత్రువుల బాధలు కలగవచ్చును. ఇంటిలో భార్య పిల్లల

యొక్క వ్యతిరేఖత కలుగవచ్చును. ఇట్లు ప్రపంచములో అనేకమైన బాధలు కలిగినప్పటికి వాటినుంచి ఎటువంటి రక్షణగాని, బాధ నివారణగాని, ఆర్థిక సహాయముగాని పరమాత్మ కలుగచేయడు. సహాయముగాని, రక్షణగాని, బాధ ఉపసంహరణగాని యోగికి కలుగ చేయనపుడు వాని క్షేమమును పరమాత్మ ఎలా వహించినట్లవుతుందని మనకు తప్పక ప్రశ్న రాగలదు. ఆ ప్రశ్నకు జవాబును వెదికి చూచినట్లయితే, పరమాత్మను ఆరాధించు యోగిక్షేమమును పరమాత్మ చూడడములేదు. వాని యొక్క అనారోగ్యము నుండి గాని, అన్ని ఇబ్బందులనుంచి గాని కాపాడుతానని ఆయన పై శ్లోకములో చెప్పనూలేదు. ఆయన చెప్పినది కేవలము తనను ఆరాధించు వాని **'యోగము'** యొక్క క్షేమమును కాపాడుతానని చెప్పాడు కాని, ఆరాధించువాని యొక్క క్షేమమును కాపాడుతానని చెప్పలేదు. పై శ్లోకములో **'యోగక్షేమ'** మన్నాడు గాని యోగిక్షేమమనలేదు.

భూమిమీద యోగమాచరించు ఉత్తమ యోగులకు కూడ ప్రపంచములోని మానవుల నుంచి కష్టాలు తప్పలేదనుటకు గత చరిత్రలోను, వర్తమానములోను ఎన్నో ఆధారములు కలవు. సక్రమమైన యోగికి ఎన్ని కష్టాలొచ్చిన, అనారోగ్యమైన ప్పటికి పరమాత్మ మీద దృష్టి మాత్రము సడలదనుటకు కూడ చరిత్రలోను, వర్తమాన కాలములోను ఆధారములు గలవు. వీటినన్నిటిని బట్టి చూచినట్లయితే తనకు కల్గు ప్రపంచ ఒడిదుడుకులన్ని కర్మరీత్య కలుగునవని, తన శ్రద్ధను ఎల్లపుడు పరమాత్మ మీద నిలిపిన యోగి యొక్క యోగము దెబ్బతినకుండ దాని క్షేమమును పరమాత్మయే చూడగలడని తెలియుచున్నది.

*(8) శ్లో॥23 : యేఽప్యన్య దేవతాభక్తా యజన్తే శ్రద్ధయాఽన్వితాః ।*
*తేఽపి మామేవ కౌంతేయ! యజన్త్య విధిపూర్వకమ్ ॥*
*(జీవాత్మ, పరమాత్మ)*

**భావము :** ఎవడు శ్రద్ధతో అన్యదేవతారాధనలాచరించునో వాడు కూడ నన్నే దారి తప్పి ఆరాధించినవాడగుచున్నాడు.

**వివరము :** ముప్పది మూడు కోట్లు దేవతలని నానుడి ఉన్నట్లు, ఎందరో దేవతలుగల భూమి మీద పరమాత్మను విడచి అన్యదేవతారాధన చేయువారు చాలామంది కలరు. పరమాత్మను ఆరాధించువారు అరుదు. కాని దేవతలను కొలుచువారు కొదవలేరు. పాపాత్ములు, దుర్మార్గులు, దొంగలు, జ్ఞానులకు వ్యతిరేఖులు, పరమాత్మంటే ఏమాత్రము విశ్వాసములేనివారు, పరమమూర్ఖులు కూడ ఏదో ఒక దేవతను నిష్టగ పూజించుచుందురు. కోర్కెలు కోరుచుందురు. వారు ఏ దేవతను పూజించిన ఆ పూజ పరమాత్మకే చెందును. అంతట అన్ని దేవుళ్లలోను ఉన్న వాడైన పరమాత్మకు ఆ పూజ చేరినప్పటికి వారు పరమాత్మను చేరలేరు. వారి మనస్సులో వేరు దేవతా ధ్యాసవుండుట వలన వారు మార్గము తప్పినవారై ఉన్నారు. ఎక్కడ ఏ దేవునికి చేసిన పూజనైన స్వీకరించువాడు అంతట వ్యాపించిన పరమాత్మే, అయినప్పటికి పూజచేయువారు పరమాత్మను చేరలేరు. దేవతలను పూజించువారు చివరకు దేవతలవద్దకు చేరవలసిందే.

(8) శ్లో॥ 24 : అహం హి సర్వ యజ్ఞానాం భోక్తా చ ప్రభురేవ చ ।
న తుమా మభిజానన్తి తత్త్వేనాఽతశ్చ్యవన్తితే ॥
(పరమాత్మ)

**భావము :** నేను సర్వ యజ్ఞములకు భోక్తను మరియు ప్రభువును. నేను ఆత్మగ ఉన్నానని తెలియనివారు దారి తప్పి పడినవారగుదురు.

**వివరము :** ఈ శ్లోకములో **తత్త్వేనా** అను పదముకు **ఆత్మగా** అను అర్థమును వదలి యదార్థముగ అని చాలా గీతలలో వ్రాయుట వలన నిజార్థము మరుగునపడి చెప్పవలసిన పూర్తి భావము బయటపడకపోయినది. నిజభావము చెడిపోకపోయిన, పూర్తి వివరము బయటపడకపోయినది. కనుక తత్త్వము అనగ "ఆత్మ" అని అర్థము చేసుకోవడము వలన పూర్తి భావము బయటపడగలదు. మనుషులు చేయు బాహ్య పూజలకు సంబంధించిన యజ్ఞముల గురించి ఇక్కడ చెప్పలేదు. పరమాత్మ

తను చెప్పవలసిన రెండు యజ్ఞములు ఇదివరకే చెప్పియున్నాడు. జ్ఞాన, ద్రవ్య యజ్ఞములనునవి శరీరములో జరుగుచున్నవని కూడ తెల్పాడు. అక్కడే శరీరములో జరుగు యజ్ఞములకు భోక్తను కూడ నేనే అన్నాడు. ఇక్కడ యజ్ఞములకు పెద్ద లేక అధిపతి అయిన ప్రభువును కూడ నేనే అంటున్నాడు. ఆయన ఎట్లు భోక్త, ఎట్లు ప్రభువుగ ఉన్నాడని యోచించిన, శరీరములో ఆత్మ సర్వత్ర వ్యాపించి ఉన్నది. ఆత్మశక్తి చేతనే తలలో జ్ఞానయజ్ఞము గాని, కడుపులో ద్రవ్యయజ్ఞము గాని జరుగుచున్నవి. ఆత్మ చైతన్యములేనిది రెండు యజ్ఞములు జరుగుటకు వీలులేదు. పరమాత్మయే ఆత్మగనున్నది. పరమాత్మ ఆత్మరూపముగ యజ్ఞములకు అధిపతిగ ఉన్నాడు. నన్ను ఆత్మగ తెలియకపోతే అనుచు '**అభిజానన్తి తత్త్వేన**' అన్నాడు. పరమాత్మను ఆత్మగ తెలియకపోతే మోక్షమార్గము నుండి తప్పిపోయిన వాడేయగును.

ఇంతవరకు పరమాత్మ, ఆత్మ, జీవాత్మల విభజన ఏ గీతలో కూడ వ్రాయబడలేదు. అందువలన చాలా భాగము గీత ఎవరికి ఇంతవరకు అర్థము కాలేదని చెప్పవచ్చును. ఆత్మల వివరము తెలిసినపుడు చాలా శ్లోకములకు అర్థము బయటపడును. ఆత్మల వివరము కూడిన ఈ గ్రంథము గీతకు క్రొత్త జన్మనిచ్చినదని చెప్పవచ్చును. అసూయపడక అర్థము చేసుకోమంటున్నాము. అంతేకాక అనేకుల భావమునకు విభేదము కల్గించు భావమున్న క్రింద శ్లోకము చూడుము.

(8) శ్లో॥ 25: యాన్తి దేవవ్రతాన్ దేవాన్, పితౄన్ యాన్తి పితృవ్రతాః ।
భూతాని యాన్తి భూతేజ్యాః యాన్తి మద్యాజినో౭పి మామ్ ॥
(పరమాత్మ)

**భావము :** దేవతా పూజచేయువారు దేవతలందే చేరుదురు. పితృదేవతలను పూజించువారు వారియందే చేరుదురు. భూతముల పూజించువారు భూతములందే చేరుదురు, నన్ను పూజించువారు నాయందే చేరుదురు.

**వివరము :** అన్ని రకముల పూజలను చేయువారందరు కలిపి నాల్గు రకములుగ

విభజించి చెప్పబడినారు. **1) దేవతాపూజ చేయువారు 2) పితృదేవతలను పూజించువారు. 3) జీవరాసులను పూజించువారు 4) పరమాత్మను ఆరాధించువారు.** ఇందులో దేవతా పూజచేయువారిని అందరము చూచేవుంటాము. ఉదాహరణకు ఒక ఊరిలో ఒక వెంకటేశ్వరస్వామి గుడి ఉన్నదనుకొందాము. ఒకడు ఆ గుడికి నిత్యముపోయి ఆ వెంకటేశ్వరస్వామిని శ్రద్ధతో పూజిస్తున్నాడను కొందాము. అలా శ్రద్ధగా పూజచేయుచు, అన్ని దేవతలకంటే ఆ దేవున్నే గొప్పగ భక్తితో ఆరాధిస్తు కొంతకాలము జరిగినది. వానికి మరణమాసన్నమై చనిపోయాడు. తర్వాత జన్మ మనుషులలో పుట్టడము జరుగలేదు. అట్లని వాడు మోక్షము పొందలేదు. ఒక గుడిలోని దేవతా ప్రతిమలో జీవునిగ జన్మ కల్గినది. ఈ మాట విచిత్రముగనున్నది కదా! అయినా వాస్తవమే. ప్రతి గుడిలోని ప్రతిమలో ఒక జీవుడుండును, ఆ ప్రతిమలో దేవుడు అతడేయగును. గుడిలో అనేక భక్తులచేత పూజలు స్వీకరిస్తు వారు పూజించు దేవుడు తానేననుకొన్న ఆ జీవుడు, కొంత కాలానికి వృద్ధాప్యము పొంది మరణావస్థను కూడ పొందవలసి వస్తుంది. సాధారణ మనిషిలో జరుగు శరీర దశలు ప్రతిమ శరీరములోనుండు వానికి కూడ జరుగును. అలా మరణించిన వాడు ఎక్కడికి పోయేది మనకనవసరము. ఇక్కడ మనకు అవసరమైన విషయము ఖాళీగ జీవుడులేని ప్రతిమలోనికి ఒక క్రొత్త జీవుడు వచ్చి చేరుచున్నాడు. అలా చేరినప్పటి నుంచి మనిషి ఆయుస్సువలె దాదాపు వంద సంవత్సరములవరకైన ఆ ప్రతిమలోనే ఆ జీవుడుండవచ్చును. మనము చిన్న తనమునుండి పిలువబడు పేరునే మనదని, కుటుంబీకులనుకొను మతమే తన మతమని, తన కులమని తలచి, నేను పలానవాడిని, నా మతము పలానా అని చెప్పుకొన్నట్లు, గుడిలోని ప్రతిమలో జన్మకల్గినవాడు అక్కడి భక్తులు ఉచ్ఛరించు పేరే తనదని, తాను పలానా దేవుడనని భ్రమించి అనుకొనును. పుట్టక పూర్వము ఏ మతములేని జీవుడు పుట్టిన కుటుంబమునుబట్టి నాది పలానా మతమనుకొని భ్రమించినట్లు, ప్రతిమలోని జీవుడు కూడ నేను పలానా దేవుడని భ్రమించును. అలా ఒక ప్రతిమలోని ఒక జీవుడు ఆ దేవునిగ చలామణి అగుచు తన ముడుపు ఒక పైసా కూడ ప్రక్కకు పోకుండ

చూచుకొనుచు, ఎవడైన ఆ డబ్బును తీసుకొన్న వానికేదో ఒకటి చేసి బాధ పెట్టుచున్నాడనుకొందాము. ఆ దేవుని విషయములో ప్రజలు భయపడి సత్యమున్న దేవుడని పైసా అపహరించిన ముప్పు తప్పదని భయపడెడివారు. అంతేకాక ఆ దేవాలయ ప్రాంగణములో ఏ తప్పు చేసిన ఆ దేవుడు వారికి బాధపెట్టెడివాడు. అందువలన అక్కడ ఎవరు ఏ తప్పు చేయకుండిరి. కొంత కాలమునకు ఆ జీవుడు ఆ ప్రతిమను వదలి మరణించి పోయాడు. ఆ స్థానములో మరొక జీవుడు వచ్చి దేవునిగ చలామణి అగుచున్నాడు. ఈ జీవుని మనస్తత్త్వము ముందున్న జీవునికంటే వేరుగనున్నది. ఎవరేమి చేసినా పట్టించుకొనేవాడు కాదు. అందువలన అక్కడికి వచ్చు భక్తులకు ఆ దేవుడంటే భయము తగ్గిపోయింది. ఈ విధముగ ఒకే ప్రతిమలో కొంత కాలముండు ఒక దేవునికి (జీవునికి) తరువాత వచ్చిచేరి కొంతకాలముండు వేరొక దేవునికి (జీవునికి) చాలా తేడాలుండవచ్చును. మా అనుభవములో ఇప్పటికి దాదాపు 50 సం॥ క్రితము ముడుపు చెల్లించుకొనేదానికి ఒక భక్తుడు ఒక భక్తబృందముతో కలిసి వడ్డికాసులవాడని పేరు పొందిన దేవుడుగల గుడికి పోయాడు. అక్కడ ముడుపులు చెల్లించు సమయములో పూర్తి డబ్బులు హుండీలో వేయక మూడుబొట్లు (10 పైసలు) తనవద్దనే దాచి పెట్టుకున్నాడు. ఆ భక్తునిది చిన్న వయస్సు అయిన దానివలన తెలిసో తెలియకో చిన్న పొరపాటు చేసాడనుకొందాము. 14 సం॥ల బాలుడు తను ధరించిన అంగీ మెడకాలరులో ఆ మూడు బొట్లును చొప్పించి దాచి పెట్టుకొన్నాడు. గుడినుండి బయటికొచ్చిన తరువాత భోజనానికి ఒక జాగాలో వెంటవచ్చిన వారందరు సద్దివిప్పి కూర్చున్నారు. ఆ కాలములో హోటళ్లు చాలా తక్కువ. చాలామంది సద్దిమూట (తినుపదార్థములు) కట్టుక పోయేవారు. తినేదానికి కూర్చున్న ఆ బాలునికి కాళ్లు, చేతులు స్వాధీనములో లేకుండ పోవడము. శరీరమంతా వణుకు ప్రారంభముకావడము, నోటివెంట నా మూడుబొట్లు నాకిమ్మని అనడము జరిగినది. కాళ్లు చేతులు వణుకుచు నా మూడు బొట్లు నాకిమ్మని మాటి మాటికి అనడము అక్కడున్న వారికి ఒక్కమారుగ ఏమి అర్థము కాలేదు. చివరికి ఆ బృందములోని వారికి ఆలోచన వచ్చి శరీరమంత

వెతకగ మూడుబొట్లు షర్టుకాలరులో దొరికాయి. వారు వెంటనే స్వామీ! నీ మూడు బొట్లకు మరీ మూడు బొట్లు వడ్డీగ ఇస్తున్నాము. మమ్ములను క్షమించమని కోరగ ఆ బాలునికి తిరిగి స్పృహ వచ్చినది. వెంటనే ఆరుబొట్లు హుండీలో వేయడము జరిగినది. బాలుడేమో స్పృహలోనికి వచ్చాడు కాని, ఆ దేవుడు శరీరము మీదికి వచ్చి మూడుబొట్లు కావాలని మాట్లాడు సమయములో వచ్చిన వణుకు జీవితాంతము శరీరములో అలాగే నిలిచిపోయినది.

ఆ ప్రతిమలో ఉన్న జీవుడు మనుషులకంటే డబ్బుమీద ఎక్కువ ఆశకల్గి ఒక బాలుని జీవితాన్నే నాశనము చేయడము జరిగింది. కొంత కాలానికి ఆ దేవుడు చచ్చిపోయి మరొక జీవుడు ఆ ప్రతిమలో చేరుకొని ఆ దేవునిగ చలామణి అగుచున్నాడు. ఈయన ఆయనవలె కాక తన సొమ్మును ఎవరెంత తిన్నా, మోసముగ తీసుకొన్న ఏమి పట్టించుకోవడములేదు. ఈ విధముగ ఒకే ప్రతిమలో నివాసమున్న ఇద్దరి దేవుల్లలో వారి వారి మనస్తత్వమును బట్టి ఒకరికొకరికి భేదముండును. మొత్తము మీద దేవతా పూజ చేయువారు ప్రతిమలలో జీవులుగ పుట్టి దేవుళ్లుగ చలామణి అగుదురు.

సంవత్సరమునకు ఒకమారు పెద్దల పండుగ అని ఆ దినము వారింటిలో చనిపోయినవారిని పూజించడము, వారికి గుడ్డలు సమర్పించడము జరుగుచుండును. ఆ విధముగ చాలామంది చేయుచుందురు. కొందరు చనిపోయిన పెద్దలపూజ తప్ప మిగత దేవతలను కూడ పూజించరు. పరమాత్మంటే ఏమిటో పేరుకూడ వారు వినివుండరు. ఏ దేవుని ధ్యాస కూడ లేని అట్టివారు తప్పనిసరి విధిగ పితృదేవతలను ఆరాధించుచుందురు. ఆ విధముగ పితృదేవతలనే గొప్పగ పూజించెడివారు, చనిపోయిన తరువాత జన్మలకు పోక, పితృదేవతలుగనే మారిపోయి తమ కుటుంబీకులు ఆరాధిస్తే, గుడ్డలు అర్పిస్తే స్వీకరించుచుందురు. అలా పూజించక పోయిన గుడ్డలు పెట్టకపోయిన ఇతరుల శరీరములోనికి వచ్చి మాకు గుడ్డలు పెట్టలేదు, సంవత్సరమునకొక మారైన కొబ్బరికాయ కూడ కొట్టలేదని దండించువారు

కూడ కలరు. దేవతా ప్రతిమల జన్మలకంటే ఈ జన్మలు నికృష్ఠమైనవని చెప్పవచ్చును. వారికి చాలా మంది భక్తులుంటే వీరికి వారి కుటుంబమువారు మాత్రమే భక్తులు అదియు సంవత్సరమునకొకమారు.

భూతములను పూజించువారు భూతములలోనికే పోవుదురని కూడ చెప్పారు. భూతములనగ జీవరాసులని అర్థము. మానవులు ఎన్నో భూతములను పూజించుట వాస్తవమే, కాటమయ్య అని కుక్కను, పోతురాజని దున్నపోతును, నాగరాజని పామును, నందీశ్వరుడని ఎద్దును, కామధేనువని ఆవును, జిల్లెడు చెట్టును, జమ్మిచెట్టును, వేపచెట్టును, గరుత్మంతుడను గ్రద్దను ఇట్లు ఒక్కో ప్రాంతములో ఒక్కోరకముగ అనేక జీవరాసులను దేవతలుగ భావించి పూజించెడివారు గలరు. అలా పూజించడము వలన చివరకు ఆ జంతువులుగనో, పక్షులుగనో, చెట్లగనో పుట్టవలసి వస్తుంది. అందువలన భూతములను పూజించువారు భూతములనే పొందుదురన్నారు.

దేవతలను, పితృదేవతలను, జీవులను పూజించక పరమాత్మ విషయ జ్ఞానము తెలిసి, మనస్సులో అన్యచింతలేకుండ యోగపద్ధతి అనుసరించుట వలన పరమాత్మనే చేరవచ్చును. వానికి జన్మలుండవు.

8) శ్లో॥26 : పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి ।
తదహం భక్త్యు పహృత మశ్నామి ప్రయతాత్మనః ॥
(పరమాత్మ)

**భావము :** ఆకు అయిన, పుష్పమైన, పండైన, నీరైన ఎవడు భక్తితో సమర్పించునో, పరిశుద్ధమైన ఆత్మకు భక్తి పూర్వకముగ సమర్పించిన దానిని నేను స్వీకరింతును.

**వివరము :** ఒక ఇంటిలో ఆరు మంది వ్యక్తులున్నారు. వారి పేర్లు వరుసగ 1) లింగడు 2) రంగడు 3) భీముడు 4) సోముడు 5) రాముడు 6) వెంకట్రాముడు.

వీరిని గుర్తించి పిలుచుటకు ఆరు పేర్లు పెట్టబడినవి. రామున్ని పిలిస్తే రాముడే వస్తాడు. రంగన్ని పిలిస్తే రంగడే వస్తాడు. అట్లుకాక రాముడుని పిలిస్తే లింగడు రావడము, లింగన్ని పిలిస్తే సోముడు రావడము జరుగదు. అట్లు వస్తే వారికి పిచ్చి పట్టిందంటాము. వీరి మాదిరే శరీరమను ఇంటిలో 1) మనస్సు 2) బుద్ధి 3) చిత్తము 4) అహము 5) భూతము (జీవుడు) 6) తత్త్వము (ఆత్మ) అను పేర్లు కల్గినవారున్నారు. ఎవరిపేరు పిలిస్తే వారు పలికిన పరవాలేదు. అట్లుకాక ఒకరిపేరు పిలిస్తే మరొకరు పలికిన వారిని తెలివి తక్కువవారనవచ్చును. ఇక్కడ పలికేవారు కరెక్టుగ పలికిన, పిలిచేవారు ఒకరి పేరుపెట్టి ఇంకొకరిని పిలిచారనుకొందాము. అపుడు పిలిచేవారే బుద్ధిహీనులని చెప్పవచ్చును. ఇదంతా ఎందుకు చెప్పుచున్నా మనగా! ఈ శ్లోకములో అలాగే వ్రాయబడివుంది. '**ప్రయతాత్మనః**' అను మాటకు ఒకరేమో పరిశుద్ధమైన బుద్ధి అన్నారు. మరొకరేమో పరిశుద్ధమైన మనస్సు అన్నారు. శరీరమనే ఇంటిలో తత్త్వము అనువాడు వేరు, బుద్ధి అనువాడు వేరు, మనస్సు అనువాడు వేరు, వేరు వేరుగనున్న వారిని శ్లోకములో తత్త్వము అని చెప్పినప్పుడు దానిని బుద్ధియని ఒకరు చెప్పడము, మనస్సని మరొకరు చెప్పడము చూస్తే ఏమనిపిస్తుంది? వారికి పిచ్చియనిపిస్తుంది కదా! 'ప్రయతాత్మనః' అన్నపుడు పరిశుద్ధమైన ఆత్మ అని అర్థము. ఆత్మను వదలి ప్రక్కవారిని చెప్పుకోవడము పొరపాటు. ఇటువంటి మాటలను చూచి హేతువాదులు ఆధ్యాత్మికము, ఆత్మ అన్ని బూటకము అంటున్నారు.

పత్రమ్, పుష్పమ్, ఫలమ్, తోయమ్ అనువాటిలో దేవునికి ఏ ఒక్కదానితోను అవసరము లేదు. అయినప్పటికి వీటి పేర్లు చెప్పడములో కొంత విశేషముందను కుంటాము. తోయము అనగా నీరు, పత్రము అనగా చెట్టుకున్న ఆకు, అలాగే పుష్పము, ఫలము నాలుగు చెట్టుకున్నవే. సాధారణముగ ఆకు చెట్టు మీద ఒక సంవత్సరము వరకు ఉండి రాలిపోవును. ఫలము కొన్ని దినముల వరకుండును. పుష్పము ఒక్క దినము మాత్రముండును. ఈ మూడిటిలో ఉన్న నీరు మాత్రము

శాశ్వితముగ ఉండును. ఈ విధముగ ఒక్క దినము మాత్రముండు పుష్పమునుగాని, ఒక వారము దినములుండు ఫలమునుగాని, ఒక సంవత్సర కాలముండు ఆకునుగాని, శాశ్వితముగ ఉండు నీరునుగాని చెప్పడములో అశాశ్వితమైనవి మూడు, శాశ్వితమైనది ఒకటిగా అర్థమైనది. అశాశ్వితమైన వాటిలో కూడ ఒక దినము, ఒక వారము, ఒక సంవత్సరకాలము వరకుండు వాటిని చెప్పాడు. ఈ మూడు చర ప్రకృతికి సంబంధించినవి. శాశ్వితమైన నీరు మాత్రము అచర ప్రకృతికి సంబంధించినది. ఈ విధముగనే మన శరీరములో కొంత తేడాలతో మార్పు చెందు మూడు గుణ భాగములు, ఏ తేడా లేకుండ మార్పు చెందని ఆత్మ భాగము గలదు. మూడు గుణములలోని తామసుడు, రాజసుడు, సాత్త్వికుడు అను జీవుడు ఎప్పటికైన నాశనముకాగల అశాశ్వితమైనవాడని, ఆత్మ భాగములోనున్న వాడు నాశనము కానివాడని తెలియుచున్నది. శాశ్వితముకాని గుణములను, శాశ్వితమైన యోగమును వదలినవాడు నావద్దకు చేరునని చెప్పడమే ఈ శ్లోకములోని అర్థము.

లోతుగ యోచించక పోతే ఈ శ్లోకము వేరు విధముగ అర్థమై ఆకు, పూవు, కాయ, నీరు అనియే తెలియును. ఈ నాల్గింటిలోని నిగూఢార్థము తెలియదు. 1) ఇక్కడ నాలుగింటిని మాత్రమే ఎందుకు చెప్పాడు? ఐదుకాని, మూడుకాని ఎందుకు చెప్పలేదు? 2) అన్ని చెట్టుకున్నవే ఎందుకు చెప్పవలెను? 3) నాల్గవదైన నీరు కల్గిన ఆకు, పూవు, పండునునే ఎందుకు చెప్పాడు? 4) మనకున్న ధనమో, ధాన్యమో, వస్తువో, వాహనమో ఇవ్వమని అడగక ప్రత్యేకించి ఆకు, కాయ, పూవు, నీరు అని అడగడమేమిటి? 5) ఏ చెట్టు లేనిచోట మనిషి ఉంటే అక్కడ ఇవి ఏవి లభించవు కదా! అపుడు వీటికంటే చౌకగ దొరుకు, ఎక్కడైన లభించు మన్నునైన ఇవ్వవచ్చని ఎందుకనలేదు? ఈ విధముగ ఎన్నో ప్రశ్నలు వేసుకుంటే దేవుని ఉద్ధేశ్యము మనకు తెలియగలదు. ఇక్కడున్న ఐదు ప్రశ్నలకు జవాబుల రూపములో చెప్పుకుంటే ఈ విధముగ కలవు.

**1) నాల్గింటిని మాత్రమే ఎందుకు చెప్పాడు? ఐదుకాని, మూడుకాని ఎందుకు చెప్పలేదు?**

జవాబు : మ్రొక్కే వానిలో సమర్పించుకోవలసినవి నాలుగు మాత్రమే ఉన్నాయి. పరమాత్మలోనికి ఐక్యమవడానికి, మోక్షమను ఐదవస్థానమును పొందడానికి, మనిషి వదలవలసినవి నాలుగు స్థానములే, కనుక నాల్గింటిని మాత్రమే చెప్పవలసివచ్చినది.

**2) అన్ని చెట్టుకున్నవే ఎందుకు చెప్పవలెను ?**

జవాబు : దేవునికి అర్పించవలసినవి ఆరాధించే మనిషిలోనే ఉన్నాయి. మనిషిలో ఉన్నట్లు సమాన పోలిక కలది భూమి మీద చెట్టు మాత్రమే ఉన్నది. శాశ్వత అశాశ్వతములైనవి మనిషిలో ఉన్నట్లు అశాశ్వతమైన ఆకులు, పూవులు, కాయలే కాక శాశ్వతమైన నీరు కూడ చెట్టులో కలదు. అందువలన చెట్టుకున్న వాటినే శ్లోకములో చెప్పారు.

**3) నాల్గవదైన నీరు కల్గిన ఆకు, పూలు, పండునే ఎందుకు చెప్పారు ?**

జవాబు : మనిషిలో మూడు గుణ భాగములు కలవు. అట్లే గుణాతీతమైన గుణములు లేని ఒక భాగము కలదు. మూడు గుణ భాగములలోను ఒక శక్తి వ్యాపించి ఉన్నది. కనిపించక వ్యాపించిన శక్తి శరీరములో అన్నిటికి ఆధారమై కదలించు చైతన్యమై ఉన్నది. ఆత్మశక్తి మూడు గుణ భాగములకు మధ్యనున్న నాల్గవ స్థానములో ఉన్నది. నాల్గవ స్థానములోనున్న ఆత్మశక్తి మూడు స్థానములకు కూడ ఆధారమై ఉన్నది. ఏ విధముగ ఆకులోను, పూవులోను, పండులోను తేమ వ్యాపించియున్నదో ఆ విధముగనే మనిషి యొక్క తామస, రాజస, సాత్త్వికమను భాగములలో ఆత్మ వ్యాపించియున్నది. చెట్టంతయు నీరు వ్యాపించి ఉన్నట్లు శరీరమంతయు ఆత్మ వ్యాపించియున్నది. ఆకు, పూవు, కాయలలో ఏ విధముగ నాల్గవదైన నీరు వ్యాపించియున్నదో, అదే విధముగ నీరువలె ఆత్మ వ్యాపించియున్నది. కావున చెట్టుకున్న ఆకు, పూలు, కాయలనే చెప్పారు.

**4) మనకున్న ధనమో, ధాన్యమో, వస్తు వాహనమునో అడగక ప్రత్యేకించి ఆకు, పూవు, కాయ, నీరు అని అడగడమేమిటి ?**

జవాబు : దేవుడు అడిగితే ఎంత విలువకల్గిన వాటినైన ఇచ్చుటకు సిద్ధముగనున్న మనుషులు భూమి మీదుండగా, అడగకనే కోట్ల డబ్బును, విలువైన వజ్రాలను హుండీలలో వేయు భక్తులుండగా, అడిగేదేదో పెద్దవి అడిగి ఉండవచ్చును కదా! లేకపోతే అడుగకుండ అయిన ఉండాలి. అడిగి మరీ అంత చౌకైన వాటిని కోరడము చూస్తే, దేవుడు చాలా తెలివి తక్కువవానిగ కన్పిస్తున్నాడు కదా! **ప్రపంచములోని గొప్ప తెలివున్న వారిలోని తెలివిని కూడ నేనే, అన్నవాడు తెలివితక్కువ వాడెట్లగును? ఆయన చెప్పిన దానిని అర్థము చేసుకోలేని మనుషులే తెలివితక్కువ వారు.** దేవుడు తాను గీచిన దేహమనబడు గీతలోపలి విషయమునే సూత్రము ప్రకారము కోరుచున్నాడు కాని, శరీరము యొక్క హద్దుకు బయటనున్న వస్తువులను కోరలేదు. ఆకులు, కాయలు, పూలు, నీరు శరీరమునకు బయటివే కదా! అని కొందరికి ప్రశ్న రావచ్చును. దానికి జవాబు, చెట్టు కూడ ఒక శరీరమేనని, అందులో కూడ జీవుడున్నాడని మరచిపోకూడదు. జీవుడు దేవుని వద్దకు చేరవలెనంటే, జీవాత్మ నాలుగు స్థాయిలను దాటి పోవలసిందే, ఆ నాలుగు స్థాయిలను సమానముగ తెలుపునవి చెట్టులోని నాల్గు భాగములే, ఆధ్యాత్మిక ప్రమాణమునకు సరిపడునవి చెట్టులోని ఆకులు, పూవులు, కాయలు, నీరు కనుక వాటినే పేరుపెట్టి చెప్పవలసివచ్చినది. దేవునికి వస్తు వాహనములతో గాని, ధన కనకములతో గాని పనిలేదు. అందువలన దేవునికి అవసరములేని డబ్బును, వజ్రాలను, బంగారును సమర్పించే దానికంటే గుణాలున్న మరియు గుణములులేని వాటిని ఆయనకు ఇవ్వడము మంచిది. ఆ విధానమును తెల్పుటకే ప్రత్యేకించి **"యాన్తి దేవ వ్రతాన్ దేవాన్"** అను శ్లోకము తర్వాత ఈ విషయమును చెప్పాడు. దీనికంటే ముందు శ్లోకములో దేవతలను పూజించువాడు, దేవతలనే చెందుతాడు నన్ను చెందడన్నపుడు, దేవతల యొక్క పూజలనే దేవుడు వద్దని చెప్పినట్లు కదా! అటువంటపుడు గుడికి పోయి పూజలో ఆకులు, కాయలు, పూలు, నీళ్లు పెట్టమని చెప్పునా! మీరే

ఆలోచించండి. దేవతారూపములే ఆరాధనలో లేనపుడు పూలు, కాయలు ఎక్కడ పెట్టాలని యోచించారా? యోచిస్తే కాయలు, పూవులు, ఆకులు వెనుక పెద్ద రహస్యమే అర్థము కాగలదు.

**5) ఏ చెట్టు లేనిచోట మనిషి ఉంటే అక్కడ ఇవి ఏవి లభించవు కదా! అపుడు వీటికంటే చౌకగా దొరుకు, ఎక్కడైన లభించు మట్టినైన ఇవ్వవచ్చునని ఎందుకనలేదు?**

జవాబు : కొన్ని భగవద్గీతలలో కొందరు రచయితలు ఇది బీద భక్తులను గురించి చెప్పిన శ్లోకమని వ్రాశారు. మరియు "ధనికులు సమర్పించే నైవేద్యములు, ధనము, బంగారు మా వద్దలేదే అని చింతించ తగదు. దేవునికి భక్తితో పత్రము, పుష్పము, ఫలము, తోయము అను వాటిని ఇచ్చిన సరిపోవును. ఇవి విలువ లేనివే అని ఏమి అనుకోక దేవుడు వాటిని కూడ ప్రేమతో తీసుకొనును" అని వ్రాశారు. ఈ విషయమును చదివిన ఒక పిల్లవాడు ఈ విధముగ మాట్లాడుచు "ధనికులైన భక్తులు తిరుపతి వెంకటేశ్వర స్వామికి ప్రతిరోజు కొన్ని కోట్ల డబ్బును, ఎంతో విలువ చేసే బంగారును, ఖరీదైన వజ్రాలను హుండీలో వేసి వస్తున్నారు కదా! ఏమిలేని బీద భక్తులు తిరుపతికి పోతే వారిని కూడ వదలకుండ పూలో, కాయలో, ఆకులో ఇవ్వమని అడగడము చూస్తే దేవుడు చాలా ఆశపోతని, బీదవారి దగ్గరనుండి కూడ ఏదో ఒకటి తీసుకోవాలను ఆశకల్గినవాడని మాకు అర్థమవుతుంది. బజారులో పూలు అమ్మేవాల్లే పూల ప్రక్కనే ఆకులు అమ్ముతున్నారు. కాయలమ్మే చోటే వాటర్‌బాటిల్లు (నీళ్ల సీసాలు) అమ్ముతున్నారు. నీళ్లుకాని, పండ్లుకాని, పూలుకాని, ఆకులుకాని అన్ని కొనవలసిందే, డబ్బులు లేని భక్తునికి వాటిని కొనాలన్నా ఇబ్బందే కదా! ఇదంతా చూస్తూవుంటే వచ్చేటపుడు ఉత్తచేతుల రావద్దు ఏదో ఒకటి తీసుకొనిరా అని పుట్టింటినుంచి వచ్చే కోడలుకు అత్తగారు చెప్పినట్లువుంది. ఏదో ఒకటి లాభము రావాలని చివరకు పూలు, కాయలు, ఆకులు, నీళ్లు అడుగుచున్న దేవుడు చాలా ఆశగలవాడే" అని అమాయకముగ అడిగాడు. ప్రక్కనేవున్న మరొక

పిల్లవాడు ఏదో ఒకటి దేవుడు మనకివ్వాలి కాని, దేవుడే ఏదో ఒకటి ఇమ్మని మనలను అడగడమేమిటని ప్రశ్నించాడు. ఇలాంటి ప్రశ్నలు ఇతరులకు కూడ వచ్చి వారి మనస్సులో దేవునికున్న విలువ పోయే అవకాశము గలదు. అందువలన ఇతర భగవద్గీతలలో చెప్పినట్లు ఈ శ్లోకము బీద భక్తులకు చెప్పినది కాదని, ఈ శ్లోకములోని విషయమును మనుషులందరికి చెప్పినదని గ్రహించుకోవలెను.

పై ఐదవ ప్రశ్నకు జవాబును చూస్తే దేవుని దృష్ఠిలో ఖరీదైనవని, చౌకగ లభించునవని భావములేదు. ఏ చెట్టులేని చోట మన్ను లభించుననుట వాస్తవమే అయినప్పటికి, ఆయన బయట కనిపించే చెట్లను గురించి, వాటికి లభించే ఆకులు, పూలు, కాయలను గురించి చెప్పలేదు. అందరి శరీరములోనున్న చెట్టును గురించి చెప్పాడు. కొంత జ్ఞానము తెలిసినవాడు శరీరమునే వృక్షముగ తలచి, అందులోని ఆత్మశక్తినే నీరుగ, పూవులను, కాయలను, ఆకులను మనలోపలనున్న గుణస్థానములుగ తలచి, దేవుడు వాటిని వదలుకొమ్మన్నాడని గ్రహించవలసియున్నది. లోదృష్ఠి లేకుండ బయటి దృష్ఠితో చూస్తే అంతా అపార్థమే అగును. చివరకు దేవుడు కూడ మనుషులవలె ఆశగలవానిగ అర్థమగును. అట్లుకాక దేవుడు చెప్పినది ఆత్మజ్ఞానమని, ఆధ్యాత్మికముతో తనవద్దకు చేరు సూత్రములను తెలియచేశాడని, జ్ఞానముతో చూచినపుడే దేవుని శ్లోకము పూర్తి అర్థము కాగలదు. **దేవుని వలననే అన్ని మనకు లభ్యమగుచున్నపుడు, అన్నిటిని దేవుడే సృష్ఠించుచున్నపుడు, దేవునికి వాటితో పనేమి ఉంటుందని యోచించండి.** ఈ శ్లోకము ప్రకారము నడుచుకోవాలంటే ఏ విధముగ ఉండాలో ఆ విధానమును కూడ క్రింది శ్లోకములోనే చెప్పాడు. ఈ శ్లోకముకంటే ముందు చెప్పిన శ్లోకములో ఏమి చెప్పాడో, ఈ శ్లోకము తర్వాత ఏ విధముగ చెప్పాడో, పరిశీలిస్తే మధ్యనున్న ఈ శ్లోకము యొక్క అసలైన పూర్తి భావము అవగాహన కాగలదు. అందువలన అన్ని భగవద్గీతలలో ఈ శ్లోకమును చదివినట్లు ఇక్కడ లేదని తెలుపుచున్నాము. అందరిది కాదని నీవు చెప్పే అర్థము ఏ నిఘంటువులో ఉందని మాత్రము అడుగవద్దండి.

(8)శ్లో॥ 27 : యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసియత్ ।
యత్తపస్యసి కౌంతేయ! తత్కురుష్వమదర్పణమ్ ॥
(పరమాత్మ, కర్మయోగము)

**భావము :** దేనిని చేయుచున్నావో, దేనిని తినుచున్నావో, దేనిని కాల్చుచున్నావో, దేనిని ఇచ్చుచున్నావో, దేనిని తపము చేయుచుంటివో అన్నియు నాకే సమర్పించుము.

**వివరము :** చేయుచున్నవాడు పరమాత్మకు సమర్పించిన సమర్పించకున్నా పరమాత్మకే చేరును. సమర్పించుకున్న ఎడల చేసిన దానిలోని కర్మ అంటదు. సమర్పించక పోయినట్లయితే చేయుచున్న కర్మ అంటును. ఎటూ పరమాత్మకే చేరును. కనుక ఆయనకే అన్ని సమర్పించుట తెలివైనవాని పనియగును. అట్లుకాక మిగతా దేవతలకనో, లేక మనుషులకనో, దైవసమర్పణ చేసినవాడు తెలివి తక్కువవాడగును.

(8)శ్లో॥ 28 : శుభాశుభ ఫలైరేవం మోక్ష్యసే కర్మబంధనైః ।
సన్న్యాస యోగ యుక్తాత్మా విముక్తో మాపైష్యసి ॥
(పరమాత్మ, కర్మయోగము)

**భావము :** ఈ ప్రకారముగ శుభాశుభ ఫలములగు కర్మ బంధములనుండి బయటపడినవాడు, సన్న్యాసయోగ యుక్తాత్ముడైన వాడు విముక్తిగల్గి నన్నే పొందును.

(8) శ్లో॥ 29 : సమోహం సర్వ భూతేషు నమేద్వేష్యోఽస్తి న ప్రియః ।
యే భజన్తి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహామ్ ॥
(పరమాత్మ)

**భావము :** సముడనగుదు నేను సర్వ జీవరాసులకు. నాకు ద్వేషిలేడు మరియు ప్రియుడులేడు. భక్తితో ఎవరు కొలుతురో వారియందు నేను, నాయందు వారు కలరు.

**వివరము :** సర్వ జీవరాసులకు పరమాత్మ సమానముగ ఉన్నాడు. ఆయనకు

ఒకడు మిత్రుడని మరియొకడు శత్రువను భావము ఏమిలేదు. ఆయనకు మనము సమానమే అయినప్పటికి మనకు ఆయన సమానముకాదని చెప్పవచ్చును. పరమాత్మ అందరిని ఒకే దృష్టితో చూచుచున్నప్పటికి, మనము ఆయనను ఒకేదృష్టితో చూడలేదు. ఒక్కొక్కడు ఒక్కొక్కరకముగ ఆయనను చూస్తున్నారు. అందువలన ఆయనకు అందరు సమానమే అయిన అందరికి ఆయన సమానముకాలేదని చెప్పవచ్చును. ఎవరెవరి భావమును బట్టి వానికి పరమాత్మ అంతంతే ఉండును. దగ్గరగ భావించుకొన్న వానికి దగ్గరగ ఉండును. దూరముగ భావించుకొన్నవానికి దూరముగ ఉండును. అలాగే నీవు ఏ దృష్టితో చూచిన ఆ దృష్టికి తగినట్లే తెలియును. పరమాత్మయందే ధ్యాసకల్గిన వారికి పరమాత్మ ధ్యాస కూడ వారియందే ఉండును. ఎవరైతే ఆయన ప్రతిరూపమైన ఆత్మతో కలిసి ఉన్నాడో, వారితో కూడ ఆయన కలిసి ఉన్నాడు.

*(8)శ్లో॥ 30 : అపి చే త్సు దురాచారో భజతే మా మనన్యభాక్ ।*
*సాధు రేవస మన్తవ్య స్సమ్యగ్వ్య వసితో హిసః ॥*
*(జీవుడు, పరమాత్మ)*

**భావము :** పెద్ద దురాచారపరుడైనప్పటికి నన్ను మనస్సులో భజించుట వలన, వాడు నిశ్చయముగ నన్ను తెలియదగినవాడు, కనుక వానిని సాధువని చెప్పవచ్చును.

**వివరము :** దుర్మార్గున్ని సాధువు అనడమేమిటి? చెడ్డవానిని మంచివాడనడమేమిటని ఇక్కడ అనుమానము రాకమానదు. పరమాత్మను తెలియగోరి మనస్సులో భజించువానిని, అనగ కర్మయోగ ఆచరణకల్గి పరమాత్మను చేరవలెనని గట్టి నిశ్చయము కలవాడు, వాని పూర్వ కర్మరీత్య ప్రపంచములో చెడుపనులే చేయుచు దురాచారుడని పేరుగాంచినప్పటికి, పరమాత్మ దృష్టిలో వాడు సజ్జనుడనియే చెప్పవచ్చును. ఎందుకనగ వానికి దురాచార కర్మయైన పాపము అంటలేదు. వానికి పరమాత్మ మంచిగనున్నాడు కావున పరమాత్మకు వాడు మంచివాడేనని తెలియాలి.

(8) శ్లో॥ 31 ః క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాన్తిం నిగచ్ఛతి ।
కౌంతేయ! ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి ॥
(జీవుడు, పరమాత్మ)

**భావము :** అట్టివాడు శీఘ్రముగ ధర్మాత్ముడై శాశ్వత శాంతిని పొందుచున్నాడు. నా భక్తుడు చెడిపోడని ప్రతిజ్ఞ చేసి చెప్పుచున్నాను.

**వివరము :** ప్రపంచములో ఎంత దుర్మార్గుడైనప్పటికి పరమాత్మను చేరవలెనను కాంక్ష కలిగినవాడు తొందరగ (ధర్మాత్ముడై) ధర్మములతో కూడిన ఆత్మగలవాడై, ముక్తిపొంది శాశ్వత శాంతియైన పరంధామమును చేరును. పరమాత్మను ఆత్మ మూలముగ ఆరాధించినవాడు ఎప్పటికి చెడిపోడని మంచి స్థితినే పొందునని, ఆత్మపరముగ వానికి మించిన లాభము పొందువాడు భూమిమీదలేడని ప్రతిజ్ఞచేసి చెప్పవచ్చును. ప్రపంచరీత్య ఎట్లున్న పరమాత్మరీత్య ధర్మాత్ముడైన వాడు చెడిపోడని ప్రతిజ్ఞగ దేవుడే చెప్పాడంటే అదెంత గొప్ప విషయమో ఆలోచించండి.

(8) శ్లో॥ 32 ః మాం హి పార్థ! వ్యపాశ్రిత్య యేஉపిస్యుః పాపయోనయః
స్త్రియో వైశ్యా స్తథా శూద్రా స్తేஉపి యాన్తి పరాంగతిమ్ ॥
(పరమాత్మ)

**భావము :** పాపయోని సంభవులు, వైశ్య శూద్ర జనులు నన్నాశ్రయించి పరమ గతిని పొందుచున్నారు.

**వివరము :** పరమాత్మను సాధించు యోగము స్త్రీలు చేయకూడదను నియమము లేదు. శరీరము అపరిశుద్ధముగనున్నను మనస్సు పరిశుద్ధముగ ఉండవలెనను సూత్రము ప్రకారము ఎట్టి పరిస్థితులలోను కూడ స్త్రీలు యోగమాచరించవచ్చును. పెద్దకులమను వైశ్యులు, తగ్గుకులమను శూద్రులు పరమాత్మకు సమానమే. కావున ఏ కులమువారైనను యోగమాచరించవచ్చును. అంతేకాక నీచుల గర్భములో పుట్టినవారు కూడ యోగమాచరించవచ్చును. వీరందరు పరమాత్మను ఉపాసించి

మోక్షము పొందవచ్చును. వీరే మోక్షము పొందుచున్నపుడు వీరికంటే గొప్పయిన బ్రహ్మజ్ఞానులు, రాజర్షుల గురించి వేరే చెప్పనేల అంటున్నాడు చూడండి.

*(8)శ్లో॥ 33 : కిం పున ర్బ్రాహ్మణాః పుణ్యాభక్తా రాజర్షయస్తథా ।*
*అనిత్య మసుఖం లోక మిమం ప్రాప్య భజస్వమామ్ ॥*
*(పరమాత్మ)*

**భావము :** పుణ్యముచేసి పుట్టిన బ్రాహ్మణుల, రాజర్షుల గూర్చి వేరే చెప్పనవసరము లేదు. అనిత్యము అసుఖము గల గుణము (లోకము)లందున్నప్పటికి నన్ను భజించి నన్నే పొందుదురు.

**వివరము :** శూద్రుడు అనగ క్షుద్రమైనపనులు చేయువాడు. నీచయోనిలో పుట్టినవారు పరమాత్మను ఆరాధించి పరమపదము పొందుచుంటే బ్రాహ్మణులను, రాజర్షులను గురించి వేరు చెప్పనవసరము లేదు. బ్రాహ్మణులనగ బ్రహ్మజ్ఞానము తెలిసినవారని అర్థము. అంతో ఇంతో బ్రహ్మజ్ఞానము తెలిసినవారు, పరమాత్మ విలువ తెలిసినవారు సులభముగ యోగమాచరించి మోక్షము పొందవచ్చును. రాజర్షులనువారికి, మోక్షమునకు దగ్గరగ ఉన్నవారికి, మోక్షమార్గములో కొంత ప్రయాణించినవారికి మరీ సులభముగ ముక్తి లభించును. ఇంతకీ రాజర్షులనగా ఎవరనిన పూర్తి వివరము తెలుసుకొందాము.

బ్రహ్మజ్ఞానము తెలిసి దానిప్రకారము యోగమాచరించు వారికి జ్ఞానాగ్ని లభించునని ముందే తెలుసుకొన్నాము. అలా లభించిన జ్ఞానాగ్ని శిరస్సునందు చేరి అక్కడ నిలువయుండి అక్కడే గల కర్మను కాల్చుచుండును. అలా కర్మను కాల్చుటకు కొన్ని జన్మలు పట్టునని కూడ తెలుసుకొన్నాము. మొదట చిన్న కణముగా పుట్టిన జ్ఞానాగ్ని కాలము గడుచుకొలది, యోగము ఆచరించుకొలది, పెరుగుచూ పోయి చివరకు పెద్ద అగ్నిగోళముగ మారును. యోగుల శరీరములో ఉన్న **'జ్ఞానాగ్ని పెరిగిన కొలత'**ను బట్టి యోగుల గొప్పతనమును గుర్తించవచ్చును. యోగ సమయములో లభించిన జ్ఞానాగ్ని ఆ సమయములో కర్మను కాల్చును.

యోగము చేయని సమయములో కర్మను కాల్చక నిలిచియుండును. తిరిగి యోగము చేయు సమయములో జ్ఞానాగ్ని పెరుగుచుండును, కర్మను కాల్చుచుండును. యోగము ఆచరించగా ఆచరించగా జ్ఞానాగ్ని పెరుగుతూ పోవుచుండును. కర్మ తీవ్రత ఎక్కువవుంటే అగ్ని ఎక్కువ ఖర్చగును. అటువంటి వారికి సంపూర్ణ అగ్ని నిలువగల్గుటకు చాలాకాలము పట్టును. తీవ్రకర్మలు లేనివారికి అగ్ని తక్కువ ఖర్చగుచు మిగులుచుపోవును. వారికి అగ్ని సంపూర్ణ స్థితికి చేరుటకు తక్కువ కాలము పట్టును. ఎంత తక్కువ కాలమైన సంవత్సరములలో ఉండును. జ్ఞానాగ్ని శరీరములో ఎంత సాంద్రతతో నిలువగల్గునో ఆ సాంద్రత పొందిన వానిని సంపూర్ణయోగి అనవచ్చును. సంపూర్ణ యోగి అయిన తరువాత కూడ కర్మ కొంతకాలము కాలవచ్చును.

యోగుల శరీరములోని తలలో నిలువవుండు జ్ఞానాగ్ని యొక్క పూర్ణత్వమును బట్టి సంపూర్ణ యోగులు, అసంపూర్ణ యోగులని యోగులను విభజించ వచ్చును. జ్ఞానాగ్ని సాంద్రతను బట్టి యోగుల యోగ్యతను పూర్వము పెద్దలు ముందే నిర్ణయించి పెట్టారు. ఆ నిర్ణయము ప్రకారము యోగులు నాల్గు హోదాలు కల్గివున్నారు. **1) మహర్షి 2) రాజర్షి 3) దేవర్షి 4) బ్రహ్మర్షి.** యోగుల తలలోపల జ్ఞానాగ్ని ప్రకాశము యొక్క సంపూర్ణత్త్వములో ***పావు భాగమున్న వానిని మహర్షి అనవచ్చును. అర్థభాగమున్న వానిని రాజర్షి అనవచ్చును. మూడొంతులున్న వానిని దేవర్షి అనవచ్చును. సంపూర్ణత్వముగ అగ్ని ప్రకాశమున్నవానిని బ్రహ్మర్షి అనవచ్చును.*** ఇక్కడ వివరించబడిన మహర్షులు, రాజర్షులు, దేవర్షులు, బ్రహ్మర్షులు పూర్వముండెడివారని చరిత్రలో తెలియుచున్నది. విశ్వామిత్రుడు పట్టుదల కలిగి ఒకే జన్మలో మహర్షి స్థాయి నుండి రాజర్షి, దేవర్షి స్థాయిలు పొంది చివరకు బ్రహ్మర్షి స్థాయిని కూడ పొందినట్లు తెలిసిన విషయమే. జ్ఞానాగ్ని ఉన్నవారు మహర్షులు, రాజర్షులు, దేవర్షులు, బ్రహ్మర్షులు కాగ ఏమాత్రము జ్ఞానాగ్నిలేని వారిని బేవర్షులు అనెడివారు. కొంచెమైన జ్ఞానాగ్నిలేని బేవర్షులు కూడ పరమాత్మను

ఆరాధించి చివరకు మోక్షమును పొందుచుండగ బ్రహ్మజ్ఞానము తెలిసిన వారిని, రాజర్షులైనవారిని గూర్చి చెప్పనవసరము లేదని ఈ శ్లోకములో భగవంతుడు చెప్పాడు.

*(8) శ్లో॥ 34 : మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు ।*
*మా మే వైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః ॥*
*(సాకారము, నిరాకారము)*

**భావము :** నీవు నా మీదనే మనస్సునుంచుము, నాకు భక్తునిగనుండుము. నన్నే నమస్కరించుము, నన్నే ఆరాధించుము. నా మీద ధ్యాస కల్గి ఆత్మతో కూడిన నన్నే పొందగలవు.

**వివరము :** ఈ శ్లోకములో సాకార భగవంతున్ని, నిరాకార పరమాత్మను రెండిటిని గూర్చి చెప్పబడివున్నదని గ్రహించవలెను. **'యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః'** అను వాక్యము నిరాకార పరమాత్మ సంబంధమైనది. దీనిలో 'నా ధ్యాసతో ఆత్మయందు కూడుకొన్నవాడు' అని చెప్పబడినది. ఆత్మ నిరాకారమైనది ఆత్మతో కూడుకోవడము అనగా యోగము చేయడము. కనపడని పరమాత్మ కొరకు కనిపించని ఆత్మను యోగము చేత ధ్యాస కల్గివుండువాడు చివరకు మోక్షము పొందును. ఇదొక పద్ధతికాగ, సాకార సంబంధమైనది మరొక పద్ధతి గలదు. సాకార పద్ధతనగ కనిపించు విగ్రహాలను పూజించడము కాదు. పరమాత్మయే భగవంతునిగ పుట్టినప్పుడు కనిపించు శరీరముగల ఆ భగవంతున్ని పూజించడము, నమస్కరించడము, ఆయన మీదనే మనోధ్యాస కల్గివుండడము. అలాగే ఆయనకే మనము భక్తులుగవుండడము సాకారమునకు సంబంధించినదగును. సాకార ఆరాధన సామాన్యముగ లభించునది కాదు. పరమాత్మ భగవంతునిగ వచ్చు రాకయే ఎవరికి తెలియదు. ఆ రాకను తెలియడమే కష్టము. ఆయన భూమి మీద ఉన్నప్పుడే సాకారపూజ సాధ్యమగును. ఆయన ఎల్లప్పుడు భూమిమీద ఉండువాడు కాదు. కావున ఎల్లప్పుడు ఆచరించుటకు అనువైనది నిరాకార ఆరాధనయేనని తెలియుము. నిరాకారముగనో, సాకారముగనో ఆయనను ఆరాధించుట వలన ఆయననే పొందగలరని తెలిపారు. ఇదియే అతి

రహస్యమైనది. అతి పెద్దదైన విద్యయని తెలియాలి. ఇంతటితో ఈ రాజవిద్యా రాజగుహ్య యోగమను అధ్యాయము సమాప్తము.

ఇందులోని శ్లోకముల వివరము క్రిందగలదు.

| | | | |
|---|---|---|---|
| 1) | ధర్మములు | – | 3 |
| 2) | పరమాత్మ | – | 17 |
| 3) | పరమాత్మ, సాకారము | – | 2 |
| 4) | పరమాత్మ, జీవాత్మ | – | 8 |
| 5) | జీవాత్మ, ప్రకృతి | – | 1 |
| 6) | పరమాత్మ, కర్మయోగము | – | 2 |
| 7) | నిరాకారము–సాకారము | – | 1 |
| | మొత్తము శ్లోకములు | – | 34 |

భావము, వివరము మార్చి వ్రాసిన శ్లోకములు – 13,22,24,25,26.

*****

తొమ్మిదవ అధ్యాయము

# విభూతి యోగము

**శ్రీ భగవంతుడిట్లనియె :-**

*(9)శ్లో॥ 1 : భూయ ఏవ మహాబాహో! శృణు మే పరమం వచః ।*
*యత్తే హం ప్రీయమాణాయ వక్ష్యామి హితకామ్యయా ॥*
*(జ్ఞానము)*

**భావము :** దేనిని నేను ప్రీతితో నీ హితముకోరి చెప్పితినో మరల శ్రేష్ఠమైన ఆ మాటలనే వినుము.

**వివరము :** పరమాత్మను గురించి భగవంతుడు ఇప్పటికే చాలా విషయములు తెలియజేశాడు. వినేవాని హితము కోరి తెలియ చెప్పానన్నాడు. అయినప్పటికి ఇంకా తెలియజేయుచున్నాను వినుము అన్నాడు. ఈ విషయములన్ని అర్జునునికి కాదు వాస్తవముగ మనకేనని తలచవలెను. అట్లనుకొనుటవలన భగవంతుడు చెప్పువిషయముల మీద ధ్యాస శ్రద్ధ పెరుగును.

*(9)శ్లో॥ 2 : న మే విదు స్సురగణాః ప్రభవం న మహర్షయః ।*
*అహ మాద్విర్థి దేవానాం మహర్షీణాం చ సర్వశః ॥*
*(సాకారము)*

**భావము :** దేవతలు, మహర్షులు నా ప్రభవమును తెలియరు. దేవతలకు, మహర్షులకు నేను ముందున్నవాడను, గొప్పవాడను.

**వివరము :** పుణ్యఫలము ఎక్కువగుట వలన భూమిమీదనే ఇష్ట సుఖములను అనుభవించువారు దేవతలు. అలాగే భూమిమీదనే జ్ఞానాగ్నిని సంపాదించుకొన్న వారు మహర్షులు. దేవతలు, మహర్షులు ఇరువురు పరమాత్మ పుట్టుకను తెలియరు.

దేవతలు మహర్షులు భూమిమీదనే ఉన్నారు. పరమాత్మ ప్రభవము (పుట్టుక) భగవంతునిగ భూమిమీదనే జరుగుచున్నది. భూమిమీద భగవంతునిగ పుట్టు పరమాత్మను ఇక్కడే ఉన్న దేవతలు, మహర్షులు కూడ తెలియలేకున్నారు.

దేవతలకున్న పుణ్యములోను, మహర్షులకున్న జ్ఞానశక్తిలోను ఇద్దరికి ముందున్నవాడు పరమాత్మ. ఇద్దరికంటే గొప్పవాడైనందున ఆయనను గూర్చి తెలియలేకున్నారు. తెలియాలని ప్రయత్నము చేస్తే తప్ప పరమాత్మ భగవంతునిగ తెలియడు. అదియు కష్టతరమైన పని. అలా తెలిసినవారు చాలా అరుదు.

(9) శ్లో॥ 3 : యో మా మజ మనాదిం చ వేత్తి లోక మహేశ్వరమ్ ।
అసమ్మూఢ స్స మర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే ॥
(పరమాత్మ)

**భావము :** నాకు ఆది అనునదిలేదని, అట్లే పుట్టుకలేదని, లోకములకెల్ల మహేశ్వరుడనని ఎవడు తెలియునో వాడు మూఢత్వము నుండి బయటపడి సర్వ పాపములనుండి ముక్తి పొందును.

**వివరము :** పరమాత్మకు మొదలేదో ఎవరికి తెలియదు. అది అగమ్యగోచరము. అందరివలె పుట్టుక కూడ లేదు. ఇక్కడ భగవంతునిగ పుట్టుచున్నది కదా అని కొందరడుగవచ్చును. పరమాత్మ నిరాకారమునుండి సాకారమునకు వస్తున్నాడు కాని అందరివలె జన్మకాదు. జన్మకున్న లక్షణాలు అక్కడలేవు. స్త్రీ పురుష సంబంధముతోనే అందరికి జన్మలు కలుగుచున్నవి. పరమాత్మ పురుష సంబంధము లేని స్త్రీయందు కూడా పుట్టగలడు. అనగా అందరివలె అది జన్మకాదని తెలియాలి. అంతేకాక సర్వలోకములకు మహేశ్వరుడని తెలిసినవారు, మూఢత్వములేనివారై సర్వ కర్మములనుండి బయటపడగలరు. ఎందుకనగ వారియందు జ్ఞానాగ్ని తయారై వారి కర్మలను కాల్చివేయుచున్నది. జ్ఞానము పెరిగి మూఢత్వమును ప్రక్కకు త్రోయుచున్నది.

(9)శ్లో॥ 4 : బుద్ధి ర్జ్ఞాన మసమ్మోహః క్షమా సత్యం దమ శ్శమః ।
సుఖం దుఃఖం భవోఽ భావో భయం చాఽ భయ మేవ చ ॥
(పరమాత్మ)

(9)శ్లో॥ 5 : అహింసా సమతా తుష్టి స్తపో దానం యశోఽ యశః ।
భవన్తి భావా భూతానాం మత్త ఏవ పృథ గ్విధాః ॥
(పరమాత్మ)

**భావము :** బుద్ధి, జ్ఞానము, నిర్మోహము, ఓర్పు, సత్యము, ఇంద్రియనిగ్రహము, సుఖము, దుఃఖము కలుగుట కలుగకుండుట, భయము, నిర్భయము, అహింస, సమదృష్ఠి, తృప్తి, తపస్సు, దానము, కీర్తి, అపకీర్తి అనేక విధ భావములు జీవరాసులకు నావలననే కల్గుచున్నవి.

(9)శ్లో ॥ 6 : మహర్షయ స్సప్త పూర్వే చత్వారో మనవ స్తథా ।
మద్భావా మానసా జాతా యేషాం లోక ఇమాః ప్రజాః ॥
(పరమాత్మ)

**భావము :** మొదట ప్రపంచములో సప్త మహర్షులు, చతుర్ మనవులు నా సంకల్పము చేత తయారైనాయి. తర్వాత వాటి వలన సమస్త జీవరాసులను సృష్ఠించాను.

**వివరము :** మొట్టమొదట సృష్ఠి ఎలా జరిగినది భగవంతుడు ఈ శ్లోకములో సూచన ప్రాయముగ తెలియజేశాడు. సైన్యములో సిగ్నల్ సెక్షన్ అను విభాగము ఒకటి కలదు. అందులో కొన్ని సిగ్నల్స్‌కు (గుర్తులకు) కొన్ని అర్థములు నిర్ణయింపబడి ఉండును. ఆ విభాగములో శిక్షణ పొందిన వారికే ఆ సిగ్నల్స్‌కు అర్థము తెలియును. వైర్‌లెస్ ఆపరేటర్లు తాము మాట్లేడే విషయము శత్రువులకు అర్థము కాకుండ మాట్లాడుటకు ఒక పెద్ద విషయమునకు చిన్న కోడ్‌ను (గుర్తును) పెట్టుకొని మాట్లాడుచుందురు. ఆ విధముగనే ఈ శ్లోకములో పెద్ద విషయమును తెలియజేయు

చిన్న కోడ్ కనిపిస్తూయున్నది. అందువలన సూచన ప్రాయముగ తెలియ జేశాడన్నాము. ఇందులోని గుప్తమైన విషయము తెలియక సప్త ఋషులు, నలుగురు సనకసనందాలు, నలుగురు మనువులు మొత్తము 15 మంది సృష్టాదిలో పుట్టారని కొందరు వ్రాశారు. మరి కొందరేమో ఏడుమంది ఋషులను, నలుగురు మనువులను మొత్తము 11 మందిని దేవుడు సృష్టించాడని వ్రాశారు. అట్లు తయారైన వారివలననే మిగత మనుషులు జీవరాసులు పుట్టాయని వ్రాశారు. ఈ విషయమును చూచిన హేతువాదులు మొదట స్త్రీలే లేకుండ పురుషులకే మిగత సంతతియంత ఎట్లు పుట్టిందని ప్రశ్నిస్తున్నారు. ఇటువంటి కొన్ని అర్థము కాని విషయములను పట్టుకొని భగవద్గీత భూటకమని, మనుషులు కల్పించుకొన్న గ్రంథమని హేళనగ మాట్లాడు చున్నారు. అటువంటి హేతువాదులను దృష్టిలో పెట్టుకొని వారికి నా జ్ఞానము యొక్క గట్టు కూడ దొరకకుండ చేస్తానని గీతలోనే దేవుడు చెప్పాడు. అటువంటివారు దేవుని జ్ఞానమునకు దూరముగ పోవునట్లు, వారికి అర్థము కాకుండునట్లు, ఇప్పటి వరకున్న గీతలలో కొంతవరకే వివరమును రచయితల చేత దేవుడే వ్రాయించాడను కొందాము.

ఇప్పుడు ఇక్కడ మేము వ్రాయు విషయమును కూడ ఎందరో విమర్శించు వారుంటారు. ఏ ఆధారముతో చెప్పారని ప్రశ్నించువారుండవచ్చును. ముందే చెప్పానుగ కోడ్ తెలియకపోతే విషయము అర్థముకాదని. అందువలన ఈ విషయము కొందరికి మాత్రము అవగాహనకు రాగలదు. ఇక్కడ బుద్ధిని ఉపయోగించి అవగాహన కొరకు ప్రయత్నించండి. ఆదిలో సృష్టికి పూర్వము క్రింద భూమిగాని, పైన ఆకాశముగాని, మధ్యలో గాలి, అగ్ని, నీరుగాని ఏవీలేని కాలమది. ప్రపంచమను పంచభూతములు గాని, జగతి అను జీవరాసులు గాని లేనపుడు కూడ కాలమనునది ఉన్నది. ఆ కాలమునకు గంటలుగాని, ఘడియలుగాని లేవు. ఏమాత్రము ఎవరికి వ్యక్తముకాని ఆ సమయములో అవ్యక్తమైన, అగమ్యమైన, అగోచరమైన ఒకే ఒక పరమాత్మ మాత్రము మిగిలి ఉండెడిది. అటువంటి పరమాత్మ నుండి పరమాత్మ ఇష్టముతోనే దాదాపు పరమాత్మంత బలము కల్గిన ప్రకృతి

అనబడునది పరమాత్మ చేతనే సృష్ఠింపబడినది. ఏమీలేని, ఏదీ కాని శూణ్యమునుండి మొట్టమొదట తయారైనది ప్రకృతి. ప్రకృతి పుట్టిన తర్వాత ఐదు భాగములుగ విడిపోయినది. ఆ ఐదు భాగములే ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి అనబడునవి. ఈ ఐదింటిని ప్రపంచము అనుచున్నాము. ఈ విధముగ మొదట జీవరాసులు లేని ప్రపంచము ఏర్పడినది. మొదటనే పరమాత్మ పురుషునిగ ఉంటూ, తనచేత తయారుచేయబడిన ప్రకృతిని స్త్రీ తత్త్వము కల్గిన దానిగ పరమాత్మే (దేవుడే) ఉంచాడు. ఆడతనము గల ప్రకృతిని ఐదు భాగములుగ మార్చినవాడు పరమాత్మయే. పంచము వలన ఏర్పడిన దానిని ప్రపంచమనడము జరిగినది. ఏ జీవరాసి లేని ఆ ప్రపంచములో మొట్టమొదట పరమాత్మనుండి కొంత భాగము విడిపోయి వచ్చినది, అదియే ఆత్మ అని పిలువబడుచున్నది. మొదట ప్రకృతి ఒక్కటిగా తయారై ఐదుగ విడిపోయినట్లు, మొదట పరమాత్మనుండి వచ్చిన ఆత్మ ఏడు భాగములుగ విడిపోయినది. ఆత్మను సుఖదుఃఖములకు అతీతమైన ఆనందమను చున్నాము. అందువలన బ్రహ్మానంద అనియు, మహర్ష అనియు ఆత్మకు పేరు కలదు. మొదట ఆత్మ పరమాత్మనుండి పుట్టుకొచ్చిన తర్వాత ఏడు భాగములుగ పరమాత్మ చేతనే విభజింపబడినది. విభజింపబడిన ఆత్మయొక్క ఏడు భాగములను మహర్షయ సప్త అని అన్నారు. **మహర్షయ సప్త అనగా ఆత్మ యొక్క ఏడు భాగములని అర్థము. ఈ విధముగ మొదట పరమాత్మచేత ఏర్పడినవే సప్త మహర్షలు, ఇంతవరకు ఎవరికీ అర్థముకాని విషయము ఇదియే.** సప్త మహర్షలు అయిన ఆత్మ భాగములు సప్తమహర్షులను మనుషులుగ మనకు అర్థమైనది. మనకెట్లు అర్థమైన మొదట తయారైనది సప్తమహర్షులు కాదు, సప్తమహర్షలని తెలియవలెను.

పరమాత్మ మొదట తనకు సమానముగ ఉండునట్లు ప్రకృతిని తయారు చేశాడని తెలుసుకొన్నాము. ప్రకృతి ఐదు భాగములుగ తయారై ప్రపంచము ఏర్పడిన తర్వాత ఆత్మ అనునది ఏర్పడినది. పరమాత్మకు తోడుగ ప్రకృతి ఉండగ, ఆత్మకు తోడుగ మరొక ప్రకృతి ఏర్పడినది. పరమాత్మ యొక్క అంశ ఆత్మకాగ,

ప్రకృతి యొక్క అంశ మరొక ప్రకృతిగ విభజింపబడినది. పరమాత్మకు తోడుగ ఏర్పడిన మొదటి ప్రకృతికి మార్పు చెందని ప్రకృతి అని పేరు గలదు. దానినే అచర ప్రకృతి అంటున్నాము. ఆత్మకు తోడుగ ఏర్పడిన రెండవ ప్రకృతికి మార్పు చెందే ప్రకృతి అని పేరుగలదు. దానినే చర ప్రకృతి అంటున్నాము. ఈ విధముగ పరమాత్మ, ఆత్మ అను రెండు ఆత్మలు కాగ, అచర ప్రకృతి, చర ప్రకృతి అని రెండు ప్రకృతులు తయారైనవి.

పరమాత్మనుండి తయారై వచ్చిన ఆత్మ సప్త మహర్షులుగ, అనగా ఏడు ఆత్మ భాగములుగ విభజింపబడినదని చెప్పుకొన్నాము కదా! పరమాత్మ సప్త మహర్షలను తయారు చేసిన తర్వాత చర ప్రకృతిని ఆధారము చేసుకొని మొదట మనస్సును తర్వాత అహమును, చిత్తమును, బుద్ధిని వరుసగ తయారు చేశాడు. ఈ నాలుగింటిలో మొదట తయారైన మనస్సు మినహా అహము, చిత్తము, బుద్ధి మూడు కొంత ఆత్మ భాగమును చుట్టుకొని బంతిలాగ ఏర్పడినవి. మూడు పొరల మధ్యన కొంత ఆత్మ భాగము చిక్కుకొనగ అదియే జీవాత్మ అయినది. బుద్ధి, చిత్తము, అహము మధ్యన నిలిచిపోయిన ఆత్మ యొక్క అంశను జీవాత్మ అంటున్నాము. ఈ విధముగ జీవాత్మ తయారైన వెంటనే ప్రకృతి రెండవ భాగము వలన శరీరమంత ఏర్పడినది. ఇట్లు ఏర్పడిన శరీరమంత మనస్సు వ్యాపించినది. ఈ విధముగ ఒక మనిషి యొక్క నమూనా మొదట తయారైనది. ఆత్మయొక్క ఏడు భాగములను దేవుడు "మహర్షయ సప్త" అనగా మహర్షులు ఏడుగురను తప్పు భావము మనుషులకు వచ్చినట్లు, "చత్వారో మనవ" అనగానే నలుగురు మనువులు అని అర్థము చేసుకొన్నారు. ఇది పూర్తి తప్పు భావము. మొదట సప్త మహర్షులను గాని, నలుగురు మనువులను గాని దేవుడు తయారు చేయలేదు. ప్రపంచముతో పాటు ఏడు ఆత్మ భాగములను, వాటికి ఆధారముగ నాలుగు ప్రకృతి భాగములను తయారుచేశాడు. వీటినే మహర్షులుగ, మనువులుగ మనము తప్పు అర్థము చేసుకోవడము వలన సృష్టి విధానము అర్థము కాకుండపోయి రహస్యముగ మిగిలిపోయింది. అదియే సృష్టి రహస్యము.

మొదట దేవుడు మనిషి యొక్క నమూనాను ప్రకృతిని, ఆత్మను ఉపయోగించి తయారుచేశాడు. తర్వాత దాని ప్రకారము మిగత జీవరాసులనన్నిటిని సృష్ఠించానన్నాడు. మొదట 108 ఆత్మలను ప్రపంచములోనికి దేవుడు పంపి 108 మంది మనుషులను తయారగునట్లు చేశాడు. ఆ 108 మందిలో 54 మంది పురుషులుగ, 54 మంది స్త్రీలుగ తయారగునట్లు చేశాడు. 54 మంది పురుషులలో 27 మందిని మంచి గుణములు కలవారిగ, 27 మందిని చెడు గుణములు కలవారిగ సృష్ఠించాడు. అదే విధముగ స్త్రీలలో కూడ 27 మంది మంచి గుణములు కలవారిగ, 27 మంది చెడు గుణములు కలవారిగ తయారు చేశాడు. ఈ లెక్కను మూడింతలు చేసి 108 సాత్త్వికులుగ, 108 రాజసులుగ, 108 మందిని తామసులుగ మొత్తము 324 మంది మనుష జాతిని తయారు చేశాడు. అందులో 162 మంది స్త్రీలుకాగ 162 మంది పురుషులని వారిలో 81 మంది మంచి స్త్రీలు, 81 మంది చెడు స్త్రీలని తెలుసుకోవలెను. అట్లే పురుషులలో కూడ మంచి చెడువారు గలరని తెలుసుకోవలెను. ఇది ఒక మానవజాతి గణితముకాగ ఇటువంటి మిగత 323 జాతులను మొదట దేవుడు తయారుచేశాడు. ప్రతి జాతిలోను సగము సంఖ్య స్త్రీ, సగము సంఖ్య పురుషులుగ చేశాడు. మనుషులుకాక మిగత 323 జాతులలో ఒక్కొక్క జాతికి 324 సంఖ్య ప్రకారము మొత్తము 1,04,652 జీవరాసులు తయారైనవి. ఈ లెక్కప్రకారము ఆదిలో పుట్టిన మొత్తము జీవరాసుల సంఖ్య 1,04,976 అని తెలియుచున్నది. ఈ సంఖ్యలన్నిటిని కలిపితే అంత్యములో 7 సంఖ్య మిగులుచున్నది. ఇది మొదట తయారైన ఆత్మకు గుర్తు అని తెలియవలెను. తర్వాత ఏ జాతికి ఆ జాతి సంతతిని పెంచుకొనునట్లు దేవుడు చేశాడు. సృష్ఠి ఆదిలో 162 మంది పురుషులతో, 162 మంది స్త్రీలతో మొదలైన మానవజాతి నేడు వందలకోట్లలోనికి చేరిపోయినది. అట్లే అన్ని జీవజాతులు పెరిగాయి. మొదట 324 జాతులతో మొదలైన జగతి నేడు వర్ణసంకరము వలన మరికొన్ని జాతులుగ పెరిగినదేమో చెప్పలేము. కొందరు 84 లక్షల జాతులు కలవని అంటున్నారు.

అయినప్పటికి 84 లక్షల జాతులు శాస్త్రబద్ధము కాదేమోననిపిస్తుంది. మొదట తయారైన జీవరాసుల జాతులు 324 కాగ అందులో 108 అండజములుగ, 108 పిండజములుగ, 108 ఉద్భిజములుగ తయారు చేయబడినవి. అందులో పిండజములైన మానవులు నాలుగు జాతులుగ గలరు. మానవుల నాలుగు జాతులుపోగా 104 జాతులు పిండమునుండి పుట్టునవి. 108 జాతులు అండము నుండి పుట్టునవి, 108 జాతులు భూమినుండి పుట్టునవి గలవు. పంచభూతములు కూడ 108 పదార్థములుగ తయారు చేయబడి, వాటిలో పుట్టు మూడు రకముల జాతులు 108 రకములుగనే ఉన్నవి. అంతేకాక పైకి పెరుగునవి, క్రిందికి పెరుగునవి, అడ్డముగ పెరుగునవి అని మూడు విధములుగ 324 జాతులు తయారు చేయబడినవి. 324 జాతులలో క్రిందికి పెరుగునవి మానవ జాతులు కేవలము నాలుగురకములు కాగ, 160 రకములు పైకి పెరుగు చెట్ల జాతులు కాగ, 160 రకములు ప్రక్కకు పెరుగు క్రిమి, కీటక, జంతు, మత్స్య జాతులై ఉన్నవి. జాతుల సంఖ్య బ్రహ్మవిద్యా శాస్త్రబద్ధముగ మొత్తము 324 జాతులేకాగ, ఒక్కొక్క జాతి ఎంత సంఖ్యలో ఉన్నది చెప్పలేము. జీవరాసుల సంఖ్య మార్పుచెందు ప్రకృతికి లేదా పదార్థమునకు సంబంధించి ఉండును. కావున భౌతిక శాస్త్రవేత్తలు ఆ సంఖ్యను చెప్పవచ్చును. జీవరాసుల జాతులను చెప్పగలది బ్రహ్మజ్ఞానము. జీవరాసుల సంఖ్యను చెప్పగలుగునది ప్రపంచ జ్ఞానము అని తెలుసుకోవలెను.

ఈ శ్లోకములో **"మహర్షయ సప్త"** అను పదమును ఏడు ఆత్మ భాగములుగ, **"చత్వారో మనవ"** అను పదమును మనస్సు మొదలగునవి నాలుగు అని అర్థము చేసుకోవలెను. అట్లు కాక సప్త ఋషులు అనిగాని, నలుగురు మనువులు అనిగాని అర్థము చేసుకొంటే శ్లోకములోని నిజ భావము అర్థము కాకుండ పోయి అనేక ప్రశ్నలుద్భవించును. వాటికి జవాబు దొరకదు. ఈ శ్లోకములో మొదట ఏడు, తర్వాత నాలుగు పుట్టిన పిదప అన్ని జీవరాసులు పుట్టాయనుట గ్రహించవలెను. మొదట జీవరాసులులేని పంచభూతములను ప్రపంచము అన్నాము. తర్వాత పుట్టిన జీవరాసినంతటిని జగతి అంటున్నాము. ప్రపంచమును జగతిని కలిపి

విశ్వము అంటున్నాము. ప్రపంచము వేరు, జగతి వేరని తెలియవలెను. రెండు కలిసినది విశ్వమని తెలియవలెను. తర్వాత అధ్యాయములో ప్రపంచము జగతి కలిసిన విశ్వరూపమైన దేవున్ని గురించి తెలుసుకొందాము.

(9) శ్లో ॥ 7 : ఏతాం విభూతిం యోగం చ మమ యో వేత్తి తత్త్వతః ।
సోఽవికంపేన యోగేన యుజ్యతే నాత్ర సంశయః ॥
(పరమాత్మ)

**భావము :** నా మహత్యమును, యోగమును, ఆత్మను ఎవడు తెలియగల్గునో, వాడు చలనములేని నాలో కూడుకొనును. దీనియందు అనుమానము లేదు.

**వివరము :** పరమాత్మ యొక్క గొప్పతనమేమిటో, ఆయన మహత్యమేమిటో, ఆయనను పొందుటకున్న యోగములేమిటో, ఆయనను పొందుటకు మార్గమై, ఆధారమైయున్న ఆత్మ ఏమిటో తెలుసుకొనినవాడు, చలనములేని మార్పులేని పరమాత్మను పొందగలడు. జ్ఞానము తెలిసినవాడు, ఆత్మను తెలిసినవాడు, పరమాత్మ విశేషము తెలిసినవాడు తప్పనిసరిగ పరమాత్మను పొందును. ఇందులో ఏమాత్రము అనుమానము లేదు.

(9) శ్లో॥ 8 : అహం సర్వస్య ప్రభవో మత్త స్సర్వం ప్రవర్తతే ।
ఇతి మత్వా భజన్తే మాం బుధా భావ సమన్వితాః ॥
(పరమాత్మ)

**భావము :** నా వలననే సర్వము పుట్టుచున్నవి. నా వలననే సర్వము వర్తించుచున్నవి. ఈ విషయము తెలిసిన జ్ఞానులు, సమన్విత భావముతో నన్ను ఆరాధింతురు.

**వివరము :** సర్వప్రపంచము పరమాత్మనుండియే పుట్టినదని, ఈ సర్వ జగత్తు పరమాత్మ వలననే నడువగల్గుచున్నదని, ప్రపంచములో జరుగు ప్రతిదానికి పరమాత్మయే మూలకారణమని తెలిసిన జ్ఞానులు సమత్వముకల్గు స్థితియైన యోగముచే పరమాత్మను ఆరాధించెదరు.

(9) శ్లో॥ 9 : మచ్చిత్తా మద్గత ప్రాణా బోధయన్తః పరస్పరమ్ ।
కథయ న్త శ్చ మాం నిత్యం తుష్యన్తి చ రమన్తి చ ॥
(పరమాత్మ)

**భావము :** నా భక్తులు చిత్తమును ప్రాణమును నాయందుంచి, నిత్యము నన్ను గూర్చిన విషయములను ఒకరికొకరు బోధించుకొనుచు తృప్తులై ఆనందముగ ఉందురు.

**వివరము :** పరమాత్మ మహత్యమును తెలిసిన భక్తులు ప్రపంచ విషయములలో లేని సంతోషము పరమాత్మ విషయములు మాట్లాడుటలో పొందుదురు. ఎంత పెద్ద ప్రపంచ విషయములున్నను వాటికి విలువనివ్వక పరమాత్మ విషయాలలోనే ఎక్కువ ధ్యాసనుంచి మాట్లాడుకొనుచుందురు. పరమాత్మ జ్ఞానవిషయములు మాట్లాడు సమయములోనున్న తృప్తి, ఆనందము, మిగత విషయములలో వారికుండదు. అందువలన వారి ధ్యాసనంతయు పరమాత్మ విషయములలో లగ్నముచేసి, ఒకరికొకరు ఆ విషయములను గూర్చి చెప్పుకొనుచు ఆనందించుచుందురు.

(9) శ్లో॥ 10 : తేషాం సతత యుక్తానాం భజతాం ప్రీతి పూర్వకమ్ ।
దదామి బుద్ధి యోగం తం యేన మా ముపయాన్తితే ॥
(పరమాత్మ)

**భావము :** ఎవడైతే ప్రీతికరముగ నన్నే ఆరాధిస్తు ఎల్లప్పుడు నాతో కూడుకొని ఉండవలెనని తలచునో, అట్టివానికి బుద్ధియోగము నేను కలుగజేయుచున్నాను. దానిచేత నన్ను తెలియగలరు, పొందగలరు.

**వివరము :** పరమాత్మ విషయాలే ఆనందదాయకముగ ఉన్నవాడు ప్రీతి పూర్వకముగ ఎల్లప్పుడు పరమాత్మతోనే సంబంధము పెట్టుకోవాలని తలచుచుండును. అట్టివానికి పరమాత్మ బుద్ధియోగమును కలుగజేయును. ఆ బుద్ధియోగముచే పరమాత్మను సులభముగ తెలియనగును. ఇచట బుద్ధియోగమని చెప్పబడివున్నది. బుద్ధి

యోగమనగ బ్రహ్మయోగమని కొందరు, కర్మయోగమని కొందరు చెప్పుకొనుచున్నారు. దాని వివరమేమనగా! బ్రహ్మయోగమాచరించు సమయములో మనస్సు ఇతర ఆలోచనమీదికి పోయినపుడు బుద్ధియే మనస్సును హెచ్చరించి సక్రమమార్గములో ఉండమని మనస్సును ఆదేశించును. అదే విధముగ కర్మయోగము ఆచరించునపుడు అహము పనిచేసిన, బుద్ధియే గ్రహించి అహమును అణిగిపొమ్మని ఆదేశించును. రెండు యోగములలో బుద్ధియే మనస్సుకు, అహముకు హితము చెప్పుచుండుట వలన రెండిటిని బుద్ధియోగమే అంటున్నాము. పరమాత్మ బుద్ధియోగము ప్రసాదించాడంటే రెండు యోగములలో ఏదైన ఒకటి కావచ్చును. లేక రెండు యోగములైన కావచ్చును.

*(9) శ్లో॥ 11 : తేషా మేవానుకమ్పార్థ! మహ మజ్ఞానజం తమః ।*
*నాశయా మ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా ॥*
*(పరమాత్మ)*

**భావము :** అట్టివారిని ఉద్ధరించుటకొరకు వారియందు ఆత్మగానున్న నేను జ్ఞాన దీపమును వెలుగజేసి అజ్ఞాన చీకటిని లేకుండ చేయుదును.

**వివరము :** తనను ఇష్ట పూర్వకముగ చేరవలెనని కోరికగలవారికి, యోగము లభ్యమగునట్లు చేసిన పరమాత్మ, వారిలో దాగియున్న అజ్ఞాన సంశయములు ఏవీ యోగభంగము చేయకుండునట్లు, ఆ సంశయములకు జవాబులు వాని శరీరమందే పుట్టునట్లు చేయుచున్నాడు. అజ్ఞానాంధకారమను సంశయములకు జ్ఞానదీపకాంతి యగు జవాబులు కలుగజేయుచున్నాడు. వెలుగుతో చీకటెట్లు మాయమగునో అట్లే సంశయములన్ని జ్ఞానముతో పటాపంచలగును. సంశయములులేనివారు నిరాటంకముగా ముక్తి పొందవచ్చును.

ఈ మాటలువిన్న అర్జునుడు ఈ విధముగ అంటున్నాడు

**అర్జునుడిట్లనియె :-**

(9) శ్లో॥ 12 : పరం బ్రహ్మ పరంధామ పవిత్రమ్ పరమం భవాన్ ।
పురుషం శాశ్వతం దివ్య మాదిదేవ మజం విభుమ్ ॥

(9) శ్లో ॥13 : ఆహు స్త్వా మృషయ స్సర్వే దేవర్షి ర్నారద స్తథా ।
అసితో దేవలో వ్యాస స్స్వయం చైవ బ్రవీషి మే ॥

(9) శ్లో ॥14 : సర్వ మేత దృతం మన్యే యన్మాం వదసి కేశవా! ।
నహి తే భగవన్ వ్యక్తిం విదుర్దేవాన దానవాః ॥

(9) శ్లో॥15 : స్వయమే వాత్మనాత్మానం వేత్థత్వం పురుషోత్తమ! ।
భూత భావన! భూతేశ! దేవదేవ! జగత్పతే! ॥

**భావము :** పరబ్రహ్మవు, పరంధామము, పవిత్రుడవు, శ్రేష్ఠుడవు, పురుషుడవు, శాశ్వతుడవు, దివ్యుడవు, ఆది దేవుడవు, అజుడవు, విభుడవు అనుచు నారదుడు, అసితుడు, దేవలుడు, సప్తఋషులు, వ్యాసుడు చెప్పుచుండిరి. ఇపుడు నీవే స్వయముగ చెప్పగ వినుచున్నాను.

ఏది నాకు చెప్పితివో అదియంతయు సత్యమైనదని మనసులో తలచు చున్నాను. నీ యొక్క అసలు స్వరూపము దేవతలు, దానవులు కూడ తెలియలేకున్నారు.

సకల భూతములను సృజించువాడవు, సకల జీవులను పాలించు వాడవు, దేవతలకు దేవుడవు, జగమునకు భర్తవైన ఓ పురుషోత్తమా! నిన్ను నీవే తెలుసుకోగలవు.

**వివరము :** పూర్వము పెద్దలైన సప్తఋషులు, నారదుడు మొదలైన వారందరు పరమాత్మను గూర్చి పెద్దగ చెప్పియున్నారు. ఆయనను గూర్చి ఎవరు ఎంత చెప్పిన అది పూర్తి విషయముకాదనియే చెప్పవచ్చును. వారు చెప్పినదానికంటే కూడ ఎన్నో రెట్లు గొప్పవాడు పరమాత్మ. అందువలన అర్జునుడు కూడ నిన్ను గూర్చి నీకే తెలియును. నిన్ను గూర్చి నీవు చెప్పవలసిందే అన్నాడు. వాస్తవముగ ఎవరికి

అర్థముగానంత మహిమ, గొప్పతనము కలవాడు పరమాత్మ. ఆయన విషయమును గురించి ఆయననే అడుగవలసిందే కాని ఎవరినడిగిన లాభములేదు. అందువలన అర్జునుడు కూడ ఇదే విషయము అడుగుచున్నాడు.

(9) శ్లో ॥ 16 : వక్తు మర్హ స్యశేషేణ దివ్యా హ్యాత్మ విభూతయః ।
యా భిర్విభూతి భిర్లోకా నిమాంస్త్వం వ్యాప్య తిష్ఠసి ॥

(9)శ్లో ॥17 : కథం విద్యా మహం యోగిన్ త్వాం సదా పరిచిన్తయన్ ।
కేషు కేషు చ భావేషు చిన్త్యోఽసి భగవన్మయా ॥

(9)శ్లో ॥ 18 : విస్తరే ణాత్మనో యోగం విభూతిం చ జనార్దన ! ।
భూయః కథయ తృప్తిర్హి శృణ్వతో నాస్తి మేఽమృతమ్ ॥

**భావము :** ఏ మహిమల చేత ఎల్లలోకములను వ్యాపించివున్నావో, ఆ దివ్య మహిమలను సశేషముగ చెప్పుటకు నీవే అర్హుడవు.

నేను ఎల్లప్పుడు నీ చింతయే చేయుచు యోగినై నిన్ను తెలుసుకొనుట ఎట్లు? ఏయే భావముల నిన్ను చింతింపవలెనో తెలియచెప్పుము.

విస్తరించివున్న ఆత్మను, దానిని పొందు విధానమును, దాని మహిమను మరల చెప్పుము. ఆ అమృతవాక్కులు ఎన్నిమార్లు విన్నను తృప్తిలేదు.

**వివరము :** పరమాత్మ విషయములు పరమాత్మ తప్ప మరెవ్వరు తెల్పలేరను ఉద్దేశ్యముతో ఇలా పరమాత్మను, మహిమా విశేషములను తెల్పమని అర్జునుడు వేడుకొనగ, పరమాత్మ తన యొక్క మహిమను తెల్పను మొదలు పెట్టాడు.

**శ్రీ భగవంతుడిట్లనియె :-**

(9) శ్లో॥ 19 : హన్త తే కథయిష్యామి దివ్యా హ్యాత్మ విభూతయః ।
ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ ! నాస్త్యన్తో వి స్తరస్యమే ॥
(పరమాత్మ, మహాత్యములు)

**భావము :** నా విభూతులు (మహిమలు) అంత్యములేనట్టివి. వాటిలో ముఖ్యమైన కొన్నింటిని మాత్రము చెప్పెదను.

(9)శ్లో॥20 : అహ మాత్మా గుడాకేశ! సర్వభూతాశయస్థితః ।
అహ మాదిశ్చ మధ్యంచ భూతానా మన్త ఏవ చ ॥
(పరమాత్మ, మహాత్మ్యములు)

**భావము :** నేను ఆత్మగవున్నవాడనై సర్వ జీవరాసులకు ఆధారముగనున్నాను. సర్వ జీవరాసులకు ఆదియు, మధ్యమును, అంత్యమును నేనే.

**వివరము :** సర్వజీవరాసుల శరీరములలో ఆత్మ అంటు ఒకటుంది. అది అన్ని శరీరములను కదిలించి నడిపించుచు, కర్మానుసారము పనులు చేయించుచూ, ప్రపంచ మనుగడకు కారణమైవున్నది. శరీరములలో ఆ విధముగనున్న ఆత్మ కూడ నేనేనని పరమాత్మ ఈ శ్లోకములో **'అహమాత్మ'** అన్నాడు. జీవుడువేరు, ఆత్మవేరు, పరమాత్మవేరు అయినప్పటికి ఆత్మ పరమాత్మలోని భాగమే, అందువలన ఆత్మను నేను అన్నాడు. అంతేకాక జీవుడు కూడ ఆయనేనని చెప్పకనే మనము తెలుసుకోవలెను. జీవాత్మకు ఆధారమైనది ఆత్మ. ఆత్మకాధారమైనవాడు పరమాత్మ. పరమాత్మకు పరమాత్మే ఆధారము. ఆయనను మించినవాడు మరొకడు లేడు. పరమాత్మను గురించి చెప్పాలంటే మాటలు చాలవు. ఆయన ఇక్కడున్నాడు, అక్కడలేడు అనుటకు ఎట్లు వీలులేదో, ఆ విధముగనే ఇది పరమాత్మ అది పరమాత్మకాదనుటకు వీలులేదు. సర్వము ఆయనైవున్నాడు. ఏ దానిని పరిశీలించి చూడనవసరము లేదు. ప్రతిది ఆయనేనని తెలియవలయును ఆ విషయము తెలుపు నిమిత్తము జీవరాసుల మొదలు, నడుమ, చివర అంతయు నేనే అన్నాడు.

__గమనిక__ **:** పరమాత్మ గొప్పతనమును తెలియచేయు ఈ అధ్యాయములో సర్వము నేనే అను పరమాత్మ వాక్కును ఎన్నో విధములుగ వివరించి చెప్పడమైనది. ఎన్ని విధముల వివరించి చెప్పుకున్నను చివరకు మనకర్థమగునది పరమాత్మకు

అతీతమైనదిగాని, పరమాత్మకు మినహాగాని ఏది లేదనుటయే. ఇక్కడ 21వ శ్లోకము నుండి 40వ శ్లోకము వరకు ఏకధాటిగ చెప్పిన విషయము కూడ అదియే. కావున మొత్తము 20 శ్లోకముల వరకు ఒకే విషయమైన దానివలన అన్నిటిని ఒక్కమారుగ కలిపి వ్రాయడము జరిగినది. శ్లోక శ్లోకము వేరువేరుగ వ్రాయక 21 నుంచి 40 వరకు వ్రాసి ఒకే భావము చెప్పడమైనదని గ్రహించాలి.

(9) శ్లో॥ 21 : ఆదిత్యానా మహం విష్ణు ర్జ్యోతిషాం రవి రంశుమాన్ ।
మరీచి ర్మరుతా మస్మి నక్షత్రాణా మహం శశీ ॥

(9) శ్లో॥ 22 : వేదానాం సామవేదోఽస్మి దేవానా మస్మి వాసవః ।
ఇన్ద్రియాణాం మనశ్చాస్మి భూతానా మస్మి చేతనా ॥

(9) శ్లో॥ 23 : రుద్రాణాం శంకరశ్చాస్మి విత్తేశో యక్షరక్షసామ్ ।
వసూనాం పావక శ్చాస్మి మేరు శ్శిఖరిణా మహామ్ ॥

(9) శ్లో॥ 24 : పురోధసాం చ ముఖ్యం మాం విద్ధి పార్థ! బృహస్పతిమ్ ।
సేనానీనా మహం స్కన్ద స్సరసా మస్మిసాగరః ॥

(9) శ్లో॥ 25 : మహర్షీణాం భృగు రహం గిరా మస్మ్యేక మక్షరమ్ ।
యజ్ఞానాం జ్ఞాన (జప) యజ్ఞోస్మి స్థావరాణాం హిమాలయః ॥

(9) శ్లో॥ 26 : అశ్వత్థ స్సర్వవృక్షాణాం దేవర్షీణాం చ నారదః ।
గన్ధర్వాణాం చిత్రరథ స్సిద్ధానాం కపిలో మునిః ॥

(9) శ్లో॥ 27 : ఉచ్చైశ్శ్రవస మశ్వానాం విద్ధి మా మమృతోద్భవమ్ ।
ఐరావతం గజేన్ద్రాణాం నరాణాం చ నరాధిపమ్ ॥

(9) శ్లో॥ 28 : ఆయుధానా మహం వజ్రం ధేనూనా మస్మి కామధుక్ ।
ప్రజన శ్చాస్మి కన్దర్ప స్సర్పాణా మస్మి వాసుకిః ॥

(9) శ్లో॥ 29 : అనన్తశ్చాస్మి నాగానాం వరుణో యాదసా మహమ్ ।
పితౄణా మర్యమాచాస్మి యమ స్సంయమతా మహమ్ ॥

(9) శ్లో॥ 30 : ప్రహ్లాద శ్చాస్మి దైత్యానాం కాలః కలయతా మహమ్ ।
మృగాణాంచమృగేన్ద్రోఽహం వైనతేయశ్చ పక్షిణామ్ ॥

(9) శ్లో॥ 31 : పవనః పవతా మస్మి రామశ్శస్త్ర భృతా మహమ్ ।
ఝుషాణాం మకర శ్చాస్మి స్రోతసా మస్మి జాహ్నవీ ॥

(9) శ్లో॥ 32 : సర్గాణా మాది రన్తశ్చ మధ్యం చైవాహ మర్జున! ।
ఆధ్యాత్మ విద్యా విద్యానాం వాదః ప్రవదతా మహమ్ ॥

(9) శ్లో॥ 33 : అక్షరాణా మకా రోఽస్మి ద్వన్ద్వ స్సామాసికస్య చ ।
అహామే వాక్షయఃకాలో ధాతాఽహం విశ్వతో ముఖః ॥

(9) శ్లో॥ 34 : మృత్యు స్సర్వహార శ్చాహ ముద్భవ శ్చ భవిష్యతామ్ ।
కీర్తి శ్శ్రీ ర్వాక్చ నారీణాం స్మృతి ర్మేధా ధృతిః క్షమా ॥

(9) శ్లో॥ 35 : బృహాత్సామ తథా సామ్నాం గాయత్రీ ఛ్ఛన్దసా మహమ్ ।
మాసానాం మార్గశీర్షోఽహ మృతూనాం కుసుమాకరః ॥

(9) శ్లో॥ 36 : ద్యూతం ఛలయతా మస్మి తేజ స్తేజస్వినా మహమ్ ।
జయోఽస్మి వ్యవసా యోస్మి సత్త్వం సత్త్వవతా మహమ్ ॥

(9) శ్లో॥ 37 : వృష్ణీనాం వాసుదేవోఽస్మి పాణ్డవానాం ధనంజయః ।
మునీనా మ ప్యహం వ్యాసః కవీనా ముశనా కవిః ॥

(9) శ్లో॥ 38 : దణ్డో దమయతా మస్మి నీతి రస్మి జిగీషతామ్ ।
మౌనం చైవాస్మి గుహ్యానాం జ్ఞానం జ్ఞానవతా మహమ్ ॥

(9) శ్లో॥ 39 : యచ్చాపి సర్వభూతానాం బీజం తదహ మర్జున! ।
న తద స్తి వినా యత్స్యా న్మయా భూతం చరాచరమ్ ॥

(9) శ్లో॥ 40 : నాన్తోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరన్తప! ।
ఏష తూద్దేశతః ప్రోక్తో విభూతే ర్విస్తరో మయా ॥

**భావము :** సూర్యులందరిలోన విష్ణువును నేను. ప్రకాశముగల జ్యోతులలో సూర్యుడను. వాయువులలో మరీచి వాయువును నేను, నక్షత్రములలో చంద్రుండను నేను. వేదములలో సామవేదమును, దేవతలలో దేవేంద్రుడను, ఇంద్రియములలో మనస్సును నేనే. జీవరాసులలోని చైతన్యము(ఆత్మ)ను నేనే. రుద్రులలో శంకరుడను, యక్షరాక్షసులలో కుబేరుడను నేనే. వసువులలో అగ్నిని నేనే, శిఖరములలో మేరు శిఖరమును నేను, పురోహితులందు బృహస్పతిని నేనని తెలియుము. సర్వ సేనాదులందు షణ్ముఖుండనగుదు, సరస్సులలో నేను సాగరుండనగుదు.

ఋషులలోన నేనగుదు భృగుమహర్షిని, శబ్దములలో ఓంకార శబ్దమునేను. యజ్ఞములందు నేను జ్ఞాన (జప)యజ్ఞమగుదును. పర్వతములలో హిమాలయమును అగుదు నేను.

25వ శ్లోకములో 'యజ్ఞానాం జపయజ్ఞోస్మి' అను వాక్యము కలదు. యజ్ఞములలో జపయజ్ఞము నేనని దీని అర్థము. అన్నిటిలోను పేరుపేరున గొప్పవాటినే చెప్పి అవియన్ని నేనన్నవాడు. ఇక్కడ యజ్ఞములన్నిటికంటే గొప్పదైన జ్ఞానయజ్ఞము నేననక జపయజ్ఞము నేనన్నాడు. ఇది నిజమా! అని మనము ఆలోచించవలసివున్నది. ద్రవ్యయజ్ఞముకంటే జ్ఞానయజ్ఞమే శ్రేష్ఠమైనదని జ్ఞానయోగమను అధ్యాయములో తెలియజేసి ఆ శ్రేష్ఠమైన యజ్ఞము నేననక జపయజ్ఞమని చెప్పడమేమిటి? కావున ఇక్కడేదో పొరపాటు జరిగినదని తెలియుచున్నది. వాస్తవముగ అన్నిటియందు శ్రేష్ఠమైన వాటినే సూచించిన భగవంతుడు ఇక్కడ మాత్రము శ్రేష్ఠమైన జ్ఞానయజ్ఞమును వదలి జపయజ్ఞమని చెప్పివుండడు. శ్లోకములో జ్ఞానయజ్ఞము స్థలములో జపయజ్ఞమని పొరపాటుగ మారిపోయి ఉండవచ్చును. కావున అక్కడ జ్ఞానయజ్ఞమనియే చదువుకోవాలని

కోరుచున్నాము. అన్నిటికంటే గొప్పది, కర్మ నిర్మూలణము చేయునది జ్ఞానయజ్ఞము. కావున **'యజ్ఞానం జ్ఞాన యజ్ఞోస్మి'** అని తెలుసుకోవలెను.

సర్వ వృక్షంబులందు అశ్వర్థవృక్షమును, దేవర్షులందు నారదుడను, గంధర్వులలో చిత్రరథుడను, సిద్ధులలో కపిలమునిని నేను.

అశ్వములలో నేను ఉచ్ఛైశ్రవమును, అమృతములో బుట్టినందువలన ఏనుగులలో ఐరావతమును నేను. నరులలో రాజును నేను.

ఆయుధములలో వజ్రాయుధమును నేను, ఆవులయందు కామధేనువును. పుట్టించువారలలో కందర్పుడను, సర్పములలో వాసుకి సర్పమును నేనే అగుదును.

నాగులలో వేయి శిరస్సుల అనంతుడగుదును. జలచరములకు వరుణ దేవుడను, పితరులందు ఆర్యముడను. దండించువారిలో యముడను నేను.

రాక్షసులలో ప్రహ్లాదుడను, వేచివున్న వారికి కాలమును నేను, మృగములలో సింహమునేను. పక్షులలో వైనతేయుండను పక్షిని నేను.

వేగముగ చరించువారిలో గాలిని. శస్త్రములు ధరించిన వారిలో రామ చంద్రుడను, చేపలలో మొసలిని, పుణ్యజలములలో గంగానదిని నేను.

పుట్టెడు వాటికంతయు ఆది, మధ్య, అంత్యములు నేను. విద్యలయందు ఆధ్యాత్మిక విద్యనగుదును. వాదించువారి వాదము నేను.

అక్షరములలో 'అ' కారమును, సమాసములలో ద్వంద్వసమాసమును, నాశనములలో అక్షయమును, విశ్వముఖుడైన విధిని నేనే.

ఎల్లవారిని సంహరించుటలో మృత్యువును. పుట్టువారికి భవిష్యత్తును, స్త్రీలలో లక్ష్మిని, కీర్తి, స్మృతి, మేధస్సు, ఓర్పు అన్నియు నేను.

సామగానంబులలో బృహత్సామమును, చంధస్సులో గాయిత్రిని, మాసములలో మార్గశిరమాసమును, ఋతువులలో వసంతఋతువును నేనే అయివున్నాను.

మోసములలో జూదము నేను. సర్వతేజస్సులందు తేజము నేను. సాత్త్వికులలోగల సత్యమును నేను. అట్లే ప్రయత్నించువారిలో ప్రయత్నమును, గెలుపొందువారిలో జయమును నేనే.

యాదవులలో వాసుదేవుడను, పాండవులలో అర్జునుడను, సకల మునులలో వ్యాసమునిని, అట్లే సర్వకవులలో శుక్రకవిని నేనే.

దండన చేయువారి దండన నేనగుదు. రాజులలో రాజనీతియును రహస్యములలో మౌనమును, జ్ఞానులలోని జ్ఞానమును నేనేయగుదును.

సర్వజీవులకు బీజమునేను. నేను లేనట్టి జీవరాసి ఏదియులేదు. సర్వ చరాచర భూతములు నావలననే పుట్టును.

ఈ విధముగ చెప్పుచుపోతే నాశుభకరమైన విభూతులకు అంత్యము లేదు, కావున వర్ణింపనలవి కాదు. విస్తరించక ముఖ్యమైన వాటిలో కొన్నిటిని మాత్రము నీకు చెప్పితిని.

**వివరము :** పరమాత్మ విషయమును ఒక్క మాటలో చెప్పాలంటే ఇది అది అను భేదము లేకుండ అంతట అన్నియు తానై ఉన్నవాడని చెప్పవచ్చును. ఇక్కడ మీరు నన్నొక ప్రశ్న అడుగవచ్చును. అదేమనగా పరమాత్మ అన్నియు తానైయున్నప్పుడు మృగములలో సింహమును, రాక్షసులలో ప్రహ్లాదుడను, శబ్దములలో ఓంకారమును నేననడములో అర్థమేమిటి? మృగములలో సింహము తప్ప మిగతా జంతువులు కాదా? శబ్దములలో 'ఓం' కారము తప్ప మిగతా శబ్దములేవి కాదా? అని ప్రశ్నించవచ్చును.

మా జవాబేమనగా! అంతయు నేనే అను ఒక చిన్న మాటకు ఇంత వివరముగ చెప్పనవసరములేదు. అయినప్పటికి వివరముగ చెప్పదలచి ఇన్ని శ్లోకములుగ చెప్పారు. అలా చెప్పినప్పటికి వివరముగ అర్థము కాలేదు. కాని అనుమానాలు పెరుగునట్లు చేశారు. మీరడిగిన ప్రశ్న ఇక్కడ అడుగుటకు యోగ్యమైనదే. ఈ శ్లోకములు వ్రాసిన వారు ఒక జాతిలో పేరు పొందినది చెప్పితే మిగతావన్ని చెప్పినట్లేనగునని వారనుకోవడము పొరపాటేనని ఒప్పుకోవచ్చును. చివరకు ఏది ఏమైన ఈ శ్లోకముల ఉద్దేశ్యము అన్నియు పరమాత్మేయని తెలియుటకేనని గ్రహించవలెను.

*(9)శ్లో॥ 41 : యద్య ద్విభూతి మత్సత్త్వం శ్రీ మదూర్జిత మేవ వా ।*
*తత్త దే వావగచ్ఛ త్వం మమ తేజోఽంశ సమ్భవమ్ ॥*
*(పరమాత్మ)*

**భావము :** సర్వ జీవరాసులందు మహిమగలది, శుభకరమైనది, పేరు పొందినదేది కలదో అది ఎల్ల నా తేజము వలన పుట్టినదేనని తెలియుము.

*(9)శ్లో॥ 42 : అథవా బహునై తేన కిం జ్ఞాతేన త వార్జున ! ।*
*విష్ట భ్యాహ మిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్ ॥*
*(పరమాత్మ)*

**భావము :** అట్లు కాకున్న ఇన్ని విధములుగ నేను చెప్పి ఏమి ప్రయోజనము! నాయొక్క ఎన్నో అంశములలో ఒక్క అంశచేతనే జగత్తంతయునున్నదని తెలియుము.

**వివరము :** అన్నిటికంటే మిన్నగ చెప్పుచున్నానని చివరగ ఒకమాట చెప్పాడు. ఆయనకున్న అనంతమైన అంశలలో ఒకే అంశచేత ఈ చరాచర ప్రపంచమంతయు నిలిచివున్నదన్నాడు. ఈ చివరి మాటతో ఆయనెంత గొప్పవాడో గ్రహించవచ్చును. విశ్వమును గూర్చి యోచించిన అంతుచిక్కనిదిగనున్నది. ఎన్నో గోళములు

నక్షత్రములతో నిండివున్న ప్రపంచములో మనమున్న భూమియే చిన్నది. ఈ భూమి మీదనే సమస్త జీవరాసులున్నవి. ఈ జీవరాసులు అనంత విశ్వము అంతయు **"ఏకాంశేన స్థితో"** ఒక్క అంశలోనే వున్నాయంటే ఆకాశము గగనం శూణ్యం అన్నట్లు పరమాత్మ అనంతము, అనిర్వచనీయం అనవలసిందే.

ఇంతటితో విభూతి యోగమను ఈ అధ్యాయము సమాప్తము. ఈ అధ్యాయములోని శ్లోకముల వివరము క్రింద చూడుము.

| | | | |
|---|---|---|---|
| 1) | పరమాత్మ | : | 33 |
| 2) | ఆత్మజ్ఞానము | : | 1 |
| 3) | సాకారము | : | 1 |
| 4) | అర్జునుడు అడిగినవి | : | 7 |
| | మొత్తము శ్లోకములు | : | 42 |

భావము, వివరము మార్చి వ్రాసిన శ్లోకము - 6.

*****

## పదవ అధ్యాయము

# విశ్వరూప సందర్శన యోగము

ప్రతి అధ్యాయమునకు ఒక పేరు పెట్టి పేరు చివరిలో యోగము అన్నారు. అధ్యాయములో ఏ విషయమును గూర్చి ఎక్కువగ చెప్పారో, ఆ విషయమునకు సంబంధించిన పేరు ఆ అధ్యాయమునకు పెట్టడము జరిగినది. ఇక్కడ విశ్వ రూపమునకు సంబంధించిన విషయము ఎక్కువగా ఉండుట వలన, ఈ అధ్యాయమును విశ్వరూప సందర్శన యోగమన్నారు. ప్రతి అధ్యాయములో చెప్పెడి విషయము యొక్క మూలఉద్దేశ్యము జీవాత్మ పరమాత్మలో కలిసిపోవడమే అయివున్నది. కలిసిపోవుటను యోగము అంటారు. విడిపోవుటను వియోగము అంటారు. గీతలో అన్ని అధ్యాయములు కలిసిపోవు విషయమునే చెప్పుచున్నవి కావున అన్ని అధ్యాయములకు చివరిలో **'యోగము'** అనుట సమంజసమైనదే.

**అర్జునుడిట్లనియె :-**

*(10) శ్లో॥ 1 : మదనుగ్రహాయ పరమం గుహ్య మధ్యాత్మ సంజ్ఞితమ్ ।*
*యత్త్వయోక్తం వచస్తేన మోహోఽయం విగతోమమ ॥*
*(ధర్మములు)*

**భావము :** నన్ను అనుగ్రహించి నాకింతవరకు చెప్పిన విషయములు ఆధ్యాత్మములైనవి కావున నాలోని మోహమెల్ల సమసిపోయినది.

*(10) శ్లో॥ 2 : భవాప్యయౌ హి భూతానాం శ్రుతౌవిస్తరశో మయా ।*
*త్వత్తః కమలపత్రాక్ష ! మహాత్మ్య మపి చావ్యయమ్ ॥*
*(పరమాత్మ)*

**భావము :** సర్వ జీవరాసులకు చావు పుట్టుకలు నీవలన కల్గుననియు, నీ మహిమ అవ్యయమైనదనియు విస్తారముగ ఇంత వరకు వింటిని.

(10)శ్లో॥ 3 : ఏవ మేత ద్యథాఽఽత్థ త్వ మాత్మానాం పరమేశ్వర! ।
ద్రష్టు మిచ్ఛామి తే రూప మైశ్వరమ్ పురుషోత్తమ ॥
(పరమాత్మ, నిరాకారము)

**భావము :** ఓ పురుషోత్తమా! నిన్ను గూర్చి నీవు చెప్పినదంతయు సత్యమగును. నీ విశ్వరూపమును చూడవలెనని నాకు కోరిక కల్గినది.

(10)శ్లో ॥ 4: మన్య సే యది తచ్ఛక్యం మయా ద్రష్టు మితి ప్రభో ।
యోగేశ్వర! తతోమేత్వం దర్శయాత్మాన మవ్యయమ్ ॥
(పరమాత్మ, నిరాకారము)

**భావము :** నీ ఆత్మ రూపమును నేను చూచుటకు అర్హుడనగుదునేని అవ్యయమైన ఆ రూపమును చూపుము.

**వివరము :** ఇంతవరకు భగవంతుడు చెప్పిన పరమాత్మ విషయములెన్నో విన్న అర్జునుడు, తన మనస్సులో ఒక నిశ్చయమునకొచ్చాడు. చెప్పెడివాడు పరమాత్మేనని, ఇంతవరకు కనిపిస్తూ చెప్పుచున్నవాడు నిజమైన విశ్వవ్యాపియేనని, విశ్వవ్యాపియైన వాడే ఈ శరీరమునుండి మాట్లాడుచున్నాడను నిశ్చయమునకొచ్చిన అర్జునుడు విన్నదేగాని, నిజముగ చూడని ఆ విశ్వరూపమేమిటో చూడగోరి, ఆ దర్శనము తనకు కలుగునట్లు చేయుమని ప్రాధేయపడ్డాడు. అప్పుడు భగవంతుడైన శ్రీకృష్ణుడు ఏమి చెప్పుచున్నాడో క్రిందచూస్తాము.

**శ్రీ భగవంతుడిట్లనియె :-**

(10)శ్లో ॥ 5 : పశ్య మే పార్థ! రూపాణి శతశోఽథ సహస్రశః ।
నానావిధాని దివ్యాని నానావర్ణా కృతీని చ ॥
(పరమాత్మ, నిరాకారము)

(10)శ్లో॥ 6 : పశ్యాఽఽదిత్యాన్ వసూన్ రుద్రా నశ్వినౌ మరుత స్తథా ।
బహూ న్యదృష్టపూర్వాణి పశ్యాఽఽశ్చర్యాణి భారత !॥
(పరమాత్మ, నిరాకారము)

(10)శ్లో॥ 7 : ఇహైకస్థం జగత్కృత్స్నం పశ్యాద్య సచరాచరమ్ ।
మమ దేహే గుడాకేశ! యచ్చాన్యద్ద్రష్టు మిచ్ఛసి ॥
( పరమాత్మ, నిరాకారము)

**భావము :** అర్జునా! అనేక విధములైన, అనేక వర్ణములైన, అనేక ఆకారములైన నా దివ్యరూపమును వందలాదిగ, వేలాదిగ, అసంఖ్యాకములుగ చూడుము.

ఆదిత్యులును, వసువులును, రుద్రులును, అశ్వనీ కుమారులును, మరుత్తులును మొదలగువారిని చూడుము. ఎన్నో జన్మల పుణ్యము చేత కనిపించెడి ఆశ్చర్యమైన ఈ రూపము చూడుము.

సర్వ జగత్తు మరియు అందలి చరాచర జీవుల సమూహమును ఒక్కటిగ నా శరీరమందే ఉన్నట్లు చూడగలవు. ఇష్టమొచ్చిన దేనినైన నాయందే చూడుము.

(10)శ్లో॥ 8 : న తు మాం శక్యసే ద్రష్టు మనేనైవ స్వచక్షుషా ।
దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగ మైశ్వరమ్ ॥
( పరమాత్మ, నిరాకారము)

**భావము :** అయితే నీకున్న కన్నులతో నన్ను చూచుటకు శక్యము కాదు. నీకు దివ్యమైన కన్నుల నిచ్చెదను. నాయొక్క ఈశ్వర స్వరూపము వాటిచే చూడుము.

**వివరము :** అర్జునుని కోరికమేరకు తన రూపమును చూపెదనని భగవంతుడు ఒప్పుకొన్నాడు. అయితే నానా విధములైన ప్రపంచము సర్వము ఒక్కటిగ తన దేహములోనే చూడగలవని చెప్పుచు, అలా చూచుటకు నీ శరీరమునకున్న కన్నులు పనికిరావని చెప్పాడు. చూడబడునది విశ్వరూపము, చూడవలెననుకొన్నవి మామూలు కన్నులు. కన్నులు కొంత దూరములో కొంత పరిధిలో చూచుటకు యోగ్యమైనవి. విశాల ప్రపంచమును ఒక్కమారుగ చూచుటకు కన్నులకు శక్తిలేదు. విశ్వరూపమంటే భగవంతుడు చూచాయగ చెప్పుచు ఎన్నో భూగోళములు, ఎన్నో సూర్యగోళములు, ఎన్నో ప్రళయములు, ఎంతో అంతులేని నానా వర్ణములు, నానా ఆకృతులు గల

జగత్సర్వము అన్నాడు. 12 ఓల్ట్సు లైటు ప్రకాశమును నేరుగ కన్నులు చూడలేవు. కొద్దిపాటి ప్రకాశమునే చూడలేని కన్నులు సూర్యగోళమును చూడగల్గునా? అదియు ఎన్నో సూర్యులు ఒక్కమారుగ ఒక్క దృశ్యముగ కనిపిస్తే మనకున్న కన్నులు చూడగలవా? చూడలేవు. అందువలననే శ్రీకృష్ణుడు అర్జునునితో నీ కన్నులు చూచుటకు తగవు అన్నాడు. అయితే ఈ కన్నులు పనికిరానపుడు అర్జునుని కోర్కెనెరవేరుటెట్లు? అంత ఇష్టముగ అడిగిన కోర్కె నెరవేరాలంటే ఎంతో గొప్పదైన విశ్వరూపమును చూడగల్గు ప్రత్యేకమైన కన్నులు కావాలి. ఆ ప్రత్యేకమైన కన్ను మనకున్నది అది అందరికి ఉన్ననూ ఉన్నా లేనట్లేనని చెప్పవచ్చును. ఎందుకనగా! ఆ మూడవకన్ను అందరికి మూయబడి వున్నది. ఎక్కడో కొందరికి తెరువబడి, శుక్లాలు వచ్చి కొందరికి ఉన్నప్పటికి, పొరలువచ్చి కొందరికి కాయలు కాచి కొందరికి ఉన్నది. మూడవకన్ను తెరవనివారు తెరిస్తే కనిపిస్తుంది కాని తెరిచిన వారి గ్రుడ్డితనమునకు వైద్యము చేస్తేగాని కనిపించదు. ఇలా అందరికి వున్నా లేనట్లున్న ప్రత్యేకమైన కన్నును తెరిపించి, దానికి స్వచ్ఛమైన చూపును ప్రసాదించవలసినది పరమాత్మయే. ప్రత్యేకమైన చూపులేని అర్జునునికి పరమాత్మయే కన్ను తెరిపించి కొద్దిసేపు చూపుకల్గించి తనను చూచునట్లు చేశాడు.

దివ్యమైన కన్నును ఇస్తున్నాను చూడుము అనిన శ్రీకృష్ణుడు ఏమి చూపాడో అది చూచిన అర్జునుడు ఈ విధముగా అంటున్నాడు.

**సంజయుడిట్లనియె :-**

*(10) శ్లో 9 : ఏవ ముక్త్వాతతో రాజన్! మహాయోగేశ్వరో హరిః ।*
*దర్శయామాస పార్థాయ పరమం రూప మైశ్వరమ్ ॥*
*(కల్పితము)*

*(10) శ్లో ॥ 10 : అనేక వక్త్ర నయన మనేకాద్భుత దర్శనమ్ ।*
*అనేక దివ్యాభరణం దివ్యానేకోద్యతాయుధమ్ ॥*
*(కల్పితము)*

(10) శ్లో ॥ 11 ః దివ్య మాల్యామ్బరధరం దివ్యగన్ధానులేపనమ్ ।
సర్వాశ్చర్యయమయం దేవ మనన్తం విశ్వతోముఖమ్ ॥
(కల్పితము)

(10) శ్లో ॥ 12 ః దివి సూర్య సహస్రస్య భవే ద్యుగపదుత్థితా ।
యది భా స్స దృశీసా స్యా ద్భాసస్తస్య మహాత్మనః ॥
(కల్పితము)

(10) శ్లో ॥ 13 ః తత్రైకస్థం జగత్కృత్స్నం ప్రవిభక్త మనేకధా ।
అపశ్యద్దేవదేవస్య శరీరే పాణ్డవస్తదా ॥
(కల్పితము)

(10) శ్లో ॥ 14 ః తత స్స విస్మయావిష్టో హృష్టరోమా ధనంజయః ।
ప్రణమ్య శిరసా దేవం కృతాంజలి రభాషత ॥
(కల్పితము)

**అర్జునుడిట్లనియె :-**

(10) శ్లో ॥ 15 ః పశ్యామి దేవాంస్తవదేవ! దేహేసర్వాంస్తథా భూతవిశేష సంఘూన్।
బ్రాహ్మణమీశం కమలాసనస్థం ఋషీంశ్చ సర్వా నురగాంశ్చ దివ్యాన్ ॥
(నిరాకారము)

(10) శ్లో ॥ 16ః అనేకబాహూదరవక్త్రనేత్రం పశ్యామి త్వాం సర్వతోఽనన్తరూపమ్ ।
నాన్తం న మధ్యం నపున స్తవాదిం పశ్యామి విశ్వేశ్వర! విశ్వరూప! ॥
(నిరాకారము)

**భావము :** దేవదేవా! సర్వదేవతలను, సర్వజీవరాసుల సమూహములను, బ్రాహ్మణులను, ఈశ్వరులను మరియు పద్మాసనములో కూర్చున్న ఋషులను, గొప్పవైన ఎన్నో సర్పములను నీ దేహమందు చూచితిని.

ఓ విశ్వేశ్వర! విశ్వరూప! అనేకమైన చేతులు, కడుపులు, ముఖములు,

కన్నులు కల్గి అంతట అనంతరూపమైన మరియు ఆది మధ్య అంతము లేని నిన్ను చూడగల్గితిని.

**వివరము :** ఇక్కడ ఎనిమిదవ శ్లోకము నుండి పదిహేనవ శ్లోకమునకు వచ్చాము. మధ్యలో గల ఆరు శ్లోకములు సంజయుడు చెప్పాడన్న వాటిని మేము చెప్పలేదు. భగవద్గీతలో ధృతరాష్ట్రుని, సంజయుని పాత్ర ఏమాత్రము లేదని మొదటనే చెప్పాము. అందువలన సంజయుని ఆరు శ్లోకములు ఇక్కడ వర్జితమైనవని గ్రహించవలెను.

శ్రీకృష్ణుడు అర్జునుని జ్ఞాననేత్రమునకు చూపు ఇచ్చిన తరువాత భౌతికమైన కన్నులు మూసుకొనగ ఆ కన్నులకు చీకటి ఏర్పడినది. మూడవకన్నుకు వెలుతురు కల్గి చూడగలిగాడు. అపుడు అర్జునునకు కనిపించిన దృశ్యమును గురించి తనేమి చూచాడో, ఆ విషయమును అక్కడేనున్న శ్రీకృష్ణునికి చెప్పుచుండెను. ఉదాహరణకు అంజనము చూచువాడు ప్రక్కనున్నవారికి అంజనములో తనేమి చూస్తున్నాడో దానిని చెప్పినట్లు, అర్జునుడు కూడ ఆ సమయములో తనేమి చూస్తున్నాడో దానిని చెప్పగలిగెను.

సమస్త దేవతలను, సమస్త మనుషులను, బ్రాహ్మణులైన ఈశ్వరులను, పద్మాసనముననున్న సమస్త ఋషులను, ఎన్నో గొప్ప సర్పములను చూచానని ఒకమాటన్నాడు. విశ్వరూపము చూచినపుడు అర్జునుడన్న మొదటి మాటలో విశ్వరూపము యొక్క గొప్పతనమేమిటో కొద్దిగ అర్థము కాగలదు. పూజింపబడు దేవతలు, పూజించు మనుషులు అందరు ఒకనియందేగలరన్నపుడు ఆ ఒక్కడు అందరికంటే విశాలమైనవాడని తెలియుచున్నది. అంతేకాక బ్రహ్మాజ్ఞానముగల ఈశ్వరులు, పద్మాసనముననున్న ఋషులు ఉన్నారనుటలో బ్రహ్మాజ్ఞానము అన్ని జ్ఞానములలో గొప్పది. ఈశ్వరులనగ అధిపతులు, కోటీశ్వరులు మొదలుకొని యోగీశ్వరులు వరకు గల ఈశ్వరులు, అదియు గొప్పదైన బ్రహ్మాజ్ఞానముగల వారు ఆయనయందు కనిపించారు. ఋషులు యోగము చేయువేళ పద్మాసనము ధరించుచుందురు. అలా కమలాసనము గల గొప్ప ఋషీశ్వరులు కూడ ఆ

రూపములో భాగమై కనిపించినపుడు బ్రహ్మజ్ఞానులకంటెను, యోగీశ్వరులకంటెను, ఋషీశ్వరులకంటెను ఆ రూపము గొప్పదని, పవిత్రమైనదని తెలియుచున్నది. విశాలమైనదని, పవిత్రమైనదని మొదటి మాటలోనే విశ్వరూపము గురించి తెలియుచున్నది. ఇంకనూ గొప్ప సర్పములు కూడ ఉన్నవని చెప్పారు. సర్పములను చూస్తూనే మరణమును చూచినట్లగును. వాటి ఆకారమే భయమును పుట్టించునదిగ ఉండును. అలాంటి భయంకర సర్పములు కూడ అందులో కలవంటే ఆ రూపము దేనికి భయపడునదికాదని, దేనికి తక్కువదికాదని తెలియుచున్నది. మొదటి శ్లోకములోనే పరమాత్మ నిరాకారమును గూర్చి అన్నిటికంటే విశాలమైనదని అన్నిటికంటే పవిత్రమైనదని, అన్నిటికంటే భయంకరమైనదని కూడ తెలియుచున్నది. విశాలమైన పవిత్రమైన మరియు భయంకరమైన ఆ రూపును గురించి అర్జునుడు రెండవ మాట ఏమన్నాడో క్రింద చూస్తాము.

విశ్వమంతయు ఏకరూపమైనప్పుడు అందులో ఉన్నవన్ని ఆ రూపములోని భాగములేయగును. సమస్త ప్రాణులు ఆ రూపములోనివే అయినపుడు వాటికున్న చేతులు, వాటికున్న తలలు, వాటికున్న కడుపులు, వాటికున్న కన్నులు అన్నియు ఆ రూపమునకున్నవియగును. అన్ని ప్రాణుల అవయవములు ఆ ఒక్క రూపమే అయినపుడు అనేక చేతులు, కడుపులు, కన్నులు, కాళ్లు, తలలు కల్గిన ఆ రూపును విశ్వరూపమనడములో తప్పులేదు. ఆశ్చర్యమును కల్గించు ఆ రూపును చూచిన అర్జునుడు మొదలు, మధ్యము, తుది ఏదీ తెలియలేదని అన్నాడు. ఎక్కడ చూచిన తలలు, కాళ్లు, కడుపులు కనిపిస్తున్నాయి. ఆకారమునకు మొదలు కాళ్లన్ని ఒకచోట మధ్యమము అయిన కడుపులన్ని ఒకచోట, చివరవైన తలలన్ని ఒకచోట కనిపించి వుంటే విశ్వరూపము ఇక్కడ మొదలని, ఇక్కడ మధ్యమని, ఇక్కడ అంత్యమని చెప్పవచ్చును. అట్లుకాక అంతట అన్ని అవయవములతో వ్యాపించివున్న ఆకారమును ఆది మధ్యాంత రహితుడని చెప్పవచ్చును.

కొలతలేనటువంటి, ఇంతవరకే వ్యాపించివున్నదని చెప్పలేని ఆ రూపము తేజస్సుకు కేంద్రమైనట్లు ప్రకాశించుచు, చూచుటకు సాధ్యముగాని

సూర్యప్రకాశమును పోలి సమానముగ వ్యాపించివున్నదని కూడ అర్జునుడు చెప్పాడు. ఈ మాటలో పరమాత్మ నిరాకారము పరిధిలేనిదని తెలియడమేకాక, ప్రకాశమును కూడ కల్గియున్నదని తెలియుచున్నది.

పరిధిలేని విశాలమైన, సమస్త రూపులు తనవైన, భయంకరమైన, ప్రకాశ వంతమైన, విశ్వరూపుడైన పరమాత్మ నిరాకారమును చూచిన తరువాత అర్జునునకు ఏమి అర్థమైనదో ఆ విషయమును చెప్పుచున్నాడు.

*(10)శ్లో॥ 17 : కిరీటినం గదినం చక్రిణం చ తేజోరాశిం సర్వతోదీప్తి మన్తమ్ ।*
*పశ్యామి త్వాం దుర్నిరీక్ష్యం సమన్తా ద్దీప్తానలార్క ద్యుతి మప్రమేయమ్ ॥*
*(అశాస్త్రీయము)*

**భావము :** విశ్వరూపమునకు ప్రత్యేకించి ఒక తల లేదు. అట్లే ప్రత్యేకించి రెండు చేతులు కూడలేవు. అందువలన కిరీటము ధరించడము గద, చక్రముకల్గి వుండడమను మాట అశాస్త్రీయమై పోవుచున్నది. గద, చక్రము, కిరీటము దేవతలలోని విష్ణువుకుండవచ్చును. కాని విశ్వరూపమునకుండవు. విశ్వరూపమును, విష్ణురూపముగ గుర్తించునట్లుగ చేసిన ప్రయోగమే ఈ శ్లోకమని చెప్పవచ్చును. దేవతలలో గొప్పవాడైన విష్ణువుకు దేవతలకు దేవుడైన పరమాత్మకు చాలా దూర భేదమున్నదని తెలియాలి.

పైన 16వ శ్లోకములో అనేక బాహూదర వక్త్రనేత్రం అన్నపుడు దానికి వ్యతిరేఖముగ కిరీటినం గదినం చక్రిణంచ అని వ్రాయడము సరియగునా? అందువలన ఈ శ్లోకమును తీసివేయడము జరిగినది.

*(10)శ్లో॥18 : త్వ మక్షరం పరమం వేదితవ్యం త్వ మస్య విశ్వస్య పరం నిధానమ్ ।*
*త్వ మవ్యయ శ్శాశ్వతధర్మగోప్తా సనాతనస్త్వం పురుషో మతోమే ॥*
*(నిరాకారము)*

**భావము :** నీవు అక్షరుడవు. తెలియదగిన పరము నీవే. విశ్వమునకు ఆధారమైన

వాడవునీవే. శాశ్వతముగ అవ్యయుడవు. ధర్మరక్షకుడవు నీవే. పురాతనము నుంచి నీవే పురుషునిగ ఉన్నావని నేను తలచుచున్నాను.

**వివరము :** మొదట లోపల కనిపించు ఆకారమును గూర్చి చెప్పిన అర్జునుడు, ఆ కనిపించునది శ్రీకృష్ణుడేనని ఒక్కమారు అనుమానము లేకుండ నిర్ణయమున కొచ్చినవాడై, నీవు నాశనములేనివాడవు అన్నాడు. ఆ దర్శనములోనే బయటనున్న శ్రీకృష్ణుడే లోపల కనిపించు విశ్వాకారమనుకొనిన అర్జునుడు, అంతవరకు విన్న అక్షరుడు ఈయనేనని తెలిసినవాడై, మోక్షము పొందకోరినవారు తెలియదగిన పరమపదము నీవే అన్నాడు. పరమాత్మకున్న అర్హతలన్ని శ్రీకృష్ణునకున్నవని తలచినవాడై నీవే జగతికి ఆధారము. నీవే ధర్మసంస్థాపకుడవు, మూలకర్తవు, పురుషోత్తముడవు అన్నాడు.

(10)శ్లో॥19: అనాది మధ్యాన్త మనన్త వీర్య మనన్త బాహుం శశిసూర్యనేత్రమ్ ।
పశ్యామిత్వాం దీప్తహుతాశవక్త్రం స్వతేజసా విశ్వమిదం తపన్తమ్ ॥
(నిరాకారము)

**భావము :** మొదలు, నడుమ, చివరలేనివాడుగను. అనంత మగతనము గలవాడుగను. అనంత బాహువులు గలవాడుగను, సూర్యచంద్రులు కన్నులుగ ఉన్నవాడుగను, ప్రకాశించు అగ్నివలె ముఖముగలవాడుగను, స్వతేజస్సుచే జగతిని తపింప జేయువాడునుయైన నిన్ను చూడగలిగితిని.

(10)శ్లో॥20 : ద్యావాపృథివ్యో రిదమన్తరం హి వ్యాప్తం త్వయైకేన దిశశ్చసర్వాః ।
దృష్ట్వాఽద్భుతంరూప ముగ్రం తవేదం లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్! ॥
(నిరాకారము)

**భావము :** భూమికి, ఆకాశమునకు, వాటి రెండిటి మధ్యను మరియు దిశలకెల్లను వ్యాపించివుంటివి నీవు. చూచుటకు అద్భుతముగను భయంకరముగనున్న నీ ఆకృతిచే ముల్లోకములు భయపడుచున్నాయి.

**వివరము :** చూచుటకు భయంకరముగనున్న విశ్వరూపు వలన ముల్లోకములు వ్యథచెందినట్లు చెప్పియున్నారు. ఇచట చూచువాడు అర్జునుడొక్కడేనని మరువరాదు. ముల్లోకములలోనివారు చూడనూ లేదు. ఎవరు భయపడనూలేదు. అలాంటపుడు భయపడినదెవరు? అను ప్రశ్నరాకమానదు. దానికి జవాబు **లోకమనగా ఒక గుణభాగమని, ముల్లోకములనగా మూడు గుణభాగములని తెలియాలి.** విశ్వరూపము జ్ఞానస్వరూపమైనది. అందువలన మూడు గుణముల సారాంశమైన **'మాయ'** విశ్వరూపమునకు భయపడగలదనియే చెప్పవచ్చును. విశ్వరూపము ఎప్పటికీ గలదు మాయ ఎప్పటికి దానికి భయపడుచూనే ఉంటుంది. అర్జునుడు జ్ఞాననేత్రముచే చూచాడు కావున ఆ విషయమే ఆయనకర్థమైనది. అంతేకాని ముల్లోకములంటే ఏవో గలవని ఊహించుకోకూడదు. అంతేకాక క్రింది శ్లోకములో చెప్పు యక్ష, కిన్నెర, కింపురుష, గరుడ, గంధర్వ, వసువులు, సిద్ధులు, సాధ్యులు, దేవతలు, రాక్షసులు అను మొదలగు తెగలన్ని మనకు కనిపించు మానవ జాతిలోనివేనని తెలియాలి. వీరందరు అర్జునుడు చూచినట్లు విశ్వరూపమును చూడలేదని మరువకూడదు. క్రింద 22వ శ్లోకములో **'వీక్షన్తే'** అనుమాటకు ప్రత్యక్షముగ చూచుట అని అర్థము చేసుకోకూడదు. జ్ఞానము ద్వార తెలియుట వలన అని అర్థము చేసుకోవాలి.

*(10)శ్లో॥21 : అమీహిత్వాం సురసంఘా విశన్తి కేచిద్భీతాః ప్రాంజలయో గృణన్తి।*
*స్వస్తీత్యుక్త్వా మహర్షి సిద్ధసంఘాః స్తువన్తి త్వాం స్తుతిభిః పుష్కలాభిః ॥*
*(నిరాకారము)*

*(10)శ్లో॥ 22 : రుద్రాదిత్యా వసవో యే చ సాధ్యా విశ్వేఽశ్వినౌ మరుతశ్చోష్మపాశ్చ।*
*గన్ధర్వ యక్షాసురసిద్ధ సంఘా వీక్షన్తే త్వాం విస్మితాశ్చైవ సర్వే ॥*
*(నిరాకారము)*

**భావము :** దేవతా సమూహములు నీయందు ప్రవేశిస్తున్నారు. కొందరు భయముచే నిన్నుమ్రొక్కుచున్నారు. సిద్ధులైన మహర్షులు స్వస్తి చెప్పుచు సంతసమున స్తుతించుచున్నారు.

**వివరము :** దేవతలు కర్మనంత అయిపోగొట్టుకొని పరమాత్మయందు చేరుచున్నారు. కొందరు మనుజులు దైవమొకడున్నాడని, తమ తప్పులకు ఆయన శిక్షించునని తలచినవారై, భక్తిచే కాక భయముచే మ్రొక్కుచున్నారు. మరికొందరు మోక్షము పొందుటకు అర్హులైన ఋషులు ***స్వస్తి అనగ అయిపోయినదని అర్థమొచ్చునట్లు పల్కుచు స్తుతించుచున్నారు. స్వస్తి అనుపదము స్వాహా అను పదమునకు దగ్గర సంబంధమైనది. వీటికి సరియైన పదము గోవింద అని కూడ చెప్పవచ్చును.*** తెలిసినవారు ఇహములో అన్ని కర్మలు అయిపోచేసుకొని మేము మీవద్దకు వచ్చుటకు సిద్ధముగ వున్నామని తెల్పుచు స్వస్తి అనిగాని, గోవింద అనిగాని స్తుతించుచున్నారు. కొందరట్లుండగ మరికొందరైన రుద్రులు, ఆదిత్యులు, వసువులు, సాధ్యులు, అశ్వనీదేవతలు, గంధర్వులు, యక్షులు, రాక్షసులు, దేవతలు సిద్ధులు అనువారు ఆశ్చర్యముగ పరమాత్మను గూర్చి ఆయన యోగమును గూర్చి ఆలోచించుచున్నారు.

(10)23: రూపం మహత్తే బహువక్త్రనేత్రం మహాబాహో! బహుబాహూరుపాదమ్ ।
బహూదరం బహుదంష్ట్రాకరాళం దృష్ట్వా లోకాహ ప్రవ్యథితాస్తథాஉహమ్ ॥
(నిరాకారము)

**భావము :** బహుముఖములు, నేత్రములు అనేకములైన బాహువులు, తొడలు, పాదములు గలదియును, అనేక భయంకరమైన కోరలుగల నీ ముఖము చూచుట వలన లోకులందరు భయముచెందినారు. మరియు నేనుకూడ భయపడి పోవుచున్నాను.

**వివరము :** ప్రపంచములోని అందరి ఆకారములు పరమాత్మవేయై ఒక్క రూపమున కనిపించుటవలన, సహజముగ ఎవరు ఎక్కడ చూడని అసాధారణ రూపమును చూచుట వలన అర్జునునికి భయముకల్గినది. భయంకరమైన కోరలు గల ముఖము అనడములో కొంత అర్థము గలదు. పరమాత్మకు ప్రత్యేకించి కోరలుగల

ముఖములేదు. ఆయనకు మనవలె ముఖముంటే కాళ్ళు చేతులువుండి కొంత పరిధిగల ఆకారమేర్పడగలదు. వాస్తవముగ పరమాత్మకు పరిధిగల రూపములేదు. అందువలన ఆయనకు ముఖము అందులోని కోరలు అసలులేవు. మీరు ముఖమే లేదంటున్నారు శ్లోకములో **'బహుదంష్ట్రాకరాళం'** అనేకమైన భయంకర కోరలు అనుమాట ఉపయోగించి చెప్పబడినది కదా! అని అడుగవచ్చును. వాస్తవమే ఆ మాట ఇక్కడ ఉపయోగించడములో మామూలు అర్థము కాక విశేషార్థమున్నదని తెలియవలసి ఉన్నది. ఆ విశేషార్థమేమనగా!

సాధారణమైన ఆకారమై అందరివలె కాళ్ళు, చేతులు, తల, ముఖమువుంటే అది సాధారణ కన్నులకే కనిపించేది. అక్కడ కనిపించు దృశ్యము అసాధారణ మైనది. కన్నులతో చూడబడు దృశ్యమున్నట్లుండదు. అందువలన ఎవరూ చూడలేని దానిని నీకు చూపుచున్నానని శ్రీకృష్ణుడు చెప్పాడు. ఆ దృశ్యము కాలము మరియు ప్రపంచపరిమాణముల రెండింటిని కలబోసుకొని ఉన్నదని ముఖ్యముగ తెలియాలి. జరుగుచున్న ప్రస్తుతకాలము, జరిగెడి ప్రపంచ ప్రస్తుత పరిమాణముల కలయికైన ఆ ఆకృతి వర్ణనాతీతము. **ప్రపంచ కొలతల గురించి ఏ ఖగోళశాస్త్రజ్ఞులు ఇంతవరకు చెప్పలేదు. చెప్పగలరను నమ్మకములేదు. కాలమునకు సెకండ్ల నుండి గంటల వరకు కొలతను కనిపెట్టినవారు అసలు కాలమంటే ఏమో చెప్పలేకపోయారు.** విడివిడిగనే అవగాహన కాని ప్రపంచ కొలత మరియు కాలము రెండు కలసి ఉండుటను ఒకేమారు దృశ్యరూపముగ కనిపించిన చూచి గ్రహించుటకు సాధ్యమగునా? ప్రపంచములో ఎవరికి అవగాహన కాని ఆ దృశ్యమును అర్జునుడు చూచుట గొప్ప అదృష్టమని చెప్పవచ్చును.

ఇప్పుడు అసలు విషయానికొస్తాము. ఏ జీవరాసికైన నోటిలోని కోరలు వాటికి ప్రత్యేకమైన ఆయుధములని చెప్పవచ్చును. దాదాపు సమస్త జంతుజాలములకు కోరలు ఆయుధములుగ ఉపయోగపడుచున్నవి. ఒక ప్రాణి మరొక ప్రాణిని వేటాడి హింసించడములో వాటి నోటిలోని కోరలు ప్రధానపాత్రవహిస్తున్నవి. అట్లు ఎక్కువగ హింసకు ఉపయోగపడు కోరలు భయంకరమైనవని చెప్పవచ్చును. అంతేకాక

ఒక ఆకారమును పూర్తిగ నుజ్జు చేసి, దాని ఆకృతిని పూర్తిగా మార్చివేయగలవి దంతములు. ఉన్న ఆకారమును లేకుండ చేయుటలోను, ఒక జీవరాసిని హింసించడములోను ప్రధానపాత్రకల్గిన దంతములు భయంకరమైనవే అగును. భూమి మీద జీవరాసులకున్న కొద్ది పరిమాణముగల దంతములే భయంకరమైనవిగ ఉండగ, కాలముతో పరిమాణముతో కలిసియున్న ఆ ఆకృతి యొక్క దంతములెంత భయంకరముగ ఉండునో! విశ్వరూపమునకున్న కాలపరిమాణముతో కలిసిన దంతములెట్లుండునో, వాటి అవగాహన అర్జుననకెట్లయినదో, కొంత యోచించి మన యోచనాచూపుకందిన దానిని తెలుసుకొందాము.

జీవరాసులు ఎక్కడ మరణిస్తున్నవో అక్కడ పరమాత్మ కోరలలో నలిగినట్లే. ఎక్కడ జీవరాసుల శరీరములు నశించి మృత్యువాతనపడుచున్నవో, అక్కడ పరమాత్మ కోరలలో నలిగినట్లే. ఎక్కడ ప్రమాదముల కారణమున జీవుల శరీరములు నలిగి పోవుచున్నవో, ముక్కలు ముక్కలు కావింపబడుచున్నవో, అక్కడ పరమాత్మ కోరలలో నలిగిపోయినట్లేనని తెలియాలి. ఒక లెక్కప్రకారము మృత్యువునే పరమాత్మ నోటి దంతములనుకొందాము. ఎన్నో రకముల మృత్యువులు ఎంతో భయంకరముగ ఉండును. అందువలన ఆయన కోరలు భయంకరముగ ఉన్నాయని తెలియాలి. ఈ ఒక్క ఆధారమును బట్టి అర్జునుడు చూచిన రూపము ప్రత్యేకమైనదని తెలియుచున్నది. ఆ రూపమునకు మనవలె శరీరములేదని, మనకున్నట్లు నియమిత స్థానములవలె కాళ్లు చేతులులేవని అర్థమగుచున్నది. ఒక్కొక్కప్పుడు జరుగు పెద్ద ప్రమాదములలో కొన్ని వేలమందో వందలమందో చనిపోవు సంఘటనలు భయంకరముగనుండును. ఇటువంటి భయంకరములను చూచి ప్రజలు భయపడు చున్నారనుటనే, నిన్ను చూచి ప్రజలు భయపడుచున్నారని అర్జునుడన్నాడు.

*( 10 ) శ్లో॥24 : నభస్స్పృశం దీప్తమనేకవర్ణం వ్యాత్తాననం దీప్తవిశాలనేత్రమ్ ।*
*దృష్ట్వా హిత్వాం ప్రవ్యథితాన్తరాత్మాధృతింన విన్దామి శమంచ విష్ణో! ॥*
*( నిరాకారము)*

(10) శ్లో॥25 : దంష్ట్రాకరాళాని చ తే ముఖాని దృష్ట్వైవ కాలానలసన్నిభాని।
దిశో న జానే న లభే చ శర్మ ప్రసీద దేవేశ! జగన్నివాస! ॥
(నిరాకారము)

**భావము :** ఆకాశము వరకు వ్యాపించిన అనేక రంగులు గలవాడవు, తెరిచిన నోరు గలవాడవు, ప్రకాశించుచున్న విశాలనేత్రములు గలవాడవునైన నిన్ను చూచుటచే నాలో భయము, బాధకల్గుచున్నది. శాంతి, ధైర్యము లేకుండ పోయినది. భయంకరమగు కోరలుగల నీముఖము కాలాగ్నివలె కనిపించుచున్నది. దానిని చూచుట వలన దిక్కు తెలియలేదు. సౌఖ్యము తెలియలేదు.

**వివరము :** అసాధారణమైన ఆ రూపము అర్జునునకు ఆకాశము వరకు కనిపిస్తున్నది. ఆకాశము వరకు వ్యాపించు అనేక రంగులు కాంతులు, ఇంద్రధనస్సు, మేఘముల ఆకృతులు అన్ని ఆయన రూపముగ కనిపిస్తున్నవి. ఆకాశములో తుఫాను ముందు వాతావరణము, నల్లని మేఘములు కమ్ముకరావడము, సూర్య ప్రకాశమే దృష్టిగ, మృత్యువునాహ్వానించు సంఘటనలే ముఖద్వారముగ మొదలగు దృశ్యములన్ని ఆ రూపములో కనిపించుట వలన అర్జునుడు భయపడసాగెను. ధైర్యము ఏమాత్రము లేకుండపోయినది, ఆపద సమయములో కల్గు భీతి కల్గసాగినది. అనేక భయంకర మృత్యుసంఘటనలే అనేక కోరలుగ కనిపించగ, కాలమే అగ్నిగ తోచగ, మృత్యువే ముఖద్వారముగ, తెరిచిన నోరుగ, జ్ఞానదృష్టికి తెలియగ అర్జునునికి పూర్తి భయమేర్పడినది. అగ్ని అనగ అన్నిటిని కాల్చి వాటి పేరు రూపము లేకుండ చేయునది. కాలము అగ్నివలెనున్నది. ఈ కాలాగ్ని ఈ రోజు ఉన్నవాడిని రేపటికి, నిన్న ఉన్నవాడిని ఈ రోజుకు లేకుండ చేయుచున్నది. కాలమనెడి అగ్నిలో ఎందరో కాలి కనుమరుగైపోయారు. జరిగెడి కాలములో ప్రతిదినము ఎందరో మృత్యువు పొంది కనిపించక పోవు విధానమే తెరచిన నోరుగ, కనపించు కోరలుగ అర్థమగుచున్నది. మృత్యువు ఎల్లవేళల కాచుకొని ఉండడమే తెరచిన నోరని, జరుగు ప్రమాదములే కోరలని, జరిగిన కాలమే కాలగర్భమని, ఆయన ఉదరమని

అర్జుననకర్థమైనది. మనకళ్ళెదుట ప్రమాదము జరిగి ప్రాణనష్టమైతేనే మనము చూడలేముకదా! కనిపించు గాయములతో బాధపడువారిని చూచి మనసు కలత చెందుట సహజమే. చిన్న సంఘటనలే చూచుట కష్టమైనపుడు అర్జునుడు జగతిలో జరుగుచున్న మృత్యు సంఘటనలన్ని ఒకేమారు చూచుటవలన భీతిల్లిపోయాడు. మనస్సు కలతచెంది పోయింది. దిక్కు తెలియలేదన్నాడు. ఇంకా ఏమనుచున్నాడనగా! క్రింది శ్లోకము చూడుము.

*(10) శ్లో॥26 : అమీచత్వాం ధృతరాష్ట్ర స్యపుత్రాః సర్వే సహైవావనిపాలసఙ్ఘైః।*
*భీష్మోద్రోణస్సూతపుత్రస్తథాஉసౌ సహాస్మదీయై రపి యోధముఖ్యైః ॥*
*(నిరాకారము)*

*10) శ్లో॥ 27 : వక్త్రాణి తేత్వరమాణా విశన్తి దంష్ట్రాకరాళాని భయానకాని ।*
*కేచి ద్విలగ్నా దశనాన్తరేషు సందృశ్యన్తే చూర్ణితై రుత్తమాఙ్గైః ॥*
*(నిరాకారము)*

**భావము :** ధృతరాష్ట్ర పుత్రులగు దుర్యోధనాదులందరు, మిగతా రాజుల సమూహము, భీష్ముడు, ద్రోణుడు, కర్ణుడు ఇటువైపు మన యుద్ధవీరులైన ముఖ్యులు అందరు వేగముగ భయంకరముగనున్న నీ ముఖముల కోరలలో ప్రవేశించుచున్నారు. కొందరేమో కోరలమధ్య తగుల్కొని చూర్ణము చేయబడినవారై తలలు మాత్రము కనిపిస్తున్నవి.

**వివరము :** ఈ 27వ శ్లోకములో ఎంతో వివరము తెలియవలసి వున్నది. ఈ అధ్యాయములో ఈ 27వ శ్లోకమే చాలా ముఖ్యమైనదని చెప్పవచ్చును. విశ్వరూపము యొక్క అవగాహన అంతో ఇంతో దీనియందే తెలియవలసివున్నది. కావున జాగ్రత్తగా తెలుసుకోవలెనని తెలుపుచున్నాము.

అక్కడ యుద్ధరంగములో ఉన్న రెండువైపుల సైన్యములోనివారు భీకర భయానకమైన ముఖములోని నోటియందు వేగముగ ప్రవేశించుచుండుట అర్జునుడు

తెలుసుకొన్నాడు. సైన్యములు రెండు యుద్ధము చేయుచుండగ, అటు ఇటు వైపునుండి ఎందరో సైనికులు రాజులు మరణించుట జరుగుచున్నది. వీరేకాక భూమిమీద ఎందరో ఆ సమయములో మరణించుట జరుగుచున్నది. మరణించు వారందరు పరమాత్మ నోటిలోనికి వేగముగ పోయినట్లు అర్జునునకు తెలియుచున్నది. మృత్యు గుహవలెనున్న నోటిలో భయంకరమైన కోరలలో నమలబడి నుజ్జు నుజ్జయినవారై, పరమాత్మ గర్భమైన కాలగర్భములోనికి జారి కనిపించకుండ పోవుచున్నారు. అలాగ ప్రతిక్షణము పరమాత్మ కాలమై తన గర్భములోనికి మ్రింగివేయుచున్నాడు. అహర్నిశలు అలా జరుగుచునేవున్నది. అలా జీవరాసులు చూర్ణమై కనిపించకపోవు ఈ ప్రక్రియలో కొందరు మృత్యుకోరలలో నలిగిపోయి కాలగర్భములో కలిసి పోయినప్పటికి, వారి శరీరములు కనిపించకపోయినప్పటికి, వారి తలలు కోరల మధ్యలో చిక్కుకొని ఫలానా వారివని గుర్తించునట్లు కనిపిస్తూనేవున్నవి. ఎందరో మృత్యుకుహూరములో ప్రవేశిస్తు కోరలచేత నమలబడి ఏమాత్రము తెలియకుండ వారి అడ్రస్ లేకుండ కాలగర్భములో కలిసిపోవుచున్నారు. అలాంటి భయంకర కాలముఖములో మృత్యుకోరల మధ్యలో చిక్కుకొని మరణించి నప్పటికి, వారి శరీరములు కాలాగ్నిలో కాలిపోయినప్పటికి, పళ్ల మధ్యలో చిక్కుకొని గుర్తింపు పొందిన తలలు కొన్ని ఉండుట విశేషము. ఆనాడు అర్జునుడికే కాదు మనకు కూడ కొందరు కోరల మధ్య చిక్కుకొన్నవారు కనిపిస్తున్నారు. నాకే కాదు మనోనేత్రము తెరిచిచూస్తే మీకు కూడ కనిపించగలరు.

నిత్యము కోట్ల సంఖ్యలో జీవులు మరణము పొందుచున్నవి. ఇలా నిత్యము జరుగుట అందరి దృష్ఠికి తెలిసిన విషయమే. మరణిస్తున్న విషయము తెలిసినప్పటికి ఎందరు పోయారో, ఎవరు పోయారో తెలియదు. పుట్టలోని చెదలు పుట్టదా గిట్టదా అన్నట్లు అడ్రస్‌లేని వారెందరు చస్తున్నారో తెలియదు. అలా కాలాగ్నిలో కాలిపోయి కనిపించకుండ పోయిన వారిలో 1948 వ సంవత్సరము చనిపోయి కాలగర్భములో కలిసిపోయిన గాంధీ లేకున్నా ఆయన గుర్తింపుకు మూలకారణమైన ఆయన తలయను కీర్తి కాలమను కోరలలో చిక్కుకొని కనిపిస్తూనేవున్నది. అందువలన

ఆయన అందరికి తెలిసిన అడ్రస్సు అయినాడు. నిత్యము మృత్యు కోరలలో ఎందరో నలిగి కనిపించక పోవుచున్నప్పటికి కొందరు కోరల సంధులలో చిక్కుకొని కనిపిస్తున్నారని చెప్పుటకు గాంధీతాతే కాదు ఇంకా చాలా మంది ఉన్నారు. అటువంటి వారిలో మదర్‌థెరిస్సా, సుభాస్ చంద్రబోస్, ఇందిరాగాంధీ మొదలగు ఈ కాలమువారే కాక పూర్వకాలములో పోయిన హరిశ్చంద్రుడు, శిభిచక్రవర్తి ఎందరో కనిపిస్తూనే ఉన్నారు. నేను చెప్పినవారు మీ దృష్ఠికి తెలియలేదా? అందరికి తెలుసును. అంతో ఇంతో కీర్తి సంపాదించుకొన్నవారు భూమి మీద స్థిరస్థాయిగ పేరున్నవారై నిలిచి పోవుదురు. వారు చనిపోయినప్పటికి గుర్తింపుగ తెలిసినట్లే ఉందురు.

రేపు నేను చనిపోయిన, కాలగర్భములో కలిసిపోయినా, గీత రచన చేసిన దానివలన, తెలియని ధర్మములు తెలిపిన దానివలన, కొందరికి జ్ఞానమార్గ దర్శకుడైన దానివలన, గుర్తింపుగ కొందరికైన, కొంత కాలమైన, కాలకోరలలో చిక్కుకొని కనిపిస్తుంటాము. నేను పోయిన తర్వాత కూడ నాకు కొంత అడ్రస్ ఉంటుంది. అలాంటి అడ్రస్ కోసము మీరు కూడ ప్రయత్నించండి. ఎందరో ధనికులు, రాజులు చక్రవర్తులు, నియంతలు కాలగర్భములో కలిసి పోయారు వారిలో కొందరు తప్ప మిగతావారంత ఎందరు పోయారో, ఎప్పుడు పోయారో, ఏమిచేశారో, ఎక్కడుండిరో తెలియక అడ్రస్‌లేని వారైనారు. డబ్బు సంపాదనే ముఖ్యమనుకొన్నవారు ఎప్పటికి కనిపించరు. దినమునకు వేయిమణుగుల బంగారు సంపాదించిన వాడు కూడ కాలములో కనిపించకపోయాడు. అటువంటి సంపాదకుడే కనిపించక పోతే నీ సంపాదనెంత.? అందువలన ధనము సంపాదించువాడు గాని, అధికారము చూపించువాడు గాని, కాలములో గుర్తింపులేనివారేనని గ్రహించాలి. అంతో ఇంతో కీర్తి కల్గిన వారే కొంత కాలమైన కనిపిస్తారు. ఇది మన దృష్టికాగ అర్జునుని మనోచూపుకింకా ఏమి తెలిసినదో క్రింద చూస్తాము.

10) శ్లో॥28: యథా నదీనాం బహవోఽమ్బువేగా స్సముద్రమేవాభి ముఖా ద్రవన్తి
తథా తవామీ నరలోకవీరా విశన్తి వక్త్రాణ్య విభివిజ్వలన్తి ॥
(నిరాకారము)

10) శ్లో॥ 29 : యథా ప్రదీప్తం జ్వలనం పతంగా విశన్తి నాశాయ సమృద్ధవేగాః।
తథైవ నాశాయ విశన్తిలోకా స్తవాపి వక్త్రాణి సమృద్ధవేగాః ॥
(నిరాకారము)

**భావము :** ఏ విధముగ నదులన్ని సముద్రమువైపు అతివేగముగ ప్రవహిస్తు సముద్రములో పడుటకై ప్రయత్నిస్తున్నవో, అట్లే ఈ నరలోకంలోని వారందరు జ్వలించుచున్న నీ ముఖమువైపు పరుగిడుచు నీ ముఖములో ప్రవేశిస్తున్నారు. మండుచున్న అగ్నిలో మిడుతలు వేగముగ వచ్చి పడి కాలిపోయినట్లు, భూమి మీద జీవరాసులన్నియు ఆ విధముగనే వేగముగ నీ ముఖాగ్నిలో పడి మరణిస్తున్నాయి.

**వివరము :** పుట్టిన ప్రతి జీవరాసి చివరకు మరణము పొందవలసిందేనని అందరికి తెలుసు. మనవెనుక నీడవలె వెంటాడుతున్న మృత్యువు ఎల్లవేళల తన నోరు తెరచుకొనియేవున్నది. మనము ఎప్పుడైన ఆ నోటిలో పడవలసిందే. అయినప్పటికి ఆ విషయమును అందరు మరచిపోయారు. ఎల్లవేళల శాశ్వతముగ ఉండువారివలె మెలగుచున్నారు. ఎవరెట్లున్నా మృత్యువును గురించి తెలిసినప్పటికి మరియు తెలియనప్పటికి ప్రతివారు మృత్యువును పొందవలసిందే. అలా ప్రతి దినము మృతి పొందువారు సముద్రమువైపు నదులు ప్రవహించురీతి, పరమాత్మ నోటిలో ప్రవేశించుటకు పరుగిడునట్లు అర్జునునికి అర్థమైనది. అక్కడ మృత్యువు ఉన్నదనిగాని, పలాన కాలములో మృత్యువు వచ్చుననిగాని తెలియని మానవులు ఉన్నట్లుండి మృతి చెందుచున్నారు. మిడుతలు అగ్నిని చూచి చనిపోతామని తెలియక ప్రతిదినము ఎగిరినట్లే ఎగిరి అగ్నిలోపడి చనిపోవుచున్నవి. వాటికి ఆ ప్రమాదము గురించిగాని, అక్కడా మరణమున్నదని గాని తెలియదు. కనిపించు ఆకర్షణ వస్తువు మీదికి నిత్యము ఎగిరినట్లే ఎగిరి అగ్నిలోపడి చనిపోవుచున్నవి. అలాగే మానవులు లేక జీవులు ప్రతిదినము ఉన్నట్లే ఉంటూ, అకస్మాత్తుగ మిడుతలవలె మరణిస్తున్నారు. మిడతలకు మండుచున్న అగ్ని అందముగ కనిపించునట్లు, జీవులకు మృత్యు సంఘటనలు కూడ మొదట అందముగనే కనిపించివుండును. మంటలో పడితే

చస్తామని మిడుతలకు తెలియనట్లు, జీవునికి కూడ ఆ పనులలో మరణమున్నదని తెలియదు. నర సమూహములకు పరమాత్మ ముఖాగ్ని ఎన్ని ఆకారములలోనున్నదో తెలియదు. ఒకవేళ తెలిసిన తెలియకున్నా ఆ ముఖాగ్నిలో పడవలసిందే, ఆ నోటిలోని భీకర కోరల మధ్య నలిగి పోవలసిందే.

*10)శ్లో॥30 : లేలిహ్యసే గ్రసమానస్సమన్తా ల్లోకాన్సమగ్రాన్వదనైర్జ్వలద్భిః।*
*తేజోభి రాపూర్య జగత్సమగ్రం భాసస్త వోగ్రాః ప్రతపన్తి విష్ణో! ॥*
*(నిరాకారము)*

*10)శ్లో॥31 : ఆఖ్యాహి మేకోభవానుగ్రరూపో నమోஉస్తు తేదేవ! వరప్రసీద।*
*విజ్ఞాతు మిచ్ఛామి భవన్త మాద్యం నహి ప్రజానామి తవప్రవృత్తిమ్ ॥*
*(నిరాకారము)*

**భావము :** మండుచున్న ముఖములచేత సమస్త జీవరాసులను మ్రింగుచున్నవాడవై సమస్తమును ఆస్వాధించుచున్నావు. నీ యొక్క కిరణములు జగత్తంతయు వ్యాపించి తపింపజేయుచున్నవి. ఉగ్రరూపుడవు నీవు ఎవడవో నాకు చెప్పుము. నీ ప్రవృత్తి నాకు తెలియకున్నది. ఆది పురుషుడైన నిన్ను నమస్కరించి తెలియకోరుచున్నాను.

**వివరము :** అర్జునుని జ్ఞానచూపుకు పరమాత్మ యొక్క ఔన్నత్యము పూర్తిగా అర్థము కాలేదు. మండుచున్న ముఖజ్వాలలచే సమస్తమును మ్రింగు పరమాత్మ అర్థము కాలేదు. ఆ పరమాత్మ కిరణముల వేడిమికి సమస్త జగత్తంతయు తపించుచుండుట, ఆ జ్వాలలో సమస్తము అంత్యమగుచుండుట చూచిన అర్జునునికి అంతవరకు అటువంటివాడున్నాడని తెలియక పోవడముచే ఈయనే శ్రీకృష్ణుడా! అసలు ఈ శ్రీకృష్ణుడెవరు? అను సంశయమేర్పడినది. వెంటనే అసలు నీవెవరు? నీ ప్రవర్తన ఏమిటో నాకర్థము కాలేదు. ముందు నీవెవరో నాకు తెలుపుము? అని ప్రశ్న వేశాడు. నీవెవరు అన్న ప్రశ్నకు పరమాత్మ, క్రింద జవాబిచ్చాడు.

**పరమాత్మ ఇట్లనియె :-**

10) శ్లో॥32: కాలోస్మి లోకక్షయకృత్ప్రవృద్ధో లోకాన్సమాహర్తుమిహ ప్రవృత్తః।
ఋతేఽపి త్వాన భవిష్యన్తి సర్వే యేఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః॥
(పరమాత్మ)

**భావము :** లోకములోని జీవులను నశింపచేయు బలమైన కాలమును నేను. జీవులను సంహరించుటే నా పని. ఇపుడు నీవు లేకపోయినను యుద్ధము చేయక పోయినను వీరు సంహరింపబడుదురు.

**వివరము :** అర్జునుడు నీవెవరు అన్న ప్రశ్నకు సమస్తమును నాశనము చేయు కాలము నేను అన్నాడు. పరమాత్మ ఇంతకు ముందే తనెంత మహిమగలవాడో చెప్పియున్నాడు. అయినప్పటికి విశ్వరూపములో భయంకరముగ కనిపించడము వలన, ముందు విన్నదంతయు మరచిపోయి అనుమానమొచ్చి నీవెవరో తెలియ జెప్పమన్నాడు. ఆ మాటకు కాలమును నేనని పరమాత్మ జవాబిచ్చుటయే కాక నీ ప్రవృత్తేమని అడిగిన దానికి జవాబుగ, నా పని జీవుల శరీరములను నాశనము చేయడమే అన్నాడు. అంతేకాక కర్మరీత్య భౌతికశరీరమును వదలవలసి వచ్చినపుడు తప్పక ఏదో ఒక విధముగ మృత్యువు చెందవలసిందే. అచట రాజులు, సైనికులు కర్మరీత్య మరణించవలసివున్నది. కావున అర్జునుడు యుద్ధము చేయకున్నను సంహరింపబడువారు తప్పక సంహరింపబడవలసిందే. కనుక పరమాత్మ అర్జునునితో నీవు ఇక్కడ యుద్ధము చేయకున్నను వారి ఆయువు మూడినది. వారు చావక తప్పదన్నాడు.

10) శ్లో॥33: తస్మాత్త్వ ముత్తిష్ఠ యశో లభస్వ జిత్వా శత్రూన్భుంక్ష్వ రాజ్యం సమృద్ధమ్।
మయైవైతే నిహతాః పూర్వమేవ నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్!॥
(పరమాత్మ)

10)శ్లో॥34 : ద్రోణంచ భీష్మంచ జయద్రథంచ కర్ణం తథాఽన్యానపి యోధవీరాన్।
మయాహతాంస్త్వం జహిమావ్యథిష్ఠా యుధ్యస్వ జేతాఽసి రణేసపత్నాన్॥
(పరమాత్మ)

**భావము :** కనుక శత్రువులను జయించుటకు లెమ్ము. వారు ఇంతవరకే నాచే సంహరింపబడినవారుగనున్నారు. నీవు నిమిత్తమాత్రముగ యుద్ధము చేసి జయించిన కీర్తియు, రాజ్యమును పొందుము.

ద్రోణుడు, భీష్ముడు, కర్ణుడు మొదలగు యుద్ధవీరులందరు నాచేత సంహరింపబడివున్నారు. నీవు యుద్ధము చేయకున్నను వారు జీవించివుండరు. అని పరమాత్మ అన్న మాటలు విని అర్జునుడిట్లనసాగెను.

**సంజయుడిట్లనియె :-**

(10)శ్లో॥35 : ఏతచ్ఛ్రుత్వా వచనం కేశవస్య కృతాంజలి ర్వేపమానః కిరీటీ।
నమస్కృత్వా భూయ ఏవాహ కృష్ణం సగద్గదం భీతభీతః ప్రణమ్య ॥
(కల్పితము)

అర్జునుడిట్లనియె :-

(10) శ్లో॥ 36 : స్థానే హృషీకేశ! తవప్రకీర్త్యా జగత్ప్రహృష్య త్యనురజ్యతే చ।
రక్షాంసి భీతాని దిశో ద్రవన్తి సర్వే నమస్యన్తి చ సిద్ధసంఘాః ॥
(నిరాకారము)

(10) శ్లో॥37 : కస్మాచ్చ తేననమేరన్మహాత్మన్గరీయసే బ్రహ్మణోఽప్యాదికర్త్రే।
అనన్త! దేవేశ! జగన్నివాస! త్వ మక్షరం సదసత్తత్పరంయత్।
(నిరాకారము)

**భావము :** ఓ పరమాత్మ! నీ మహిమా కీర్తిని విని జగత్తంతయు సంతోష మందునుండగ, రాక్షసులు భయపడి దిక్కులకు పరుగిడుచున్నారు. సిద్ధులెల్లరు నమస్కరించుచున్నారు. బ్రహ్మకు కూడ ఆదికర్తవైన, మహాత్ముడైన నిన్ను ఎందుకు నమస్కరింపకుందురు.

దేవదేవ! జగన్నివాస! నీవే ఆ అక్షరము మరియు సత్తు, అసత్తు, వాటికి వేరుగనున్న వాడు అన్నియు నీవేయగుదువు.

**వివరము :** పరమాత్మ గొప్పతనము, మహిమను, అన్నిటిని విన్న జనులు కొందరు ఎంతో సంతోషపడుచున్నారు. ప్రపంచ విషయములకంటే పరమాత్మ విషయములకు ఎక్కువ విలువిచ్చువారు ఎందరో భూమిమీద కలరు. అట్టివారు దైవవిషయములు చెవులపడిన వెంటనే సంతోషము పొందుచున్నారు. ఆ విషయములో క్రొత్త అనుభూతి పొందుచున్నారు. ఎంత పెద్ద ప్రపంచ విషయములైన వారికి రుచించవు. ఇట్టివారు కొందరైతే కొందరు రాక్షసగుణములు గలవారు పరమాత్మ విషయము విని ఆయన కర్మరీత్య శిక్షించునని, ఆ శిక్ష భయంకరముగ ఉండునని, వాటిని తప్పించుకోవలెనని ప్రయత్నించుచు దిక్కు దిక్కుకు ప్రాకులాడుచుందురు. రకరక మార్గముల అనేక దిక్కుల ప్రయాణిస్తున్నారు. ఏ దిక్కులోని ఏ మార్గములోనైన పాపములనుండి రక్షించుకొను అవకాశము గలదేమోనని వెదుకుచున్నారు. మరికొందరు సిద్ధులనబడువారు ఏ దిక్కులేనివారై, ఏ మార్గము అనుసరింపనివారై, కేవలమొక్క పరమాత్మనే నమ్మి ఆరాధించుచు నమస్కరించుచున్నారు.

అసత్తైన శరీరములో సత్తయిన ఆత్మ కలదు. సత్తుకాని శరీరములోనున్న సత్తు (ఆత్మ) పోయినపుడు సత్తుపోయిందని పూర్వమనెడివారు. ఒక ఆవు మరణించినపుడు పూర్వము ఆవు సత్తు పోయిందనెడివారు. ఆ పదము కాల క్రమేపి మారి నేడు ఆవు సచ్చిపోయిందంటున్నారు. అట్లే రామయ్య అనెడివాడు మరణించినపుడు రామయ్య ఆత్మ (సత్తు) పోయిందని పూర్వమనెడివారు. నేటి కాలములో ఆ పదమే రామయ్య సచ్చి పోయాడనబడుచున్నది. సత్తు అన్నమాట సచ్చి అనుట జరుగుచున్నది. అసత్తయిన శరీరములోనున్న సత్తయిన ఆత్మయు, ఆత్మకంటే వేరుగనున్న పరమాత్మయు అన్నియు ఆ నిరాకారమేనని తెలియాలి. కాలమును నేనే అన్న తరువాత అర్జుననకు పరమాత్మ యొక్క ఔన్నత్యము పూర్తి అర్థమై ఆయన యొక్క నిజతత్త్వమును గూర్చి ఇలా చెప్పుచున్నాడు.

(10) శ్లో॥38 : త్వమాదిదేవః పురుషః పురాణస్త్వమస్య విశ్వస్య పరం నిధానమ్ ।
వేత్తాఽసి వేద్యంచ పరంచ ధామ త్వయాతతం విశ్వ మనన్త రూప! ॥
(నిరాకారము)

**భావము :** ఓ కృష్ణా! ఆది దేవుడవు, పురాణ పురుషుడవు, విశ్వమయుడవు, పరమ పదముడవు, తెలిసినవాడవు, తెలియదగినవాడవు అన్నియు నీవే.

**వివరము :** భూమి మీద ఉన్న దేవతలందరిలో మొదటివాడు, అన్ని దేవతలకంటే గొప్పవాడు, పురాతన కాలమునుండి పురుషుడని చెప్పబడినవాడు, విశ్వమంతయు అణువణువున వ్యాపించినవాడు, చివరకు పొందదగిన తెలియదగిన మోక్షము మరియు తెలిసిన జ్ఞాని, తెలియదగిన జ్ఞానము, తెలిసిన యోగి, తెలియదగిన ఆత్మ అన్నియు పరమాత్మయేనని అర్జునుడు తెలుసుకొన్నాడు. తరువాత ఏమనుచున్నాడనగ!

10) శ్లో॥39: వాయుర్యమోఽగ్ని ర్వరుణశ్శశాంకః ప్రజాపతిస్త్వం ప్రపితామహశ్చ ।
నమో నమస్తేఽస్తు సహస్రకృత్వః పునశ్చ భూయోఽపినమో నమస్తే ॥
(నిరాకారము)

**వివరము :** ఈ శ్లోకములో ప్రజాపతి అన్న పదమును చతుర్ముఖ బ్రహ్మ అని చాలా గ్రంథములలో వ్రాయబడివున్నది. ప్రక్కనే **'ప్రపితామహశ్చ'** అను పదమునకు అతని తండ్రిని పుట్టించినవాడు తాత అని అర్థముగలదు. అనగ బ్రహ్మ, బ్రహ్మ తాతయు నీవే అని వ్రాయబడివున్నది. బ్రహ్మకు తండ్రి విష్ణువు తప్ప తాతలేదని అందరికి తెలుసు. అలాంటప్పుడు బ్రహ్మ, బ్రహ్మతాత అనడము తప్పగును. కావున ప్రజాపతి అను పదమునకు సూర్యుడన్న అర్థము సరిపోవునని గ్రహించవలెను. సూర్యుడు సూర్యుని తాత అనడము సమంజసము, సత్యము. బ్రహ్మ బ్రహ్మతాత అని లేని తాతను చెప్పడము అసమంజసము అసత్యమని తెలియాలి.

వాయువు, అగ్ని, యముడు, వరుణుడు, చంద్రుడు, బ్రహ్మ, బ్రహ్మ తండ్రి తాత అన్నీ నీవే అగుదువు. అట్టి నీకు మ్రొక్కుచున్నాను. మరిమరి వేలమార్లు మ్రొక్కుచున్నాను.

10) శ్లో॥ 40: నమః పురస్తా దథ పృష్ఠతస్తే నమో௨స్తు తే సర్వత ఏవ సర్వ।
అనన్తవీర్యా మిత విక్రమ స్త్వం సర్వం సమాప్నోషి తతో௨సి సర్వః॥
(నిరాకారము)

**భావము :** మ్రొక్కువాడనుముందు, మ్రొక్కువాడను వెనుక, మ్రొక్కువాడను సర్వ దిక్కులందు, అమిత పరాక్రమవంతుడవు మరియు అమిత మగతనముగల వీర్యుండవు. సర్వమునకు వ్యాపించిన వాడవగుట వలన సర్వము నీవేయగుదువు.

**వివరము :** పరమాత్మ సర్వము వ్యాపించినవాడు. మనకు ముందు, వెనుక, ప్రక్కల, చుట్టు, పైన, క్రింద అంతట వ్యాపించివున్నవాడు. ఇక్కడున్నాడని అక్కడ లేడనునది లేక, మొత్తము నిండినవాడుగ పరమాత్మవున్నాడు. అందువలన అర్జునుడు ముందు వెనుక సర్వ దిక్కుల మ్రొక్కుచున్నానని చెప్పాడు. అంతట వ్యాపించి అన్నియు తానైనవాడే పరమాత్మయని అమిత వీర్యముగల మగతనము కూడ ఆయనేనని అర్జునుడన్నాడు.

10) శ్లో॥ 41: సఖేతి మత్వా ప్రసభం యదుక్తం హే కృష్ణ! హే యాదవ! హే సఖేతి।
అజానతా మహిమానం తవేదం మయా ప్రమాదా త్ప్రణ యేన వా௨పి॥
(సాకారము)

10) శ్లో॥ 42 : యచ్చావహాసార్థమసత్కృతో௨సి విహారశయ్యాసనభోజనేషు।
ఏకో௨ థవా௨ప్యచ్యుత! తత్సమక్షం తత్క్షా మయే త్వా మహ మప్రమేయమ్॥
(సాకారము)

**భావము :** సఖుడవని తలచి వినయవిధేయతలు లేకుండ, నీ మహాత్యము తెలియక ఓయి సఖా! ఓయి మాధవ! ఓయి కృష్ణా అని విహరించునపుడు, పరుండునపుడు, కూర్చుండునపుడు, భోజనము చేయునపుడు, ఒంటరిగనున్నపుడు ఇతరుల ఎదుట ఎగతాళిగ మాట్లాడినవన్నియు క్షమించవలయును.

*10) శ్లో॥43 : పితాఽసి లోకస్య చరాచరస్య త్వమస్యపూజ్యశ్చ గురుర్గరీయాన్।
నత్వత్సమోఽస్త్యభ్యధికః కుతోఽన్యో లోకత్రయేఽప్యప్రతిమప్రభావ! ॥
(సాకారము)*

**భావము :** చరాచర జీవరాసులకు తండ్రివియును, పూజ్యుడవును, గురుడవును నీవే. దేవదేవ! ముల్లోకములందు నీకు సమానమైన వారెవ్వరులేరు. అందరికంటే నీవే అధికుడవు.

**వివరము :** ఇంతవరకు చాలా శ్లోకములలో అన్నియు నీవే అనిన అర్జునుడు ఇప్పుడిక్కడ ప్రత్యేకించి పరమాత్మను తండ్రిగ, పూజ్యగురువుగ చెప్పాడు. ఈ శ్లోకములో కేవలము తండ్రి గురువునిద్దరిని గూర్చి చెప్పడములో ఒక విశేషత గలదు. అదేమనగా! ప్రతి మానవునికి తండ్రిద్వార జన్మ కలగడము సహజము. దీనిని భౌతిక జన్మ అంటాము. అభౌతికమైన జన్మ అనునది మరొకటి కలదు. ఆ జన్మను ప్రతి ఒక్కడు పొందవచ్చును. పొందక పోవచ్చును. భౌతిక జన్మకు కారణము కన్న తండ్రి. అట్లే అభౌతిక జన్మకు కారణము పూజ్యగురువు. కన్న తండ్రి యొక్క వీర్యబిందువుచే కలుగు జన్మ భౌతికమైనది స్థూలమైనది. పూజ్యగురువు యొక్క జ్ఞాననాదముచే కల్గు జన్మ అభౌతికమైనది, సూక్ష్మమైనది. ***తండ్రిచే కల్గిన వారిని బిందుపుత్రులని, గురువుచే అభివృద్ధయిన వారిని నాద పుత్రులని అందురు. తండ్రిచే కల్గిన జన్మ కనిపించునది, కర్మవృద్ధి చేయునది కాగ, గురువుచే కల్గినది కనపించనిది, కర్మనాశనము చేయునదైవున్నది.***

ఇలా ఒక జీవితములో రెండు జన్మలకు అర్హులైన మనుషులు చాలామంది కేవలమొక జన్మతోనే సరిపెట్టుకొని, గురువుచే కల్గు రెండవ జన్మను పొందకున్నారు. ఇక్కడ అర్జునుడు ఈ రెండు జన్మల విషయమును గుర్తుచేసుకొని, రెండు జన్మలకు కారణమైన తండ్రిని, గురువును కూడ పరమాత్మగ చెప్పాడు. వీరిద్దరిని అలా చెప్పడములో కారణమేమనగా! స్థూలజన్మలకు కారణమైన తండ్రిశరీరములో మగతనమై ఆ శరీరములో వీర్యకణముగ కూడ ఉన్నవాడు పరమాత్మేనను వాస్తవము

తెలిసిన అర్జునుడు సర్వ జీవుల పుట్టుకకు కారణమైన వాడు కనిపించని పరమాత్మేనని అర్థము చేసుకొన్నాడు. అలాగే సూక్ష్మజన్మకు కారణమైన గురువు యొక్క శరీరములోని జ్ఞానము, జ్ఞానము యొక్క వివరణ పరమాత్మయేనని నిజము తెలిసిన అర్జునుడు సర్వజీవరాసులకు పూజ్యగురువు కూడ పరమాత్మేనని తన మనోనేత్రములచే తెలుసుకొన్నాడు. అందువలననే కన్న తండ్రివగుదువు. పూజ్య గురుడవగుదువని పరమాత్మను కొనియాడాడు.

*10) శ్లో॥ 44 : తస్మాత్ప్రణమ్య ప్రణిధాయ కాయం ప్రసాదయే త్వా మహమీశమీడ్యమ్।*
*పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః ప్రియః ప్రియాయార్హసి దేవ సోఢుమ్ ॥*
*(నిరాకారము)*

**భావము :** అందువలన నీకు సాష్టాంగనమస్కారము చేయుచు పూజార్హుడైన ఈశ్వరుడైన నిన్ను ప్రసన్నుడవగుమని ప్రార్థించుచున్నాను. ఓ దేవదేవ! కుమారునికి తండ్రివలె, మిత్రునికి మిత్రునివలె, ప్రియురాలికి ప్రియుడువలె నన్ను మన్నించుటకర్హుడవు.

*10) శ్లో॥ 45 : అదృష్టపూర్వం హృషితోఽస్మి దృష్ట్వా భయేన చ ప్రవ్యథితం మనో మే*
*త దేవ మే దర్శయ దేవ! రూపం ప్రసీద దేవేశ! జగన్నివాస! ॥*
*(సాకారము, నిరాకారము)*

**భావము :** ముందెప్పుడు చూడని అదృష్టపూర్వమైన ఈ రూపము చూచి మొదట సంతోషము కల్గినది. అయినను ఇప్పుడు మనస్సులో భయము కల్గుచున్నది. దేవదేవ నీవు ప్రసన్నుడవై, మొదటి సౌమ్యమైన ఆకారమునే చూపుము.

**వివరము :** అర్జునుడు అంతవరకు ఎవ్వరు చూడని ఆ దృశ్యమును చూచి, అదృష్టము వలన అబ్బిన ఆ దర్శన భాగ్యమును గూర్చి సంతసించినప్పటికి, భయంకరమౌ రూపము అతని మనస్సులో భయము కల్గించెను. ఆ విశ్వరూపమును అర్జునుడు చూడజాలక మొదటి సౌమ్యరూపమును చూపమని కోరెను.

*10) శ్లో॥ 46 :కిరీటినం గదినం చక్రహస్త మిచ్ఛామి త్వాంద్రష్టు మహం తథైవ ।*
*తేనైవ రూపేణ చతుర్భుజేన సహస్ర బాహో ! భవ విశ్వమూర్తే ! ॥*
*(అశాస్త్రీయము)*

**భావము :** ఈ అధ్యాయములో 17వ శ్లోకము ఇక్కడ 46వ శ్లోకము రెండునూ అశాస్త్రీయ శ్లోకములే. ఇవి కల్పిత శ్లోకములని తెలియాలి. ఎందుకనగ విశ్వరూపమునకు పరిమితిగ చేతులు లేవు. అట్లే శ్రీకృష్ణునకు నాల్గు చేతులు లేవు. సాధారణ మనిషిగనున్న శ్రీకృష్ణునికి నాల్గు చేతులున్నాయనుట ఎంత సమంజసము. అలా నాల్గుచేతులుంటే విశ్వరూపము చూపి నేను దేవుడనని చెప్పుకోవలసిన అవసరముండదనుకుంటాము. నాల్గు చేతలుంటేనే చెప్పకనే దేవుడని ప్రజలే పూజించెడివారు. అపరిమిత అసంఖ్యాకములైన చేతులు విశ్వరూపమునకుండగ కేవలము వేయి చేతులని చెప్పడమేమిటి? అనేక సంశయములతో కూడుకొని ఎటుచూచిన శాస్త్రబద్ధమైన జవాబు దొరకని శ్లోకములను ఈ గీతలో బయటికి నెట్టివేయడము జరిగినది. **ఇది శాస్త్రమను జలముచే కడగబడిన గీత. ఎన్నో భావములు సవరింపబడిన గీత.** దీనిని అసూయతో అడ్డముగ మాట్లాడువారు తప్ప అందరు సమ్మతింపతగినదని తెలియజేయుచున్నాము.

**పరమాత్మ ఇట్లనియె :-**

*10) శ్లో॥47: మయాప్రసన్నేనతవార్జునేదం రూపం పరం దర్శిత మాత్మయోగాత్*
*తేజోమయం విశ్వ మనన్తమాద్యం యన్మేత్వదన్యేన నదృష్టపూర్వమ్ ॥*
*(నిరాకారము)*

**భావము :** నా యొక్క ప్రసన్నముచేత మొదటిదైన విశ్వవ్యాపకమైన, తేజస్సుచే కూడిన నా శ్రేష్ఠమైన రూపము చూపబడినది. పూర్వమునుండి ఇంతవరకు నీవు తప్ప ఇతరులెవరు దీనిని చూచిన వారులేరు.

**వివరము :** ఈ అధ్యాయములో 32వ శ్లోకమును ఇక్కడ 47వ శ్లోకమును భగవంతుడిట్లనియెనని అన్ని గీతలలో వ్రాయబడివున్నది. అలా వ్రాయుట

పొరపాటని తెలియాలి. జ్ఞానముతో ప్రతి సూక్ష్మమును స్థూలముగ చెప్పదలచిన మేము ఈ విషయమును కూడ చెప్పక తప్పలేదు. ఈ రెండు శ్లోకములను భగవంతుడైన శ్రీకృష్ణుడు చెప్పలేదు. అర్జునునికి జ్ఞాననేత్ర దృష్టివున్న ఆ సమయములో స్వయముగ విశ్వరూపుడైన పరమాత్మయే పల్కిన మాటలివి. ఆ సమయములో దేహధారియైన శ్రీకృష్ణుడు చెప్పినప్పటికి భౌతిక చెవులకు వినిపించవు. అందువలన ఆ శ్లోకముల వద్ద భగవంతుడిట్లనియె అని వ్రాయకూడదు. పరమాత్మ ఇట్లనియె అని వ్రాయుట సమంజసము.

శరీరముతో ఉన్న కర్మయోగి కాని, బ్రహ్మయోగి కాని, పరమాత్మ ఆకృతిని తెలియలేరు. బ్రహ్మయోగులు మాత్రము తమ శరీరములోని ఆత్మను వారి మనోనేత్రముచే చూడగల్గినను పరమాత్మను చూడలేరు. బ్రతికివున్నవారెవరు పరమాత్మను చూడలేరనియే చెప్పవచ్చును. అర్జునునికి పరమాత్మయే స్వయముగ కల్పించిన అవకాశము వలన చూడగలిగాడు. అటువంటి అవకాశమెవరికైన వస్తే తప్ప చూడలేరనియే చెప్పవచ్చును. **సృష్ట్యాదినుండి ఎవరూ చూడని రూపు నీవు చూడగల్గితివని పరమాత్మ అనడము వలన అది ఎవరికీ సాధ్యము కానిదని తెలియుచున్నది.** పరమాత్మ ఇలా ఉన్నాడని తెల్పునిమిత్తము ఒకమారు అర్జునుని అడ్డము పెట్టుకొని బహిర్గతము చేసినదని తెలియవలెను. పరమాత్మ రూపము పరమాత్మ తెలుపవలసిందే కాని వేరెవరిచేత కాదని తెలియవలెను. అర్జునునికి పరమాత్మ అనుగ్రహముతో కల్గిన దానివలన మనకు కొంత అర్థమైనదని అనుకొందాము.

*10) శ్లో॥ 48: నవేదయజ్ఞాధ్యయనైర్నదానైర్న చక్రియాభిర్న తపోభిరుగ్రైః ।*
*ఏవంరూప శ్శక్యఅహం నృలోకే ద్రష్టుం త్వదన్యేన కురుప్రవీర ! ॥*
*(నిరాకారము)*

**భావము :** వేదములచేతకాని, యజ్ఞములచేతకాని, దానములచేతకాని, ఉగ్రతపస్సుల

చేతకాని ఈ రూపముగల నన్ను తెలియజాలరు. జగతిలో నీవు తప్ప నన్ను చూచినవారు ఎవరు లేరు.

**వివరము :** ఈ శ్లోకములో ఏవైతే పరమాత్మనారాధించు ఆరాధనలుకావో, వేటివలన పరమాత్మను తెలియలేరో వాటిని తెలియజేశాడు. నేటికాలములో వేదములు తెలిసిన స్వాములు, యజ్ఞములు చేయు గురువులు, చేయించు ధనికులు, దేవతల ప్రసన్నము కొరకు తపస్సులు చేయు సన్న్యాసులు, దానము చేయు ఔదార్యులు, గొప్ప జ్ఞానులుగ, దైవజ్ఞులుగ చలామణి అగుట సహజమే. వేదములు తెలిసినవారు, యజ్ఞములు చేయువారు, దానములు తపస్సులు చేయువారు దేవుని మార్గములో ఏమాత్రము లేరను సత్యము కొంత చేదుగ ఉన్నప్పటికి, పరమాత్మ వాక్యము ప్రకారము ఇది సత్యమే. దైవమునకు వ్యతిరేఖమైనది మాయ. మాయ పరమాత్మవైపు ఎవరిని పోకుండ తనవైపు ఉండునట్లు యజ్ఞ, దాన, తపస్సులను సృష్ఠించి వాటిచేత దైవమార్గములో ఉన్నట్లు భ్రమింపచేసింది. దేవుడే స్వయముగ ఇవి నన్ను తెలియు మార్గములుకావని చెప్పినప్పటికి, నమ్మనంత లోతుకు మనలను తనలో ముంచి వేసింది. అందువలన ఇప్పటికైన ఏవి దైవమును తెలియుమార్గములో, ఏవికావో తెలియుట ముఖ్యము. ఈ విషయము విశ్వరూపము చాలించునపుడు చివరిలో చెప్పినది. ఊరికి పోవువాడు ముఖ్యమైన విషయము చివరిలో చెప్పినట్లు, జాబు వ్రాయువాడు చివరిలో ముఖ్యమైన విషయమును తిరిగి వ్రాసినట్లు, పరమాత్మ తన విశ్వరూపము చాలించు చివరిలో చెప్పిన విషయము మానవ జాతికే చాలా ముఖ్యమైనది. భగవంతునిగ కాక పరమాత్మ స్వయముగ తన విశ్వరూపము నుండి ఇచ్చిన సందేశము చాలా ముఖ్యము. పరమాత్మ విశ్వరూపములో నుండి చెప్పినవి రెండే విషయములు.

1) **నేనే కాలమునై ఉండి అందరి పుట్టుకను కల్గించి చివరకు మృత్యువు అగుచున్నాను.**

2) **వేదముల వలన, యజ్ఞములవలన, దానముల వలన, తపస్సుల వలన నన్ను ఎవరు తెలియలేరు.**

పరమాత్మ తెల్పిన ఈ రెండు విషయములు జీవరాసులకి చాలా ముఖ్యమని తెలియాలి. మన ఆరాధనలను బట్టి మనము పరమాత్మ వైపు ఉన్నామా లేక ప్రకృతి (మాయ లేక సాతాన్, లేక సైతాన్) వైపు ఉన్నామా ఆలోచించుకోండి.

10) శ్లో॥ 49: మాతేవ్యథా మాచవిమూఢభావో దృష్ట్వా రూపంఘోరమీదృఙ్మమేదమ్ ।
వ్యపేతభీః ప్రీతమనాః పునస్త్వం తదేవమే రూపమిదం ప్రపశ్య ॥
(సాకారము, నిరాకారము)

**భావము :** ఈ భయంకర రూపమును నీవు చూచి భయము చెందకు, విమూఢ భావములను పొందకు. నీకు ప్రీతి కలుగుటకు, భయము వీడిపోవుటకు మొదటి సౌమ్యముగనున్న రూపునే చూపుచున్నాను చూడుము.

**వివరము :** విశ్వరూప సందర్శనములో అర్జునుని మనోనేత్రమునకు పరమాత్మ తప్ప ఎవరు కనిపించలేదు. అందరు ఆయనయందే కనిపించుట వలన, అందరిని నాశనము చేయు ఆ రూపు భయంకరమైనదగుట వలన అర్జునుడు భీతిల్లిన మాట నిజమే. భయము చెందిన అర్జునునికి కుదుట కల్గించుటకు సాధారణ కన్నులకు దృష్టినిచ్చి, మనోనేత్రమును లేకుండ చేసి, పరమాత్మ తిరిగి సాధారణ మనిషివలె శ్రీకృష్ణునిగ అర్జునునికి కనిపించసాగెను. అపుడు అర్జునుడు భయము నుండి తేరుకొన్నవాడై ఇట్లనెను.

**సంజయుడిట్లనియె –:**

10) శ్లో॥ 50: ఇత్యర్జునం వాసుదేవస్తథోక్త్వా స్వకంరూపం దర్శయామాస భూయః ।
అశ్వాసయామాస చ భీతమేనం భూత్వా పున సౌమ్యవపు ర్మహాత్మా ।
(కల్పితము)

**అర్జునుడిట్లనెను :–**

10) శ్లో॥ 51 : దృష్ట్వేదం మానుషం రూపం తవ సౌమ్యం జనార్ధన! ।
ఇదానీ మస్మి సంవృత్త స్సచేతాః ప్రకృతిం గతః ॥
(సాకారము)

**భావము :** ఓ కృష్ణా! మనుజరూపమున నీ సౌమ్య స్వభావ ఆకృతినిగని నా అంతరంగమందు స్వస్థత చేకూరెను. మనసు నిలకడకల్గెను.

**శ్రీ భగవంతుడిట్లనియె :-**

10) శ్లో॥ 52 : సుదుర్దర్శ మిదం రూపం దృష్టవా నసి యన్మమ ।
దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్శనకాంక్షిణః ॥
(నిరాకారము)

**భావము :** అర్జునా! నీవు చూచిన బ్రహ్మాండమైన రూపము ఇతరులు చూచుట దుర్లభము. దేవతలెందరో నా దివ్యాకృతిని చూచుటకు ఎల్లప్పుడు కాంక్షకల్గియున్నారు.

**వివరము :** పరమాత్మ దర్శనము పొందాలని దేవతలెందరో ఆశకల్గివున్నారు. అయినప్పటికి వారికి దర్శనము కాలేదు. ఇచట కొందరికొక ప్రశ్న పుట్టవచ్చును. **మానవులమగు మనకు ఆ దర్శనము లభించకపోవచ్చును. కాని దేవతలకు కూడ సాధ్యముకాదంటున్నారే'** అని అడుగవచ్చును. దానికి జవాబు దేవతలు వేరు. మనుషులు వేరనుకోకూడదు. మనుషులలో కొంత ఎక్కువ పుణ్యము చేసినవారు దేవతలగుచుందురు. అంతేకాని వారికి మనకు పెద్ద తేడా ఏమీవుండదు. వారు జీవులే మనము జీవులమే. వారికి మనకంటే ఎక్కువ జ్ఞానముండుట వలన పరమాత్మ దర్శనమును నిత్యము కోరుకొంటున్నారు. అయినప్పటికి అది సాధ్యపడలేదు. పరమాత్మ దయతో అర్జునునికొక్కనికే ఆ దర్శనమబ్బినది.

10) శ్లో॥ 53 : నాహం వేదైర్న తపసా న దానేన న చేజ్యయా ।
శక్య ఏవం విధో ద్రష్టుం దృష్టవా నసి మాం యథా ॥
(నిరాకారము)

**భావము :** నీవు నన్ను ఎట్లు చూచియున్నావో ఆ దర్శనము దొరకవలెనన్న వేదములచేతను, దానములచేతను మరియు యజ్ఞముల చేతను శక్యము కాదు.

**వివరము :** ఈ విషయము 48వ శ్లోకములో విశ్వరూపములో కూడ చెప్పివున్నారు.

ముఖ్య విషయము కావున భగవంతునిగ మరియొకమారు ఇక్కడ చెప్పడమైనది. అర్జునుడు చూచిన పరమాత్మ దర్శనము వేదములు చదువుట వలన కాని, దానముల వలనగాని, యజ్ఞములు చేయుట వలన కాని, తపస్సుల వల్లనైన కాని లభించదు. కొందరికి తపస్సుల వలన ఎవరినైన ప్రత్యక్షము చేసుకోవచ్చునను భావముండును. తపస్సుల వలన దేవతలు ప్రత్యక్షమగుదురేమో కాని పరమాత్మ దర్శనము మాత్రము దానముల చేతకాని, వేదద్యాయణము వలనకాని, యజ్ఞయాగాదుల వలన కాని, ఉగ్రమైన తపస్సుల వలన కాని సాధ్యపడదని తెలియవలెను. అలాయైన పరమాత్మను పొందువారందరు ఎలా ఏ మార్గముచే పొందుచున్నారని ప్రశ్నించగ క్రింది శ్లోకములో జవాబు చూస్తాము.

(10) శ్లో॥ 54 : భక్త్యా త్వనన్యయా శక్య అహ మేవం విధోఽర్జున! ।
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరన్తప! ॥
(పరమాత్మ, బ్రహ్మయోగము)

**భావము :** అర్జునా! నా ఆత్మను తెలియుటకు, చూచుటకు, ప్రవేశించుటకు అనన్యమైన భక్తిచేతనే సాధ్యమగుదును.

**వివరము :** ఇతర దేవతల మీద ధ్యాసలేక పరమాత్మ మీదనే భక్తి కల్గినవాడు, అన్యచింత లేకుండ మనస్సు నిల్పగలవాడు, తన శరీరమందలి పరమాత్మ అంశమైన ఆత్మను తెలియగలుగును, చూడగలుగును. తరువాత పరమాత్మయందు ప్రవేశించగల్గును. ఈ విధముగ పరమాత్మను చేరుమార్గము గలదు.

(10) శ్లో॥ 55 : మత్కర్మకృన్మత్పరమో మద్భక్త స్సంగవర్జితః ।
నిర్వైర స్సర్వభూతేషు యస్సమామేతి పాణ్డవ! ॥
(భక్తియోగము, బ్రహ్మయోగము, కర్మయోగము)

**భావము :** ఎవడు నాకర్మలనే ఆచరించుచున్నాడో, ఎవడు నా స్థానమునే ముఖ్య గతిగా తలంచుచున్నాడో, ఎవడు సంగవర్జితుడో, ఎవడు సర్వభూతములందు వైరము లేనివాడై బ్రహ్మయోగియై ఉన్నాడో అతడు నన్ను పొందగలడు.

**వివరము :** ఈ శ్లోకములో మత్‌కర్మ= నా పనిని, కృత్ = చేయువాడు. నా పనిని చేయువాడు అని పరమాత్మ చెప్పియున్నాడు. పరమాత్మ పని ఏమిటని అనుకొంటే ఆయన అన్ని చేయుచున్నాడు. అన్ని పనులు ఆయనవేనని కొందరనవచ్చును. అన్నిటికి కారణము ఆయనే అయినప్పటికి అవి మనకు కనిపించకుండ, మనకు తెలియకుండచేయునవి. వాటిని మనము లెక్కించకూడదు. ఉదాహరణకు సర్వ జీవరాసులను పుట్టించుచున్నాను మరియు చంపుచున్నానని వెనుకటి అధ్యాయములలో చెప్పివున్నాడు. పరమాత్మ చేయు ఆ పనిని జీవులుగనున్న మనము చేయజాలము. మనకు పూర్తిగ తెలియునట్లు భగవంతునిగ సాకారరూపమున చేయుపనులే ముఖ్యము. అంతపెద్ద పరమాత్మ కేవలము ఒక చిన్న మానవశరీరము ధరించి పుట్టి మానవులకు అవసరమైన ధర్మములను తెలియజేతునన్నాడు. ధర్మములకు ముప్పుకల్గి అవి లేకుండా పోయినపుడు నేను పుట్టుదునన్నాడు. అటువంటపుడు ఆయన జీవిత ధ్యేయమైన పని ధర్మములను తిరిగి నెలకొల్పుటయే. ఇక్కడ నాపనిని అని దానినే చెప్పుచున్నాడు. ఎవడైతే మాసిపోయిన ధర్మములను తెలియజేయు చున్నాడో, వాడు పరమాత్మ పనిని చేసినట్లగును. ఆయన పనిని చేయువాడు పరమాత్మను పొందుటకవకాశము గలదని తెలియజేయుచున్నాడు.

ఇచట కొందరికొక ప్రశ్న పుట్టుటకు అవకాశము గలదు. అదేమనగా! పరమాత్మను చేరవలెనంటే రెండేమార్గములన్నారు కదా! ఆ రెండులో ఒకటి కర్మయోగము, రెండవది బ్రహ్మయోగమని మీరే చెప్పారు కదా! ఇపుడు ఏ యోగము కానటువంటి ఈ పనిని చేయుట వలన మోక్షము పొందవచ్చునంటున్నారు కదా! అసలు పరమాత్మను చేరు మార్గములెన్ని ఉన్నవి? మొదట చెప్పినవి రెండేనా! లేక చాలా ఉన్నాయా?

ఇలా ప్రశ్నించడము వలన జ్ఞానాభివృద్ధి బాగా జరుగునని మా అభిప్రాయము. అనుమానమొచ్చినపుడు అర్జునుడు శ్రీకృష్ణుని వదలక ప్రశ్నించాడు. అలాగున ఇక్కడ ఈ ప్రశ్న సర్వసమ్మతము. దానికి జవాబు ఏమనగా! పరమాత్మను చేరుటకు మార్గములు రెండేనని ఇపుడు కూడ చెప్పుచున్నాము. అందరికి యోగ్యమైనవి

రెండే మార్గములు. అందరికి యోగ్యము కానిది, అందరికి సాధ్యముగానిది ఒక మార్గమున్నది. అది దొడ్డిదారిలాగ పరమాత్మను చాలా తొందరగ చేర్చునది. ఇది మనసు నిలపడముకంటే కూడ దుస్సాధ్యమైనది. అందువలన పరమాత్మ గీతలో కూడ ముందు రెండే మార్గములని తెలియజేసి తరువాత సందర్భానుసారముగ దీనిని చెప్పాడు. ఈ విషయము అనగ మూడవ దాని విషయము ఆరవ అధ్యాయమైన విజ్ఞానయోగములో 19వ శ్లోకమందు తెలియజేసివుంటాము. ఆరవ అధ్యాయము లోనే మూడవదారి తెలియబరచబడినది. ఇది చాలా దగ్గరి దారి కనుక సూక్ష్మములో మోక్షమంటున్నాము. నిజముగ ఇది కర్మ, బ్రహ్మయోగములాంటిది కాదు. ఇది భక్తియోగమనబడు ప్రత్యేకమైన మార్గము ఈ ప్రత్యేకమైన మార్గములోనే పరమాత్మ పనులు ఆచరించడము కూడానున్నదని తెలియవలెను. సాధారణముగ తండ్రిపనిని కొడుకు చేసినట్లు, పరలోక రాజ్య తండ్రియైన పరమాత్మ పనిని ఆయన సంతతియైన మనము చేయుట సముచితము. తండ్రిని గుర్తించి ఆయన పనులను గుర్తించి అవి ఆచరించడము వలన సులభముగ మోక్షమును పొందవచ్చును. అట్లుకాక పోయిన యోగమార్గములు రెండేగతియని తెలియవలెను.

అంతేకాక నా భక్తుడై, సంగవర్జితుడై అనికూడ అన్నాడు. పాపపుణ్యములను అంటకుండ ఎవడు పనులు చేయుచున్నాడో వాడు పరమాత్మను చేరగలడు. ఇది పరమాత్మను చేరు రెండు మార్గములలో ఒకటైన కర్మయోగము. కర్మయోగములో పాపపుణ్యముల సంగముండదు. కర్మల సంగమమును వదలిన వాడు పరమాత్మను చేరుననుటయే కాక ఈ శ్లోకములో మరొక మాట కూడ అన్నాడు. సర్వభూతములకు వైరము లేనటువంటివాడు నన్ను చేరగలడు. ఈ మాట రెండవ మార్గమైన బ్రహ్మయోగమునకు సంబంధించినది. బ్రహ్మయోగములో సర్వజీవులకు సమమైన ఆత్మానుభవమును పొందుచున్నాడు. ఆ సమయములో వాడు ఏ జీవరాసికి శత్రువుకానటువంటి ఆత్మతో సంబంధపడి ఉన్నాడు. అటువంటి బ్రహ్మయోగము ఆచరించువాడు సర్వజీవులకు వైరములేనటువంటి వాడని తెలియాలి. ఇచట యోగమార్గములు రెండును మరియు ప్రత్యేకమైన మార్గమొకదానిని గురించి చెప్పి

వాటి వలన విశ్వరూపుడైన పరమాత్మను చేరగల్గుదురని తెలియజేశాడు. ఇంతటితో విశ్వరూపసందర్శన యోగమను ఈ అధ్యాయము సమాప్తము.

ఈ అధ్యాయములోని శ్లోకముల వివరము క్రింద చూడవచ్చును.

| | | | |
|---|---|---|---|
| 1) | ధర్మములు | – | 1 |
| 2) | పరమాత్మ | – | 4 |
| 3) | నిరాకారము (విశ్వరూపము) | – | 26 |
| 4) | పరమాత్మ, బ్రహ్మయోగము | – | 1 |
| 5) | భక్తియోగము, బ్రహ్మయోగము, కర్మయోగము | – | 1 |
| 6) | అశాస్త్రీయమైనవి | – | 10 |
| 7) | సాకార, నిరాకారములు | – | 2 |
| 8) | సాకారము | – | 4 |
| 9) | పరమాత్మ – నిరాకారము | – | 6 |
| | మొత్తము శ్లోకములు | – | 55 |

భావము, వివరము మార్చి వ్రాసిన శ్లోకములు – 23,25,27,39.

*****

## పదకొండవ అధ్యాయము

# భక్తి యోగము

**అర్జునుడిట్లనియె :-**

*(11) శ్లో ॥ 1 : ఏవం సతతయుక్తా యే భక్తా స్త్వాం పర్యుపాసతే ।*
*యేచాప్యక్షర మవ్యక్తం తేషాం కేయోగవిత్తమాః ॥*
*(బ్రహ్మ, కర్మ, భక్తి యోగములు)*

**భావము :** ఆ విధముగ ఎల్లపుడు ఆత్మతో కూడుకొన్నవాడు, భక్తితో నిన్ను ఉపాసించువాడు, కనిపించని నాశనములేని స్థానమును గురించి ఉపాసించువాడు గలరు. వీరిలో బాగా యోగము తెలిసిన వారు ఎవరు?

**వివరము :** విత్= తెలియడము, యోగ= కలయిక, యోగవిత్ అనగ పరమాత్మతో కలియుటకు తెలిసినదని అర్థము. పరమాత్మతో కలియుటకు వెనుక అధ్యాయము చివరి శ్లోకములో చెప్పబడినట్లు మూడు మార్గములు కలవు. కర్మయోగము, బ్రహ్మయోగము కాక భక్తియోగమని పేరు పెట్టబడిన మూడవ మార్గమున్నదని తెలుసుకొన్న అర్జునుడు, ఈ మూడు మార్గములలో ఏది పరమాత్మను కలియుటకు తెలిసిన మార్గమని ప్రశ్నించాడు. 1) సతత యుక్తాయే 2) భక్తాః 3) అక్షర మవ్యక్తం అని మూడు భాగములుగ విభజించి వీరిలో ఎవరు నీతో కలయిక తెలిసినవారని అడిగాడు. అర్జునుడు అడిగిన వివరము ఎల్లపుడు ఆత్మతో కూడియున్నవాడైన బ్రహ్మయోగి, భగవంతుని మీద భక్తికల్గి ఎల్లవేళల ఆయన కర్మలాచరించు భక్తియోగి, అవ్యక్తమైన అక్షరమును కర్మనాశనముచే పొందకోరిన కర్మయోగులలో ఎవరు బాగా తెలిసినవారని అడుగగ భగవంతుడేమి సమాధానమిచ్చాడో క్రింద చూద్దాము.

**శ్రీ భగవంతుడిట్లనియె :-**

(11) శ్లో ॥ 2 : మయ్యా వేశ్య మనో యేమాం నిత్యయుక్తా ఉపాసతే ।
శ్రద్ధయా పరయో పేతా స్తే మే యుక్తతమా మతాః ॥
(బ్రహ్మ, కర్మ, భక్తియోగములు)

**భావము :** పరమశ్రద్ధ కల్గినవారై నాయందు మనస్సునుంచి, నిత్యము నాతో యుక్తము కోరి ఉపాసించువారందరు ఉత్తమయోగులని నా ఒప్పుదల.

**వివరము :** ఇచట అర్జునుడడిగిన ప్రశ్నలకు వీరు బాగా తెలిసినవారని, వీరు తెలియనివారని చెప్పక శ్రద్ధ కలిగిన వారు ఉత్తములన్నాడు. పరమాత్మను చేరవలెనను కోర్కెతో కర్మ, బ్రహ్మ, భక్తి అను మూడు మార్గములననుసరించు వారిలో **'పరయో శ్రద్ధయా ఉపేతా' 'శ్రేష్ఠమైన శ్రద్ధ కల్గిన'** వారందరు శ్రేష్ఠులేనని చెప్పాడు. దీనిని బట్టి ప్రతి దానికి శ్రద్ధ అనునది ముఖ్యమని తెలియుచున్నది. శ్రద్ధలేని భక్తి నిరర్థకమని తెలియుచున్నది.

ఈ కాలములో ఎందరో ధనమున్నవారు వారి లెక్కలో కొద్దిపాటి విలువున్న డబ్బును ఖర్చు పెట్టి పూజలు చేయిస్తున్నారు. 200 రూ॥ ఇచ్చి అభిషేకము, 300 రూ॥ ఇచ్చి మరొక పూజ, 500 రూ॥లు ఇచ్చి మరొక అర్చన చేయించి ఎవరు చేయని పూజలన్ని చేయించాననుకొని తృప్తిపడితే, వాటిని దేవుడు చూడక వానియందు ఎంత భక్తి శ్రద్ధలున్నాయని మాత్రమే చూస్తున్నాడు, కాని ఎంత ఖర్చు పెట్టాడని చూడలేదు. ఒకడు చనిపోతే వానికోసము బాధలేనివాడు ఏడ్వడు. బాధవున్నవాడు మాత్రమే ఏడ్చును. కొన్ని ప్రాంతములలో డబ్బిస్తే కూలికి ఏడ్చేవారున్నారు. ఏడ్వలేని వారు, బాధలేనివారు, పలువురు చూచుటకు కూలి మనుషుల చేత ఏడ్పించుచున్నారు. అలా ఏడ్పించువారియందు బాధలేదు. బాధున్నవారైతే వారే ఏడ్చేవారు. బాధలేదు కావున కూలిచ్చి ఏడిపిస్తున్నారు. అలాగే శ్రద్ధలేని భక్తులు కూలిచ్చి మిగతావారిచేత పూజలు చేయిస్తున్నారు. శ్రద్ధవుంటే వారే స్వయముగ ఎక్కడైన పూజించెడివారు.

ఆ శ్రమ మనకెందుకు! ఇంత రేటని డబ్బిస్తే ఆ పూజేదో వారే చేస్తారను శ్రద్ధలేని భక్తులు చాలామంది కలరు.

ఏది ఏమైన ఎవరు ఏవిధ పూజలు యోగములు చేసిన అందలి శ్రద్ధయే ముఖ్యము. అందువలన పరమాత్మ వీరు వారు అనక శ్రద్ధవున్న యోగులందరూ శ్రేష్ఠులేనన్నాడు.

*(11) శ్లో॥ 3 : యే త్వక్షర మనిర్దేశ్యమవ్యక్తం పర్యుపాసతే ।*
*సర్వత్రగ మచిన్త్యంచ కూటస్థ మచలం ధ్రువమ్ ॥*
*( మోక్షము)*

*(11) 4 శ్లో॥ సన్నియ మ్యే న్ద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః ।*
*తే ప్రాప్నువన్తి మా మేవ సర్వభూతహితే రతాః ॥*
*( బ్రహ్మయోగము)*

**భావము :** అక్షరమైనది, నిర్ధేశింపబడనిది, కనిపించనిది, ఆలోచనకందనిది, కూటస్థమైనది, అచలమైనది, శాశ్వతమైనది, అంతట వ్యాపించినదియైన పరమాత్మను ఉపాసించువారు.

ఇంద్రియములను నిగ్రహించి, అన్నిటియందు బుద్ధి సమముచేసి, సర్వభూత హితులైన వారు నన్ను పొందగల్గుదురు.

**వివరము :** ముక్తిని పొందకోరు వారు మూడు మార్గములను అనుసరిస్తారను కొన్నాము కదా! ఆ మూడు మార్గములలో ఏదో ఒక మార్గముననుసరించి పరమ పదమను గమ్యము చేరినవాడు నాశనములేనివాడై పంచభూతములకు అతీతుడగును. పంచభూతములలో ఏ శక్తి వానినేమి చేయలేదు. వాడపుడు పరమాత్మయే. గమ్యము చేరినవాడు ఇచటనున్నాడు అచటలేడని, పలానావాడని, నిర్ధేశింపబడనివాడుగ మారియున్నాడు. అప్పుడు వాడు సర్వవ్యాపియైన పరమాత్మయై ఉన్నాడు. గమ్యము చేరినవాడు వ్యక్తుడు కాడు, ఎచటను కనిపించడు, ఎవరి కన్నులు వానిని చూడలేవు,

అతడు అవ్యక్తుడైన పరమాత్మగనుండును. అంతేకాక ఎవరి ఆలోచనకందువాడు కాడు. ఏ బుద్ధి అతనిని ఆలోచించి తెలుసుకోలేదు. అతను అంతట వ్యాపించినవాడై, అచలుడై, శాశ్వితుడై, కూటస్థుడై, పరమాత్మగ మారినవాడై ఉండును.

అలా పరమాత్మగ మారవలెననుకొన్నవాడు మూడుమార్గములలో ఏదో ఒక మార్గమనుసరించాలి. అందులో ఒకడు బ్రహ్మయోగమును అనుసరించాడను కొందాము, వాడు ఇంద్రియముల ధ్యాసలలోనికి మనస్సును పోనీయకుండ చేసుకోవాలి. వాని బుద్ధిని సర్వజీవులందు సమముగనున్న ఆత్మమీద సమము చేయాలి. సర్వభూత సన్నిహితుడైన ఆత్మయందే ధ్యాసతో నిలిచిపోవాలి. బ్రహ్మ యోగమాచరించినవాడు పరమాత్మను పొందగలడు.

(11) శ్లో॥ 5 : క్లేశోఽధికతరస్తేషా మవ్యక్తాసక్త చేతసామ్ ।
అవ్యక్తా హి గతి ర్దుఃఖం దేహావద్భి రవాప్యతే ॥
(బ్రహ్మయోగము)

**భావము :** అట్లు ఆత్మను ఉపాసించునట్టి బ్రహ్మయోగులు అనుసరించు మార్గము చాలా కష్టమైనది పార్థ! ఇంద్రియములకు తెలియని ఆత్మను పొందుట అతి కష్టమైన మార్గమని తెలియుము.

(11) శ్లో॥ 6 : యేతు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః ।
అనన్యేనైవ యోగేన మాం ధ్యాయన్త ఉపాసతే ॥
(కర్మ యోగము)

**భావము :** ఎవరైతే సర్వకర్మలు నాకే సమర్పణమొనర్చారో, వారు ఇతర ఏ కర్మలు అంటని రీతిలో కర్మయోగంబొనర్చి నన్ను ఉపాసించుచున్నారు.

(11) శ్లో॥ 7 : తేషా మహం సముద్ధర్తా మృత్యుసంసార సాగరాత్ ।
భవామి న చిరా త్పార్థ! మయ్యావేశిత చేతసామ్ ॥
(భక్తి యోగము)

**భావము :** నాయందే వారి మనస్సును లగ్నము చేసివున్న నాభక్తపరులు కలరు. నేను శీఘ్రముగ వారినందరిని మృత్యు సంసార సముద్రమునుండి బయటపడ వేయుచున్నాను.

**వివరము :** వరుసగ 5,6,7 మూడు శ్లోకములలో బ్రహ్మయోగము, కర్మయోగము, భక్తియోగము మూడు చెప్పబడినవి. ఈ మూడు విధానములననుసరించి వారిని తప్పక మృత్యుమయమై సారములేనిదైన జన్మకర్మల జలమయమైన సముద్రము నుండి బయటపడవేతును. మోక్షమునిస్తునని పరమాత్మ తెలిపాడు.

*(11)శ్లో॥ 8 ః మయ్యేవ మన ఆధత్స్వమయి బుద్ధిం నివేశయ ।*
*నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః ॥*
*(బ్రహ్మయోగము)*

*(11)శ్లో॥ 9 ః అథ చిత్తం సమాధాతుం న శక్నోషి మయి స్థిరమ్ ।*
*అభ్యాసయోగేన తతో మా మిచ్ఛాఽప్తుం ధనంజయ! ॥*
*(బ్రహ్మయోగము)*

**భావము :** నాయందే మనసునుంచి ఎల్లపుడు నన్నే తలచుచుండుము. నాయందే బుద్ధినుంచుము. ఆ తరువాత నన్నే పొంది నాయందే నిలుతువు. ఈ విషయములో అనుమానము లేదు.

నీ చిత్తమును స్థిరరీతి నాయందు నిలుపశక్తిలేని ఎడల ఓ అర్జునా! అట్టి శక్తి అభ్యాసయోగమున పొందగలవు.

**వివరము :** పరమాత్మ అంశయైన ఆత్మ మీదనే మనోధ్యాసనుంచవలెను. ఆత్మ యోచన తప్ప వేరు యోచన బుద్ధికి లేకుండ చేయవలెను. మనో బుద్ధులకు ఇంద్రియ ధ్యాసలు లేని దాని వలన, తదుపరి పరమాత్మనే పొంది పరమాత్మ యందే నిలుతువు.

మనస్సు నిలచుట వలన బుద్ధి నిలచును, బుద్ధి నిలచుట వలన చిత్తము నిలచును. ఇలా ఒకటి నిలిచిన మరొకటి నిలుచునని వెనుక తెలుసుకొన్నాము. చిత్తము స్థిరరీతి నిలువకపోతే మనస్సు, బుద్ధి నిలువలేదనియే చెప్పనగును. అట్లు మనస్సునుగాని, బుద్ధినిగాని, చిత్తమునుగాని నిలుపలేనివానికి అభ్యాసయోగముచేత అట్టి నిలుపగలశక్తి లభించును. యోగాభ్యాసము వలన తప్పక యోగము సాధ్యమగును.

(11) శ్లో ॥10 : అభ్యాసేஉప్యసమర్థోஉసి మత్కర్మపరమో భవ ।
మదర్థ మపి కర్మాణి కుర్వన్ సిద్ధి మవాప్స్యసి ॥
(భక్తియోగము)

**భావము :** మనస్సు నిల్పు అభ్యాసమునకు సమర్థత లేనివాడవైతే నా పనులు చేయుము. నా కొరకు పనులు చేయుట వలన మోక్షమును పొందవచ్చును.

**వివరము :** ఎంత సాధన చేసినప్పటికి మనస్సు నిలకడ కల్గక ప్రాపంచిక విషయముల మీద చలించుచున్న ఎడల, ఇక ఆ సాధన చేతకాదనిపించిన, ఆ సాధన వదలివేసి పరమాత్మ పనులైన ధర్మప్రచారకార్యములు చేయవలెను. అలా పరమాత్మ పనియైన ధర్మప్రచార సంబంధ కార్యముల చేయుట వలన ముక్తి పొందవచ్చును.

(11) శ్లో॥ 11 : అథైత దప్యశక్తోஉసి కర్తుం మద్యోగ మాశ్రితః ।
సర్వకర్మఫలత్యాగం తతః కురు యతాత్మవాన్ ॥
(కర్మ యోగము)

**భావము :** భక్తియోగము చేత నాపనులు చేయుటకు కూడ సామర్థ్యములేని వాడవైతే అఖిల కర్మఫలత్యాగివగుము. అట్టికర్మ యోగమున నన్ను పొందగలవు.

**వివరము :** ఇక్కడ వరుసగ 9,10,11 శ్లోకములలో బ్రహ్మ, భక్తి, కర్మయోగముల గూర్చి చెప్పబడియున్నది. 9వ శ్లోకమున బ్రహ్మయోగము చేతకాకపోతే బ్రహ్మ యోగ సాధన చేయమన్నాడు. 10వ శ్లోకములో ఆ బ్రహ్మయోగ సాధన చేత కాని

ఎడల భక్తియోగమాశ్రయించి, పరమాత్మ కార్యములైన ధర్మప్రచార సంబంధ కార్యములు చేయమన్నాడు. ఆ కార్యములు చేతగాని ఎడల 11వ శ్లోకమున కర్మయోగమాశ్రయించి కర్మఫలత్యాగివై పాప పుణ్యములను పొందక ఉండమన్నాడు. ఇట్లు ఒకదాని తరువాత మరొక దానికి అవకాశమివ్వమని పరమాత్మ తెల్పాడు.

(11)శ్లో ॥12 : శ్రేయో హి జ్ఞాన మభ్యాసాత్ జ్ఞానా ద్ధ్యానం విశిష్యతే ।
ధ్యానా త్కర్మఫలత్యాగ స్త్యాగాచ్ఛాన్తి రనన్తరమ్ ॥
(బ్రహ్మ, కర్మ యోగములు)

**భావము :** అభ్యాసముకంటే జ్ఞానము మేలు, ధ్యానము జ్ఞానముకంటే గొప్పది, ధ్యానమును మించినది కర్మఫలత్యాగము. మనిషికట్టి త్యాగముచే శాంతికల్గును.

**వివరము :** ప్రస్తుత కాలములో చాలామంది జ్ఞానము తెలియకనే అభ్యాసము చేయుటకు మొదలు పెట్టుచున్నారు. ఒక ఊరికి పోవాలనుకొన్నవాడు ఆ ఊరికి పోవుదారి ఏదో పూర్తిగా ఇతరుల ద్వార తెలుసుకొని, ఇది సరియైన దారియని నిశ్చయము చేసుకొని, ఆ దారివెంట ప్రయాణించినట్లయిన గమ్యము చేరగలడు. అట్లుకాక దారి తెలియకనే ప్రయాణించుట ముఖ్యమని పోతూ, ఊరు వస్తుందనుకొంటే ఏ ఊరొచ్చునో! నీవు చేరవలసిన ఊరు రాకపోవచ్చును. అట్లే మోక్షమను గమ్యము చేరుటకు జ్ఞానమను దారిని పూర్తిగ తెలిసివుండాలి. జ్ఞానము తెలియకనే సాధన చేయువారు వృథా ప్రయాసపడినట్లగును. పూర్తి జ్ఞానము చెప్పకనే ఉపదేశమిచ్చు గురువులు, జ్ఞానము తెలుసుకోకనే ఉపదేశము తీసుకొను శిష్యులు ముఖ్యముగ **"శ్రేయోహి జ్ఞానమభ్యాసాత్"** అను విషయము గుర్తుంచుకోవాలి.

జ్ఞానము తెలిసిన తరువాత జ్ఞానము ప్రకారము అభ్యాసము చేయాలి. అలా అభ్యాసము చేయుట వలన చివరకు సిద్ధికల్గును. అటువంటి మనోసాధన చేయలేని ఎడల ఆ అభ్యాసముకంటే కర్మఫలత్యాగము శ్రేష్ఠమైనది. సాధన రూపముగలేని కర్మయోగము ఆచరించుటవల్ల మోక్షసిద్ధి ప్రాప్తించును. మనో

నిలకడమీద ఆధారపడిన బ్రహ్మయోగ సాధనకంటే కర్మయోగసాధన సులభమైనదని తెలియాలి.

*(11) శ్లో ॥13 : అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవచ ।*
*నిర్మమో నిరహంకార స్సమదుఃఖసుఖః క్షమీ ॥*
*(కర్మయోగము)*

*(11) శ్లో ॥14 : సన్తుష్ట స్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః ।*
*మయ్యర్పితమనోబుద్ధి ర్యో మద్భక్త స్సమేప్రియః ॥*
*(కర్మయోగము)*

**భావము :** సర్వ జీవరాసులందు ద్వేషములేక, కరుణ స్నేహముకల్గి, మమత విడిచి, అహంకారములేకుండ, కల్గెడి సుఖదుఃఖములను సమముగ చూచుచు, ఓర్పుకల్గి వుండువాడు, ఎల్లపుడు సంతృప్తికల్గిన కర్మయోగియై మనోబుద్ధియందు మోక్షము పొందవలెనను దృఢనిశ్చయము కల్గివుండు భక్తునియందు నాకధిక ప్రేమ.

**వివరము :** సాధ్యమైనంతవరకు సర్వజీవరాసుల ఎడల స్నేహము కరుణకల్గి, ద్వేషము మోహము లేకుండ మసలుకొనుచు, అహంకారము లేకుండ జరిగెడి పనులలో వచ్చు సుఖదుఃఖములను ఓర్పుతో సమముగ లెక్కించుచు, సుఖములకు పొంగక దుఃఖములకు కృంగకవుంటూ, ఎల్లప్పుడు తనకు లభించిన వాటితోనే తృప్తిపొంది, మోక్షమును చేరవలెనను గట్టి సంకల్పము మనసులోకల్గి, బుద్ధితో అదే అభిప్రాయము కల్గి అహమును హెచ్చరించుచు, ఎప్పటికప్పుడు అహమును బుద్ధిచేత అణచివేయు వాడు నాకు మిగుల ప్రియుడని పరమాత్మ చెప్పాడు.

*(11) శ్లో ॥15 : యస్మాన్నో ద్విజతే లోకో లోకా న్నో ద్విజతే చ యః ।*
*హర్షామర్ష భయోద్వేగైర్ముక్తో యస్సచ మే ప్రియః ॥*
*(బ్రహ్మయోగము)*

**భావము :** అర్జునా! ఎవని వలన ప్రపంచమునకు భయములేదో, ప్రపంచముచే

ఎవడు భయపడడో, వాడు కోపమును, భయమును, సంతోషమును మనో వ్యాకులతను పొందడు, వాడే నాకు పరమప్రియుడు.

*(11) శ్లో॥16 : అనపేక్ష శ్శుచిర్దక్ష ఉదాసీనో గతవ్యథః ।*
*సర్వారమ్భ పరిత్యాగీ యో మద్భక్త స్సమే ప్రియః ॥*
*(బ్రహ్మయోగము)*

**భావము :** దేనియందు ఆశలేనివాడును, మనో శుభ్రతకల్గినవాడును, పట్టుదల కల్గిన వాడును, ఎవరి పక్షము లేనివాడు, దేనిని ఆరంభించక వదలివేసిన బ్రహ్మయోగి అయిన భక్తుడు నాకధిక ప్రియుడు.

*(11) శ్లో॥17 : యోన హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి ।*
*శుభాశుభ పరిత్యాగీ భక్తిమాన్ యస్స మే ప్రియః ॥*
*(కర్మయోగము)*

**భావము :** సంతోషపడక అట్లే దుఃఖమును పొందక, ద్వేషమందక, అభిలాషియు కాక, మంచిచెడు పుణ్యపాపములను పొందక, వాటిని పరిత్యజించినవాడు ఎవడో వాడు నాకు మిగులప్రియుడు.

*(11) శ్లో॥18 : సమ శ్శత్రౌ చ మిత్రేచ తథా మానావమానయోః ।*
*శీతోష్ణ సుఖదుఃఖేషు సమ స్సంగ వివర్జితః ॥*
*(బ్రహ్మ, కర్మయోగములు)*

*(11) శ్లో॥ 19 : తుల్య నిన్దా స్తుతి ర్మౌనీ సన్తుష్టో యేన కేనచిత్ ।*
*అని కేతః స్థిరమతి ర్భక్తిమాన్ మే ప్రియో నరః ॥*
*(కర్మయోగము)*

**భావము :** మిత్రులయందు, శత్రువులయందు, మానావమానములందు, శీతోష్ణ సుఖదుఃఖములందు సమతకల్గినవాడు, పాపపుణ్యములను సమానముగ వర్జితము

చేసినవాడు, స్థుతియు, నిందయు సమముగ తలచి దొరికిన దానితో తృప్తిచెంది గృహములు మొదలగు నివాసస్థలముల మీద ఆశలేని స్థిర మనస్కుడగువాడు నాకు ప్రియుడు.

(11)శ్లో 20 : యే తు ధర్మ్యా మృత మిదం యథోక్తం పర్యుపాసతే ।
శ్రద్ధధానా మత్పరమా భక్తాస్తేஉతీవ మే ప్రియాః ॥
(బ్రహ్మ, కర్మయోగములు)

**భావము :** ఎవరు నా పరమపదము మీద శ్రద్ధగలిగి, ఈ మృతములేని ధర్మము లను ఏ విధముగ చెప్పియున్నారో, ఆ విధముగ ఉపాసించు భక్తుడు నాకు పరమప్రియుడు.

**వివరము :** మోక్షమే జీవితాశయముగ ఉన్నవాడు అన్నిటికంటే ఎక్కువ శ్రద్ధ కలిగి పరమాత్మ సంబంధమైన ధర్మములను పూర్తిగ తెలుసుకొనును. అమృతమైన ధర్మములు ఎలావున్నవో అలాగే ఆచరించి పరమాత్మను చేరవలెనని ప్రయత్నము చేయువారెవరైతే ఉన్నారో వారు పరమాత్మకు మిక్కిలి ప్రీతిపాత్రులుగనున్నారు.

ఈ అధ్యాయములో పరమాత్మకు ప్రియులైన వారిని గురించి చెప్పుచు, ఎవరైతే ధర్మాచరణ చక్కగ కల్గియున్నారో వారందరు ఇష్టులేనన్నాడు. అంతేకాక పరమాత్మను చేరు మార్గములు రెండేకాదు మరొక మార్గమున్నదని గుర్తు చేశాడు. ఆయనకు ఇష్టమైనవారు కొందరున్నారంటే, ఇష్టములేని వారు కూడ ఉన్నారని అర్థమగుచున్నది. పరమాత్మకు అందరు సమానమే కదా! ప్రియులు, అప్రియులు కూడ ఉందురా! అని కొందరడుగవచ్చును. వాస్తవముగ ఆయనకు అందరు సమానులే, కానీ మనమే కొందరము దగ్గరగ పోవుచున్నాము. కొందరము దూరముగ పోవుచున్నాము. అందువలన ఒకప్పుడు వెనుక అధ్యాయములలో **అజ్ఞానులకు దవ్వు, జ్ఞానులకు దాపు** అని ఆయనే చెప్పివున్నాడు. మనకున్న జ్ఞాన అజ్ఞానములను బట్టి మనమే ఆయనను ప్రియునిగ, అప్రియునిగ చేసుకొనుచున్నాము. పుట్టినపుడు

సామాణ్యులమైన మనము  పెరిగిన తరువాత మాణ్యులమగుచున్నాము లేక నీచులము అగుచున్నాము.  అట్లే పుట్టినపుడు దైవము దృష్టిలో సమానులమైన మనము పెరిగిన తరువాత జ్ఞానమార్గముననుసరించి పురుషోత్తముడైన దైవమునకు దగ్గర కావచ్చును, లేక అజ్ఞాన మార్గమనుసరించి దూరము కావచ్చును.  అది మన అనుకరణను బట్టి ఉండునని తెలియవలెను.

ఇంతటితో భక్తి యోగమనబడు ఈ అధ్యాయము సమాప్తము. ఈ అధ్యాయములోని శ్లోకముల వివరము క్రిందగలదు చూడండి.

| | | | |
|---|---|---|---|
| 1) | కర్మయోగము | – | 6 |
| 2) | బ్రహ్మయోగము | – | 6 |
| 3) | భక్తియోగము | – | 2 |
| 4) | బ్రహ్మయోగము, కర్మయోగము | – | 3 |
| 5) | కర్మ, బ్రహ్మ, భక్తియోగములు | – | 2 |
| 6) | మోక్షము | – | 1 |
| | మొత్తము శ్లోకములు | | 20 |

*****

## పన్నెండవ అధ్యాయము

# క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగము

**అర్జునుడిట్లనియె :-**

(12)శ్లో॥ 1: ప్రకృతిం పురుషం చైవ క్షేత్రం క్షేత్రజ్ఞ మేవ చ ।
ఏత ద్వేదితు మిచ్ఛామి జ్ఞానం జ్ఞేయం చ కేశవ ! ॥
(ప్రకృతి, పురుషుడు)

**భావము :** ఓకృష్ణా! ప్రకృతి అనగా ఏది? పురుషుడెవడు? క్షేత్రము అనగానేది? క్షేత్రజ్ఞుడెవడు? జ్ఞానమేది? జ్ఞేయమైనదేది? వీటన్నిటిని తెలియవలెనని కోరిక కల్గినది తెలియజెప్పుము.

**వివరము :** ఇక్కడ అర్జునుడడిగినవి ఆరు ప్రశ్నలు గలవు. ఇవి చాలా ముఖ్యమైన ప్రశ్నలు. ఆ ప్రశ్నలు మూడు జతలుగనున్నవి. 1) ప్రకృతి, పురుషుడెవరు? 2) క్షేత్రము ఏది, క్షేత్రజ్ఞుడెవరు? 3) జ్ఞానము, జ్ఞేయము లేవి? ఈ ప్రశ్నలలో కొన్నిటికి వెనుక జవాబులు చెప్పబడివున్నవి. తనకున్న అనుమానములు నివృత్తికోసము తిరిగి ప్రకృతి, పురుషుల గురించి అడిగాడు. అట్లే జ్ఞానము జ్ఞేయమును గురించి అడిగాడు. ఇకపోతే ఇందులో క్రొత్త ప్రశ్నలు క్షేత్రము, క్షేత్రజ్ఞుడు ఎవరు అన్నవే. వీటిని గురించి భగవంతుడైన శ్రీకృష్ణుడు ఏమి చెప్పుచున్నాడో క్రింద చూచెదము.

**శ్రీ భగవంతుడిట్లనియె :-**

(12) శ్లో॥ 2 : ఇదం శరీరం కౌన్తేయ ! క్షేత్ర మిత్యభిధీయతే ।
ఏతద్యో వేత్తితం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః ॥
(ప్రకృతి, పురుషుడు)

**భావము :** అర్జునా! ఈ శరీరమే క్షేత్రమని చెప్పబడుచున్నది. దీనిని పూర్తిగ ఎవడు తెలిసివున్నాడో వానిని జ్ఞానులైనవారు క్షేత్రజ్ఞుడని చెప్పుచున్నారు.

**వివరము :** క్షేత్రమనగ భూమి అని అర్థము. క్షేత్రజ్ఞ అనగ భూమిని తెలిసినవాడని అర్థము. ఒక ఇంటి యజమాని తన ఇంటి వివరములన్ని తెలిసివుండును. తన ఇంటికి వెనుక తలుపు ఉన్నది లేనిది, ఆ ఇంటి అధిపతికే తెలుసును. అట్లే ఎన్ని కిటికీలు, ఎన్ని తలుపులు, ఎన్నిగదులున్నది పూర్తిగ తెలిసినవానినే ఆ ఇంటిని గూర్చి తెలిసిన వాడందుము. అట్లే ఒక ఎకరము పొలము ఒకనికి ఉన్నదను కొందాము. ఆ ఎకరములో ఎన్ని గుంతలున్నది, ఎక్కడ గట్టున్నది, ఎక్కడ కాలువవున్నది ఆ ఎకర క్షేత్రము యొక్క యజమానికే తెలుసును. అలాగే మన శరీరము కూడ ఒక పొలములాంటిదే. దీనికొక యాజమాని ఉన్నాడు. వానికి దీని సవివరమంతయు తెలిసియున్నది. పొలములో ఎచటైన పని చేయుటకు యజమానికి అధికారముండును. యజమాని అధికారము పొలమంతా ఉన్నట్లు, శరీరమను క్షేత్రములో శరీరమంతట శరీర యజమాని యొక్క అధికారము వ్యాపించివుండును. శరీరమంతట అధికారము వ్యాపించి ఉన్నవాడు, శరీరమంత అణువణువున తెలిసివున్నవాడు, శరీరమునకు అధిపతియైన ఆత్మయనువాడు ఒకడున్నాడు. సంపూర్ణ జ్ఞానము తెలిసినవారు శరీరములో అధిపతిగ ఉన్న ఆత్మనే క్షేత్రజ్ఞుడని చెప్పుచున్నారు. ఇక్కడ గమనించవలసిన విషయమేమనగా? జీవాత్మ ఆత్మల విభజన తెలియనివారు గీతను వ్రాయడములో క్షేత్రజ్ఞుడనగా జీవాత్మ అని వ్రాశారు. అది పూర్తి ధర్మవిరుద్ధమైన విషయము. క్షేత్రజ్ఞుడు జీవాత్మ ఏమాత్రము కాదు. ఆత్మయే క్షేత్రజ్ఞుడని గ్రహించవలెను.

*(12)శ్లో ॥ 3 : క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత ! ।*
*క్షేత్ర క్షేత్రజ్ఞ యో ర్జ్ఞానం యత్తద్ జ్ఞానం మతం మమ ॥*
*(ప్రకృతి, పురుషుడు)*

**భావము :** సర్వ శరీరములందున్న క్షేత్రజ్ఞుడను నేనేయని తెలియుము. శరీరమును అందులోని ఆత్మను తెలుపు జ్ఞానమే నిజమైన జ్ఞానమని నా భావము.

**వివరము :** క్షేత్రవేత్త అయిన ఆత్మ శరీరమంతయు వ్యాపించి శరీర కార్యములు జరుగునట్లు చేయుచున్నాడు. అలాగే వేరు వేరు శరీరములందు వేరువేరుగ ఆత్మ అనబడునది ఉండి ఆ శరీరమునకు తగిన చైతన్యము నిచ్చి కదలించుచున్నది. అనేక జీవరాసులు అనేక శరీరములు ధరించి కోట్లాదిగనున్న జగత్తులో, ప్రతి జీవరాసి ధరించిన శరీరములో ఆత్మ కలదు. జగత్తులో ఎన్నో జీవరాసులు గలవు. అట్లే వాటి శరీరములలో ఎన్నో ఆత్మలు కలవు. అన్ని శరీరములలో జీవుడు అను పేరున్నవాడు ఒకడే అయినప్పటికి, ఒక్కొక్క శరీరములో ఒక్కొక్క జీవుడున్నాడు. అలాగే ఆత్మ అను పేరున్నది ఒకటే అయినప్పటికి, అనేక శరీరములలో అనేక జీవులతో పాటు అనేక ఆత్మలున్నవని గ్రహించవలెను. చాలా మంది జ్ఞానులు అన్ని శరీరములలో ఒకే ఆత్మ ఉన్నదని పొరపడుచున్నారు. అలా అన్ని శరీరములలో ఒకే ఆత్మలేదని, అన్ని శరీరములలో ఒకే పేరున్న ఆత్మవున్నదని గ్రహించవలెను.

భూమి మీద జీవుడు ధరించిన శరీరములెన్నివున్నను అవి అన్నియు ప్రకృతితో తయారైనవే. కావున శరీరములు ప్రకృతి యొక్క అంశతో తయారైనవని చెప్పగలము. అదే విధముగనే జగతిలో జీవులెన్నివున్నను అవి అన్నియు పరమాత్మచే తయారైనవి. కావున జీవులను పరమాత్మ అంశ అనగలము. మరియు అదే విధముగ అన్ని శరీరములలోవున్న ఆత్మలన్ని పరమాత్మచేత తయారైనవే, కనుక ఆత్మలు కూడ పరమాత్మ అంశ అని చెప్పబడుచున్నవి. ఒక శరీరము ప్రకృతి అంశకాగ అందులోని జీవుడు, ఆత్మ, పరమాత్మ అంశమని తెలియుచున్నది. ఈ జగత్తులో కార్యములు జరుగుటకు శరీరము పరికరములాగ ఉండగ, అందులోని పనులు చేయించు శక్తిగ ఆత్మవున్నది. ఆత్మ పనులు చేయిస్తుండగ, శరీరము చేయుచుండగ, ఆ పనులలో కలుగు అనుభూతులను జీవుడు అనుభవిస్తున్నాడు. ఈ విధముగనే సర్వజగత్తంతయు శరీరము, జీవుడు, ఆత్మ వాటి వాటి పాత్రలు వహిస్తున్నవని తెలియుట ఉత్తమమైన జ్ఞానమందురు. శరీరమను క్షేత్రములో క్షేత్రజ్ఞుడను ఆత్మ ఏ విధముగ పనులు చేయిస్తున్నదో తెలుపునట్టి జ్ఞానమే నిజమైన జ్ఞానమని భగవంతుడు చెప్పాడు.

ఇక్కడ కొందరికొక అనుమానము రావచ్చును. అదేమనగా! *"అందరి శరీరములలో ఒకే పేరు గల ఒకే పరమాత్మ అంశయైన ఆత్మవున్నదని చెప్పారు. అన్ని శరీరములలోనున్న ఆత్మలు ఒకే అంశకల్గి ఒకే లాగుండునని చెప్పారు. ఆత్మలు శరీరములకు శక్తి నిచ్చి పని చేయిస్తున్నవని కూడ చెప్పారు. జగత్తులో వేరు వేరు శరీరములకు వేరు వేరు శక్తికలదు. ఒకడు ఎత్తిన బరువును మరొకడు ఎత్తలేడు. బక్కపలుచని వాడు బలిసిన శరీరమున్న వానిని కూడ కొట్టగలడు. బలిసినవాడు చిన్న బరువును కూడ ఎత్తలేక పోవుచున్నాడు. అంతేకాక ఒకే బరువున్న ఇద్దరు వ్యక్తులలో ఒకడు మోయు బరువును మరొకడు ఎత్తలేడు, మోయలేడు. ఇద్దరిలోను ఒకే విధమైన ఆత్మలున్నపుడు ఆ శరీరములలో తేడా ఎందుకు వచ్చినది?"* అని వారి ప్రశ్న. క్షేత్రము, క్షేత్రజ్ఞుని తెలియుట ముఖ్య జ్ఞానమని చెప్పియుండుట వలన ఇక్కడ శరీరము ఆత్మను గురించిన ప్రశ్న సమంజసమైనదని చెప్పవచ్చును. ఈ ప్రశ్నకు అంతరంగము నుండి ఏ జవాబు వస్తుందో మీరు మేము అందరము క్రింద చూస్తాము.

మనుషులలోనే శారీరకముగ ఎందరో బలవంతులను బలహీనులను మనము చూచియేవుందుము. అలాగే ఆరోగ్య అనారోగ్యులను కూడ చూచివుందుము. కొందరు తొందరగ రోగగ్రస్తులుకావడము. కొందరు ఎటువంటి రోగక్రిముల మధ్య ఉన్నప్పటికి రోగగ్రస్తులు కాకపోవడము జరుగుచున్నది. ఎక్కువ తినువారు, బలమైన తిండి తినువారు, బలహీనులుగ ఉండడము, కొందరు తక్కువ తినుచున్నప్పటికి, బలమైన ఆహారము కాకపోయినప్పటికి వారు బలముగ ఉండడము జరుగుచున్న విషయమే. రోగముల మధ్యనున్న వారికి రోగములు రాకపోయి ఆరోగ్యముగ ఉండడము, బలహీనమైన ఆహారము తీసుకొన్నప్పటికి, కొద్దిపాటి ఆహారము తిన్నప్పటికి బలవంతులుగ ఉండడము, అంతేకాక కొన్ని చోట్ల ఒకపూట చాలా కొద్దిపాటి తిండితో బ్రతుకుచు అన్ని పనులు చేసుకొంటు ఆరోగ్యముగనున్న వారుండడము కలదు. ఈ విధముగ హెచ్చు తగ్గు భేదములు ఉండడమునకు కారణము, వారి శరీరములలోనున్న ఆత్మ యొక్క పాత్రయని తెలియుచున్నది.

ఆత్మ శరీరమంతా వ్యాపించి శరీరము ద్వారా పనిచేయిస్తుండడమే కాక, ఆ శరీరము ఎంత పొడవు పెరుగవలెనో, ఎంత పొట్టిగనుండవలెనో నిర్ణయించి పెంచునది ఆత్మయే. శరీరము యొక్క పెరుగుదలయే కాక, శరీరములోని ముఖము యొక్క అందము, ముఖములోని ముక్కు పెదవులు మిగత కండరములు, ముఖవర్చస్సు యొక్క అందమును తీర్చిదిద్ది పెంచునది ఆత్మయే. శరీరము యొక్క వంపు సొంపులను క్రమబద్ధీకరణ చేయుటయే కాక, శరీర ఆరోగ్యమును అనారోగ్యమును తీర్చి పెట్టునది ఆత్మయేనని తెలియుము. ఇంకనూ శరీరములో తనశక్తిని నరముల ద్వారా ప్రసరింపజేయుచు శరీరమునకు బలము నిచ్చునది ఆత్మయే. బక్కచిక్కిన శరీరములోని బలము, దృఢ శరీరములోని బలహీనతయు అన్నియు ఆత్మయే కల్గించుచున్నది. శరీరములో అన్నిటికి కారణమైన ఆత్మ బ్రహ్మనాడిని కేంద్రముగ చేసుకొని, మిగతా నాడుల ద్వార శరీరమంతా వ్యాపించివున్నది. ఆత్మ శరీరమంత చైతన్య (శక్తి) రూపముగ వ్యాపించి శరీరమును కదలించు కార్యమొకటి చేస్తు, శరీర పెరుగుదల, ఆరోగ్యము మొదలగు మరొక కార్యములు కూడ చేయుచున్నది.

ఆత్మ శరీరములో రెండు భాగములుగ తన కర్తవ్యమును చేయుచున్నది. ముఖ్యముగ శరీర బలాబలము యొక్క పని చూడడమొక కార్యము కాగ, రెండవది శరీర ఆరోగ్య అనారోగ్యముల విషయమైన కార్యము. ఒక శరీరములోని ఆత్మయొక్క కర్తవ్యము రెండు విధములుగ నిర్వర్తింపబడుచున్నదను మాట వాస్తవమే అయినప్పటికి, చాలామందికి ఈ విషయము తెలియదు. ఆత్మ బ్రహ్మనాడిని కేంద్రముగ చేసుకొని, బ్రహ్మనాడి నుండి ప్రారంభమగు నాడుల ద్వారా శరీరమంత ప్రాకి, ప్రతి ధాతువులోను ప్రతి చిన్న భాగములోను చైతన్యముగనున్నది. అలా అంతట వ్యాపించి, జీవుని కర్మానుసారము జరుగవలసిన పనులకు కావలసిన కదలిక శక్తినిచ్చి, శరీరమును కదలించి పనిచేయిస్తున్నది. ఇది చాలా మందికి తెలిసిన విషయమేననుకుంటాను. శరీరమునకు బలమునిచ్చి కదలించు ఆత్మ, ఒక శరీరమునకు ఎక్కువ బలమునిచ్చుచు, మరొక శరీరమునకు తక్కువ బలము నివ్వడమేమిటని అడుగవచ్చును. **శరీరము ద్వారా ఏ కార్యము జరుగవలెనో,**

**అక్కడ ఆ కార్యము జరుగుటకు ఎంత బలము కావలెనో, అన్నీ కర్మననుసరించి ఉండును.** ఉదాహరణకు ఒకడొక మూట ఎత్తవలసినపుడు అక్కడ ఎంత బలము ఉపయోగింపబడవలెను, అతను పూర్తిపైకి ఎత్తునా లేక మధ్య వరకు ఎత్తునా, ఎత్తిన బరువును ఎంతసేపు మోయును అను విషయములన్ని కర్మననుసరించి ఉండును. జరుగవలసిన కార్యాకార్యములలో శక్తి ఆత్మదే అయినప్పటికి, అది కర్మననుసరించి ఉండడము వలన ఒకే కార్యములో ఒకడు బలవంతునిగ, ఒకడు బలహీనునిగ కనిపిస్తున్నారు. అలా భేదములు కనిపించని కర్మవేనని తెలుసుకోవలెను. అలా శరీరములోని ఆత్మబలము నాడుల ద్వారా వ్యాపించి పనులకు ఉపయోగపడడము ఒక కార్యము కాగ, రెండవ కార్యములో ఆత్మచైతన్యము (ఆత్మబలము) శరీరములో ప్రాకి అక్కడక్కడ గల కొన్ని స్థానముల్లో ప్రవేశించి మార్పుచెంది ద్రవముగను, కాంతిగను బయల్పడి శరీరమునకు ఆరోగ్య అనారోగ్యమును మరియు అందము అందహీనమును కలుగజేయుచున్నది.

బ్రహ్మనాడిలోగల ఏడు కేంద్రములనుంచి బయల్పడు శక్తి కదలికగ, ఆ కదలికలోని బలముగ, శరీరమునకు ఉపయోగపడుచున్నదని తెలుసుకొన్నాము. అలాగే ఆత్మశక్తి శరీరములోని ఏడుగ్రంథులలో ప్రవేశించి మార్పుచెంది ద్రవరూపముగ, మరియు కనపడని కాంతికిరణములరూపముగ మారి గ్రంథుల నుండి బయటపడుచు, శరీర ఆరోగ్య అనార్యోగములను, యవ్వన, వృద్ధాప్యములను కలుగజేయుచున్నది. ఏడుగ్రంథులనుండి బయల్పడునది కాంతియుక్తమైన ద్రవమని తెలియాలి. ఏడు నాడీకేంద్రములలో ముఖ్యమైన నాడీకేంద్రము అన్నిటికంటే పైన శిరోభాగములోనున్న సహస్రారమనబడునది. సహస్రారములో గల ఆత్మ క్రిందనున్న ఆరు కేంద్రములలో ఎంత శక్తి విడుదల కావలెనో నిర్ణయించుచున్నది. అలాగే గ్రంథులలోకెల్ల ముఖ్యమైన గ్రంథి శిరోభాగములోనే కలదు. ఇది ఆకారములో అన్ని గ్రంథులకంటే చిన్నదైనప్పటికి గ్రంథులకన్నిటికి రాజులాంటిది, కావున దీనికి గ్రంథిరాజమని పేరు గలదు. పిండిమిషనులో గింజలు పిండిగ మారి బయట కొస్తున్నట్లు, ఆత్మబలము గ్రంథులలో ప్రవేశించి ద్రవరూపముగ బయటికి వస్తున్నది.

నాడీకేంద్రములలో పైనున్న నాడీకేంద్రము క్రింది ఆరు కేంద్రముల మీద అధికారముకల్గి శక్తి బహిర్గతమును నిర్ణయించునట్లు, గ్రంథులలో పైనున్న గ్రంథిరాజము క్రింద గల ఆరు గ్రంథుల మీద అధికారముకల్గి వాటిని పని చేయిస్తున్నది. ఉదాహరణకు శరీరములో మనకు తెలిసిన ఒక గ్రంథి విషయము చూస్తాము.

శరీరములో జీర్ణప్రక్రియ సక్రమముగ జరుగుటకు ఉపయోగపడు రసమును స్యందించు లాలాజలగ్రంథియనబడు గ్రంథులు మన ముఖములో ఇరువైపుల చెవులకు దగ్గరగ కొద్ది క్రిందిగానున్నవి. ఈ గ్రంథి ఒక చిన్న చెలిమెలాంటిది. దీనియందు లాలాజలమను ద్రవము ఊట కల్గివున్నది. ఈ ఊట నిమ్మకాయను, చింతకాయను తలచుకొన్నప్పుడు ఎక్కువగ ఉండును. ఈ లాలాజలగ్రంథి అనబడు దానిలో ఊరు లాలాజలమను రసము, మనము తిను ఆహారములోని చక్కెరను తీపిపదార్థము (గ్లూకోజ్)ను, లేక పిండి పదార్థములను జీర్ణముచేయును. లాలాజలగ్రంథి నుండి లాలాజలము ఎంత తయారు కావలెననునది పైనున్న గ్రంథిరాజము నిర్ణయించును. ఈ రసము యొక్క సామర్థ్యమును బట్టి శరీరములోని జీర్ణశక్తివుండును. నోటిలో ఊరు ఈ రసము ఎక్కువ తయారైతే పైన చెప్పిన పదార్థములు బాగా జీర్ణమగును. ఈ రసము తక్కువ తయారైతే పైన చెప్పిన పదార్థములు సరిగ జీర్ణము కావు. శరీరమునకు వేడిమిని శక్తినిచ్చు కార్బోహైడ్రేట్స్ అనునవి పిండిపదార్థముల నుండి తయారు కాగలవు. పిండి పదార్థములను జీర్ణము చేయు లాలాజలరసస్యందన తక్కువైతే పిండి పదార్థముల జీర్ణము తక్కువగును. అలాగైనపుడు వేడిమినిచ్చు కార్బోహైడ్రెట్స్ తక్కువగుట వలన శరీరము నిస్సారముగ ఉండుట బలహీనత ఏర్పడును. ఇటువంటి ఆరోగ్య అనారోగ్యమునకు ముఖ్యకారణము లాలజల గ్రంథియని తెలియుచున్నది. ఇలా శరీరములో గల మిగిలిన గ్రంథుల రసము కూడ ఒక్కొక్కటి ఒక్కొక్క రకముగ తమ పనులు చేయుచు శరీరము ఆరోగ్యముతో సంబంధము పెట్టుకొనుచున్నవి. కంఠభాగములో ఉన్న థైరాయిడ్ గ్రంథి

ముఖవర్చస్సు, ముక్కు, పెదవుల పెరుగుదలను నిర్ణయించి వాటి ఆరోగ్యములను పర్యవేక్షించును. అలాగే పైత్యరసగ్రంథి, క్లోమరసగ్రంథులు రెండు జీర్ణక్రియలో ఉపయోగపడును. క్లోమరసగ్రంథిలో తయారగు క్లోమరసము జీర్ణక్రియలో ఉపయోగపడడమే కాక, ఇన్సులిన్ అను హార్మోన్‌ను తయారు చేసి ఇన్సులిన్ ద్వారా శరీరములో గ్లూకోజ్‌శాతము నిర్ణయించి షుగర్ రోగమునుండి కాపాడుచున్నది. ఈ గ్రంథి పనిచేయక పోతే షుగర్‌రోగము తప్పదు. వీర్యగ్రంథులలో తయారగు వీర్యమును బట్టి కూడ శరీరము ఆరోగ్యముగవుండును. వీర్యగ్రంథుల నుండి తయారైన వీర్యము శరీరములో నిలువవుండును. వీర్యము నిలువ ఎక్కువైన తక్కువైన ఆరోగ్యములో మార్పుండును. ఎక్కువ నిలువ ఉంటే గ్రంథుల పని మందగించి శరీరములో మార్పువచ్చి కొద్దిగ అనారోగ్యమగును. ఈ విధ అనారోగ్యము ఎక్కువ మానసికముగ, కొద్దిపాటి శారీరకముగవుండును. యుక్తవయస్సులో వీర్యము నిలువ ఎక్కువ లేనట్లు బయటికి పోవు విధానము కూడ గ్రంథిరాజము చేయగలదు. ఎక్కువ వీర్యము బయటికి పోయి తయారు చేయుటకు గ్రంథులకు పని ఎక్కువైన శరీర అనారోగ్యము ఎక్కువగును. శరీరము నుండి క్రమము మించి ఎక్కువ వీర్యనష్టమైనపుడు వెంటనే నిస్పృహ నిరుత్సాహము ఏర్పడును. వీర్యగ్రంథులలో తయారగు వీర్యములోనున్న వీర్యకణములలో కంటికి కనిపించు నీలవర్ణమగు ప్రకాశము కూడ కలదు. వీర్యగ్రంథులలో తయారగు వీర్యము గ్రంథిరాజము యొక్క సామర్థ్యము మీద ఆధారపడివుండును. కర్మను అనుసరించి అవి పనిచేయునట్లు నిర్మాణముండుట వలన కొందరిలో వీర్యాభివృద్ధి ఎక్కువ, కొందరిలో తక్కువ ఉండును. దీనినే మగసిరి అనుట కూడ కలదు. సిరిలో పేద ధనికుడున్నట్లు మగసిరిలో కూడ కలరు. గ్రంథులన్ని ఒకదానితో ఒకటి గ్రంథిరాజముతో సంబంధము కల్గివున్నవి. ఆత్మజ్ఞానమున్న యోగులు మనస్సును గ్రంథిరాజములోనే లగ్నము చేయుచున్నారు. భృకుటికి మధ్యన ఉపజిహ్వాకు పై భాగమున గ్రంథిరాజము కలదు. పెద్దలందరు ఇక్కడే మనస్సును నిలుపమన్నారు. అలా నిలపగలిగిన బ్రహ్మయోగుల శరీరములోని గ్రంథులన్ని పూర్తిస్థాయి ఆరోగ్యముగ పని చేయు

చుండును. బ్రహ్మాయోగులకు షుగర్ రోగము లేకుండుట గమనార్హము. అంతేకాక యోగుల శరీరములోని గ్రంథిరాజము నుండి బయల్పడు కాంతితరంగములు ఎక్కువ ప్రకాశవంతముగనుండును. అదే సామాన్య మనిషిలో తక్కువ ప్రకాశము గలవిగ ఉండును. శరీర ఆరోగ్యములో కూడ గ్రంథిరాజము ముఖ్యపాత్ర వహిస్తున్నది. ఈ విధముగనే మిగతా గ్రంథులు కూడ వాటి వాటి పనులను చేయుచు శరీరమును ఆరోగ్యముగ ఉంచడములో పాత్రవహిస్తున్నవి. ప్రతి గ్రంథిరసములోను ఒక విధ కాంతి ఉండడము విశేషము. అన్నిటికి పెద్దదైన గ్రంథిరాజములో బయలుదేరిన కాంతి తరంగాలుగ ప్రసరిస్తు అన్ని గ్రంథులను పని చేయిస్తున్నది. గ్రంథిరాజము యొక్క కాంతి తరంగములు ఏ గ్రంథికి సరిగ లభ్యముకాక పోతే ఆ గ్రంథి సక్రమముగ పనిచేయదు.

శరీరములో గ్రంథుల విధానముతో కొంతపని, నాడీకేంద్రముల విధానముతో కొంతపని చేయుచు ఆత్మ, శరీరమను క్షేత్రమును పాలించు రాజుగ ఉన్నది. శరీరమంతా వ్యాపించి దాని మీద అధికారము కల్గియున్న ఆత్మను తెలియు జ్ఞానము చాలా ముఖ్యమైన జ్ఞానమని భగవంతుడు చెప్పాడు. కనుక అందరు బాహ్యవిషయ జ్ఞానము వదలి, శరీరాంతరంగమునందుగల జ్ఞానమును తెలుసు కొనుటకు ప్రయత్నించవలెను.

*(12)శ్లో॥ 4 : తత్క్షేత్రం యచ్చ యాదృక్చ యద్వికారి యతశ్చ యత్ ।*
*స చ యో యత్ప్రభావశ్చ తత్సమాసేన మేశృణు ॥*
*(ప్రకృతి, పురుషుడు)*

**భావము :** అట్టి క్షేత్రమేదియో, అది ఎట్టిదగునో, దానికేవికారములుగలవో, ఆ వికారములు దేనినుండి పుట్టుచున్నవో, ఎవడు క్షేత్రజ్ఞుడో, వానికేమి ప్రభావములున్నవో వాటిని క్లుప్తముగ చెప్పెదను వినుము.

**వివరము :** క్షేత్రము, క్షేత్రజ్ఞుని గురించిన జ్ఞానము తెలిపెదనని భగవంతుడు

చెప్పాడు. క్షేత్రమనగా ఏది? అది ఎన్ని విధములుగ ఉన్నది? దానికేయే మార్పులున్నవి. ఆ మార్పులు దేనివలన వచ్చుచున్నవి. క్షేత్రజ్ఞుడను వాడు ఎవడు? క్షేత్రజ్ఞునకున్న ప్రభావమేమిటి. ఆ ప్రభావము శరీరములో ఏ విధముగ పనిచేయుచున్నది. మొదలగు విషయములు తెలుసుకోవడమే జ్ఞానము.

*(12) శ్లో ॥ 5 : ఋషిభిర్బహుధా గీతం ఛన్దోభి ర్వివిధైః పృథక్ ।*
*బ్రహ్మసూత్రపదైశ్చైవ హేతుమద్భి ర్వినిశ్చితైః ॥*
*( ప్రకృతి, పురుషుడు)*

**భావము :** ఋషుల వలనను, వేదములవలనను, హేతువులతో సిద్ధాంతము చేయబడిన బ్రహ్మసూత్రముల వలనను, నిర్ణయింపబడి శరీరము మరియు ఆత్మ యొక్క విషయములు చెప్పబడివున్నవి. పెద్దలందరు నిర్ణయించిన జ్ఞానము తెలుసుకొందాము.

*(12) శ్లో ॥ 6 : మహాభూతా న్యహంకారో బుద్ధి రవ్యక్త మేవ చ ।*
*ఇంద్రియాణి దశైకంచ పంచేంద్రియ గోచరాః ॥*
*( ప్రకృతి )*

*(12) శ్లో ॥ 7 : ఇచ్ఛా ద్వేష స్సుఖం దుఃఖం సంఘాత శ్చేతనా ధృతిః ।*
*ఏతత్ క్షేత్రం సమాసేన సవికార ముదాహృతమ్ ॥*
*( ప్రకృతి )*

**భావము :** గొప్ప భూతములైన జీవాత్మ, ఆత్మయును, అవ్యక్తమైన బుద్ధి, అహము మొదలగునవియు, ఒకటిగనున్న పది ఇంద్రియములు, అగోచరమైన ఐదు ఇంద్రియములు.

ప్రేమ, అసూయ, సుఖదుఃఖము, ధైర్యము, భయము, శ్రద్ధ అను చేతనమైన సంఘము. ఎన్నో వికారములు గలదిగ ఈ శరీరక్షేత్రము చెప్పబడివున్నది.

**వివరము :** ఇక్కడ ఆరవ శ్లోకములో **'ఇంద్రియాణి దశైకంచ'** అను పదములో **"దశైకం"** అను పదమునకు ఏకముగనున్న పది అని అర్థముండవలెను. గీతలో చాలామంది పదనొకండు అని వ్రాసివుంచారు. ***ఏకం దశ అన్నప్పుడు పదకొండు అనడములో తప్పలేదు. దశ ఏకం అన్నపుడు పది ఒక్కటిగ అనగ పదియు ఒక గుంపుగ అని గ్రహించుకోవలెను.*** పది ఇంద్రియములను ఒక గుంపుగ, ఐదు ఇంద్రియములను ఒక గుంపుగ ఇక్కడ చెప్పడమైనదని తెలియాలి. ఇక్కడ పైన కనిపించెడి పది ఇంద్రియములను ఒకటిగ చెప్పారు. కనిపించని ఐదు ఇంద్రియము లను వేరుగ చెప్పారు. కనిపించెడు, కనిపించని వాటిని వేరు వేరుగ చెప్పడములో ఈ పది ఒకటిగ, మిగత ఐదు వేరుగనున్నవనడములో **'ఇంద్రియాణి దశైకంచ, పంచేంద్రియగోచరాః'** అని భగవంతుడన్నాడు. అంతేకాక ఆరవ శ్లోకములో మొదట మహాభూతా అను పదము వాడబడినది. ఈ పదమునకు కూడ చాలా గీతలలో తప్పు అర్థము వ్రాశారు. మహాభూత అను పదమునకు పంచభూతములు అన్నారు. అలా అనడము పూర్తి తప్పని తెలియవలెను. ఎందుకనగ పంచభూతములు శరీరములో ప్రత్యేకముగ లేవు. పంచభూతముల విభజనచేత తయారైన భాగములే శరీర భాగములుగ ఉండగ, తిరిగి ప్రత్యేకించి పంచభూతములని చెప్పడమేమిటి? ప్రత్యక్షముగ పంచభూతములచే మార్పుచెంది పుట్టిన భాగములు తప్ప శరీరములో పంచభూతములు ప్రత్యేకించిలేవు. కావున మహాభూత అను పదమునకు అర్థము పంచభూతములుకావని, మహాభూతములైన జీవాత్మ, ఆత్మలని గ్రహించాలి.

ఒక శరీరములో అవ్యక్తముగ (కనిపించక) ఉన్నటువంటి రెండు గొప్పవైన భూతములని పిలువబడు జీవాత్మ, ఆత్మలు గలవు. అట్లే తొమ్మిది కనిపించనటువంటి బుద్ధి, అహము, మనస్సు, చిత్తము, ప్రాణ, అపాణ, ఉదాన, సమాన, వ్యాన, వాయువులు గలవు. ఇంకనూ ఇంద్రియములని పిలువబడు కనిపించు పది కర్మేంద్రియ జ్ఞానేంద్రియములు, ఐదు కనిపించని ఇంద్రియ శక్తులు గలవు. కనిపించు భాగములైన కన్ను, చెవి, నాలుక, చర్మము, ముక్కు, కాళ్ళు, చేతులు, నోరు, గుదము,

గుహ్యము ఒక గుంపుకాగ, కనిపించని ఇంద్రియశక్తులు చూపు, వినికిడి, వాసన, స్పర్శ, రుచి ఒక గుంపు అని తెలియవలెను.

| | | |
|---|---|---|
| **మహాభూతములని పిలువబడు జీవాత్మ, ఆత్మలు** | **-** | **2** |
| **అవ్యక్తమైన అంతరంగములు** | **-** | **9** |
| **కనిపించు ఇంద్రియములు** | **-** | **10** |
| **కనిపించని ఇంద్రియములు** | **-** | **5** |
| **సజీవ శరీరములో మొత్తము భాగములు** | **-** | **26** |

ఈ విధముగ క్షేత్రమనునది 24 భాగముల చేత మరియు రెండు ఆత్మల చేత కలిసివుంటున్నది. అంతేకాక ప్రేమ అసూయలను గుణములు, సుఖదుఃఖము లను అనుభూతులు, శ్రద్ధ, ధైర్యము, భయము అను చేతనమైన సంఘము మరియు ఎన్నో వికారములు కల్గి శరీరమను క్షేత్రమున్నదని తెలియాలి.

*(12) శ్లో॥ 8 : అమానిత్వ మదమ్భిత్వ మహింసా క్షాన్తి రార్జవమ్ ।*
*ఆచార్యోపాసనం శౌచం స్థైర్య మాత్మ వినిగ్రహః ॥*
*(జ్ఞానము)*

*(12) శ్లో॥ 9 : ఇంద్రియార్థేషు వైరాగ్య మనహంకార ఏవచ ।*
*జన్మమృత్యుజరావ్యాధి దుఃఖదోషాను దర్శనమ్ ॥*
*(జ్ఞానము)*

*(12) శ్లో॥ 10 : అసక్తి రనభిష్వంగః పుత్రదారగృహాదిషు ।*
*నిత్యం చ సమచి త్తత్వ మిష్టానిష్టోపప త్తి షు ॥*
*(జ్ఞానము)*

(12) శ్లో॥ 11 : మయి చానన్యయోగేన భక్తి రవ్యభిచారిణీ ।
వివిక్త దేశసేవిత్వ మరతి ర్జనసంసది ॥
(జ్ఞానము)

(12) శ్లో॥ 12 : ఆధ్యాత్మజ్ఞాన నిత్యత్వం తత్త్వజ్ఞానార్థ దర్శనమ్ ।
ఏతజ్జ్ఞానమితి ప్రోక్త మజ్ఞానం యదతోఽన్యథా ॥
(జ్ఞానము)

**భావము :** గర్వ దంభములనునవి కలుగకుండ, శాంతి నిష్కపటము, అహింస కలిగి, సద్గురువులను పూజించుచు, ధైర్యము ఆత్మనిగ్రహముకల్గి ఇంద్రియముల మీద ఆసక్తి లేక, నేనను అహంకార భావము లేకుండ, జన్మ, మృతి, ముసలితనము, రోగము, దుఃఖము వచ్చునవి, పోవునవిగ తలచుకొనుచు, భార్యాపుత్రులందు ప్రేమలేకుండ గృహము, భూమి మొదలగు వాటిమీద ఆసక్తి లేక, నిత్యము సంభవించెడి ఇష్టాఇష్టములందు, కష్టసుఖములందు సమచిత్త్వము కల్గి, వ్యభిచరింపని భక్తికల్గి, అనన్యమైన యోగము చేయుచు, మనుషులులేని స్థలములో ఉండుటకు ఇష్టపడుచు, జనసమూహములందు ఇష్టములేనివాడై ఆధ్యాత్మిక జ్ఞానమును నిత్యము కల్గి, ఆత్మను జ్ఞానముచేత తెలియగోరినవాడై ఉండవలెను. దానినే జ్ఞానమని అట్లుకాని అన్యమంతయు అజ్ఞానమని తెలియవలెను.

**వివరము :** ఇక్కడ ఒకే మారు ఐదు శ్లోకముల భావమంతయు చెప్పబడివున్నది. ఐదు శ్లోకములలోను జ్ఞానవిషయము గురించి చెప్పారు. ఈ విధముగ ఉండడమే జ్ఞానమని వివరించారు. 8 నుండి మొదలై 12వ శ్లోకముతో ముగిసిన ఈ విషయములలో 11వ శ్లోకములో **'మయిచానన్య యోగేన భక్తి రవ్యభిచారిణీ'** అనుమాట చాలామందికి బాగా అర్థమై ఉండదనుకొంటాము. **'భక్తిరవ్యభిచారిణీ'** అన్న పదమునకు భక్తిలో వ్యభిచారమేమిటని అర్థమైవుండదు. వ్యభిచారమంటే ఒకరు శారీరకముగ అనేకమందితో సంబంధము పెట్టుకోవడము. ఇక్కడ భక్తి అనునది మనసుకు సంబంధించినది. కావున మనస్సుతో భక్తి ద్వారా అనేక మంది

దేవతలతో సంబంధము పెట్టుకోవడమును భక్తిలో వ్యభిచారమంటున్నాము. ఒక స్త్రీ తన భర్తను వదలి ఇతరులతో సంబంధము పెట్టుకోవడము ఎలా వ్యభిచారమో, అలాగే ఒక జీవునకు భర్తయైన పరమాత్మను వదలి ఇతర దేవతలతో సంబంధము పెట్టుకోవడము భక్తిలో వ్యభిచారమగును. శరీర వ్యభిచారమెంత తప్పో అలాగే భక్తి ద్వార చేయు మానసిక వ్యభిచారము అంతే తప్పని చెప్పవచ్చును. వేశ్య విటుడిచ్చు డబ్బు ఆశతో ఎంతోమంది విటులను ఆశ్రయించినట్లు, మనిషి దేవతలిచ్చు ఫలితములకు ఆశపడి ఎంతోమంది దేవతలను ఆశ్రయించి పూజించుట జరుగుచున్నది.

సర్వమునకు మూలకర్తయై భరించు పరమాత్మను వదలి స్వల్పమైన దేవతలను పూజించుట నేడు ఎక్కువ శాతము జరుగుచున్నది. ప్రపంచ జనాభాలో భక్తి తక్కువగనున్న ఈ కాలములో, ఉన్న భక్తి కొంత ఇతర దేవతలమీద ఉన్నది. వేయిమంది భక్తులను పరిశీలించినట్లయితే అందులో ఒక్కడు కూడ పరమాత్మ మీద భక్తి కల్గివుండడము అరుదు. ఆ వేయిమందిలోను అందరు కూడ ఒకే దేవుని మీద భక్తి కల్గివుండరు. వేయిమందికి పదివేలమంది దేవతలుండుట ఆశ్చర్యము. అట్లుండుట అజ్ఞానమని అది సరియైన పద్ధతికాదని, పరమాత్మను మినహా ఏ దేవతను ఆరాధించకూడదని, దేవతలమీద ధ్యాసవదలి పరమాత్మ మీద ధ్యాస పెంచు కోవడమును జ్ఞానమని తెలియజేశారు.

*(12) శ్లో॥ 13 : జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి యద్ జ్ఞాత్వాఽమృత మశ్నుతే ।*
*అనాది మత్పరం బ్రహ్మ న సత్త న్నాఽస దుచ్యతే ॥*
*(పరమాత్మ)*

**భావము :** ఏది జ్ఞేయమో దానిని చెప్పెదను. దానిని తెలియుట వలన అమృతమును పొందవచ్చును. అది అనాది, మత్పరము, బ్రహ్మము. దానిని సత్తనియు, అసత్తనియు పిలువకూడదు.

**వివరము :** చేనుకు గట్టు, దారికి గమ్యములాంటిది జ్ఞానమునకు జ్ఞేయమని తెలియాలి. చేను గట్టుతో ముగిసినట్లు, దారి గమ్యముతో ముగిసినట్లు, జ్ఞానము జ్ఞేయముతో ముగియును. చేనుకు కట్ట గట్టయినట్లు, దారికి ఊరు గమ్యమైనట్లు జ్ఞానముకు పరమాత్మ జ్ఞేయమగును. పరమాత్మ తెలుపు మార్గమే జ్ఞానము. జ్ఞానము ద్వార చివరకు తెలియబడునదే పరమాత్మ. పరమాత్మనే అనాది అనియు, పరము అనియు, బ్రహ్మ అనియు పిలుతురు. ఆది లేనివాడు కావున అనాది అనియు, అన్నిటికంటేమించినది వేరైనది కావున పరము అనియు, అన్నిటికంటే పెద్దది మొదటిది కావున బ్రహ్మ అనియు పిలుతురు. జ్ఞానగమ్యమైన పరమాత్మను సత్తనికాని, అసత్తని కాని పిలువరాదు. ఎందుకనగ ఆయన సత్తుకాదు, అసత్తుకాదు. ఇక్కడొక ప్రశ్న కొందరికిరావచ్చును. అదేమనగా అసలు సత్తెవరు? అసత్తెవరు? సత్తు, అసత్తులెవరో తెలుసుకొంటే రెండూ కాని వానిని సులభముగ తెలియవచ్చును? అని అడుగవచ్చును. ఆ విషయము తెలుసుకొందాము.

సత్తు, అసత్తు అనునవి రెండు మన దేహములోనే ఉన్నవి. సత్తు దేహమంతయు ఉన్నది. అసత్తు దేహములో ఒక్కచోట స్థిరముగ ఉన్నది. వివరముగ చెప్పుకోవాలంటె **సత్తు అనగా ఆత్మ, అసత్తు అనగ జీవాత్మయని** తెలుసుకోవాలి. మరికొందరు అసత్తయిన జీవాత్మను చిత్తు అని కూడ పిలుతురు. సత్తును సత్ అనియు చిత్తును చిత్ అని కూడ పిలుతురు. దీనినే సత్‌చిత్ అని కలిపి పిలుతురు. బ్రహ్మయోగము చేయువాడు మనస్సు ద్వార ఆత్మ అనుభవము పొందుచున్నాడు. అనగ సత్‌చిత్ కలిసిన అనుభవమును ఆనందమని చెప్పుచున్నారు. దానినే ఆత్మానందమని, సచ్చిదానందమని పిలుతురు. సచ్చిదానందమను మాటకు సత్తు చిత్తు కలిపిన ఆనందమని అర్థము చేసుకోవాలి. బ్రహ్మయోగిని ఆత్మానంద అనియు సచ్చిదానంద అనియు పెద్దలు పిలుచుటలో అర్థము కలదు.

అంతేకాక తెలిసినవారు, తెలియనివారు సత్తయిన ఆత్మను సచ్చు అని పిలుచుట కూడ జరుగుచున్నది. ఆత్మ శరీరమంతా వ్యాపించివున్నదని, ఆత్మయే

ప్రతి శరీరభాగమున శక్తియై కదలించుచున్నదని తెలుసుకొన్నాము. శరీరమంత వ్యాపించిన ఆత్మశక్తి ఎక్కడో ఒకచోట, ఎవరికో ఒకరికి, శరీరములో కాలులోనో, చేయిలోనో లేకుండ పోవును. ఉదాహరణకు ఒక చేయిలో ఆత్మ వ్యాపించకుండ భుజమువరకే వ్యాపించి నిలచిపోయినదనుకొనుము. అపుడు వానిచేయి కదలదు, మెదలదు. ఆ చేయిలో ఏమాత్రము చైతన్యము లేదు. సత్తు భుజము వరకే వున్న దాని వలన చేయి సత్తుపడిపోయిందని పూర్వమనెడివారు. కాలక్రమేపి ఆ పదము మారి చేయి సచ్చుపడిపోయిందంటున్నారు. సత్తు సచ్చుగ అందరి చేత పిలువబడుచున్నది. అలాగే మనిషి శరీరములోని ఆత్మ పూర్తిగ పోయి, ఏమాత్రము చైతన్యము లేకుండ పోయినపుడు, పూర్వము మనిషి సత్తుపోయింది అనెడివారు. అలాగే ఆవు శరీరములోని సత్తు పూర్తి పోయినపుడు ఆవు సత్తుపోయిందనెడివారు. ప్రస్తుత కాలములో ఆవు సచ్చిపోయిందంటున్నారు. అలాగే ఏది మరణించిన అందులోని ఆత్మ శరీరమును వదలి పోవుచున్నది. కనుక పలానా జంతువు సచ్చిపోయిందనో, పలానా మనిషి సచ్చిపోయినాడనో చెప్పుట జరుగుచున్నది.

ఇలా అందరిచేత సచ్చు అనియు కొందరిచేత సత్తనియు పిలువబడు ఆత్మయు, అట్లే కొందరిచేత చిత్తని మరికొందరు చేత అసత్తని పిలువబడు జీవాత్మయు పరమాత్మ కాదు. కావున పరమాత్మను సత్తని కాని, అసత్తని కాని పిలువకూడదు. ఒకే శరీరములో సత్తు, అసత్తు, రెండూకాని వాడు ఉండి వేరు వేరు పనులు కల్గియుండుట వలన ముగ్గురిని కలిపి పిలువకూడదు. సత్తు, అసత్తులను పుట్టించినవాడు పరమాత్మ కావున జన్మలేనివాడు పరమాత్మ, జన్మలున్న వారు ఆత్మ, జీవాత్మలు. ఆదిలేని పరమాత్మ పుట్టించిన జీవాత్మలమైన మనము ఎప్పుడు పుట్టామో తెలియదు. కావున జన్మలుకల్గిన అనాదలము మనము. జన్మలు లేని పరమాత్మ అనాది కాగ, జన్మలున్న అనాదులు జీవాత్మలని తెలియాలి. ఇపుడు తెలుసుకోవడము ఏమిటి? ప్రతి దినము మనము అనాదులన్నమాట వింటూనే ఉన్నాము. ఎక్కడ ఎవరు అంటున్నారని ఆలోచించనవసరము లేదు. **'అనాది జన్మ దానము చేయండి'**

అనియో లేక **'అనాది జన్మ అన్నము పెట్టండి'** అనియో అక్కడక్కడ బిక్షగాల్లు అనడము వినియేవుందుము. పూర్వము త్రిజట అను రాజు తన గడచిన జీవితమును గురించి ఆలోచించి పశు, పక్షి, మృగాదులవలె మానవుని జీవితము కూడ గడుచుచున్న దని, ఇందులో ప్రత్యేకత ఏమి లేదని, ప్రత్యేకత కావాలంటే వాటికంటే మిన్నగనున్న పని పరమాత్మ జ్ఞానము సంపాదించుటేనని తలచి, జ్ఞానార్థియై చిత్రవర్ణ అను మహర్షి వద్దకు పోయి ఆయన దర్శనార్థము మహర్షి గృహము చెంత నిలచివుండెను. చాలాసేపు వేచి ఉన్నప్పటికి తలుపులు తెరువలేదు. గురువుగారైన మహర్షి బయటికి రాలేదు. అపుడా రాజు "నేను త్రిజట రాజును, జ్ఞానము కొరకు వచ్చివున్నాను తలుపు తెరవండని" మహర్షిని పిలువలేదు. రాజు పిలువనిదే లోపలున్న వారికి తెలియదు. కావున రాజు తప్పక పిలువవలసి వచ్చినది. అపుడేమని పిలిచాడనగా! 'అయ్యా అనాది జన్మ ధర్మము తెలుపండి' అని ఒకమారు 'అనాది వాడు వచ్చాడు ధర్మము చేయండి' అని మరొకమారు పిలిచెను. ఆ మాటలు లోపలనున్న చిత్రవర్ణ మహర్షి విని ప్రక్కనున్న శిష్యునితో వచ్చిన వానికి దానము కావాలో ధర్మము కావాలో అడిగి రమ్మని చెప్పెను. ఆ శిష్యుడు బయటికి వచ్చి త్రిజట రాజును చూచి నీకు ధర్మము కావాలా? దానము కావాలా? అని అడిగెను. దానికి రాజు "నేను త్రిజట అను రాజును. నాకు వస్తువాహన, ధనకనకాదులు చాలా ఉన్నవి. కావున మీరిచ్చు దానము వద్దు. నావద్ద లేనివి తెలియనివియైన ధర్మములు మీవద్ద ఉన్నవి. ఆ ధర్మములు నాకు కావాలి. వాటిని దానము చేయండి, ఆది తెలియని అనాది జన్మనాది, జన్మలేని అనాదిని చేయండని కోరుచున్నాను" అనెను. రాజుగారి మాటలు తెలుసుకొన్న చిత్రవర్ణ మహర్షి సంతసించి రాజుకు ధర్మములను తెలిపి జీవాత్మయైన రాజు అసత్తని, చైతన్యమైన ఆత్మ సత్తని ధర్మములచేత సత్తు అసత్తు కాని పరమాత్మను తెలుసుకొమ్మని చెప్పెను.

ఆనాడు సర్వమున్న గొప్పరాజు అనాది జన్మనాది ధర్మము చేయండని అడుగగా ఈనాడు ఏమిలేని బిక్షగాళ్ళు ఆ మాటననుచున్నారు. బిక్షగాళ్ళవద్దయిన

గుర్తుకు మిగిలిన ఆ మాటను వారు కూడ కోరికొకటి మాట ఒకటిగ పల్కుచున్నారు. వారికి కావలసినది దానము, వారడుగుచున్నది ధర్మము. అడిగేవాని దగ్గరకాని ఇచ్చేవానిదగ్గరకాని ధర్మము లేదు. అంతేకాక వారు అనాది జన్మ అనుటలో దిక్కులేని జన్మయను భావముతో అంటున్నారు తప్ప, మొదలు తెలియని జన్మనాది అను అర్థముతో కాదు. ఇప్పటికైన మనము సరియైన అర్థము తెలుపు జ్ఞానమునే ఆశ్రయిస్తాము. జ్ఞేయమును గూర్చి క్రింద తెలుసుకొందాము.

*(12)శ్లో॥14 : సర్వతః పాణి పాదం త త్సర్వతోఽక్షిశిరోముఖమ్ ।*
*సర్వత శ్శృతిమ ల్లోకే సర్వమావృత్య తిష్ఠతి ॥*
*(పరమాత్మ)*

**భావము :** అందరియందు కాళ్ళు, చేతులు, కన్నులు, ముఖము, చెవులు కల్గి పరమాత్మ అంతట వ్యాపించివున్నది.

**వివరము :** పరమాత్మ అనునది స్త్రీకాదు పురుషుడు కాదు. ఒక విధముగ అన్ని ఆయనే కావున పురుషునిగ ఆయన అనియు, స్త్రీగ అది అనియు వ్రాయడములో జరుగుచుండును. ఒకచోట అది అని, మరొకచోట ఇదియని, ఆయన ఈయన అంటున్నారే అనుకోకూడదు. పరమాత్మ ఏది కానివాడని తెలియడము కోసమే అలా వ్రాయవలసి వచ్చినది. ఇక్కడ ఈ శ్లోకములో కూడ ప్రకృతి పురుషులు రెండు పరమాత్మేనని, విడదీసిచూస్తే వేరు వేరుగనున్నవని తెలుపడమే సారాంశమని తెలియుము. కాళ్లు, చేతులు, ముఖము, కన్నులు, చెవులు ప్రపంచములోని జీవరాసులకన్నిటికి ఉన్నవే. స్థూలమైన అవయవములు ప్రకృతిలో తయారైనవని, వాటియందుండి కదలించునది ఆత్మని ముందే తెలుసుకొన్నాము. ప్రపంచములోని సర్వజీవరాసుల స్థూల అవయవములు, అందులోని సూక్ష్మశక్తి రెండు పరమాత్మే అయివున్నాడని ఈ శ్లోకములో చెప్పడమైనది. స్థూల సూక్ష్మములైన ప్రకృతి, ఆత్మల రెండిటిని కలిపి చూచిన జగత్తులోని శరీరములన్ని పరమాత్మేనని, అన్ని అవయవములు ఆయనేనని తెలియుచున్నది. జ్ఞానము ద్వార తెలియు జ్ఞేయము

జీవరూపమైన ప్రపంచముగ వ్యాపించి ఉన్నదని తెలియవలెను. జ్ఞేయమైన పరమాత్మ ఇంకా ఎట్లున్నాడనగా!

*(12) శ్లో॥ 15 : సర్వేన్ద్రియగుణాభాసం సర్వేన్ద్రి యవివర్జితమ్ ।*
*అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృచ ॥*
*(పరమాత్మ)*

**భావము :** పరమాత్మ సర్వేంద్రియముల గుణములలో ప్రకాశించునదియైయుండి సర్వేంద్రియములు లేనిదిగనున్నది. అన్నిటిని భరించునదైయుండి ఏది లేనిదని, అన్ని గుణములను అనుభవించునదై ఏ గుణములేనిదని చెప్పవచ్చును.

**వివరము :** పరమాత్మను ఎటూ తేల్చిచెప్పలేమని ముందే చెప్పాము, అది వర్ణనాతీతమైనది. అందువలన పలానాయని చెప్పుటకు చేతకాక రెండు విధముల చెప్పారు. సర్వేంద్రియ భావములతో ఉండునదై ఏ ఇంద్రియములేనిది సర్వమును భరించునదై ఏదికానిది మరియు అన్ని గుణములుకల్గినదై ఏ గుణములేనిది పరమాత్మయని చెప్పారు. పరమాత్మను ఏకస్తముగ చూచిన ఇంద్రియములు, గుణములు కలదియై భర్తగనున్నదని చెప్పవచ్చును. విడదీసి చూచిన ఏదీకానిదని, ఏమి చేయనిదని చెప్పవచ్చును. ఏకముగ చూచినవున్నది ఒకటే అగును. విడదీసిన ప్రకృతి, పరమాత్మ, ఆత్మ, జీవాత్మయని నాలుగవుచున్నవి. ఏకముగ చూచిన అన్ని పనులకు మూలకర్త పరమాత్మయని చెప్పవచ్చును. విడదీసి చూచిన పరమాత్మ సాక్షీభూతుడు, ఏ పని చేయడు, చేయునవి ప్రకృతి ఆత్మ అని చెవ్పవచ్చును. విడదీయక పరమాత్మను ఒక్కనిగ చూచిన, కార్యమునకు మూలము పరమాత్మయని చెప్పవచ్చును. విడదీసి చూచిన ప్రకృతి చేయునదైవుండగ, చేయించువాడు ఆత్మకాగ, అనుభవించువాడు జీవుడని చెప్పవచ్చును. ఈ విధముగ ఉండుటవలననే అన్నిటికి నేనే కారణమని ఒకచోట చెప్పడము. ప్రకృతియే కారణమని మరొకచోట చెప్పడము జరిగినది. అందువలన ఎక్కడ పరమాత్మను విడదీసి అర్థము చేసుకోవాలో, ఎక్కడ విడదీయక అర్థము చేసుకోవాలో బాగా తెలిసివుండాలి.

*(12) శ్లో॥ 16 : బహి రన్తశ్చ భూతానా మచరం చర మేవ చ ।*
*సూక్ష్మత్వాత్త దవిజ్ఞేయం దూరస్థం చాన్తి కే చ తత్ ॥*
*(పరమాత్మ)*

**భావము :** చర అచర ప్రపంచముగ జీవరాసుల లోపల బయట పరమాత్మ ఉన్నది. అది సూక్ష్మమగుటచే తెలియబడునది కాదు. దూరముగ మరియు దగ్గరగనున్నదని తెలియుము.

**వివరము :** కంటికి కనిపించు ప్రపంచమునంతటిని ప్రకృతి అంటాము. కదలెడి ప్రకృతియని, కదలని ప్రకృతియని రెండు రకములుగ ప్రకృతివున్నది. సమస్త జీవరాసుల శరీరములు కదలెడి ప్రకృతియని (చర ప్రకృతియని) పిలువబడుచున్నది. జీవరాసుల శరీరములు మినహాగల సమస్తముయైన గాలి, నీరు, అగ్ని, భూమి, ఆకాశము కదలని లేక మార్పుచెందని ప్రకృతియని (అచర ప్రకృతియని) పిలువబడు చున్నది. జీవరాసులలోపల మార్పుచెందుచు కదలుచున్న చర ప్రకృతియు, జీవరాసుల బయట మార్పుచెందక కదలని అచర ప్రకృతియు రెండు పరమాత్మయేనని చెప్పబడుచున్నది. ఎందుకనగ అణువణువున వ్యాపించినది పరమాత్మయే, కనుక చరాచర ప్రపంచమంతయు పరమాత్మయేనని తెలియాలి. పరమాత్మ ఇంద్రియములకు తెలియని సూక్ష్మము కావున అది చూపుకు తెలియునది కాదు. జ్ఞానము వలన కూడ సులభముగ తెలియునది కాదు. ధర్మములు తెలిసినవారికి పరమాత్మ చాలా దగ్గరగ గలదు. ధర్మములు తెలియని వారికి చాలా దూరముగనున్నదని చెప్పవచ్చును. ఎందుకనగ ధర్మములు తెలిసినవాడు తొందరలో పరమాత్మను చేరగలడు. కనుక వానికి చాలా దగ్గరగ ఉన్నదని చెప్పవచ్చును. అట్లే ధర్మములు తెలియనివాడు పరమాత్మను ఎప్పటికి చేరలేడు. కనుక వానికి చాలా దూరముగ ఉన్నదని చెప్పవచ్చును.

*(12)శ్లో॥ 17 : అవిభక్తం చ భూతేషు విభక్త మివ చ స్థితమ్ ।*
*భూతభర్తృ చ తద్ జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణుచ ॥*
*(పరమాత్మ)*

**భావము :** పరమాత్మ విభజింపబడక ఒక్కటైయున్నను, జీవరాసులలో విభజింపబడి ఉన్నది. సమస్త జీవులను భరించునదియు, సమస్త జీవులను లయము చేయునదియు, సమస్త జీవులను పుట్టించునదియై ఉన్నది.

**వివరము :** ఈ విషయము 15వ శ్లోకములో కూడ చెప్పుకొన్నాము. పరమాత్మ ఒక్కటిగ ఉన్నది. దీనికి మించినశక్తిగాని, దీనిని మించి పేరు పొందినది గానిలేదు. సర్వమునకు మూలకారణమైన పరమాత్మ విభజింపబడక, సర్వత్ర వ్యాపించి పరమాణువు సహితముతానై ఉన్నది. ఇట్లు ఇతరమునకు స్థానములేనిదై, అంతట అదేనిండియున్న దానిని ఒక్కటిగా చెప్పుకోవచ్చును. ఒక విధముగ ఇట్లుండియు ప్రపంచము కార్యరూపము దాల్చుటకు పరమాత్మ అనేక రూపములుగ విభజింపబడి వున్నది. పరమాత్మయే అనేక భాగములుగవుంటూ, ఒక్కొక్క భాగము ఒక్కొక్క కార్యము చేయుచు, ప్రపంచమును కార్యరూపముగ నడిపిస్తున్నది. ప్రపంచమును పుట్టించుటకు, భరించుటకు, లయము చేయుటకు పరమాత్మ విభజింపబడివున్నదని చెప్పవచ్చును. ప్రపంచమును పుట్టించువాడు, పెంచువాడు, లయము చేయువాడు, ఒకే పరమాత్మ అయినప్పటికి విభజించి చెప్పుకోవలసివున్నది. పరమాత్మ విభజన రూపముగను, విభజనలేని వానిగను ఉంటూ ఎటూ తేల్చి చెప్పలేనివానిగ ఉన్నాడని చెప్పవచ్చును.

*(12)శ్లో॥18 : జ్యోతిషా మపి తజ్జ్యోతి స్తమసః పర ముచ్యతే ।*
*జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య ధిష్ఠితమ్ ॥*
*(పరమాత్మ)*

**భావము :** పరమాత్మ ప్రకాశించెడి వాటికి ప్రకాశమైయున్నది. అజ్ఞానమున కంటే వేరైనది. జ్ఞానము జ్ఞేయమైనది. సర్వజీవరాసుల హృదయములో జ్ఞానగమ్యమైయున్నది.

**వివరము :** పరమాత్మ ప్రకాశించే సూర్యచంద్రాదులందే కాక, అన్ని జ్యోతులందు

ప్రకాశమునిచ్చు మూలపదార్థమైయున్నది. తెలియనిదానికంటే వేరుగనున్నది, అనగ అన్నిటికి జ్ఞానవిజ్ఞానమైవున్నది. జ్ఞానమును మరియు జ్ఞేయమును రెండుయైవున్నది. అంతేకాక పరమాత్మ జ్ఞానగమ్యమై సర్వజీవుల శరీరములలోని హృదయములో (బ్రహ్మనాడిలో) అధిష్ఠించివున్నది. హృదయమనగ గుండెకాదు. మెదడు మొదలుకొని చివరివరకున్న సుషుమ్ననాడి లేక బ్రహ్మనాడియని గ్రహించవలెను.

*(12)శ్లో॥ 19 : ఇతి క్షేత్రం తథా జ్ఞానం జ్ఞేయం చోక్తం సమాసతః ।*
*మద్భక్త ఏత ద్విజ్ఞాయ మద్భావా యోపపద్యతే ॥*
*( ప్రకృతి, పరమాత్మ)*

**భావము :** ఈ విధముగ క్షేత్రమును, అట్లే జ్ఞానమును, జ్ఞేయమును సంగ్రహముగ చెప్పబడినది. నా భక్తులు దీనిని బాగుగ తెలిసినవారై నన్ను పొందుటకు అర్హులగుదురు.

*(12)శ్లో॥ 20 : ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి ।*
*వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతి సమ్భవాన్ ॥*
*( ప్రకృతి, పరమాత్మ)*

**భావము :** ప్రకృతి, పురుషులు రెండును ఆదిలేనివని తెలియుము. గుణవికారములెల్ల ప్రకృతినుండి పుట్టినవేనని తెలియవలయును.

**వివరము :** ఆదిలేనివాడు పరమాత్మయే అయినప్పటికి, పరమాత్మ ప్రకృతిని ఎప్పుడు తయారు చేసిపెట్టినది మనకు తెలియదు. కావున ప్రకృతి కూడ అనాదియేనని చెప్పవచ్చును. పుట్టుకలేని అనాది పరమాత్మకాగ, పుట్టి అనాదియైనది ప్రకృతి. ప్రకృతిలోని వారమే మనమంతా. మనమంతా ఎప్పుడు పుట్టామో! ఎప్పటినుండి చస్తూ పుట్టుచున్నామో తెలియదు. కనుక మనము కూడ అనాదులమే. ఇటువంటి మనలోగల గుణములు ప్రకృతి నుండి పుట్టినవే, ప్రకృతి నుండి పుట్టిన గుణములకు కూడ నాంది మనకు తెలియదు. మనయొక్క మరియు మనయొక్క గుణముల

మొదలు మనకు తెలియకపోయిన పరవాలేదు. కాని మనము మన గుణముల యొక్క అంతుచూడాలి, తర్వాత మనమంతమైపోయి అంతములేని పరమాత్మగ మారిపోవాలి.

*(12) శ్లో॥ 21 : కార్యకారణకర్తృత్వే హేతుః ప్రకృతి రుచ్యతే ।*
*పురుష స్సుఖదుఃఖానాం భోక్తృ త్వే హేతు రుచ్యతే ॥*
*(ప్రకృతి, జీవాత్మ)*

**భావము :** కార్య కారణములను కలుగజేయుటయందు ప్రకృతి హేతువుగనున్నది. పురుషుడు సుఖదుఃఖములనుభవించుటకు కారణభూతునిగ ఉన్నాడని చెప్పవచ్చును.

**వివరము :** పురుషుడనగ పరమాత్మయని చెప్పుకొన్నాము. పరమాత్మ సర్వము తానైవున్నదని కూడ చెప్పుకొన్నాము. అటువంటి పరమాత్మ కార్యరూపమైన ప్రపంచము ఎడల విభజింపబడి ఉన్నాడని కూడ తెలుసుకొన్నాము. ఆ విభజన ఈ శ్లోకములో కనిపిస్తున్నది. కార్యములు జరుగుటకు ప్రకృతిగ విభజింపబడి, ప్రకృతి నుండి శరీరము వరకు విభజన జరిగినది. కార్యములకు ప్రకృతితో తయారైన శరీరము కారణము కాగ, ఆ కార్యములలో ఉండు సుఖదుఃఖములను అనుభవించుటకు పరమాత్మ నుండి జీవాత్మ విభజింపబడి ఉన్నది. పరమాత్మ భాగమైన జీవాత్మ శరీరములో నివశిస్తు, పనులలోనున్న కష్టసుఖములను అనుభవిస్తున్నాడు. ఈ విధముగ కార్యరూపజగత్తులో ప్రకృతి శరీరముగను, పరమాత్మ జీవాత్మగను పాత్ర వహిస్తున్నట్లు తెలియుచున్నది.

*(12) శ్లో॥ 22 : పురుషః ప్రకృతిస్థో హి భుంక్తే ప్రకృతిజాన్ గుణాన్ ।*
*కారణం గుణ సంగోఽస్య సదసద్యోనిజన్మసు ॥*
*(ప్రకృతి, జీవాత్మ)*

**భావము :** పురుషుడు ప్రకృతియందున్నవాడై ప్రకృతి సంభవములైన గుణములను అనుభవించుచున్నాడు. గుణములతో సంబంధపడియున్న కారణమువలన మంచి చెడు యోనులయందు జన్మించుచున్నాడు.

**వివరము :** ఇక్కడ పురుషుడనగా జీవాత్మయని తెలియవలయును. జీవాత్మ శరీరమందున్నాడు, కనుక ప్రకృతియందున్నాడని చెప్పుచున్నారు. జీవాత్మ శరీరమందుండి శరీరములో ప్రకృతి జనిత గుణములతో మనస్సుద్వార సంబంధ పడియుండి వాటి అనుభవములను పొందుచు, పాపపుణ్యములను తగిలించుకొను చున్నాడు. కనుక పాపపుణ్యముల ఫలితములబట్టి మంచి చెడు జన్మలు కలుగుచున్న వని చెప్పవచ్చును.

*(12) శ్లో॥ 23 : ఉపద్రష్టాఽనుమన్తా చ భర్తా భోక్తా మహేశ్వరః ।*
*పరమాత్మేతి చాప్యుక్తో దేహేఽస్మిన్ పురుషః పరః ॥*
*( జీవాత్మ, ఆత్మ, పరమాత్మ)*

**భావము :** దేహము ధరించిన పురుషుడు దేహమునందు సాక్షీభూతునిగను అనగ ఆత్మగను, సమ్మతించువాడైన జీవునిగను, భరించు భర్తగనున్న పరమాత్మగను, అనుభవించు జీవునిగను, మహేశ్వరుడుగను, ఆత్మగను, పరమాత్మగను చెప్పబడుచున్నాడు.

**వివరము :** శరీరమునందు శరీరముకంటే వేరైన పరమాత్మ శరీరములో మూడు విధములవుంటూ అనేక విధముల పిలువబడుచున్నాడు. సాక్షి, సమ్మతించువాడు, భర్త, భోక్త, మహేశ్వరుడు, పరమాత్మయని అనేక విధముల పిలువబడుచున్నాడు. పరమాత్మ శరీరములో జీవాత్మ, ఆత్మ, పరమాత్మగ ఉంటు వేరు వేరు పాత్రలు వహిస్తు అనేక విధముల పిలువబడుచున్నాడు. ఉన్నది ఒక్కడే అయిన విభజన ద్వార మూడుగ ఉంటూ కార్యరూపమైన తంతు నడుపుచున్నాడు.

*(12) శ్లో॥ 24: య ఏవం వేత్తి పురుషం ప్రకృతిం చ గుణైస్సహ ।*
*సర్వథా వర్తమానోఽపి న స భూయోఽభిజాయతే ॥*
*( ప్రకృతి, పురుషుడు)*

**భావము :** ఎవడైతే ఈ ప్రకారముగ పురుషులను, ప్రకృతిని, గుణములను

తెలుసుకొన్నాడో, వాడు ఎల్లపుడు అన్ని విషయములలో వర్తించుచున్నప్పటికి తిరిగి జన్మించడు.

**వివరము :** ప్రకృతి వలన శరీరము తయారైనదని, శరీరములోని గుణములు కూడ తయారైనవని తెలిసి, గుణ విశేషములను పూర్తిగ తెలిసి, సర్వకార్యములకు ప్రకృతి జనిత గుణములే కారణమని తెలిసినవాడై, అలాగే పురుషుడైన పరమాత్మ కూడ మూడు భాగములుగ విభజింపబడివున్నదని తెలిసి, గుణములలో చిక్కుకొని వాటి అనుభవములను పొందుచున్నది పరమాత్మలోని అంశ అయిన జీవాత్మయని, మొత్తము శరీర యంత్రాంగ కార్యమును నడుపునది ఆత్మయని, అన్నిటికి సాక్షిభూతుడై ఏమి చేయక శరీరములో తటస్థముగ ఉండువాడు పరమాత్మయని ఎవడు తెలిసివున్నాడో, వాడు జగత్తులో ఎక్కడేకార్యము చేయుచున్నప్పటికి వానికి కర్మలంటవు. పునర్జన్మకు కారణమైన కర్మలు తయారు కాకపోవుటవలన వానికి పునర్జన్మ ఉండదు. ఇక్కడొక ప్రశ్నకు అవకాశము గలదు. అదేమనగా! "వెనుకటి సంచితకర్మ ఎక్కువ ఉన్నవానికి ప్రస్తుతము క్రొత్త ఆగామికర్మ రాక పోయినప్పటికి, ఒకే జన్మలో వాడు కడతేరి మరుజన్మ లేకుండ పోవునా? భగవంతుడు చెప్పినట్లు ప్రకృతి, పురుషుల వివరము తెలిసినవాడు సంచిత కర్మనంతటిని అనుభవించక రెండవ జన్మ పొందక ఆ జన్మలోనే ముక్తిపొందునా?" ఈ విధముగ ఎవరికైన సంశయమురావచ్చును. దానికి జవాబు ఈ శ్లోకములో *'సర్వథా వర్తమానోపి నసభూయోభిజాయతే'* అన్నారు కదా! సర్వథా వర్తమానోపి అనుటలో సహజముగ ఉన్న కర్మరీత్య నీ పనులు నీవు చేయుచు, నీ చావు నీవు చస్తు, నీ పుట్టుక నీవు పుట్టుచున్నప్పటికి క్రొత్తకర్మ రాదు. క్రొత్త జన్మ రాదు అని అర్థము. జన్మకు కారణమైనది కర్మ. కర్మసిద్ధాంతరీత్య పాత కర్మ అయిపోవు వరకు దాని పని అది చేయుచుండును. అందువలన పూర్తి సంచిత కర్మ అంతా అయిపోవు వరకు దాని పద్ధతి ప్రకారము జన్మలుండును. అది అయిపోయిన వెంటనే భగవంతుడు చెప్పిన పద్ధతి ప్రకారము జన్మలుండవు. అట్లు కాక శ్లోకములో పాతకర్మ ఉన్నప్పటికి ఒకే జన్మలో మోక్షము పొందుదువని ప్రత్యేకించి చెప్పలేదని తెలియాలి.

(12)శ్లో॥ 25 : ధ్యానేనాఽఽత్మని పశ్యన్తి కేచి దాత్మాన మాత్మనా ।
అన్యే సాంఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే ॥
( భక్తి, బ్రహ్మ, కర్మ యోగములు)

(12)శ్లో॥ 26 : అన్యే త్వేవ మజానన్తః శ్రుత్వాఽన్యేభ్య ఉపాసతే ।
తేఽపి చాతితరన్త్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః ॥
( జీవుడు, మోక్షము)

**భావము :** మృత్యువును జయించి మోక్షము పొంది పరమాత్మయందు ఐక్యమగుటకు, కొందరు పరమాత్మ సాకారరూపమును ధ్యానించు భక్తియోగము కల్గియుందురు. మరికొందరు బ్రహ్మయోగముననుసరించి ఆత్మదర్శనమును చేసుకొనుచుందురు. ఇంకా కొందరు కర్మయోగమును అనుసరించుచుందురు. ఈ విషయములు తెలియనివారు ఇతరులవలన విని, వారు చెప్పిన ప్రకారము ఉపాసనచేసి సాఫల్యమును పొందుచున్నారు.

**వివరము :** ఇక్కడ భగవంతుడు చెప్పినట్లు లోకములో ఈ పద్ధతులను అనుసరించు వారెవరైన ఉన్నారా! అని చూచిన ఏ గురువువద్దకు పోయిన, ఏ ఉపన్యాసకుల బోధలనువినిన, ఏ ఉపాసకులను చూచిన, అక్కడ కనిపించునది వినిపించునది ప్రకృతి సంబంధించిన పూజలు, ప్రకృతి సంబంధించిన బోధలు తప్ప ఏమి లేవు. ఎవరిని చూచిన పరమాత్మను వదలి అన్యదేవతలను ఆరాధన చేయువారే కనిపిస్తున్నారు. ఏ ఆశ్రమములో చూచిన అన్యదేవతా ప్రతిష్ఠ స్పష్టముగ కనిపిస్తున్నది. ఏ బోధ వినినా అందులో దేవతలను పొగడడమో, ఆరాధించడమో గూర్చి చెప్పడమే ఉన్నది. ఏ స్వామిని చూచిన అతడు శివభక్తుడైన శైవునిగనో, లేక విష్ణు భక్తుడైన వైష్ణవునిగనో ముద్రవేసికొని ఉన్నారు. అటువంటి వారి బోధలువిని వాటి ప్రకారము ఉపాసన చేసిన వారెక్కడికి పోగలరు? కావున బోధలు వినువారు జాగ్రత్త! పైన చెప్పినట్లు ఇతర దేవతలనారాధించువారి పంచన చేరవద్దండి. పై శ్లోకములో ఉన్నట్లు ప్రకృతి, పురుషుల విభజన చేసి, వారి గూర్చి పూర్తిగ తెలుసుకొన్న వారి

దగ్గర చేరి, పరమాత్మ సంబంధ బోధనలనే విని, దాని ప్రకారమే సాధన చేసిన ఎడల మోక్షము పొందుటకర్హులగుదురు. అట్లుకాక దేవతారాధన సంబంధముగ పోయిన దేవతలందే చేరుదురు. పరమాత్మయందు ఎన్నటికి చేరలేరు.

*(12)శ్లో॥ 27 : యావత్సంజాయతే కించిత్సత్త్వం స్థావరజంగమమ్ ।*
*క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగా త్తద్విద్ధి భరతర్షభ! ॥*
*(ప్రకృతి, పురుషుడు)*

**భావము :** స్థావర జంగమమైన జంతువేది పుట్టిన, అట్లే ఏకించిత్ వస్తువు పుట్టిన అది క్షేత్రక్షేత్రజ్ఞుల కలయికతోనే పుట్టుచున్నదని తెలియవలెను.

**వివరము :** ఇక్కడ క్షేత్ర క్షేత్రజ్ఞుడను పదము ఉపయోగింపబడినది. క్షేత్రమనగ శరీరమని, క్షేత్రజ్ఞుడనగ ఆత్మ అని ముందే తెలుసుకొన్నాము. ఒక వ్యక్తిని విడదీసినపుడు క్షేత్రము క్షేత్రజ్ఞుడని చెప్పుకొనుట సమంజసము. అదే విశాలముగ ప్రపంచమును గురించి చెప్పుకొన్నప్పుడు, ప్రకృతిని క్షేత్రమని పురుషుడైన పరమాత్మను క్షేత్రజ్ఞుడని చెప్పవచ్చును. ఇక్కడ పై శ్లోకములో ప్రకృతి, పురుషుడను భావముతో క్షేత్రక్షేత్రజ్ఞుడని చెప్పియున్నారని తెలియవలెను. ప్రపంచములో కదిలెడి జీవులైన మానవులు, క్రిమి కీటక జంతువులు, సర్పములు, పక్షులు, జలచరములు మొదలగు నవన్నియు మరియు కదలని వృక్షలతాదులు మొదలగునవి, అంతేకాక క్రొత్తగ పుట్టుకొచ్చుచున్న నక్షత్రములు మొదలుకొని ఏకించిత్ వస్తువైన క్రొత్తగ పుట్టిన ఎడల అవి ప్రకృతి, పురుషుల సంయోగము వలన పుట్టినవేయగును. ప్రకృతి, పురుషుని కలయికలేని వస్తువుగాని, స్థావర జంగమమైన జీవిగాని ఏది ప్రపంచములోలేదని చెప్పవచ్చును. ఉదాహరణకు ఒక జీవరాసిని తీసుకొంటే అందులో ప్రకృతి సంబంధ శరీరము, పరమాత్మ సంబంధ ఆత్మ జీవాత్మలు కలవు. అలాగే క్రొత్తగా తయారై వచ్చిన మన ఇంటిలోని ప్రాణములేని ఒక కుర్చీని తీసుకొని చూచిన, అందులో ప్రకృతి సంబంధ పదార్థముండగ ఆ పదార్థములోని

అణువణువున పరమాత్మ వ్యాపించియున్నది. ఈ విధముగ ఏ జీవరాసిగాని, ఏ పదార్థముగాని, ప్రకృతి పురుషుల సంబంధము లేనివి లేవని తెలియవలెను.

(12)శ్లో॥ 28 : సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరమ్ ।
వినశ్యత్స్వవినశ్యన్తం యః పశ్యతి సపశ్యతి ॥
(పరమాత్మ)

**భావము :** సర్వజీవరాసులందు సమానముగ నివాసముండు పరమాత్మను, సమస్తము నాశనమైనప్పటికి నాశనముగాని వానిగ ఎవడు చూచునో వాడే చూచినవాడగును.

**వివరము :** పరమాత్మ సర్వజీవరాసులలో ఉంటూ అవి మరణించినప్పటికి, పరమాత్మ ఉనికి చెడనిదై ఉండడము ఆశ్చర్యమే కదా! పరమాత్మ తిష్టవేసి ఉన్న శరీరములు మరణించినప్పటికి, పరమాత్మ నాశనమెట్లు కాలేదో సవివరముగ తెలుసుకొందాము. అట్లు తెలుసుకొనుట వలన శ్లోకములో 'యఃపశ్యతి సపశ్యతి' అన్నట్లు శరీరములు నాశనమైన పరమాత్మ నాశనము కాలేదని చూచినవాడు నిజముగ చూచినవాడగును.

మనము ఒక ఊరికి బయలుదేరునపుడు ఆ ఊరు ఎంత దూరమున్నది, మనమెక్కడ దిగవలయునో, అన్నియు జ్ఞప్తిలో పెట్టుకొని ప్రయాణిస్తుంటాము. గమ్యము చాలా దూరమైతే దారికి కావలసిన ఖర్చు నిమిత్తము ఎంత డబ్బుకావాలో అంతే దగ్గర పెట్టుకుంటాము. అట్లే ప్రయాణములో ఎవరితో స్నేహము చేసినప్పటికి, దిగి పోవునంతవరకే స్నేహముండునని తెలిసి అంతవరకే పరిచయమేర్పరచు కొంటాము. అది గమ్యము తెలిసిన ప్రయాణము, కనుక ఆ ప్రయాణములో బంధాలు అనుబంధాలు ఏమి పెట్టుకోము.

జీవ ప్రయాణములో మరణమను గమ్యమున్నదని అందరికి తెలుసు. కాని ఆ గమ్యమెంత దూరమున్నది తెలియదు. అది ఎప్పుడొచ్చునది తెలియదు. ఒక ఊరికి పోవాలంటే ప్రయాణకాలము నెల పట్టునని తెలిసినప్పటికి, సాటి ప్రయాణికులతో అంటీ అంటని స్నేహము చేస్తాము. కాని మన శరీరవాహన

ప్రయాణ కాలమింతయని ఖచ్చితముగ తెలియనప్పటికి, మన సాటి ప్రయాణికులతో పూర్తి సంబంధాలు ఏర్పరచుకోవడము జ్ఞానరహితమని, అర్థరహితమని తెలియాలి. జ్ఞానసహితముగ యోచిస్తే సాటి ప్రయాణీకులుగ శరీరములందు జీవితము సాగిస్తున్నప్పటికి ఎవరి గమ్యము వారిది. ఎవరు ఏ గమ్యము వరకు ప్రయాణించి నిలిచిపోవుదురో చెప్పలేము. నీ వెంట నీ గమ్యము వరకు ప్రయాణించి నీతో పాటు దిగి పోవువారెవరు ఉండరు. మన వెంట ఎవరు రారనుమాట వాస్తవమే. చివరకు సహచరిణి అని పేరుగాంచిన నీ భార్య కూడ నీ వెంట చనిపోదు. ఈ వాస్తవాన్ని అందరు ఒప్పుకోవలసిందే. అయితే మనకు తెలియని వాస్తవమొకటున్నది. అదేమనగా! సహజముగ కనిపించు నీతోటి, నీసాటి ప్రయాణీకులు నీ గమ్యము వరకు రాకున్నను, నీకు కనిపించకుండ నీతో ప్రయాణము చేయువారు ఇంకా ఇద్దరున్నారు. వారిలో ఒకడు పేరున్నవాడు, మరియొకడు పేరులేనివాడు, ఒకనిపేరు ఆత్మ. పేరులేని రెండవవాడు ఆత్మకు పరముగనున్నాడు, కనుక వానిని పరమాత్మ అనడము జరుగుచున్నది. అతనినే **'ఈశ్వరుడు' (అధిపతి) అనియు, 'శివము' అనియు, దేవుడనియు** అనేక విధములుగ పిలుచుచున్నాము.

నీవు జీవాత్మవని నీకు తెలుసు. కాని నీవు శరీరములో జీవయాత్ర సాగిస్తున్నావని మరచినావు. అంతేకాక నీతో కూడ శరీరములో ఎల్లకాలము మరీ ఇద్దరు ప్రయాణిస్తున్నారని కూడ తెలియదు. నీకు తెలిసిన తెలియకపోయిన శరీరములో నీతో సహా ముగ్గురు ప్రయాణిస్తున్నారు. అట్లే అందరి శరీరములలోను జీవాత్మ, ఆత్మ, పరమాత్మ అను ముగ్గురు ప్రయాణిస్తున్నారు. ఆలోచిస్తే ఒకే వాహనమైన శరీరములో జీవునితో పాటు ప్రయాణిస్తున్న ఆత్మ, పరమాత్మలతో ఏ జీవుడు సంబంధముగాని, స్నేహముగాని పెట్టుకోలేదు. మనవెంటవచ్చు ఆత్మ పరమాత్మలతో స్నేహము చేయని మనము, మనవెంటరాని బయట ప్రజలతో ఎంతో సంబంధ బాంధవ్యాలు పెట్టుకొన్నాము. బయట వారితో కాలము గడుపు మనకు, లోపలనున్న వారితో స్నేహము చేయు తీరిక ఓపిక లేకుండపోయినది. మనము లోపలనున్న

వారి వైపు చూడకున్ననూ, నీవైపు వారు చూస్తున్నారు. వారితో మనము బంధము పెట్టుకోకున్నను, వారి బంధము ఎల్లవేళలా మనతో ఉన్నది. వారి బంధము లేకపోతే శరీరములో మనమొక్క నిమిషము కూడ ఉండలేము. శరీరవాహనములో జీవాత్మ, ఆత్మ, పరమాత్మలు ప్రయాణిస్తు మరణగమ్యము చేరుకోగానే, శరీరము నుంచి జీవాత్మ దిగిపోవును. జీవాత్మ ఒక్కడే కాక జీవాత్మతోపాటు ఆత్మ కూడ దిగిపోవును. నీతో పాటు మొదటినుండి ఉన్న ఆత్మ పరమాత్మలలో నీతో వచ్చువాడు ఆత్మ ఒక్కడే. ఈ విషయము పురుషోత్తమ ప్రాప్తి యోగమను అధ్యాయములో 8వ శ్లోకములో కూడ చెప్పబడినది.

నీ మరణ గమ్యములో నీతో పాటు శరీర వాహనము నుండి దిగిపోవు వాడు ఆత్మకాగ, ఆత్మకంటే వేరుగనున్న పరమాత్మ అట్లే శరీరమందే ఉండును.

సజీవయాత్రలో జీవుడు సుఖదుఃఖములను అనుభవించుచుండును. సుఖ దుఃఖములను అనుభవించుటకు కావలసిన కార్యాచరణకు చైతన్యమునిచ్చి శరీరమును కదలించువాడు రెండవవాడైన 'ఆత్మ', మూడవవాడైన పరమాత్మ సాక్షిగ అన్నిటిని చూస్తు ఏమి చేయక మౌనముగానుండును. జీవుడు శరీరములో ఉన్నపుడు మరియు లేనపుడు స్తబ్ధతగనుండువాడు శివము లేక ఈశ్వరుడు లేక పరమాత్మ. ఏమియుకాని ఈ మూడవ వానిని పరమాత్మ అనడములో అర్థము తెలుసుకొన్నాము కదా! అట్లే ఈశ్వరుడని ఎందుకంటున్నామో వివరముగ తెలుసుకొందాము.

అధిపతి అనగ పెద్దవాడు, గొప్పవాడు, మించినవాడని అర్థమగుచున్నది. లక్షాధిపతియనగ లక్షకు అధిపతియని లేక లక్షకు మించినవాడని, లక్షలు కలవాడని అర్థమగుచున్నది. ఆ విధముగ లక్షాధీశ్వరుడు, కోటీశ్వరుడు అనడములో కోటికి లక్షకు అధిపతియని వాటికంటే గొప్పవాడని తెలియుచున్నది. యావత్ ప్రపంచ మంతటికి అధిపతియైనవాడు పరమాత్మ ఒక్కడే, కనుక మొత్తమునకు అధిపతిగ పరమాత్మను 'ఈశ్వరుడు' అనడము జరిగినది.

పరమాత్మ ఎక్కడా గుర్తించలేనిది, అంతట ఉన్నది, దేనికి తెలియనిది, బ్రతికివున్నవానికి, జ్ఞానులకు, యోగులకు కూడ తెలియనిది, అగమ్యగోచరమైనది కావున దానిని 'శివము' అనడము కూడ జరిగినది. శివము అనగ తెలియనిదని అర్థము. జ్ఞానులకు, యోగులకు శివమనునదొకటున్నదని తెలుసు. అది ఏది అని మాత్రము తెలియదు. జీవుడు బ్రహ్మయోగము చేత శరీరమందున్న ఆత్మను తెలియవచ్చుగాని, శివమును మాత్రము తెలియలేడు. కర్మ అయిపోయిన తరువాత జన్మలేని స్థితిని చేరు యోగులు, శివమునందు ఐక్యమై పోవుదురు. ఆ శివమేదో అపుడే తెలుస్తుంది కాని ముందు తెలియదు.

శరీరమందు జీవయాత్రలో మరణమను గమ్యములో ఆత్మ జీవాత్మలు శరీరమునుండి నిష్క్రమించగ, చివరకు శరీరములో మిగిలిపోవునది శివము. బ్రతికున్నపుడు నీచమైన గుణములతో సంబంధమున్న జీవుడు శరీరములో ఉన్నపుడు, ఆ శరీరమునకు అంత ప్రాముఖ్యత లేదు. చనిపోయిన తరువాత శరీరములో జీవుడు లేడు, ఏ నీచ గుణములు అందులో లేవు. అపుడది శుద్ధ 'శివ' నిలయము, అందులో పరమాత్మ తప్ప మరెవ్వరు లేరు. కనుక ఆ విషయము తెలిసిన జ్ఞానులు, యోగులు మరణించిన శరీరములను విభూతినామములతో అలంకరించి గోవింద నామస్మరణతో పూజించి ఎల్లవారిని మ్రొక్కమనెడివారు. అటువంటి సాంప్రదాయము ఇప్పటికి ఉన్నను, అది అర్థము తెలియని ఆచారమైనది. ఇపుడు మ్రొక్కెడివారు భక్తితో కాక భయముతో మ్రొక్కుచున్నారు. ఒకవేళ మ్రొక్కని ఎడల చనిపోయిన వారు తిరిగి దయ్యముగ వస్తారని, వారి పీడ ఇంటిచుట్టు ఉంటుందని, మ్రొక్కితే వారి పీడ అంతటితో పోతుందని మ్రొక్కుచున్నారు.

పూర్వము అలా చేయలేదు. ప్రతి పని అర్థము తెలిసి చేసెడివారు. జీవుడు పోయిన తరువాత శరీరములో మిగిలినది 'శివము' అని వారికి తెలుసు. అందువలన మరణించబడిన శరీరమును (మృతదేహమును) శివము అనెడివారు. కాలక్రమేపి భావము పోయినది. శివము శవముగ పిలువబడుచున్నప్పటికి, పూర్వము నుండి ఉండు పూజలు మొదలగు ఆచరణలు అలాగే ఉన్నవి. ఈ

విధముగ ఆచరణలుండి అర్థములు మారిపోయినప్పటికి, నిజమైన జ్ఞానులు, యోగులు చనిపోయిన శరీరములో కూడ చెడని పరమాత్మ ఉనికిని మనోనేత్రముచే చూడగల్గు చున్నారు. ఈ విషయమును గురించి శ్లోకములో చనిపోయిన దేహములో కూడ నాశనముగాని వానిని చూచిన వాడే నిజముగ నన్ను చూచిన వాడని పరమాత్మ చెప్పాడు.

(12)శ్లో॥ 29 : సమం పశ్యన్ హి సర్వత్ర సమవస్థిత మీశ్వరమ్ ।
న హినస్త్యాత్మనాఽత్మానం తతో యాతి పరాం గతిమ్ ॥
(జీవాత్మ, ఆత్మ, పరమాత్మ)

**భావము :** సమస్త ప్రాణులందు సమముగ నివశించు పరమాత్మను సమముగ చూచువాడు, ఆత్మచేత ఆత్మను హింసించడు. అందువలన అతడు ఉత్తమగతిని (మోక్షము) పొందును.

**వివరము :** ఇక్కడ ఆత్మచేత ఆత్మను హింసించడము అన్నమాట అర్థమై ఉండదను కొంటాము. దానిని గురించి ఆలోచించి ఎవడైతే పరమాత్మ అంతట అందరియందు సమానముగ ఉన్నాడని తెలియుచున్నాడో, పరమాత్మ శరీరములో ఎట్లున్నది తెలిసియున్నాడో, వాడు అనగ జీవాత్మ అయినవాడు తన శరీరములో ఉన్న ఆత్మ, పరమాత్మలను దృష్టిలో పెట్టుకొని, తన శరీరమునకు ఏ ముప్పు తలపెట్టిన అది ఆత్మకు ముప్పు తలపెట్టినట్లగునని తలచును. ఎందుకనగ తన శరీరమంత చైతన్యముగ ఆత్మయు, సూక్ష్మముగ పరమాత్మ వ్యాపించి ఉన్నారని అతనికి తెలుసు. తన శరీరమునకు ఉరివేసిన అది ఆత్మను హింసించి చంపినట్లగునని తెలియును. అట్లే తనకున్న చేయిని నరికివేసిన అది చేతిలోనున్న ఆత్మను నరికివేసినట్లగునని తలచును. ఈ విధముగ శరీరములో సమానముగ వ్యాపించిన ఆత్మ పరమాత్మలను తెలిసినవాడు, వారివెనుక తలలో జీవాత్మగ ఉన్న తాను తన శరీరమంతటవున్న ఆత్మ పరమాత్మలను హింసింపలేడు. ఈ లోదృష్టి కలిగి ఆత్మ పరమాత్మల వివరము తెలిసినవాడు మోక్షమును పొందును.

(12)శ్లో॥ 30 : ప్రకృత్యైవ చ కర్మాణి క్రియమాణాని సర్వశః ।
యః పశ్యతి తథాఽఽత్మాన మకర్తారం స పశ్యతి ॥
(ప్రకృతి, పరమాత్మ)

**భావము :** అన్ని విధముల కర్మలు వాటి పనులు ప్రకృతిచేతనే జరుపబడుచున్నవని, పరమాత్మ అకర్త అనియు తెలిసినవాడే నిజమును తెలిసినవాడు.

**వివరము :** సజీవ శరీరములో ప్రకృతి పరమాత్మయను రెండు ఉన్నవని తెలుసు. ఆ రెండిటిలో సర్వకర్మల ప్రకారము జరిగెడి సర్వకార్యములు ప్రకృతివలననే జరుగుచున్నవని, కార్యాచరణకు ప్రకృతియే బాధ్యత వహిస్తున్నదని, శరీరములోని పరమాత్మ ఏమి చేయక కేవలము సాక్షిగ ఉంటు అకర్తగ ఉన్నాడని ఎవడు తెలియుచున్నాడో, వాడే నిజము తెలిసినవాడని చెప్పవచ్చును.

(12)శ్లో॥ 31 : యదా భూతపృథగ్భావమేకస్థ మనుపశ్యతి ।
తత ఏవచ విస్తారం బ్రహ్మ సమ్పద్యతే తదా ॥
(పరమాత్మ)

**భావము :** భూత భేదంబులన్నియు పరమాత్మ ఒక్కనివేయని, పరమాత్మవలననే అన్ని విస్తరింపబడుచున్నవని ఎప్పుడు తెలియునో అప్పుడు పరమాత్మనే పొందుచున్నాడు.

**వివరము :** నానా ఆకారములుకల్గి నానారకములుగ కనిపించు జీవరాసులన్ని ఒకే పరమాత్మలోనివేనని, అనేకరక జాతులుగ భూమిమీద పుట్టి విస్తరించు జీవరాసులన్ని ఒకే పరమాత్మ నుండి పుట్టుచున్నవని ఎప్పుడు తెలియుచున్నదో, అప్పుడు వాడు పరమాత్మను పొందుటకు అర్హుడగును.

(12)శ్లో ॥ 32 : అనాదిత్వా న్నిర్గుణత్వాత్పరమాత్మాఽయ మవ్యయః ।
శరీరస్థోఽపి కౌన్తేయ ! నకరోతి న లిప్యతే ॥
(పరమాత్మ)

**భావము :** అనాదియు, నిర్గుణుడును, అవ్యయుడును అయిన పరమాత్మ శరీరమందున్నప్పటికి కర్మలు చేయడు, కర్మలనంటడు.

**వివరము :** ఆది లేనివాడును, మూడుగుణములు లేనివాడును, నాశనము లేనివాడును అయిన పరమాత్మ శరీరములో ఉండి కూడ ఏ కార్యములు చేయడు, తాను ఏ కర్మలనంటించుకొనడు.

*(12)శ్లో॥ 33 : యథా సర్వగతం సౌక్ష్మ్యా దాకాశం నోపలిప్యతే ।*
*సర్వ త్రావస్థితో దేహే తథాఽత్మా నోపలిప్యతే ॥*
*(పరమాత్మ)*

**భావము :** ఏ విధముగ అంతట వ్యాపించి అన్నిటిని తాకియున్న ఆకాశము సూక్ష్మమగుట వలన దానినేది అంటనట్లు, అట్లే సర్వదేహములందు వ్యాపించి తాకియున్న పరమాత్మను ఏవిగాని అంటకున్నవి.

*(12)శ్లో॥34 : యథా ప్రకాశయ త్యేకః కృత్స్నం లోక మిమం రవిః ।*
*క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత ! ॥*
*(పరమాత్మ)*

**భావము :** సూర్యుడొక్కడీ లోకమునంతటిని ఎట్లు ప్రకాశింపజేయకల్గుచున్నాడో అట్లే పరమాత్మ సమస్త క్షేత్రములను, క్షేత్రజ్ఞులను ప్రకాశింపజేయుచున్నాడు.

**వివరము :** సూర్యుడు తన కిరణముల చేత సమస్త భూమండలమునంతటికి ఏ విధముగ వెలుగును ప్రసరింపజేయుచున్నాడో, అదే విధముగ సమస్త ప్రపంచములోని జీవరాసుల శరీరములను మరియు శరీరములలోగల ఆత్మను, పరమాత్మ తన శక్తి చేత చైతన్యవంతము చేసి కదిలించుచున్నాడు. పరమాత్మ సమస్త శరీరములను తయారు చేసి వాటిలో ఆత్మను నెలకొల్పి ఆత్మకు శక్తినిచ్చి దాని చేత శరీరమును కదలునట్లు చేయుచున్నాడని తెలియాలి.

(12)శ్లో ॥35 : క్షేత్ర క్షేత్రజ్ఞ యో రేవ మన్తరం జ్ఞానచక్షుషా ।
భూతప్రకృతిమోక్షం చ యే విదు ర్యాన్తి తే పరమ్ ॥
(ప్రకృతి, పురుషుడు)

**భావము :** జ్ఞాననేత్రముచేత క్షేత్రము, క్షేత్రజ్ఞులను, వాటి భేదములను, జీవరాసులను, ప్రకృతిని, మోక్షమును ఎవరు తెలియగల్గుచున్నారో, వారు పరమ పదమును పొందగల్గుచున్నారు. ఇంతటితో క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగమను ఈ అధ్యాయము ముగిసినది.

ఈ అధ్యాయములోని శ్లోకముల వివరము క్రింద చూడవచ్చును.

| | | | |
|---|---|---|---|
| 1) | ప్రకృతి, పరమాత్మ (పురుషుడు) | – | 11 |
| 2) | ప్రకృతి | – | 2 |
| 3) | ఆత్మజ్ఞానము | – | 5 |
| 4) | పరమాత్మ | – | 11 |
| 5) | ప్రకృతి, జీవాత్మ | – | 2 |
| 6) | జీవాత్మ, ఆత్మ, పరమాత్మ | – | 2 |
| 7) | భక్తి, బ్రహ్మ, కర్మయోగములు | – | 1 |
| 8) | జీవుడు, మోక్షము | – | 1 |
| | మొత్తము శ్లోకములు | – | 35 |

భావము, వివరము మార్చి వ్రాసిన శ్లోకములు – 2, 6.

*****

# పదమూడవ అధ్యాయము

# గుణత్రయ విభాగ యోగము

(13)శ్లో॥1: పరం భూయః ప్రవక్ష్యామి జ్ఞానానాం జ్ఞాన ముత్తమమ్ ।
యద్జ్ఞాత్వా మునయస్సర్వే పరాం సిద్ధి మితో గతాః ॥
(జ్ఞానము)

**భావము :** ఏ జ్ఞానమును తెలుసుకొని మునులందరు శ్రేష్ఠమైన మోక్షమును పొందియున్నారో, అట్టి జ్ఞానములలోకెల్ల ఉత్తమమైన జ్ఞానమును మరల చెప్పుచున్నాను.

(13)శ్లో॥2 : ఇదం జ్ఞాన ముపాశ్రిత్యమమ సాధర్మ్య మాగతాః ।
సర్గేఽపి నోపజాయన్తే ప్రళయే న వ్యథన్తి చ ॥
(జ్ఞానము)

**భావము :** ఈ జ్ఞానమును తెలిసి ఉపాసించినవారు, నా పరమపదమును పొందిన వారై సృష్ఠికాలములో పుట్టరు. మరియు ప్రళయ కాలములో బాధపడరు.

**వివరము :** పరమాత్మ జ్ఞానమును పొందినవాడు దానిని ఉపాసించుట వలన, పరమాత్మయందే ఐక్యమైపోయి జీవస్వరూపమును కోల్పోవును. మోక్షము పొందిన తరువాత ఒక మనిషిగాను, లేక ఒక జంతువుగాను లేకుండ, ఏ శరీరము ధరించకుండ, అణువణువున వ్యాపించి పోయివున్నాడు. కనుక వానికి ప్రళయకాలములో బాధకాని, సృష్ఠికాలములో పుట్టుటను సమస్యకానీలేదు. ప్రళయ సంభవములకు అతీతుడుగ ఉండును.

(13)శ్లో॥ 3 :మమ యోని ర్మహద్బ్రహ్మ తస్మిన్ గర్భం దధామ్యహమ్ ।
సంభవ స్సర్వభూతానాం తతో భవతి భారత ! ॥
(ప్రకృతి, పరమాత్మ)

**భావము :** నా యోని పెద్దదైన విశాలమైన ప్రకృతి, దానిని నేను గర్భము ధరించునట్లు చేయుచున్నాను. దానినుండి సర్వభూతముల పుట్టుకలు కలుగుచున్నవి.

**వివరము :** సమస్త ప్రపంచమంత అన్యములేకుండ ఏకస్తముగ ఉన్నది పరమాత్మ. దానికి మినహా ఏమిలేదని చెప్పుకొన్నాము. కాని ప్రపంచ కార్య కారణములకు పరమాత్మను విభజించుకోవాలని కూడ చెప్పుకొన్నాము. అలా విభజించి చూచుకొంటే నాలుగు ముఖ్య భాగములుగ ఉన్నవి. అవి **1) జీవాత్మ 2) ఆత్మ 3) పరమాత్మ 4) ప్రకృతి.** ఈ నాలుగు భాగములలో జీవాత్మ, ఆత్మ, పరమాత్మ అనునవి అలాగే ఉండగ, ప్రకృతి నుండి కనిపించు మరియు కనిపించనివి ఎన్నో పుట్టినవి. సమస్త జీవరాసులు ప్రకృతి నుండి పుట్టినవే. సమస్త జీవరాసులు ప్రకృతి నుండి పుట్టగ, వాటిని పుట్టించిన వాడు పరమాత్మ. ఒక స్త్రీనుండి కొందరు జన్మించుచుండుట మనకు తెలిసిన విషయమే. స్త్రీ నుండి పుట్టిన వారిని పుట్టించిన వాడు పురుషుడు అని కూడ మనకు తెలుసు. అదేవిధముగ సర్వ జీవరాసుల పుట్టుకకు కారణమైన భీజదాతయగు పరమాత్మ తండ్రికాగ, యోని స్వరూపిణియగు ప్రకృతి తల్లియగుచున్నది. ఒక మనిషికి స్థూలముగ కనిపించు తల్లితండ్రులున్నట్లు, సర్వజీవరాసుల మొత్తమునకు కనిపించని తల్లితండ్రులు ప్రకృతి, పరమాత్మలున్నారని తెలియవలెను. ఈ లెక్క ప్రకారము మన తల్లి ప్రకృతి, తండ్రి పరమాత్మయని చెప్పవచ్చును.

*(13)శ్లో॥ 4: సర్వయోనిషు కౌంతేయ! మూర్తయః సంభవంతి యాః ।*
*తాసాం బ్రహ్మ మహద్యోనిః అహం బీజప్రదః పితా ॥*
*(ప్రకృతి, పరమాత్మ)*

**భావము :** సర్వయోనులందు పుట్టుచున్న అనేక రకముల ఆకారములు గల జీవరాసులకు ప్రకృతి తల్లికాగ, భీజదాతనైన నేను తండ్రినగుదును.

*(13)శ్లో॥ 5 : సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతి సంభవాః ।*
*నిబధ్నంతి మహాబాహో! దేహే దేహిన మవ్యయమ్ ॥*
*(జీవుడు, మూడు గుణములు)*

**భావము :** ప్రకృతి చేత పుట్టిన సత్త్వ రజస్తమ అను గుణములు దేహములో నాశనముకాని జీవాత్మను బంధించుచున్నవి.

**వివరము :** ప్రకృతికి జీవరాసులు పుట్టాయని చెప్పాము కదా! ఆ జీవరాసుల శరీరములను విభజించి చూచినట్లయితే వాటిలో కనిపించెడి జ్ఞానేంద్రియములు కర్మేంద్రియములు, కనిపించని వాయువులు, అవయవముల శక్తులు, గుణములు ముఖ్యమైన నాడీకేంద్రములు, గ్రంథులు మొదలగునవి కలవు. శరీరము మొత్తమును లెక్కించిన, దానిలోని భాగములు కూడ ప్రకృతికి పుట్టినవని చెప్పవచ్చును. వీటన్నిటితో కార్యములు జరుగుటకు, కర్మను సంపాదించి పెట్టుటకు, ముఖ్యపాత్రవహించునవి గుణములు. ఈ గుణములు మూడు భాగములుగ ఉన్నవి. ఒకటి తామసగుణ భాగము. రెండవది రాజసగుణ భాగము. మూడవది సాత్త్విక గుణభాగము. ఈ మూడు గుణ భాగములలో ఒక్కొక్క దానియందు ఆరు గుణములు ఒక గుంపుగ, మరియొక ఆరు గుణములు మరొక గుంపుగ ఉన్నవి. ఆరు ఒక వర్గము, మరియొక ఆరు ఒక వర్గముకాగ, ఈ గుంపులకు సంబంధములేని మరియొక రెండు మరియు ఒకటి కలసి మూడుగుణములు ప్రత్యేకముగ కలవు. దీనిని బట్టి ఒకే గుణభాగములో (6+6+2+1=15) మొత్తము పదిహేను గుణములు గలవని తెలియుచున్నది. ఇంతవరకు అందరు అన్ని పుస్తకములలో వ్రాసుకొన్నవి చెప్పుకొన్నవి ఆరు మాత్రమే. అరిషట్ వర్గములు అని వాటి పేర్లు **1) కామ 2) క్రోధ 3) లోభ 4) మోహ 5) మద 6) మత్సర్యములు.** ఈ విధముగ ఒక గుంపైన ఆరు గుణములు మాత్రము ప్రచారములో కలవు. ఇపుడు మేము మా రచనలో మొత్తము గుణములను బహిర్గతము చేసి చెప్పుచున్నాము. అలా తెలుసుకోక పోతే క్షేత్రమును పూర్తి తెలిసినవారము కాము. అన్ని కార్యములకు మూలమైన గుణములను తెలియకపోతే వాటివలన ఏర్పడు కర్మలు తెలియవు.

ఇపుడు మేము తెలుపు గుణములు అందరిలోను ఉన్నవేనని తెలియాలి. ఒక గుణ భాగములో లేక ఒక గుణ ఆవరణములో ఉన్న మొత్తము 15 గుణములలో

కంటికి తెలియనివైనను వాటిలో ఒక విధముగ 12 మాత్రము స్థూలగుణములుగను, మూడింటిని సూక్ష్మగుణములుగను చెప్పుకోవచ్చును. ఈ వివరణ అర్థమగుటకు మాత్రమేనని తెలియాలి. ముఖ్యముగ చెప్పుకొను 12 గుణములలో ఆరు చెడు గుణములని, ఆరు మంచి గుణములని చెప్పుకోవచ్చును. **వాటినే రాక్షస (చెడు) గుణములని, దైవ (మంచి) గుణములని కూడ చెప్పవచ్చును.** ఇంతవరకు రాక్షస ప్రభావము గల కామ, క్రోధ, లోభ, మోహ, మధ, మాత్సర్యములనే మనమందరము వినియున్నాము. మనము వినని, ప్రచారములో లేని దైవ ప్రభావముగల **1) దానము 2) దయ 3) ఔదార్యము 4) వైరాగ్యము 5) వినయము 6) ప్రేమ** అను పేరున్న ఈ గుణములు ఒక గుంపుగ ఉన్నవి. ఇవి మొదటి ఆరు గుణములకు వ్యతిరేఖమైనవి. కామము లేక ఆశ అనబడు గుణమునకు దానము అనునది విరుద్ధమైన గుణమని తెలియవలెను. అట్లే కోపమునకు దయ, లోభమునకు ఔదార్యము, మోహమునకు వైరాగ్యము, మదము (గర్వము) నకు వినయము, మత్సరము (అసూయ) అను దానికి ప్రేమ అను గుణములు వ్యతిరేఖమైనవి.

ఆరు చెడువి, ఆరు మంచివన్నాము కదా! ఆరు చెడు గుణములు పాప కర్మను సంపాదించి పెట్టుచున్నవి. అలాగే ఆరు మంచి గుణములు పుణ్యమును సంపాదించి పెట్టుచున్నవి. మిగత మూడు గుణములను సందర్భానుసారము తరువాత చెప్పెదము. ఇవి 6+6=12 గుణములు పాపపుణ్యములను సంపాదిస్తున్నవన్నాము కదా! ఉదాహరణకు ఒక కామమను గుణమును దానికి వ్యతిరేఖమైన దానమను గుణమును తీసుకొందాము. ఆశయను గుణము ఏదో ఒక విధముగ తనకు లేని దానిని ఇతరుల నుండి తాను సంపాదించుకొనునట్లు చేయును. అట్లు చేయుటలో అక్రమాలు, అన్యాయములు, అసత్యములు అన్ని కూడుకొని ఉండుట సహజము. దాని వలన పాపము సంభవించును. దానికి వ్యతిరేఖమైన దానగుణము ఇతరులకులేని దానిని తన వద్దనుండి ఉచితముగ ఇప్పిస్తున్నది. ఇందులో అక్రమ, అన్యాయ, అసత్యమనునవి ఏమాత్రము ఉండుటకు

అవకాశములేదు. కావున ఈ కార్యములో పుణ్యమే సంభవించును. ఈ విధముగ సంభవించు పాపపుణ్యములు జీవున్ని బంధించి మరుజన్మలకు తీసుకుపోవును. అందువలన గుణముల వలన ఏర్పడు కార్యములలో సంభవించు పాపపుణ్య ఫలితములను కర్మ బంధములన్నారు. కర్మ బంధములనునవి ఆ శరీరములో ఉన్న జీవున్ని బంధించి పెట్టివుండును. మరుజన్మకు లాగుకొని పోవు కర్మలను జన్మబంధములని కూడ అంటున్నారు. ఈ విధముగ జీవున్ని బంధించు సూత్రములను (త్రాడులను) గుణములే తయారు చేయుచున్నవి. ముఖ్యముగ జీవునకు బంధనములను కలుగజేయునవి గుణములు. అందువలన ఈ శ్లోకములో దేహములోనున్న జీవున్ని మూడు గుణ భాగములు బంధించి పెట్టాయన్నాడు.

ఈ అధ్యాయములో ఇక్కడ నుండి గుణములు ప్రేరేపించు కార్యములను గురించి తెలియజేయుట ప్రారంభమగుచున్నది. కావున ముందే గుణముల వివరమంతా తెలియవలసిన అవసరమున్నది. అందువలన గుణముల గూర్చి వివరముగ తెలుసుకొందాము. ఇంతవరకు తామస గుణభాగములో 12 గుణములు, రాజస గుణభాగములో 12 గుణములు, సాత్త్విక గుణభాగములో 12 గుణములు మొత్తము 36 గుణములు కలవని తెలుసుకొన్నాము. క్రింద పటములో గుణ భాగములను వాటిలో గల జీవాత్మను చూడవచ్చును.




గుణ చక్రము

మూడు ఆవరణములుగనున్న గుణ భాగములలో గుణములు ఏ విధముగ ఉన్నది క్రింది పటము  చూడవచ్చును.




గుణ చక్రము

ఒక్కొక్క భాగములో మొత్తము 12 గుణములుండగ, తామస గుణ స్వభావములు, రాజస గుణస్వభావములు, సాత్త్విక గుణస్వభావములు వేరువేరుగ ఉండుట వలన  వాటి ఆకారములు కూడ వేరు వేరుగ ఉన్నవని తెలియవలెను. ఒక గుణభాగములో ఒక్కొక్క గుణము 9 భాగములుగ విభజింపబడి ఉన్నది. ఈ విధముగ ఒక గుణభాగములో (12×9=108) మొత్తము 108 గుణములు కలవు. 108 గుణములన్ని ఒకే విధముగ ఉండక  వాటి ప్రభావ పరిమాణములలో తేడాలున్నవి. అదెలాయనగా! ఉదాహరణకు ఆశ అను గుణమును తీసుకొందాము. ఆశలో పెద్ద ఆశ, చిన్న ఆశ అను 9 రకముల ఆశలుండును. అట్లే కోపమును తీసుకొనిన మొదట పెద్ద కోపముండును. దాని తరువాత పరిమాణము తగ్గుచుపోతు చివరకు 9వది చిన్నదిగ ఉండును. ఇదే ప్రకారముగ మొదటి ఆరు గుణములు మొదట పెద్దదిగ ఉండి చివరకు చిన్నదిగ మారివుండును. మిగతా మంచి ఆరు గుణములు పరిమాణములలో కూడ మొదటి ఆరు గుణములవలె తేడా ఉండును. అయితే ఇక్కడ గమనించవలసిన విషయమేమనగా! మొదటి గుణములు పెద్ద పరిమాణము నుండి చిన్నగ మారియుండగ రెండవ గుంపులోని గుణములు చిన్న

పరిమాణము నుండి పెద్ద పరిమాణము వరకు మారి ఉండుట గమనించదగ్గ విషయము. ఉదాహరణకు పెద్ద కోపమునుండి చిన్న కోపము వరకు మారివుండగ, దానికి వ్యతిరేఖమైన దయా గుణము కోపము చిన్నదిగ అంత్యమైన చోటనుండి చిన్న గుణముగా ప్రారంభమై చివరకు పెద్దదిగ మారివుండును. కోపము పెద్దది నుండి చిన్నది వరకు 9 భాగములు మారివుండగ, దానికి వ్యతిరేఖమైన దయ అక్కడ నుండి చిన్నదిగ ప్రారంభమై 9వ భాగము పెద్దదిగ మారినిలచి ఉండును. అవి ఎట్లున్నది పై పటములో చూడుము.




గుణ చక్రము

ఈ విధముగ మూడు గుణ ఆవరణములలోను ఒక్కో గుణభాగములో 12 గుణములు 9 భాగములు కాగ మొత్తము 108 అవును. ఈ సంఖ్యయే కోట్ల సంఖ్యలో ప్రపంచ ఆయుస్సయినది. మొత్తము ప్రపంచములోని జీవరాసులన్నియు మూడు గుణభాగములలోని 108 గుణములలోనే చిక్కుకొని ఉన్నవి. చిన్నవి పెద్దవి అయిన 108 గుణములే సర్వజీవులను శరీరములలో బంధించి పెట్టి ఉన్నవి. అందువలననే పూర్వము పెద్దలు మానవుడు చేయు మంత్రసాధనకాని, దైవనామ జపముకాని, ప్రదక్షిణలుకాని, పూజించు పూలుకాని, ఆకులుకాని,

జపమాలలోని పూసలను కాని 108 సంఖ్య పెట్టి ఉండడము గమనార్హము. ప్రతిది 108 పెట్టి ఒక్కొక్క జపముకాని, పూజకాని ఒక్కొక్క గుణమునకని 108 గుణములు గుర్తుండునట్లు చేశారు. ఆ వివరము మనందరికి తెలియకపోయిన పూర్వము పెద్దలు సంపూర్ణజ్ఞానులైన దానివలన వారెంతో ముందు చూపుతో ఈ పద్ధతి ఉంచారని గ్రహించవలెను. ప్రతి జపమాలలోను 108 పూసలు గుణములకు ప్రతి రూపములుగ ఉంచి, వీటియందే నీవు బంధించి ఉన్నావనునట్లు పూసలను గుండ్రని ఆవరణముగ ఏర్పరిచి పెట్టారు.

ఏ జీవుడైన శరీరములో గుణచక్రమందు మూడు గుణ ఆవరణములందు ఒకే సమయములో ఎప్పుడూ ఉండడు. ఒక సమయములో ఒక గుణ ఆవరణములోనే ఉండును. అందువలన ఒక ఆవరణములో ఉన్న 108 గుణములలోనే బంధింపబడి ఉన్నాడని చెప్పబడుచున్నాడు.

(13) శ్లో॥ 6 : తత్ర సత్త్వం నిర్మలత్వా త్ప్రకాశక మనామయమ్ ।
సుఖసంగేన బధ్నాతి జ్ఞానసంగేన చానఘ ! ॥
(జీవుడు, సాత్త్వికము)

**భావము :** మూడు భాగములలో సాత్త్విక గుణభాగములో గల గుణములు నిర్మలత్వము ప్రకాశత్వము కల్గి ప్రయాసలేనివై, సుఖములందాసక్తి కల్గించునవై ఉండి జ్ఞానసుఖములలోనే బంధించును.

**వివరము :** సాత్త్విక భాగములోని గుణములు సుఖములందు ఆసక్తి కల్గించి జ్ఞాన సుఖములలోనే బంధించును. జ్ఞానసుఖము అనగా ఇచ్చట దైవజ్ఞానమేనని అనుకోకూడదు. ప్రపంచ విషయ జ్ఞానమని అర్థము చేసుకోవాలి. మిగత రెండు గుణముల వారికంటే సాత్త్వికులు క్రొత్త విషయము తెలుసుకొనుటలోనే ఎక్కువ లగ్నమైవుందురు. జీవితమంత నేర్చుకొన్న తరగని సమాచారములెన్నో కలవు. అటువంటి వాటిని ఒకదాని తరువాత ఒకటి నేర్చుకొనుటకే తన తెలివినంత ఉపయోగించుచుండును. తెలియని దానిని తెలుసుకోవడమును జ్ఞానమంటాము. తెలియని వాటిని తెలుసుకొనుట సాత్త్వికులకు ఆసక్తి. ఆ ఆసక్తిలోనే మునిగి క్రొత్త




గుణ చక్రము

వాటిని తెలుసుకొని ఇంకా క్రొత్తవాటిని తెలుసుకొను సుఖమునందే మునిగి ఉండడమును సాత్త్విక జ్ఞానమంటారు.

*(13) శ్లో॥ 7 : రజో రాగాత్మకం విద్ధి తృష్ణా సంగ సముద్భవమ్ ।*
*తన్నిబధ్నాతి కౌన్తేయ! కర్మసంగేన దేహినమ్ ॥*
*(జీవుడు, రాజసము)*

**భావము :** రాజస గుణ భాగములోని గుణములు ప్రపంచ విషయములందు ప్రీతిని కలుగజేయునవై, వాటియందు ఆసక్తి ఆశను పుట్టించునవై, ఆ పనులందే తగులుకొనునట్లు చేసి జీవున్ని బంధించుచున్నవి.




గుణ చక్రము

(13) శ్లో ॥8 : తమ స్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినామ్ ।
ప్రమాదాలస్య నిద్రాభి స్తన్నిబధ్నాతి భారత! ॥
(జీవుడు, తామసము)

**భావము :** తామస గుణ ఆవరణములో ఉన్న గుణములు అజ్ఞానమును కలుగజేయునవై, మోహమును పుట్టించునవై ఉన్నవని తెలియుము. అంతేకాక ప్రమాదముతో కూడుకొన్న మజ్జుతనము, నిద్రలయందే జీవున్ని బంధించి పెట్టుచున్నవి.




గుణ చక్రము

(13) శ్లో ॥9 : సత్త్వం సుఖే సంజయతి రజః కర్మణి భారత!।
జ్ఞాన మావృత్య తు తమః ప్రమాదే సంజయత్యుత ॥
(జీవుడు, మూడు గుణములు)

**భావము :** సాత్త్విక గుణభాగము యొక్క గుణములు సుఖములందాసక్తి కల్గించగ, రాజసగుణభాగములోని గుణములు ఆశను కల్గించి లాభము కొరకు పనులు చేయించగ, తామస ఆవరణములోని గుణములు జ్ఞానమును కప్పివేసి ప్రమాదాలచే ముప్పునుకలుగ చేయు పనులందే ఆసక్తి కల్గించి చేయించుచున్నవి.

(13) శ్లో॥ 10 : రజ స్తమ శ్చాభిభూయ సత్త్వం భవతి భారత ! ।
రజ స్సత్త్వం తమశ్చైవ తమ స్సత్త్వం రజస్తథా ॥
(జీవుడు, మూడు గుణములు)

**భావము :** మూడు గుణ భాగములలో జీవుడు ఒక సమయములో ఏదో ఒక భాగములో మాత్రముండును. తామస భాగములో ఉన్నపుడు రాజస భాగములోను, సాత్త్విక భాగములోను ఉండడు. అలాగే రాజస భాగములో ఉన్నపుడు తామస భాగములోను, సాత్త్వికములోను ఉండడు. సాత్త్విక భాగములో ఉన్నపుడు రాజస భాగములోను, తామస భాగములోను ఉండడు.

(13) శ్లో॥ 11 : సర్వద్వారేషు దేహేఽస్మిన్ ప్రకాశ ఉపజాయతే ।
జ్ఞానం యదా తదా విద్యాత్ వివృద్ధం సత్త్వమిత్యుత ॥
(జీవాత్మ, సాత్త్వికము)

**భావము :** శరీరమునందున్న జీవునకు అనేక మార్గముల ద్వారా జ్ఞానము ఎప్పుడు కల్గుచున్నదో, అప్పుడు ఆ జీవుడు సాత్త్విక గుణభాగములోనున్నాడని తెలియవచ్చును.

**వివరము :** ఇక్కడ 'సర్వద్వారేషు' అను పదమునకు అనేక దారుల ద్వారా లేక అనేక ద్వారములద్వార అనేకరీతుల జ్ఞానము అభివృద్ధికావడమని అర్థము చేసుకోవలెను. అట్లుకాక శరీరమునకున్న తొమ్మిది ద్వారముల ద్వార జ్ఞానము కల్గడమని అనుకోకూడదు. అది అర్థములేని మాటయగును. గుదము గుహ్యము ద్వార జ్ఞానము కల్గుతుందా అని ఎవరైన ప్రశ్నిస్తే జవాబు లేకుండ పోతుంది. శ్లోకములోని నిజభావము ప్రకారము అనేక విధముల జ్ఞానము అభివృద్ధికావడమని తెలియవలెను. అనేక మార్గముల ద్వార జ్ఞానము తెలియబడుచు పెరగడము సాత్త్విక గుణ భాగములో జీవుడున్నప్పుడు జరుగును.

(13)శ్లో॥12 : లోభః ప్రవృత్తి రారమ్భః కర్మణా మశమః స్పృహా ।
రజస్యేతాని జాయన్తే వివృద్ధే భరతర్షభ ! ॥
(జీవాత్మ, రాజసము)

**భావము :** సంకుచిత స్వభావము, కార్యములందాసక్తి, ధనము మీద, బంగారు మీద ఇష్టము, మనస్సుకు అశాంతి ఎపుడు కల్గుచున్నవో అప్పుడు రాజస గుణ భాగములోని గుణములు పనిచేయుచున్నవని తెలియవచ్చును.

(13)శ్లో॥ 13 : అప్రకాశోஉప్రవృత్తిశ్చ ప్రమాదో మోహ ఏవ చ ।
తమ స్యేతాని జాయన్తే వివృద్ధే కురునందన ! ॥
(జీవాత్మ, తామసము)

**భావము :** అజ్ఞానము, మజ్జుతనము, చెడుపనులు చేయుటయందే మనసు లగ్నమగుట ఎప్పుడు పొడచూపునో, అప్పుడు జీవుడు తామసభాగములో ఉన్నాడని, తామస గుణములు జీవుని మీద పని చేయుచున్నవని తెలియవచ్చును.

(13)శ్లో॥ 14 : యదా సత్త్వే ప్రవృద్ధే తు ప్రళయం యాతి దేహభృత్ ।
తదోత్తమవిదాం లోకా నమలాన్ ప్రతిపద్యతే ॥
(జీవాత్మ, సాత్త్వికము)

**భావము :** దేహధారి అయిన జీవుడు సత్త్వ గుణభాగములో ఉన్నప్పుడు మరణిస్తే, వాడు ఉత్తమ జ్ఞానవంతులు పొందు పరిశుద్ధమైన జన్మను పొందును.

(13) శ్లో॥ 15 : రజసి ప్రళయం గత్వా కర్మ సంగిషు జాయతే ।
తథా ప్రలీన స్తమసి మూఢయోనిషు జాయతే ॥
(జీవాత్మ, రాజసము, తామసము)

**భావము :** రాజస భాగములో జీవుడున్నపుడు మరణించిన ఎడల కర్మములతో కూడిన జన్మలే వచ్చును. తామసములో ఉండి చనిపోయిన వానికి మూఢ యోనులందే జన్మము కల్గుచుండును.

(13)శ్లో॥ 16 : కర్మణ స్సుకృతస్యాஉహు స్సాత్త్వికం నిర్మలం ఫలమ్ ।
రజస స్తు ఫలం దుఃఖ మజ్ఞానం తమసః ఫలమ్ ॥
(జీవుడు, మూడు గుణములు)

**భావము :** సాత్త్విక గుణభాగములో జీవునకు పుణ్యకార్యములు నిర్మల ఫలితములు దొరుకును. రాజస భాగములో జీవునకు దుఃఖము దొరుకును. తామసములో అజ్ఞానమే జీవునకు కల్గుచుండును.

(13) శ్లో॥ 17 : సత్త్వాత్సంజాయతే జ్ఞానం రజసో లోభ ఏవ చ ।
ప్రమాదమోహౌ తమసో భవతోఽజ్ఞాన మేవ చ ॥
(జీవుడు, మూడు గుణములు)

**భావము :** సత్త్వగుణ ఆవరణములో జీవునకు జ్ఞానముకల్గుచుండును. రాజస భాగములో ఇతరుల సొమ్ము నాది కావలెనను ఆకాంక్ష ఏర్పడుచుండును. తామస భాగములో తనకు ఇష్టము నష్టము చేకూర్చుకొనుట, భ్రాంతి అజ్ఞానము చేకూరు చుండును.

(13) శ్లో॥18 : ఊర్ధ్వం గచ్ఛన్తి సత్త్వస్థా మధ్యే తిష్ఠన్తి రాజసాః ।
జఘన్యగుణవృత్తిస్థాః అధో గచ్ఛన్తి తామసాః ॥
(జీవుడు, మూడు గుణములు)

**భావము :** సాత్త్వికులకు ఉత్తమమైన జన్మలు, రాజసులకు మధ్యమమైన జన్మలు, తామసులకు నీచమైన జన్మలు కల్గుచుండును.

(13) శ్లో ॥19 : నాన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టాఽనుపశ్యతి ।
గుణేభ్య శ్చ పరం వేత్తి మద్భావం సోఽధిగచ్ఛతి ॥
(జీవుడు, మూడు గుణములు)

**భావము :** సర్వకార్యములకు గుణములే కర్తలని ఎవడు తెలుసుకొనునో, ఆ గుణములు వేరు తాను వేరని వాడు తెలుసుకొని నా స్థానమైన పరమపదమును పొందుచున్నాడు.

(13)శ్లో॥ 20 : గుణా నేతా నతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్ ।
జన్మ మృత్యు జరాదుఃఖై ర్విముక్తోఽమృత మశ్నుతే ॥
(జీవుడు, మూడు గుణములు)

**భావము :** దేహమునందున్న జీవుడు దేహమునందున్న గుణములను తెలుసుకొని, జన్మ మృత్యుజరా దుఃఖములను వదలినవాడై, మృతములేని మోక్షమును పొందుచున్నాడు.

**అర్జునుడిట్లనియె :-**

(13) శ్లో॥ 21 : కైర్లింగై స్త్రీన్ గుణా నేతా నతీతో భవతి ప్రభో! ।
కి మాచారః కథం చైతాం స్త్రీన్ గుణా నతివర్తతే ॥
(యోగి)

**భావము :** ఓ కృష్ణా! ఈ త్రిగుణ భాగములోనున్న గుణములన్నిటిని అతిక్రమించిన వాని ఆచారమెట్లుండును? వాడు త్రిగుణములనెట్లు అతిక్రమించి వర్తించుచుండును?

**శ్రీ భగవంతుడిట్లనియె :-**

(13) శ్లో॥ 22 : ప్రకాశం చ ప్రవృత్తిం చ మోహ మేవ చ పాణ్డవ! ।
న ద్వేష్టి సమ్ప్రవృత్తాని న నివృత్తాని కాంక్షతి ॥
(యోగి)

**భావము :** తేజస్సుగ జరిగెడి కార్యములను తనవని అనుకొనని వాడు, తనకు సంప్రాప్త మైన వాటి ఎడల ద్వేషంబులేనివాడు, తనకు దొరికిన వాటి ఎడల కాంక్షలేనివాడు.

(13)శ్లో॥ 23 : ఉదాసీన వదాసీనో గుణైర్యో న విచాల్యతే ।
గుణావర్తన్త ఇత్యేవ యోఽవతిష్ఠతి నేంగతే ॥
(యోగి)

**భావము :** సర్వ విషయములందు తటస్థముగ ఉదాసీనునిగ ఉండి ఎవడు గుణములచే చలించబడడో, ఎవడు ప్రతిది గుణముల ప్రవర్తనయేయని తెలిసి వాటికి అచంచలుడై బుద్ధి నిశ్చలత పొందియుండునో.

(13) శ్లో ॥ 24 : సమదుఃఖసుఖ స్స్వస్థ స్సమలోష్టాశ్మకాంచనః ।
తుల్యప్రియాప్రియో ధీర స్తుల్యనిన్దాత్మ సంస్తుతిః ॥
(యోగి)

**భావము :** సుఖదుఃఖములను ఎవడు సమముగ చూచునో, బంగారు మన్నురాతికి ఎవడు సమముగ విలువిచ్చునో, ప్రీతి అప్రీతి స్తుతి నిందల ఎడల ఎవడు స్థిర బుద్ధి గలవాడైవుండునో.

(13)శ్లో॥ 25 : మానావమానయో స్తుల్య స్తుల్యో మిత్రారిపక్షయోః ।
సర్వారమ్భపరిత్యాగీ గుణాతీత స్స ఉచ్యతే ॥
(యోగి)

**భావము :** ఎవడు మానావమానములయందు, మిత్ర శత్రువులందు సమబుద్ధి కలవాడో, కామ్య కర్మములనెల్ల పరిత్యజించిన వాడెవడో అట్టివానిని గుణాతీతుడని చెప్పవచ్చును.

(13)శ్లో॥ 26 : మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే ।
స గుణాన్ సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే ॥
(సాకార, నిరాకారములు)

**భావము :** వ్యభిచరించని మనస్సుతో పరమ భక్తితో ఎవడు నన్ను సేవించుచున్నాడో, వాడు త్రిగుణములనెల్ల అతిక్రమించి పరమాత్మయందైక్యమగుటకు అర్హుడగును.

(13)శ్లో॥ 27 : బ్రహ్మణోహి ప్రతిష్ఠాఽహ మమృతస్యావ్యయస్య చ ।
శాశ్వతస్య చ ధర్మస్య సుఖస్యైకాన్తికస్య చ ॥
(సాకార, నిరాకారములు)

**భావము :** నిత్యుడు అవ్యయుడైన నిర్మలాత్మ, శాశ్వితైశ్వర్య ధర్మమౌ పరమపదము, జ్ఞానులు పొందగలుగు మోక్షపదవి లభించవలెనన్న నన్ను ఆశ్రయించవలసిందే.

**వివరము :** ఈ చివరి రెండు శ్లోకములలోను నిరాకారమైన పరమాత్మను పొందుటకు సాకార పరమాత్మను ఆశ్రయించవలసినదని, సాకారమును భక్తి యోగముచే సేవించవలెనని భావము ప్రకటించారు. సాకార పరమాత్మ ప్రస్తుతము లేకున్న ఆయన సాకారముగ ఉన్నపుడు తెలిపిన జ్ఞానము నాశ్రయించుట వలన నిరాకార పరమాత్మను పొందవచ్చును. పరమాత్మ భగవంతునిగ ఉన్నప్పుడు చెప్పిన జ్ఞానమును వదలి అన్యదేవతల మహత్యములనో, పురాణమహిమలనో ఆశ్రయించిన, ఎవరూ ఎప్పటికీ మోక్షము పొందలేరు.

ఇంతటితో గుణత్రయ విభాగయోగమను ఈ అధ్యాయము సమాప్తమైనది. ఈ అధ్యాయములోని శ్లోకముల వివరము క్రింద గలదు.

| | | | |
|---|---|---|---|
| 1) | జ్ఞానము | - | 2 |
| 2) | ప్రకృతి, పరమాత్మ | - | 2 |
| 3) | జీవుడు, మూడు గుణములు | - | 8 |
| 4) | జీవుడు, సాత్త్వికము | - | 3 |
| 5) | జీవుడు, రాజసము | - | 2 |
| 6) | జీవుడు, తామసము | - | 2 |
| 7) | జీవుడు, రాజస, తామసము | - | 1 |
| 8) | కర్మయోగి | - | 5 |
| 9) | సాకార, నిరాకారము | - | 2 |
| | మొత్తము శ్లోకములు | - | 27 |

బ్రహ్మ కాల కర్మ గుణచక్రములోని కర్మచక్రమును తర్వాత పేజీలో చూడవచ్చును.


ఆత్మ
1
పుణ్యము
2
పాపము
పుణ్యము
3
పాపము
4
పాపము
పుణ్యము
5
పుణ్యము
6
పాపము
7
8
9
10
11
12
శరీర సంబంధ అవయవములు
వాక్కు అయుస్సు
ధన సంబంధ తండ్రి సంబంధ

కర్మచక్రము

*****

## పదునాలుగవ అధ్యాయము

# పురుషోత్తమ ప్రాప్తి యోగము

**శ్రీ భగవంతుడిట్లనియె :-**

*(14) శ్లో॥1: ఊర్ధ్వ మూల మధశ్శాఖ మశ్వత్థం ప్రాహు రవ్యయమ్ ।*
*ఛన్దాంసి యస్య పర్ణాని యస్తం వేద స వేదవిత్ ॥*
*( ప్రకృతి, పురుషుడు)*

**భావము :** పైకి వేర్లు క్రిందికి కొమ్మలు గల అశ్వర్థమనే వృక్షము అవ్యయమైనదని, వేదములు ఆకులుగ ఉన్నవని ఎవడు తెలియునో వాడు వేదములు తెలిసినవాడని చెప్పవచ్చును.

**వివరము :** ఒక వృక్షమునకు వేర్లు, మొదలు, కొమ్మలు, ఆకులు, ఫలములు ఉండుట సహజము. ఇక్కడ మనము చెప్పుకొను అశ్వర్థమనబడు దానికి వేర్లు (మూలము), కొమ్మలు (శాఖలు), ఆకులు ,ఫలములు గలవు కావున వృక్షములాంటి పోలికలున్నవి. కనుక ఒక విధముగ అర్థమగుటకు వృక్షమని చెప్పుకోవచ్చును. వాస్తవానికిది వృక్షముకాదని తెలియాలి. సాధారణముగ వృక్షమునకు వేర్లు క్రింద భూమిలో, కొమ్మలు పైన ఉంటూ కొమ్మలకు ఆకులు అందముగ కనిపిస్తుంటాయి. అలాగే వృక్షము పెరుగుటకు భూమి నుండి వేర్లు ఆహారమును గ్రహించి పెట్టుచున్నవి. వేర్లు నుండి గ్రహించిన ఆహారమును ఆకులు ఉపయోగించుకొని చెట్టు పెరుగుచు పైకి క్రిందికి దిశలకు కొమ్మలు ప్రాకియుండుట మనము చూస్తూనే ఉన్నాము. కాని ఇక్కడ చెప్పబడు అశ్వర్థమనబడు వృక్షము పైకి వేర్లు, క్రిందికి కొమ్మలు కలదిగ ఉండడము విచిత్రము. అశ్వర్థమనబడు వృక్షము పెరుగుటకు కావలసిన సదుపాయములన్ని పైనున్న మూలము నుండి లభిస్తున్నవి. ఆకులు, కాయలకు కావలసిన ఆహారము పైనున్న మూలము నుండి లభిస్తు చెట్టు పెరుగుచూ పోయి దృఢముగ వ్యాపించుకొన్నది. చెట్టు నిర్మాణములోనే విచిత్రముకాగ, ఫలములు

కాయడములో కూడ సాధారణ చెట్టుకంటే మరీ విచిత్రముగ ఉండును. సాధారణముగ మామిడి చెట్టుకు మామిడి కాయలు కాయడము సహజము. అలాగే ఏ జాతి చెట్టుకు ఆ జాతి కాయలు కాయడము అందరికి తెలిసిన విషయమే. కాని అశ్వర్థవృక్షమనబడు దానికి ఒక విధమైన కాయలు కాయవు. ఈ చెట్టుకు అనేక విధములగు ఫలములు కాయుచున్నవి. ఈ అశ్వర్థవృక్షము ఆకారములోనేకాక కాయలలో విచిత్రముగ ఉండగ, కాయలలోనేకాక ఆకులలో కూడ విచిత్రముగనే ఉన్నదని చెప్పవచ్చును. అదేమిటంటే దీని ఆకులు వేదములకు ప్రతిరూపములు. వేదములే ఆకులుగ ఉన్న ఈ చెట్టును తెలిసినవాడు నిజముగ వేదములు తెలిసినవాడని చెప్పవచ్చును. ఇంకనూ క్రింది శ్లోకమున ఏమనుచున్నాడనగా!



**అశ్వర్థ వృక్షము**

14) శ్లో॥ 2: అధశ్చోర్ధ్వం ప్రసృతాస్తస్య శాఖా గుణప్రవృద్ధా విషయప్రవాలాః।
అధశ్చ మూలా న్యనుసన్త తాని కర్మానుబన్ధీని మనుష్యలోకే ॥
(ప్రకృతి, పురుషుడు)

**భావము :** ఆ అశ్వర్థమను వృక్షము యొక్క శాఖలు గుణ విషయములచే వృద్ధి అయినవై అనేక దిశలకు వ్యాపించి ఉన్నవి. మరియు దాని వేర్లు విస్తరించినవై మనుష్య లోకమున వ్యాపించినవి.

**వివరము :** ఈ వృక్షము అనేక విధములుగ ప్రత్యేకతలు కల్గివున్నదనుకొన్నాము కదా! వాటిలో ఇది పెరుగుటకు ఆహారమొక ప్రత్యేకతతో కలదు. సాధారణ వృక్షమునకు భూమిలో నత్రజని, భాస్వరము మొదలగు పదార్థములు ఆహారము కాగ! ఈ చెట్టుకు గుణ విషయములే ఆహారముగ ఉన్నవి. గుణముల వలన పెరిగిన కొమ్మలు, ఆకులు, ఆహార బలమునే ప్రదర్శించుకొనుచు కనిపిస్తున్నవి. ఇక్కడ చాలామందికి కొన్ని ప్రశ్నలు రావచ్చును. అవి ఏవనగా! గుణములే ఆహారముగ గల చెట్టెక్కడున్నది? దాని ఆకులను చెట్లను ఎక్కడా చూడలేదే! మీరు చూచారా? వేదములే ఆకులుగ, గుణవిషయములే ఆహారముగ ఉన్న చెట్టు భూమిమీద ఉన్నదా? ఉంటే ఎక్కడున్నది? ఈ విధ ప్రశ్నలకు జవాబులు చూస్తామా!

ఈ శ్లోకము చివరిలో మనుష్యలోకే అను పదము వాడబడినది, కావున ఈ చెట్టు మనుషులకు సంబంధించి ఉన్నదని తెలియుచున్నది. ఆ దృష్టితో చూచిన గుణముల విషయములు మనుషులలోనే ఉన్నవి. కావున ఈ చెట్టు తప్పనిసరిగ మనిషిలోనే అణిగివున్నదని చెప్పవచ్చును. మనిషిలో సూక్ష్మముగ అణిగివున్న అశ్వర్థవృక్షమను దానిని పరిశీలించి చూచిన మనిషి తలలోనే మూలము, క్రింది శరీరమంత చెట్టుగ విస్తరించి ఉన్నదని తెలియుచున్నది. ఒక మానవ శరీరమును ఒక వృక్షముగ చెప్పవచ్చును. తలలోని కర్మ, కాల, గుణచక్రములు మూలముకాగ, శరీరమంత విస్తరించిన నాడులు కొమ్మలుకాగ, జ్ఞానేంద్రియములు ఆకులుకాగ, కర్మేంద్రియములు కాయలుగ ఉన్నవని గ్రహించవలెను.

మానవుని శిరస్సులో బ్రహ్మ, కాల, కర్మ, గుణచక్రములను నాల్గుచక్రముల అమరిక బ్రహ్మనాడిని కేంద్రముగ చేసుకొని ఉన్నది. కాల కర్మ గుణచక్రములలో మానవుని ఆయుస్సు, జీవితకాలములో చేయవలసినపనులు, పనులకు సంబంధించిన గుణములు అన్నియు అణిగివున్నవి. మానవుని జీవితమునకు సంబంధించినవన్నియు అక్కడ (శిరస్సులో) అమరియుండుట వలన ఊర్ధ్వమూలము అన్నారు. జీవితమునకు మూలమైనదంత శరీరము పై భాగమున శిరస్సులో ఉండుటవలన పైన మూలమనుట వాస్తవమే. పైన ఉన్నదేదో దాని కారణముననే క్రింద శరీరమంతయు కదలి పని చేయుచున్నది. ఒక పని ఎపుడు జరుగవలెననుటకు కాలచక్రములోని కాలము, ఎట్లు జరుగవలెనను విధానమును కర్మచక్రములోని కర్మయు, ఏ గుణముచేత జరుగవలెననుటను గుణచక్రములోని గుణములు సూచిస్తున్నవి. మూడుచక్రములను అనుసరించి శరీరావయవముల ద్వార జరిగెడు పనులచే క్రొత్త కర్మ పుట్టుచున్నది. కావున పనులు చేయు కర్మేంద్రియములకు కర్మమను ఫలములు కాయుచున్నవన్నారు. పైనగల గుణముల ప్రేరణకు జ్ఞానేంద్రియములు కారణమగుట వలన వాటిని ఆకులుగ వర్ణించి, వాటినే గుణములకు మారు పేరైన వేదములుగ చెప్పారు. కాల కర్మములు ప్రసారమగు నాడులను కొమ్మలుగ వర్ణించి చెప్పారు. ఈ విధముగ పైన అన్నిటికి కారణమైన కర్మ గుణములు ఉండగ క్రిందవాటిని ప్రేరేపించు జ్ఞానేంద్రియములు, కర్మలను సంపాదించు మరియు ఆచరించు కర్మేంద్రియములు కలవు.

ఈ విధమైన శరీరము అశ్వర్థ వృక్షమని చెప్పబడివున్నది. ప్రతి శరీరము ఒక వృక్షములాంటిదని చెప్పవచ్చును. దీని ప్రకారము జీవుడు ధరించిన శరీరములన్నియు వృక్షములే. జీవుడైన నేను, నీవు ధరించిన శరీరములు కూడ అశ్వర్థవృక్షములేనని తెలియవలెను.

14) శ్లో॥ 3: న రూప మస్యేహ తథోపలభ్యతే నాన్తో న చాది ర్నచ సమ్ప్రతిష్ఠా ।
అశ్వత్థ మేనం సువిరూఢమూల మసంగ శస్త్రేణ దృఢేన ఛిత్వా ॥
(ప్రకృతి, పురుషుడు)

**భావము :** అశ్వర్థవృక్షము యొక్క రూపముగాని, దాని మొదలుగాని, చివరగాని ఉన్న స్థితియుగాని తెలియబడడములేదు. దృఢమైన మూలముగల ఈ వృక్షమును అసంగశస్త్రముచే నరుకవలెను.

**వివరము :** ఎంతో జ్ఞానదృష్టి ఉంటే కాని అశ్వర్థవృక్షము యొక్క నిజస్వరూపము అర్థముకాదు. అందువలన శరీరమందు అమరియున్న దీనిరూపము జ్ఞానదృష్టిలేని ఎవరికి అర్థముకాదు. కొంత జ్ఞానమున్నవారు కూడ దీనిని పోల్చుకోలేరు. ఒక జీవుడు శరీరము ధరించడము ఎప్పుడు మొదలు పెట్టాడో తెలియదు. జీవుడు పుట్టినప్పుడు శరీరవృక్షము కూడ పుట్టియున్నది. కావున జీవుడు అనాది అయినట్లు శరీరవృక్షము కూడ అనాదియైనదేనని చెప్పవచ్చును. శరీరాంతర్గతములో సూక్ష్మముగ ఇమిడివున్న అశ్వర్థవృక్షము శరీరము నశించినను తాను నశించునది కాదు. కాల, కర్మ, గుణచక్రములతో పాటు అమరియున్న ఈ వృక్షము మరణములో శరీరమును విడచి మరో క్రొత్త శరీరమును ఆశ్రయించుచున్నది. ఈ వృక్షము యొక్క గుణచక్రమను వేర్లలో జీవుడు బంధించబడి ఉన్నాడు. ఒక శరీరము జీవుడు వదలినాడంటే వృక్షముతో సహా కదలిపోయిందని అర్థము చేసుకోవాలి. ఈ విధముగ అనాది నుండి శరీరములు మారుచు కర్మ అను వేర్లు దృఢముగ వ్యాపించి ఉండుట వలన ఇది దృఢమూలమైనదని శ్లోకములో చెప్పబడివున్నది. ఆది తెలియని అనాదియైన ఈ వృక్షము యొక్క అంత్యము కూడ ఎవరికి తెలియదు. పుట్టుక అంత్యము తెలియబడని ఇది ప్రస్తుతము శరీములో ఎట్లున్నది కూడ తెలియకున్నది. ఇట్టి వృక్షము యొక్క ఆదిని, ప్రస్తుతస్థితిని, తెలుసుకొని దానిని అంత్యము కూడ చేయవచ్చును. జ్ఞానదృష్టిచేత అదెట్లున్నది తెలిసినవాడు దానిని నాశనము చేసి అంత్యము కూడ చూడగలడు. దానిని తెలుసుకొన్నవాడు సర్వవేదములు తెలిసినవాడని మొదటి శ్లోకములో చెప్పినట్లు తెలిసినవాడై దానికి నీరు, ఆహారమైన విషయములను,

గుణములను లేకుండ చేసిన ఎడల, దానంతటది ఎండిపోయి నశించిపోవును. గుణములతో సంగమించనివాడు చెట్టును నాశనము చేయగలడు.

14) శ్లో॥ 4: తతః పదం త త్పరిమార్గితవ్యం యస్మిన్ గతా న నివర్తన్తి భూయః ।
త మేవ చాఽద్యం పురుషం ప్రపద్యేయతఃప్రవృత్తిః ప్రసృతాపురాణీ ॥
(పరమాత్మ)

**భావము :** ఏ పదమును పొందిన తరువాత తిరిగి జన్మించరో దానిని తెలియవలెను. ఈ ప్రకృతి జీవరాసులన్ని ఎవరి వలన పుట్టి వ్యాపించియున్నవో అట్టి పురాణ పురుషుని శరణువేడవలెను.

**వివరము :** శరీరమందున్న అశ్వర్థవృక్షమును నశింపజేసిన తరువాత అందులోగల జీవాత్మ ఎక్కడికి పోవునో తెలుసుకోవలెను. జీవాత్మవృక్షమును వదలిన తరువాత తిరిగి పుట్టని పరమాత్మ స్థానమునలంకరించి పరమాత్మగ మారిపోవును. తిరిగి జన్మ పొందని ఆ స్థానమును పొందవలెనంటే ఈ ప్రపంచమునకు ఆది, పురాణ పురుషుడైన పరమాత్మను శరణువేడడము వలననే సాధ్యమగును. ఏదీకాని పరమాత్మను నేరుగ ఎవరు ఆరాధించలేరు. కావున మొదట జీవాత్మకు, పరమాత్మకు మధ్యవర్తి అయిన ఆత్మను పూజించవలసిందే.

(14) శ్లో ॥ 5 : నిర్మానమోహా జితసంగదోషా అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః ।
ద్వన్ద్వైర్విముక్తాస్సుఖదుఃఖసంజ్ఞై ర్గచ్ఛన్త్యమూఢాః పద మవ్యయం తత్ ॥
(పరమాత్మ)

**భావము :** మాన, మోహములను వీడినవారు, ప్రపంచ విషయములతో సంగమించుట వలన కల్గు కర్మను లేకుండ చేసుకొన్న వారు, నిత్యము ఆత్మ చింతన చేయువారు, ఆశలను లేకుండ చేసినవారు, సుఖదుఃఖములకు కారణమగు పాప పుణ్యములనుండి బయటపడినవారు అయిన జ్ఞానులు, నాశనములేని పరమ పదమును పొందుచున్నారు.

(14) శ్లో॥ 6 : న త ద్భాసయతే సూర్యో న శశాంకో న పావకః ।
యద్గత్వా న నివర్తన్తే తద్ధామ పరమం మమ ॥
( పరమాత్మ )

**భావము :** దానిని సూర్యుడు కాని, చంద్రుడుకాని, అగ్నికాని ప్రకాశింప చేయలేరు. దేనిని పొందిన తిరిగి జన్మించరో అదే నా పరంధామము.

**వివరము :** శరీరములోని అశ్వర్థవృక్షమును నాశనము చేసినవాడు మోక్షమును పొంది పరమాత్మయందైక్యమై పోవుచున్నాడు. అట్టి పరమాత్మ స్వయంప్రకాశమైనది. దానిని సూర్యుడు కాని, అగ్నికాని, చంద్రుడుకాని ప్రకాశింప చేయజాలరు. ఎందుకనగ చీకటిగనున్న దానిని వెలుతురు చేయుట సూర్యచంద్రాదులకు సాధ్యమగును. వాటికంటే వెలుతురెక్కువైన పరమాత్మను ఏదీ ప్రకాశింప చేయలేదు. దేనిని పొందిన వారు తిరిగి వర్తించుటకు పుట్టరో అదియే శ్రేష్ఠమైన పరమపదమని తెలియవలెను.

(14) శ్లో ॥ 7 : మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః ।
మనష్షష్ఠా ణీన్ద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి ॥
( పరమాత్మ )

**భావము :** బ్రతికివున్న జీవరాసులలో జీవాత్మ నా అంశమై, ప్రకృతి సంబంధమైన ఇంద్రియములలో ఆరవదైన మనస్సును ఆకర్షించుచున్నది.

**వివరము :** కార్యరూపమైన ప్రపంచములో పరమాత్మ మూడు భాగములుగ విభజింపబడివున్నదని ముందే తెలుసుకొన్నాము. అందులో ఒకటైన జీవాత్మ పరమాత్మతోపాటు అనాదియనియే చెప్పవచ్చును. అనాదియైన జీవాత్మ శరీరములో ఉంటూ అందులో బయటి విషయములను తెలియజేయు జ్ఞానేంద్రియముల తరువాత ఉన్న ఆరవదైన మనస్సును ఆకర్షించుచున్నది. భూమ్యాకర్షణ వలన వస్తువులు క్రిందపడునట్లు గుణచక్రములో ఉన్న జీవాత్మ ఆకర్షణ వలన మనస్సు తనకు తెలిసిన విషయములను లోపలివైపుకు జారవిడిచినట్లు పంపుచున్నది. అట్లు పంపుట

వలన బయటి విషయములతో జీవాత్మ మరియు దాని బుద్ధి సంబంధపడుచున్నవి. జీవాత్మకున్న ఆకర్షణ చేతనే మనస్సు ద్వార ప్రపంచ సంబంధములు తగులు కొనుచున్నవి. జీవాత్మకున్న ఆకర్షణను లేకుండ చేయడమే బ్రహ్మయోగము.

(14) శ్లో॥8 : శరీరం య దవాప్నోతి యచ్చా ప్యుత్క్రామ తీశ్వరః ।
గృహీత్వైతాని సంయాతి వాయుర్గన్ధాని వాశయాత్ ॥
(ఆత్మ, ప్రకృతి)

**భావము :** ఆత్మ శరీరమును వదలి ఎపుడు పోవుచున్నదో, పోయి ఎక్కడ ప్రవేశిస్తున్నదో, అక్కడకి వాయువు వాసనను తీసుకుపోయినట్లు ఆత్మ గుణములను కూడ తీసుకొని పోవుచున్నది.

**వివరము :** ఇక్కడ చాలామంది జీవుడు శరీరమును వదలి పోవునపుడని పొరపడుచున్నారు. ఈ శ్లోకములో ఈశ్వరుడని స్పష్టముగ చెప్పియుండగ జీవుడని చెప్పుకోవడము తప్పుగ తెలియుచున్నది. ఆత్మల వివరము తెలియక పోతే చాలా చోట్ల ఇటువంటి పొరపాట్లు జరుగుచుండును. ఇక్కడ చెప్పబడినది శరీరములో విభజింపబడి ఉన్న జీవాత్మ, ఆత్మ, పరమాత్మలలో పరమాత్మ శరీరమును వదిలి పోవునది కాదు. ఎందుకనగ పరమాత్మ మరొకచోట లేదనుటయే లేదు. కనుక అక్కడ లేకపోతే కదా పోవలసి వచ్చునది. అంతటా ఉన్న పరమాత్మపోదు. కనుక శరీరమును వదలిపోవునది రెండే భూతములు. అవి జీవాత్మ, ఆత్మ. ఈ రెండిటిలో శరీరమునకంతయు అధిపతి (ఈశ్వరుడు)యైనది, శరీరమంతయు వ్యాపించి కదలించు శక్తియైనది ఆత్మయే. మరణములో శరీరమును వదలి పోవునది పైకి తెలియబడునట్లున్నది ఆత్మయే. ఎందుకనగ శరీరమంతయు చైతన్యమై కదలించు కదలికలు ఆత్మవే. ఆ కదలికలు మరణముతో నిలిచిపోవుచున్నవి. కనుక శరీరమును ఆత్మ వదలి పోయినదని చెప్పవచ్చును. అంతేకాక సత్తైన ఆత్మ మరణములో పోవుచున్నది కావున సత్తు పోయినది (సచ్చిపోయినది) అనుట సాధారణముగ వినుచున్నాము. శరీరమును వదలి ఆత్మ పోవుచున్నప్పుడు ఆత్మతోపాటు ఉన్న

జీవాత్మ కూడ పోవలసి వస్తున్నది. ఈ విషయము వెనుక చెప్పబడివున్న సాంఖ్యయోగమను అధ్యాయములో 23,24 శ్లోకములలో వివరము చెప్పబడివున్నది.

ఆత్మ జీవాత్మతోపాటు అక్కడే ఉన్న కామాది గుణములను కూడ తీసుకొని పోవుచున్నది. శరీరమును వదలి పోవుటకు, ఎక్కడో చేరుటకు కారణమైన కర్మ కూడ వాటితో పోవుచున్నది. జ్ఞానదృష్ఠితో చూచిన ఎడల శిరోభాగములో ఉన్న బ్రహ్మ, కాల, కర్మ, గుణచక్రములు నాలుగు వాటితో అనుసంధానమైన అశ్వర్థ వృక్షము మొత్తము శరీరము నుండి బయల్పడి, స్థూలకన్నులకు కనిపించకుండ ప్రయాణించి రెండు సెకండ్లలో మరొక క్రొత్త శిశుశరీరమును ధరించుచున్నది. పుష్పములలోని సువాసన గాలిలో కలిసి ప్రయాణిస్తున్నపుడు కంటికెట్లు కనిపించదో,అట్లే ఆత్మతో పాటు ప్రయాణిస్తున్న అశ్వర్థవృక్షము కనిపించదని గ్రహించవలెను.

*(14)శ్లో ॥ 9 : శ్రోత్రం చక్షు స్స్పర్శనం చ రసనం ఘ్రాణ మేవ చ ।*
*అధిష్ఠాయ మన శ్చాయం విషయా నుపసేవతే ॥*

*(జీవాత్మ)*

**భావము :** చెవులు, కన్నులు, చర్మము, నాలుక, ముక్కు అను జ్ఞానేంద్రియములను మరియు మనస్సును అధిష్ఠించి వాటి విషయములను అనుభవిస్తు జీవాత్మ శరీరమందున్నాడు.

**వివరము :** శరీరములోపల ఎక్కడో గుణచక్రములోనున్న మూడుభాగములలో ఏదో ఒక భాగములో నివాసము చేయుచున్న జీవుడు నిజముగ అంధుడు. అప్పుడే పుట్టిన కన్నులు తెరువని కుక్క పిల్ల తన వద్దకు వచ్చిన వాటిని మాత్రము వాసనచే తెలుసుకొనుచుండునే కాని నిజముగ చూడలేదు. అట్లే మనస్సు వలన తన వద్దకు వచ్చిన విషయములను మాత్రము బుద్ధిచే జీవుడు తెలుసుకొనుచున్నాడు. మనస్సు శరీరమునకు బాహ్యముగనున్న కన్ను, చెవి, ముక్కు, చర్మము, నాలుక అను ప్రత్యేక శక్తులు గల ఐదు ఇంద్రియములనుండి చూపు, వినికిడి, వాసన, స్పర్శ, రుచి అను

ఐదు అనుభూతులను గ్రహించి లోపలనున్న బుద్ధికి జీవునికి తెలియజేయును. బుద్ధి అందించు వివరముతో సహా జీవుడు వచ్చిన అనుభూతులను స్వయముగ అనుభవించుచుండును. అనుభూతులను జీవుడు అనుభవించినప్పటికి వాటి వివరము బుద్ధి ద్వారానే బయటికి చెప్పబడును. జీవుడొక గ్రుడ్డివాడు, మూగవాడు, చెవిటి వానితో సమానమని చెప్పవచ్చును. సాధారణముగ ప్రపంచములో గ్రుడ్డి, చెవిటి, మూగవాడు చూడలేక, వినలేక, చెప్పలేక పోయినప్పటికి చేతికి దెబ్బ తగిలిన బాధను అనుభవించును. కాని బాధను గురించి బయటికి చెప్పలేడు. అట్లే జీవుడు స్వయముగ వినలేక, చూడలేక, చెప్పలేక పోయినప్పటికి బాధలు అనుభవించుచుండును. అట్లే సుఖములు అనుభవించుచుండును. అనుభవించిన వాటి వివరము, ప్రక్కనే జీవునకు దగ్గరగ ఉన్న బుద్ధి వివరించి చెప్పుచుండును. బుద్ధి వివరించి తెలియజేస్తే కాని అనుభవించిన అనుభవముల వివరము జీవునికి తెలియదు. బుద్ధి లేకపోతే జీవాత్మ స్తబ్దునిగ అనుభవించవలసిందే తప్ప అనుభవించిన దానిని గురించి కూడ చెప్పలేడు.

ఒక్కొక్క శరీరములో ఒక్కొక్క జీవాత్మ దానికి దగ్గరగ బుద్ధిని ఏర్పాటు చేసి పెట్టబడివున్నది. ప్రతి శరీరములో ఉన్న జీవాత్మలు ఒకే పరమాత్మ అంశ అయినప్పటికి వాటి వాటి బుద్ధిని బట్టి వాటిలో అనేక తేడాలు కన్పిస్తున్నవి. అలా కన్పించినవి ఆ జీవాత్మల బుద్ధి భేదమే తప్ప మరివేరుకాదని తెలియాలి. ఉదాహరణకు ఒకే పదార్థమును నలుగురు వ్యక్తులకిచ్చి వాటిని రుచి చూచి వాటి రుచిని గురించి చెప్పమన్నామనుకొందాము. నలుగురు ఒకే విధముగ చెప్పలేరు. నలుగురు కొద్ది కొద్ది తేడాలతో నాల్గు విధములుగ చెప్పుచుందురు. బెల్లము నిచ్చి రుచి చెప్పమనిన ఒకడు కొద్దిగ పులుపు కలిసిందనో, మరియొకడు తీపు తక్కువుందనో, మూడవవాడు చాలా తియ్యగవున్నదనో, నాల్గవవాడు వీరికంటే విభిన్నముగనో చెప్పును. ఒకే బెల్లమును నల్గురు రుచి చూచి వాటి అనుభవమును ఆ నాల్గు జీవాత్మలు అనుభవించినప్పటికి, వారిలోని బుద్ధి వివరించుటలో కొద్ది తేడాలు కన్పిస్తున్నవి. దీనిని బట్టి ఒక్కొక్క జీవునికి ఒక్కొక్క రకమైన బుద్ధికలదని తెలియుచున్నది.

అందువలననే పూర్వపు పెద్దలు **'తలకొక్క బుద్ధి'** అను మాటను చెప్పారు. మనమింకా వివరముగా యోచించినట్లయితే మన అనువభములో ఒకనిని మందబుద్ధి అని అనడము, మరొకనిని పదునైన బుద్ధి అనడము జరుగుచున్నది కదా! అనేక రకములుగ అనేక శరీరములలో బుద్ధులున్నవని తెలియాలి. వారి వారి బుద్ధిని బట్టి ఆయా జీవాత్మలు వివరము తెలుసుకొంటున్నవని, నిజముగ జీవాత్మ కర్మబంధము చేత అనుభవములను అనుభవించువాడేనని, తనకు ఏ వివరము తెలియని శుద్ధాత్మయేనని తెలియాలి. గుణములలో చిక్కినందున, వాటివివరము బుద్ధి తెల్పుచుండుట వలన, బుద్ధి యొక్క రంగే జీవునకంటుకొనుచున్నది. శరీరములో జీవాత్మ ఏ ఆకారముతో ఉన్నాడో వానికి దగ్గర బుద్ధి ఎట్లు కలదో తెలుసుకోవలెనను ఆసక్తి కలవారికి విశదముగ అర్థమగునట్లు చెప్పడమేమనగా! జీవాత్మ ఏమికాని శూణ్యము. పరమాత్మ అంశ అయినందువలన అది ఏ పదార్థముకాక శూణ్యముగ శరీరములో ఉన్నదని తెలియాలి. అయినప్పటికి కర్మబంధముచే దానికి గుండ్రని ఆకారము ఏర్పడినది. ఏమి కాని శూణ్యమును ఒక గుండ్రని పొర ఆవహించి ఉండడము వలన బంతిలాంటి ఆకారములో శూణ్యము మిగిలిపోయినది. ఆవరణములోని ఆ శూణ్యమునే జీవాత్మ అంటున్నాము. చుట్టూవున్న పొరను బుద్ధి అంటున్నాము. బుద్ధి పొరను ఆనుకొని ఇంకను రెండు పొరలు కలవు. అవి చిత్తము, అహము. దీనిని బట్టి జీవాత్మ అనబడు ఖాళీస్థలమునకు మూడు పొరల ఆవరణమేర్పడినదని తెలియుము. అట్టి జీవాత్మ ఆకారమును క్రింది పటములో చూడవచ్చును.



(14) శ్లో॥10: ఉత్క్రామన్తం స్థితం వాపి భుంజానం వా గుణాన్వితమ్।
విమూఢా నానుపశ్యన్తి పశ్యన్తి జ్ఞానచక్షుషః ॥
(జీవాత్మ)

**భావము :** దేహము అంతమై దానిని వదలి పోవునపుడు, దేహములో ఉన్నపుడు, గుణముల అనుభవములను పొందుచున్నపుడు, ఆ జీవుడెలానున్నది జ్ఞానులు జ్ఞాననేత్రముచే చూడగలరు. అజ్ఞానులు చూడలేరు.

**వివరము :** జీవాత్మ శరీరము వదిలి పోవునపుడు జన్మలకు కారణమైన కాల, కర్మ, గుణ సముదాయముగల చక్రములతో సహా పోవుచున్న విషయమును, శరీరములో ఉన్న మూడు గుణభాగములలో ఏదో ఒక భాగములో అంధత్వములో జీవుడు నివశిస్తు, ఆ గుణ అనుభవములను అనుభవిస్తు, వాటి వివరమును బుద్ధి ద్వార తెలుసుకొనుచున్న విషయమును అజ్ఞానులు తెలియలేరు. జ్ఞాననేత్రమున్న వారు మాత్రము చూడగలరు. జ్ఞాననేత్రము ఎక్కడున్నది తెలియదు కదా! **మన శరీరములో ఉన్న గ్రంథి రాజమే జ్ఞాననేత్రముగ కూడ పనిచేయుచున్నది.** గ్రంథి రాజము యొక్క స్థానములో మనస్సు లగ్నము చేయుటకు అలవాటుపడినవానికి ఆత్మ విషయములన్నియు గోచరము కాగలవు. అట్లు తెలిసిన విషయములో ఆత్మను తప్ప జీవాత్మను గూర్చి మరియు మిగత ప్రకృతి జనిత భాగములైన బుద్ధి, చిత్తము, అహము, మనస్సును గూర్చి బయటికి కూడ చెప్పనగును. అందువలననే బుద్ధి, చిత్తము, అహము యొక్క ఆకారమును, జీవాత్మ యొక్క ఆకారమును బయటికి చెప్పగల్గుచున్నాము. గుణములను వాటి మధ్యలో ఉన్న జీవాత్మను కూడ చెప్పగల్గుచున్నాము.

(14) శ్లో॥ 11 : యతన్తో యోగినశ్చైనం పశ్యన్త్యాత్మన్యవస్థితమ్।
యతన్తోఽప్యకృతాత్మానో నైనం పశ్యన్త్యచేతసః ॥
(ఆత్మ)

**భావము :** ప్రయత్నము చేయు యోగులు దేహమందున్న ఆత్మను చూడగలరు. అచేతస్కులు, అకృతాత్ములు ఎంత ప్రయత్నించినను ఆత్మను తెలియలేరు.

**వివరము :** మూడు ఆత్మలు దేహములో కలవు. అందులో జీవాత్మ ప్రయత్నము చేసి ఆత్మను తెలుసుకోవాలి. ఒక విధానము ప్రకారము యోగపద్ధతిలో జీవాత్మ పరమాత్మను చేరాలంటే మార్గము మధ్యలో ఉన్నది ఆత్మయే, కనుక ఆత్మను తెలియనివారు పరమాత్మను తెలియలేరు. కనుక ఎంతో మంది బ్రహ్మయోగులు ప్రయత్నము చేసి తమ శరీరములో ఉన్న ఆత్మను తెలుసుకోగల్గుచున్నారు. మనస్సు స్వాధీనపడనివారు, బ్రహ్మయోగ సాధనలో కృతకృత్యులు కాని వారు, ఎంత ప్రయత్నించినను ఆత్మను తెలియలేరు.

*(14) శ్లో ॥ 12 : య దాదిత్యగతం తేజో జగ ద్భాసయతేఽఖిలమ్ ।*
*య చ్చ న్ద్రమసి య చ్చా గ్నౌ తత్తేజో విద్ధి మామకమ్ ॥*
*( పరమాత్మ)*

**భావము :** సమస్త జగత్తును ప్రకాశింపజేయు సూర్యునిలో ఉండు తేజస్సు, చంద్రునికున్న తేజస్సు, అగ్నికున్న తేజస్సు నా యొక్క తేజస్సేనని తెలియవలెను.

**వివరము :** సమస్తములోను మూలవస్తువై పరమాత్మ కలదు. ఏ దానిలోనైన ఎవరిలోనైన ఒక ప్రత్యేకత కల్గివున్నదంటే, ఆ ప్రత్యేకత పరమాత్మనుండి కల్గినదేనని తెలియవలెను. అలాగే సూర్యునికి ప్రత్యేకమైన ప్రకాశమును, చంద్రునికున్న ప్రత్యేకమైన వెన్నెలను, అగ్నికున్న ప్రత్యేకతైన కాల్చివేయు వేడియును పరమాత్మవేనని తెలియాలి. ఈ విషయము విభూతి యోగమను అధ్యాయములో ముందు చెప్పబడి ఉన్నప్పటికి సందర్భానుసారము చెప్పవలసి వచ్చినది.

*(14) శ్లో ॥13 : గా మావిశ్య చ భూతాని ధారయా మ్యహ మోజసా ।*
*పుష్ణామి చౌషధీ స్సర్వా స్సోమో భూత్వా రసాత్మకః ॥*
*( పరమాత్మ)*

**భావము :** భూమియందుండి నా బలముచేత సమస్త జీవరాసులను నేనే ధరించు చున్నాను. రసమయుడైన చంద్రునిగా ఉంటు సమస్త ఔషధులను పోషించుచున్నాను.

**వివరము :** అణువణువున వ్యాపించిన వాడు పరమాత్మ. ఆయన భూమియందు కూడ ఉన్నాడు. భూమియందుండి భూమినుండి సమస్త ఆహారపదార్థముల ఉత్పత్తికి కావలసిన బలమునిచ్చుచున్నాడు. ఆహారపదార్థములను భూమి నుండి తయారు చేసి సమస్త జీవులను పోషించుచున్నాడు. అంతేకాక ఆకాశమున చంద్రుడైవుండి, భూమి మీద మొక్కలుగ మరియు వృక్షములుగ ఉన్న ఔషధాలకు వెన్నెల ద్వార రసాయణములను చేకూర్చి, వాటిలో ఔషధశక్తి కల్గునట్లు చేయుచున్నాడు. భూమి మీద పెరుగుచున్న మొక్కలను వృక్షములను రెండు భాగములుగ విభజించి, ఒక భాగము సమస్త జీవరాసుల శరీరములను పోషించు పోషకపదార్థములైన ఆహారములుగ, రెండవ భాగమును సమస్త జీవరాసులకు కల్గు రోగముల నివృత్తికి కావలసిన రసాయణములు గల ఔషధములుగ, పరమాత్మయే తన శక్తి ద్వార తయారుచేసి పెట్టుచున్నాడు.

(14)శ్లో॥14: అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహ మాశ్రితః ।
ప్రాణాపానసమాయుక్తః పచా మ్యన్నం చతుర్విధమ్ ॥
(ఆత్మ)

**భావము :** నేను సకల జీవుల శరీరములందు వైశ్వానరుడను అగ్నిగ ఉండి, ప్రాణ అపాన వాయువులచేత మండుచు, నాల్గు విధములగు ఆహారములను పచనము చేయుచున్నాను.

**వివరము :** సర్వశరీరములందు పరమాత్మ ఆత్మ ద్వార చైతన్యమునిచ్చి వాటి కదలికకు మూలమైవున్నాడు. ఆత్మ, జీవాత్మలు, పరమాత్మ అంశముగ ఉంటు వాటి పని అవి చేస్తున్నవి. ఆత్మ తన పనిలో భాగమైన శరీరములను కదిలించడమే కాక, తనశక్తిని గ్రంథుల ద్వార ప్రసరింపజేసి వాటిద్వార అతీతమైన శక్తిని విడుదల చేయుచున్నది. ఆత్మ చైతన్యము శరీరమంత ఒక విధముగ పనిచేయుచు, గ్రంథులనుండి దూరి మరోశక్తిగ బయటికి వచ్చి మరొక విధముగ పనిచేయుచున్నది. లాలాజలగ్రంథి

నుండి వచ్చిన లాలాజలమను మహిమగల రసము, క్లోమరసగ్రంథి నుండి బయటికి వచ్చిన క్లోమరసము, అలాగే పైత్యరసగ్రంథి నుండి వచ్చిన పైత్యరసములు మూడు శక్తియుక్తమైనవి. ఈ మూడు రసములు ఒక చోట జీర్ణాశయములో కలిసినపుడు ఒక విధమైన అగ్ని ఏర్పడుచున్నది. దాని పేరే **'వైశ్వానర'** అంటున్నారు. ఈ మూడు రసముల కలయికశక్తి తీక్షణమైనది. అందువలన జీర్ణాశయములోగల నాల్గురకములైన ఆహారములు జీర్ణమగుచున్నవి. నీరు తగిలిన వెంటనే గట్టి సున్నపురాయి మెత్తగ విడిపోయినట్లు, రసముల ప్రభావమునకు గట్టి ఆహారము కూడ మెత్తగ మారిపోవుచున్నది.

మనము భుజించు ఆహారములు నాల్గు భాగములుగ ఉన్నవి. 1) పిండి పదార్థములు (కార్బోహైడ్రేట్స్) 2) మాంస పదార్థములు (ప్రోటీన్స్) 3) ఖనిజ లవణములు (మినరల్స్) 4) నూనె, క్రొవ్వు (లిపిడ్స్,ఆయిల్స్) పదార్థములు. మనము నిత్యము భుజించు వాటిలో ఉన్న ఈ నాల్గు రకముల పదార్థములను ఆత్మశక్తిచే తయారైన రసములే జీర్ణము చేయుచున్నవి.

<u>**గమనిక**</u> : నాల్గు విధ ఆహారముల గూర్చి చాలామంది భక్ష్య, భోజ్య, లేహ్య, చోష్య అని వ్రాసినారు. దంతములతో కొరికి తినునవి, దంతములతో నమలకయే తినునవి, నాలుకతో చప్పరించుచు తినునవి, నాలుకతో చప్పరించకయే త్రాగునవి అను నాల్గురకములుగ తినుపద్ధతిని చెప్పియున్నారు. తినుపద్ధతిని అనుసరించి విభజించిన అది మానవులకొక్కరికి సరిపోతుంది. దంతములులేని బల్లి, కప్పలకు సరిపోదు. గీతలో చెప్పిన విషయములన్నీ సర్వజీవులకు వర్తించునవిగ ఉండవలెను. మనుషులకు సరిపోయి జంతువులకు సరిపోని బోధ జగత్తుకంతటికి వర్తించదు. అలా చెప్పువాడు జగద్గురువు కాదు. జగత్తులోని సమస్తజీవులకంతటికి వర్తించు బోధ చెప్పువాడే జగద్గురువు. శిష్యుల సంఖ్యను బట్టి జగద్గురువు కాదు, బోధలను బట్టి జగద్గురువుండును. **శ్రీకృష్ణుడు చెప్పిన గీతా శాస్త్రమంతయు సర్వజీవులకు వర్తించునది కావున ఆయనకు శిష్యులు లేకున్నను జగద్గురువైనాడు.** ఆయన బోధను ఎవరూ సంకుచిత బోధ చేయకూడదు. మేము చెప్పిన నాలుగు రకముల ఆహారపదార్థములు

సర్వజీవుల శరీరములకు అవసరమైనవి. వాటి ఆహారములో ఉండునవి. అలా చెప్పుకోకపోతే మాంసము తిను జంతువులు దంతములతో తిను భక్ష్యములనే తినగలవుకాని వాటికి లేహ్యములు, భోజ్యము, చోష్యములుండవు.

14) శ్లో॥15: సర్వస్య చాహం హృది సన్నివిష్టో మత్తః స్మృతిర్జ్ఞానమపోహనంచ।
వేదైశ్చ సర్వైరహ మేవ వేద్యో వేదాన్తకృ ద్వేదవి దేవ చాహమ్ ॥
(ఆత్మ)

**భావము :** సర్వజీవరాసుల హృదయ స్థానములో నేనున్నాను. స్మృతి, జ్ఞానము, ఊహ దాని మరుపు నా వలననే కల్గుచున్నవి. వేదవేదాంతములు నన్నే తెల్పుచున్నవి. వేదముల తెలిసినవాడను నేనే.

**వివరము :** హృది అనగ మరియు హృదయము అనగ రెండు ఒక్కటే. హృదయము అనగ గుండె అని చాలామంది భావములో కలదు. ఆ భావము చాలా తప్పు. హృదయము అనగ గుండెకాదని చాలామార్లు చెప్పాము. ఆధ్యాత్మిక విద్యలో హృదయము అనగ బ్రహ్మనాడి అని అర్థము. శరీరమధ్యలోనున్న బ్రహ్మనాడిలో ఆత్మ నివాసము చేయుచున్నది. అన్ని జీవరాసుల శరీరములలోని బ్రహ్మనాడిలోనే ఆత్మ నివశిస్తున్నది. అందువలన పై శ్లోకమున "సర్వస్య చాహం హృది సన్ని విష్టో" అని చెప్పబడినది. శరీరములో జీవాత్మ ఆత్మలు వేరువేరుగనున్నవి. శరీరములోని జీవాత్మ ఏ పని చేయదు. అయినప్పటికి అన్ని తానే చేయుచున్నట్లు భ్రాంతి చెందుచున్నది. వాస్తవానికి అన్ని పనులు ఆత్మే చేయుచున్నది. శరీరములో స్మృతి, జ్ఞానము, ఊహ మరియు మరుపు ఆత్మవలననే కల్గుచున్నవి. శరీరములో ఆత్మ ఎన్నో కార్యములను చేయుచున్నను ఇక్కడ ప్రత్యేకించి మూడు కార్యములను చేయుచున్నట్లు చెప్పబడినది. ఒకటి స్మృతి, రెండవది జ్ఞానము, మూడవది ఊహ. ఈ మూడింటిని ఆత్మ బుద్ధికి అందిస్తున్నది. ఊహ అనగ ఆలోచన అనియు, జ్ఞానము అనగ ప్రపంచ జ్ఞానము అనియు, స్మృతి అనగ జ్ఞాపకము అనియు ఈ మూడు మనస్సు వలన కల్గుచున్నవనియు అందరు అనుకోవడము జరుగుచున్నది.

ఈ మూడు వాస్తవముగ మనస్సుకు కల్గునవి కావు. స్మృతి, జ్ఞానము, ఊహను మొదట ఆత్మ బుద్ధికి అందించుచున్నది. ఆత్మ ద్వార బుద్ధికి కల్గు స్మృతి ప్రత్యేకమైనది. మనిషి నిద్రావస్థలో ఉండి శరీరములో మనస్సు బుద్ధి స్తబ్దతగ ఉన్నపుడు ఆత్మనుండి బుద్ధిద్వార వచ్చు మెలుకువను స్మృతి అంటున్నాము. ప్రతి దినము నిద్రనుండి వచ్చు మెలుకువను స్మృతి అంటున్నాము. అలాగే శరీరములో పరమాత్మ జ్ఞానమును అందించునది ఆత్మ. ప్రపంచ జ్ఞానమును ఐదు ఇంద్రియములనుండి అందించునది మనస్సు. పరమాత్మ వివరము ఆత్మకే తెలియును కావున పరమాత్మ జ్ఞానమును తెల్పునది ఆత్మ అని తెలియవలెను.

ఊహ ఆత్మ వలన కల్గునది. అలాగే ఆలోచన మనస్సుకు కల్గుచున్నది. ఊహ హృదయమునుండి క్రొత్తగ పుట్టుచున్నది. అలా పుట్టిన ఊహ తిరిగి అణిగి పోవుచున్నది. ఎక్కడలేని వివరము మొదట ఆత్మనుండి పుట్టుచున్నది. ఉదాహరణకు మొదట ఎవరికి తెలియని టెలివిజన్ అను యంత్రవివరము ఆత్మ మొదట ఒక మనిషి యొక్క బుద్ధికి అందించగ, దానిని ఆ మనిషి కనిపెట్టాడని ప్రచారము జరిగినది. రేడియోను మార్కోని అను వ్యక్తి కనుగొన్నాడనుచున్నాము. వాస్తవానికి మార్కోని అను వ్యక్తి శరీరములోని ఆత్మ అతని బుద్ధికి ఊహ ద్వార అందించిన విషయమే రేడియో. అతని ఆత్మ అందించిన విషయము అతనికి తెలియదు. అలాగే ప్రక్క మనుషులకు తెలియదు. అందువలన నేనే రేడియోను కనుగొన్నానని అతను అనుకోగా, మార్కోని కనుగొన్నాడని ప్రజలు అనుకొంటున్నారు. ఇలాగే నేడు భూమి మీద ప్రచారములోనికి వచ్చిన విమానములు, రైళ్లు, కంప్యూటర్లు మొదలగు అనేక పరికరములను ఆత్మ అందించినవే, అయిన ఆ వివరము మనకు తెలియకుండపోయినది. కావున పై శ్లోకములో నా వలననే ఊహ కల్గుచున్నదని చెప్పబడినది. మానవుని హృదిలో మెదలిన ఊహ తిరిగి మరచి పోవడము కూడ జరుగుచున్నది. కొంతమంది మాత్రము వచ్చిన ఊహను మనస్సులో లగ్నము చేయుచున్నారు. అలా మనస్సులో లగ్నము చేయబడిన ఊహ తిరిగి మనోజ్ఞప్తికి రాగలిగితే అపుడది ఆలోచన అవుతుంది. మనిషికి వచ్చు ఊహలు అన్నియు

ఆలోచనలు కావడములేదు. ఎందుకనగ వచ్చిన ఊహ బుద్ధిలోనే అనిగి పోవుచున్నది. మనస్సులో అనిగిపోతే ఎప్పుడైన ఆలోచనరూపములో రాగలదు. అలాకాకపోతే శాశ్వితముగ మరిచిపోవడము కూడ జరుగుచున్నది. అందువలన ఊహ మరపులు కూడ నావలననే కలుగుచున్నవని పై శ్లోకమున చెప్పబడినది..

(14) శ్లో॥ 16 : ద్వా విమౌ పురుషౌ లోకే క్షర శ్చాక్షర ఏవచ ।
క్షర స్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే ॥
(ఆత్మ, జీవాత్మ)

**భావము :** లోకములో రెండు రకముల పురుషులు కలరు. వారు క్షరుడనియు, అక్షరుడనియు చెప్పబడుచున్నారు. క్షరుడు సర్వభూతములందు కలడు. క్షరునితో కూటస్థునిగనున్న వాడు అక్షరుడని చెప్పుచున్నారు.

**వివరము :** ప్రపంచము తయారైన తర్వాత మొట్టమొదట పుట్టినది ఆత్మ. ఆత్మ పుట్టిన తర్వాత మార్పుచెందు ప్రకృతి తయారైనది. ఆత్మ పురుషతత్త్వముకాగ, ప్రకృతి స్త్రీ తత్త్వముగ ఉన్నది. ఆత్మను పురుషతత్త్వముగ, ప్రకృతిని స్త్రీ తత్త్వముగ ఎందుకు చెప్పాలి అను ప్రశ్నకూడ రాగలదు. దానికి సమాధానము మొదట ఏదైన పుట్టుటకు బీజము అవసరము. బీజముంటే దానికి సంబంధించినది పుట్టును. మొదట ప్రపంచము పుట్టుటకు బీజము ఒకటి కలదు. అదియే ఏదికానిది, ఏ పేరు లేనిది. దానినుండి పుట్టినది ప్రకృతి. ఉత్పత్తి చేసిన బీజము పురుషునిగ, ఉత్పత్తి చేయబడిన ప్రకృతి స్త్రీగ లెక్కించబడి ఉన్నది. ఈ విషయమునే వెనుక గుణత్రయవిభాగ యోగములో 3,4 శ్లోకములలో స్పష్టముగా తెలుపబడినది. భరించువాడు భర్త, భరించబడునది భార్య అన్నట్లు ఉత్పత్తి చేయునది పురుషుడు, ఉత్పత్తి చేయబడినది స్త్రీగ లెక్కించి చెప్పుచున్నాము. దీనినిబట్టి ఆత్మ ఏ విధముగనున్నా పురుషునిగ, ప్రకృతి ఏ రూపములోనున్నా స్త్రీగ చెప్పుకోవలసి వచ్చినది.

పురుషుని నుండి పుట్టినది ప్రకృతి. విశ్వమున్నంత వరకు పురుషతత్త్వము గల ఆత్మ, స్త్రీతత్త్వముగల ప్రకృతి ఉంటుంది. మొట్టమొదట ప్రపంచము తయారైన తర్వాత పురుషుడని చెప్పుకొను దానినుండి ఆత్మ బహిర్గతమైనదని విభూతియోగములో ఆరవ శ్లోకమునందే తెలుసుకొన్నాము. బహిర్గతమైన ఆత్మ ఏడు భాగములుగ విభజింపబడినదని కూడ తెలుసుకొన్నాము. ఏడు భాగములలో పై భాగమునందు గల ఆత్మ భాగము కొంత చర ప్రకృతి భాగములచేత వేరు చేయబడినది. ఆ విధముగ వేరు చేయబడిన కొంత ఆత్మను ప్రత్యేకమైన పేరుతో పిలుస్తున్నాము. దాని పేరే ***"జీవాత్మ"***. ***ఏదికాని దానినుండి దాని అంశతో విడివడిన దానిపేరు ఆత్మకాగ, ఆత్మనుండి వీడిపోయి ప్రత్యేకమైన భాగముగనున్నది జీవాత్మయని జ్ఞప్తికి పెట్టుకోవలెను.*** ఇక్కడ ఇంకా కొంత వివరముగ తెలుసుకొంటే, మొదట తయారైన ఆత్మ ఏడు భాగములైనదని చెప్పుకొన్నాము. ఆ ఏడు భాగములు ఎట్లున్నవనగా! మొదట ఆత్మ రెండు సమాన భాగములుగ విభజింపబడినది. ఆ రెండులో ఒకటి అలాగా నిలిచిపోగా రెండవది మరియు రెండు సమాన భాగములుగ చీలిపోయినది. ఈ విధముగ చీలిపోయినవి ఒకటి అలాగే ఉండగ రెండవది సమానముగ చీలిపోవుచు చివరకు ఏడు భాగములుగ తయారైనది. ఉదాహరణకు తర్వాత పేజీలోని చిత్రము చూడుము.

ఈ విధముగ ఆత్మ ఏడు భాగములుగ విభజింపబడినది. ఉదాహరణకు సంఖ్యలలో గుర్తించడము జరిగినది. ఆత్మ రెండు వేల యూనిట్ల శక్తిగ ఉన్నట్లు తెలియుచున్నది. అందులో వెయ్యి యూనిట్లు మొదటి భాగముండగ, మిగత ఆరు భాగములు వెయ్యి యూనిట్లుగ విభజింపబడినదని గ్రహించవచ్చును. ప్రథమములోనున్న మొదటి భాగము వెయ్యియూనిట్ల శక్తి కల్గియున్నదనుటకు గుర్తింపుగ ఆ మొదటి భాగమును సహస్త్రారము అని పేరు పెట్టుకొన్నాము. ఇది తెలిసి పెట్టిన పేరు కాకున్నను కాకతాళీయముగ సహస్త్రారమనియే పేరు వచ్చినది. ఇదంత ఏ శాస్త్రప్రమాణముతో చెప్పుచున్నారని అడుగువారుండవచ్చును. **దానికి మా జవాబు ఏమనగా! ఇదంతయు బ్రహ్మవిద్యా శాస్త్రప్రమాణముతో చెప్పబడినదని**

## పరమాత్మ నుండి ఆత్మ విభజన చిత్రము



**తెలుపుచున్నాము. ఇదెక్కడి శాస్త్రమనుకోవద్దండి ప్రపంచములో గల షట్ శాస్త్రములలో పెద్ద శాస్త్రము ఇదియే.** మిగత ఐదు శాస్త్రములు దీనికంటే చిన్నవి. ఐదు శాస్త్రములు ప్రకృతికి సంబంధించినవికాగ, ఆరవదైన బ్రహ్మవిద్యాశాస్త్రము పరమాత్మకు సంబంధించినది. బ్రహ్మవిద్యాశాస్త్రము ప్రకారము ఆత్మ ఏడు భాగములుగ విభజింపబడగా, తర్వాత చరప్రకృతి వలన తయారు చేయబడిన బుద్ధి, చిత్తము, అహము, మనస్సు వలన జీవాత్మ తయారైనది. జీవాత్మ ఆత్మలోని కొంత భాగమేనని తెలుసుకొన్నాము కదా! ఆత్మలోని ఎంత భాగముతో జీవాత్మ తయారైనదని ప్రశ్నవస్తే దానికి జవాబును కూడ చూడవలసియున్నది. ఆత్మ ఏడు భాగములలో మొదటి భాగము వెయ్యి యూనిట్లుగ ఉందనుకొన్నాము కదా! ఆ వెయ్యి యూనిట్లలో సగము ఐదు వందల యూనిట్లను చరాప్రకృతి చీల్చుకొని బుద్ధి చిత్త అహంకార రూపములతో చుట్టుకొనగ జీవాత్మ అయినది. అనగా మొదటి ఆత్మ భాగములో సగము జీవాత్మగ తయారైనది. ఆ వివరము అర్థమగునట్లు తర్వాత పేజీలో బొమ్మ రూపములో చూచెదము.

ఈ విధముగ మొదటి భాగములో సగము జీవాత్మకాగ, మొదటి స్థానములో ఆత్మ 500 యూనిట్లుగ ఉండగ, రెండవ స్థానములో కూడ 500 యూనిట్లే ఆత్మ భాగమున్నది. ఇలా పైన రెండు స్థానములలో ఆత్మ సమాన బలము కల్గియుండగ, క్రింది ఆరు, ఏడు స్థానములలో $31\frac{1}{4}$ (31.25) యూనిట్లుగ సమానముగ ఉన్నది. ఈ ఏడు భాగముల ఆత్మస్థానములనే సప్తస్థానములని గుర్తింపు పేర్లను కూడ ఆ స్థానములకు పెట్టడడము జరిగినది. పైన గల మొదటి స్థానమును సహస్రారము అని పిలువగ, రెండవ దానిని ఆగ్నేయ స్థానము, మూడవది విశుద్దము, నాల్గవది అనాహతము, ఐదవది మణిపూరకము, ఆరవది స్వాదిష్ఠానము, ఏడవది ఆధారము అని చెప్పడము జరిగినది.

ఏడు ఆత్మ భాగములు శరీరములో ఏడు నాడీకేంద్రములను ఆక్రమించుకొన్నవి. మొదటి నాడీకేంద్రమైన మెదడును (సహస్రారమును) ఆత్మ

## పరమాత్మ నుండి ఆత్మ, ఆత్మనుండి జీవాత్మ విభజన చిత్రము



## శరీరములో ఆత్మ భాగములున్న విధానము.



మొదటి భాగము 500 యూనిట్లు ఆక్రమించుకోగా, రెండవ నాడీకేంద్రమైన మెదడు క్రింది భాగమును (ఆగ్నేయమును) ఆత్మ రెండవ భాగము 500 యూనిట్లు ఆక్రమించుకొన్నది. ఈ విధముగ మిగత ఐదు నాడీకేంద్రములలో ఆత్మయొక్క ఐదు భాగములు ఆక్రమించు కొన్నవి. ఏడు నాడీకేంద్రములకు ఆత్మ భాగముల పేర్లే నిర్ణయింపబడినవి. శరీరము యొక్క ఏడు నాడీకేంద్రములనుండి ఆత్మయొక్క ఏడు భాగములు తమ తమ కార్యములను చేయుచున్నవి. వీటినే శరీరములో సప్తస్థానములని కొందరంటున్నారు. మరికొందరి సప్తచక్రములని కూడ అంటున్నారు. వీటినే పద్మములని వాటికి కొన్ని రేకులున్నవని కొందరు చెప్పగ, మరికొందరు ఒక్కొక్క స్థానమును ఒక మంత్రముగ కొన్ని బీజాక్షరమున్నట్లు కూడ చెప్పారు. ఈ విధముగ అక్కడ ఉన్న సత్యమును వదలి చాలామంది చాలా విధములుగ చెప్పగ హేతువాదులు ఇదంత పూర్తి అసత్యము అని అన్నారు. ఏడు నాడీకేంద్రములున్నది సత్యమే, అందులో ఆత్మశక్తులు ఏడు విధములుగ ఉన్నది సత్యమే. హేతువాదులు ఏడు భాగముల ఆత్మను ఒప్పుకోకపోయినప్పటికి వారికి తెలిసిన విజ్ఞానము ప్రకారము ఏడు నాడీకేంద్రములు లేవని చెప్పలేరు.

ఇక్కడ ఇంకొక విశేషమేమిటంటే 500 యూనిట్లగ ఉన్న మొదటి సహస్రా నాడీకేంద్రము, రెండవ ఆగ్నేయ నాడీకేంద్రము రెండు ఒకే మెదడు స్థానములో పైన క్రింద ఉండగ, $31\frac{1}{4}$ యూనిట్లుగనున్న ఆరవ స్వాదిష్ఠాన నాడీకేంద్రము, ఏడవ ఆధార నాడీకేంద్రము రెండు వెన్నెముక చివరి భాగములో ఒకే చోట పైన క్రింద గలవు. మిగత మూడు ఆత్మభాగములు $250, 125, 62\frac{1}{2}$ యూనిట్లుగ తేడాలు కల్గియుండి ఒకదానికొకటి దాదాపు జానెడు దూరముగనున్న నాడీ కేంద్రములలో గలవు. ఒక్క చోటగల పై రెండు కేంద్రముల ఆత్మపని దాదాపు ఒకేలాగుండును. అలాగే క్రింద ఒకచోటనున్న రెండు నాడీకేంద్రములలోని ఆత్మపనియు దాదాపు ఒకే విధముగనుండును. పై రెండు నాడీకేంద్రములు ఒక్కచోట ఉన్నవి కావున వాటి రెండిటిని ఒకటిగ లెక్కించి, క్రింద రెండు నాడీకేంద్రములు కూడ ఒక్కచోటివే కావున వాటిని కూడ ఒకటిగ లెక్కించినట్లయితే, మధ్యలో మూడిటిని లెక్కించి

చూచిన మొత్తము ఐదు భాగములుగ తెలియుచున్నవి. ఒకచోట యుండి ఒకే విధముగ పనిచేయు పై రెండు ఆత్మ భాగములు సమానశక్తియుండి, రెండు ఒకటిగ గుర్తింపబడి "సహస్రాగ్నేయ" అని పేరుగాంచియుండగ, అలాగే క్రింది రెండు ఆత్మభాగములు సమానశక్తికల్గి ఉండి ఒకటిగ గుర్తింపబడి "స్వాదిష్ఠాధార" అని పేరుగాంచియున్నవి. ఈ విధముగ 1) సహస్రాగ్నేయ 2) విశుద్ధ 3) అనాహత 4) మణిపూరక 5) స్వాధిష్ఠాధార అను ఐదు పేర్లుగలిగినవి. శరీరములోని ప్రకృతి అయిన పంచ భూతములకు ఇవి అధిపతిగనున్నవి. సహస్రాగ్నేయము ఆకాశతత్త్వమునకు, విశుద్ధము గాలితత్త్వమునకు, అనాహతము అగ్నితత్త్వమునకు, మణిపూరకము నీటితత్త్వమునకు, స్వాధిష్ఠాధారము భూమి తత్త్వమునకు అధిపతిగ ఉన్నవని తెలియవలెను.

ఇక్కడ కొందరికి మరియొక ప్రశ్నరావచ్చును. అది ఏమనగా! ఆత్మ 2000 యూనిట్ల శక్తి కల్గియున్నదని చెప్పారుగదా! అది అందరిలో 2000 యూనిట్లే ఉంటే అందరు ఒకే బలము కల్గియుండాలి కదా! ఆ విధముగ అందరు ఒకే బలము కల్గియున్నట్లు ఎక్కడలేదు. ఒక్కొక్కరు ఒక్కొక్క బలము కల్గియున్నారు కదా! దీనిని బట్టి 2000 యూనిట్లు అందరిలో లేనట్లే కదా! అని అడుగవచ్చును. అంతేకాక యూనిట్ అంటే ఎంత కొలత అని కూడ అడుగవచ్చును. దానికి మా జవాబు ఏమనగా! ఒకే పొడవు, ఒకే వెడల్పుగలిగిన విస్తీర్ణములోనున్న శక్తిని ఒక యూనిట్ అనుచున్నాము. పొడవు వెడల్పు ఒకే కొలతతోయున్న చతురస్రశక్తిని ఒక యూనిట్ అనుచున్నాము. ఒక ఆత్మ 2000 యూనిట్లశక్తిగ విభజింపబడినదని అర్థము. అన్ని శరీరములలో ఆత్మ ఒకే కొలతతోలేదు. ఒక్కొక్క శరీరములోని ఆత్మ ఒక్కో పరిమాణముతో ఉన్నది. ఏ శరీరములో, ఏ పరిమాణములో ఉండిన అది మాత్రము 2000 సమానశక్తి భాగములుగ విభజింపబడినది. ఆత్మ అదియున్న శరీరమంత వ్యాపించియున్నది. శరీరమంత వ్యాపించిన దానివలన ఆత్మ శరీర ఆకృతిని పొందియున్నది. శరీరమంత వ్యాపించిన ఆత్మ ప్రత్యేక సమయములో (బ్రహ్మయోగములో) 1500 యూనిట్లు 500 యూనిట్లుగ మారిపోగలదు. ఒక్క

యూనిట్‌లో రెండు యూనిట్ల చొప్పున అనిగిపోగలదు. తిరిగి విడిపోయి శరీరమంత వ్యాపించి 1500 యూనిట్లుగ మారిపోగలదు. ఆత్మ మొదటి స్థానమైన 500 యూనిట్లలో క్రింది ఆరు స్థానములలోని 1000 యూనిట్లు చేరిపోగలవు. పైవి క్రిందివి అన్ని 1500 యూనిట్లు 500 యూనిట్లగనే ఉండిపోవును.

యూనిట్ అనునది పరిమితమైన కొలతతో లేదు. ఆత్మ ఒకే పరిమాణములో లేదు. ఒక్కొక్క శరీరములో ఒక్కొక్క పరిమాణములో గలదు. కావున ఒక్కొక్క శరీరమునకు ఒక్కొక్క శక్తి ఉండును. పరమాత్మనుండి వచ్చిన ఆత్మ ఒకే కొలతలో లేకుండుట వలన శరీరములకు వ్యత్యాసబలములు కలవు. పరమాత్మ నుండి వచ్చిన ఏ ఆత్మయిన 2000 యూనిట్లగనే సమానముగ విభజింపబడినది. అంతేకాక అందరికి తెలియని విషయమొకటి కలదు. అది ఏమనగా! పైన గల మొదటి రెండవ కేంద్రములైన సహస్రాగ్నేయములలో గల 500+500=1000 యూనిట్ల ఆత్మతప్ప మిగత క్రిందగల ఐదు కేంద్రముల ఆత్మభాగములలోని 500 యూనిట్ల శక్తి ఒకప్పుడు ఎక్కువ సాంద్రతగ, ఒకప్పుడు తక్కువ సాంద్రత ఉండును. క్రింది స్థానములలోని 500 ఆత్మ యూనిట్లు కొంతకాలము బలముగవుండి, కొంతకాలము బలహీనపడడము కూడ జరుగుచుండును. అందువలన శరీరములో ఒకప్పుడున్న బలము ఒకప్పుడు ఉండదని తెలియవలెను.

ఏడు స్థానములను ఆధారము చేసుకొని చరప్రకృతిచేత శరీరమంత తయారైనది. శరీరమంతయు స్త్రీతత్త్వమైన ప్రకృతికాగ, ఆత్మ, జీవాత్మ రెండు పురుషతత్త్వమైన ఆత్మలైనవి. అందువలన ఆత్మ జీవాత్మలను ఈ శ్లోకములో ఇద్దరు పురుషులుగ వర్ణించి చెప్పడము జరిగినది. ఈ ఇద్దరి పురుషులనే ఒకరు క్షరపురుషుడని, మరియొకడు అక్షర పురుషుడని కూడ చెప్పడమైనది. క్షరపురుషుడనగా! నాశనమగువాడని, అక్షర పురుషుడనగా! నాశనము కానివాడని అర్థము. వీరిలో నాశనమగు వాడు జీవాత్మ, నాశనము కానివాడు ఆత్మ. శరీరములోని బుద్ధి, చిత్త,

అహములు ఉన్నంత వరకు జీవాత్మ ఉండగలదు. ఆ మూడు పొరలు లేకుండ పోయినపుడు జీవాత్మ యథావిధిగ ఆత్మలో కలిసిపోవును. అపుడు జీవాత్మ ఉండదు. కనుక జీవుడు క్షరుడనియు, ఆత్మ అక్షరుడనియు చెప్పబడినది. క్షరాక్షరులుగానున్న ఆత్మ, జీవాత్మలు రెండు ఒక శరీరములోనే నివశిస్తున్నవి. ఆత్మలేకుండ జీవాత్మకాని, జీవాత్మలేకుండ ఆత్మగాని ఉండవు. అందువలన ఆత్మను శ్లోకములో కూటస్థుడన్నారు.

ఈ శ్లోకము వరకు భగవద్గీతలో ఎక్కడగాని ఆత్మ, జీవాత్మల విభజన చేసి చెప్పలేదు. ప్రత్యేకించి ఈ శ్లోకములోనే ఆత్మ, జీవాత్మల విభజనను శాస్త్రబద్ధముగ భగవంతుడు తెలియజేశాడు. ఈ శ్లోకము భగవద్గీతలో ఎంతో కీలకమైనది కాగ, చాలామంది ఈ శ్లోకములోని భావమునే అవగాహన చేసుకోలేక పోయారు. క్షర పురుషుడని చెప్పిన జీవాత్మను స్త్రీతత్త్వమైన శరీరముతో పోల్చుకొని అర్థము చెప్పుకోవడము జరిగినది. అందువలన గీతకు ముఖ్య ఆధారమైన ఈ ఆధ్యాయములోని 16,17 శ్లోకములు పూర్తి అర్థశూన్యమైపోయినవి. గుణత్రయవిభాగ యోగములో మూడవ శ్లోకములో ప్రకృతి స్త్రీ అనియు, దానికి నేను బీజదాతనైన పురుషుడనని తెలియ చెప్పగ ప్రకృతి సంబంధ శరీరముగా జీవాత్మను పోల్చడము చాలాతప్పు. ఈ శ్లోకములో క్షరుడు అక్షరుడని ఇద్దరు పురుషులైన జీవాత్మ, ఆత్మను తెలిపి, తర్వాత శ్లోకములో ఇద్దరి పురుషులకంటే ఉత్తమమైన పురుషుడున్నాడని, వానినే పురుషోత్తముడనుచున్నామని కూడ చెప్పాడు. ఇక్కడ ముగ్గురు పురుషులను తెలియజేసి **"త్రైతసిద్ధాంతమును"** శాస్త్రపద్ధతిలో భగవంతుడు తెలిపాడు. భగవంతుని మాటను త్రోసివేసి ప్రకృతితో కూడుకొన్న శరీరమును క్షరపురుషుడని చెప్పినవారు, దేవుని భావమునకు పూర్తి వ్యతిరేఖముగ చెప్పినవారగుదురు. దాని వలన పెద్దపాపమే వస్తుంది. ఇప్పటికైన చాలామంది పొరబడి వ్రాసిన వ్రాతలను వదలివేసి, సరియైన పద్ధతిలో దేవుని భావము ప్రకారము మూడు ఆత్మల త్రైతమును తెలుసుకొందాము. 16వ శ్లోకములో జీవాత్మ, ఆత్మల వివరము చెప్పిన భగవంతుడు 17వ శ్లోకములో మూడవ ఆత్మను గురించి ఏమి చెప్పుచున్నాడో గమనిస్తాము.

(14)శ్లో॥17 : ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః ।
యో లోకత్రయ మావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః ॥
(పరమాత్మ)

**భావము :** ఉత్తముడగు పురుషుడు అన్యమైనవాడొకడున్నాడు. వాడే పరమాత్మయని చెప్పబడుచున్నాడు. అతడే ముల్లోకములను ఆవహించి అవ్యయుడై, అధిపతియై, భర్తయై ఉన్నాడు.

**వివరము :** విశ్వమునంతటిని భరించు భర్తయైనవాడు, ప్రపంచము, జగత్తు రెండు నాశనమైనప్పటికి నాశనము కానివాడు, అన్నిటికి అందరికి అధిపతియైనవాడు, జీవాత్మ ఆత్మలకు వేరుగ ఉన్నవాడు అయిన వానికి ఆత్మ జీవాత్మలవలె పేరులేదు. పేరేకాదు, రూపము కూడ లేదు. ఆకారముగాని, పేరుగాని లేనివానిని ఏమని పిలువాలో అర్థముకాక చివరకు ఒక మార్గమును అన్వేషించినవారు ఆయన ఏ పద్ధతిలో ఉన్నాడో, ఆ పద్ధతి కలవాడని చెప్పను మొదలు పెట్టారు. జీవాత్మ ఆత్మలు ఇద్దరు పురుషులే అన్నాము కదా! ఇద్దరికంటే ఉత్తమునిగా నున్నవాడు గనుక **"పురుశోత్తమ"** అనడము జరిగినది. అంతేకాక ఆత్మకంటే వేరుగ ఉన్నవాడు గనుక **"పరమాత్మ"** అని కూడ చెప్పడము జరిగినది. పర అనగా వేరు అని అర్థము. ఆత్మకంటే పరముగానున్నాడు కావున పరమాత్మ అనడము జరిగినది. పరమాత్మ అనిన, పురుశోత్తమ అనిన అవి పేర్లుకాదు. ఆయనున్న విధానమును తెలుపు అర్థముతో కూడుకొన్న గుర్తింపు పదములని తెలియాలి. అలాగే ఈ శ్లోకములో చెప్పబడిన భర్త, అవ్యయ, ఈశ్వర అను పదములు అర్థముతో కూడుకొని దేవుని విధానమును తెలుపునవని గ్రహించాలి. అందరు చెప్పుకొను దేవుడు అను పదము కూడ అలాంటిదే. దేవున్ని పిలుచు ఏ పదముగాని అలాగే ఉండునని తెలియవలెను.

పరమాత్మ అని పిలువబడువాడు జీవాత్మ ఆత్మలకంటే అన్యముగ ఉన్నవాడై, ఇంకా ఎలాగున్నాడనగా! జీవాత్మ ఆత్మలున్న దానికంటే అధికముగ, అన్యముగా

ఉన్నాడని తెలియుచున్నది. జీవాత్మ ఒక శరీరములో ఆత్మ మొదటి స్థానమైన తలలో ఒక్కచోట మాత్రమున్నది. ఆత్మ మాత్రము ఏడు భాగములుగ ఉంటూ శరీరమంత తన శక్తిని వ్యాపింపచేసి శరీరమంతయు నఖశిఖ పర్యంతము గలదు. దీనిని బట్టి ఆత్మ వ్యాపించని శరీర భాగము లేదని తెలియుచున్నది. ఆత్మ శరీరములో అణువణువున ఉంటూ శరీరమునంతటిని చైతన్యము చేసి కదలునట్లు చేయుచున్నది. ఆత్మ వ్యాపించని శరీరభాగముంటే అది కదలదు. ఆరోగ్యముగ ఉండదు. ఆత్మ వ్యాపించని శరీరభాగమున్న వారిని నష్టాత్ములనవచ్చును. సర్వసాధారణముగ శరీరమంత ఆత్మ వ్యాపించియుండగ, జీవాత్మ మాత్రము శరీరమంతలేక ఒక్క చోట మాత్రమున్నది. శరీరమంత వ్యాపించిన ఆత్మ ఒక్క జీవాత్మలో మాత్రము లేదు. జీవాత్మ వేరు ఆత్మ వేరుగ ఉన్నవి, కావున ఆత్మ, జీవాత్మ మినహా శరీరమంత గలదు. ఒక్కచోటున్న జీవాత్మను, శరీరమంత వ్యాపించిన ఆత్మను సృష్ఠించిన పరమాత్మ మాత్రము ఇక్కడ లేదనకుండునట్లు అంతట వ్యాపించినది. అంతట అనగా ఆత్మలేని జీవాత్మలో కూడ కలదు. ఆత్మవ్యాపించిన శరీరమంతట కూడ విస్తరించియున్నది. శరీరములోపలే కాక శరీరము బయట అణువణువున ఉన్నది ఒక్క పరమాత్మేనని తెలియవలెను. ఆత్మ శరీరము లోపల మాత్రమే ఉండి, శరీరము బయట లేదు. శరీరమంతట లేకుండ ఒక్కచోటున్న జీవాత్మలోను, జీవాత్మలో లేకుండ శరీరమంతట ఉన్న ఆత్మలోను, జీవాత్మ ఆత్మలు లేని ప్రకృతిలోను, ప్రతి అణువులోను వ్యాపించినది ఒకే ఒక పరమాత్మ. అందువలన పరమాత్మను సర్వవ్యాపి అన్నారు. జీవాత్మ ఆత్మలను తయారుచేసిన పరమాత్మ ఆ రెండు ఆత్మలకంటే ఉత్తమునిగ ఉంటూ పురుషోత్తమ అని గుర్తింపు పొందడమే కాక, రెండు ఆత్మలయందు కూడ వ్యాపించి ఆ రెండిటికి అధిపతిగ ఉన్నాడు. కావున ఆ పురుషోత్తమున్ని ఈశ్వరుడని కూడ పిలువడము జరిగినది. రెండు ఆత్మలకు వాటి ఉనికికి కారణమైన వాటిని పోషిస్తున్నాడు కావున భర్త అనియు, జగద్భర్త అనియు పొగడబడుచున్నాడు.

ఇక్కడున్న 16,17 శ్లోకములు రెండు కేవలము మూడు ఆత్మల వివరమును మాత్రమే తెలియజేశాయి. అందువలన ఈ రెండు శ్లోకములు భగవద్గీతలో అత్యంత

ప్రాముఖ్యమైనవని చెప్పుచున్నాము. జగత్తులో బ్రహ్మవిద్యకు మూలకారణమైన మూడు ఆత్మల వివరము ఇక్కడే గలదు. ఈ మూడు ఆత్మలు గల రెండు శ్లోకములు అర్థమైతేనే మిగతా భగవద్గీత శ్లోకములన్ని అర్థముకాగలవు. ఈ శ్లోకములు అర్థము గానిది ఇటు ఆస్తికవాదులకుగాని, అటు హేతువాదులకుగాని గీత అర్థముగాదు. దేవుడున్నాడను చెప్పు ఆస్తికులకుగాని, దేవుడెట్లున్నాడని వాదించు హేతువాదులకు గాని, దేవుని వాస్తవికత తెలియకపోవడానికి ప్రధాన కారణము త్రైతమైన మూడు ఆత్మలు తెలియకపోవడమేనని తెలియవలెను.

<u>**గమనిక**</u> : *చాలామంది వ్రాసిన గీతలలో ముగ్గురు పురుషుల విభజన అర్థము కాక ప్రకృతితో కూడిన శరీరమును క్షరుడని, జీవుడు అక్షరుడని, దేవుడు పురుషోత్తముడని చెప్పుకొన్నారు. ప్రకృతిని భాగముగ కలుపుకోవడము తప్పుగ తెలుసుకోవాలి. ఇక్కడ చెప్పినది కేవలము పురుషునికనియే తెలియాలి.*

*(14) శ్లో ॥ 18 : యస్మాత్ క్షర మతీతోఽహ మక్షరాదపి చోత్తమః ।*
*అతోఽస్మిలోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః ॥*
*(పరమాత్మ)*

**భావము :** క్షరునికంటే అతీతుడను, అక్షరునికంటే ఉత్తముడను అయినందువలన లోకమునందు వేదములలో నేను పురుషోత్తముడనని ప్రసిద్ధిగాంచివున్నాను.

**వివరము :** పరమాత్మ క్షరపురుషునికంటే అధికుడు, అక్షరపురుషునికంటే ఉత్తముడు అయి ఉన్నందువలన పురుషోత్తముడని పిలువబడుచున్నాడు. ఆత్మకంటే పరాయి వాడైనందువలన అనగ ఆత్మకంటే వేరైనవాడగుట వలన పరమాత్మయని పిలువబడు వాడు, ఇక్కడ క్షరాక్షరులైన ఇద్దరి పురుషులకంటే ఉత్తముడగుటవలన పురుషోత్తమ అనికూడ పిలువబడుచున్నాడు. ఈ ప్రపంచములో ఏదైతే పెద్ద శక్తియో, ఈ ప్రపంచమును ఎవడైతే పుట్టించి పాలించుచున్నాడో, ఈ ప్రపంచములో దేవతలకంతా దేవుడై సర్వలోకములకధిపతియై ఎవడైతే ఉన్నాడో, ఈ ప్రపంచమంత ఒక్క అణువు కూడ వదలక అంతట వ్యాపించి అన్నిటికి మృత్యువు ఎవరై ఉన్నాడో, ఆ ఏకైక

శక్తియే పేరులేనివాడు మరియు రూపములేనివాడు. ఇప్పుడు ఇక్కడ పురుషోత్తము డని, పరమాత్మయని పిలువబడువాడే సృష్ఠి, స్థితి, లయ కారణకర్తయై ఉన్నాడు. వానికి పేరులేదని చెప్పి పరమాత్మ, పురుషోత్తమ అంటున్నారే అనుకోవద్దండి. అవి పేర్లుకావు. ఆయనకు పేరు పెట్టడానికి వీలులేదు. అందువలన ఆయనకున్నవి పేర్లుకావని, ఇతరులతో పోల్చి పిలువడములోని పోలికలే పరమాత్మ అనుట మరియు పురుషోత్తమ అనుట అని తెలియాలి. శరీరములోని ఆత్మతో పోల్చి ఆత్మకంటే వేరైన దానివలన పరమాత్మ అని అంటున్నాము. పరమాత్మ అనుటలో ఆత్మకంటే పరముగా (వేరుగా) ఉన్నవాడని అర్థము కలదు. అట్లే పురుషులతో పోల్చి చెప్పినపుడు పురుషోత్తమ అన్నారు. పురుషోత్తమ అనుటలో ఉన్న ఇద్దరి పురుషులలో ఉత్తమమైనవాడు అని అర్థము కలదు. ఇతరులతో పోల్చి చెప్పుకోవడమే కాని అవి పేర్లు కావని గ్రహించవలెను. పదిమంది నల్లవారిలో ఒక తెల్లవాడున్నప్పుడు వానిని తెల్లోడు అంటాము. తెల్లోడు అనుమాట ఇతరులతో పోల్చు పోలిక కాని అది పేరు కాదు కదా! అట్లే క్షరాక్షరులతో పోల్చు పోలికలే పరమాత్మ, పురుషోత్తమ అనుమాటలు, నిజముగ ఆయనకు పేరుగాని ఆకారముగాని లేవు.

*(14) శ్లో॥ 19: యో మా మేవ మసమ్మూఢో జానాతి పురుషోత్తమమ్ ।*
*స సర్వవి ద్భజతి మాం సర్వభావేన భారత !॥*
*(పరమాత్మ)*

**భావము :** ఎవడు అజ్ఞానరహితుడై జ్ఞానసహితుడై పురుషోత్తమునిగా నన్ను ఎరింగిన వాడై ఉన్నాడో, వాడు సర్వము తెలిసినవాడై అన్ని భావములతో నన్ను ఆరాధించిన వాడగుచున్నాడు.

**వివరము :** ఎవడైతే పూర్ణస్థాయి జ్ఞానము తెలుసుకొంటున్నాడో, వాడు పురుషోత్తము డైన పరమాత్మను క్షర అక్షరులకంటే వేరుగ చూస్తున్నాడు. క్షర అక్షరులను శరీరమందే చూస్తు, పరమాత్మ అంతట ఉన్నట్లు తెలియుచున్నాడు. పరమాత్మ యొక్క నిజ స్వరూపమును అర్థము చేసుకోగల్గుచున్నాడు. సర్వవిధముల పరమాత్మను అర్థము

చేసుకొన్న వానిని సర్వజ్ఞుడని చెప్పవచ్చును. వాడు పరమాత్మను సర్వవిధముల ఆరాధించినవాడగుచున్నాడు.

*(14)శ్లో॥ 20 : ఇతి గుహ్యతమం శాస్త్ర మిద ముక్తం మయాஉనఘ ।*
*ఏత ద్బుద్ధ్వా బుద్ధిమాన్ స్యా త్కృతకృత్యశ్చ భారత ॥*
*( జీవాత్మ, ఆత్మ, పరమాత్మ)*

**భావము :** ఈ ప్రకారముగ మిగుల రహస్యమైన శాస్త్రము నీకు నేను చెప్పితిని. దీనిని తెలుసుకొన్నవాడు బుద్ధిమంతుడును, కృతకృత్యుడగును.

**వివరము :** ఈ అధ్యాయములో చివరిదైన ఈ శ్లోకములో రహస్యమైన శాస్త్రము నాచే నీకు చెప్పబడినదని చెప్పారు. రహస్యమైనదనగా ఎవరికి తెలియనిదని అర్థము. ఇదివరకు తెలియబడని విషయమేమనగా! ఒకే పురుషుడు మూడుగ విభజింపబడివుండడము, మరియు ఆ ముగ్గురు ఎవరనుట. ఈ విషయములో భగవంతుడు రహస్యమనినట్లే గొప్పగ తెలిసినవారు కూడ ముగ్గురిని తెలియలేక, ఒకరి స్థానములో ప్రకృతిని వాటి శరీరములను పెట్టుకొన్నారు. వేరు వేరైన ప్రకృతి పురుషులలో ఒక్క పురుషునికి సంబంధించిన విషయమిది అని తెలియక, పురుషునికి విభిన్నముగనున్న ప్రకృతిని ఆ స్థానములో పెట్టుకొన్నారు. దీనివలన ఈ విషయము ఎవరికి అర్థము కాలేదనుటకు నిదర్శనమైనది. ఇది రహస్యమైనదని భగవంతుడు చెప్పుటవలన మనకు తెలియని రహస్యమేదో ఇందులో కలదని పరిశీలించి చూడవలసిన అవసరమున్నది.

ఇంతేకాక ఇది శాస్త్రబద్ధమైన విషయమని కూడ చెప్పబడివున్నది. అనగా ఇది శాసనరూపమైనదని, ఇందులో చెప్పిన విషయము తూచ తప్పక జరుగు విషయములు మరియు ఉన్న విషయములని తెలియాలి. శాస్త్రబద్ధమైన లెక్కాచారము లతో కూడుకొని ఉన్న బ్రహ్మ, కాల, కర్మ, గుణచక్రముల వివరము, వాటి పెంపకమైన అశ్వర్థవృక్షము యొక్క నిజస్వరూపమునుగాంచలేక సంసార వృక్షమని ఊహించు

కోవడము శాస్త్రబద్ధతను చాటి చెప్పలేదు. ఇన్ని సంవత్సరములని జగతి సృష్ఠిని తెలియజేయు బ్రహ్మాచక్రము, ఇంతకాలము మానవ జీవితమని తెలియజేయు కాలచక్రము, ఇంతే కష్టము ఇంతే సుఖమని తెలియజేయు కర్మచక్రము, ఇవే గుణములని తెలియజేయు గుణచక్రము అశ్వర్థమూలమై ఉన్నవని శాస్త్రబద్ధముగ తెలిసినవాడు బుద్ధిమంతుడగును, కృతకృత్యుడగునని చివరి శ్లోకములో తెలియజేశారు. అందువలన మనము దేనిని చదువుచున్నప్పుడైన అందులో ముఖ్యముగ శాస్త్రీయత గమనించవలయును. శాస్త్రీయత లేని విషయము అగ్నిలేని వంటలాంటిది. హేతువాదుల ప్రశ్నలకు నిలువదు.

ఇంతటితో పురుషోత్తమ ప్రాప్తి యోగమను ఈ అధ్యాయము సమాప్తమైనది. ఇందులోని శ్లోకముల వివరము క్రింద ఇవ్వబడినది.

| | | | |
|---|---|---|---|
| 1) | ప్రకృతి, పురుషులు | – | 3 |
| 2) | పరమాత్మ | – | 9 |
| 3) | ఆత్మ, ప్రకృతి | – | 1 |
| 4) | జీవాత్మ | – | 2 |
| 5) | ఆత్మ | – | 3 |
| 6) | జీవాత్మ, ఆత్మ | – | 1 |
| 7) | జీవాత్మ, ఆత్మ, పరమాత్మ | – | 1 |
| | మొత్తము శ్లోకములు | – | 20 |

భావము, వివరము మార్చి వ్రాసిన శ్లోకములు – 2,14,15,16,17.

*****

## పదిహేనవ అధ్యాయము

# దైవాసుర సంపద్విభాగ యోగము

**శ్రీ భగవంతుడిట్లనియె :-**

(15) శ్లో॥ 1 : అభయం సత్త్వసంశుద్ధిర్జ్ఞానయోగవ్యవస్థితిః ।
దానం దమ శ్చ యజ్ఞ శ్చ స్వాధ్యాయ స్తప ఆర్జవమ్ ॥
(దైవగుణము)

(15) శ్లో॥ 2 : అహింసా సత్య మక్రోధస్త్యాగ శ్శాన్తి రపైశునమ్ ।
దయా భూతేష్వలోలుప్త్వం మార్దవం హ్రీ రచాపలమ్ ॥
(దైవగుణము)

(15) శ్లో॥ 3 : తేజః క్షమా ధృతిః శౌచ మద్రోహో నాతిమానితా ।
భవన్తి సమ్పదం దైవీ మభిజాతస్య భారత ! ॥
(దైవగుణము)

**భావము :** భయము లేకుండుట, సత్త్వగుణములో మంచివైన ఆరు గుణములు కల్గియుండడము, జ్ఞానము యోగములందలి వ్యవహారములన్ని తెలిసివుండడము, దానమిచ్చుట, ఇంద్రియములను స్వాధీనములో ఉంచుట, ద్రవ్య జ్ఞానయజ్ఞములు తెలిసి వేదాధ్యయణము చేసివుండుట, తపస్సుకల్గి కపటము లేకుండుట, అహింస, సత్యమునే పలుకుట, క్రోధము లేకుండుట, త్యాగము, శాంతికల్గి చాడీలు చెప్పకుండుట, జీవరాసులమీద దయ, విషయములందు ఆసక్తి లేకుండుట, మృదువుగ ఉండుట, గంభీరభావము కల్గియుండుట మనస్సు చలింపకుండుట, తేజస్సు, క్షమించు స్వభావము, ధైర్యము, శుభ్రత, పరులకు ద్రోహము చేయకుండుట, అభిమానము లేకుండుట దైవాంశయందు పుట్టినవారికి కల్గుచున్నవి.

(15)శ్లో॥ 4 : దమ్భో దర్పో౽భిమానశ్చ క్రోధః పారుష్య మేవ చ ।
అజ్ఞానం చాభిజాతస్య పార్థ! సమ్పద మాసురీమ్ ॥
(అసుర గుణము)

**భావము :** గర్వము, అధికారత్వము చలాయించుట, అభిమానము కల్గివుండుట, క్రోధము, కఠినత్వము కల్గివుండుట, అజ్ఞానము కల్గియుండుట రాక్షసాంశయందు పుట్టినవారికుండును.

(15)శ్లో॥ 5 : దైవీ సమ్పద్విమోక్షాయ నిబన్ధాయా౽సురీ మతా ।
మాశుచ స్సమ్పదం దైవీ మభిజాతో౽సి పాణ్డవ! ॥
(దైవ అసుర గుణములు)

**భావము :** దైవ అంశ మోక్షమును కల్గించును. అసురాంశ బంధమే కల్గించును. నీవు దైవాంశ సంభూతుడవైనందు వలన బాధపడవలసిన పనిలేదు.

**వివరము :** దైవాంశ, రాక్షసాంశ అను రెండు భాగములలో దైవాంశ దైవము వైపు, రాక్షసాంశ జన్మలవైపు మార్గములై ఉన్నవి. దైవాంశ అనుదానిలో పుట్టినవారు దైవమునకు జ్ఞానమునకు విరుద్ధమైన పనులు చేయకుందురు. మంచి పనులు చేయుచు, వాటి వలన కొద్ది కొద్దిగ ఆలోచిస్తు, ఆ ఆలోచనల వలన కొద్ది కొద్దిగ జ్ఞానము మీద ధ్యాసకల్గుచు, గురు సన్నిధికి చేరుచుందురు. అక్కడ గురువు బోధించు జ్ఞానమును బట్టి కొన్ని జన్మలకైన మోక్షమును పొందగలరు. రాక్షసాంశయందు పుట్టినవారు దైవమునకు జ్ఞానులకు విరుద్ధమైన పనులు చేయుట వలన వారికి జ్ఞానమునకు మధ్య దూరమేర్పడును. జ్ఞానము మీద ధ్యాసలేని వారు గురువులను సహితము హేళనగా మాట్లాడుచుందురు. అటువంటి వారికి జ్ఞానము యొక్క గట్టు దొరకక జన్మ జన్మలకు దైవమునకు దూరమగుచు జన్మకర్మలను పొందుచునే ఉందురు. దైవికమైన విషయములందు విలువ, గౌరవమిచ్చు సజ్జనులు (దైవాంశపరులు) దైవికమైన శ్రద్ధను పొందుచు కొన్ని జన్మల తరువాత దైవమును గురించిన సమాచారము తెలియగలరు. ఇటువంటి వారిని గూర్చియే విజ్ఞాన

యోగములో 19వ శ్లోకములో 'బహూనామ్ జన్మనామంతే జ్ఞానవాన్మాం ప్రపద్యతే' అని అన్నారు. రాక్షసాంశ గలవారు దైవిక విషయములను చులకనగా చూస్తు జ్ఞానులను శత్రువులుగ లెక్కించుచుందురు. అటువంటివారు దేవతలకు భక్తులుకావచ్చును కాని పరమాత్మ విషయముల గురించి తెలియలేరు. జన్మ జన్మకు జ్ఞానము యొక్క గట్టుకు దూరమగుచు ఎప్పటికీ జ్ఞానమును తెలియలేరు. అర్జునుడు దైవాంశమున పుట్టినవాడు కనుక ఎన్నో జన్మల శ్రద్ధ చేత గురువుగ భగవంతుడే లభించాడు. దైవాంశములో పుట్టిన వారిని దేవతలని, రాక్షసాంశలో పుట్టిన వారిని రాక్షసులని అనుచున్నాము. పురాణాలలో చెప్పినట్లు వారెక్కడో లేరు. భూమి మీద మానవాకారులలోనే ఉన్నారు. దీని విషయము క్రింది శ్లోకములో చూడండి.

*(15)శ్లో॥ 6 : ద్వౌ భూతసర్గౌ లోకేఽస్మిన్ దైవ ఆసుర ఏవ చ ।*
*దైవో విస్తరశః ప్రోక్త ఆసురం పార్థ! మే శృణు ॥*
*(దైవ, అసుర గుణములు)*

**భావము :** లోకమున దైవ అసుర అను రెండు రకముల జీవులు పుట్టుచున్నారు. దైవవిషయముల వాటి గుణముల గురించి చెప్పివున్నాను. అసురులను గూర్చి చెప్పెదను వినుము.

**వివరము :** దేవతలు, రాక్షసులు అను రెండు రకములవారు భూమిమీద ఉన్నారంటే నమ్మలేని విషయముగ ఉంటుంది. కాని భగవంతుడు చెప్పిన మాట నిజము. దేవతలనువారు ఎక్కడో పై లోకాలలో ఉన్నారని అనుకోవడము పొరపాటు, దేవతలు రాక్షసులు నిజముగ భూమిమీదనే ఉన్నారు. కొంత జ్ఞానమున్నవారు వీరిని భూమిమీదనే గుర్తించవచ్చును. ఈ రెండు జాతులు గుణములను బట్టి ఏర్పడుచున్నవి. ఇక్కడ 'ద్వౌ భూతసర్గౌ లోకేఽస్మిన్ దైవ అసుర ఏవచ' అనడములో లోకములకు నిలయమైన భూమి మీదనే దేవతలు, రాక్షసులు పుట్టుచున్నారని చెప్పడము బాగుగ గ్రహించవచ్చును.

దేవతలు ముప్పదిమూడు కోట్లు కలరని ప్రతీతి కలదు. వారెంత మందైనప్పటికి విష్ణు, ఈశ్వర, బ్రహ్మ మొదలుకొని చిన్న చిన్న దేవతల వరకు భూమి మీద విస్తరించి మనుషులరూపములో ఉన్నారు. ఇక్కడ కొందరికొక అనుమానము రావచ్చును. భూమిమీద దేవతలున్నట్లై కాదా! కనిపించలేదే! వారెక్కడ ఉన్నారు? వారెట్లున్నారు? అని అడుగవచ్చును. దానికి సమాధానము భగవంతుడు చెప్పినట్లు దేవతలు రాక్షసులు భూమి మీదనే కలరు. అయినప్పటికి వారిని మనము గుర్తించలేక పోవుచున్నాము. అలా ఎదుటి వారిని గుర్తించుటకు కొంతైనా జ్ఞానదృష్టి అవసరము. ఎదుటి వారిని గుర్తించలేక పోవడమే కాక మానవులలో దేవతలైనవారు వారిని వారు కూడ గుర్తించలేరు. ఎదుటి వారిని గుర్తుంచుటకు అవకాశమున్నది కాని ఎవరిని వారు గుర్తించుటకు అవకాశములేదు. ఎదుటి వారు దేవతలని గుర్తించుటకు జ్ఞానదృష్టి అవసరమన్నాము కదా! అలాంటి దృష్ఠిలేని వారికి అందరు మనుషులుగానే కనిపించుచుందురు. మనుషులలో గల తారతమ్యములు తెలియవు. చిన్న చిన్న దేవతలు మొదలుకొని విష్ణువు వరకు గల దేవతా వ్యత్యాసములు మానవులలోనే కలవు.

జ్ఞానశక్తి ఉన్నవారంత దేవతలేనని చెప్పవచ్చును. వారి వారి జ్ఞానశక్తిని బట్టి దేవతలందు వ్యత్యాసములు కలవు. అత్యధిక జ్ఞానశక్తివున్న వాడు విష్ణువు. అతనికంటే కొంత తక్కువ కలవాడు రుద్రుడు. తరువాత బ్రహ్మ అలాగే జ్ఞానశక్తి తగ్గుకొలది వారిలో వ్యత్యాసములుండి ఆయా దేవతలుగ చెప్పబడుచున్నారు. దీనిని బట్టి జ్ఞానశక్తి ఉన్నవారంతా దేవతలని, జ్ఞానశక్తిలేని వారంతా రాక్షసులని చెప్పవచ్చును.

దేవతలైన విష్ణు, ఈశ్వర, బ్రహ్మ మొదలగువారు ఈ కలియుగములో ఉన్నారా? విశేషమైన జ్ఞానశక్తి ఉన్న విష్ణు, ఈశ్వర, బ్రహ్మ మొదలగువారు పరమాత్మయందైక్యము చెందక కలియుగములో కూడా ఉన్నారా? వారికి ముక్తి రాలేదా? వారు కూడ అందరి మాదిరి జన్మ ఎత్తుచునే ఉన్నారా? అను ప్రశ్నలు అందరికి రావచ్చును. దానికి సమాధానమేమనగా!

దేశములో రాజు, యువరాజు, ప్రధానమంత్రి, మంత్రి అను ఎన్నియో లెక్కలేనన్ని పదవులున్నవి కదా! ఆ పదవులు మొదటినుండి ఉన్నప్పటికి ఒక పదవిలో ఒకే మనిషి ఎప్పటికి లేడు. దేశానికి రాజు పదవి శాశ్వతమైనది. అయినప్పటికి రాజు మాత్రము శాశ్వతము కాదు. ఒకే రాజ్యానికి రాజుగ ఎంతో మంది మారివుండుట మనకు తెలిసిన విషయమే. అంత దూరమెందుకు ఇప్పుడున్న ప్రధాని పదవిలో ఎంతో మంది ప్రధానులుగ ఉండి మారిపోవుట చూచుచూనే ఉన్నాము కదా! ఎంతమంది ప్రధానులు మారినా ప్రధానమంత్రి పదవి మాత్రము అలాగే శాశ్వతముగ ఉన్నది కదా! అలాగే భూమిమీద విష్ణు, ఈశ్వర, బ్రహ్మ అను మొదలగు దేవతా పదవులు కలవు. ఈ పదవులకు అర్హత పొందిన జీవులు నిర్ణయించబడుచున్నారు. అలాగే ఒకే జీవుడు శాశ్వతముగ ఒక పదవికి అర్హుడుగ లేడు. అతను కొంత కాలముండగ, మరియొకడు కొంత కాలము అర్హత పొందుచున్నాడు. ఒక జీవుడు ప్రపంచమంతటిలోను జ్ఞానశక్తి (యోగాగ్ని)లో మొదటివాడైనాడనుకొనుము. యోగశక్తిలో మొదటివాడైన దానివలన అన్నిటికంటే పెద్ద దేవతా పదవియైన విష్ణు పదవికి అర్హత పొంది ఉండును. అప్పుడు ఆ జీవుడు స్త్రీ పురుషులలో ఏ శరీరము ధరించి ఉన్నప్పటికి అతడే విష్ణువు. అటువంటి వాడు కొద్దిపాటి కర్మతో పుట్టివుండును. ఆ జన్మలో పూర్తి జ్ఞానాగ్నిని సంపాదించుకొని, ఉన్న కొద్దిపాటి కర్మను కూడ లేకుండ చేసుకొని, ఆ జన్మలోనే మోక్షము పొందును. అప్పుడు తిరిగి ఆ పదవికి భూమి మీద ఎవడో ఒకడు జ్ఞానశక్తిలో అధికుడు అర్హత పొంది విష్ణువగును. ఈ విధముగ దేవతల పదవులు ఖాళీ ఏర్పడుచూనే ఉండును. తరువాత వాటికి ఇతరులు అర్హులగుచూనే ఉందురు. భూమిమీద జీవులే వారి వారి జ్ఞానశక్తిని బట్టి దేవతల యొక్క అర్హతలు పొందివున్నారని తెలియుచున్నది. విష్ణు, ఈశ్వర, బ్రహ్మలు కూడ భూమిమీద మనుషులేనని తెలియుచున్నది. అట్లు శరీరధారులైన దేవతలు యోగమాచరించి కర్మలేకుండ చేసుకొని మోక్షము పొందుచున్నారు. పెద్ద పెద్ద దేవతలు భూమి మీద ఉన్నప్పటికి, మాయా ప్రాబల్యము వలన వారెవరైనది వారికే తెలియదు. దేవతలైన వారు గురువులుగ, జ్ఞానులుగ,

యోగులుగ, భక్తిపరులుగ, సన్న్యాసులుగ ఎందరో ఉండగ, వారికి విరుద్ధముగ ఎందరో రాక్షసులు కూడ భూమిమీదే మనుష్యుల రూపములో ఉన్నారు.

జ్ఞానము కల్గిన వారికి విరుద్ధముగ ఉండు వారంత రాక్షసులే, వీరియందు జ్ఞానముకాని, జ్ఞానశక్తికాని ఏమాత్రముండదు. పరమాత్మ విషయములు వీరికి వ్యతిరేఖముగా ఉండును. ముఖ్యముగ తామసభక్తి గల రాక్షసులు తామే నిజమైన భక్తులమనుకొనుట కూడ కలదు. ఇంకనూ వారెట్లున్నారనగా క్రింది శ్లోకములు చూచెదము.

(15) శ్లో॥ 7 : ప్రవృత్తిం చ నివృత్తిం చ జనా న విదు రాసురాః ।
న శౌచం నాపి చాఽఽచారో న సత్యం తేషు విద్యతే ॥
(హేతువాద అసురగుణము)

**భావము :** అసురులైన వారు మనిషి యొక్క పుట్టుకనుగాని, మరణముగాని తెలుసుకోలేరు. వారివద్ద శుచిత్వముగాని, ఆచారముగాని, సత్యముగాని ఉండదు.

**వివరము :** భూమి మీద దేవతలు, రాక్షసులు అను రెండు రకముల మనుషులు గలరని ఆరవ శ్లోకములో చెప్పిన భగవంతుడు, ఈ శ్లోకమునుండి అనేక విధములుగ ఉన్న రాక్షసులను గురించి చెప్పను మొదలు పెట్టాడు. ఇప్పుడు ఏడవ శ్లోకములో హేతువాదులను గురించి చెప్పి, ఎనిమిదవ శ్లోకములో నాస్తికవాదులను గురించి చెప్పి, తొమ్మిదవ శ్లోకమున హేతువాదులను, నాస్తికవాదులను కలిపి ఇరువర్గము వారిని గురించి చెప్పాడు. ఈ శ్లోకములో ప్రత్యేకించి హేతువాదులను గురించి చెప్పాడు, కావున హేతువాదులను భూమిమీదున్న అసురులుగానే లెక్కించుకోవలెను. అసురులైన హేతువాదులు మనుషుల యొక్క పుట్టుకనుగాని, మరణముగాని ఏమాత్రము తెలియరన్నాడు. అంతేకాక శుచిత్వమన్నది, ఆచారమన్నది, సత్యమన్నది వారియందు లేదని, అది ఏమిటో వారికి తెలియదన్నాడు. ఈ మాట వింటూనే చాలామందికి కొన్ని ప్రశ్నలు వెంటనే రాగలవు. హేతువాదులు భూమి మీద

ఎందరో ఉన్నారు. ఆస్తికులకంటే హేతువాదులు చాలా తెలివైన వారుగ కనిపిస్తున్నారు. మనిషి పుట్టడము, చావడము వారికి తెలియకుండ పోవడమేమిటి? ఎందరో ఎం.డి డాక్టర్లు, ఎమ్.బి.బి.యస్ డాక్టర్లు హేతువాదులుగ ఉన్నారు. వారికి మనుషుల పుట్టుక, చావులు తెలియవా? ఈ మాట నమ్మదగినదేనా? ఎంతో శుభ్రముగ ఉన్న వారికి శుభ్రతలేదనడము అసత్యము కాదా? ఎందరో హేతువాదమును ముఖ్యవాదముగ పెట్టుకొన్నవారు సత్య నిర్ధారణయని, సత్యాన్వేషణయని, సత్యప్రచారమని, సత్యశోధనయని, సత్యమను పేరుతో సమాజమునకు సత్యమును తెలుపుచున్నామనుచుండగ వారివద్ద సత్యములేదని, వారికి సత్యము తెలియదనడము సమంజసమైన మాటనా? హేతువాదమునకు ఒక పద్ధతిని ఏర్పరుచుకొని దాని ప్రకారమే చివరి వరకు క్రమము తప్పకుండ ఆచరించు వారివద్ద ఆచారము లేదను గీతమాట సత్యమెట్లగును? ఇన్ని ప్రశ్నలు ఉద్భవించి, ఈ శ్లోకములో నిజములేనట్లు అనిపించుచున్నది. అయినప్పటికి లోతుగ చూస్తే అన్ని ప్రశ్నలకు జవాబు దొరికి శ్లోకములోని అసలైన సత్యము తెలియుచున్నది.

మానవ సమాజములో ఎందరో ఎన్నో పనులుచేసి బ్రతుకుచున్నారు. ప్రతి పనిలోను దానికి సంబంధించిన విజ్ఞత, చేయవలసిన పద్ధతి, పనిమీద ఆసక్తి, పని విలువ అన్ని తెలిసే చేయుచుందురు. అందరు బ్రతికే ఉద్ధేశ్యముతోనే పని చేయుచున్నారు. అయినప్పటికి కొందరు చేయు పనులు చట్ట సమ్మతమైనవిగ, కొందరు చేయు పనులు చట్ట విరుద్ధముగ ఉండును. దొంగపనిచేయువానికి ఆ పనిలో నైపుణ్యత, చేయవలసిన పద్ధతి, చేయడములో ఆసక్తి అన్నియుండును. అట్లే కూలి పని చేయడానికి కూడ క్రమశిక్షణ, నైపుణ్యత, ఒక పద్ధతి, పనిలో ఆసక్తి అన్ని ఉండును. ఇద్దరి ఉద్ధేశ్యము డబ్బు కొరకే అయినప్పటికి ప్రభుత్వ దృష్టిలో దొంగపని చట్ట విరుద్ధముగ, కూలిపని చట్ట సమ్మతముగ ఎట్లున్నదో, అట్లే భూమిమీద అందరికి కనిపించని చట్టమొకటున్నది. ఆ చట్టములో కొందరు ధర్మవిరుద్ధులుగ, కొందరు ధర్మసమ్మతులుగ ఉన్నారు. బయటి ప్రభుత్వ చట్టములో శిక్షలున్నట్లు, లోపలి ప్రభుత్వము యొక్క ధర్మమను చట్టములో కూడ శిక్షలు గలవు.

కూలి పని చేసేవానికంటే ఎక్కువ శ్రద్ధతో, క్రమశిక్షణతో, పద్ధతిగ నైపుణ్యముతో బ్రతుకు తెరువుకని దొంగపని చేస్తే, వానికంటే వీడు బాగా చేశాడని ప్రభుత్వము యొక్క చట్టము ఒప్పుకోదు కదా! అట్లే ఆత్మవాదులకంటే హేతువాదులు సమాజ శ్రేయస్సుకొరకని విజ్ఞానముతో, క్రమశిక్షణతో, పద్ధతి ప్రకారము ఆచరించిన వానికంటే వీడు బాగా చేశాడని దేవుని యొక్క ధర్మము ఒప్పుకోదు. అందరు బ్రతుకుతెరువుకే పనులు చేస్తున్నా వానిపనిని బట్టి కొందరిని మర్యాదస్థులని, కొందరిని నేరస్థులని న్యాయశాస్త్రము ఎట్లు చెప్పగలుగుచున్నదో అలాగే ఆత్మవాదులు, హేతువాదులు సమాజశ్రేయస్సుకే పని చెస్తామనుచున్నా వారి పనినిబట్టి కొందరిని సురులని, కొందరిని అసురులని గీతాశాస్త్రము చెప్పగలుగుచున్నది.

తీవ్రవాదులు గవర్నమెంటును, చట్టమును ఒప్పుకోరు. తాము చేయుచున్న తీవ్రవాదము సరియైనదే అనుచుందురు. మా పనిలో ప్రాణమును సహితము లెక్కచేయకుండ క్రమశిక్షణగా మా సిద్ధాంతములకు అనుగుణముగ నడుచుకొను చున్నామనుచుండినప్పటికి గవర్నమెంటు వారి సిద్ధాంతములను వారి క్రమశిక్షణను ఒప్పుకోక తప్పుగ లెక్కించి తీవ్రవాదము చట్టవిరుద్ధమని చెప్పుచున్నది. అలాగే తీవ్రవాదులు గవర్నమెంటును ఒప్పుకోనట్లు, హేతువాదులు దేవున్ని, ధర్మమును ఒప్పుకోరు. తాము అనుసరిస్తున్న హేతువాదము సరియైనదని అనుచుందురు. వారు వారి సిద్ధాంతములకు అనుగుణముగ నడుచుకొనుచుండిన, వారి విధానములో సత్యముగ ఉండిన, చక్కని ఆచరణకల్గియుండిన దేవుడు వారి సిద్ధాంతములను, వారి సత్యమును, వారి విధానమును ధర్మవిరుద్ధమని చెప్పుచున్నాడు.

ఇపుడు అసలు విషయానికొస్తాము. ఈ శ్లోకములో మనిషి యొక్క పుట్టుక, చావు రెండు తెలియవన్నాడు కదా! అది నిజమా అని ప్రశ్నవచ్చినది కదా! దానికి జవాబు చూస్తాము. ఒక సజీవ శరీరము ప్రపంచములోని ఐదు విషయ జ్ఞానములను, ఐదు ఇంద్రియముల చేత తెలుసుకోగల్గుచున్నది. పరిమితమైన జ్ఞానమును తెలుసుకొనునది పరిమిత అవయవమని గుర్తించి వాటికి కన్ను, చెవి, ముక్కు,

నాలుక, చర్మము అని పేరు పెట్టుకొన్నాము. వీటి వలన దృశ్యము, శబ్దము, వాసన, రుచి, స్పర్శ తెలియుచున్నవి. ఈ ఐదు విషయములు తప్ప ఇతరము ఏమి ఎవరికి తెలియదు. ఒక సాధారణ అమాయకునికైనగాని, శాస్త్రవేత్తయిన విజ్ఞానికి గాని ఐదు జ్ఞానములే తెలియును. ఐదు ఇంద్రియములకు తెలియనిది ఏదైనవుంటే అది ఇంద్రియాతీతమైనదని, ఇంద్రియాలకు అగోచరమైనదని చెప్పవచ్చును. ఉదాహరణకు రెండు ఇనుప ముక్కలను తీసుకొని చూస్తే వాటి ఆకారము, వాటి రంగు అన్ని ఒకలాగునే ఉన్నవి. ఆ రెండిటిలో ఒకటి అయస్కాంతమున్నది. దానిని ఏమాత్రము గుర్తించలేకపోయాము. దాని అయస్కాంతశక్తి కంటికిగాని, చెవికిగాని, స్పర్శకుగాని, రుచికిగాని, వాసనకుగాని తెలియకున్నది. కనిపించని అయస్కాంతశక్తిని వేరే విధానము ద్వార తెలుసుకోవచ్చును. అపుడది అయస్కాంతమని తెలియును. ఆ విధానము లేకుండ ఇంద్రియాలకు అయస్కాంతశక్తి తెలియలేదు, కావున దానిని ఇంద్రియాతీతశక్తి అని అనవచ్చును. లేకపోతే ఇంద్రియాగోచరశక్తి అనవచ్చును. ఇలాంటివి ప్రపంచములో ఎన్నో ఇంద్రియాలకు తెలియనివి గలవు. వాటిని ప్రత్యక్షముగకాక పరోక్షముగ తెలుసుకోవచ్చును. పరోక్షముగ తెలియుటకు ఏదో ఒక విధానము అవసరము. ఆ విధానమునే ప్రయోగము అంటున్నాము. కాని అన్నియు ప్రయోగాల ద్వార తెలియవని ముఖ్యముగ గుర్తుంచుకోవలెను. అటువంటి వాటిని ఎలా తెలుసుకోవాలనిన, కేవలము యోగాల ద్వార మాత్రమే తెలియవచ్చును. ఐదు ఇంద్రియములకు తెలియని వాటిని ప్రయోగాల ద్వార కాని, యోగాల ద్వార కాని తెలియవచ్చును.

ప్రయోగానికి, యోగానికి ఏమి తేడాగలదని కొందరడుగవచ్చును. దానికి జవాబు, **జ్ఞానేంద్రియములకు తెలియని దానిని తెలుసుకొనుటకు కర్మేంద్రియముల సహాయముతో చేయు కార్యమును ప్రయోగము అంటున్నాము.** ప్రయోగములో మనిషిలోని జ్ఞానకర్మేంద్రియములు పది పనిచేయుచున్నవి. కనిపించే ఇంద్రియాలతో కనిపించని దానిని తెలుసుకొనుటకు చేయు పనినే ప్రయోగము అనుచున్నాము. ప్రయోగముతో కనిపించని అయస్కాంత శక్తిని, దాని సాంద్రతను, దాని ఆవరణ

క్షేత్రమును తెలుసుకోవచ్చును. ప్రయోగాన్నిబట్టి పరికరాలు కూడ అవసరమే. ఉదాహరణకు ఐదు ఇంద్రియాలకు తెలియని సూక్ష్మక్రిములను మైక్రోస్కోప్ ద్వార చూడగల్గుచున్నాము. ఇక యోగము యొక్క విషయానికి వస్తే ఇంద్రియాలకు తెలియని దానిని తెలుసుకోవచ్చును. కాని ఇక్కడ యోగమును శరీరమునకున్న కర్మేంద్రియ జ్ఞానేంద్రియములతో పనిలేకుండ చేయవలసియుండును. ప్రయోగములో ప్రకృతికి సంబంధించియుండి, ఇంద్రియాలకు అతీతముగనున్న దేనినైన తెలుసుకోవచ్చును. పంచభూతములకు సంబంధములేకుండ ఉన్నదానిని ప్రయోగము ద్వార తెలుసుకొనుటకు వీలులేదు. **పంచభూతములకు సంబంధము లేకుండ మొత్తము ప్రకృతికి అతీతమైన దానిని యోగము ద్వార మాత్రమే తెలుసుకొనుటకు వీలగును.** సర్వజగత్తులో పంచభూతములకు అతీతమైనవి మూడే కలవు. 1) జీవాత్మ 2) ఆత్మ 3) పరమాత్మ. ఈ మూడు ఎటువంటి ప్రయోగాలకు అందునవికావు. ఇంతవరకు ప్రపంచములో ఎందరో శాస్త్రజ్ఞులు ఎన్నో ప్రయోగాలు చేసి కనుగొన్నవన్ని ప్రకృతికి సంబంధించినవేనని తెలియవలెను. భౌతికశాస్త్రము తెలిసిన డాక్టర్లకు భౌతిక శరీరము యొక్క అంతర్ భాగములు, వాటి రోగములు, వాటి నివారణ విధానములు తెలుసియుందురు. **గుండెను తెరిచి చూచిన డాక్టర్లుగాని, మెదడును శస్త్రచికిత్స ద్వార చూచినవారుగాని, శరీరములోని జీవున్నిగాని, శరీరమంత ఉన్న ఆత్మనుగాని చూడలేదు. ఎందుకనగా వీరు చేసినది ప్రయోగమేకాని యోగము కాదు, కనుక ప్రకృతికి అతీతమైన ఆత్మ తెలియలేదు.** కోసి లోపల చూచినపుడే తెలియని ఆత్మ, పుట్టినపుడుగాని, చనిపోయినపుడుగాని పైన మాత్రమే చూచువారికి జీవాత్మ యొక్క పుట్టుకగాని, చావుగాని ఎట్లు తెలియును. చాలామంది హేతువాదులు ప్రాణమును జీవుడు అని అనుకొన్నారు. జీవుడు వేరు, ప్రాణము వేరని తెలియనిది జీవుని యొక్క ప్రవృత్తి అనగ పుట్టుకను గూర్చిగాని, నివృత్తిని గూర్చిగాని ఎలా తెలియగలరు. అందువలన ఈ శ్లోకములో చావు, పుట్టుకలు తెలియనివారని చెప్పడము జరిగినది.

శౌచము అనగా శుభ్రత అని అర్థము. ఇక్కడ శుభ్రత నీకా, నీ శరీరమునకా అని యోచించవలెను. శరీరశుభ్రత అందరు కలిగివుందురు. కాని శరీరము లోపలనున్న వాడు మాత్రము శుభ్రముగ ఉండడములేదు. అందువలన చెడుగుణముల మలినము అంటుకొన్నవానిని శుచిత్వములేని వాడన్నారు. అలాగే శరీర లోపలి సత్యము తెలియని వాడు, బయట సత్యము అను పేరుతో ఎన్ని బోర్డులు పెట్టుకొనిన, వాడు సత్యము తెలియనివాడేనని చెప్పాలి. అలాగే శరీరములో నివశించువాడు ఎవడైన లోపలి తన ఆచారమేమి అని తెలియకపోతే వాడు ఆచారములేనివాడేనని చెప్పాలి. జీవుడు శరీరములోనికి వచ్చునది, పోవునది తెలియని వాడు, గుణముల మలినము కలవాడు, లోపలి సత్యమును, ఆచారమును తెలియనివాడు, బయటి ప్రపంచములో దేశమునకు రాజయినప్పటికి వాడు అసురుడేనని చెప్పాలి.

(15) శ్లో॥ 8 : అసత్య మప్రతిష్ఠం తే జగ దాహు రనీశ్వరమ్ ।
అపరస్పర సమ్భూతం కి మన్యత్కామహైతుకమ్ ॥
(నాస్తికవాద అసురగుణము)

**భావము :** దేవుడు అనేవాడు లేడు అనియు, దేవునిచేత జగత్తు సృష్ఠింపబడినదనుట అసత్యమనియు, స్త్రీ పురుషుల పరస్పర సంబంధము వలననే జీవరాసులు పుట్టుచున్నవని, స్త్రీ పురుష సంబంధమునకు కామము తప్ప వేరే ఏముంది అనుచున్నారు.

**వివరము :** భూమి మీద నాలుగు విధముల మనుషులు గలరని చెప్పవచ్చును. నాస్తికులు-దేవుడు లేడనువారు. హేతువాదులు-దేవుడు ఉంటే ఎట్లున్నాడని ప్రశ్నించువారు. ఆస్తికులు-దేవుడున్నాడని చెప్పుచు, దేవున్ని వదలి దేవుడుకాని వారిని ఆరాధించువారు. ఆత్మవాదులు-వీరు కేవలము ఆత్మల గురించే మాట్లాడుదురు. నాస్తికులకు ఆస్తికులు ఎంత వ్యతిరేఖమో అట్లే హేతువాదులకు, ఆత్మవాదులకు అంతే విరుద్ధ భావములుండును. వెనుకటి ఏడవ శ్లోకములో

ఆత్మవాదులకు విరుద్ధవాదులైన హేతువాదులను గురించి చెప్పుకొన్నాము. ఇక్కడ ఈ శ్లోకములో నాస్తికవాదులను గురించి చెప్పుకోవలసియున్నది.

భూమిమీద హత్యచేయు హంతకుడు, మానభంగము చేయు హత్యాచారకుడు వారి మనోభావములలో ఎంత దగ్గరివారో అలాగే నాస్తికవాది, హేతువాది దగ్గరి భావములున్నవారు. ఒకడు పాము లేదు అంటే, మరొకడు ఉంటే చెప్పు లేకుండ చేస్తానంటాడు. ఇక ఆస్తికవాది, ఆత్మవాదుల విషయమును చూస్తే వీరు కూడ దగ్గర సంబంధమున్నవారే. ఆస్తికవాది ఇదిగో పాము అంటే, ఆత్మవాది అది విషముండేపామో కాదో చూడు అంటాడు. ఆస్తికుడు పాముంది అంటే, నాస్తికుడు అసలు పామేలేదు అంటాడు. విషముండే దానినే నిజమైన పామనాలి అని ఆత్మవాది అంటే, ఏ పామున్నాదనిన లేకుండా చేస్తానంటాడు హేతువాది. ఈ విధముగ విభిన్న భావములు కలవారుగ నాస్తిక, ఆస్తిక, హేతువాద, ఆత్మవాదులున్నారు. నాస్తికుడు ఆస్తికున్ని మూఢనమ్మకము కలవాడని మూఢుడని అంటాడు. ఆస్తికుడు నాస్తికున్ని మూర్ఖభావము కలవాడని మూర్ఖుడు అంటాడు. అలాగే హేతువాది ఆత్మవాదిని భావవాది అంటాడు. ఆత్మవాది హేతువాదిని మొండివాది అంటాడు. భగవద్గీతలో శ్రీకృష్ణుడు నాలుగురకముల వారిని గూర్చి చెప్పాడు. గీతలో ఎక్కువ ఆత్మవాదమును గురించి చెప్పి, దానికంటే తక్కువ ఆస్తికత్వమును చెప్పాడు. చాలాకొద్దిగ హేతువాదమును, నాస్తికవాదమును గురించి చెప్పాడు. ఇక్కడ నాస్తికవాదమును గురించి చెప్పుచు, నాస్తికులు దేవుడు లేడని విశ్వమును సృష్ఠించాడనుట పూర్తి అసత్యమని అంటారన్నాడు.

మనకు తెలిసిన విధానమును చెప్పుకుంటే, ఒక ఊరిలో రంగయ్య, మల్లయ్య అనబడు ఇద్దరు మగపిల్లలకు వారి పెద్దలు ఏడు సంవత్సరముల చిన్న వయస్సులోనే పెళ్లి చేశారు. యుక్త వయస్సు వచ్చిన తర్వాత కాపురానికి పంపవచ్చని ఆడపిల్లలను పుట్టింటివాళ్లు వారి ఇంటిలోనే పెట్టుకొన్నారు. యుక్తవయస్సు వచ్చేంతవరకు ఒకరునొకరు చూచుకోలేదు. మగపిల్లలకు 22 సంవత్సరముల వయస్సు వచ్చిన తర్వాత ఆడ పిల్లలను కాపురానికి పంపాలనుకొన్నారు. మగపిల్లలకు యుక్తవయస్సు

వచ్చింది. అప్పుడే వారిద్దరికి ఒక జబ్బు కూడ వచ్చింది. ఆ మాయదారి జబ్బు వలన రంగయ్యకు పూర్తి జ్ఞాపకశక్తి పోయింది. మల్లయ్యకు పూర్తి జ్ఞాపకము పోకుండ కొంతమాత్రము మిగిలింది, అయిన చూపు కొంత పోయింది. ఆ చూపు ఉన్నా ఎదురుగ ఉన్నది ఉన్నట్లు కనిపించదు. వేరుగ కనిపిస్తుంది. ఎలాగైతేనేమి చిన్నపుడే పెళ్లి అయింది కావున ఆడపిల్లలను భర్తల ఇంటికి పంపాలని వారి పెద్దలనుకొన్నారు. ఒక మంచి దినము చూచుకొని, ఆడపిల్లలను భర్తల ఇంటికి పిలుచుకొని వచ్చారు. ముందు రంగయ్య దగ్గరకు పోయి, ఇదిగో నీ భార్యను పిలుచుకొని వచ్చామని అన్నారట. రంగయ్యకు పూర్తి జ్ఞాపకము పోయింది. కావున నాకు పెళ్లే కాలేదు, నాకు భార్యే లేదన్నాడట. ఎంత చెప్పిన రంగయ్య వినడములేదు. అసలుకు నాకు భార్యేలేదు, ఎప్పుడూ పెళ్లి కాలేదు, మీరెంత చెప్పిన వినను, నన్ను ఒప్పించలేరు అన్నాడు. రంగయ్యకు కొద్దిగైన జ్ఞాపకముంటే ఎలాగో ఒకలాగ చెప్పేవారు. ఏమాత్రము జ్ఞాపకములేక నాకు భార్యే లేదనువానిని ఏమి అనలేక వెనుతిరిగి పోయారు. ఇక మల్లయ్య దగ్గరకు పోయారు. నీ భార్యను తెచ్చామని చెప్పారు. మల్లయ్యకు పూర్తి జ్ఞప్తి పోలేదు, కనుక నా భార్యను చూపమన్నాడు. అలాగే వారి పెద్దలు అతని భార్యను చూపారు. భార్యను చూచిన మల్లయ్యకు చూపు సరిగ లేనిదానివలన అతని భార్య ఒక గాడిద మాదిరి కనిపించింది. అతనికి ఉన్నదున్నట్లు కనిపించదు కదా! అపుడు మల్లయ్య నా భార్యను చూపుతామని గాడిదను చూపుతారే అన్నాడట. ఆ మాటకు ఆశ్చర్యపోయిన పెద్దలు అతని ఒప్పించడానికి మంచి నగలు పెట్టి, మంచి గుడ్డలు కట్టి తీసుకవచ్చి చూపారట. అపుడతనికి ఎలుగుబంటి మాదిరిగా కనిపించిందట. నాకు ఎలుగుబంటిని చూపుతున్నారే అని మల్లయ్య అనగా, వారి పెద్దలకు ఏమని చెప్పాలో అర్థముకాక, ఏ దుస్తులలో చూపిస్తే బాగుంటుదని ఆలోచించి పంజాబిడ్రస్‌లో చూపించారట. ఈ మారు మల్లయ్య నిఘాగ చూసి గుర్రాన్ని తెచ్చారే అన్నాడు. అతని భార్యను భార్యగ ఒప్పించడానికి నానాతంటాలుపడి, చివరకు ఒక ఆలోచన ప్రకారము మల్లయ్యను భార్య దగ్గరకు పిలుచుకొని వచ్చి చేతితో తాకించి

చూపించారట. ఇన్ని పనులు చేసిన తర్వాత మల్లయ్యకు ఆమె తన భార్యేనని అర్థమైనది. అయినప్పటికి ఇంతవరకు గాడిద, గుర్రము అని ఇపుడు ఒప్పుకుంటే బాగుండదనుకున్నాడు. ఈ మారు ఈమె నా భార్యే కాదన్నాడు. తనకు సరిగా కనిపించదు, కావున ఎక్కడ మోసము చేస్తారో అనుకొని ఎప్పుడు చూపిన, ఎట్లు చూపిన ఆమె తన భార్య కాదనడమె పనిగ పెట్టుకొన్నాడు. ఈ విధముగ జ్ఞాపకము లేని రంగయ్య భార్యే లేదని అంటే, కొంత చూపున్న మల్లయ్యకు భార్యను చూపినా అర్థముకానప్పుడు ఒప్పుకోని అతను అర్థమైనప్పటికి కాదనుటకు అలవాటుపడినాడు. ఇట్లు రంగయ్యలాంటి నాస్తికుడు అసలు దేవుడే లేడంటే, మల్లయ్యలాంటి హేతువాది అర్థమైన ఒప్పుకోడు.

ఏది చెప్పిన కాదను హేతువాదులకంటే మొదటనే అసలు దేవుడేలేడను నాస్తికుడే నయమనుకొంటాము. ఎట్లు చెప్పిన కళ్లులేని గ్రుడ్డివాడొకడైతే, కళ్లున్న గ్రుడ్డివాడు మరొకడన్నట్లు నాస్తికులు, హేతువాదులు ఇద్దరు దేవుడు లేడని వాధించువారే. ఒక కార్యము జరగాలంటే ఒక కర్తకావాలి అను సూత్రము ప్రకారము, ఇంత పెద్ద విశ్వము సృష్ఠించబడినదంటే దానివెనుకల ఒక సృష్ఠికర్త ఉండి తీరాలి. కార్యమును, కర్తను తెలుసుకొని ప్రపంచ సృష్ఠికి కూడ ఒక కర్త ఉన్నాడని చాలామంది ఒప్పుకొనుచుండగ మేము సైన్సు చదివాము, మాకు ఆధారము కనిపించలేదు, మేము చూడనిదే విశ్వసించము, మేము శాస్త్రజ్ఞులము అని పావలా బేడ శాస్త్రజ్ఞులు అనుచుండగ పెద్ద శాస్త్రవేత్తలు విశ్వమును నడిపించే శక్తి ఒకటుంది, అదియే దేవుడని అంటున్నారు. అబ్దుల్‌కలామ్ పెద్ద శాస్త్రవేత్తయిన ఆయనకు దేవుని మీద మంచి అభిప్రాయము కలదు, మిగతవారికెందుకు లేదో? ఎవరు ఏ అభిప్రాయములో ఉండిన మనము తెలుసుకోవలసింది, తెలియనిది ఒకటుంది. దానిని తెలుసుకొనుటకు ఒక విధానము కూడ కలదు. భౌతిక శరీరములో అభౌతికముగనున్న దానిని తెలుసుకొనుటకు పరికరములు, ప్రయోగాలు పనికిరావు. భౌతిక శరీరములో అభౌతికముగనున్న దానిని అభౌతిక విధానమైన జ్ఞానముతోనే తెలుసుకోవాలి. అట్లుకాక ఎన్నాల్లు వాధించిన జన్మవృథా అగును తప్ప సాధించినదేమి ఉండదు.

(15) శ్లో॥ 9 : ఏతాం దృష్టి మవష్టభ్య నష్టాత్మానోஉల్పబుద్ధయః ।
ప్రభవన్త్యుగ్రకర్మాణః క్షయాయ జగతోஉహితాః ॥
(హేతువాద, నాస్తిక అసురగుణము)

**భావము :** ఈ విధమైన భావము గలవారు అల్పబుద్ధిగలవారై, నష్టాత్ములై, క్షయమును పొందుచు, ఇతరులకు అహితులగుచు, భయంకరమైన కర్మను సంపాదించుకొన్నవారై తిరిగి పుట్టుచున్నారు.

**వివరము :** ఈ శ్లోకములో విశేషమైన పదము **ఉగ్రకర్మాణః** అన్నది. నాస్తికులకు, హేతువాదులకు కర్మసిద్ధాంతమంటే అసలు గిట్టదు. కర్మసిద్ధాంతము యొక్క రహస్యము వారికి తెలియదు. ఈ శ్లోకములో చెప్పుకోతగిన పదము మరొకటి కలదు. **నష్టాత్మనః** అను ఈ పదమును గురించి కూడ కొంత యోచించవలసియున్నది. ఆత్మ అంటేనే అసత్యమను వారిపట్ల నష్టాత్మ అను పదము ఉపయోగింపబడినది. ఒక రాజ్యములో ఉన్నవారందరికి ఆ రాజ్యాంగ చట్టము అమలు జరుపబడును. ఆ రాజ్యములోనున్న ఉగ్రవాదులు, తీవ్రవాదులు చట్టమును వ్యతిరేఖించిన, చట్టమును ఒప్పుకోకపోయిన అక్కడున్న చట్టమునే వారియెడల అమలు జరుపబడును. చట్టమును ఒప్పుకోనంతమాత్రమున ఆ చట్టమునకు అతీతులు కారు. దానితోనే శిక్షింపబడుదురు. ఆ విధముగనే దేవుని రాజ్యమనబడు శరీరములో ఉండి కూడ దేవుని ధర్మమును ఒప్పుకోనంత మాత్రమున ధర్మమునకు వారు అతీతులు కారు. దేవుని చట్టము ప్రకారము శరీరములోనే తగిన శిక్ష అనుభవించవలసి వస్తుంది. ఎవని శరీర రాజ్యములో వాని యొక్క కర్మ లెక్కించ బడుచుండును. అక్కడ వ్రాయబడిన ధర్మవ్యతిరేఖతకు తగిన శిక్ష శరీరములోనే అమలు జరుపబడును. బయట కోర్టులలో న్యాయవాదులున్నట్లు అక్కడ నీ తరుపున వాధించువారు ఎవరు ఉండరు. అక్కడ వాదనలు, సాక్షాలు ఉండవు. తప్పుచేసిన రోజే శిక్షకూడ వ్రాసిపెట్టబడి ఉండును. చేసిన తప్పుతోపాటు దానికి తగిన శిక్ష కూడ నిర్ణయించి వ్రాయబడి ఉండును.

తప్పుకు శిక్ష సహజమే అయినా ఇక్కడ అసురులైన హేతువాదులు, నాస్తిక వాదులు ఉగ్రకర్మను సంపాదించుకొనుట వలన నష్టాత్ములగుచున్నారు. మానసిక బాధలు, బాధ్యత బాధలు, దెబ్బల బాధలు మొదలగు బాధలను ఎన్ని అనుభవించిన అవి ఉగ్రకర్మలు కావు. శరీరములో ఆత్మశక్తి అందక కొన్ని అవయవములు పనిచేయక పోవడము భయంకర కర్మ అగును. శరీరమునకు శక్తినిచ్చునది ఆత్మ. ఆత్మను నష్టపోవడము అంటే శరీరములో శక్తిని నష్టపోవడమని అర్థము చేసుకోవలెను. ఆత్మశక్తి నష్ట పోయిన వానికి శరీరములో శక్తి అందక, శరీరము అనుకూలించక పోవడము అన్నిటికంటే పెద్ద నరకమగును. పూర్తి పరిశోధించకనే, పూర్తి అవగాహన కాక మునుపే, తాను స్వయముగ అనుభవిస్తున్న ఆత్మనే లేదనడము మహా పాపమగును. అందువలన శ్లోకములో ఉగ్రకర్మ అను పదమును వాడారు. అవయవములకు శక్తి అందకపోతే దానికి మించిన శిక్ష ఉండదు. ఊహించుకుంటేనే భయంకరముగ ఉండును. జీవితమే నరకయాతనై ఎటు తిరిగి అనుభవించవలసి వచ్చును. అంతేకాక తన చుట్టు ఉండువారికి హితములేనివారై పోవుట వలన వారికి ఒక జంతువువలె కనిపిస్తువుండును. శరీర క్షయము కల్గుచు ఒక్కొక్క అవయవము శరీరమునుండి వేరై పోవుచుండును. ఉగ్రవాదులను ప్రభుత్వము దేశ ద్రోహులుగ గ్రహించి వారికి కఠినశిక్ష అమలు చేసినట్లు, హేతువాదులను, నాస్తికవాదులను ఆత్మద్రోహులుగ లోపలి ఆత్మ గుర్తించి శరీరములోనే శిక్షను అమలు చేయును. ఇపుడు ఇష్టమొచ్చినట్లు మాట్లాడడము ఎందుకు? తర్వాత జన్మలలో ఆత్మనుండి ఎందుకు నష్టపోవాలి? బయట సమాజమును ఉద్ధరించుతానని నీ శరీరములోపల ఉండే సమాజమునకు చెడ్డకావద్దు. ముందు లోపలి సమాజమును తెలుసుకొని తర్వాత బయట సమాజము మీదికి దృష్టి పెట్టు, అదియే సరియైన పద్ధతి.

(15) శ్లో॥ 10: కామ మాశ్రిత్య దుష్పూరం దమ్భమానమదాన్వితాః ।
మోహా ద్గృహీత్వాఽసద్గ్రాహాన్ ప్రవర్తంతేఽశుచివ్రతాః ॥
(అసుర గుణము)

**భావము :** దంభ, మాన, మధ, గర్వయుతులైన రాక్షసులు తీరని కోర్కెలు కలవారై, మోహమున తమ తప్పులు గ్రహించనివారై, శాస్త్రీయతలేని పనులచే వ్రతములు ఆచరింతురు.

**వివరము :** రాక్షసాంశకలవారు కూడ వ్రతములు చేయుదురు. అది మిక్కిలి కోర్కెల నిమిత్తమై ఉండును. అంతేకాక తమ ఆడంబరమును చాటవలెనను ఉద్దేశ్యముతో గర్వముగ చేయునవియై ఉండును. ఎప్పుడు ఎవరికి పైసా ఇవ్వని వారు, తన గొప్పదనమును బయటికి తెలియజేయుటకు, అనవసరమైన సందర్భములో ఎంతైన ఖర్చుపెట్టి వ్రతములు కూడ చేయుదురు. ఆ వ్రతములు తీరని అసాధారణ కోర్కెలై ఉండును. అటువంటి పూజలు ఈ కాలములో ఎందరో చేయుచున్నారు. దైవాంశ కలవారు చేయు పూజలు, రాక్షసాంశకలవారు చేయు పూజలలో కూడ ఎంతో తేడావుండును. అసురుల పూజలు కోర్కెల నిమిత్తమై ఉంటూ తమ గొప్పదనమును చాటునవై ఉండును.

*(15)శ్లో॥ 11 : చిన్తా మపరిమేయాం చ ప్రళయాన్తా ముపాశ్రితాః ।*
*కామోపభోగపరమా ఏతావ దితి నిశ్చితాః ॥*
*(అసుర గుణము)*

*(15)శ్లో॥ 12 : ఆశాపాశశతై ర్బద్ధాః కామక్రోధపరాయణాః ।*
*ఈహన్తే కామభోగార్థ మన్యాయే నార్థ సంచయాన్ ॥*
*(అసుర గుణము)*

**భావము :** మరణించువరకు బ్రతుకు తెరువు కొరకు పరిమితములేనట్టి చింత చేయువారై, కోర్కెల వలన కల్గు సుఖములే గొప్పవని మనస్సులో నిశ్చయము చేసుకొన్నవారై, ఆశయను పాశముచే అనేక విధముల బంధింపబడినవారై, కామక్రోధ పరవశులై, తమ కోర్కెలు నెరవేర్చుకొనుటకు అన్యాయమైన మార్గముల ద్వార ధనము సంపాదింతురు.

**వివరము :** అసురజనులకు మరణించు చివరి క్షణము వరకు కోర్కెలే ఉండును. మరు గంటలో చావు తప్పదని తెలిసినప్పటికి చేతనైతే ఆ గంట కూడ ఏదోఒకటి సంపాదించవలెనను కోర్కెయే ఉండును. ఎటూ నేను పోతున్నాను కదా! కోర్కెలతో నాకేమి పనియని అనుకోడు. అంతేకాక వారు తమ జీవితకాలములో కోర్కెలే దైవముకంటే పెద్దవని తలచినవారై, సంపాదనే మిగుల గొప్పకార్యమని తలపోసిన వారై, తమ బుద్ధినంతటిని సంపాదించుటయందే లగ్నము చేసివుందురు. డబ్బు కొరకు దేనినైన వదలుకొను స్వభావముగలవారు దైవమును కూడ లెక్కించరు. వారి మనస్సులో సంపాదించవలెనను కోర్కె తప్ప మరేమి ఉండదు. అటువంటి వారు నానా ఆశలను త్రాళ్లచే కట్టబడినవారై నాకు ఇల్లు కావలెనను కోర్కె, భూమి కావలెనను కోర్కె, బంగారు కావలెనను కోర్కె, ధనము ఎక్కువగ ఉండవలెనను కోర్కె ముఖ్యముగ ఉంటూ, వాటివెనుక అనేకమైన చిన్న చిన్న కోర్కెలుంటు, అవి నెరవేరుటకు అన్యాయమైన మార్గముల ద్వారా ధనమును సంపాదించుచుందురు. రాజకీయములోకాని, వ్యాపారములోకాని అన్యాయమార్గములో మిక్కిలిగ సంపాదించి నప్పటికి ఇక చాలునను తృప్తి ఉండక నానాటికి ఎక్కువగుచునే ఉండును. చివరకు చనిపోవునపుడు కూడ ఆ చింతలోనే చనిపోవుదురు.

(15) శ్లో॥ 13: ఇద మద్య మయా లబ్ధ మిమం ప్రాప్స్యే మనోరథమ్ ।
ఇద మ స్తీద మపి మే భవిష్యతి పున ర్ధనమ్ ॥
(అసుర గుణము)

**భావము :** ఈ ధనమిప్పుడు నాచే సంపాదించబడినది. మన కోర్కెలను బట్టి సంపాదించగలము. ఇప్పుడు సంపాదించిన ధనమంతయు నాది. మరల నేను ఎంతో ధనమును సంపాదించగలను.

**వివరము :** రాక్షసాంశకలవారు అన్యాయ మార్గమున సంపాదించుచుందురను కొన్నాము కదా! అలా సంపాదించిన దానిని చూచి నేను ఇంత ధనము సంపాదించానని మురిసి పోవుచుందురు. అంతేకాక మనమెట్లనుకొంటే అట్లు

సంపాదించగలమని ఇతరులకు కూడ చెప్పుచుందురు. నా తెలివితో నేనింత ఆస్తిని సంపాదించాను. ఇక ముందు కూడ సంపాదించగలనని చెప్పుచుందురు. నీతి నియమములకు న్యాయమునకు లోబడి సంపాదించలేని వానిని అసమర్థునిగ తాము సమర్థులుగ చెప్పుకొనుచుందురు.

*(15) శ్లో॥ 14 : అసౌ మయా హత శ్శత్రుః హనిష్యే చాపరా నపి ।*
*ఈశ్వరోఽహ మహం భోగీ సిద్ధోఽహం బలవాన్ సుఖీ ॥*
*(అసుర గుణము)*

*(15) శ్లో॥ 15: ఆఢ్యోఽభిజనవా నస్మి కోఽన్యోఽస్తి సదృశో మయా ।*
*యక్ష్యే దాస్యామి మోదిష్య ఇత్యజ్ఞానవిమోహితాః ॥*
*(అసుర గుణము)*

*(15) శ్లో॥ 16 : అనేక చిత్తవిభ్రాన్తా మోహజాలసమావృతాః ।*
*ప్రసక్తాః కామభోగేషు పత న్తి నరకేఽశుచౌ ॥*
*(అసుర గుణము)*

**భావము :** నేను శత్రువును చంపినాను. ఇతర శత్రువులను కూడా చంపగలను. నేనే ఈశ్వరుడను, భోగిని, సుఖిని, నేను సిద్ధుడను, నేను బలశాలిని, జనులలో మంచి కులమువాడను, భాగ్యవంతుడను, నాకు సమానులెవ్వరు లేరు, నేను యజ్ఞము చేయుదును, దానము చేతును, ఆనందపడెదనను అజ్ఞాన భ్రమచే మోహితులైనవారు, అనేక విధములగు చిత్తవిభ్రాంతి పరులు, మోహమను వలలో చిక్కి కోర్కెలను అనుభవించుటయందు ఆసక్తి గలవారై పాపమును సంపాదించుకొని నరకమును అనుభవించుటకు పోవుచున్నారు.

**వివరము :** అసుర భావములుగలవారు జ్ఞానమును ఏమాత్రము తెలియని వారగుట వలన వారికి కర్మయొక్క విధానము అసలు తెలియదు. ప్రతి పనికి కర్మ కారణమని దాని ప్రకారము మనుషులు నడుచుకోవలసి ఉన్నదని తెలియనివారై, ప్రతి పనికి తామే కారణమకొనుచున్నారు. అట్లనుకొనుట వలన శత్రువు తమ చేత చంపబడిన

దానికి కారణము నేనేనని, శత్రువును తన బలముచేతనే చంపగలిగానని అనుకొనును. కర్మచేత జరుగబడిన కార్యమని తలపోయడు. అలాగే కర్మ కారణమున ధనికుడయినట్లయితే తానే భోగిని సుఖవంతుడు బలశాలియని అనుకొనును. యజ్ఞ దానములను తానే చేయుచున్నానను భ్రమలోనే ఉండును. అటువంటి అహంకార యుక్తులు చేయుపనులలో కర్మ సంభవించి దానిని అనుభవించుటకు తిరిగి పుట్టుచుందురు.

*(15)శ్లో॥ 17 : ఆత్మ సమ్భావితాః స్తబ్ధా ధనమాన మదాన్వితాః ।*
*యజన్తే నామ యజ్ఞై స్తేదమ్భే నావిధిపూర్వకమ్ ॥*
*(అసుర గుణము)*

**భావము :** తమ్ము తాము పొగడుకొనుచు, తమ ప్రభావమే గొప్పదనుచు, ధన మాన మధములచే కూడిన వీరు, గర్వముతో అశాస్త్రీయపద్ధతిలో చేయు యజ్ఞమును నామకార్థయజ్ఞమనవచ్చును.

*(15)శ్లో॥ 18: అహంకారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః ।*
*మా మాత్మపర దేహేషు ప్రద్విషన్తోఽభ్యసూయకాః ॥*
*(అసుర గుణము)*

**భావము :** అట్టి అసుర జనులు అహంకారగ్నులై ఉండి, బలము గర్వము కామ క్రోధమును ఆశ్రయించిన వారై, తమ శరీరములందును, పర శరీరములందునున్న నన్ను అసూయతో ద్వేషించుచుందురు.

**వివరము :** అసుర జనులకు తమ శరీరములో ఉన్న దైవమే ఇతరుల శరీరములో కూడ ఉన్నదని తెలియదు. వాడు వేరు తాను వేరను భావములో పూర్తిగ ఉండి, తనకు కల్గిన వాటితో తనను పలానావాడనని తలచుకొనుచు అహంకారము కలవాడై, తనయందు మరియు ఇతరులయందుగల దైవమును కూడ అసూయతో ద్వేషించుచున్నాడు. ఆత్మజ్ఞానము పట్టనివారు వారు చేయు బాహ్యారాధనలను

గొప్పగ తలచుకొని, జ్ఞానము యోగము మొదలగు ఆత్మ విషయములను అసూయతో చూస్తు ద్వేషించుచుందురు. కోర్కెలతో కూడివుండి, కోర్కెలతో చేయు వ్రతక్రతువులనే గొప్పగా తలచుకొని, దైవికమైన ఆత్మ, పరమాత్మలను తెల్పు జ్ఞానులను, గురువులను ద్వేషించుటేకాక, వారికి చెడు చేయుటకు ప్రయత్నించుచుందురు.

(15) శ్లో॥ 19: తా నహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్।
క్షిపా మ్యజస్ర మశుభా నా సురీ ష్వేవ యోనిషు ॥
(జీవాత్మ, పరమాత్మ)

**భావము :** క్రూరులు, ద్వేషులు, శుభమును ధూషించు ఆ నరాధములను అసుర యోనులందే త్రోయబడి సంసార దుఃఖ గతులను పొందునట్లు నేనే చేయుచుందును.

**వివరము :** శరీరమందున్న ఆత్మ, పరమాత్మలను ధూషించువారు, జ్ఞానులను, గురువులను శత్రువులుగ చూచి బాధించువారు, క్రూరులు ద్వేషులు అయిన వారిని జన్మ జన్మలకు అసురులుగానే పరమాత్మ పుట్టించుచుండును. వారిని తిరిగి రాక్షసత్వము గల వారింటనే పుట్టించి అక్కడ సంసార విషయములందే మునిగి పోవునట్లు చేయును.

(15) శ్లో॥ 20 : ఆసురీం యోని మాపన్నా మూఢా జన్మని జన్మని ।
మా మప్రాప్యైవ కౌన్తేయ! తతో యాన్త్యధమాం గతిమ్ ॥
(జీవాత్మ, పరమాత్మ)

**భావము :** అట్లు అసుర యోనులందు జన్మించినట్టివారు జన్మ జన్మములకు అజ్ఞానులగుచు నన్ను పొందు జ్ఞానము యొక్క విధానమే తెలియలేరు. జన్మ జన్మకు అధమగతి పొందుచుందురు.

**వివరము :** అజ్ఞానమార్గమున నడచుకొనుచు ప్రపంచములో కొంతకాలము బ్రతికి పోవు మానవులు అసుర భావము కల్గినవారై, తాము ఉన్న స్థితిలో తమను పలానావారమని లెక్కించుకొని ఆత్మజ్ఞానులను, గురువులను అసూయతో ద్వేషించిన

అది పరమాత్మనే ద్వేషించినట్లగును. ఉదాహరణకు ఒక పోలీస్ ఉద్యోగి సి.ఐ. లేదా డి.ఎస్.పి హోదాకలిగినవారనుకొందాము. అతడు ప్రస్తుతము చేయుచున్న ఉద్యోగమును బట్టి నేను పలానా అని అహము పొందివుండి నేను ఉద్యోగరీత్యా ఎవడైన సాధారణ జీవాత్మనను విషయము తెలియక అహముతో నిండి గర్వదంభములు కల్గి ఒక గురువును లేక ఆత్మజ్ఞానిని పోలీస్‌స్టేషన్‌లో నిలబెట్టి అసూయతో ద్వేషించాడనుకొందాము. ఇతరులను తిట్టిన అంత ప్రమాదములేదుకాని ఒక జ్ఞానిని అదేపనిగ తప్పులేకున్న అసూయతో నిందించితే అది దైవధూషణే అగును. అట్టి వాని మీద పరమాత్మ తప్పక ఏవగింపు కల్గినవాడై వానిని జ్ఞానములేని అసురజాతియందే పుట్టించును. ఇచట వాని కర్మ కూడ పుట్టుకను నిర్ధారించలేదు. ఇది కర్మాతీతమైన పరమాత్మ పనిగ పరిగణించబడుతున్నది. అలా అసురయోనులందు పుట్టినవాడు జన్మ జన్మలకు జ్ఞానమునకు దూరమగుచు, ఏ జన్మకు జ్ఞానము యొక్క గట్టు దొరకకుండ పోవునట్లు పరమాత్మ చేయుచున్నాడు. ఈ విధముగ జన్మ జన్మకు అధోగతి తప్ప వేరులేదు. అందువలన ఆత్మజ్ఞానము కల్గినవారి ఎడల ఎంత గొప్ప ఉద్యోగియైన, రాజకీయవేత్తయిన, ధనికుడైన జాగ్రత్తగ వినయ విధేయతలతో మసలుకోవలెను. అట్లుకాక వారిని ధూషించి ద్వేషించుట వలన తిరిగి వారేమి అనరు, కాని వారివెనుక కనిపించకున్న పరమాత్మ ఏమైన చేయును.

(15) శ్లో॥ 21 : త్రివిధం నరకస్యేదం ద్వారం నాశన మాత్మనః ।
కామః క్రోధ స్తథా లోభ స్తస్మా దేత త్త్రయం త్యజేత్॥
(ప్రకృతి)

**భావము :** ఆత్మ నాశనకరమైన ఈ అసుర భావమునకు మూడు త్రోవలుండును. కామ, క్రోధ, లోభమను మూడింటిని వర్జింపవలయును.

(15) శ్లో॥ 22 : ఏ త్తైర్విముక్తః కౌన్తేయ! తమోద్వారై స్త్రిభిర్నరః ।
ఆచర త్యాత్మన శ్శ్రేయ స్తతో యాతి పరాం గతిమ్ ॥
(ప్రకృతి)

**భావము :** ఈ మూడు తమో ద్వారములను ఎవడు విడుచునో వానికి శుభము ఏర్పడి పరమపదమును పొందగలడు.

**వివరము :** అసుర భావము కలుగజేసి మానవుని అధోగతికి పంపు ఆశ, కోపము, లోభము అను మూడింటిని వదలి వాటికి వ్యతిరేఖమైన దానము, దయ, ఔధార్యము కలిగివుండుట వలన వాటి ద్వారా మంచిచేయుచు జ్ఞానము వైపు చూపుమరల్చుటకు వీలగును. తరువాత కొన్ని జన్మలకైన జ్ఞానమునార్జించి మోక్షమునకు అర్హుడగును.

(15)శ్లో॥ 23 : యశ్శాస్త్ర విధి ముత్సృజ్య వర్తతే కామకారతః ।
న స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాం గతిమ్ ॥
(జీవాత్మ)

**భావము :** శాస్త్రవిధులను విడచి ఆశ కొరకే సంచరించువాడు ఏమి సాధించలేడు. వాడు సుఖమును పొందలేడు, మోక్షమును పొందలేడు.

**వివరము :** జీవితమునకొక విధానముంటుందని, జీవితమును శాసనబద్ధముగ పెద్దలు చెప్పినట్లు గడుపవలెనని తెలియక, వారి ఇష్టమొచ్చినట్లు సంచరించుచు, ఆశ అను పెద్ద గుణముచే ధనార్జనే జీవిత ధ్యేయముగ పెట్టుకొని, శాస్త్రవిధులైన నీతి న్యాయము, జ్ఞాన ధర్మములను గాలికి వదిలి, ధన సముపార్జనకు ఎట్లయిన మాట్లాడి ఎట్లయిన చేయువాడు దైవపరముగ ఏమి సాధించలేడు. ఎంత సాధించిన వానికి సుఖముండదు, మోక్షము ఎప్పటికి పొందలేడు.

(15)శ్లో॥ 24 : తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ ।
జ్ఞాత్వా శాస్త్ర విధానోక్తం కర్మ కర్తు మిహార్హసి ॥
(జీవాత్మ)

**భావము :** కార్య అకార్యములను తెల్పునది శాస్త్రము. కనుక శాస్త్రవిధానము ఎరిగి కర్మలాచరించవలెను.

**వివరము :** మానవ జీవితములో కర్మ ప్రకారము జరుగు కార్యములను ఈ ప్రకారము చేయవలెనని, ఈ ప్రకారముగ చేయకూడదని తేల్చి చెప్పగలిగినది శాస్త్రము. శాస్త్రము శాసనములతో కూడుకొనివున్నది. శాసన నిర్ణయము ప్రకారము పనులు చేసిన అందులో కర్మ అంటదు. శాస్త్ర ప్రకారము చేయకుండిన ఆ పనులలోని కర్మ అంటుకొనుచుండును. చేతికి తొడుగు తగిలించుకొని పని చేసిన ఏ మురికి చేతికంటదు. అదే పనిని తొడుగు లేకుండ చేసిన చేతికి మురికి అంటుకొనును. అలాగే శాస్త్రమును అనుసరించి చేయు పనిలో కర్మ అంటదు. అదే పనిని శాస్త్రబద్ధము కాకుండ చేసిన కర్మ అంటును.

ఇంతటితో దైవాసుర సంపద్విభాగ యోగమను ఈ అధ్యాయము సమాప్త మైనది. ఇందులోని శ్లోకముల వివరము క్రిందచూడుము.

| | | | |
|---|---|---|---|
| 1) | దైవ గుణములు | – | 3 |
| 2) | అసుర గుణములు | – | 13 |
| 3) | జీవాత్మ, పరమాత్మ | – | 2 |
| 4) | దైవ అసుర గుణములు | – | 2 |
| 5) | జీవాత్మ | – | 2 |
| 6) | ప్రకృతి | – | 2 |
| | మొత్తము శ్లోకములు | – | 24 |

భావము, వివరము మార్చి వ్రాసిన శ్లోకములు – 7,8,9.

*****

## పదహారవ అధ్యాయము

# శ్రద్ధాత్రయ విభాగ యోగము

**అర్జునుడిట్లనియె :-**

*(16)శ్లో॥1 : యే శాస్త్రవిధి ముత్సృజ్య యజన్తే శ్రద్ధయాఽన్వితాః ।*
*తేషాం నిష్ఠా తు కా కృష్ణ! సత్త్వ మాహో రజ స్తమః ॥*
*(ప్రకృతి, గుణములు)*

**భావము:** ఎవరైతే శాస్త్రపద్ధతులను వదలి శ్రద్ధతో పూజలు, ఆరాధనలు చేయుచున్నారో అట్టివారి నిష్ఠను ఏమనవచ్చును? సత్త్వమా! రాజసమా! తామసమా!

**వివరము :** ప్రతి పని శాస్త్రయుక్తముగ చేయవలెనని వెనుక అధ్యాయములోని చివరి శ్లోకములో చెప్పబడి ఉన్నది. ప్రతి పనిని శాస్త్రయుక్తముగ చేయుమనినట్లే దేవతారాధన మొదలుకొని అన్ని పనులను శాస్త్రయుక్తముగ చేయవలసివున్నది. అయినప్పటికి అందరు అలా చేయడములేదు. శాస్త్రవిధానమును వదలి చాలామంది అనేకమైన కార్యములు చేయుచున్నారు. ఆశతో లాభ మొచ్చునని తలచి చేయు పనులయందు శ్రద్ధ కలదు. ఎంతో శ్రద్ధతో చేయబడు శాస్త్రరహిత కార్యములను ఏ గుణ భాగములకు సంబంధించినవని, వారి శ్రద్ధ ఏ గుణ భాగమునకు సంబంధించినదని అడుగవచ్చును. ఇదియే ఇక్కడ ముఖ్యమైన ప్రశ్న. దానికి భగవంతుడేమి చెప్పుచున్నాడో క్రింది శ్లోకములో చూస్తాము.

**శ్రీ భగవంతుడిట్లనియె :-**

*(16)శ్లో॥ 2 : త్రివిధా భవతి శ్రద్ధా దేహినాం సా స్వభావజా ।*
*సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చేతి తాం శృణు ॥*
*(గుణములు)*

**వివరము :** మన శరీరములో గుణచక్రమొకటి కలదని, అందులో మూడు భాగములు కలవని, ఆ మూడు భాగములకే సాత్త్విక, రాజస, తామస భాగములని పేర్లు పెట్టబడినవని ముందే చెప్పుకొన్నాము. అంతేకాక ఒక్కొక్క భాగములో 12 గుణములు కలవని వాటితోపాటు భయము, ధైర్యమను రెండు గుణములు, శ్రద్ధ అను ప్రత్యేకమైన ఒక గుణము కలిగి మొత్తము 15 గుణములగుచున్నవని కూడ తెలుసుకొన్నాము. ఈ విధముగ ఒక్కొక్క గుణభాగములో ఒక్కొక్క శ్రద్ధ కలదు. శ్రద్ధ అన్ని గుణములవలె ఉండునది కాదు. అన్ని గుణములు కర్మానుసారము ప్రేరేపింపబడుచుండును. శ్రద్ధ మాత్రము గుణభాగములలో ఉన్నప్పటికి, కర్మాధీనము కాదు. జీవునకు స్వభావజనితమైనది శ్రద్ధ, శ్రద్ధ ప్రకారము ఇష్టమైన పనికాని, ఇష్టములేని పనికాని కర్మానుసారము శరీరములో జరుగుచుండును. ***పరమాత్మను తెలియవలెనను శ్రద్ధ, జ్ఞానము తెలియవలెనను శ్రద్ధ కర్మాతీతమైనవి. ఈ శ్రద్ధ గుణాతీతమైనదని చెప్పవచ్చును.*** ఈ శ్రద్ధను బట్టి కర్మాతీతమైన జ్ఞానమును ఆత్మప్రాప్తిని పొందవచ్చును. కాని గుణభాగములలోని శ్రద్ధనుబట్టి పనులు జరుగవచ్చును, జరుగక పోవచ్చును. మనిషికొక శ్రద్ధవుండగ దానిప్రకారము జరుగక మరియొక విధముగ పనులు జరుగుట అందరికి ప్రత్యక్షానుభవమై ఉన్నది. **'తానొకటి తలచిన కర్మమొకటి తలచునని'** అక్కడక్కడ అనుట వినుచునేవున్నాము.

(16) శ్లో॥ 3 : సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత ! ।
శ్రద్ధామయోఽయం పురుషో యో యచ్ఛ్రద్ధః స ఏవ సః ॥
(గుణములు)

**భావము :** సర్వులకు శ్రద్ధ వారి ఇష్టానుసారము పుట్టునది. ఏ శ్రద్ధ ఎవనికి కలదో వానిని ఆ శ్రద్ధా పురుషుడని చెప్పవచ్చును.

**వివరము :** ఈ శ్లోకము కొంత సారాంశమైన శ్లోకమని చెప్పుకోవచ్చును. ఇందులో ముఖ్యముగ గమనించవలసిన విషయము చాలా ఉన్నది. ఇంతకు ముందు గుణత్రయ విభాగయోగమను అధ్యాయములో గుణములు మూడు భాగములుగ ఉన్నవని, ఒక్కొక్క దానికి ఒక్కొక్క పేరు గలదని కూడ తెలుసుకొన్నాము.

శరీరధారుడైన జీవుడు ఆ గుణభాగములలోనే ఉండునని, ఏ గుణభాగములో ఉంటే ఆ గుణము పేరే జీవునికి కల్గునని కూడ చెప్పుకున్నాము. తామసములో ఉంటే తామసుడని, రాజసములో ఉంటే రాజసుడని, సాత్త్వికములో ఉంటే సాత్త్వికుడనుకొన్నాము. అక్కడ చెప్పినది అక్కడివరకు వాస్తవమే అయినప్పటికి ఇక్కడ మరికొంత మార్పుతో అర్థము చేసుకోవలసి ఉన్నది. ఇక్కడ చెప్పిన శ్లోకములో శ్రద్ధ అనునది జీవునకు స్వభావజనితమైనదని, శ్రద్ధ మూడు విధములుగ ఉన్నదని, గుణములను బట్టి శ్రద్ధలు కలవని చెప్పబడివున్నది. ఏ శ్రద్ధవున్న పురుషుని ఆ గుణ పురుషునిగ చెప్పబడుచున్నది. ఒక్కొక్కప్పుడు జీవుడున్న గుణములోనే శ్రద్ధకూడ ఉండును. జీవునకు గల శ్రద్ధ తామస గుణ భాగములోని పనుల మీద ఉండి జీవుడు మాత్రము సాత్త్వికములో ఉన్నాడనుకొనుము. అప్పుడు వాడు సాత్త్వికుడాయనిన కాదని చెప్పవచ్చును. వాడు తామసుడనియే చెప్పవచ్చును. జీవుడు కర్మరీత్యా బలవంతముగ సాత్త్వికగుణ భాగములో బంధింపబడి ఉన్నప్పటికి వాడు సాత్త్వికుడు కాడు. శ్రద్ధను బట్టి పురుషుడు ఎవరైనది నిర్ణయింపబడుచున్నది. "**శ్రద్ధామయో ఽయం పురుషోయో యచ్ఛ్రద్ధః స ఏవసః**" అనుమాట ప్రకారము ఏ గుణశ్రద్ధతో కలిసినవాడు ఆ గుణ పురుషుడనియే చెప్పబడును. కావున సాత్త్వికములో జీవుడుండి శ్రద్ధ తామస గుణభాగములో ఉన్నపుడు వాడు నిజముగ తామసములో ఉన్నవాడే అగును. సాత్త్వికములో ఉన్నవాడు కాదని తెలియవలెను.

ఒక విషయము వినుచున్నప్పుడు మనస్సెక్కడో ఉన్నట్లయితే ఆ విషయము బుర్రకెక్కనట్లు, ఒక గుణములో ఉన్న జీవుని శ్రద్ధ మరెక్కడో ఉన్నట్లయితే జీవుడు అక్కడలేనట్లే లెక్కించబడును. ఎచట శ్రద్ధగలదో అచటే ఉన్నట్లు లెక్కించవలెను. మరొక ఉదాహరణ తీసుకొందాము. జ్ఞానము సంపూర్ణముగ తెలిసినవాడు గుణములలో శ్రద్ధలేనివాడై, గుణములేని దానియందు శ్రద్ధకల్గి ఉన్నాడనుకొనుము. కాని వాని పూర్వజన్మ కర్మప్రకారము ఆ జీవుడు బలవంతముగ రాజస గుణభాగములో చిక్కి అందులోని గుణముల ఆచరణ చేయవలసి వచ్చినపుడు వానిద్వారా జరుగు పనులు రాజస గుణములలోనివైనప్పటికి వానిని రాజసుడనకూడదు. వానికున్న శ్రద్ధనుబట్టి గుణాతీతుడని చెప్పవచ్చును. శ్రద్ధను బట్టి వాని స్థానమును

నిర్ణయింపదగుననునదియే ఈ శ్లోకములోని ముఖ్యసూత్రము. గుణ భాగములను బట్టి శ్రద్ధ మూడు విధములైన, గుణాతీత భాగమును బట్టి కూడ శ్రద్ధ కలదు. మూడు గుణముల శ్రద్ధను బట్టి తామసులు, రాజసులు, సాత్త్వికులు కాగ గుణాతీత భాగమును బట్టి యోగులు కూడ ఉన్నారు. **'చాతుర్వర్ణం'** అను శ్లోకములో చెప్పినట్లు నాల్గుశ్రద్ధలు కూడ కలవని తెలియాలి.

(16) శ్లో॥ 4 : యజన్తే సాత్త్వికా దేవాన్ యక్షరక్షాంసి రాజసాః ।
ప్రేతాన్ భూతగణాం శ్చాన్యే యజన్తే తామసా జనాః ॥
(గుణములు)

**భావము :** సాత్త్విక గుణము కలవారు దేవతలను ఆరాధించుదురు. రాజసులు యక్షులను రాక్షసులను, తామసులు ప్రేతములను భూతములను పూజ చేయుదురు.

**వివరము :** సాత్త్వికశ్రద్ధకల్గిన జీవులు దేవతలను ఆరాధించుదురు. రాజసశ్రద్ధగల వారు దేవతలకంటే తక్కువైన యక్ష రాక్షసులను పూజింతురు. తామస శ్రద్ధకలవారు ప్రేతములను దయ్యములను పూజించుచుందురు.

(16) శ్లో॥ 5 : అశాస్త్ర విహితం ఘోరం తప్యన్తేయే తపోజనాః ।
దమ్భాహంకారసంయుక్తాః కామరాగబలాన్వితాః ॥
(గుణములు)

(16) శ్లో॥ 6 : కర్శయ న్త శ్శరీరస్థం భూతగ్రామ మచేతసః ।
మాం చైవా న్త శ్శరీరస్థం తాన్ విద్ధ్యాసుర నిశ్చయాన్ ॥
(గుణములు)

**భావము :** ఏ మనుజులు అహంకారము, దంభముతో కూడినవారై, ఆశ, ప్రేమ గుణముల బలము కల్గినవారై, ఇతరులను ఇబ్బంది పెట్టువారై, అశాస్త్రపద్ధతిలో తపములు చేయువారై, అజ్ఞానులై శరీరమునందలి ఇంద్రియములను వాటిలోపల ఉండు ఆత్మనైన నన్ను కృశింపజేయుచున్నారో, అట్టివారు అసురులని తెలియుము.

**వివరము :** కొందరు కోర్కెలే ముఖ్య ఆశయముగ పెట్టుకొని, అవి నెరవేరుటకు కొన్ని నియమములతో కూడిన తపస్సులు కూడ చేయుచుందురు. శరీర కష్టముతో

కూడుకొన్న ఆరాధనలను తపస్సులంటాము. శరీరమును తపింపజేయు నియమము లతో కూడిన ఆరాధనలు, ఇతరులకు కూడ ఇబ్బంది కలుగజేయునవిగ ఉండును. ఉదాహరణకు ఇల్లంతా శుభ్రపరచి బొట్టుపెట్టి ఇంటిలోని వారంతా ఒకే ఆహారము తిని బయటి పనులకు పోకుండ ఇంటిలోనే ఉండగ, ఆ ఇంటిలోని ఒకడు పూజ మొదలిడును. ఆ పూజ చేయునంత వరకు ఇంటిలోని వారు బయటికి, బయటివారు ఇంటిలోనికి రాకూడదు. పూజచేయువాడు తన మంత్రము పదివేలు జపమై పోవువరకు లేవకూడదు, ఆహారము తీసుకోకూడదు. ఇటువంటి నియమము గల పూజ మొదలు పెట్టినారనుకోండి. మలమూత్రాదులు వస్తున్నప్పటికి వాటి విసర్జన కొరకు బయటికి పోకూడదు. పోయినట్లయిన నియమము ఉల్లంఘించినట్లగును. ఈ నియమముతో ఇంటిలోని వారుకూడ బాధపడవలసివున్నది. అలాగే పూజ చేయువాడు మంత్రము పదివేలయిపోవు వరకు లేవకూడదు. ఆ నియమము ప్రకారము కూర్చున్నవానికి కాల్లు నొప్పిపుట్టిన కదలకూడదనుటచే వాని ఇంద్రియము లకు కష్టమేర్పడినది. అందులోని చైతన్యముగనున్న ఆత్మకు కూడ ఆహార బలములేక శక్తి బలహీనపడినట్లయినది. కదలకుండుట వలన నరములలో గ్లాని ఏర్పడిశక్తి ప్రసారమగుటకు ఆటంకమేర్పడుచున్నది. ఇటువంటి తపనతో కూడుకొన్న ఆచరణలు చేయువారు శరీరములోని ఇంద్రియములను, అందులోని దైవమైన ఆత్మను కష్టపెట్టువారగుట వలన వారిని రాక్షసాంశ కలవారని చెప్పవచ్చును.

*(16) శ్లో॥ 7 : ఆహార స్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః ।*
*యజ్ఞ స్తప స్తథా దానం తేషాం భేద మిమం శృణు ॥*
*(గుణములు)*

**భావము :** సర్వ జీవరాసులు తీసుకొను ఆహారము కూడ మూడు శ్రద్ధలుగ ఉన్నది. అట్లే త్రి శ్రద్ధలుగ యజ్ఞము, తపము, దానము మొదలగునవి కలవు. వాటి భేదములను వివరింతు వినుము.

**వివరము :** మనిషి తిను ఆహారములోనే కాక చేయు పనులలోను అలాగే ఆరాధనలలోను మొదలగు అన్నిటియందును శ్రద్ధ మూడు విధములుగ ఉన్నదని చెప్పవచ్చును. చేయుచున్న పని ఏ గుణముదైవున్న శ్రద్ధను బట్టి లెక్కించనగునని

చెప్పాము కదా! ఆ మూడు గుణభాగముల శ్రద్ధలను ఇక్కడ తెలియజేయుచున్నాడు. మొదట ఆహారమును గూర్చి తెలియజేయుచున్నాడు చూడండి.

(16) శ్లో॥ 8 : ఆయుస్సత్త్వబలారోగ్య సుఖ ప్రీతి వివర్ధనాః ।
రస్యాస్స్నిగ్ధాస్స్థిరా హృద్యా ఆహారా స్సాత్త్వికప్రియాః ॥
(సాత్త్విక శ్రద్ధ)

**భావము:** ఆయుస్సును, శరీర ఉల్లాసము, బలము, ఆరోగ్యము, కలుగజేయునవియు, చూచుటకు అందముగను, ప్రీతిని వృద్ధిచేయు రసవత్తరమైనవి, నూనె పదార్థములు కలవి, దీర్ఘకాలమున్నా చెడిపోని ఆహార పదార్థముల మీద సాత్త్వికులకు ప్రీతియుండును.

**వివరము :** ఆహారము మీద శ్రద్ధ ఏ ఏ గుణములలో ఎలాగుండునో ఇక్కడ వివరించడమైనది. మొదట ఆహారమంటే ఏమిటో తెలుసుకొందాము. మనము నోటి ద్వార లోపలికి వేయునవన్నియు ఆహారము కాదు. నోటిద్వారా కడుపులోనికి పోవు అన్నియు ఆహారము కాదని చాలామందికి తెలియదు. నోటిద్వారా కడుపులోనికి పోవు వాటిలో ఆహారపదార్థములని, ఆహారపదార్థములు కానివని రెండు రకములైన పదార్థములు కలవు. శరీరమునకు ఉపయోగపడి, శరీర ఆరోగ్యమును కాపాడుచు శరీర పోషణకు ఉపయోగపడు పోషక పదార్థములున్న వాటిని ఆహారము అనవచ్చును. నోటిద్వారా తీసుకొనుచుండినప్పటికి శరీర పోషణకు ఉపయోగపడక నేరుగ మెదడు మీద పనిచేసి మానసికముగ సుఖమునుకల్గించు మత్తుపదార్థములను ఆహార పదార్థములనము. అటువంటి మత్తు పదార్థములైన గంజాయి, నల్లమందు, సారా, బ్రాందీలు మొదులుకొని ఉన్న ప్రతిది ఆహారపదార్థ జాబితాలో చేరవు. శరీర పోషణ నిమిత్తము పోషక పదార్థములున్న వాటినే ఆహారముగ పరిగణింపవచ్చును. ఆహార పదార్థము తీసుకోవడములో ఆహారమైన ఏ పదార్థమైనను అభ్యంతరము లేదు. కాని ఆహారపదార్థములు కాని మత్తుపదార్థములు తీసుకోవడము మంచిదికాదు. ఇక్కడ కొందరికొక ప్రశ్న రావచ్చును. అదేమనగా *'ఆహార పదార్థములలో ముఖ్యముగ శాఖాహారము, మాంసాహారము అను రెండు రకములుగ ఉన్నవి కదా! వాటిలో శాఖాహారము మంచిది, మాంసాహారము*

*చెడ్డదనుచు మాంసాహారమును వదిలివేయమంటారు. మాంసాహారము వలన చెడు గుణములు వస్తాయని చెప్పచుంటారు అది వాస్తవమేనా?'* ఈ ప్రశ్నలకు జవాబు ఏమనగా! ఆహార పదార్థములలో శరీరమునకు ఉపయోగపడు నవి, మానసికముగ పనిచేయునవని రెండు రకములు ఉన్నవి. కాని శరీరమునకు ఉపయోగపడు ఆహారములో ఇవి తినవచ్చును ఇవి తినకూడదను నియమముగలవి ఏవిలేవు. మానసిక మార్పు కలుగజేయు మత్తుపదార్థములు తప్ప తినకూడనివేవీ లేవు. ఆహారము సంపాదించుకోవడములో పాపపుణ్యములు రావచ్చునుకాని తినడములో ఏమి లేదు. ఆహారము వలన గుణములు మారునని చాలామంది చెప్పగ వినియు, చాలా పుస్తకములలో వ్రాయగ చూచివున్నాము. ఏ ఆధారముతో అలా వ్రాశారో వారికే తెలియదు. ఆహారము వలన గుణములు మారునట్లయితే జ్ఞానబోధ అవసరమే లేదు. అందరికి మంచి ఆహారము పెట్టి మంచిగ మార్చివేయ వచ్చును. ఏ ఆహారము తిన్నప్పటికి వారి శరీరమునకే కాని గుణములకు ఆధారము కాదు. గుణములకు కారణమైనది వెనుకటి జన్మ కర్మయే. సైన్యములో మూడువందల మందికి ఒకచోట ఒకే ఆహారమివ్వడము జరుగుచున్నది. ఒకే ఆహారము తినుచున్న మూడువందల మందికి ఒకే గుణమున్నదా? అని చూచిన ఎడల అట్లు ఎవ్వరికి లేదు. వారిలో ఒక్కొక్కరు ఒక్కొక్క గుణము కల్గివున్నారు. అందువలన ఆహారము గుణములను మార్చలేదని ఋజువగుచున్నది. ఇక్కడ గీతయందు ఈ అధ్యాయములో గుణమును బట్టి ఆహారమున్నదని చెప్పాడు, కాని ఆహారమును బట్టి గుణములున్నట్లు చెప్పలేదని ముఖ్యముగ తెలియవలెను.

ఇంక మాంసాహారమును వివరించుకొని చూచినట్లయితే శరీరము పెరుగుదలకు మాంసకృత్తులను పోషక పదార్థములవసరము. మాంసకృత్తులు (Protiens) అను పోషక పదార్థములు పప్పు ధాన్యములైన కంది, పెసర మొదలగు ధాన్యములలోను జంతువుల మాంసములోను కలవు. ధాన్యములలోని మాంసకృత్తులు శరీరమునకెట్లు ఉపయోగపడుచున్నవో, అట్లే జంతు మాంసములోని మాంసకృత్తులు ఉపయోగపడచున్నవి. శరీరములో అవి మంచి ఇవి చెడు ఏమి చేయలేదు. ముందే చెప్పాము ఆహారము సంపాదించుకొనుటలో పాపమురావచ్చును, కాని

ఆహారము తినుటవలన శరీరములో పాపము రావడముకాని, గుణములు మారడము కాని జరుగదు. ఆహారరీత్య శాఖాహారమైన మాంసాహారమైన ఒక్కటే. ఆహారము శరీర ఆరోగ్య అనారోగ్య సమస్యలకు సంబంధించినది, కాని గుణముల వృత్తి నివృత్తికి సంబంధించినది కాదు. ఆహారమే గుణముల వృత్తి నివృత్తికి సంబంధించినదైవుంటే మనకు జ్ఞానము యోగసాధన అవసరమే లేదు కదా! ఆహారముతోనే గుణములను లేకుండ చేసుకొని పరమాత్మను పొందవచ్చును కదా! అట్లు ఎప్పటికి సాధ్యము కాదుగనుకనే యోగసాధనకు జ్ఞానమవసరమైనది. ఆహారము వలన గుణములలో మార్పువచ్చునని పెద్దస్వాములు, గురువులు చెప్పడము విచారకరము. అంతేకాక ఆహారము మంచిదైనప్పటికి, పెట్టు వారిలో గుణములు మంచివి కాని ఎడల వారు పెట్టిన ఆహారము తినుట వలన, తిన్నవారికి సహితం చెడు గుణములు వచ్చుననుట మరీ విచిత్రము. పెట్టిన వారెట్టివారైన ఆహారములో ఏ ప్రభావముండదు. పెట్టిన వానికి, ఆహారమునకు ఏ సంబంధము లేదు. ఎవరు పెట్టిన అది సాధారణ ఆహారముగనే ఉండును. తప్పుచేసినవాడు తన తప్పును అన్నము పెట్టిన వారి మీద వేయు ద్రోహబుద్ధిచే కొందరలా కథలను అల్లిపెట్టారు. అలా అయిన తప్పుచేసిన ప్రతివాడు అన్నము పెట్టిన వారిమీద తమ తప్పును త్రోయగలడు. ఇది మంచిదేనా మీరే యోచించండి.

జింక గడ్డి మేస్తుంది కావున క్రూర జంతువు కాదు. పులి మాంసము తింటుంది కావున క్రూర జంతువుగ తయారైనదని కొందరు ఉపమానము చెప్పవచ్చును. జింక జన్మతః సాధు జంతువు. పులి జన్మతః క్రూర జంతువు. వాటి సాధుత్వము క్రూరత్వము సహజముగ వాటితోపాటు పుట్టినవేకాని మాంసము, గడ్డి తినుట వలన మధ్యలో వచ్చినవి కావు. శరీర పోషణకు ఎవరికి లభ్యమైన ఆహారమును వారు తినవచ్చును. తినిన ఆహారము శరీరమునకు ఉపయోగపడునే తప్ప గుణములను మార్చలేదు. సారా త్రాగినవాడు మరోలా మారిపోవుచున్నాడు కదా! అదివాడు తీసుకొన్న సారాను బట్టియే కదా మారినదని కొందరడుగవచ్చును. దానికి జవాబు మొదటనే చెప్పుకొన్నాము, సారా ఆహారము కాదు, మత్తు పానీయమని. మత్తును కలుగజేయు ఏ పదార్థమైన వాని మానసిక ప్రవృత్తిని తాత్కాలికముగ

మార్చగలదు. వానిలో అణిగివున్న దానిని మత్తు బయట పెట్టగలదు, కాని లేని దానిని కల్పించలేదు. మంచివానిగ కన్పించు వాని నిజస్వభావము మత్తులో బయటపడగలదు. లోపల దాగివున్న విషయము బయటపడగలదు. కొన్ని రహస్యములు కూడ ఆ సమయములో బయట పెట్టగలరు. మత్తు కల్గిన సమయములో మనస్సు నిజము దాచుకొను స్వభావమును కోల్పోవును. ఏది ఏమైన మత్తు పదార్థము ఆహారము కాదు కనుక అది మానసికముగ పనిచేయునని ముందే చెప్పాము. ఆహారము శరీర బల అబల, ఆరోగ్య అనారోగ్యములను నిర్ణయించునదై ఉన్నది. మత్తు పదార్థము మానసిక బలాబలములను, గుణవృత్తి ప్రవృత్తులను నిర్ణయించునదై ఉన్నది. మత్తు పానీయమైన సారా మానసికముగ గుణముల ప్రేరణ కల్గించునదై మనో ఉల్లాసమును కలుగజేయునదై, ఉండగ, నల్లమందు అను మత్తు పదార్థము తలలోని గుణములు పనిచేయకుండ స్తబ్ధతకలుగజేయును. ప్రపంచములో ఏదీ తనకు సంబంధములేనట్లు ఏ గుణము పనిచేయని మత్తులో జీవున్ని ముంచి ఉంచగలదు. అందువలన ఏది ఆహారము, ఏది ఆహారముకాదని మొదట తెలియడము మన కర్తవ్యము.

ఆహారమైన వాటిలో మాంసాహారము నిషేధమనుట మంచిదికాదు. దాని వలన జ్ఞానము కలుగదనుట మరీ మంచిదికాదు. కర్మరీత్యా మాంసాహారమే దొరికినపుడు, తప్పక తినవలసి వచ్చినపుడు, నేను తిననని కూర్చొనుట వీలుకాదు. యుద్ధము చేయనని అర్జునుడు కూర్చున్నప్పటికి కర్మరీత్యా నీ పని నిల్వబోదు నీ చేతనే జరుగునన్నట్లు, నేనీ ఆహారము తిననని కూర్చున్నా కర్మ ఉన్నప్పుడు వానిచేతనే తినబడును. అంతమాత్రమున నేను జ్ఞానమునకు పనికిరానని అనుకోకూడదు. పనికి రావని ఇతరులకు కూడ చెప్పకూడదు. భగవద్గీతలో ఆహారములను గూర్చి చెప్పునప్పుడు మాంసాహారము నిషేధమని భగవంతుడెక్కడ చెప్పలేదు. ప్రతి దానిని జ్ఞానపరముగ యోచించాలి తప్ప అన్యదా యోచించి చెప్పకూడదు. ఇక్కడ కూడ ఈ ఆహారముల మీద ఈ గుణములలోనున్న వారికి శ్రద్ధ ఉండునని చెప్పాడు తప్ప ఇవి తినుట వలన ఈ గుణములు అభివృద్ధగునని చెప్పలేదనుట గ్రహించవలెను. ఇక్కడ **ఆహారమును బట్టి గుణములు లేవు, గుణములను బట్టి ఆహారమున్నదనుటయే** సూత్రము.

ఉదాహరణకు కర్మరీత్య జీవుడు తామసములో ఉన్నప్పటికి, అక్కడ ప్రేరణ వలన ఆయా గుణములచేత లభించు తామసాహారము తిన్నప్పటికి, వాని శ్రద్ధ సాత్త్వికములో ఉన్న ఎడల వానిని జ్ఞానరీత్య సాత్త్వికునిగ లెక్కించవలెనని కూడ చెప్పుకొన్నాము. ఇక్కడ ఇప్పుడు చెప్పిన శ్లోకములో సాత్త్విక శ్రద్ధ కల్గిన వానికున్న ఆహార ప్రీతిని మాత్రము చెప్పుచున్నట్లు గ్రహించవలెను. అది వానికి లభించవచ్చును లభించకపోవచ్చును. అది కర్మను బట్టి ఉండును.

(16) శ్లో॥ 9 : కట్వామ్ల లవణాత్యుష్ణ తీక్ష్ణరూక్ష విదాహినః ।
ఆహారా రాజస స్యేష్టా దుఃఖశోకామయప్రదాః ॥
(రాజసగుణశ్రద్ధ)

**భావము :** చేదు, పులుపు, ఉప్పు, కారము, వేడిగ ఉన్నవి, సారము లేకుండ ఎండి పోయినవి, దాహమును కలుగజేయునవి, తినుటలో కష్టము, తిన్న తరువాత బాధను కల్గించు అనారోగ్యకర పదార్థములయందు రజోగుణము కలవారికి శ్రద్ధవుండును.

(16) శ్లో॥10: యాత యామం గతరసం పూతిపర్యుషితంచ యత్ ।
ఉచ్ఛిష్టమపి చామేధ్యం భోజనం తామసప్రియమ్ ॥
( తామస గుణ శ్రద్ధ)

**భావము :** ఉడికి ఉడకనిది, రసము పోయినది, చెడిపోయి వాసన వచ్చునది, తిని మిగిలి వదలివేసిన దానిని, పవిత్రతలేనిది అయిన ఆహారము తామసులకు ప్రీతిగ ఉండును.

(16)శ్లో॥11 : అఫలాకాంక్షి భి ర్యజ్ఞో విధదృష్టో య ఇజ్యతే ।
యష్టవ్య మేవేతి మనస్సమాధాయ స సాత్త్వికః ॥
( సాత్త్వికము)

**భావము :** ఫలితము మీద కాంక్షలేక శాస్త్రవిధి ప్రమాణములను అనుసరించి యజ్ఞము (పూజ) చేయవలెనని మనస్సున నిశ్చయించి, చేయు యజ్ఞము సాత్త్విక యజ్ఞమనబడును.

(16) శ్లో॥ 12 : అభిసన్ధాయ తు ఫలం దమ్భార్థ మపి చైవ యత్ ।
ఇజ్యతే భరతశ్రేష్ఠ ! తం యజ్ఞం విద్ధి రాజసమ్ ॥
(రాజసము)

**భావము :** మనస్సు ఫలితము మీద సంబంధించినవాడై దంభముగ ఇతరులకు తెలియునట్లు చేయబడు యజ్ఞమును రాజసయజ్ఞమని తెలియుము.

(16) శ్లో॥ 13 : విధిహీన మసృష్టాన్నం మంత్ర హీన మదక్షిణమ్।
శ్రద్ధా విరహితం యజ్ఞం తామసం పరిచక్షతే॥
(తామసము)

**బావము :** శాస్త్రపద్ధతిలేనిది, అన్నదానములేనిది, మంత్రములులేనిది దక్షిణలేనిది అసలు శ్రద్ధ లేకుండ చేయు యజ్ఞమును తామసయజ్ఞమని చెప్పవచ్చును.

(16) శ్లో॥ 14 : దేవ ద్విజ గురు ప్రాజ్ఞ పూజనం శౌచ మార్జవమ్ ।
బ్రహ్మ చర్య మహింసా చ శారీరం తప ఉచ్యతే ॥
(తపము)

**భావము :** దేవతలయందును, బ్రాహ్మణులయందును, గురువులయందును జ్ఞానుల యందును, భక్తియు, శుచిత్వము, కపటము లేకుండుట, బ్రహ్మచర్య అహింసా ప్రవర్తనము, శరీర తపస్సని చెప్పబడును.

(16) శ్లో॥ 15: అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్ ।
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే ॥
(తపము)

**భావము :** పరులు బాధపడని మాటలు, ప్రియము, హితము, సత్యము గల మాటలు, ఇతరులకు మంచి చేయునటుల మాట్లాడుటయు, వేదమభ్యసించుటయు వాక్ తపస్సని చెప్పబడును.

(16) శ్లో॥ 16 : మనఃప్రసాద స్సౌమ్యత్వం మౌన మాత్మవినిగ్రహః।
భావసంశుద్ధి రిత్యేత త్తపో మానస ముచ్యతే॥
(తపము)

**భావము :** మనో నిర్మలత్వమును, సౌమ్యమును, మౌనము వహించుటయు, జీవాత్మ కష్టసుఖములలో నిగ్రహముగవుండుటయు, భావ సంశుద్ధి కలిగి ఉండుటయు మానస తపములని చెప్పబడును.

(16) శ్లో॥ 17 : శ్రద్ధయా పరయా తప్తం తప స్త త్త్రివిధం నరైః ।
అఫలాకాంక్షి భి ర్యుక్తై స్సాత్త్వికం పరిచక్షతేః ॥
(సాత్త్వికము)

**భావము :** ఫలకాంక్షలేక పరమశ్రద్ధతో, యోగ్యత గల మనుజులు సలుపు ఈ త్రివిధ తపములను సాత్త్విక తపములని అందురు.

(16)శ్లో॥ 18 : సత్కార మాన పూజార్థం తపోదంభేన చైవయత్ ।
క్రియతే తదిహ ప్రోక్తం రాజసం చలమధ్రువమ్ ॥
(రాజసము)

**భావము :** సత్కరింపుకొరకు, సన్మానము కొరకు, పూజకొరకు, దంభముగ చంచలము క్షయకరమునగు రీతిలో సలుపు తపమును రాజస తపమందురు.

(16)శ్లో॥ 19 : మూఢగ్రాహే ణాత్మనో య త్పీడయా క్రియతే తపః ।
పరస్యోత్సాదనార్థం వా తత్తామస ముదాహృతమ్ ॥
(తామసము)

**భావము :** తెలివి లేనట్టి పట్టుదల తోడ తనకు కష్టమైనను చేయు తపము, పరుల వినాశనమునకు చేయు తపమును తామస తపమని చెప్పబడును.

(16) శ్లో॥ 20 : దాతవ్య మితి య ద్దానం దీయతేఽనుపకారిణే ।
దేశే కాలేచ పాత్రే చ త ద్దానం సాత్త్వికం స్మృతమ్ ॥
(సాత్త్వికము)

**భావము :** దానమొనరింపవలెనను ఉద్దేశ్యము కలిగివుండి, దేశ కాలపాత్రా పాత్రలు తెలిసి, బదులుమేలు చేయనట్టి సజ్జనునకిచ్చు దానమును సాత్త్విక దానమందురు.

**వివరము :** శరీరములోని గుణములలో జ్ఞానమునకు నిత్య శత్రువగు ఆశ (కామము) అను గుణముకు పూర్తి వ్యతిరిక్తమైన గుణము దానము. ఒకరి నుండి తీసుకొనునది ఆశకాగ, ఒకరికిచ్చునది దానము. మూడు గుణ భాగములలో కామమను గుణము మూడు విధములుగ ఉన్నట్లు, దానము కూడ మూడు విధములుగ ఉన్నది. అందులో సాత్త్విక దానమును గురించి ఇక్కడ తెలిపారు. దానము చేయవలెనను తలంపు కలిగివుండి ఏ కాలములో అవసరమో, ఏ కాలములో అవసరము కాదో తెలుసుకొని ఎదుటి వానికి అవసరమైన సమయములో దానము చేయడము, అదియు అతడు దానమునకు యోగ్యుడో, అయోగ్యుడో తెలుసుకొని ఎదుటివాడు యోగ్యుడైనపుడే దానమీయవలెను. తిరిగి మేలు చేయని వానికిచ్చునదియే సాత్త్విక దానమగును. అలాకాక వానికి వస్తురూపముగ దానమిచ్చి ధన రూపముగ మేలు పొందకూడదు. అలా చేసిన అది సాత్త్విక దానమనిపించుకోదు. ఈ కాలములో చాలామంది ప్రతిఫల కాంక్షలోపల పెట్టుకొని పైకి దానము చేయుచుందురు. ఇంకా కొందరు రూపాయి దానమిచ్చి పది రూపాయల పని చేయించుకొనువారు కూడ కలరు. అట్లు చేసిన మొదట ఇచ్చినది దానమే అయిన అది సాత్త్విక దానమనిపించుకోదు. ప్రతిఫలకాంక్షలేనిదే సాత్త్విక దానమగును. దానములలో యోగ్యత, కాలమును తెలిసి చేసిన దానమే సాత్త్విక దానమగును.

*(16) శ్లో॥ 21 : యత్తు ప్రత్యుపకారార్థం ఫల ముద్దిశ్యవా పునః ।*
*దీయతే చ పరిక్లిష్టం తద్దానం రాజసం స్మృతమ్ ॥*

*(రాజసము)*

**భావము :** ఫలమునందు ఆశ, ప్రత్యుపకారమునందు ఆలోచనకల్గి, అతికష్టము మీద మనస్సులో బాధపడుచు ఇచ్చు దానము రాజస దానమని చెప్పబడుచున్నది.

**వివరము :** ఇప్పుడు దానమిచ్చుట వలన వానిచేత వేరు విధముగ మేలు పొందవచ్చునను. ఆశకల్గి ఇచ్చుదానము కాని, నేను దానము చేయుట వలన పుణ్యము వచ్చునని ఆలోచనతో ఇచ్చుదానమును కాని, దానమిచ్చుటవలన నా వద్ద ఉన్నది పోవుచున్నదేయని లోపల బాధపడుచు ఇచ్చు దానమునుకాని రాజస దానమనియందురు.

(16) శ్లో॥ 22 : అదేశకాలే యద్దాన మపాత్రే భ్యశ్చ దీయతే ।
అసత్కృత మవజ్ఞాతం త త్తామస ముదాహృతమ్ ॥
(తామసము)

**భావము :** మర్యాదలేక, తిరస్కార పూర్వకముగ, దేశకాలమును తెలిసికొనక పాత్రుడగునో కాదో ఆలోచించక ఇచ్చుదానము తామస దానమందురు.

**వివరము :** దానమిచ్చునప్పుడు తీసుకొనువానికి మర్యాదలేకుండ విసిరిపారేసినట్లు దానమివ్వడము, అడిగిన తిరస్కారముగ దానమివ్వడము, కాలపరిస్థితి తెలుసుకోక వర్షాకాలము చెట్టుకు నీరుపోసినట్లు అవసరములేనప్పుడు దానమివ్వడము, దానమునకు పాత్రుడగునో కాదో చూడకనే ఉన్నవానికి ఇవ్వడము తామస దానమని పెద్దలు చెప్పుచుందురు.

ఇంతటితో శ్రద్ధాత్రయ విభాగయోగమనబడు ఈ అధ్యాయము ముగిసింది. ఇందులో ఇంకను మిగిలియున్న ఆరు శ్లోకములు వ్రాయబడలేదు. ఇవి త్రిశ్రద్ధలకు సంబంధములేని విషయమేగాక గీతకు సంబంధముకాని విషయములు, భగవంతుడు చెప్పని విషయములు కావున ఆరు శ్లోకములు ఇక్కడ చెప్పబడలేదని తెలియవలెను. యోగశాస్త్రము కాని విషయములనే వెనుక అధ్యాయములలో కూడ విడువబడి యున్నవి. అలాగే ఇప్పుడు కూడ తీసి వేయడము జరిగింది. ఇలాంటివే ముందు రాబోవు అధ్యాయములో కూడ కలవు.

(16) శ్లో॥ 23 : ఓం తత్సదితి నిర్దేశో బ్రహ్మణ స్త్రివిధః స్మృతః ।
బ్రాహ్మణాస్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా ॥

**(కల్పితము)**

(16) శ్లో॥ 24 : తస్మా దోమిత్యుదాహృత్య యజ్ఞదానతపఃక్రియాః ।
ప్రవర్తన్తే విధానోక్తా స్సతతం బ్రహ్మవాదినామ్ ॥

**(కల్పితము)**

(16) శ్లో॥ 25 : తదిత్యనభిసన్ధాయఫలం యజ్ఞతపఃక్రియాః ।
దానక్రియాశ్చ వివిధాః క్రియన్తే మోక్షకాంక్షిభిః ॥

**(కల్పితము)**

(16)శ్లో॥ 26: సద్భావే సాధుభావే చ సదిత్యేత త్ప్రయుజ్యతే ।
ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ! యుజ్యతే ॥

(కల్పితము)

(16)శ్లో॥ 27 : యజ్ఞే తపసిదానే చ స్థితి స్సదితి చోచ్యతే ।
కర్మచైవ తదర్థీయం సదిత్యేవాభిధీయతే ॥

(కల్పితము)

(16)శ్లో॥ 28 : అశ్రద్ధయా హుతం దత్తం తపస్తప్తం కృతం చ యత్ ।
అస దిత్యుచ్యతే పార్థ! న చ తత్ప్రేత్యనో ఇహ ॥

(కల్పితము)

ఈ ఆరు శ్లోకములలో ఓం తత్ సత్ అను పదమును గూర్చి చెప్పిన విషయముకలదు. ***'ఓం తత్ సత్'*** అను పద ఉచ్ఛరణ యజ్ఞ దాన తపములలో కలుగు దోషములను పోగొట్టగలదనియు, ఆ పదములు పరబ్రహ్మ స్వరూపమనియు చెప్పబడియున్నది. అంతేకాక యజ్ఞదాన తపస్సులందు మోక్షకాములు ఈ శబ్దముల నామోచ్ఛరణ చేయుచుందురని కూడ చెప్పివున్నారు. భగవంతుడు చెప్పిన భగవద్గీత ఒకే పద్ధతి ఒకే బోధగ ఉండవలెను. మోక్షకాములకు యోగమే శరణ్యమనియు, పరమాత్మను తెలియగోరువారికి యజ్ఞదాన తపములు సాధనములు కావని, వాటివలన తెలియుటకు శక్యముకాదనియు తెల్పిన భగవంతుడు మాటమార్చి మోక్షాసక్తులకు యజ్ఞదానతపములు పనికి వచ్చునని చెప్పునా? యోగమే శరణ్యమన్నవాడు యజ్ఞదానతపములు సాధనములని చెప్పునా? ఇది భగవంతుడు చెప్పినవి కాదు.

ఎందుకనగా! గీతలో బాహ్యయజ్ఞములను గూర్చి ఎచటను చెప్పి ఉండలేదు. ఆయన చెప్పినవి రెండే యజ్ఞములు. అవియు శరీరములోపల జరుగునవి. జ్ఞానయజ్ఞము, ద్రవ్యయజ్ఞమని పేరు పెట్టబడినవని, రెండు యజ్ఞములు దేహములో జరుగునవేనని, తెలిపినవాడు బాహ్య యజ్ఞములను గురించి చెప్పునా? దానము గుణచక్రములోని గుణ భాగములలోని ఒక గుణమగును. గుణము వలన ప్రపంచము, గుణ వర్జితము వలన పరబ్రహ్మ తెలియునని చెప్పినవాడు మోక్షమునకు దానము పనికివచ్చునని తెలుపుట మంచిదా! దానగుణము వలన

పుణ్యము లభించును కాని మోక్షము లభించునా? ఒక గుణమైన దానము ప్రపంచరీత్యా మంచిని పెంపొందించును కాని మోక్షమును చూపలేదు. అంతేకాక తపస్సుకంటే యోగమధికమని యోగమును ఆచరించి యోగివి కమ్మని చెప్పినవాడు తపస్సును గురించి గొప్పగా చెప్పడు. అలా చెప్పాడంటే అది అసత్యమని చెప్పవచ్చును. కావున ఇచట యజ్ఞదాన తపములను గూర్చి చెప్పబడిన శ్లోకములు ఆరును కల్పితములని చెప్పవచ్చును. **'ఓం'** అను దానిని గూర్చి అది ఏ వివరము నిచ్చుచున్నదని, దాని సారాంశమేమని చెప్పిన వాడు దానికి తత్‌సత్ కలిపి పూర్ణము చేయడము ఆంజనేయునికి నామము పెట్టి ఇప్పుడు ఆంజనేయుడనవచ్చు అన్నట్లున్నది. కనుక జ్ఞానమును చేకూర్చలేనివి, అజ్ఞానమునిచ్చి సంశయము రేకెత్తించునవియు, ఒకచోట భగవంతుడు చెప్పిన దానికి విరుద్ధముగ మరొకచోట చెప్పబడిన శ్లోకములను ఇక్కడేకాక వెనుక అధ్యాయములలో కూడ మూడు నాలుగు చోట్ల తీసి ప్రక్కన పెట్టడము జరిగినది. హేతుబద్ధమైన జ్ఞాన జిజ్ఞాసపరులు మేము చెప్పిన మాటలను అర్థము చేసుకోగలరనుకుంటాము.

ఈ పదహారవ అధ్యాయములో చెప్పబడిన శ్లోకముల వివరములు క్రింద చూడవచ్చును.

| | | | |
|---|---|---|---|
| 1) | గుణములు | – | 6 |
| 2) | సాత్త్విక గుణము | – | 4 |
| 3) | రాజస గుణము | – | 4 |
| 4) | తామస గుణము | – | 4 |
| 5) | తపములు | – | 3 |
| 6) | ప్రకృతి–గుణములు | – | 1 |
| 7) | కల్పితములు | – | 6 |
| | మొత్తము శ్లోకములు | – | 28 |

*****

## పదిహేడవ అధ్యాయము

# మోక్ష సన్న్యాస యోగము

**అర్జునుడిట్లనియె :-**

*(17) శ్లో॥ 1: సన్న్యాసస్య మహాబాహో! తత్త్వ మిచ్ఛామి వేదితుమ్ ।*
*త్యాగస్య చ హృషీ కేశ! పృథ క్కేశినిషూదన! ॥*
*(కార్య సన్న్యాసము, కర్మ త్యాగము)*

**భావము :** ఓ కృష్ణా! సన్న్యాసము మరియు త్యాగము అనువాటి యొక్క నిజ తత్త్వమును వేరు వేరుగ విశదముగ తెలియకోరుచున్నాను.

**వివరము :** ఇక్కడ అర్జునునికి త్యాగము సన్న్యాసము అను రెండిటి మీద సంశయము వచ్చి రెండు వేరు వేరుగ ఉన్నాయనుకొని వాటి వివరమడిగాడు. త్యాగము సన్న్యాసము ఇంచుమించు ఒకే అర్థము నిచ్చునవైనప్పటికి వాటి పదములలో భేదముందని ఒప్పుకొనక తప్పదు. వదలుకోవడమని అర్థము నిచ్చు త్యాగ, సన్న్యాసములలో ఏమి తేడా కలదో క్రింది శ్లోకములో చూస్తాము.

*17) శ్లో॥ 2: కామ్యానాం కర్మణాం న్యాసం సన్న్యాసం కవయో విదుః ।*
*సర్వకర్మఫలత్యాగం ప్రాహుస్త్యాగం విచక్షణాః ॥*
*(కార్య సన్న్యాసము, కర్మ త్యాగము)*

**భావము :** కోరి చేయు పనులనెల్ల వదలి వేయడము సన్న్యాసమని కవులందురు. కోరి చేసిన పనులలోని ఫలితమును (కర్మను) వదలుకోవడము త్యాగమని జ్ఞానులందురు. (ఆత్మసంయమ యోగములో 1,2 శ్లోకములలో త్యాగమును కూడ సన్న్యాసమనియే చెప్పినట్లు గ్రహించవలెను.)

**వివరము :** శరీరములో ఒక కార్యము జరుగుటకు కర్మవలన గుణములు పని చేయునని తెలుసుకొన్నాము. కర్మనుండి కార్యము గుణముల ద్వార మొదలవు

చున్నప్పటికీ, ఎంతటి జ్ఞానికైన కర్మ ఏదో తెలియదు. ఫలానా గుణము నాలో పని చేయుచున్నదని గుణమును తెలుసుకోవచ్చును. అట్లే బుద్ధి వివరమును గమనించ వచ్చును. గుణముల దగ్గర నుండి జరిగే పనివరకు తెలుసుకోగల్గుచున్నాము. ఆ పనికి కారణమైన కర్మ, గుణము వెనుక ఉన్న దానివలన పూర్తి పని జరుగువరకు కర్మ ఎవరికీ ముందు తెలియదు. కావున మనకు కార్యము ఏ గుణములతో మొదలగుచున్నదని తెలియును. కాని దాని వెనుక ఎంత ప్రారబ్ధకర్మ ఉన్నది తెలియదు. ఇప్పుడు అసలు విషయానికొస్తాము. ఒక పని జరుగవలసియున్నపుడు బ్రహ్మయోగము ద్వార ఆ సమయములో ఆ పనిని చేయకుండ వదలుకోవడమును సన్న్యాసమని అందురు. ఇక్కడ పనికి కారణమైన ఆశ మొదలగు గుణములను వదలి వేయడము జరుగుచున్నది. ఒక్క బ్రహ్మయోగములో మాత్రము గుణములను నిరోధించుటకు వీలగుచున్నది. ఒక్క బ్రహ్మయోగి మాత్రమే బ్రహ్మయోగ సమయములోనే జరుగు పనులను నిరోధించ గల్గుచున్నాడు. ఏ గుణము పని చేయనిది, ఏ సంకల్పము బుద్ధికి లేనిది, చిత్తమునకు కార్య నిర్ణయములేనిది, ఇంద్రియములకు పనిలేనిది ఒక్క బ్రహ్మయోగ సమయము మాత్రమే. కనుక వాడు కామ్యాది పనులను వదులుకోవడము సన్న్యాసమని అంటున్నాము.

త్యాగము, సన్న్యాసము రెండు ఒకే అర్థము నిచ్చునవేయైనప్పటికి కార్యము జరుగక ముందు కార్యమునే వదులుకోవడమును సన్న్యాసమనియు, కార్యము జరిగిన తర్వాత అందులో వచ్చు కర్మను వదులుకోవడము త్యాగమనియు కొద్ది తేడాతో చెప్పవలసి వచ్చినది. త్యాగమను దానిని వివరించి చూచిన, ఒక కార్యము సర్వ సాధారణముగ గుణముల ప్రేరేపితము వలన జరిగినప్పటికి, ఆ కార్యములో వచ్చు ఫలితమైన పాపపుణ్యములను రాకుండ వదులుకోవడమును త్యాగ మంటున్నాము. అట్లు చేయు వానిని కర్మయోగి అంటున్నాము. ఈ విధానము ఒక్క కర్మయోగులకు మాత్రమే సాధ్యమగును. ఒక్క సమయములో కార్య ఫలితమును వదులుకోవడమును త్యాగమనియు, అదే విధముగ ఒక్క సమయములో కార్యమును వదులుకోవడమును సన్న్యాసమని అనుచున్నాము. రెండింటి ఉద్దేశ్యము అర్థము ఒక్కటే అయినప్పటికి ఒకటి కర్మయోగమనియు, రెండవది బ్రహ్మ యోగమనియు

తెలియవలెను. సన్న్యాసములో సంచితకర్మ, త్యాగములో ఆగామికర్మ వదలబడు చున్నది. సన్న్యాసములో ఉన్న సంచితకర్మ లేకుండ పోవుచున్నది. త్యాగములో వస్తున్న ఆగామికర్మ రాకుండ పోవుచున్నది. ఈ విషయము గూర్చి కర్మ సన్న్యాస యోగములో కూడ మొదటనే రెండిటి ఫలితము ఒక్కటేనని చెప్పబడినది. ఈ రెండు మోక్షమువైపు మార్గమును చూపునవై ఉన్నవి. ఇక్కడ వివరించి చెప్పు నిమిత్తము త్యాగమును సన్న్యాసమును వేరువేరుగ చెప్పవలసి వచ్చినది. గీతలో వెనుక అన్ని చోట్ల త్యాగమును కూడ సన్న్యాసమనియే చెప్పినట్లు గ్రహించవలెను.

(17) శ్లో॥ 3 : త్యాజ్యం దోషవ దిత్యేకే కర్మ ప్రాహుర్మనీషిణః ।
యజ్ఞదానతపఃకర్మ న త్యాజ్య మితి చాపరే ॥
(కల్పితము)

(17) శ్లో॥ 4 : నిశ్చయం శృణు మే తత్ర త్యాగే భరతసత్తమ ! ।
త్యాగో హి పురుషవ్యాఘ్ర ! త్రివిధ స్సమ్ప్రకీర్తితః ॥
(కల్పితము)

(17) శ్లో॥ 5 : యజ్ఞ దాన తపఃకర్మ న త్యాజ్యం కార్య మేవ తత్ ।
యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్ ॥
(కల్పితము)

(17) శ్లో॥ 6 : ఏతాన్యపి తు కర్మాణి సంగం త్యక్త్వా ఫలాని చ ।
కర్తవ్యా నీతి మే పార్థ ! నిశ్చితం మత ముత్తమమ్ ॥
(కల్పితము)

**వివరము :** ఈ నాల్గు శ్లోకములలో సారాంశము చూచిన యజ్ఞ, దాన, తపస్సు అనునవి మానవుని పావనము చేయు కార్యములని, వీటిని వదలకూడదని, వీటి వలన కర్మరాదని, ఈ మూడు మినహా సర్వ కార్యములందు కర్మలంటునని కొందరను చున్నారని చెప్పడమే కాక, ప్రత్యేకించి ఆరవ శ్లోకములో యజ్ఞ,తప,దానములనునవి కర్తవ్యములని, కోరిక లేకుండ చేయమనడము ఒక విధముగ అందరికి మంచిగ కనిపించినప్పటికి అందులో అసలైన సత్యమును కప్పిపుచ్చారు. ఈ శ్లోకము వలన

చాలామంది తప్పుదారి పట్టుటకు అవకాశమున్నది. భగవంతుడు చెప్పిన దానికి ఈ శ్లోకముల భావము అన్యముగ కనిపిస్తున్నది. అది ఏమనగా! మానవుని నిత్య జీవితములో ఎన్నో రకముల పనులు జరుగుచుండును. వాటి వలన కర్మ వచ్చుననుట నిజమే. ప్రతి పనిలోను కర్మకలదను సూత్రము ప్రకారము యజ్ఞ,దాన,తపములలో కూడ కర్మ కలదు. అన్ని పనులవలె కర్మనంటగట్టు యజ్ఞ,దాన,తపములు మానవుని పావనము చేయు సాధనములెట్లయినవి? అంతేకాక యజ్ఞ,దాన,తపములను కోర్కె లేకుండ చేయమని, అవి తప్పనిసరిగ చేయవలసిన కార్యములని చెప్పి, మిగతా కార్యముల గురించి చెప్పక పోవడము వలన, చాలామంది మూడు కార్యములలో మాత్రము కర్మ అంటదని, మిగతా కార్యములలో కర్మ అంటునని తలచుటకు అవకాశము గలదు. మానవుడు చేయు సర్వకార్యములను సమానముగ చెప్పక ఈ విధముగ యజ్ఞ, దాన,తపములను ప్రత్యేకించి చెప్పడములో భగవంతుడు తెలియజేసిన కర్మ యోగమునకు ముప్పు ఏర్పడుచున్నది. భగవంతుడు ఒకచోట చెప్పిన సూత్రబద్ధమైన విషయమునకు వ్యతిరిక్తముగవున్న శ్లోకములు మధ్యలో మానవుడు కల్పించినవని సులభముగ అర్థమగుచున్నది. మానవుని బుద్ధిలో కార్యముల తేడాలున్నవి. కావున యజ్ఞ,దాన,తపములు పవిత్రమైన కార్యములన్నారు. భగవంతుడు ఎన్నో చోట్ల సర్వకార్యములందు కర్మ అంటుచున్నదని చెప్పి, అవి అంటని విధానములను కూడ బోధించియున్నాడు. కనుక మేము ప్రత్యేకించి ప్రక్కవారిచే చెప్పబడిన యజ్ఞ దాన తపముల శ్లోకములను బయటపెట్టి తీసి వేయడము జరిగినది.

(17) శ్లో॥ 7 : నియతస్య తు సన్న్యాసః కర్మణో నోపపద్యతే ।
మోహాత్తస్య పరిత్యాగస్తామసః పరికీర్తితః ॥
(కల్పితము)

(17) శ్లో॥ 8 : దుఃఖ మిత్యేవ యత్కర్మ కాయక్లేశభయాత్త్యజేత్ ।
స కృత్వా రాజసం త్యాగం నైవ త్యాగఫలం లభేత్ ॥
(కల్పితము)

**భావము :** నియత కార్యములను త్యజింప తగదు. ఆ కార్యములను అజ్ఞానము

చేత త్యజించిన దానిని తామస త్యాగమందురు. అట్లే దుఃఖకరమైనదని శరీరమునకు చేయుటలో కష్టమైనదని వదలుట రాజస త్యాగమందురు.

**వివరము :** ఇక్కడ ఈ రెండు శ్లోకములు కూడ భగవంతుడు చెప్పిన జ్ఞానమునకు విరుద్ధమైనవి. కర్మ ప్రకారము నియమింపబడియున్న కార్యములను ఎవరైన తప్పక చేసి తీరవలసిందేనని వెనుక అధ్యాయములలో తెలుసుకొన్నాము. ఎవడైన నేను చేయనని పట్టుబట్టినప్పటికి వానిచేత బలవంతముగ కర్మ చేయించునని కూడ భగవంతుడు తెల్పియున్నాడు. ఎవరి ఇష్టముల మీద సంబంధములేని కర్మ నిర్ణయమును నేను చేయనని, చేయకుండ ఎవడైన తప్పించుకొనువాడు గలడా? తప్పకుండ చేయవలెనని చెప్పిన పరమాత్మ ఇక్కడ అలా చేయకుండ వదలడము తామసత్యాగమని, రాజసత్యాగమని చెప్పునా? అలా ఎవనికి ఇష్టమొచ్చినది వాడు చేసి, ఎవనికి ఇష్టము కాని దానిని వాడు వదలి వేసినట్లయితే, ఇక కర్మ యొక్క ప్రాబల్యము ఏమున్నది? కర్మ నిర్ణయమును ఎవడు అతిక్రమించలేడు. నీవు యుద్ధము చేయనను పట్టుపట్టినప్పటికి, విధి (కర్మ) బలవంతముగ నిన్ను ప్రేరేపించి నీచేత యుద్ధము చేయించి తీరునని చెప్పిన విధానమేమగును? భగవంతుడు చెప్పిన కర్మ సూత్రములకు ఈ రెండు శ్లోకములు కూడ విరుద్ధమైనవని తెలియ బడుచున్నవి. ఇంతేకాక తొమ్మిదవ శ్లోకమున నియతకర్మ ప్రకారము అహము లేకుండ, ఫలితము మీద ఆశలేకుండ, కార్యములను ఆచరించిన దానిని సాత్త్విక త్యాగమని చెప్పబడునన్నారు. 7, 8 రెండు శ్లోకములలో ఆచరించని దానిని త్యాగమనడమేమిటి? 9వ శ్లోకములో ఆచరించిన దానిని త్యాగమనడమేమిటి? ఇచటనే 7,8 శ్లోకములకు 9వ శ్లోకమునకు పూర్తి వ్యతిరిక్తత ఉండడము అందరు గమనించవచ్చును. సంస్కృతమును తెలిసిన వారు వారికిష్టమొచ్చినట్లు శ్లోకములల్లి భగవద్గీతలో చొప్పించిపెట్టి భగవంతుని భావమునకు విరుద్ధ ప్రచారము చేశారు. గీతను చదువువారు వాటి తేడాలు గమనించకపోవడము మరీ విచిత్రము. భగవంతుని భావానికి విరుద్ధ భావము సృష్టించిన వారెవరోగాని, వారికి భయంకర పాపమంటుకొనును. ఇక్కడ వరుసగ ఆరు శ్లోకములు అశాస్త్రీయమైనవి కల్పితమైనవి. రెండవ శ్లోకము తర్వాత తొమ్మిదవ శ్లోకముతో భగవద్గీత మొదలగుచున్నది.

(17)శ్లో॥ 9 : కార్య మిత్యేవ య త్కర్మ నియతం క్రియతేఽర్జున! ।
సంగం త్యక్త్వాఫలం చైవ స త్యాగ స్సాత్త్వికో మతః ॥
(సాత్త్వికము)

**భావము :** కర్మ నియతమైనది కార్యమని, కార్యము చేయుటలో సంగము లేకుండ ఫలితము మీద ధ్యాస లేకుండ చేయుట సాత్త్విక త్యాగమని అందురు.

**వివరము :** ఇది భగవంతుడు చెప్పిన శ్లోకమనుటలో సంశయములేదు. మనము నిత్యము చేయుపనులు ముందే నిర్ణయింపబడివున్నవి. గత జన్మల సంచితమను కర్మనుండి ఇప్పటి జన్మకు కొంత కర్మ పుట్టినప్పుడే కేటాయించబడివుండును. దానినే ప్రారబ్ధకర్మ అంటున్నాము. ప్రారబ్ధకర్మ పొల్లు పోవునది కాదు. దీని ప్రకారము ఎవరైన ఆడి తీరవలసిందే. మన శరీరములోని తలయందు ఎన్ని వెంట్రుకలుండ వలెనను విషయము మొదలుకొని ఎప్పుడేమి చేయవలెనను విషయము వరకు ఒక జన్మకు పూర్తి నిర్ణయింపబడి ఉండును. అలా నిర్ణయించబడివున్న ప్రారబ్ధకర్మను నియతకర్మ అంటున్నాము. నియతకర్మ ప్రకారము జరిగితీరునని తెలిసి జీవితములో తన చేత జరుగబడు కార్యములలో అహముతో కలువక, ఈ కార్యములలో పాపపుణ్య ఫలితము వచ్చునను ధ్యాస లేకుండ, తాను చేయవలసిన పని పద్ధతిగ చేసి తీరవలెనని నిమిత్తమాత్రముగ ఎవడు చేయుచున్నాడో, అట్టి దానిని సాత్త్విక త్యాగమని చెప్పుచున్నాము. ఇందులో వాడు విడచినదేది? దేనిని త్యాగమంటున్నామని అడిగిన దానికి సమాధానమేమనగా! కర్మ ప్రకారము జరుగబడు కార్యములోను కంటికి కనిపించకుండ కర్మ పుట్టుకొస్తున్నది. ఆ క్రొత్త కర్మను ఆగామికర్మ అంటున్నాము. ఆ ఆగామికర్మను ఎవడైతే తనకు అంటకుండ వదలించుకొనుచున్నాడో దానిని త్యాగమంటున్నాము. క్రొత్తదైన ఆగామికకర్మను తగులుకోకుండ చేసుకొనుటకు భగవంతుడు కర్మయోగమను విధానము చెప్పియున్నాడు. దాని ప్రకారము రాబోవు కర్మమీద కూడ ధ్యాసలేకుండ అహమును వదలి చేయవలసిన పనిని చేయడము వలన క్రొత్తకర్మను వదలినవాడగుచున్నాడు. దానినే త్యాగమని కూడ అంటున్నాము.

(17)శ్లో॥ 10 : న ద్వేష్ట్య కుశలం కర్మ కుశలే నానుషజ్జతే ।
త్యాగీ సత్త్వసమావిష్టో మేధావీ ఛిన్న సంశయః ॥
(కర్మ యోగము)

**భావము :** సత్త్వగుణ త్యాగియైనవాడు మేధావియై, సంశయములను ఛేదించు జ్ఞానము గలవాడై ఉండి, కార్యములలో కల్గు కర్మను నాశనము చేయగల అగ్ని గలవాడై ఉండును. తనకు సుఖము కలుగజేయు పనులయందు ఆసక్తి లేకుండా, దుఃఖము కష్టము కలుగజేయు పనులయందు అయిష్టతలేకుండును.

**వివరము :** జ్ఞానము తెలిసినవాడు నిర్ణయింపబడిన ప్రారబ్ధకర్మ ప్రకారము తన శరీరము ద్వార మంచి చెడు కష్టసుఖములను కలుగజేయునవి, పాపపుణ్యములను తెచ్చిపెట్టు పనులు జరుగుచుండునని తెలిసియుండును. మన ప్రమేయముతో సంబంధము లేకుండ కేవలము ప్రారబ్ధకర్మ ప్రమేయముతోనే జరుగు పనులయందు మన ఇష్టాయిష్ట సంబంధములేదని తెలిసినవాడు, మంచి పనులకొరకు ఆసక్తి చూపడముగాని, చెడు పనులందు అనాసక్తి చూపుటగాని లేకుండును. అశుభ కార్యముల మీద ద్వేషముగాని, శుభకార్యములందు కోరికగాని లేనివాడు, కార్యముల వలన కల్గు కర్మలను కాల్చివేయు అగ్నిగలవాడు గొప్ప జ్ఞానిగ యోగిగ చెప్ప బడుచున్నాడు.

(17) శ్లో॥ 11 : నహి దేహభృతా శక్యం త్యక్తుం కర్మాణ్యశేషతః ।
యస్తు కర్మఫలత్యాగీ స త్యాగీ త్యభిధీయతే ॥
(కర్మయోగము)

**భావము :** దేహము ధరించినవాడు సంపూర్ణముగ కర్మను వదలి పెట్టుటకు శక్యము కాదు. ఎవడు కర్మఫలత్యాగము చేయునో వాడు త్యాగి అనబడును.

**వివరము :** శరీరము ధరించిన ఏ జీవుడైనగాని తన జీవితకాలమునకు సరిపడునదిగ నిర్ణయింపబడిన ప్రారబ్ధకర్మప్రకారము జరుగవలసిన పనులను వదలుటకు శక్యము కాదు. నిర్ణయింపబడియున్న కర్మలు కార్యరూపముగ జరిగి తీరవలసిందే. వాటిని చేయకూడదను వాడుగాని, చేయనను వాడుగాని కర్మ శాసనములను పూర్తిగ

తెలియనివాడేనని చెప్పవచ్చును. నియత కర్మను ఆచరించకుండ ఉండుటకు ఎవరికీ వీలుకాదు. నియతమైన ప్రారబ్ధకర్మలో మంచి పనులున్నా, చెడు పనులున్నా తప్పక చేసి తీరవలసిందే. మంచిపనులు మాత్రము చేసెదను, చెడుపనులు చేయననుటకు వీలులేదు. ఒకవేళ చెడు పనులనే చేసెదను, మంచి పనులను చేయననుటకు కూడ వీలులేదు. ఆచరణకు ఏ పనులు వచ్చిన వాటిని కర్మ ప్రేరేపించి వానిచేత తప్పక చేయించును. కర్మచేతిలో కీలుబొమ్మవలె కదలుచున్న మానవుడు(జీవుడు) అన్ని పనులు చేయవలసి వస్తున్నది.

జ్ఞానియైనవాడు కర్మలవలన జరుగవలసిన పనులు చేయక తప్పదని తెలిసినవాడై, జరిగెడి పనులలో క్రొత్తగావచ్చు ఆగామికకర్మయను దానిని కర్మయోగ పద్ధతి ద్వారా రాకుండ చేసుకొనుచుండును. యోగపద్ధతి తెలిసి ప్రారబ్ధకర్మను పనుల రూపముగ ఆచరించుచు, ఆ పనుల ద్వారా వచ్చు ఆగామికకర్మను రాకుండ చేసుకొను వానిని త్యాగి అనవచ్చును. పాత కర్మలాచరించుచు క్రొత్త కర్మలు రాకుండ చేయువానిని కర్మయోగి అనియు కర్మత్యాగి అనియు అనవచ్చును.

*(17) శ్లో ॥ 12 : అనిష్టమిష్టం మిశ్రం చ త్రివిధం కర్మణః ఫలమ్ ।*
*భవత్యత్యాగినాం ప్రేత్య న తు సన్న్యాసినాం క్వచిత్ ॥*
*(కర్మయోగము)*

**భావము :** అనిష్టమనియు, ఇష్టమనియు, మిశ్రమమైనదనియు మూడు విధ కర్మలు త్యాగులు కానివారికి మరణానంతరము కలుగుచున్నవి. త్యాగియైనవానికి ఏ కర్మలు లేవు.

**వివరము :** ప్రపంచములో నిత్యము పనులు చేయువానికి చేసే పనులను బట్టి సుకర్మ, దుష్కర్మ, మిశ్రమకర్మ అని మూడు విధములైన కర్మలు తగులుకొనుచున్నవి. మరణానంతరము తర్వాత జన్మలలో ఆ మూడు విధముల కర్మములయొక్క ఫలితములైన సుఖములను, కష్టములను మరియు కష్టసుఖమిశ్రమములను జీవుడు అనుభవించవలసివుండును. ఇది సాధారణ మనుషులకు జరిగెడి విధానము. యోగులైన వారికి త్రివిధకర్మలు లేవు వాటి పనులు లేవు. ఎందుకనగా! కర్మయోగి

అయినవాడు మొదట పనులు చేయునపుడే జాగ్రత్తకల్గి ఆ పనిలోని కర్మను అంటించుకొనడు. అందువలన ఏ కర్మ వానికి లేదు.

(17) శ్లో॥ 13 : పంచైతాని మహాబాహో ! కారణాని నిబోధ మే ।
సాంఖ్యే కృతాన్తే ప్రోక్తాని సిద్ధయే సర్వకర్మణామ్ ॥
(ప్రకృతి)

**భావము :** సర్వకర్మలు ఆచరించుటకు సాంఖ్యసూత్రము ప్రకారము ఐదు కారణములు ఉన్నవని చెప్పబడినవి. వాటిని వివరింతును తెలుసుకొనుము.

**వివరము :** ప్రారబ్ధకర్మములో ఉన్న సర్వ కర్మలు కార్యరూపమై జగతిలో జరుగుటకు ముఖ్యముగ శరీరములో ఐదు భాగములు కారణమైవున్నవని, శరీర యంత్రాంగమును గూర్చి విపులముగ తెలిసినవారు చెప్పియున్నారు.

(17) శ్లో॥ 14 : అధిష్ఠానం తథా కర్తా కరణం చ పృథగ్విధమ్ ।
వివిధాశ్చ పృథక్చేష్టా దైవం చైవాత్ర పంచమమ్ ॥
(ప్రకృతి)

**భావము :** శరీరమును అధిష్ఠించియున్న వాటిలో అనేక కార్యములు చేయు బాహ్య కరణములు, వివిధ కార్యములు చేయించు అంతఃకరణములు వీటిలో దైవమొకటి కలసి మొత్తము ఐదు కర్తలైయున్నవి.

**వివరము :** శరీరమను వేదిక మీద ప్రారబ్ధకర్మ అమలై కార్యములు జరుగుటకు కారణము ముఖ్యముగ శరీరములోని ఐదు భాగములని ముందే తెలిపివున్నారు. అంతేకాక కర్మ కార్యముల మొత్తము తతంగమునకు వేదికగ శరీరమున్నది. శరీర వేదికలో కార్యము జరిగి కర్మ అమలు జరుగుటకు ముఖ్యకారణములైన భాగములు 1) మనస్సు 2) బుద్ధి 3) చిత్తము 4) శరీర బాహ్యాయింద్రియములు. శరీరము నందు కార్యములు జరుగుటకు ముఖ్య సూత్రధారులైన ఈ నాలుగు బాహ్య ఇంద్రియములు, అంతఃకరణములు కాక మరొకటి కూడ గలదు అదియే ఆత్మ. ఆత్మ అన్నిటికి శక్తినిచ్చి పని చేయించుచున్నది. వివిధ పనులు చేయు యంత్రములకు

కరెంటు ఎట్లు ఉపయోగపడుచున్నదో, అట్లే ఆత్మ యొక్క చైతన్యము చేతనే శరీరము మొత్తము బయటి లోపలి భాగములు పనిచేయుచున్నవి. ఇలా ఆత్మతో కలిపి మొత్తము ఐదు భాగములు ప్రారబ్ధకర్మ అమలు జరుగుటకు కర్తలైవున్నవి. ఇందులో ముఖ్యముగ జ్ఞాపకము పెట్టుకొనవలసినదేమనగా! శరీరములోని జీవునికి కార్యములు చేయుటలో ఏ పాత్రలేదు. జీవుడు శరీరములో కేవలము కష్టసుఖములను అనుభవించుటకు మాత్రమే ఉన్నాడు. పనులు జరుగుటలో వానికేమి సంబంధములేదు.

(17) శ్లో ॥ 15 : శరీరవాఙ్మనోభి ర్యత్క ర్మ ప్రారంభతే నరః ।
న్యాయ్యం వా విపరీతం వాపంచైతే తస్య హేతవః ॥
(ప్రకృతి)

**భావము :** మానవుడు మనోవాక్కాయములచే ప్రారంభించు కార్యములు న్యాయమైనవి గాని, అన్యాయమైనవిగాని వాటికి పైన చెప్పబడిన ఐదు భాగములు కారణములని చెప్పవచ్చును.

**వివరము :** మానవుడు చేయు ప్రతి పనికి శరీరములోని పది ఒక గుంపుగవున్న పది బాహ్యేంద్రియములైన కర్మేంద్రియ, జ్ఞానేంద్రియములు, మరియొక గుంపుగనున్న అంతఃకరణములైన మనోబుద్ధి చిత్తములను నాలుగు మరియు ఆత్మ ఒకటి కలిసి ఐదు కర్తలైయున్నవి. మనిషి చేయు మంచిపనిగాని, చెడుపనిగాని, న్యాయమైనదిగాని, అన్యాయమైనదిగాని, కర్మ ప్రకారమున్న ఏదిగాని శరీరములో కార్యరూపముగ చేయుటకు ఈ ఐదే కర్తలని గ్రహించవలెను. జీవుడు ఏమాత్రము కర్తగాడు, జీవుడు సుఖదుఃఖములను అనుభవించు భోక్త మాత్రమేనని గుర్తుంచుకోవలెను.

(17) శ్లో ॥ 16 : తత్రైవం సతి కర్తారం ఆత్మానం కేవలం తు యః ।
పశ్య త్యకృతబుద్ధిత్వాత్ న స పశ్యతి దుర్మతిః ॥
(జీవాత్మ)

**భావము :** కర్మ కార్య విషయములందు కర్తలైదునుండుగ, అజ్ఞానియైనవాడు అన్నిటికి జీవాత్మయే (తానే) కర్తయని తలచుచున్నాడు. అట్టివాడు తెలివి తక్కువవాడై తన నిజస్థితిని తెలియకున్నాడు.

**వివరము :** జగతిలో కర్మ ప్రకారము సర్వకార్యములను జరిపించునవి ఒకే గుంపుగ బయటవున్న జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు, మనో, బుద్ధి, చిత్తము మరియు వాటికి శక్తి నిచ్చు ఆత్మవుండగ అజ్ఞానియైన జీవాత్మ అన్ని పనులకు తానే కర్తనని తలపోయుచుండును. చూస్తున్నవాడు చేస్తున్నాననుకోవడము తప్పు గదా! జరుగు సంఘటనలోని అనుభవములను మాత్రము అనుభవిస్తు, పనులు ఇతరుల చేత జరుపబడుచున్నవని తెలియని జీవాత్మ, తానే కార్యములకు కర్తననుకొనుచున్నాడు. శరీర యంత్రాంగ వివరము తెలియనివాడు, శరీరములో తానెక్కడున్నానని తెలియనివాడు, శరీరములో తానేమి చేయుచున్నానని తెలియనివాడు, తనకు సమీపములో ఉన్న అహము యొక్క మాట విని అహంకారమగ్నుడై పనులన్నిటిని నేనే చేయుచున్నానని తలచుచున్నాడు. శరీరము మొత్తము నేనేనను భావము కల్గివున్నాడు. శరీరము మొత్తము నేనేనని అనుకోవడము వలన శరీరములో వెనుకటి కర్మరీత్య జరిగెడి పనులన్నిటిలోను క్రొత్త ఆగామికకర్మ తయారై జీవున్ని అంటుకొనుచున్నది. జీవుడు జరిగెడి పనులను నేనే చేయుచున్నాననుకోవడము వలననే క్రొత్తకర్మ అంటుకొనుచున్నది. అలా అనుకోకపోతే క్రొత్త కర్మ అంటుకొనెడిది కాదు. జగత్తులో అనేక హోదాలలో అనేక విధములుగ జీవించు జీవాత్మలందరు పనులకు నేనే కర్తననుకోవడము వలననే కర్మలు సంపాదించుకొని, వాటిని అనుభవించుటకు మరుజన్మలెత్తుచు, అక్కడ కర్మలననుభవిస్తు మరి క్రొత్త కర్మ సంపాదించుకొనుచు, వాటిని అనుభవించుటకు తిరిగి పుట్టుచు, జనన మరణమను విధానమును చక్రమువలె తయారు చేసుకొన్నారు. కర్మను అనుభవించడము సంపాదించుకోవడము ఒకదానితో ఒకటి అనుసంధానమై ఉన్నదానివలన, వాటినుండి బయటపడలేకున్నారు. ఎవడైతే శరీర యంత్రాంగ నిజస్థితిని తెలుసుకొంటాడో, వాడు పాతకర్మను అనుభవిస్తు క్రొత్త కర్మను సంపాదించుకోడు. అటువంటి వాడు పాతకర్మ అయిపోయిన వెంటనే మోక్షమును పొంది పరమాత్మలోనైక్యము కాగలడు.

*(17) శ్లో॥ 17 : యస్య నాహంకృతోభావో బుద్ధి ర్యస్య న లిప్యతే ।*
*హత్వాపి స ఇమాన్ లోకాన్న హన్తి ననిబధ్యతే ॥*
*(కర్మయోగము)*

**భావము :** ఎవని భావములో అహము లేదో, ఎవని బుద్ధి ఫలితము మీద ఉండదో, వాడు జగత్తులోని అందరిని చంపినప్పటికి వానికి కర్మ అంటదు. వాడు హంతకుడు కాడు.

**వివరము :** జగత్తులోని కార్యములన్నియు కర్మరీత్య అంతర బాహ్యేంద్రియముల ద్వారా ఆత్మశక్తిచే జరుగుచున్నవని తెలిసినవాడై, నేను కర్తనను అహమును వదలి, వచ్చెడు లాభనష్టముల మీద బుద్ధినుంచకవుండునో అట్టివానికి ఏ కర్మ అంటదు. అదే సూత్రము ప్రకారము ఏ పని జరుగుచున్నప్పటికి కర్మ అంటదు. ఈ సూత్రము ప్రకారమే ఎందరినో హత్య చేసినప్పటికి వాడు హంతకుడు కాదు. హత్యా పాపము వానిని అంటదని చెప్పవచ్చును. ఇలాగే గొప్ప సత్కర్మ చేసినను వానికి పుణ్యము రాదు. అహములేనివాడు చేసిన పనులలో దుష్కర్మ, సుకర్మ అనబడు పాపపుణ్యములు వానికిరావు.

*(17) శ్లో॥ 18 : జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధా కర్మచోదనా ।*
*కరణం కర్మ కర్తేతి త్రివిధః కర్మసంగ్రహః ॥*
*(యోగము, వియోగము)*

**భావము :** జ్ఞానము, జ్ఞేయము, పరిజ్ఞాతయని, కర్మచ్ఛేదనమునకు చేయునది, చేయువాడు, సంభవించునదియని కర్మ సంభవమునకు మూడు విధములున్నవి.

**వివరము :** ఇక్కడ శ్లోకములో **'కర్మచోదన'** అను పదము ఉపయోగింపబడివున్నది. కర్మను చోదించుట లేక కర్మను తెలియుట అను అర్థమిచ్చు ఈ పదమిచ్చట సందర్భాను సారము సరిపోదు. వాస్తవముగ ఇచట ఉండవలసిన పదము కర్మచ్ఛేదనా అని ఉండవలెను. **"కర్మచ్ఛేదనా"** అనుటలో పొరపాటుగ కర్మచోదనా అనడము జరిగి ఉంటుందనుకొంటాము. కర్మచ్ఛేదన అనుటలో కర్మను లేకుండ చేయుట అని అర్థము గలదు.

తెలియజేయునది జ్ఞానము, తెలియబడునది జ్ఞేయము. తెలుసుకొనువాడు పరిజ్ఞాత. జ్ఞానము వలన జ్ఞేయమును తెలిసినవాడు కర్మచ్ఛేదనము చేయును. అట్లే చేయునది కరణం, చేయించునది కర్మ, చేయువాడు కర్త అనియు మూడు

విధానములు గలవు. వీటివలన జీవునకు కర్మ సంభవించుచున్నది. మూడు విధములైన ఒక పద్ధతి వలన కర్మచ్ఛేదము. అట్లే మూడు విధములైన మరియొక పద్ధతి వలన కర్మ సంగ్రహము జరుగుచున్నది.

*(17)శ్లో॥ 19 : జ్ఞానం కర్మ చ కర్తా చ త్రిధైవ గుణభేదతః ।*
*ప్రోచ్యతే గుణ సంఖ్యానే యథావ చ్ఛృణు తా న్యపి ॥*
*(గుణములు)*

**భావము :** గుణ వివరణ సాంఖ్యమునందు గుణ భేదములను బట్టి జ్ఞానము, కర్త, కర్మ అనునవి మూడు విధములుగ ఉన్నవి. వాటి వివరమును చెప్పెద శ్రద్ధగ వినుము.

**వివరము :** సాంఖ్యశాస్త్రము (శరీర యంత్రాంగము) అనుసరించి, తలలోని గుణచక్రములో గల భేదములను బట్టి ప్రతి మనిషి చేయు కార్యములలో కర్మ, కర్త, జ్ఞానము అను వాటియందు మూడు విధములు కలవు. పనిని చేయునప్పుడున్న జ్ఞానమును మూడు విధములైన గుణముల సంబంధముగ చెప్పుచు, అట్లే చేయుచున్న పనిని చేయుచున్న వానిని కూడ మూడు విధములుగ చెప్పుట జరిగినది. దానిని క్రింది శ్లోకములలో చూడగలము.

*(17)శ్లో॥ 20 : సర్వ భూతేషు యే నైకం భావ మవ్యయ మీక్షతే ।*
*అవిభక్తం విభక్తేషు తద్జ్ఞానం విద్ధి సాత్త్వికమ్ ॥*
*(సాత్త్వికజ్ఞానము)*

**భావము :** సర్వ జీవరాసులందు ఉన్న పరమాత్మ నాశరహితమై ఒకే రూపముగ ఉన్నదని, వేరు వేరు ఆకారములుగ ఉన్న జీవశరీరములందు వేరువేరుగ విభజింపబడినదై ఏకముగ ఉన్నదని తెలుపు జ్ఞానమును సాత్త్విక జ్ఞానమందురు.

**వివరము :** అణువణువున వ్యాపించిన పరమాత్మను సర్వజీవరాసుల శరీరమందు అవ్యయునిగ ఎవడు చూచుచున్నాడో, మరియు అనేక విధములైన ఆకారములుగ విభజింపబడిన శరీరములలో ఒకే ఆకారముగ ఉండి విభజింపబడనిదై పరమాత్మ గలదని తెలుపు జ్ఞానము ఎవనికి కలదో, ఆ జ్ఞానమును సాత్త్విక జ్ఞానమందురు.

(17) శ్లో॥ 21: పృథక్త్వేన తు యద్జ్ఞానం నానాభావాన్ పృథగ్విధాన్ ।
వేత్తి సర్వేషు భూతేషు తద్ జ్ఞానం విద్ధి రాజసమ్ ॥
(రాజసజ్ఞానము)

**భావము :** సర్వ జీవరాసులందు భావమును బట్టి అందులోని పరమాత్మ కూడ వేరు వేరుగవున్నాడని తెలుపు జ్ఞానము రాజసజ్ఞానమగును.

**వివరము :** అన్ని జీవరాసులలో వాటి భావములు వేరైనప్పటికి, పరమాత్మ అంశ ఒకటిగానే ఉన్నదని తెలియక జీవుల భావములున్నట్లే పరమాత్మ కూడ అనేక విధములుగ ఉన్నదని తెలుపు జ్ఞానము రాజస జ్ఞానమని అనవచ్చును.

(17) శ్లో॥ 22 : యత్తు కృత్స్నవ దేకస్మిన్ కార్యే సక్త మహైతుకమ్ ।
అతత్త్వార్థవ దల్పం చ తత్తామస ముదాహృతమ్ ॥
(తామసజ్ఞానము)

**భావము :** శాస్త్రబద్ధము కానట్టిది, అసత్యమైనది, అల్పమైనదియునైన ఒక్క కార్యమే సర్వార్థసిద్ధియనుచు, ఆసక్తియంతయు దానియందుంచు జ్ఞానమును తామస జ్ఞానమందురు.

(17) శ్లో॥ 23 : నియతం సంగరహితం అరాగద్వేషతః కృతమ్ ।
అఫలప్రేప్సునా కర్మ యత్త త్సాత్త్విక ముచ్యతే ॥
(సాత్త్వికకర్మ)

**భావము :** ఫలాపేక్ష లేక, సంగరహితముగ, ప్రేమ ద్వేషములులేకుండ చేయు నియతకర్మ (ప్రారబ్ధకర్మ)ను సాత్త్వికకర్మ అనబడును.

(17) శ్లో॥ 24 : యత్తు కామేప్సునా కర్మ సాహంకా రేణ వా పునః ।
క్రియతే బహులాయాసం త ద్రాజస ముదాహృతమ్ ॥
(రాజసకర్మ)

**భావము :** కోర్కె కలవాడై మిక్కిలి ప్రయాసతో, కర్త తానన్న అహంభావముతో గర్వ పడుచు చేయు కర్మను రాజసకర్మయని అందురు.

*(17)శ్లో॥ 25 : అనుబంధం క్షయం హింసాం అనపేక్ష్య చ పౌరుషమ్ ।*
*మోహా దారభ్యతే కర్మ య త్త త్తామస ముచ్యతే ॥*
*( తామసకర్మ)*

**భావము :** తాను చేయు పనివలన కలుగు నాశనమును, హింసను ఆలోచించక, తన చేతనౌనో కాదోయని యోచించక, పౌరుషములచే అజ్ఞానభ్రాంతితో చేయు కర్మములను తామసకర్మలని అందురు.

*(17)శ్లో॥ 26 : ముక్తసంగోఽనహంవాదీ ధృత్యుత్సాహసమన్వితః ।*
*సిద్ధ్యసిద్ధ్యో ర్ని ర్వికారః కర్తాసాత్త్విక ఉచ్యతే ॥*
*( సాత్త్విక కర్త)*

**భావము :** సంగరహితుడై కర్త తానన్న అహంకారములేకుండ ధైర్యము ఉత్సాహము కల్గి, కార్యఫలములలో నష్టలాభముల మీద కలత చెందనివాడై, పనులు చేయు వానిని సాత్త్విక కర్తయని అందురు.

*(17)శ్లో॥ 27 : రాగీ కర్మఫలప్రేప్సుః లుబ్ధో హింసాత్మకోఽశుచిః ।*
*హర్షశోకాన్వితః కర్తారాజసః పరికీర్తితః ॥*
*( రాజసకర్త)*

**భావము :** బంధువుల మీద ప్రేమ కలిగి కార్యములలో లాభమును కోరువాడై, లోభియగుచు హింస చేయువాడై, శుభ్రతలేనివాడై, సంతోష దుఃఖములకు చలించువాడు రాజసకర్తయగును.

*(17)శ్లో॥ 28 : అయుక్తః ప్రాకృత స్స్తబ్ధః శఠో నైష్కృతి కోఽలసః ।*
*విషాదీ దీర్ఘసూ త్రీ చ కర్తాతామస ఉచ్యతే ॥*
*( తామసకర్త)*

**భావము :** అస్థిర స్వభావుడు, అనర్హుడును, శాస్త్రవిధానము తెలియని అవిద్యాపరుడును, ఏదీ ఆరంభించక ఉండువాడు, మోసగాడును, ఇతరులను చెరచువాడు, సోమరితనము గలవాడును, విషాదపరుడు, తొందరగ చేయవలసిన దానిని దీర్ఘకాలము వరకు చేయనివాడు తామసకర్తయని చెప్పబడును.

(17) శ్లో॥ 29 : బుద్ధే ర్భేదం ధృతే శ్చైవ గుణత స్త్రివిధం శృణు ।
ప్రోచ్యమాన మశేషేణ పృథ క్త్వేన ధనంజయ ! ॥
(గుణములు)

**భావము :** మానవునికి ఉన్న త్రిగుణములనుబట్టి వానికున్న బుద్ధి మరియు ధైర్యములు మూడు విధములుగ ఉన్నవి. వాటిని మూడు విధములుగ ఒక్కొక్క దానిని వివరించి తెలిపెదను వినుము.

(17) శ్లో॥ 30 : ప్రవృత్తిం చ నివృత్తిం చ కార్యా కార్యేభయాభయే ।
బంధం మోక్షం చ యా వేత్తి బుద్ధి స్సా పార్థ! సాత్త్వికీ ॥
(సాత్త్వికబుద్ధి)

**భావము :** ఇది జన్మలు కల్గించునదని, ఇది జన్మరాహిత్యము చేయునదని, ఇది కార్యమని, ఇది అకార్యమనియు, ఇవి భయాభయములని, ఇది బంధము, ఇది మోక్షము అని వివరించి తెలుపు బుద్ధి సాత్త్వికబుద్ధి అని చెప్పవచ్చును.

(17) శ్లో॥ 31 : యయా ధర్మ మధర్మం చ కార్యం చాకార్య మేవ చ ।
అయథావ త్ప్రజానాతి బుద్ధిస్సా పార్థ! రాజసీ ॥
(రాజసబుద్ధి)

**భావము :** ఇది ధర్మమని, ఇది అధర్మమని, ఇది కార్యమని, ఇది అకార్యమని ఉన్నదున్నట్లు తెలియజేయలేక పొరపాటుగ వేరుదానిని సూచించు బుద్ధి రాజస బుద్ధియని చెప్పవచ్చును.

(17) శ్లో॥ 32 : అధర్మం ధర్మ మితి యా మన్యతే తమసాఽవృతా ।
సర్వార్థాన్ విపరీతాం శ్చ బుద్ధి స్సా పార్థ! తామసీ ॥
(తామసబుద్ధి)

**భావము :** అజ్ఞానము చేత అధర్మమును ధర్మమనిపించుచు, మరియు తెలియదగిన వాటినన్నిటికి విరుద్ధముగ తెలుపుచున్న బుద్ధిని తామసబుద్ధి అని అందురు.

(17)శ్లో33: ధృత్యా యయా ధారయతే మనః ప్రాణేన్ద్రియక్రియాః ।
యోగే నావ్యభిచారిణ్యా ధృతి స్సాపార్థ! సాత్త్వికీ ॥
(సాత్త్వికధృతి)

**భావము :** శరీరములోని మనస్సు, ఇంద్రియములు, వాయువుల యొక్క పనులను నిలుపగల్గి వాటిని యోగమందు తగులుకొని నిలుచునట్లు చేయు ధైర్యమును సాత్త్విక ధైర్యమని చెప్పవచ్చును.

(17)శ్లో॥ 34 : యయా తు ధర్మకామార్థన్ ధృత్యా ధారయతేఽర్జున! ।
ప్రసంగేన ఫలాకాంక్షీ ధృతి స్సా పార్థ! రాజసీ ॥
(రాజసధృతి)

**భావము :** మిక్కిలి ఆసక్తిగల ఫలకాంక్షచే ధర్మముయందును ధనము కొరకు ఆశను కలుగజేయు ధృతిని రాజస ధైర్యము అనవచ్చును.

(17)శ్లో॥35: యయా స్వప్నం భయం శోకం విషాదం మదమేవ చ ।
న విముంచతి దుర్మేధా ధృతిస్సా పార్థ! తామసీ ॥
(తామసధృతి)

**భావము :** స్వప్నము, భయము, శోకము, విషాద, మదములు మొదలుగా గల విషయములందు మదిని విడువకుండ నిల్పు దుష్టునికున్న ధైర్యమును తామస ధృతి అనవచ్చును.

(17)శ్లో ॥ 36 : సుఖం త్విదానీం త్రివిధం శృణు మే భరతర్షభ!
అభ్యాసా ద్రమతే యత్ర దుఃఖాంతం చ నిగచ్ఛతి ॥
(గుణములు)

**భావము :** అభ్యాసవశమున ఏ సుఖము కల్గుచున్నదో, దేనివలన దుఃఖములు సమసిపోవుచున్నవో, ఆ మూడు విధములైన సుఖములను వివరించెదను వినుము.

(17) శ్లో॥ 37 : యత్తదగ్రే విషమివ పరిణామేఽమృతోపమమ్ ।
తత్సుఖం సాత్త్వికం ప్రోక్త మాత్మబుద్ధి ప్రసాదజమ్ ॥
(సాత్త్విక సుఖము)

**భావము :** మొదట చూచిన విషతుల్యముగ తోచుచు, పోను పోను తుదకు అమృత తుల్యముగ కనిపించు, ఆత్మ విషయమందు యోచించు బుద్ధికి కల్గు సుఖమును సాత్త్విక సుఖమని అందురు.

(17) శ్లో॥ 38 : విషయేన్ద్రియ సంయోగా ద్యత్త దగ్రేఽమృతోపమమ్ ।
పరిణామే విష మివ తత్సుఖం రాజసం స్మృతిమ్ ॥
(రాజస సుఖము)

**భావము :** విషయములు, ఇంద్రియములు కలిసి ఏకమై ఆదియందు అమృత సమానముగ తోచు సుఖము, పోను పోను పరిణామము చెందుచు చివరకు విషముతో సమానముగ కనిపించును, అట్టి సుఖమును రాజస సుఖమని అందురు.

(17) శ్లో॥ 39 : య దగ్రే చానుబన్ధే చ సుఖం మోహాన మాత్మనః ।
నిద్రాలస్య ప్రమాదోత్థం త త్తామస ముదాహృతమ్ ॥
(తామస సుఖము)

**భావము :** ఆదియందు అంత్యమందు కూడ నిద్ర, ఆలస్య, ప్రమాదములతో కూడి మనస్సును అజ్ఞానమందు ముంచు సుఖమును తామస సుఖమని చెప్పవచ్చును.

(17) శ్లో॥ 40 : న త దస్తి పృథివ్యాం వా దివి దేవేషు వాపునః ।
సత్త్వం ప్రకృతిజైర్ముక్తం యదేభి స్స్యాత్త్రిభిర్గుణైః ॥
(గుణములు)

**భావము :** భూమి మీద గల సమస్త జీవరాసులలోను మరియు దైవత్వముగల దేవతలలోను ఎవడైననుగాని, ప్రకృతి జనిత గుణములను పూర్తి విసర్జించి చరించువాడు లేడు.

**వివరము :** ప్రతి మానవుడు బ్రతుకు తెరువుకోసము పని చేయవలసియున్నది. ప్రతిపని గుణప్రేరితమై జరుగవలసియున్నది. గుణములేనిది పనిలేదు. పని జరుగవలెనంటే గుణముండితీరవలసిందే. అటువంటప్పుడు ఎవడైనగాని దేవతలలో గాని, రాక్షసులలోగాని మూడు గుణములను వదలి ఉండువాడులేడని తెలియుచున్నది. ఇక్కడ కొందరికొక ప్రశ్న రావచ్చును. అది ఏమనగా యోగము చేయు సమయములో మూడు గుణములు వదలియే కదా! ఉన్నది అని అడుగవచ్చును. దానికి సమాధానమేమనగా! సమాజములో వ్యవహరించు మనిషి గుణములు కలవాడని చెప్పాము, కాని వ్యవహరించకుండ యోగము చేయువారి యొక్క విషయము చెప్పలేదు. గుణములులేని వానిని యోగి అంటాము. అతడు కూడ కొద్దిసేపు యోగములో ఉండి, మరికొంత కాలము సాధారణముగ గుణములలోనే ఉండునని గ్రహించవలెను.

ఇక్కడ ఎనిమిది శ్లోకములు వరుసగ కల్పితము చేసి కలుపబడి యున్నవి. ఈ ఎనిమిది శ్లోకములలోని భావము భగవంతుడు చెప్పిన జ్ఞానమునకు పూర్తి వ్యతిరిక్తముగ ఉన్నది. కావున వీటిని బయటపెట్టవలసి వచ్చినది. భగవద్గీత కానటువంటి ఈ శ్లోకములు గీతవలె ఉన్నప్పటికి, వాటి భావము సంకుచితమైనది కావున సులభముగ గుర్తించుటకు వీలైనది.

పరమాత్మ మానవులను సృష్ఠించి తనను తెలుసుకొమ్మని చెప్పాడుకాని కులముల, మతముల పేరిట విభజించలేదు. నేడు భూమి మీదగల కులమతములు మానవుని సృష్ఠియేగాని పరమాత్మ సృష్ఠికాదని తెలియాలి. ఈ విషయమై మూడవ అధ్యాయమైన జ్ఞానయోగములో 13వ శ్లోకమున **"చాతుర్వర్ణ్యం మయాసృష్టం"** అను మాటవద్ద నాల్గువర్ణములనగా నాల్గుకులములుకాదని కూడ చెప్పియున్నాము. ఇక్కడ మరియు ఈ శ్లోకములలో నాల్గుకులములైన బ్రాహ్మణ, వైశ్య, క్షత్రియ, శూద్రుల గురించి చెప్పుచు వారి కులములను బట్టి పనులు నిర్ణయించి అవియే వారి స్వధర్మములని చెప్పడము చాలా విచిత్రము, జ్ఞానవిరుద్ధము. అంతేకాక కులమును బట్టి పని చేయడము స్వధర్మమాచరించినట్లని, స్వధర్మాచరణమైన వారి పనులకు కర్మ అంటదని చెప్పడము యోగశాస్త్రమైన భగవద్గీతకే వ్యతిరేఖము.

భగవద్గీతలోనే భగవద్గీతకు వ్యతిరేఖ భావమునిచ్చు శ్లోకములుండడము గమనిస్తే దానిని గూర్చి ఏమని చెప్పాలో కూడ అర్థముకాదు. ఏది ఏమైనప్పటికి అవి బయటపడడము మన అదృష్టమని అనుకోవచ్చును. క్రింద వాటినెలా వ్రాశారో వాటిలోని భావమేమిటో చూచి వాటి వివరణ మన బుద్ధితో యోచిద్దాము.

(17) శ్లో॥ 41 : బ్రాహ్మణ క్షత్రియవిశాం శూద్రాణాం చ పరన్తప !
కర్మాణి ప్రవిభక్తాని స్వభావప్రభవైర్గుణైః ॥
(కల్పితము)

**భావము :** బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర జాతుల స్వభావములను బట్టి వేరువేరు పనులు గలవు వాటిని వివరింతును.

**వివర్శ :** కులమును బట్టి పనియని, ఆ పనులు వారి స్వభావజనితములైనవని, అవియే వారి స్వధర్మములనుట జ్ఞానము కాదు. కులముల వ్యవస్థయే జ్ఞానముకాదు. సర్వులకు సమానమైన పరమాత్మ హెచ్చుతగ్గు కులములు సృష్టించలేదు. జగత్తులోని సర్వజీవరాసులకు వర్తించు బోధ చెప్పి జగద్గురువని పేరుగాంచిన పరమాత్మ కేవలము మానవులయందు మాత్రము కులములనేర్పరిచి మిగతా జాతులను వదలివేయడము జరుగదు. ఆయన ఏమి చెప్పిన అది అందరికి వర్తించునదిగ ఉండును. మనుషులకు అమలై జంతువులకు అమలుగాని కులముల వివరము భగవంతుడు చెప్పినది కాదు. అది జ్ఞానము కాదు.

(17) శ్లో॥ 42 : శమోదమస్తప శ్శౌచం క్షాన్తిరార్జవ మేవచ ।
జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం బ్రాహ్మ కర్మ స్వభావజమ్ ॥
(కల్పితము)

(17) శ్లో॥ 43: శౌర్యం తేజో ధృతి ర్దాక్ష్యం యుద్ధే చా ప్యపలాయనమ్ ।
దానమీశ్వరభావశ్చ క్షాత్రం కర్మ స్వభావజమ్ ॥
(కల్పితము)

(17) శ్లో॥ 44 : కృషి గోరక్ష వాణిజ్యం వైశ్యం కర్మ స్వభావజమ్ ।
పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్ ॥
(కల్పితము)

**భావము :** శమ, దమములు, తపము, శౌచము, శాంతి, జ్ఞాన, విజ్ఞానముల ఆర్జవము, ఆస్తికత బ్రాహ్మణులకెల్ల సహజకర్మలగును. అట్లే శౌర్యతేజస్సులును, కార్యదక్షత ధైర్యము, యుద్ధమందు వెన్నుచూపకుండుట, దానము, ఆధిపత్యము వహించుట క్షత్రియులకు స్వభావకర్మ అనబడును. గోవులను రక్షించి పోషించుట, వ్యాపారము చేయుట, వైశ్యులకు సహజకర్మ అనియు, పరిచర్యలు చేయుటయే శూద్ర జనుల స్వభావకర్మ అని చెప్పబడివున్నది.

**విమర్శ :** ఇలా కులములకు పనులు అంటగట్టి ఆ పనులే వారి సహజకర్మలని, అవి వారి స్వధర్మములని చెప్పుట పూర్తి జ్ఞానవిరుద్ధము. ఎందుకనగా! కర్మయోగము రెండవ అధ్యాయములో 35వ శ్లోకములో స్వధర్మ పరధర్మముల గూర్చి చెప్పియున్నాము. అచట ప్రకృతి కార్యములకు సంబంధించినవన్నియు పరధర్మములు అనియు, కేవలమొక్క ఆత్మ సంబంధముగ ఉన్నవి మాత్రమే స్వధర్మములనియు సూత్రబద్ధముగ చెప్పబడియున్నవి. వాటి సూత్రము ప్రకారము ఇక్కడ చెప్పిన నాల్గు జాతుల యొక్క పనులు ప్రకృతికి సంబంధించినవి. కావున అవి అన్నియు పరధర్మములేనని చెప్పవచ్చును. పరధర్మములైన వాటిని స్వధర్మములను కోవడము అజ్ఞానమని చెప్పవచ్చును. అందువలన ఈ శ్లోకములు గీతనుండి బహిష్కరింపబడుచున్నవి.

(17)శ్లో॥ 45 : స్వే స్వేకర్మణ్యభిరతః స్సం సిద్ధిం లభతే నరః ।
స్వకర్మనిరతస్సిద్ధిం యథా విన్దతి తచ్ఛృణు ॥
(కల్పితము)

(17)శ్లో॥ 46: యతః ప్రవృత్తిర్భూతానాం యేనసర్వమిదం తతమ్ ।
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః ॥
(కల్పితము)

(17) శ్లో॥ 47 : శ్రేయాన్స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్ ।
స్వభావనియతం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్ ॥
(కల్పితము)

(17) శ్లో॥ 48 : సహజం కర్మ కౌన్తేయ! సదోష మపిన త్యజేత్ ।
సర్వారమ్భా హిదోషేణ ధూమే నాగ్నిరివాఽవృతాః ॥
(కల్పితము)

**భావము :** వారివారి కర్మల పట్ల శ్రద్ధబూని చేయువారు మోక్షము పొందగలరు. నరుడు స్వధర్మము వలన సిద్ధి ఎట్లు పొందునో చెప్పెదను. ఎల్ల జీవరాసులకు సృష్ఠికర్తయైన పరమాత్మను స్వకీయకర్మ నాచరించుటచే పూజించినవాడై మోక్షము పొందవచ్చును. మంచిదని త్రోచు పరుల ధర్మమునకంటే స్వధర్మము శ్రేయస్కరము. తన కుల స్వభావజనితమైన కర్మ చేసెడి వానికి పాపము రాదు. అంతేకాక అగ్నికి పొగ అంటుకొనివున్నట్లు సర్వకార్యములకు కర్మయను దోషముండును. కాని కులమును బట్టి ఉన్న పని దోషము కలదియైనప్పటికి వీడరానిదైన చేయవలసి యున్నది. సహజ కర్మ చేయుటలో దోషములేదు.

**వివర్శ :** మానవులలో కుల విభజనచేసి ఆ కులములకు నిర్ణయించిన పనులను స్వధర్మమని, అవి ఆచరించుటయే పరమాత్మను ఆరాధించినట్లగునని, వైశ్యులు వ్యాపారము చేయుటలో దోషమున్నప్పటికి పాపమురాదని, అట్లే క్షత్రియులు రాజ్యము కొరకు ఎందరినో చంపుట పాపపు పనియైనప్పటికి పాపమురాదని, స్వభావ జనితమైన ఏ పనిలో కర్మ అంటదని చెప్పడము చోద్యము, విపరీత అజ్ఞానము, అధర్మము. కులములోని పనులు స్వధర్మములనుటయే పెద్ద అజ్ఞానము. అవి కర్మను తెచ్చుపెట్టునవైనప్పటికి వాటి ద్వారా మోక్షము పొందవచ్చని చెప్పడము మరీ అజ్ఞానము, అశాస్త్రీయము. కులమునుబట్టి ఉన్న స్వకర్మ దోషమున్నదైన ఆచరించుట మేలని చెప్పడము పూర్తి అజ్ఞానము. వ్యాపారము వైశ్యులుకాక ఇతరులు చేస్తే అధర్మమగునా? వ్యాపారములో ఎన్ని మోసములు చేసిన కర్మ అంటదా? ఇంతవరకు భగవంతుడెక్కడైన ఈ మాటలు చెప్పాడా? అహమును వీడి ఎవడేపని చేసినప్పటికి వానికి కర్మ అంటదన్నాడు, కాని యోగపద్ధతి కాకుండ కుల పనిని చేయడములో

పాపమురాదని చెప్పడము యోగశాస్త్రమైన భగవద్గీతకు వ్యతిరేఖము కాదా! ఇలా వ్యతిరేఖ భావములు వ్రాసి గీతలో చేర్చడము వలన ఎందరో గీతవలన అజ్ఞానులగుటకు అవకాశమున్నది. ఈ శ్లోకములు ఇక్కడ ఉండడము వలన భగవంతుని భావమునకే ముప్పు తెచ్చిపెట్టుచున్నవి. పెద్ద పాత్రయందు గల పాయసములో చిన్న విష బింధువు కలసినట్లు, ఎన్నో శ్లోకముల రూపముగ చెప్పిన కర్మయోగపద్ధతిని ఈ ఎనిమిది శ్లోకములు చిన్నాభిన్నము చేయుచున్నవి. కావున ఇంత చెడును చేకూర్చు ఈ శ్లోకములను పూర్తిగ తీసివేయడము జరుగుచున్నది. నేను చెప్పడమే కాక మీరు కూడ యోచించి తెలుసుకోవడము ముఖ్యము.

(17)శ్లో॥ 49 : అసక్తబుద్ధి స్సర్వత్ర జితాత్మా విగతస్పృహః ।
నైష్కర్మ్యసిద్ధిం పరమాం సన్న్యాసే నాధిగచ్ఛతి ॥
(కర్మయోగము)

**భావము :** దేనియందును ఆసక్తిలేనివాడవై, మనసునందు విషయస్పృహలను మాని కార్యము చేసిన, కర్మ అంటని సన్న్యాసముచే ఆత్మను జయించి (తెలుసుకొని)న వాడగుచున్నాడు.

(17)శ్లో॥ 50 : సిద్ధం ప్రాప్తో యథా బ్రహ్మ తథాఽప్నోతి నిబోధమే ।
సమాసేనైవ కౌన్తేయ నిష్ఠా జ్ఞానస్య యా పరా ॥
(యోగము)

**భావము :** కర్మయోగసిద్ధిని పొందిన వానిని గూర్చి నేను తెల్పితిని. అట్లే బ్రహ్మయోగ పద్ధతి నానుండి తెలుసుకొనుము. ఇది జ్ఞాననిష్ఠలో శ్రేష్ఠమైనది.

(17)శ్లో॥ 51: బుద్ధ్యా విశుద్ధయా యుక్తో ధృత్యాఽత్మానం నియమ్యచ ।
శబ్దాదీన్ విషయాం స్త్యక్త్వా రాగద్వేషౌ వ్యుదస్య చ ॥
(యోగము)

(17) శ్లో॥52 : వివిక్తసేవీ లఘ్వాశీ యతవాక్కాయ మానసః ।
ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః ॥
(యోగము)

(17) శ్లో॥ 53: అహంకారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహమ్।
విముచ్య నిర్మమ శ్శాన్తో బ్రహ్మభూయాయ కల్పతే ॥
( యోగము)

**భావము :** శుద్ధమైన బుద్ధికల్గి, విషయములను జయించి, ఆత్మయందునే మనస్సును నియమించి, శబ్దాది విషయముల త్యజించి, రాగద్వేష గుణములను వదలి, ఏకాంత వాసము చేయుచు, మితముగ భుజించుచు, వాక్మనోకాయముల పని చేయకుండు నట్లు చేసి, నిత్యము ధ్యానయోగ (బ్రహ్మయోగ)మునందే లగ్నమై, అహంకారము బలము, గర్వము, కామము, క్రోధము, బాహ్య వస్తువుల మీద ధ్యాస వదలి, మమకారములేక శాంతినొందువాడు పరబ్రహ్మమును పొందుటకు సమర్థుడగును.

**వివరము :** వెనుకటి అధ్యాయములో ఎన్నో శ్లోకములందు కర్మ బ్రహ్మయోగముల గురించి చాలా విపులముగ చెప్పబడివున్నప్పటికి చివరి అధ్యాయములో మరి ఇప్పుడు వాటిని గూర్చి జ్ఞప్తి చేయుచున్నాడు. ముందు కర్మయోగమును చెప్పి మరియు బ్రహ్మయోగమును గూర్చి కూడ చెప్పాడు. ఇంతటితో కర్మ, బ్రహ్మయోగము లను వివరించి చెప్పడము ముగిసినదనుకుంటాము. ఇన్నిమార్లు జ్ఞప్తి చేయడములో సారాంశము వీటిని మరువకూడదనియే. కనుక పరమాత్మను చేరుటకు యోగపద్ధతిలో రెండే మార్గములున్నవని మరువకూడదు.

(17) శ్లో॥ 54 : బ్రహ్మభూతః ప్రసన్నాత్మా నశోచతి నకాంక్షతి ।
సమస్సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్ ॥
( బ్రహ్మ, కర్మయోగములు)

**భావము :** బ్రహ్మభూతుడు, ఆత్మ ప్రసన్నుడు కోర్కెలను కోరడు. దుఃఖములను పొందడు, సర్వభూతములను సమముగ జూచువాడై ఉత్తముడగు నా భక్తవరుడగును.

**వివరము :** కర్మయోగము ఆచరించువాడు ప్రారబ్ధ కర్మరీత్య సర్వకార్యములు జరుగుచున్నవని, వాటివలననే కష్టసుఖములు కలుగుచున్నవని, తెలిసినవాడై కష్టమొచ్చిన దుఃఖపడడు, సుఖమురావలెనను కోర్కెయు కోరడు. అట్లే బ్రహ్మయోగి అయినవాడు ఆత్మ తనయందున్నట్లే సర్వులయందున్నదని తెలిసినవాడై, సర్వ

జీవరాసులయందు ఆత్మను సమముగ చూచువాడైవుండును. వీరిరువురు పరమాత్మకు పరమభక్తిపరులని తలచవచ్చును.

(17) శ్లో॥ 55 : భక్త్యా మా మభిజానాతి యావాన్యశ్చాస్మి తత్త్వతః।
తతోమాం తత్త్వతో జ్ఞాత్వావిశతే తదనన్త రమ్ ॥
(సాకార, నిరాకారము)

**భావము :** నేను నిశ్చయముగ ఎట్టివాడనో, ఎవ్వడనై ఉన్నానో పరమభక్తిచే తెలియగల్గినవాడు, నా యదార్థమంతయు తెలిసినవాడై తదుపరి నాయందే చేరిపోగలడు.

**వివరము :** పరమాత్మ యొక్క నిజస్థితి ఏమిటో తెలియుట చాలా కష్టము. విశేషమైన జ్ఞానమున్నవానికి మాత్రమే పరమాత్మను గురించిన జ్ఞానము తెలియబడును. లేకపోతే భూమిమీదున్న అనేకరక దేవతల మీదే ప్రతి ఒక్కరికి ధ్యాస, భక్తివుండును. ఎన్నో జన్మలనుండి జ్ఞానపరముగ ఆసక్తి కలవానికి చివరకు పరమాత్మ ఒకడున్నాడని అతను దేవతలకందరికి దేవుడని తెలియును. కేవలము పరమాత్మ అనువాడు ఒకడున్నాడని తెలియుటకే ఎన్నో జన్మలు కావలసివస్తే, ఆయన యొక్క నిజస్థితి గురించి తెలుసుకోవాలన్న, ఆయన ఎవరైనది ఎట్లున్నది తెలియాలంటే కొన్ని జన్మలుగ జ్ఞానమార్గమున నడిస్తేకాని అర్థము కాదు. అలా ఎన్నో జన్మల జ్ఞానసముపార్జనతో చివరకు పరమాత్మ సమస్త సృష్టికర్త, స్థితికర్త, లయకర్త అనియు, ఆయన నిరాకారముగ అణువణువున అంతట వ్యాపించి ఉన్నాడనియు, ఆయనకు పేరు రూపములేదని తెలియవచ్చును. ఇంకనూ విశేషమైన జ్ఞానము సంపాదించుకొన్న వానికి పరమాత్మ నిరాకారుడైవుండి, అప్పుడప్పుడు సాకారరూపమున భూమిమీద పుట్టుచుండునని, పుట్టి తన ధర్మములను గూర్చి తానే తెలియచేసి పోవునని కూడ తెలియును. సాకారరూపము మీద మిక్కిలి భక్తికల్గినవారు ఆ జన్మను గుర్తించకల్గి, ఆ జన్మలోనే సాఫల్యము పొందగలరు. పరమాత్మ స్థితిగతులను తెలిసినవారు కర్మయోగ పద్ధతికాని, బ్రహ్మయోగ పద్ధతికాని అవలంభించి చివరకు మోక్షము పొందుదురు. భక్తియోగమను ప్రత్యేక మార్గమును అనుసరించిన వారు, సాకారమున

ఉన్న పరమాత్మను గుర్తించినవారు ఒకే జన్మలో మోక్షము పొందగ, కర్మ బ్రహ్మయోగ మార్గములను అవలంభించువారు కొన్ని జన్మల తరువాత మోక్షము పొందుదురు.

(17) శ్లో॥ 56 : సర్వకర్మాణ్యపి సదాకుర్వాణో మద్వ్యపాశ్రయః ।
మత్ప్రసాదా దవాప్నోతి శాశ్వతం పద మవ్యయమ్ ॥
(మోక్షము)

**భావము :** సర్వకర్మలను ఎల్లపుడు నా పద్ధతినాశ్రయించి చేయువానికి నా అనుగ్రహము వలన అవ్యయమైన శాశ్వతమైన పరమపదము లభించగలదు.

**వివరము :** పరమాత్మ తన ధర్మములను తెలియజేయు నిమిత్తము మానవ అవతారము ఎత్తినప్పుడు ఆయన ఏవిధమగు కార్యములు చేశాడో, కార్యముల చేయుచు ఏ విధముగ కర్మలంటని విధానమును అవలంభించాడో తెలిసి, ఆ పద్ధతులనే ఆశ్రయించినవాడై పనులు చేయుచు పోయిన పరమాత్మ ప్రసాదించు శాశ్వత మోక్షము పొందవచ్చును.

(17) శ్లో॥ 57 : చేతసా సర్వకర్మాణి మయిసన్న్యస్య మత్పరః ।
బుద్ధియోగ ముపాశ్రిత్యమచ్చిత్త సతతం భవ ॥
(కర్మయోగము)

**భావము :** మనసుచే సర్వకార్యములు నాకే సమర్పించి, నీవు ఎల్లప్పుడు నాయందే చిత్తమును లగ్నము చేసి, నాకంటే ఇతరములేదని తలచి కర్మయోగమున ఆరాధించుము.

**వివరము :** ఇంతవరకు జ్ఞానమును వివరించి చెప్పిన భగవంతుడు ఇప్పుడు అర్జునునకు సలహా ఇస్తున్నాడు. నీవు ఇట్లే నడుచుకొనుమని చెప్పుచున్నాడు. అది ఏమనగా! మనస్సు ద్వారా అన్ని పనులను పరమాత్మకే సమర్పించి, అన్ని పనులను చేయించువాడు పరమాత్మేనని చిత్తము ద్వారా నిర్ణయించి, చేయుపనులన్ని పరమాత్మ నిర్ణయమేనని తలచుచు, పరమాత్మకంటే వేరేది లేదని తలచి, జరుగుచున్నదంత ఆయన జరిపించునదేనని బుద్ధిచే అహమును అణచివేసి కార్యములను చేయుమని చెప్పాడు.

(17)శ్లో॥ 58 : మచ్చిత్త స్సర్వదుర్గాణి మత్ప్రసాదా త్తరిష్యసి ।
అథచేత్త్వమహంకారాత్ న శ్రోష్యసి వినంక్ష్యసి ॥
(కర్మయోగము)

**భావము :** నాయందే చిత్తముంచిన నేను ప్రసాదించు ప్రసాదమువలన సర్వ దుఃఖములనుండి తరింతువు. అట్లుకాక అహంకారమునే కల్గి నామాట వినకున్న చెడిపోదువు.

**వివరము :** పరమాత్మ భగవంతునిగ ఉండి, భగవంతునిగ నేను చెప్పు మాటలు వినకున్న చెడిపోదువని హెచ్చరించి చెప్పాడు. అదేమనగా! సాకారరూపమున భగవంతునిగా, పరమాత్మ అర్జునునికి కనిపించాడు. చెప్పువాడెవడైనది అర్జునునికి తెలుసు. భగవంతుడు యుద్ధము చేయమని చెప్పాడు. అర్జునునికి శరీరములోని చిత్తము నిర్ణయము ప్రకారము జరుగవలసివున్నది. ఆ నిర్ణయమేదైనకాని అక్కడ చిత్తములో నిర్ణయించునది పరమాత్మయేనని, ఆయనే ఎదురుగ ఉన్న భగవంతుడని తెలిసి, ఆయనమాట వినడమే చిత్తము యొక్క నిర్ణయమని అనుకొని భగవంతుడు చెప్పినట్లు నడచుకోవడము అప్పటిపని. అయినప్పటికి అర్జునుడు నేను, నా నిర్ణయము, నేనెట్లు తలచితే అట్లేనని అహముతో కూడి అనుకుంటే, అంతవరకు విన్నది తెలుసుకొన్నది అంతా వృథాయేయగును. ఆ భావములో అర్జునుడేది చేసిన కర్మ అంటును. అతను జ్ఞానమార్గము నుండి చెడిపోయిన వాడగును.

(17)శ్లో॥ 59 : యదృహంకార మాశ్రిత్యన యోత్స్య ఇతి మన్యసే ।
మిథ్యైష వ్యవసాయస్తే ప్రకృతి స్త్వాం నియోక్ష్యతి ॥
(ప్రకృతి)

**భావము :** అట్లు అహంకారమునే వహించి యుద్ధము చేయనని పట్టుబట్టిన నీ నిశ్చయము నిలువదు. ప్రకృతి నిన్ను నియోగించి పంపగలదు.

**వివరము :** అర్జునునికి 'నేన'ను భావము అట్లే ఉండి నేను యుద్ధము చేసిన, వారినందరిని చంపుదునని అనుకొని యుద్ధము చేయకుండుటే మేలని తలచి

యుద్ధము చేయకుండ ఉన్నట్లయితే, ప్రారబ్ధకర్మ ప్రకారము యుద్ధము చేయవలసి ఉన్నపుడు శరీరములో అర్జునుని నిర్ణయము నిలువదు. కొంత వరకు యుద్ధము చేయననుకొన్నప్పటికి జరుగవలసిన కర్మవున్నపుడు బుద్ధియోచనలలో చేయమని చెప్పు నిర్ణయమును చిత్తము నిర్ణయించును. బయట అర్జునుడు యుద్ధము చేయకుండినప్పటికి లోపల బుద్ధి చేస్తే బాగుండునా? చేయకపోతే బాగుండునా! అని యోచనలలో మునిగివుండును. అట్లు పరంపరగ సాగు బుద్ధి యోచనలలో ప్రారబ్ధకర్మప్రకారము జరుగవలసినదేదో దానిని చిత్తము నిర్ణయించును. చివరిగ చిత్తము నిర్ణయించినదే శరీరము ద్వార జరుగును. ఆ సమయములో యుద్ధము అర్జునుడు చేయవలసిన కర్మవున్నది, కావున కర్మ ప్రకారము చెలరేగు గుణములను బుద్ధి యోచిస్తుండగ, కర్మప్రకారము జరుగవలసిన కార్యమును బుద్ధియోచనల నుండి చిత్తము నిర్ణయించి, యుద్ధము చేయుటకు ఆజ్ఞ ఇవ్వడము వలన అర్జునుని శరీరము అస్వతంత్రముగ కదలి యుద్ధము చేయును. జరుగవలసిన దానిని ఎవ్వరు ఆపలేరు. అలా ఆపు అధికారము జీవునకు లేదు. కర్మననుసరించి చిత్త నిర్ణయము ప్రకారము సర్వము జరుగవలసి ఉన్నది. అందువలననే నీవను కున్నట్లుండదు. ప్రకృతి జనిత గుణ ప్రేరేపితుడవై నీవు యుద్ధము చేయగలవు. ప్రకృతి నిర్మాణము అలా నీచేత చేయిస్తుందని భగవంతుడు చెప్పాడు.

*(17)శ్లో॥ 60 : స్వభావజేన కౌన్తేయ ! నిబద్ధస్స్వేన కర్మణా ।*
*కర్తుంనేచ్ఛసి యన్మోహా త్కరిష్య స్యవశో౽పితత్ ॥*
*(ప్రకృతి)*

**భావము :** అర్జునా! మోహముచే యుద్ధము చేయనను నీ నిర్ణయము నీ స్వభావములో నీయందే ఉన్న కర్మచేత కట్టివేయబడి, నీ ప్రయత్నము లేకనే అస్వతంత్రముగ యుద్ధము చేసెదవు.

**వివరము :** నేను నావారు అను మోహము చేత, అహము చేత అర్జునుడు యుద్ధము చేయకూడదనుకొన్నాడు. కాని అర్జునుని కర్మచక్రములో ఉన్న ప్రారబ్ధకర్మ అతనియందే అతని నిశ్చయమును కట్టివేసి, నీ నిర్ణయము పనికిరాదన్నట్లు చేయును. ఈ పద్ధతి అర్జునునికే కాదు అందరియందును జరుగునదే. మనకు ఇష్టమున్నా ఇష్టములేకున్నా

కర్మనిర్ణయము ప్రకారము కొన్ని పనులు చేయవలసి ఉండును. అలాగే అర్జునునికి జరిగినది. ఎవనికైనకాని కర్మప్రకారము ఏ పనినైన, ఎంత నీచ కార్యమైన, తన మనసొప్పుకున్నా తప్పక చేయవలసివచ్చును. దానిని బట్టి బుద్ధికలవాడు మన నిర్ణయమేమికాదు, కర్మ నిర్ణయము ప్రకారమే జరుగునని సులభముగ తెలుసుకోగలడు. తెలివిలేనివాడు ఒకరు చెప్పినప్పటికి, తాను అనుభవించినప్పటికి తెలుసుకోలేక అన్ని పనులు నా ఇష్టప్రకారమే జరుగుచున్నవనుకొనుచుండును. అటువంటివాడు నిజస్థితిని తెలుసుకోలేడు.

*(17)శ్లో॥ 61 : ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జునతిష్ఠతి ।*
*భ్రామయన్ సర్వభూతాని యన్త్రా రూఢాని మాయయా॥*
*(పరమాత్మ)*

**భావము :** సర్వ జీవరాసుల శరీర హృదయములందు పరమాత్మ తిష్ఠవేసి ఉండి, యంత్రమునెక్కి ఆడించువానివలె తన మాయచేత సర్వ భూతములను ఆడించు చున్నాడు.

**వివరము :** సర్వ జీవరాసులు అనేక విధములుగ కదలుచు కొన్ని ఆడుచుండగ, కొన్ని పోట్లాడుచుండగ, కొన్ని రమించుచుండగ, కొన్ని పరుగిడుచుండగ, కొన్ని ఎగురుచు కొన్ని దుముకుచున్నవి. అట్లు నానారకములుగ కనిపించు జీవరాసుల శరీరములలోని హృది స్థానములో పరమాత్మ నివాసముంటున్నాడు. శరీరమంతయు నాడులచే వ్యాపించి నాడులచే కదలింపబడుచున్నది. నాడులకన్నిటికి కేంద్రము మెదడు. మెదడు నుండి వచ్చు ఆదేశములు నాడుల ద్వార శరీరమంతయు ప్రాకి శరీరమును కదలించి, ఆడించి, పాడించి అనేకములుగ చేయుచున్నవి. మెదడు నుండి ప్రసారమగు ఆదేశము లెక్కడివి? ఎవరివి? అను ప్రశ్నవేసుకొనిన, మెదడు భాగమునే హృదయమనుచున్నాముకదా! హృదయములోనే పరమాత్మ ఉన్నది. కర్మచక్రములోని కర్మానుసారము మాయ అను పరికరములైన బుద్ధి, చిత్తము, మనస్సు ద్వార ఆదేశము పంపుచు దాని ప్రకారము నరములను లాగి శరీరమును ఆడునట్లు చేయుచున్నాడు.

యంత్రము మీద పని చేయువాడు యంత్రము (స్విచ్‌లను) మీటలను త్రిప్పుచు యంత్రముచే పని చేయించినట్లు దేహారూఢుడైన (దేహమునెక్కి ఉన్నవాడైన) పరమాత్మ మొత్తము శరీరమను యంత్రములోని మనో, బుద్ధి, చిత్తములను గుణము లతో సరిచేర్చి ఉన్న కర్మప్రకారము ఆడించుచున్నాడు. **పరమాత్మ శరీరమును ఆడించుటకు ఆత్మయను విద్యుత్తును, మనోబుద్ధి చిత్తములను ముఖ్య అనుబంధ మీటలను, గుణములను చక్రములను, కర్మయను పద్ధతిని ఉపయోగించి కష్టసుఖములను ఉత్పాదనలను తయారు చేయుచున్నాడు.** ఈ విధానము తెలియని వారు పరమాత్మ శరీరమును నాడులచేత బొమ్మవలె ఆడించుచున్నాడని అనుకోక, అన్నిటికి తామే కారణమని అజ్ఞానులు తలపోయుచున్నారు. ప్రతి ఒక్కరికి ప్రతిపని తామే చేసినట్లే అనిపించుచుండును. ఎందుకనగా బొమ్మలాటలో బొమ్మలను ఆడించువాడు కనిపించక బొమ్మలు కదలుట మాత్రమే అగుపించునట్లు, మనిషిచేత జరుగుచున్న కార్యములలో లోపల ఆడించు పద్ధతికాని, ఆడించువాడు కాని తెలియక, పైకి ఆడేవారు మాత్రము కనిపిస్తుండుట వలన, ప్రతి ఒక్కరు తమ చేత జరుగు పనులను తామే చేయునట్లనుకొనుచున్నారు. ప్రతి కదలిక ప్రతి పని నాదికాదు, నేను చేయలేదు, పరమాత్మ, ఆత్మ(బలము) చేత ఇంద్రియములు అనబడు శరీర భాగములను కర్మ ప్రకారము కదిలించుచున్నాడని, తానందుకు కారణము కాదని ఎవడు తెలియునో వాడు అహమును వదలిన వాడగుచున్నాడు. శరీరముతో ఏ పని జరిగిన దానికి తాను కర్తనుకాదని తెలుసుకొనుచున్నాడు. దానివలన జరుగు పనులకు వానికి సంబంధము ఏమాత్రములేదని చెప్పవచ్చును. ఈ సూత్రము ప్రకారము ఒక శరీరముచేత లోకములోని వారందరు చంపబడినప్పటికి అందులోని జీవుడు హంతకుడు కాడని, వానికి పాపమంటదని చెప్పాడు.

(17) శ్లో॥ 62: తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత !
తత్ప్రసాదాత్పరాంశాన్తిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్ ॥
(పరమాత్మ)

**భావము :** సర్వ భావములలో పరమాత్మను శరణువేడుము. ఆయన అనుగ్రహము వలన ప్రకృతికంటే అన్యమైన శాంతిని మరియు శాశ్వతమైన మోక్షస్థానమును పొందవచ్చును.

**వివరము :** బయటి ప్రపంచములో ఎవడెంత గొప్పదనము, హోదాకల్గి ఉన్నప్పటికి, లోపల పరమాత్మ వలననే సర్వము జరుగుచున్నవని తెలిసి, అన్నిటికి మూలకర్తయైన పరమాత్మను తనకున్న అన్ని మనోభావముల ద్వారా శరణువేడి, గొప్పగ తలచుకొని, తనదేమిలేదని ఉన్నదంత పరమాత్మదేనని, తాను పరమాత్మ ఆడించునట్లు ఆడు ఆట బొమ్మలాంటివాడినని తలచి, ఆయనకున్న అనేక అంశలలో ఒక అంశచేతనే సర్వప్రపంచమును నడుపగల గొప్పవాడని, **నేను అనుకుంటే నీవు నీవుగానే ఉంటావు, నేను అనుకుంటే నీవు అంతటా ఉంటావు** అను వాక్యము ప్రకారము ఆయన తలచితే జీవుడు జీవుడుగానే ఉండగలడని, ఆయన తలచితే జీవుడు అంతటా అణువణువున వ్యాపించి పరమాత్మయందైక్యము కాగలడని తెలిసి మ్రొక్కుట వలన, ఆరాధించుట వలన ఎవడైనకాని పరమాత్మ అనుగ్రహము పొంది, ఆయన ప్రసాదించు శాంతిని పొంది, ప్రకృతికంటే అన్యమైన మోక్షమును (పరమాత్మను) పొందగలడు.

*(17) శ్లో॥ 63: ఇతితే జ్ఞాన మాఖ్యాతం గుహ్యాద్గుహ్యాతరం మయా ।*
*విమృశ్యైత దశేషేణ యథేచ్ఛసి తథాకురు ॥*

*(జ్ఞానము)*

**భావము :** రహస్యములలోకెల్ల అత్యంత రహస్యమైన జ్ఞానమును నీకు నేను చెప్పితిని. దీనిని శేషము లేకుండ వివరించుకొని చూచి ఎట్లు నీకిష్టమో అట్లు చేయుము.

**వివరము :** ఇంతవరకు భగవంతుని చేత చెప్పబడిన జ్ఞానము చాలా రహస్యమైనది. ఒక విధముగ విప్పి చెప్పిన అర్థముకానిది. పరమాత్మకు తప్ప ఎవరికి తెలియనిది. పరమాత్మ ద్వారా విన్నప్పటికి కొందరికి అర్థముకాక రహస్యముగనే ఉండును. కావున రహస్యములలోకెల్ల రహస్యమైనదని చెప్పవచ్చును. ఇంతటి గొప్ప జ్ఞానము తెలియవలెనినిన, ఎన్నో జన్మలు జ్ఞానసంబంధ సుకృతముంటేనే సాధ్యమగును. లేకపోతే ఈ జ్ఞానము దగ్గరికే రాదు. ఒకవేళ ఈ వివరములు దగ్గరికొచ్చిన చదువువారే దూరమగుదురు. ఇంత వివరముగ చెప్పబడినదియు హద్దులు గీచి చూపిన గీతను ఎవరైన వినిన చదివిన అంతటిని విశదీకరించి బాగా యోచించి ఎట్లు మీకిష్టమో అట్లే నడుచుకోవచ్చును. భగవంతుడు తెల్పెడి జ్ఞానమునంతటిని

తెల్పి ఎవరిని ఇట్లే నడుచుకోమని బలవంతపెట్టక నీ ఇష్టమన్నాడు. జ్ఞానము కర్మాతీతమైనది. జ్ఞానము కర్మను బట్టి నిర్ణయింపబడి నీకు అంటునది కాదు. జ్ఞానము శ్రద్ధానుసారము లభ్యమగునది. శ్రద్ధ ఎవరి ఇష్టానుసారము వారికి పుట్టునది. స్వయముగ పుట్టునది (స్వయంభూ) శ్రద్ధ అయిన దానివలన నీ ఇష్టమని చెప్పాడు.

భగవంతుడు జ్ఞానము అజ్ఞానము అనియు, ప్రకృతి పరమాత్మ అనియు, మాయ ఈశ్వరుడు అనియు రెండు మార్గములు సూచించి నీవు ఏ మార్గములో పోతావో పొమ్మన్నాడు. ఆయన మన మీదనే బాధ్యత ఉంచినప్పటికి, నిజ జ్ఞానము తెలిసినవాడు నేను అను అహమును పొందక, నా ఇష్టమని మోహమునబడక, సర్వము పరమాత్మయేనని నమ్మి భక్తినంతయు ఆయన మీదనే చూపుచు, శరణు పొందిన ఆయన మరియు ఆయన జ్ఞానము సులభముగ అర్థమగును. అటువంటి శరణ్యము లేకుండ నా బుద్ధిని ఉపయోగించి జ్ఞానము తెలుసుకొంటాననుకోవడము కూడ పొరపాటే. అట్లు పరమాత్మ జ్ఞానము తెలుసుకొనుటకు చాలా కాలము పట్టును. శరణువేడిన వానికి తొందరగ జ్ఞానము లభ్యమగుటయే కాక ఆ జన్మలోనే మోక్షము దొరుకును.

*(17)శ్లో॥ 64: సర్వగుహ్యతమం భూయ శృణు మే పరమం వచః ।*
*ఇష్టోஉసిమేదృఢమితి తతో వక్ష్యామి తే హితమ్ ॥*
*(గీతా సారాంశము)*

**భావము :** సర్వ రహస్యములలో ఉత్తమమగు పరమవచన సముదాయమును మరల వినుము. నీవు నాకు మిగుల ఇష్టుడవగుటచే హితము కోరి చెప్పుచున్నాను.

**వివరము :** వాస్తవానికి ముందు చెప్పిన 63వ శ్లోకముతోనే భగవద్గీత అయిపోయినప్పటికి నిజానికి మన హితము కోరి గీతయొక్క సారాంశమును రెండు శ్లోకముల రూపముగ భగవంతుడు చెప్పాడు. వాటికంటే ముందున్న ఈ శ్లోకములో నీవు నాకు ఇష్టుడవని, నీ మేలుకోరియని చెప్పడము విశేషము. పరమాత్మ ఎందుకు పనికిరాని మనలను గొప్పగ గుర్తించి అలా చెప్పాడంటే ఆయనలోని గొప్పతనమేమిటో

చెప్పనలవికాదు. ఆయన అంతగ చివరిలో మన మీద శ్రద్ధవుంచి చెప్పిన గీత మొత్తము సారాంశమేదో క్రింద చూచెదము.

(17)శ్లో॥ 65 : మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు ।
మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే ॥
(గీతా సారాంశము)

**భావము :** నన్ను నీ మనస్సున తలంపుము. నీవు నా భక్తునిగ ఉండుము. నన్నే పూజించుము. నన్నే నమస్కరింపుము. నన్నే పొందగలవు. ఇది సత్యము. నీవు నాకు మిక్కిలి ప్రియుడవు కాగలవు. ప్రతిజ్ఞ చేసి చెప్పుచున్నాను.

**వివరము :** ఎవడైతే పరమాత్మను మనసులో తలచుచుండునో, పరమాత్మకు భక్తునిగ ఉంటూ ఆయననే పూజించి, నమస్కరించుచున్నాడో వాడు పరమాత్మనే పొందగలడు. వాడే పరమాత్మకు మిక్కిలి ప్రియుడు. ఆ మాట నిజము. అంత గొప్ప పరమాత్మకు ఇంత చిన్నవాడు ప్రియుడా అను అనుమానము పెట్టుకోవలసిన అవసరములేదు. ఎందుకనగా పరమాత్మయే స్వయంగా ప్రతిజ్ఞ చేసి చెప్పాడు.

పరమాత్మ నిరాకారముగ ఉన్నప్పుడు కాని లేక పరమాత్మ సాకారరూపమున ఉన్నప్పుడుకాని ఆయన మీదే భక్తి, ఆయన మీదే ఆరాధన, ఆయన మీదనే నమస్కారము, ఆయన మీదనే మనోధ్యాస కల్గియుండడమే మహాభాగ్యమగును. వాని పద్ధతే వానిని పరమాత్మునికి ప్రియుని చేసి ఆయన సన్నిధికి చేర్చును. ఇది ఎంతో గొప్ప సారాంశమైన సందేశము.

(17)శ్లో॥ 66 : సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ ।
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః ॥
(గీతా సారాంశము)

**భావము :** సర్వధర్మములను సంపూర్ణముగ వీడి నన్ను మాత్రమే నీవు శరణు కోరుము. నిన్ను పాపనియచంబులో నుండి ముక్తుని చేతును. దుఃఖింపకుము.

**వివరము :** భగవద్గీత అంతయు ధర్మములు బోధించి, వాటిచేతనే కర్మయోగము బ్రహ్మయోగమును సూచించి, ఆ రెండు యోగముల ద్వారా కర్మను నాశనము చేసుకొని మోక్షము పొందమని తెలిపిన భగవంతుడు, గీత మొత్తము సారాంశములో ఇంతవరకు చెప్పిన యోగధర్మములను వీడి నన్నే శరణు పొందమన్నాడు. రెండు యోగములపద్ధతులు పరమాత్మను చేర్చుమార్గములు కాగా, చివరిలో చెప్పిన సారాంశములో సూక్ష్మములో మోక్షమని చాలా దగ్గర దారిలో పరమాత్మను చేరు ఉపాయమును చెప్పాడు. గీత సారాంశమైన రెండు శ్లోకములలో ముందు చెప్పినది పరమాత్మ సాకారముగ ఉన్నప్పుడే కాక నిరాకారముగ ఉన్నప్పుడు కూడ ఆచరించ వలసిన భక్తిమార్గము బోధించగ, ఇక్కడ చివరి మాటగా పరమాత్మ కేవలము సాకారముగా లేక భగవంతునిగ సాధారణ మానవఆకారములో ఉన్నపుడు, ఏ గుర్తింపులేనివాడై కనుగొనుటకు కష్టమైనపుడు కనుగొన్నప్పటికి, కొద్ది అనుమానమున్న దానిని పెద్దది చేసి తనకు దూరముగ పంపు సాకారమును అతికష్టము మీద తెలిసి, అనుమానము లేని భక్తిగలవారికి చెప్పిన మాటలని గ్రహించాలి.

సాక్షాత్తు పరమాత్మ అయిన సాకారమును కనుగొన్నవానికి ధర్మములతో కూడ పనిలేదు. గీత పొడవున విన్న ధర్మములను కూడ వదలి గీత చివరిలో పరమాత్మను భగవంతునిగ శరణుపొందిన వానిని, ఆయన వాని కర్మనంతటిని క్షమించి లేకుండచేసి తనయందే చేర్చుకొనును. రెండు యోగముల ద్వారా కొన్ని జన్మలవరకు అయిపోని కర్మ, మూడవదైన భక్తియోగముతో ఒకే జన్మలో అయిపోయి ఆ జన్మలోనే పరమతండ్రి పరలోక రాజ్యాధిపతి అయిన పరమాత్మను చేరవచ్చును. కర్మయోగము బ్రహ్మయోగముల ద్వారా కర్మ కాలిపోవలసి వున్నది. కాని చివరిలో చెప్పిన భక్తియోగములో జ్ఞానాగ్నిలేదు, యోగసాధనలేదు, యోగికృషిలేదు. కేవలము శరణు వేడి తన్నుతాను పూర్తి సమర్పించుకొని తానూ శూన్యముగా నిలిచిపోవడమే. అంతమాత్రముననే భయంకర కర్మలన్ని నిష్ఫలమై పోవును. పరమాత్మయే స్వయంగా కర్మలన్నిటిని క్షమించివేసి తనవద్దకు చేర్చుకొనును.

ఇంతటితో భగవంతుడుగా ఉండి పరమాత్మ చెప్పిన ధర్మములున్న హద్దు అను ఈ గ్రంథము ముగిసింది. ఇంకను 12 శ్లోకములు ఉన్నవి కదా! ఇంతటితో

ముగియడమేమిటని అడిగిన, అది భగవద్గీతకాదని ఇంతవరకే భగవంతుడు చెప్పివున్నదని గ్రహించవలెను.

ఈ చివరి అధ్యాయములోని శ్లోకముల వివరములు క్రింద గలవు.

| | | | |
|---|---|---|---|
| 1. | కర్మ సన్న్యాసము, కర్మ త్యాగము | – | 2 |
| 2. | సాకారము, నిరాకారము | – | 1 |
| 3. | కర్మయోగి, బ్రహ్మయోగి | – | 1 |
| 4. | కర్మయోగము | – | 7 |
| 5. | యోగము | – | 4 |
| 6. | ప్రకృతి | – | 5 |
| 7. | పరమాత్మ | – | 2 |
| 8. | జ్ఞానము | – | 1 |
| 9. | గుణములు | – | 4 |
| 10. | జీవుడు | – | 1 |
| 11. | యోగము, వియోగము | – | 1 |
| 12. | సాత్త్వికము | – | 1 |
| 13. | మోక్షము | – | 1 |
| 14. | గీతా సారాంశము | – | 3 |
| 15. | సాత్త్విక జ్ఞానము | – | 1 |
| 16. | రాజస జ్ఞానము | – | 1 |
| 17. | తామస జ్ఞానము | – | 1 |
| 18. | సాత్త్విక కర్మ | – | 1 |
| 19. | రాజస కర్మ | – | 1 |
| 20. | తామస కర్మ | – | 1 |
| 21. | సాత్త్విక కర్త | – | 1 |
| 22. | రాజస కర్త | – | 1 |

| | | | |
|---|---|---|---|
| 23. | తామస కర్త | – | 1 |
| 24. | సాత్త్వక బుద్ధి | – | 1 |
| 25. | రాజస బుద్ధి | – | 1 |
| 26. | తామస బుద్ధి | – | 1 |
| 27. | సాత్త్వక ధృతి | – | 1 |
| 28. | రాజస ధృతి | – | 1 |
| 29. | తామస ధృతి | – | 1 |
| 30. | సాత్త్వక సుఖము | – | 1 |
| 31. | రాజస సుఖము | – | 1 |
| 32. | తామస సుఖము | – | 1 |
| 33. | కల్పిత శ్లోకములు | – | 14 |
| 34. | వర్జించిన శ్లోకములు | – | 12 |
| | మొత్తము శ్లోకములు | – | 78 |

భావము, వివరము మార్చి వ్రాసిన శ్లోకము – 2.

## చివరిలో మా మాట

ఈ గ్రంథమును పూర్తిగా చదివిన తర్వాత ఇందులోని విషయమంతయూ శాస్త్రబద్ధమైన సమాచారమేనని తెలిసినప్పటికీ, అన్ని విషయములు క్షుణ్ణముగా అర్థమైనప్పటికీ, త్రైత సిద్ధాంతముతోపాటు అనేక క్రొత్త విషయములు బయటపడినవని అనిపించినప్పటికీ, చివరికి మాయాప్రభావముచేత ఇదంతయూ నమ్మదగినదేనా! అను సంశయము రాగలదు. ఇది సత్యము కాదేమోనని అనిపించగలదు. అంతేకాక పేరుపొందిన ఎందరో పెద్దలు, స్వామిజీలు, పీఠాధిపతులు వ్రాసిన వాటిని కొట్టివేయడమేమిటనీ, ముందెవరూ శ్లోక భావములను మార్చనిది ఈయన

మాత్రము ఒకటికాదు, రెండుకాదు ఏకంగా 55 శ్లోకముల భావములను మార్చి వ్రాయడమేమిటనీ, శాస్త్రబద్ధత లేనివని పేరుపెట్టి దాని కారణమున 122 శ్లోకములను తీసివేయడమేమిటనీ, ఒకవైపు సూక్ష్మములనీ, జ్ఞానదృష్టికి మాత్రము తెలియునని చెప్పుచూ జీవుని ఆకారమును చిత్రించి చూపడమేమిటనీ, ఐదువేల సంవత్సరముల నుండి భగవద్గీత యొక్క నిజ స్వరూపము ఇంతవరకు ఎవరికీ అర్థముకాలేదు అనడమేమిటనీ, అనుమానములను మాయ రేకెత్తించగలదు. ఇంతవరకు ఎవరికీ తెలియనిది ఈయనకొక్కనికే తెలిసియుండునాయనీ, ఆదిశంకరాచార్యుల అద్వైతమును, మధ్వాచార్యుల ద్వైతమును మించినదా ఈయన త్రైతమని, ఇదంతా నమ్మదగినదేనా?యనీ, వింతండవాదమని ఇంకనూ ఎన్నోరకముల యోచనలను మాయ పుట్టించగలదు. అయినప్పటికీ ఈ గ్రంథమును గురించి తొందరపడి ఏ నిర్ణయము తీసుకోవద్దండి. గ్రుడ్డిగా ఏ దానినీ నమ్మవద్దండి. జాగ్రత్తగా అర్థము చేసుకొని ఒక అవగాహనకు రావలెనని పాఠకులను కోరుచున్నాము. మేము ఏ విధముగా ఎన్ని చెప్పినప్పటికీ ఎవరికున్న **“శ్రద్ధ”**నుబట్టి వారికి ఇందులోని **“జ్ఞానము”** అర్థముకాగలదని చివరిగా చెప్పుచున్నాము.

ఇట్లు

**త్రిమత ఏకైక గురువు**

**ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, (64) చతుష్షష్ఠాధిక గ్రంథకర్త**

**ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త**

**శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**

**అసత్యమును వేయిమంది చెప్పినా అది సత్యముకాదు,**

**సత్యమును వేయిమంది కాదనినా అది అసత్యము కాదు.**

# త్రైత సిద్ధాంతము



ఆధ్యాత్మిక విద్యలో మూడవ సిద్ధాంతమైన త్రైతము సృష్టి ఆదిలో పరమాత్మ నెలకొల్పినదై మహావృక్షములాగ ఉండెడిది. కాలక్రమమున మోడువారిపోయి ఎవరికీ తెలియకుండా పోయినది. మాయ ప్రభావము చేత మానవ లోకమందు ఎంతోకాలము నిక్షిప్తముగా మోడువారియున్న త్రైతము ప్రస్తుతము చిగురించింది. ఈ చెట్టు అజ్ఞాన మనే రోగమునకు మంచి ఔషధమని తెలిపి ఎంతోమందిని దీని దరికి చేర్చడము మా భాగ్యము అనుకున్నాము. ఎంత గొప్ప మతఛాందసవాదులు కానీ ఇది మాదియని ఒప్పుకొనుట త్రైతములోని గొప్పతనమనుకుంటాము. మా మతమువేరు, మా దేవుడు వేరని దీనిని తెలిసిన వారెవరూ అనలేరు. ఇది స్వచ్ఛమైన దైవజ్ఞాన పద్ధతియైనందు వలన తెలియక ముందు ఎట్లు మాట్లాడి విమర్శించినా, తెలిసిన తర్వాత తప్పక ఒప్పు కోవలసి వస్తున్నది.దాదాపు రెండువేల సంవత్సరములనుండి వున్న అద్వైత, ద్వైతసిద్ధాంత వరులకు కొంత అయిష్టతను కల్గించునదైనప్పటికీ, వారు బుద్ధిచే యోచించి, స్వానుభవ ములనుబట్టి చూచిన ద్వైత, అద్వైతములు మాట్లాడుటకు తగినవనీ, నిజనిర్ధారణ అనుభవము, వాస్తవ ఆచరణ ఒక్క త్రైతములోనే కలదని తెలియగలదు. ఇతర మతము లను కూడా తనయందు కలుపుకొను త్రైతము పరమాత్మ తెలిపిన వాస్తవమైన ఇందూ పథముగ (జ్ఞానమార్గముగ) వర్థిల్లగలదని తలచుచున్నాము.

ఇట్లు

త్రిమత ఏకైక గురువు, త్రైత సిద్ధాంత ఆదికర్త

**శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**

**www.thraithashakam.org**